# పీఠిక

ఈ ప్రపంచమున జన్మమందిన ప్రతిమానవునకును పురుషార్థ చతుష్టయసాధనమునకు శరీరమే ముఖ్యకారణము. అది రక్తమాంస మేదోమజ్జాస్థిచర్మ సిరాదియుక్తమై అపథ్యాదిదోషవ్యాజమువలనను పూర్వజన్మకృతపాపమువలనను అనేకవిధవ్యాధులకు తావల మగును. ఆ వ్యాధులబారినుండి శరీరరక్షణము చేసికొని ఆరోగ్యమునుపొంది సుఖింపఁగోరుట అత్యావశ్యకము. శరీరారోగ్యములేక మఱి యెన్ని విధములయిన భాగ్యములున్నను నిరర్థకములే. కనుక శరీరారోగ్య దీర్ఘాయుస్సంపాదనము మానవునకు ప్రథమకర్తవ్యము. ఆమార్గము నుప దేశించునది ఆయుర్వేదము.

అట్టి ఆయుర్వేదమును మన ప్రాచీనఋషులు శ్రీధన్వంతరివద్ద నుండి యుపదేశమందిరి. అంతటితో నాఁగక తమతపోబలముచే బుద్ధి సూక్ష్మముచే నావేదమును వ్యాప్తిగావించిరి. వారు సర్వరోగనిదాన ములు సర్వవిధచికిత్సలు సుశ్రుతాదుల కనుభూతము కావించిరి. సుశ్రు తాదుల యనుగ్రహముచే శ్రీమదింద్రకంఠవల్లభాచార్యుఁడు ఈవైద్య చిన్తామణి యనుగ్రంథమును లోకమునకు ప్రసాదించెను. ఈగ్రంథము లోకమున ప్రచారముచెందుసందర్భమున వర్ణనాతీతములగు దోషము లకు నిలయమయ్యెను. అట్టి దోషములనెల్ల యథాశక్తి వైద్యగ్రం థాంతరములసాయమున తొలఁగింపఁజేసి ప్రకరణాదులు నిస్పష్టముగ విభజించి యీముద్రణము నిప్పటికి ప్రచురింపఁగలిగితిమి. దీనిని పరి శీలించువారు గుణదోషములు వెలయించినచో ముద్రణాంతరమున నా దొసఁగుల కృతజ్ఞతతో దిద్దుకొందుము.

ఇదివరలో ఈ క్రింది వైద్యగ్రంథముల ప్రచురించినాము.—అజీర్ణ మంజరి, అనుపానమంజరి, అష్టాంగహృదయము (సూత్ర - చికిత్స-కల్ప

శారీర - నిదాన - ఉత్తరస్థానములు), ఇలాజుల్ గుర్బా (యూనాని వైద్యము), చరకసంహిత (సూత్ర - శారీర - ఇంద్రియ-నిదాన-విమాన చికిత్స - సిద్ధి - కల్పస్థానములు), కాలజ్ఞానము, వైద్యశతశ్లోకి, రావణ కుమారతంత్రము, గదనిగ్రహము, బసవరాజీయము, భేషజకల్పము, శార్ఙ్గధరసంహిత, దేహతత్త్వనిర్ణయము, దేశీయవైద్యవిజ్ఞానము, చారుచర్య, రసరత్నాకరము, రాజమార్తాండము, లోలంబరాజీయము, వస్తుగుణమహోదధి, వృక్షాయుర్వేదము, శార్ఙ్గధరకృతత్రిశతి, సుశ్రుత శారీరము, పరహితసంహిత (సాధారణకాండము), షడ్రసనిఘంటువు, నాడీజ్ఞానము, మశూచికము, సహదేవపశువైద్యశాస్త్రము, రసప్రదీపిక, విషవైద్యచింతామణి, మాధవనిదానము. మఱియు సుశ్రుతము పూర్తి గను, ఆయుర్వేదము, ధన్వంతరినిఘంటువు, మదనకామరత్నములు త్వరలో ముద్రణమగును. విద్వద్వర్యులు మాచేయు వైద్యగ్రంథసేవకు చేయూత యొసఁగుదురు గాక అని ప్రార్థించెదము.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు

# వైద్యచింతామణి-విషయసూచిక

## ఆనాహప్రకరణమ్

## అజీర్ణప్రకరణమ్

## అర్శరోగప్రకరణమ్

## అపస్మారరోగప్రకరణమ్.



## కుష్ఠరోగప్రకరణమ్.

## కర్ణరోగప్రకరణమ్

## శిరోరోగప్రకరణమ్.

## నేత్రరోగప్రకరణమ్.



## నల్లగుడ్డుయందుజనించురోగములు



## దృష్టిగతత (తిమిర) రోగములు



## కంటితెల్లగుడ్డుయందు జనించురోగములు

పుటసంఖ్య

## యంత్రాదిప్రకరణమ్



## అథమానప్రకరణమ్.



## అథపరిభాషాప్రకరణమ్.

శ్రీః.

శ్రీధన్వంతరయే నమః

ఆంధ్రతాత్పర్యసహిత

# వైద్యచింతామణౌ

## శూలప్రకరణమ్

— అజీర్ణశూల - కర్మవిపాకము —

శ్లో. శూద్రస్యైవ తు భుక్తేన్నే త్వవ్రతస్య ద్విజస్య చ,
శూలవ్యాధిర్భవేన్నిత్యం అజీర్ణేనాతిపీడితః. 1

తాత్పర్యము. శూద్రుడు లేక కర్మహీనుడగు ద్విజునియొక్క అన్నమును భక్షించిన శూలవ్యాధి, అజీర్ణము ఇవి గలవాడగు.

— ప్లీహశూల కర్మవిపాకము —

విశ్వస్తవిషదాతా చ ప్లీహశూలీ భవేన్నరః,

తా. నమ్మినవానికి విషము పెట్టినవాడు, ప్లీహశూల గలవాడగు.

— జఠరశూల కర్మవిపాకము —

శ్రుతాధ్యయనసంపన్నం యాచితారమకించనమ్. 2
బ్రాహ్మణం దాన్తమాహూయ దానార్హం న దదాతి యః,
స భవేజ్జఠరీశూలీ తథాధ్మానీ చ కర్హిచిత్. 3
కృచ్ఛ్రాతికృచ్ఛ్రచాంద్రాణి స కుర్యాద్రోగముక్తయే,

తా. వేదశాస్త్రసంపన్నుడై దాంతుడై దరిద్రుడై యాచించెడి బ్రాహ్మణుని దానార్హుని పిలిచి యెవడు దానము చేయడో వాడు, జఠరశూల, అధ్మానము ఇవి గలవాడుగ జనించు. ఇట్టి జఠరశూల నివృత్తికై కృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, చాంద్రాయణ ప్రాయశ్చిత్తములం జేసికొనవలయును.

— అరుచిశూలకర్మవిపాకము —

శ్రద్ధాహీనో ధనవాన్ దానేష్వరతిస్తామసదానీ వా. 4
యస్సోఽరుచిమాన్ శూలీ జాయేతాత్మనిస్సారః,

తా. ధనవంతు డగువాడు శ్రద్ధాహీనుడై దానము చేయుటయందు నిష్ఠను లేక తామసదానం బొనరించిన, అరుచి, శూల ఇవి గలవాడగు గావున, దాని ప్రాయశ్చిత్తములం జెప్పెద.

తచ్ఛాంతి

చాంద్రాయణం చాతికృచ్ఛ్రం ప్రాజాపత్యమతఃపరమ్. 5
హోమాద్యపిచ కుర్వీత వ్యాధ్యాదేరనురూపతః.

తా. అరుచిశూలగలమనుజుడు, చాంద్రాయణము, అతికృచ్ఛ్రము, ప్రాజాపత్యకృచ్ఛ్రము, హోమములు మొదలగువాటిని రోగానుగుణ్యముగ జేసిన నశించును.

శిరశ్శూల కర్మవిపాకము

సాక్షాద్ధన్తి గవాదీని యః పునర్జననాన్తరే. 6
శిరోరోగీ శ్రోత్రరోగీ శూలీ వారుచిమాన్భవేత్,

తా. పూర్వజన్మమందు గోవు బ్రాహ్మణుడు మొదలగువారిని స్వయముగ జంపించినవాడు తలపోటు, కర్ణశూల, శూల, అరుచి ఇవి గలవాడుగ జనించు.

తచ్ఛాంతి

ఏతన్నివృత్తయే వర్షం ద్వివర్షం వా త్రివర్షకమ్. 7
చరేద్ఘృతవ్రతం చాన్తే గోహిరణ్యాదికం దిశేత్,

తా. ఒక సంవత్సరము లేక రెండుసంవత్సరములు లేక మూడుసంవత్సరములు ఘృతవ్రతమునుం జేసి పిదప బ్రాహ్మణులకు గోహిరణ్యాది దానములం జేసిన, పూర్వోక్తమగు గోబ్రహ్మహత్యాది దోషములు నివర్తించు.

కటిశూల కర్మవిపాకము

గోగామీ కటిశూలీ స్యాత్తస్య చాంద్రాయణం తథా. 8
కృచ్ఛ్రం చైవాతికృచ్ఛ్రం చ జపం సౌరం చ నిర్దిశేత్,

తా. గోగమనమును జేసినవాడు, కటిశూలరోగముగలవాడుగ జనించును గావున చాంద్రాయణము, కృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, సౌరమంత్రజపము, వీటిలో నేదైనను జేసిన నది నివర్తించు.

కర్ణశూల కర్మవిపాకము

మైథునం శృణుయాత్పిత్రోః కర్ణశూలీ భవేత్తు సః. 9
స్యాచ్చైవ బధిరః కించిత్కపాలేఽసహ్యశబ్దవాక్,

తా. ఎవడు మాతాపితృవులయొక్క మైథునమునుగూర్చి వినునో, వాడు కర్ణ

శూలగలవాడుగగాని లేక చెవుడుగలవాడుగగాని లేక కపాలమునందు, అసహ్యమగు శబ్దముగలవాడుగగాని జనించు.

తచ్ఛాన్తి

నిష్కం వింశతికం దద్యాద్బ్రాహ్మణాయ కుటుంబినే. 10
విష్ణుప్రకాశకాన్ మంత్రాన్ జపేద్రోగోపశాన్తయే,

తా. కుటుంబవంతుడగు బ్రాహ్మణునకు (౨౦) వరహాలయెత్తు సువర్ణము దానముచేసి పిదప విష్ణుప్రకాశకమంత్రములను జపించిన కర్ణశూల నివర్తించు.

హస్తశూలకర్మవిపాకము తచ్ఛాన్తి

పూర్వజన్మని నాస్తిక్యాత్సంధ్యాదిరహితో ద్విజః. 11
హస్తశూలీ సంభవతి నిష్కద్వాదశకం దిశేత్,
భోజయేద్బ్రాహ్మణాన్ శక్త్యా జపేత్సౌరం హిరణ్యదః. 12

తా. పూర్వజన్మమందు, నాస్తిక్యబుద్ధిచే సంధ్యావందనాది నిత్యకృత్యములం జేయని బ్రాహ్మణుడు, హస్తశూల గలవాడుగ జనించు. తచ్ఛాంతికై (౧౨) వరహాలయెత్తు సువర్ణమును దానముచేసి, శక్త్యనుసారముగ బ్రాహ్మణులకు భోజనంబిడి సౌరమంత్రజపమును జేసిన హస్తశూల నివర్తించును.

నయనశూలకర్మవిపాకము.

నగ్నాం పరస్త్రియం దృష్ట్వా సూర్యం నాస్తముపాగతమ్,
నేత్రశూలీ భవేత్సోఽపి నేక్షితుం శక్నుతే దిశః. 13

తా. వస్త్రహీనముగ నుండు పరస్త్రీనిగాని, లేక ఉదయాస్తమయములయందు సూర్యునిగాని చూచినవాడు, నేత్రశూలగలవాడుగ జనించు. అందువలన దిక్కులం జూచుటయందు శక్తి లేక యుండు.

తచ్ఛమనమునకు శాంతి

వర్చో మే దేహీ మంత్రేణ జపేత్సప్తసహస్రాయుతాన్,
వయస్సుపర్ణా ఇతి చ మంత్రైస్స్యాదభిషేచనమ్. 14

తా. నేత్రశూలరోగముగలవాడు, 'వర్చో మే దేహీ' యనుమంత్రమును ఏడుబదివేలు జపించి పిదప 'వయస్సుపర్ణా' అనుమంత్రముతో అభిషేకమును సదా చేసికొనవలయు.

శూలకర్మవిపాకము

శూలీ పరోపతాపీ స జాయతే పశుఘాతకః,
సోన్నదానం ప్రకుర్వీత తథా రుద్రం జపేద్బుధః. 15

తా. పరునికి తాపమును గలుగజేసినవానికి, శూలరోగముత్పన్నంబగు శరీరము సదా కృశించు. తచ్ఛాంతికై బ్రాహ్మణుల కన్నదానం బొసంగి రుద్రజపమునుం జేయువలయు.

## శూలభేదములు

దోషైః పృథక్ సమస్తామద్వంద్వైశ్శూలోష్టధా భవేత్,
సర్వేష్వేతేషు శూలేషు ప్రాయేణ పవనః ప్రభుః. 16

తా. వాతజము, పిత్తజము, కఫజము, సన్నిపాతజము, ఆమజము, ద్వంద్వజము అని శూలరోగము ఎనిమిదివిధంబులుగ నుండు. ఈ అష్టవిధంబులయందు వాయువు ప్రధానముగ నుండు.

## వాతజశూలనిదానలక్షణములు

వ్యాయామయానాదతిమైథునాచ్చ ప్రజాగరాచ్ఛీతజలాతిపానాత్,
కలాయముద్గాఢకకోరదూషాదత్యర్థరూక్షాధ్యశనాభిఘాతాత్. 17
కషాయతిక్తాదివిరూఢజాన్నవిరుద్ధవల్లూరకశుష్కశాకాత్,
విట్శుక్రమూత్రానిలవేగరోధాత్ శోకోపవాసాదతిహాస్యభాషాత్.
వాయుః ప్రవృద్ధోజనయేద్ధి శూలంహృత్పార్శ్వపృష్ఠత్రికబస్తిదేశే,
జీర్ణే ప్రదోషేచ ఘనాగమేచ శీతేచ కోపం సముపైతి గాఢం. 19
ముహుర్ముహుశ్చోపశమప్రకోపౌ విడ్వాతసంస్తంభనతోదభేదైః,
సంస్వేదనాభ్యంజనమర్దనాద్యైః స్నిగ్ధోష్ణభోజ్యైశ్చ శమంప్రయాతి. 20

తా. వ్యాయామము, దారినడచుట, అతిమైథునము, జాగరణము, మిగుల శీతజలపానము, బఠాణీలు, పెసలు, కందులు, అరికలు, మిగుల రూక్షపదార్థములు వీటిని మిగుల భుజించుట; అభిఘాతము, వగరు, చేదు, నాటినపైరుధాన్యము, ఎండిన మత్స్యాదిమాంసములు, ఎండించినశాకములు వీటిని భుజించుట; మలము, మూత్రము, శుక్రము, అపానవాయువు, వీటివేగముల నిరోధించుట; శోకము, ఉపవాసము, మిగుల నవ్వుట, ఎక్కువగా మాట్లాడుట వీటియన్నిటివలన వాతము ప్రకోపించి, హృదయము, పార్శ్వములు, పొత్తికడుపు, వెన్ను, పిర్రు వీటియందు శూలను గలుగం జేయు. అట్టిశూల జీర్ణకాలమునందును, ప్రదోషకాలమునందును, గ్రీష్మాంతమునందును, మిక్కుటముగ శీతపదార్థమును సేవించినపుడును, గాఢముగ ప్రకోపమును జెందును. ఇదియ వాతశూల యనఁబడు, ఇది ప్రకోపించినకాలమునందు, విరేచనము, వాతశమనచికిత్స, గుద్దడము, పిసకడము, చెమటదీయుడము, అభ్యంజనము, స్నిగ్ధము, ఉష్ణముగ నుండుభోజనము వీటిని జేసిన శాంతిని జెందు.

## పైత్తికశూలనిదానలక్షణములు

క్షారాతితీక్ష్ణోష్ణవిదాహితైలనిష్పావపిణ్యాకకులుత్థయూషైః,
కట్వమ్లసౌవీరసురావికారైః క్రోధానలాయాసరవిప్రతాపైః. 21
గ్రామ్యాతియోగాదశనైర్విదగ్ధైః పిత్తం ప్రకుప్యాశుకరోతి శూలమ్,
తృణ్మోహదాహార్తికరం హినాభ్యాం సంస్వేదమూర్ఛాభ్రమశోష
యుక్తమ్. 22
మధ్యందినే కుప్యతి చార్ధరాత్రే విదాహకాలే జలదాత్యయే చ,
శీతే చ శీతైః సముపైతి శాన్తిం సుస్వాదు శీతైరపి భోజనైశ్చ. 23

తా. యవక్షారాది ద్రవ్యములు, తీక్ష్ణద్రవ్యములు, ఉష్ణద్రవ్యములు, విదాహకరపదార్థములు, తైలపక్వపదార్థములు, అనుములు, గానుగపిండి, ఉలవకట్టు, కారము, పులుసు, కాంజికము, నానావిధమద్యములు, కోపించుట, నిప్పుసెగపడుట, శరీరాయాసము, ఎండపడుట, అతిమైథునము, బియ్యమును వేయించి పక్వముచేసిన అన్నము, వీటిసేవనవలన పిత్తము ప్రకోపించి, దప్పి, మోహము, దాహము, నాభియందు చెమట, మూర్ఛ, భ్రమ, మంట ఇట్టిలక్షణములు గల శూలను గలుగజేయును. అది మధ్యాహ్నకాలమునందును, అర్ధరాత్రమునందును, ఉష్ణకాలమునందును, శరదాదికాలములయందును, శీతకాలమునందును ప్రకోపించును. చలవపదార్థములు, వాతకరపదార్థములు వీటిని సేవించిన నది ఉపశమించు.

## కఫజశూలనిదానలక్షణములు

ఆనూపవారిజకిలాటపయోవికారైర్మాంసేక్షుపిష్టకృసరాతిల
శష్కులీభిః,
అన్యైర్బలాసజనకైరపి హేతుభిశ్చ శ్లేష్మాప్రకోపముపగమ్య కరోతి శూలమ్,
హృల్లాసకాససదనారుచిసంప్రసేకైరామాశయే స్తిమితకోష్ఠశిరోగురుత్వైః,
తైర్వ్యాః, భుక్తే సదైవ చ రుజం కురుతేఽతిమాత్రం సూర్యోదయేఽథ శిశిరే కుసు
మాగమే చ. 25

తా. జలసమీపదేశమునందుండు ఎనుము మొదలగునట్టియు, జలమునందుండెడి హంసచక్రవాకాదిపక్షుల మాంసములు, క్షీరముతో చేయబడిన పదార్థములు, మాంసములు, చెరుకుపాలు మొదలగు పదార్థములు, పిండివంటలు మొదలగు పదార్థములు, నువ్వులు బెల్లముకలిపిచేసిన పదార్థములు, నువ్వులచూర్ణము, చక్కిలములు, కఫకరపదార్థములు వీటిసేవనచే శ్లేష్మము ప్రకోపించి, ఓకిరింత, దగ్గు, శైథిల్యము,

అరుచి, జొల్లు, మలబద్ధము, తలబరువు, ఇట్టిలక్షణములతో గూడియుండుశూలను, ఆమాశయమునందు గలుగంజేయు. అది, భోజనానంతరమునందును, శ్లేష్మోల్బణమునందును, సూర్యోదయ కాలమునందును, శిశిరవసంత ఋతువులయందును, ప్రకోపమును జెందును. ఇదియ కఫజశూల యనంబడు.

ఆమజశూలలక్షణములు

ఆటోపహృల్లాసవమీగురుత్వస్తైమిత్యనానాహకఫప్రసేకైః,
కఫస్య లింగేన సమానలింగమామోద్భవం శూలముదాహరంతి. 26

తా. కడుపునందు గుడగుడశబ్దము, హృల్లాసము, వమనము, గురుత్వము, నిశ్చలత్వము, కడుపుబ్బరము, కఫము, జొల్లు - ఇట్టిలక్షణములతో గూడి, కఫజశూలతో సమానలక్షణములు గలిగియుండిన దానిని ఆమజశూల యని తెలిసికొనవలయు

ద్వంద్వజశూల లక్షణము.

వస్తిహృత్కంఠపార్శ్వేషు స శూలః కఫవాతికః,
కుక్షౌ హృన్నాభిమధ్యేషు స శూలః కఫపైత్తికః. 27
దాహజ్వరకరో ఘోరో విజ్ఞేయో వాతపైత్తికః,

తా. వస్తి హృదయము కంఠము పార్శ్వములు వీటియందు జనించినది కఫవాతజశూల యనియు, కుక్షి హృదయము నాభిమధ్యము వీటియందుజనించినది కఫపిత్తజశూల యనియు, దాహము జ్వరము వీటినిగలుగజేయునది వాతపిత్తజశూల యనియును తెలియవలయు.

సన్నిపాతజశూలలక్షణము

సర్వేషుదోషేషుచసర్వలింగం విద్యాద్భిషక్ సర్వభవం హి శూలమ్,
తత్ కష్టమేతత్ విషవజ్రతుల్యం వివర్జనీయం ప్రవదన్తి తజ్జ్ఞాః,

తా. వాతాదిసమస్తదోషజన్య శూలలక్షణములు గలది సన్నిపాతజశూల యనంబడు. ఇది విషము, వజ్రాయుధము వీటితోతుల్యముగ క్రూరమగుటవలన, అసాధ్యమని తెలిసికొనవలయు.

పరిణామజశూలలక్షణము

భుక్తే జీర్యతి యచ్ఛూలం తదేవపరిణామజమ్. 29
తస్యలక్షణమప్యేతత్సమాసేనాభిధీయతే,
బలాసః ప్రచ్యుతః స్థానాచ్ఛ తేనసహామూర్ఛితః. 30
వాయుమాదాయ కురుతే శూలం జీర్యతి భోజనే,

తా. భుజించిన అన్నము జీర్ణించుకాలమునందు కఫము, స్వస్థానమునుంచి చలించి శీతముతోగూడి వాయువును ప్రకోపింపజేసి శూలను గలుగజేయు. అది పరిణామశూల యనంబడు.

### పరిణామశూలస్థానములు

సకుక్షౌ జఠరే పార్శ్వే నాభ్యాం వస్తౌ స్తనాన్తరే. 31
పృష్ఠమూలప్రదేశేషు సర్వేష్వేతేషు వా పునః,
భుక్తమాత్రే తథా వాపి జీర్ణే న్నే చ ప్రశామ్యతి. 32
షష్టికవ్రీహిశాలీనాం భోజనే చ వివర్ధతే,
తత్పరిణామజం శూలం దుర్విజ్ఞేయం మహాగదమ్. 33
ఆహారరసవాహీనాం స్రోతసాం దుష్టహేతుకమ్,

తా. వాతాదిదోషప్రకోపమువలన, అన్నరసవాహిను లగు నాడులు దుష్టములగుటచే భుజించినతోడనే కుక్షి ఉదరము పార్శ్వములు నాభి పొత్తికడుపు రొమ్ము పృష్ఠమూలప్రదేశము వీటియందొక్కటొకటియందు గాని, లేక అన్నిటియందు గాని శూలగలుగుట, అన్నము జీర్ణమైన పిదప శమించుట, అరవైదినముల పంటగల సంబాబియ్యపు అన్నము శాలిధాన్యపుఅన్నము భుజించిన వృద్ధిపొందుట ఇట్టిలక్షణములు గలది దుర్విజ్ఞేయమగు గొప్ప పరిణామశూల యనంబడు

### వాతజపరిణామశూలలక్షణము

ఆధ్మానాటోపవిణ్మూత్రవిబంధారతివేపనైః. 34
స్నిగ్ధోష్ణోపశమప్రాయం వాతికం తద్వదేద్భిషక్,

తా. కడుపుబ్బుట, శూలయుక్తముగ గుడగుడశబ్దము పుట్టుట, మలమూత్రబంధము, దేనియందు దిష్టము లేకపోవుట, కంపముగలుగుట, మృదువుగను, ఉష్ణముగనుండు పదార్థముల సేవించిన శమించిన దానివలె నుండుట, ఇట్టిలక్షణములుగలది వాతజపరిణామశూల యని యెరుంగవలయు.

### పిత్తజపరిణామశూలలక్షణము

తృష్ణాదాహారతిస్వేదకట్వమ్లలవణోద్భవమ్. 35
శూలం శీతశమప్రాయం పైత్తికం లక్షయేద్భిషక్,

తా. దప్పి దాహము అరతి చెమట ఇవి గలుగుట, కారము పులుసు ఉప్పు గల పదార్థములను భుజించిన వృద్ధిచెందుట, శీతపదార్థములు భుజించిన శమించినటుల నుండుట, ఇట్టిలక్షణములు గలది పిత్తజపరిణామశూల యని తెలిసికొనవలయు.

కఫజపరిణామశూలలక్షణము

ఛర్దిహృల్లాససంమోహాస్స్వల్పరుక్ దీర్ఘసంతతి. 36
కటుతిక్తోపశాంతం చ తచ్చ్ఞేయం కఫాత్మకమ్,

తా. వాంతి, హృల్లాసము, మిగులమోహము, స్వల్పవేదన, దీర్ఘకాలము అనుసరించియుండుట, కారము వగరుగలపదార్థములను భుజించిన శాంతిని జెందుట ఇట్టి లక్షణములుగలది కఫజపరిణామశూల యని తెలిసికొనవలయు.

ద్వంద్వజసన్నిపాతజపరిణామశూలలక్షణము

సంసృష్టలక్షణం లబ్ధ్వా ద్విదోషం పరికల్పయేత్. 37
త్రిదోషజమసాధ్యంతు క్షీణమాంసబలానలమ్,

తా. ద్విదోషజన్యశూలలక్షణములు గలిగియుండిన ద్విదోషజశూల యనియు త్రిదోషజన్యశూలలక్షణములుగలిగి మాంసము బలము అగ్ని ఇవి క్షీణించియుండిన సన్నిపాతజశూల యనియును తెలియంగవలయు.

శూలోపద్రవములు

వేదనాచ తృషా మూర్ఛా హ్యానాహో గౌరవారుచీ. 38
కాసశ్వాసౌచ హిక్కాచ శూలస్యోపద్రవాస్స్మృతాః,

తా. వేదన, దప్పి, మూర్ఛ, కడుపుబ్బుట, శరీరము బరువుగనుండుట, అరుచి, దగ్గు, ఉబ్బసము, ఎక్కిళ్లు ఇవి శూలోపద్రవము అని తెలియంగవలయు.

శూలవ్యాధికి అసాధ్యలక్షణము

ఏకదోషాన్వితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః. 39
సర్వదోషోత్థితో ఘోరో త్వసాధ్యో భూర్యుపద్రవః,

తా. ఏకదోషజనితశూలము సాధ్య మనియు, ద్విదోషజన్యశూల కష్టసాధ్యమనియు, త్రిదోషజన్యశూల అధికోపద్రవము గలిగి భయంకరముగనుండుగాన అసాధ్యమనియు తెలియంగవలయు.

అన్నద్రవశూలలక్షణము

జీర్ణేజీర్యత్యజీర్ణే వా యచ్ఛూలముపజాయతే. 40
పథ్యాపథ్యప్రయోగేణ భోజనాభోజనేన వా,
న శమం యాతి నియమాత్ సోన్నద్రవఉదాహృతః. 41

తా. అన్నము జీర్ణించిన కాలమునందుగాని జీర్ణించుచుండు కాలమునందుగాని జీర్ణించకయుండు కాలమునందుగాని శూల జనించి పథ్యముగ భుజించినను లేక అపథ్య

ముగ భుజించినను భోజనము జేసినను లేక భోజనము జేయకయుండినను శమించక యెల్లపుడు పీడించుచుండిన దానిని అన్నద్రవశూలయని యెఱుంగవలయు.

—॥ మఱియు అన్నద్రవశూలలక్షణము ॥—

అన్నద్రవాఖ్యే శూలే తు న తావత్స్వాస్థ్యమశ్నుతే,
యావత్కటుకపీతాన్నమన్నం న చ్ఛర్దయేద్ద్రవమ్. 42

తా. కారముగను పచ్చగను పుల్లగను అన్నద్రవము వమనంబయ్యే పర్యంతము స్వస్థతలేకయుండుటయే అన్నద్రవశూలలక్షణమని తెలిసికొనవలయు.

---

—॥ వాతజశూలకు - దశమూలాదికషాయము ॥—

తైలమేరండజం వాపి దశమూలస్య వారిణా,
పీతం నిహన్తి సాటోపం హింగుసౌవర్చలాన్వితమ్. 43

తా. దశమూలకషాయమునందు ఆముదము ఇంగువ సౌవర్చలవణము వీటిని చేర్చి పుచ్చుకొనిన ఆటోపముతోగూడిన శూలనివర్తించు.

—॥ విశ్వాదికషాయము ॥—

విశ్వమేరండజం మూలం క్వాథయిత్వా శృతం పిబేత్,
హింగుసౌవర్చలోపేతం సద్యశ్శూలనివారణమ్. 44

తా. శొంఠి, ఆముదపువేరు, వీటికి కషాయముబెట్టి అందు ఇంగువ, సౌవర్చలవణము, వీటిని పుచ్చుకొనిన వెంటనే శూల నివర్తించు.

—॥ బలాదికషాయము ॥—

బలాపునర్నవైరండబృహతీద్వయగోక్షురైః,
క్వాథస్సహింగులవణః పీతో వాతరుజం జయేత్. 45

తా. చిట్టాముట్టి, తెల్లగలిజేరువేరు, ఆముదపువేరు, ములక, వాకుడు, చిరిపల్లేరు, వీటికి కషాయముబెట్టి, అందు, ఇంగువ, సైంధవలవణము, వీటినిచేర్చి పుచ్చుకొనిన వాతికశూల నివర్తించు.

—॥ పిత్తశూలలకు శతావర్యాదికషాయము ॥—

శతావరీ సయష్ట్యాహ్వావాట్యాలకుశగోక్షురైః,
శృతశీతం పిబేత్తోయం సగుడక్షౌద్రశర్కరమ్. 46
పిత్తాసృగ్దాహశూలఘ్నం సద్యో దాహరుజాపహమ్,

తా. పిల్లపీచర, యష్టిమధుకము, చిట్టాముట్టి, దర్భమూలము, చిరిపల్లేరు, వీటిని

కషాయముబెట్టి, అందుబెల్లము, తేనె, శర్కర, వీటిని చేర్చి పుచ్చుకొనిన పిత్తగర్మము, దాహము, శూల, ఇవి నివర్తించు.

—॥ బృహత్యాదికషాయము ॥—

బృహతీగోక్షురైరండకుశకాశేక్షువాలకాః. 47
పీతాః పిత్తభవం శూలం సద్యో హన్త్యసుదారుణమ్,

తా. ములకవేరు, చిరిపల్లేరు, ఆముదపువేరు, కుశదర్భ, కొశదర్భ, చెఱకు, కురువేరు, వీటి వేళ్లనుకషాయముబెట్టి పుచ్చుకొనిన, దారుణమగు పిత్తజశూలనివర్తించును.

—॥ త్రిఫలాదికషాయము ॥—

త్రిఫలారగ్వధక్వాథశ్శర్కరాక్షౌద్రసంయుతః. 48
రక్తపిత్తహరో దాహ పిత్తశూలనివారణః,

తా. కరక (౧) భాగము, తాడి (౨) భాగములు, ఉసిరికలు (౩) భాగములు, రేలగిజరు (౪) భాగములు, వీటినికషాయముబెట్టి అందు, చక్కెర తేనె చేర్చి పుచ్చుకొనిన రక్తపిత్తము, దాహము, పిత్తశూల, ఇవి నివర్తించు

త్రిఫలారిష్టయష్ట్యాహ్వా కటుకారగ్వధైశ్శృతమ్. 49
పాయయేన్మధుసమ్మిశ్రం దాహశూలోపశాన్తయే,

తా. కరక, తాడి, యుసిరికలు, వేపయీనెలు, యష్టిమధుకము, కటుకరోహిణి, రేలగిజరు, వీటిని సమాంశములు కషాయముబెట్టి అందు తేనె కలిపి, పుచ్చుకొనిన, దాహశూల నివర్తించు,

—॥ కఫశూలకు ఏరండమూలాది కషాయము ॥—

ఏరండమూలం ద్విపలం జలేష్టగుణితే పచేత్. 50
తత్క్వాథో యావశూకాఢ్యః పార్శ్వహృత్కఫశూలహా,

తా. ఆముదపువేరు, (౨) పలములు, (౧౬) పలముల నీళ్లయందునిచి (నాల పాలుమిగులునట్లు) కషాయముకాచి, అందు యవక్షారముచేర్చి పుచ్చుకొనిన, పార్శ్వము గుండె వీనియందుండు। కఫశూల నివర్తించు.

—॥ ఆమశూలకు చిత్రకాది కషాయము ॥—

చిత్రకగ్రంథికైరండ శుంఠీధాన్యజలైశ్శృతమ్. 51
సహింగుసైంధవబిడమామశూలహరం పరమ్,

తా. చిత్రమూలము, మోడి, ఆముదపువేరు, శొంఠి, ధనియాలు, వీటిని కషాయముబెట్టి, అందు, ఇంగువ, సైంధవలవణము, బిడాలవణముచేర్చి సేవించిన, ఆమశూల నివర్తించు.

(ద్వంద్వజశూలకు కషాయము)

నిదిగ్ధికాబృహత్యౌ చ కుశకాశేక్షువాలికాః. 52
శ్వదంష్ట్రైరండమూలం చ వారిణా సహ పాచయేత్,
పిబేత్సశర్కరక్షౌద్రం శూలే పిత్తానిలాత్మకే. 53

తా. వాకుడువేరు, ములకవేరు, కుశ, కాశదర్భ, పెండువగడ్డి, పీటివేళ్లు, చిరిపల్లేరు, ఆముదపువేరు, వీటిని కషాయముబెట్టి, అందు చక్కెర తేనె కలిపి సేవించిన పిత్తవాతజశూలనివర్తించు.

(పిత్తశ్లేష్మజశూలలకు పటోలాదికషాయము)

పటోలత్రిఫలారిష్టైః శృతం క్షౌద్రయుతం పిబేత్,
పిత్తశ్లేష్మ జ్వరచ్ఛర్దిదాహశూలోపశాంతయే. 54

తా. చేదుపొట్ల, కరక, తాడి, ఉసిరికెలు, వేపయీనెలు, వీటిని కషాయము, బెట్టి, అందు, తేనె కలిపి పుచ్చుకొనిన, పిత్తశ్లేష్మజ్వరము, ఛర్ది, దాహముశూల ఇవి నివర్తించు.

(ద్రాక్షాది కషాయము)

ద్రాక్షాటరూషయోః క్వాథః శ్లేష్మపిత్తాసృజం జయేత్,
పిత్తశ్లేష్మోద్భవం శూలం విరేకవమనైర్జయేత్. 55

తా. ద్రాక్ష, అడ్డసరపు యీనెలు, వీటినికషాయముబెట్టి, పుచ్చుకొనిన శ్లేష్మపిత్తశూల నివర్తించును. మరియు, విరేచనము, వమనము, వీటినిజేసిన, పిత్తశ్లేష్మశూల నివర్తించు.

(ఏరండమూలాదికషాయము)

ఏరండఫలమూలాని బృహతీద్వయగోక్షురైః,
పర్ణిస్యస్సహదేవీ చ సింహపుచ్ఛీత్రికంటకా. 56
తుల్యైరేతైః శృతం తోయం యవక్షారయుతం పిబేత్,
పృథగ్దోషభవం శూలం హన్యాత్సర్వభవం తథా. 57

తా. ఆముదపుగింజలు, ఆముదపువేరు, వాకుడువేరు, ములకవేరు, పల్లేరువేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, పిల్లిపెసర, కారుమినుము, సహదేవి, సింహపుచ్ఛి, (నక్కతోకపొన్న) పెండువగడ్డి, వీటిని సమాంశములుగ కషాయముబెట్టి, అందు యవక్షారముచేర్చి పుచ్చుకొనిన, ద్వంద్వజశూలలు నివర్తించు.

### ఏలాదికషాయము

ఏలాహింగుయవక్వాథః సైంధవప్రతివాపితః,
పీతఏరండతైలేన కటిహృద్భవముద్ధతం. 58
జాఠరం నాభిశూలం చ పృష్ఠకుక్షిగతం తథా,
శిరఃకర్ణాక్షిశూలం చ నాశయత్యతివేగతః. 59

తా. ఏలకులు, ఇంగువ, యవలు, వీటిని కషాయముబెట్టి, అందు సైంధవలవణము, ఆముదముకలిపి సేవించిన, కటిశూల, హృదయశూల, జఠరశూల, నాభిశూల, కుక్షిశూల, శిరశ్శూల, కర్ణశూల, నేత్రశూల, ఇవియన్నియు నివర్తించు.

### మాతులుంగాదికషాయము

మాతులుంగరసో వాపి శిగ్రుక్వాథస్తథాపరః,
సక్షారో మధునా పీతః పార్శ్వహృద్వస్తిశూలహా. 60

తా॥ మాదీఫలరసములోగాని, లేక, మునగవేళ్ల కషాయములోగాని, యవక్షారము తేనెకలిపి పుచ్చుకొనిన, పార్శ్వశూల, హృదయశూల పొత్తికడుపునందు నొప్పి ఇవి నివర్తించు.

### అజమోదాదికషాయము

అజమోదావచాహింగులవణం బిడపూర్వకమ్,
శుంఠీసువర్చలాకృష్ణాదుల్హారీరింగిణీ తథా. 61
బీజపూరస్య బీజాని తుంబరుం సమభాగతః,
ఏతత్క్వాథస్య పానేన యాంతి శూలాన్యనేకధా. 62

తా. ఓమము, ఇంగువ, బిడాలవణము, శొంఠి, సౌవర్చలవణము, పిప్పళ్లు దూలగొండి, పిల్లిపెసర, మాదీఫలపువిత్తులు, తుంబురయనుగ్రంధ్యము, వీటినిసమభాగములుగ జేర్చి కషాయముబెట్టి సేవించిన, సర్వశూలలు మానును.

### ఏరండాదికషాయము

ఏరండబిలబృహతీద్వయమాతులుంగపాషాణభిత్త్రికటుమూలకృతః కషాయః,
సక్షారహింగులవణోరుబుతైలమిశ్రః శ్రోణ్యూరుమేఢ్రహృదయస్తనరుక్షుపేయః. 63

తా. ఆముదపువేరు, దూలగొండివేరు, వాకుడువేరు, ములకవేరు, మాదీఫలపువేరు, పాషాణభేది (పిండికొండ) త్రికటుకములు వీటిని సమాంశములుగ కషాయముబెట్టి

అందు యవక్షారము ఇంగువ సైంధవలవణము అముదము వీటిని చేర్చి సేవించిన, కటిశూల, ఊరుశూల, మేఢ్రశూల, హృదయశూల, స్తనశూల ఇవియన్నియు నివర్తించు.

—॥ పరిణామశూలకు - త్రిఫలాదికషాయము ॥—

త్రిఫలాకృతమాలభవం క్వథనం సితయామునునా సహితం హరతి,
తనుదాహయుతాస్రకపిత్తరుజః కిలపిత్తజశూలహరం ప్రసరమ్. 64

తా. త్రిఫలములు, రేలగిజరు వీటిని సమాంశములుగ కషాయము బెట్టి అందు తేనె చక్కెరచేర్చి పుచ్చుకొనిన శరీరతాపము, రక్తపిత్తము పిత్తశూల ఇవి నివర్తించు.

—॥ పరిణామశూలకు కల్కము ॥—

విష్ణుక్రాన్తాజటాకల్కస్సితాక్షౌద్రఘృతైస్సహ,
పరిణామభవం శూలం నాశయేత్సప్తభిర్దినైః. 65

తా. విష్ణుక్రాన్తవేళ్లకల్కమునందు చక్కెర తేనె నెయ్యి వీటినిచేర్చి ఏడు దినములు పుచ్చుకొనిన పరిణామశూల నివర్తించు.

—॥ పరిణామశూలలకు శుంఠీకల్కము ॥—

శుంఠీతిలగుడైః కల్కం దుగ్ధేన సహ యోజయేత్,
పరిణామభవం శూలమామవాతం త్ర్యహాజ్జయేత్. 66

తా. శొంఠి నువ్వులు బెల్లము వీటిని కల్కముజేసి పాలుగలిపి పుచ్చుకొనిన పరిణామశూల ఆమవాతము ఇవి మూడుదినములలో నివర్తించు.

—॥ ఉదయభాస్కరరసము ॥—

భస్మసూతం మృతం చాభ్రం శిలాగంధకతాళకే,
హింగుకం కుష్ఠముస్తే చ తుల్యం చూర్ణం విభావయేత్. 67
స్నుహ్యర్కత్రికనిర్గుండీమహారాష్ట్రద్రవైః పృథక్,
ప్రతిద్రావైర్దినం భావ్యం శుష్కం తద్గోళకీకృతమ్. 68
వస్త్రే బద్ధ్వా మృదాలిప్య శుష్కం కృత్వా పుటే పచేత్,
చతుర్దాబస్తమాత్రేణ పుటే పక్త్వా విచూర్ణయేత్. 69
ద్వే గుంజే ఘృతశుంఠీభ్యాం లేహ్యాస్యాదుదయభాస్కరాత్,
వాతశూలప్రశాన్త్యర్థం తిలక్షారం ససైన్ధవమ్. 70
మధునా లేహయేచ్చాను శూలే వా శాన్తితుంబుకమ్,

తా. రసభస్మము, అభ్రకభస్మము, శుద్ధమనుశిల, శుద్ధిచేసినగంధకము, శుద్ధతాళకము, ఇంగువ, చంగల్వకోష్ఠము, తుంగముస్తలు వీటిని సమభాగములుగ చూర్ణించి జెముడుపాలు, ఉమ్మెత్త, వావిలి, దుంపరాష్ట్రిము. మహారాష్ట్రి వీనిరసములచే

ప్రత్యేక మొక్కొకదినము భావనజేసి ముద్దజేసి యెండించి వస్త్రముఁజుట్టి పైన మన్ను బూసియెండించి పుటంబిడి స్వాంగశీతలమునదీసి పిదప గోమూత్రమున భావనజేసి పూర్వమువలె నాలుగుమారులు పుటంబిడి చల్లారినపిదప చూర్ణించి (౨) గురిగింజల యెత్తుచొప్పున, శొంఠిచూర్ణము నెయ్యి యీ అనుపానముతోగాని అగరు గంధపు చూర్ణముతోగాని సేవించినవాతశూల నివర్తించు.

### సర్వశూలలకు శూలకుఠారరసము

టంకణం పారదం గంధం త్రిఫలావ్యోషతాళకే. 71
విషం తామ్రం చ నేపాళం భృంగస్వరసమర్దితమ్,
ద్విగుంజమాత్రో హరతి మరిచేనార్ద్రకేన వా. 72
సర్వం శూలకుఠారోయం శూలం చక్రమివాసురాన్,

తా. పేల్చినవెలిగారము, (శుద్ధిజేసినవెలిగారము) శుద్ధరసము, శుద్ధిజేసినగంధకము, త్రిఫలములు, త్రికటుకములు, శుద్ధతాళకము, శుద్ధిజేసిననాభి, తామ్రభస్మము, శుద్ధిజేసిననేపాళములు వీటిని సమాంశములుగ గ్రహించి ఖల్వమునందునిచి గుంటగలిజేరుఆకురసముచే మర్దించి (౨) గురిగింజలంతమాత్రలుజేసి అందులోనొకమాత్ర మిరియాలచూర్ణము లేక అల్లపురసము యీఅనుపానమున సేవించిన సర్వశూలలు నివర్తించు.

### త్రిదోషజశూలలకు అగ్నికుమారరసము

సూతేన గంధం సహ టంకణేన సమం విషం యోజ్యమిహ
త్రిభాగమ్. 73
కపర్దశంఖావపితౌ ద్విభాగౌ మరీచకై రష్టగుణైర్విమిశ్రమ్,
జంబీరనీరేణ విమర్దనీయం సిద్ధో భవేదగ్నికుమార ఏషః, 74
దేయం హి గుంజాద్వితయం చ శూలే త్రిదోషజే యోగ్యరసాను
పానైః,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, వెలిగారము ఇవి సమభాగములు శుద్ధిజేసినవసనాభి (౩) భాగములు, గవ్వలభస్మము, (౨) భాగములు, శంఖభస్మము (౨) భాగములు, మిరియాలు, (౮) భాగములు వీటినన్నియు చూర్ణించి ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముచే మర్దించిననగ్నికుమారరసము సిద్ధమగు. దీనిని (౨) గురిగింజలంత యోగ్యమైన అనుపానముతో సేవించిన త్రిదోషజముల నివర్తించు.

### సకలశూలలకు క్షారతామ్రరసము

పలమితమృతశుల్బం తన్మితం గంధచూర్ణం వసుమితపరిమాణం
తింత్రిణీక్షారచూర్ణమ్. 75

త్రయమిదమపి పిష్టం క్షారతామ్రాఖ్యమేతద్ హరతి సకలశూలం
పీతముష్ణోదకేన,

తా. తామ్రభస్మము (౧) పలము, గంధకము (౧) పలము, చింత క్షారము (౨) పలములు, యీమూటిని నేకముగ జేర్చిన నూరిన క్షారతామ్రరసమనంబరగు. దీనిని ఉష్ణోదకముతో పుచ్చుకొనిన సకలశూలలు మానును.

శూల పీడారిరసము

వ్యోమపారదగంధాశ్చ జయపాలకటంకణం. 76
వహ్నిచంద్రశశిద్వి త్రిభాగాంశ్ జంభాంభసా త్ర్యహమ్,
పిష్ట్వా కోలమితాం కృత్వా గుడకాంజికతో నరస్తతః. 77
వితరేదామశూలాద్యా కృమిశూలే విశేషతః,
పథ్యం తక్రోదనం చాత్ర స్తంభాగ్నం శీతలక్రియాః. 78

తా. అభ్రికభస్మము (3) భాగములు రసభస్మము (౧) భాగము శుద్ధగంధకము (౧) భాగము నేపాళములు (౨) భాగములు వెలిగారము (3) భాగములు వీటిని ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముచే 3 దినములు నూరి రేగుగింజలంతమాత్రలు జేసి బెల్లము కాంజికము వీటితో సేవించిన ఆమశూల క్రిమిశూల ఇవి నివర్తించును, పథ్యము మజ్జిగన్నమిడి విరేచనముకట్టుటకు శీతోపచారములను చేయవలయును.

పక్తిశూలలకు శంఖసుందరరసము

సమం తామ్రదళం పిష్ట్వా రసేంద్రం ద్విగుణం బలిమ్,
మృద్వా స్త్రీణ సమావేష్ట్య పుటయంత్రః పునః పచేత్. 79
సంమర్ద్య హేమవాతారిచిత్రకవ్యోషసుజ్గిభిః,
షోడశాంశం విషం దత్వా చూర్ణయిత్వాస్య వల్లకమ్. 80
ప్రాగుక్తైరనుపానైశ్చ దద్యాచ్ఛూలం చ వాతజమ్,
కఫజం పక్తి శూలం చ హన్యాచ్ఛ్రీశివశాసనాత్. 81

తా. మిగులసన్నమగు తామ్రపు రేకులు (౧) తులము గ్రహించి, శుద్ధిచేసినరసము (౧) తులముపైచిమర్దించి గంధకము (౨) తులములుచేర్చి కజ్జలిచేసి శరావములోబోసి మూకుడు మూసి చీలమన్నుయిచ్చి గజపుటమిడి స్వాంగశీతలమున దీసి మూర్ఛించి యీ ఔషధమునకు ౧౬. వ పాలు నాభిచేర్చి ఉమ్మెత్తరసము, ఆముదపువేరురసము చిత్రమూలరసము, శొంఠి పిప్పలి మిరియాలు కషాయము వీనిచే ప్రత్యేకముగ భావనచేసి

చూర్ణించి ఒకవల్ల ప్రమాణముపూర్వోక్తఅనుపానములచేసేవించిన వాతశూల కఫశూల పత్తిశూల ఇవి నివర్తించు.

## సర్వశూలలకు షణ్ముఖరసము

సూతం గంధం సమం శుద్ధం సూతాంశం మృతతామ్రకమ్,
సువర్చలం చ సూతాంశం జంబీరైర్దినసప్తకమ్. 82
మర్దయేదాతపే తీవ్రే రుద్ధ్వా లఘుపుటత్రయమ్,
దత్త్వాదాయ తు తచ్చూర్ణే సూతాంశం త్రికటుం క్షిపేత్. 83
షణ్ముఖోయం రసో నామ త్రిగుంజస్సర్వశూలజిత్,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, తామ్రభస్మము, సౌవర్చలవణము వీటిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముతో (7) దినములు మర్దించి తీవ్రమగు యెండయందునిచి యెండించి ప్రమిదెలయందునిచి (3) లఘుపుటములిడి సాంగశీతలమున దీసి చూర్ణించి పిదప ఆచూర్ణమునకు సమము త్రికటుకచూర్ణమునుకలిపి (3) గురిగింజలంత సేవించిన సర్వశూలలు నివర్తించు.

## మహాశూలహరరసము

రసం గంధకం టంకణం శ్వేతకాచం సకర్పూరశృంగం సుతామ్రం గనరాటమ్. 84
విడం శంబుకం శృంగమేణస్య శంఖం రవిస్నుక్పయోభిర్దినం సంవిమర్ద్య,
విశుష్కం తు పశ్చాద్విమవ్యోషయుక్తం మరీచాజ్యయుక్తం తు వల్లం దదీత. 85
మహాశూలహర్తా క్షయే దుర్నివారే, గ్రహణ్యాం తథా పాండురోగేఽగ్నిమాంద్యే,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసినగంధకము, వెలిగారము, శ్వేతకాచము, కర్పూరము, దుప్పికొమ్ముభస్మము, తామ్రభస్మము, గవ్వలభస్మము, బిడాలవణము, ఆలుచిప్పలయొక్కభస్మము, లేడికొమ్ముభస్మము, శంఖభస్మము వీటిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందునిచి జిల్లేడుపాలు బొంతజెముడుపాలు వీటిచే ప్రత్యేకమొంకదినము మర్దించి యెండపెట్టి పిదప శుద్ధిచేసిననాభి త్రికటుకములు వీటిని చూర్ణించి కలిపి వల్లప్రమాణము మిరియాలచూర్ణము నెయ్యి వీటితో సేవించిన మహాశూల/క్షయ సంగ్రహణి పాండు అగ్నిమాంద్యము ఇవి నివర్తించు.

## శూలగజకేసరి

రసవిషగంధకసర్జక్షారాస్సహసింధుపిప్పలీవిశ్వైః. 86
అహిపల్ల్యంబు విమృష్టాశ్శూలేభహారిర్ద్విగుంజోయమ్,

తా. శుద్ధిచేసినరసము, శుద్ధగంధకము, నాభి, గవ్వలభస్మము, వెలిగారము, సైంధవలవణము, పిప్పలి, శొంఠి వీటిని సమభాగములుగజేర్చి తమలపాకులరసముచే నూరి రెండుగురిగింజలయెత్తు సేవించిన సర్వశూలలు నివర్తించు. ఇది శూలగజకేసరి రసము.

## గజకేసరీరసము

క్షారం కపర్దం విషసైంధవం చ వ్యోషాన్వితం పర్ణరసైర్విమర్ద్యమ్.87
గుంజైకమాత్రోఽనిలజే వికారే పక్త్యాఖ్యశూలే గజకేసరీ స్యాత్,

తా. గవ్వలక్షారము, శుద్ధిజేసిననాభి, సైంధవలవణము త్రికటుకములు వీటిని సమములుగ ఖల్వమునందునిచి తమలపాకులరసముతో మర్దించి గుంజామాత్రను సేవించిన వాతవికారము పక్తిశూల ఇవి నివర్తించు.

## శూలద్విపఘ్నవటి

పథ్యాటంకణవిశ్వహింగుమరిచం వహ్నిర్విడంగంధకమ్. 88
తుల్యం సైంధవసంయుతంతుకుజలైః సర్వం దినం మర్దితమ్,
శూలాధ్మానవిబంధగుల్మకసనశ్లేష్మామవాతాపహా. 89
అజీర్ణవ్యాధ్యుదరారుచీః పరిహరేచ్ఛూలద్విపఘ్నీవటీ,

తా. కరక్కాయవలుపు, పేల్చినవెలిగారము, శొంఠి, ఇంగువ, మిరియాలు, చిత్రమూలపువలుపు, బిడాలవణము, శుద్ధిచేసినగంధకము, సైంధవలవణము ఇవి సమభాగములు వీటినన్నిటిని పసరకడుగుతో నొకదినము మర్దించి మాత్రలుచేసి సేవించిన శూల, కడుపుబ్బుట, మలబద్ధము, గుల్మము, దగ్గు, కఫము, ఆమవాతము, అజీర్ణము, ఉదరరోగము అరుచి ఇవి నివర్తించు. ఇదియ శూలద్విపఘ్నవటి యనబడును.

## హరీతక్యాదిచూర్ణము

హరీతకీచాతివిషేహింగుసౌవర్చలం వచా. 90
గాలితేంద్రయవాస్తుల్యా భక్షయేదుష్ణవారిణా,
కష్టైకమనుపానం స్యాద్వాతశూలహారం పరమ్. 91

తా. కరక్కాయవలుపు, అతివస, ఇంగువ, సౌవర్చలవణము, వస, కొడిశ

పాలచూర్ణము వీటిని సమభాగములుగ చూర్ణించి యొకకర్షము ఉష్ణోదకముతో పుచ్చుకొనిన వాతశూల నివారించు.

సౌవర్చలాదిచూర్ణము

సౌవర్చలామ్లవేతసబిడలవణయుతాస్సైంధవాతివిషా,
త్రికటుకం బీజపూరరసాన్వితమశితం గుల్మశూలహరమ్. 92

తా. సౌవర్చలవణము, అమ్లవేతసము, బిడాలవణము, సైంధవలవణము, అతివస, త్రికటుకములు వీటిని సమభాగములుగ చూర్ణించి మాదీఫలరసముతో సేవించిన గుల్మము శూల ఇవి నివర్తించు.

ఉశీరాదిచూర్ణము

ఉశీరం సైంధవం హింగుమూలమేరండజం సమమ్,
వాతశూలం నిహంత్యేవ పీత్తం తప్తేన వారిణా. 93

తా. వట్టివేళ్లు, సైంధవలవణము, ఇంగువ, ఆముదపువేరు వీటిని సమభాగములుగ చేర్చి చూర్ణించి ఉష్ణోదకముతో సేవించిన వాతశూల నివర్తించు.

శ్వేతైరండాదిచూర్ణము

శ్వేతైరండశిఖాహింగుసైంధవం సమచూర్ణితమ్,
తప్తేనవారిణాపీతం వాతశూలహరం పరమ్. 94

తా. తెల్లఆముదపువేరు, ఇంగువ, సైంధవలవణము వీటిని సమములుగ చేర్చి చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన వాతశూల హరించు.

మందారమూలికాదిచూర్ణము

మందారమూలికాచూర్ణం భుక్తం దుగ్ధేన మిశ్రితమ్,
వాతశూలహరం దేవీమూలం వాదోరటోద్భవమ్ 95

తా. మందారపువేరుచూర్ణము పాలలోకలిపి పుచ్చుకొనినను సహదేవివేరు లేక నాగవేరు వీటిచూర్ణమును పాలలోకలిపి పుచ్చుకొనినను వాతజశూల నివర్తించు.

యవాన్యాదిచూర్ణము

యవానీం సైంధవం హింగుక్షారం సౌవర్చలాభయే,
పిబేత్కోష్ణాంబునా వాతోద్భవశూలనివృత్తయే. 96

తా. ఓమము, సైంధవలవణము, ఇంగువ, యవక్షారము, సౌవర్చలవణము కరక్కాయవలుపు వీటిని సమభాగములుగవైచి చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన వాతశూల నివర్తి.

కరంజాదిచూర్ణము

కరంజసౌవర్చలనాగరాణాం సరామఠానాం సమభాగికానామ్,
చూర్ణం కదుష్ణేన జలేన పీతం సమీరశూలం వినిహంతి సద్యః. 97

తా. క్రానుగపట్ట, సౌవర్చలవణము, శొంఠి, ఇంగువ వీటిని సమములుగ వైచి చూర్ణించి కొంచముష్ణముగనుండు నుదకములోకలిపి పుచ్చుకొనిన వాతజశూల తత్కాలమునందే నివర్తించు.

హృచ్ఛూలకు ఉశీరాదిచూర్ణము

ఉశీరం పిప్పలీమూలం చూర్ణం కృత్వా సమాంశతః,
గోఘృతేన సమం పీతం హంతి హృచ్ఛూలముల్బణమ్. 98

తా. వట్టివేళ్లు, మోడి, వీటిని సమానములుగ వైచి చూర్ణించి ఆవునేతితో పుచ్చుకొనిన హృదయశూల నివర్తించు.

పిత్తశూలకు ధాత్ర్యాదిచూర్ణము.

ప్రలిహ్యాత్పిత్తశూలఘ్నం ధాత్రీచూర్ణం సమాక్షికమ్,
సగుడం ఘృతసంయుక్తం ఫలం త్రైఫలం హంతి పిత్తజమ్. 99

తా. ఉశిరి, కెవలువు చూర్ణములో తేనెచేర్చిగాని లేక త్రిఫలాచూర్ణములో బెల్లము నెయ్యిచేర్చిగాని పుచ్చుకొనిన పిత్తశూల నివర్తించు.

కఫశూలకు కట్ఫలాదిచూర్ణము

కట్ఫలం పౌష్కరం శృంగీముస్తకం కటుకం త్రిక,
సమస్తానేకశో వాస సూక్ష్మచూర్ణాని కారయేత్. 100
ఆర్ద్రికస్వరసశ్చైవ ద్విర్లిహ్యాత్ క్షౌద్రమిశ్రితమ్,
శూలానిలారుచిచ్ఛర్ది కాసశ్వాసక్షయాపహమ్. 101

తా. కౌయఫలము, పుష్కరమూలము, కర్కాటకశృంగి, తుంగముస్తలు, త్రికటుకములు, కచోరములు వీటిని సమభాగములుగ చూర్ణించి అల్లపురసము తేనె వీటితో సేవించిన కఫశూల, వాతము, అరుచి, ఛర్ది, కాస, శ్వాస, క్షయము ఇవి నివర్తించు.

అన్యత్కట్ఫలాదిచూర్ణము

కట్ఫలం పౌష్కరం కృష్ణా శృంగీ చ మధునా సహ,
శ్వాసకాసజ్వరహరః శ్రేష్ఠో లేహః కఫాంతకృత్. 102

తా. కౌయఫలము, పుష్కరమూలము, పిప్పళ్లు, కర్కాటకశృంగి, వీటిని చూర్ణించి తేనె తేర్చి పుచ్చుకొనిన శ్వాస కాస జ్వరము కఫము ఇవి నివర్తించు.

### త్రిఫలాదిచూర్ణము

తీక్ష్ణాయశ్చూర్ణసంయుక్తం త్రిఫలాచూర్ణముత్తమమ్,
ప్రయోజ్యం మధుసర్పిర్భ్యాం సర్వశూలనివారణమ్. 103

తా. ఉక్కుభస్మము, త్రిఫలముచూర్ణము వీటిని సేకముగఁజేర్చి తేనె నెయ్యి వీటితో పుచ్చుకొనిన సర్వశూలలు నివర్తించు.

### మందాగ్నిశూలకు దీప్యాదిచూర్ణము

దీప్యకం సైంధవం పథ్యా నాగరం చ చతుఃపలమ్,
చూర్ణం శూలం జయత్యాశు మందస్యాగ్నేశ్చ దీపనమ్. 104

తా. ఓమము, సైంధవలవణము, కరక్కాయవలుపు, శొంఠి వీటిని ప్రత్యేకము నాలుగుతులములుచేర్చి చూర్ణించి అర్ధతులమువంతున పుచ్చుకొనిన శూల మందాగ్ని ఇవి నివర్తించు.

### బిల్వమూలాదిచూర్ణము.

మూలం బైల్వం తథైరండం చిత్రకం విశ్వభేషజమ్,
హింగుసైంధనసంయుక్తం సద్యశ్శూలనివారణమ్. 105

తా. మారేడువేరు, ఆముదపువేరు, చిత్రమూలము, శొంఠి, ఇంగువ, సైంధవ లవణము వీటిని చూర్ణించి అరతులమువంతున సేవించిన శూల తత్క్షణమే నివర్తించు.

### కుబేరాక్షాదిచూర్ణము

అక్షం నాగరరామఠాభయసమం మజ్జాం కుబేక్షజామ్,
తుల్యాం పుష్కరతైలపక్వమృదితాం సేవేత్సదా యో నరః. 106
నానాస్థానవిశాలశూలశమనం బ్రహ్మాస్త్రమేతత్పరం,
సత్యం శ్రీజయదేవసూనునృహరేర్వక్త్రాంబుజాన్నిస్సృతమ్. 107

తా. తాడికాయవొలుపు ౧ భాగము, శొంఠి ౧ భాగము, ఇంగువ ౧ భాగము, కరక్కాయవొలుపు ౧ భాగము, గచ్చపప్పు ౪ భాగములు వీటిని చూర్ణించి ఆముదముతో వండి నూరి సేవించిన సర్వశూలలు మానును. ఇదియు జయదేవునియొక్క కుమారుడగు నృహరియనువానిచే వచింపబడియె. ఇది నిజముగా గుణమిచ్చును.

### ఆధ్మానశూలకు హింగ్వాదిచూర్ణము

హింగ్వమ్లత్రిపటూగ్రషట్కటుశఠీవృక్షామ్లదీప్యాలకా,
పాఠాజాద్యజగంధమూలహపుషాద్వ్యక్షారసారాభయం. 108

హింగ్వామ్లాసవిబంధవర్ధ్మకసనశ్వాసాగ్నిసాదారుచి,
ప్లీహార్శోఖిలశూలగుల్మగళహృద్రోగాశ్మపాండుప్రణుత్. 109

తా. ఇంగువ, మాతులుంగము, * లవణత్రయము, వస, † త్రికటుకములు పిప్పలిమూలము, చవ్యము, చిత్రమూలము, కచోరములు, ‡ వృక్షామ్లము, ఓమము, కంకోలములు, విషబొద్దివేరు, జీలకఱ్ఱ, పెన్నేరుగడ్డ, బోడతరము, యవక్షారము, వెలిగారము, దాడింబ, కరక్కాయపొలుపు వీటిని సమభాగములుగ చూర్ణించి, అరతులమువంతున పుచ్చుకొనిన, ఎక్కిళ్లు, కడుపుబ్బరము, మలబద్ధము వర్ధ్మ, దగ్గు, శ్వాస, అగ్నిమాంద్యము, అరుచి, ప్లీహ, అర్శస్సు, అఖిలశూలలు, గుల్మము, గళరోగము, హృద్రోగము, అశ్మరి, పాండువు ఇవి నశించును.

## పరిణామశూలకు సాముద్రాదిచూర్ణము.

సాముద్రం సైంధవం క్షారో రుచకం రోమకం విడమ్,
దంతీలోహరజః కిట్టంతివృత్సూరణకం సమమ్. 110
వృద్ధగోమూత్రపయసా మందపావకపాచితమ్,
తద్యథాగ్నిబలం చూర్ణం పిబేదుష్ణేన వారిణా. 111
జీర్ణేఽజీర్ణే చ భుంజీత మాంసాదిఘృతసాధితమ్,
నాభిశూలం చ హృచ్ఛూలం గుల్మప్లీహాకృతం జయేత్. 112
విద్రధ్యష్ఠీలజం హన్తి కఫవాతోద్భవం తథా,
అన్నద్రవం జరయితుం అజీర్ణం గ్రహణీమపి. 113
శూలానామపి సర్వేషాం చౌషధం నాస్త్యతః పరమ్,
పరిణామసముత్థస్య విశేషేణాంతకం మతమ్. 114

తా. ఉప్పు, సైంధవలవణము, యవక్షారము, సర్జక్షారము, సౌవర్చలవణము, చవిటుప్పు, బిడాలవణము, దంతిమూలము, లోహభస్మము, మండూరభస్మము, తెగడ, అడవికంద వీటిని సమములుగ పైచి చూర్ణముచేసి ముసలియావుమూత్రము, పాలు వీటితో మందాగ్ని చేపాకముగవండి శక్త్యనుసారముగ నుష్ణోదకముతో పుచ్చు

* సైంధవము, సౌవర్చలము, బిడము, † త్రికటుకములు మొదలు చిత్రమూలమువరకు కటుషట్కము. ‡ పులిచింత.

కొనిన జీర్ణమునందు గాని లేక అజీర్ణమునందుగాని నెయ్యితో వండినమాంసము పెరుగు నెయ్యి పాలు వీటినిభుజించినను నాభిశూల, హృదయశూల, గుల్మము, పీహశూల, విద్రధి, అష్టీల, కఫలు, శూలలు, వాతశూల, అన్నద్రవశూల, అజీర్ణము, గ్రహణి ఇవిమొదలగు సర్వశూలలు నివర్తించుటయేగాక ముఖ్యముగ పరిణామశూల నివర్తించు.

## గుడాదిమోదకము

పక్తిశూలం జయత్యాశు గుడార్ద్రతిలమోదకః,
హింగ్వాభయం వచావేల్లం నీతముష్ణాంబునా జయేత్. 115
అనాహశూలహృద్రోగవిషూచీగుల్మమారుతాన్,

తా. బెల్లము, అల్లము, నువ్వులు వీటినిసూరి మోదకమును జేసి పుచ్చుకొనిన లేక ఇంగువ, కరకయుబుంపు, వస, వాయువిళంగములు వీటి చూర్ణమును ఉష్ణోదకముతో పుచ్చుకొనినను ఆనాహశూల, హృద్రోగము, విషూచి, గుల్మము, వాతము ఇవి నివర్తించు.

## * మృత్యుశూలకు ఇంద్రవారుణ్యాదిమార్గము

ఇంద్రవారుణికామూలం కటుత్రయసమన్వితమ్. 116
నరోంబునాహరేత్పీతం శూల మత్యంతదుస్సహామ్,

తా. పెద్దపాపరవేరు, కటుత్రయము వీటిని సమముగ చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన దుస్సహమగు మృత్యుశూల నివర్తించు.

## వాతశూలకు సోమాగ్నివటుకములు

సమాంశం పంచలవణం దత్వార్ద్రకజలే పచేత్. 117
దినమేకం తతః కుర్యాద్వటికాంచణమాత్రకామ్,
భక్షయేద్వాతశూలార్తస్సోమాగ్నిముఖనామకః. 118

తా. పంచలవణములను అల్లపురసమునందువైచి ౧ దినము వండి శనగలంత మాత్రలుజేసి భక్షించిన వాతశూల నివర్తించు.

## సర్వశూలలకు శంఖవటుకము.

చించాక్షారం పంచపలం లవణాని పలం పలమ్. 119
సంచూర్ణ్యనిక్షిపేత్ప్రస్థద్వయే జంబీరవారిణి,

---

* మృత్యుశూల యనగా దుస్సహమైన శూలయని భావము.

శంఖం దశపలం తప్త్వానిక్షిపేత్సప్తవారతః. 120
తత్సమస్తం విశోష్యాథ హింగువ్యోషం చతుష్పలమ్,
బలిసూతవిషాన్భాగైః పలార్ధాంశ్చ పృథక్ పృథక్. 121
ఏతత్సమస్తం సంమర్ద్య జంబీరాన్మైదినత్రయమ్,
బదరాస్థిప్రమాణేన వటికాః కారయేద్బుధః. 122
ఏకైకాం భక్షయేత్ప్రాతః కోష్ణతోయం పిబేదను,
సర్వశూలం హరేద్గుల్మ మజీర్ణం పరిణామజమ్. 123
అతిసారగదం హన్యాద్గ్రహణీం చ విశేషతః,

తా. చింతక్షారము ౫ పలములు, ఉప్పు ౧ పలము, సైంధవలవణము ౧ పలము, పాదిరిలవణము ౧ పలము, బిడాలవణము ౧ పలము, గాజుప్పు ౧ పలము వీటిని చూర్ణించి ౨ ప్రస్థముల నిమ్మపండ్లరసమునందు వైచి ౧౦ పలముల శంఖమునుకాల్చి అరసమునందు ౭ మార్లు చల్లార్చి పిదప అన్నియు నేకముగ రొండించి చూర్ణముజేసి, అందు ఇంగువ, శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిని ప్రత్యేకము ౧ పలము, గంధకము ½ పలము, రసము ½ పలము, శుద్ధనాభి ½ పలము, వీటినిచూర్ణించి నిమ్మపండ్లరసముతో ౩ దినములు మర్దించి, రేగుగింజలంతమాత్రలు జేసి ప్రాతఃకాలమునందు ౧ మాత్ర భక్షించి, పిదప ఉష్ణోదకమునుత్రాగిన సర్వశూలలు, గుల్మము, అజీర్ణము, పరిణామశూల, అతిసారము, గ్రహణి ఇవి నివర్తించు.

### అష్టవిధశూలలకు సూర్యప్రభావటుకములు.

వ్యోషం గ్రంథివచా చ హింగుజరణద్వంద్వం విషం నింబుక. 124
ద్రావైరార్ద్రికజైరసైర్విమృదితం తుల్యాంశమేతోపమా,
కర్తవ్యా వటికాథ సా దినముఖే భుక్త్వా కవోష్ణాంబునా. 125
శూలం త్వష్టవిధం నిహన్తి సహసా సూర్యప్రభా నామతః,

తా. త్రికటుకములు, మోడి, వస, ఇంగువ, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, నాభి వీటిని సమాంశములుగ గ్రహించి, నిమ్మపండ్లరసము, అల్లపురసము, వీటితో ప్రత్యేకముగ మర్దించి, నిరియాలంతమాత్రలుజేసి, అందొకమాత్ర ప్రాతఃకాలమున ఉష్ణోదకముతో పుచ్చుకొనిన అష్టవిధశూలలు నివర్తించు.

### చిత్రకాదికటుకములు

చిత్రకం జరణం పాఠా వ్యోషం లవణపంచకమ్. 126
అజాజీ ధాన్యకం హింస్రా దీప్యకం గ్రంధికం తథా,
ఏతాని సమభాగాని సూక్ష్మచూర్ణాని కారయేత్. 127
జంబీరస్య రసేనైవ వటకాన్కారయేత్సుధీః,
హృచ్ఛూలం పార్శ్వశూలం చ ఆమశూలమరోచకమ్ 128
అశీతి వాతజాన్ రోగాన్ నాశయేచ్చైవ తత్ క్షణాత్,

తా చిత్రమూలము, జీలకఱ్ఱ, విషబొద్దివేరు, త్రికటుకములు, పంచలవణములు, పెద్దజీలకఱ్ఱ, ధనియాలు, జటామాంసి, ఓమము, మోడి వీటిని సమములుగ జేర్చి చూర్ణించి, నిమ్మపండ్లరసముతో నూరి మాత్రలుజేసి సేవించిన, హృదయశూల, పార్శ్వశూల, ఆమశూల, అరుచి, అశీతివాతములు ఇవి తత్క్షణమే నివర్తించు.

### హరీతక్యాదివటుకములు

హారీతకీ త్రికటుకం జటిలాం గ్రంధి హింగు చ. 129
సైంధవం చ సమం మర్ద్యం వటీం కుర్యాత్సుఖావహామ్.
లఘుకోలప్రమాణాం తాం భక్షయేత్ప్రాతరేవ హి. 130
ఏకైకా వటికా భుక్తా జన్మశూల నివారిణీ,
గ్రహణ్యామతిసారేవాఽజీర్ణేమందే చ పావకే. 131
ఉష్ణోదకానుపానేన సుఖమాప్నోతి మానవః,

తా. కరక్కాయవొలుపు, త్రికటుకములు, జటామాంసి, మోడి, ఇంగువ, సైంధవలవణము వీటిని సమాంశములుగ గ్రహించి నీటితో మర్దించి చిన్న రేగుగింజలంత మాత్రలుజేసి అందు ౧ మాత్ర ప్రాతఃకాలమున భక్షించిన జన్మశూల యనగా పుట్టుకతో వచ్చినకడుపునొప్పి నివర్తించుటయేగాక గ్రహణి అతిసారము అజీర్ణము మందాగ్ని ఇవి సగా నివర్తించు.

### వచాదివటుకములు

వచా విశ్వాజీరోషణగరళ బాహ్లీకదహన
త్వచాకార్యావట్యాశ్చణ కతులితామార్కవస్సైః. 132
యథా భానోర్భాస స్తిమిరనికరం ఘ్నంతి హి తథా.
హరంత్యేతా శూలాన్యనిలమనలగ్లానిమపిచ,

తా. వస, శొంఠి, జీలకఱ్ఱ, ధనియాలు, శుద్ధనాభి, చిత్రమూలము, లవంగ

పట్టు, వీటిని సమభాగములుగ చూర్ణించి గుంటగలగరాకురసముతో మర్దించి శనగ లంతమాత్రలుజేసి సేవించిన శూల, వాయువు, అగ్నిమాంద్యము ఇవి నివర్తించు.

గరళాదివటికలు లేక సూర్యవటి

గరళహుతభుగ్విశ్వాజాజీవచోషణహింగుభి
ర్విధివిమృదితై ర్భృంగద్రావై ర్గుటీపరికల్పితా. 133
హరతి వివిధం భుక్తాశూలం తథానిలమూఢతా
మనలవిరతిం సౌప్త్యం భాస్వద్వటీ భువి విశ్రుతా,

తా. శుద్ధనాభి, చిత్రమూలము, శొంఠి, జీలకఱ్ఱ, వస, మిరియాలు, ఇంగువ, వీటిని సమాంశములుగ గుంటగలగరాకురసముతో మర్దించి మాత్రలుజేసి సేవించిన శూల మూఢవాతము అగ్నిమాంద్యము సుప్తి వాతము ఇవి నివర్తించు.

పరిణామశూలకు శంబూకాదివటుకములు

శంబూకమూషణం చైవ పంచైవ లవణాని చ. 134
సమాంశై ర్గుటికాం కృత్వా కుఠేరకరసేన వా,
ప్రాతర్భోజనకాలే వా భక్షయేత్తు యథాబలమ్. 135
శూలాద్విముచ్యతే జన్తుస్సహసా పరిణామజాత్,

తా. శంఖమువలెనుండు గవ్వలభస్మము, మిరియాలు, పంచలవణములు వీటిని సమాంశములుగ గ్రహించి గగ్గెరరసముతో మర్దించి మాత్రలుజేసి ప్రాతఃకాలము నందుగాని భోజనకాలమునందుగాని బలానుసారముగ సేవించిన పరిణామశూల నివర్తించు.

తిలాదివటుకములు.

తిలనాగరపథ్యానాం భాగం శంబూకభస్మనామ్. 136
ద్విభాగగుడసంయుక్తాం వటీం కృత్వాక్షభాగికామ్,
శీతాంబునా పిబేత్ప్రాతర్భక్షయేత్ క్షీరభోజనమ్. 137
సాయాహ్నే రసికం పీత్వా నరో ముచ్యేత దుర్జరాత్.
పరిణామసముత్థాచ్చ శూలాచ్చిరభవాదపి. 138

తా. నువ్వులు, శొంఠి, కరక్కాయపోలుపు, శంఖభస్మము ఇవి ప్రత్యేకము ౧ భాగము, బెల్లము ౨ భాగములు గ్రహించి మర్దనజేసి అక్షప్రమాణము మాత్రలు జేసి శీతోదకముతో ప్రాతఃకాలమునందు సేవించి పాలుఅన్నముభక్షించి సాయంకాల మున సగా నీరీతిగజేసి బెల్లపుపానకముత్రాగిన బహుకాలమునుంచియుండు దుర్జయ మగు పరిణామశూల నివర్తించు.

### కూష్మాండక్షారము

కూష్మాండం తనుఖండం తు ఛిత్వా ఘర్మే విశోషయేత్,
స్థాల్యాం నిక్షిప్య తత్సర్వం పిధానేన పిధాయ చ. 139
చుల్ల్యాం నివేశ్య వహ్నిం చ జ్వాలయేత్కుశలో నరః,
యథా తన్న భవేద్భస్మ కింత్వంగారో దృఢో భవేత్. 140
తథా నిర్వాపయేచ్ఛీతం చూర్ణయేచ్చూర్ణితం తుతత్,
మాషద్వయమితం తావచ్ఛుంఠీచూర్ణవిమిశ్రితమ్. 141
జలేన భక్షయేన్నిత్యం మహాశూలాకులో నరః,
అసాధ్యమపి యచ్ఛూలం తదప్యేతేన శామ్యతి. 142

తా. పెద్దగుమ్మడికాయను సన్నగతరిగి యెండించి యొకపాత్రయందునిచి మూకుడుమూసి పొయిమీద నునిచి గాఢాగ్నిచే నిప్పువలె నగుపర్యంతమునుంచి పిదప దీసి చల్లార్చి చూర్ణముజేసి ఆచూర్ణమును ౨ మాషములయెత్తు అంతేయు శొంఠిచూర్ణము నందుకలిపి యుదకముతో సేవించిన మహాశూల అసాధ్యశూల ఇవి నివర్తించు.

### త్రిదోషశూలలకు గోమూత్రమండూరము

గోమూత్రసిద్ధమండూరం త్రిఫలాచూర్ణసంయుతమ్,
విలిహేన్మధుసర్పిభ్యాం శూలం హన్తి త్రిదోషజమ్. 143

తా. గోమూత్రమున సిద్ధమగు మండూరమునందు, త్రిఫలాచూర్ణమునుగలిపి తేనె, నెయ్యి, వీటితో పుచ్చుకొనిన త్రిదోషజశూల నివర్తించు.

### పరిణామశూలకు తారమండూరము

విడంగం చిత్రకం చవ్యం త్రిఫలాత్ర్యూషణాని చ,
నవ భాగాని చైతాని లోహకిట్టసమాని చ. 144
గోమూత్రం త్రిగుణం దత్వామూత్రాద్ద్విగుణితో గుడమ్,
శనైర్మృద్వగ్నినా పక్త్వా సుసిద్ధం పిండతాం గతమ్. 145
స్నిగ్ధభాండే వినిక్షిప్య భక్షయేత్కోలమాత్రయా,
ప్రాఙ్మధ్యాన్తక్రమేణైవ భోజనస్య ప్రయోజితః. 146
యోగోయం శమయత్యాశు పక్తిశూలంసుదారుణమ్,
కామలాం పాండురోగం చ శోథం మేదోనిలార్శసీ. 147
శూలార్తానాం కృపాహేతోస్తారయా ప్రకటీకృతః,

తా. వాయువిడంగములు, చిత్రమూలము, చవ్యము, కరక, తాడి, యుసిరి

కలు, శొంఠి, పిప్పలి, మిరియాలు ఇవి సమాంశములు వీటికన్నిటికి సమాంశము లోహకిట్టచూర్ణము, వీటికన్నిటికి మూడింతలు గోమూత్రము, గోమూత్రమునకు రెండింతలు బెల్లము, ఇవియన్నియు మందాగ్నిచే గట్టిపడువరకు పచనజేసి నేతితో మాగినకుండ యందునిచి కోలప్రమాణము భోజనాత్పూర్వముగాని లేక భోజనమధ్యమునందుగాని సేవించిన దారుణమగు పక్తిశూల, కామిల, పాండువు, వాపు, మేదోరోగము, అర్శోరోగము ఇవి నివర్తించు. దీనిని శూలగలవారియందలి దయచే తార వచించెను.

### భీమమండూరము

యవక్షారం కణాం శుంఠీం కోలం గ్రంథికచిత్రకౌ. 148
ప్రత్యేకం పలమాదాయ ప్రస్థం లోహస్య కిట్టతః,
శనైః పచేదయఃపాత్రే యావద్దర్వీప్రలేపనమ్. 149
దత్వాష్టగుణగోమూత్రం కిట్టాచ్చూర్ణాద్విచక్షణః,
తతోక్షమాత్రాన్వటకాన్ యోజయేత్సప్తరాత్రతః. 150
ఆదిమధ్యావసానేషు భోజనస్యోచితస్య హి,
స భీమవటకో హ్యేష పరిణామరుజాంతకః. 151

తా. యవక్షారము, పిప్పలి, శొంఠి, మిరియాలు, మోడి, చిత్రమూలము, ఇవి యన్నియు ప్రత్యేకము ౧ పలము, మండూరభస్మము ౧ ప్రస్థము వీటిని లోహపాత్రయందునిచి వీటికి యెనిమిదింతలు గోమూత్రముపోసి కలిపి గట్టిపడువరకు దర్వితో కలియబెట్టి వండి, అక్షమాత్రము భోజనాత్పూర్వమునందుగాని, భోజనమధ్యమునందుగాని, భోజనాంతరమునందుగాని, యేడుదినములు సేవించిన పరిణామశూల నివర్తించు.

### అన్నజద్రవశూలకు - గుడమండూరము

గుడామలకపథ్యానాం చూర్ణం ప్రత్యేకశః పలమ్,
త్రిఫలం లోహకిట్టంస్యాత్తత్సర్వం మధుసర్పిషా. 152
సమాలోడ్య సమశ్నీయాదక్షమాత్రప్రమాణతః,
ఆదిమధ్యావసానేషు భోజనస్య నిహంస్తి తత్. 153
అన్నద్రవం జరత్పిత్తే మమ్లపిత్తం సుదారుణమ్,
పరిణామసముత్థం చ శూలం సంవత్సరోత్థితమ్. 154

తా. బెల్లము, ఉసిరికెపప్పు, కరకపప్పు, వీటిని ప్రత్యేకము ౧ పలము వంతునచేర్చి చూర్ణించి మూడుపలములు లోహకిట్ట చూర్ణమునుచేర్చి కలియనూరి అక్ష

మాత్రము తేనె లేక నెయ్యి వీటిలో కలిపి భోజనాత్పూర్వము గాని మధ్యమునగాని అంతమునగాని సేవించిన, అన్నద్రవశూల, జ్వరపిత్తము, ఆమ్లపిత్తము, సంవత్సరము నకు లోపుగ జనించిన పరిణామశూల ఇవి యన్నియు నివర్తించును.

—॥ శతావరీమండూరము ॥—

సంశోధ్య చూర్ణితం కృత్వా మండూరస్య పలాష్టకమ్. 175
శతావరీ రసస్యాష్టౌ దధ్నస్తు పయసస్తథా,
పలాన్యాదాయ చత్వారి తథా గవ్యస్య సర్పిషః. 176
విపచేత్సర్వమేకత్ర యావత్పిండత్వమాగతమ్,
సిద్ధం తు భక్షయేన్మధ్యే భోజనస్యాగ్రతోపి వా. 177
వాతాత్మకం పిత్తభవం శూలంచ పరిణామజమ్,
నిహన్త్యేవ హి యోగోయం మడూరస్య న సంశయః. 178

తా. మండూరభస్మము ౮ పలములు చల్లపిల్లిగడ్డలరసము ౮ పలములు పెరుగు ౪ పలములు పాలు ౪ పలములు ఆవునెయ్యి ౪ పలములు వీటినన్నియు నేకముగజేర్చి గట్టిపడువరకు వండి అక్షప్రమాణము భోజనాత్పూర్వమునందుగాని భోజనాంతరమునగాని సేవించిన వాతజపరిణామశూల పిత్తజ పరిణామశూల ఇవి నివర్తించు.

—॥ సర్వశూలలకు సప్తవింశతిగగ్గులు ॥—

క్షారద్వయం త్రికటుకం త్రిఫలా హరిద్రా రుద్రాక్షముస్తలవణత్రయ తుంబరూణి,
సగ్రంధికాగ్నితృటిచిత్రకచవ్యకుష్ఠమాతీకపుష్కరవిడంగవిషాయుతాని. 179
యావన్త్యమూని గజపిప్పలిసంయుతాని తావత్ప్రమాణమితగగ్గులు సంయుతాని,
కృత్వా ఘృతేన ఘుటికా మనుజైః ప్రయోజ్యాసాకంచ దుగ్ధజల కాంజికముద్గయూషైః. 180
హృత్పార్శ్వపృష్ఠకటివంక్షణకుక్షికక్షశూలాని నాశయతి కంఠకిలాసరోగాన్,
పాండ్వామయం క్షయమపస్మృతి మూర్ధవాతమున్మాదమామపవనం శ్వయథుం ప్రమేహమ్. 181

తా. యవక్షారము, సర్జక్షారము, త్రికటుకములు, త్రిఫలములు, పసపు, రుద్రాక్షు, తుంగముస్తలు, సైంధవలవణము, బిడాలవణము, కౌచలవణము, తుంబురు యనుగ్రింధ్యము, మోడి, జీడిగింజలు, సన్నయాలకులు, చిత్రమూలము, చవ్యము, కోష్ఠము, మాక్షికభస్మము, పుష్కరమూలము, వాయువిడంగములు, అతివస, గజపిప్పలి, వీటినన్నియుసమభాగములుగ గ్రహించి చూర్ణించి అన్నిటికి సమము శుద్ధిచేసిన గుగ్గిలమునుచేర్చి నెయ్యితో మాత్రలుజేసి పాలు నీళ్లు కాంజికము ముద్గయూషము ఈ అనుపానములతో సేవించిన హృదయము పార్శ్వము వీపు కటిప్రదేశము గజ్జలు కడుపు చంకలు వీటియందు జనించిన శూలలు, కుష్ఠము, కిలాసరోగము, పాండువు, క్షయ, అపస్మారము, ఊర్ధ్వవాతము, ఉన్మాదము, ఆమవాతము, వాతము, వాపు, ప్రమేహము ఇవియన్నియు నివర్తించును.

హృదయశూలకు బీజపూరస్వరసము

సుపక్వబీజపూరస్య రసస్సైంధవమిశ్రితః,
పీతః పథ్యాశినో హన్తి హృచ్ఛూలమతిదారుణమ్. 182

తా. బాగుగపండిన మాదీఫలపురసమునందు సైంధవలవణమును జేర్చి పుచ్చుకొని పథ్యముగనుండిన దారుణమగు హృదయశూల నివర్తించు.

పిత్తశూలకు శతావరీస్వరసము

శతావరీరసం క్షీరం క్షౌద్రం ప్రాతః పిబేన్నరః,
దాహశూలోపశాంత్యర్థం సర్వపిత్తామయాపహమ్, 183

తా. శతావరీరసమున పాలు తేనెచేర్చి ప్రాతఃకాలమునందు పుచ్చుకొనిన దాహము, శూల, పిత్తశూల, ఇవి నివర్తించు,

పిత్తశూలకు ధాత్ర్యాది రసపానములు

ధాత్ర్యా రసం విదార్యావా త్రాయంత్యాగోస్తనాంబు వా.
పిబేత్సశర్కరం సద్యః పిత్తశూలనివారణమ్. 184

తా. ఉశిరికరసమునందుగాని నేలగుమ్మడు రసమునందుగాని కలుప్రానుగ రసమునందుగాని ద్రాక్షరసమునందుగాని చక్కెరకలిపిపుచ్చుకొనిన పిత్తశూల నివర్తించు.

త్రిదోషశూలకు విదారీస్వరసము

విదారీ దాడిమరసస్సవ్యోషలవణాన్వితః,
క్షౌద్రయుక్తో జయత్యాశు శూలం దోషత్రయోద్భవమ్. 185

తా. నేలగుమ్ముడురసము దాడింబవిత్తులరసము వీనియందు, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవ లవణము వీటిచూర్ణమునుకలిపి తేనెచేర్చి పుచ్చుకొనిన, త్రిదోషయుక్తశూలలు నివర్తించు.

## శృంగభస్మయోగము

బహుశాఖం తు యచ్ఛృంగం గృహీత్వా తన్మృగోద్భవమ్,
అంతర్ధూమం విదగ్ధం తద్భస్మకర్షం ఘృతైర్లిహేత్. 186
వాతశూలహరం సిద్ధం జయన్తీం వా గుడైర్లిహేత్,

తా. దుప్పికొమ్మును రొట్టినిప్పులయందునించి బాగుగభస్మముజేసి, నాభస్మమును ఒక కర్షమెత్తు నేతితోకలిపి పుచ్చుకొనినను, లేక తక్కాలిచూర్ణమును బెల్లముతోకలిపి పుచ్చుకొనినను, వాతశూల నివర్తించు.

## సర్వశూలలకు లోహభస్మము

మూత్రాంతఃపాచితాం శుష్కాం లోహచూర్ణసమన్వితామ్. 187
సగుడామభయాం దద్యాత్సర్వశూలోపశాన్తయే,

తా. కరక్కాయలను ఆవుపంచితమునందు వుడికించి యెండబెట్టి చూర్ణించి లోహచూర్ణమునుకలిపి బెల్లముతో పుచ్చుకొనిన సర్వశూలలు మానును.

## పరిణామశూలకు ఏరండాదిభస్మము

ఏరండవహ్నిశంబూకవర్షాభూగోక్షురం సమమ్. 188
అంతర్దగ్ధ్వా పిబేదద్భిరుష్ణాభిశ్శూలశాంతయే,

తా. ఆముదపువేరు, చిత్రమూలము, క్షుద్రశంఖము (అలుచిప్పలు), తెల్లగలిజేరు, చిరిపల్లేరు వీటిని సమభాగములుగ భాండమువందుపైచి భస్మముజేసి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన శూల నివర్తించు.

## శంబూకభస్మము

శంబూకజం భస్మ పీతం జలేనోష్ణేన తత్క్షణాత్. 189
పక్తిజం వినిహంత్యాశు శూలం విష్ణురివాసురాన్,

తా. క్షుద్రశంఖభస్మమును ఉష్ణోదకముతో పుచ్చుకొనిన పక్తిశూలనివర్తించు.

## సర్వశూలలకు గంధకరసాయనము

పలైకం త్రిఫలాచూర్ణం పలార్ధం గంధకస్య తు. 190
లోహభస్మ తు కర్షైకం సర్వం సంచూర్ణ్య మిశ్రయేత్,

కర్షార్ధం మధుసర్పిభ్యాం లేహయేత్సర్వశూలనుత్. 191
వాతవిస్ఫోటకాన్హంతి సేవనాత్తు త్రిమాసతః,
గతాః కేశాః పునర్యాంతి గంధకస్య రసాయనాత్. 192

తా॥ త్రిఫలాచూర్ణము, ౧ పలము గంధకచూర్ణము ౪ పలము, లోహభస్మము ౧ కర్షము, నీటినన్నియుఁజేర్చి అర్ధకర్షము తేనె నెయ్యి వీటిలో కలిపి మూడు నెలలుపుచ్చుకొనిన సర్వశూలలు వాతవిస్ఫోటకము ఇవి నివర్తించుటయేగాక, రాలిన కేశములు సగా మరల జనించును.

పంక్తిశూలలకు ఖండామలక రసాయనము

సుపీడితం చ కూష్మాండం తులార్ధం భృష్టమాజ్యతః,
ప్రస్థార్ధఖండం తుల్యంతు క్షిపేదామలకీరసమ్. 193
ప్రస్థం సుపూతకూష్మాండరసం దత్వాథ తత్పచేత్,
దర్వ్యాలేపగతే, తస్మిన్ చూర్ణీకృత్య వినిక్షిపేత్. 194
ద్వే ద్వే పలే కణా జాజీశుంఠీనాం మరిచస్య చ,
పలం తాళీసధాన్యాకచాతుర్జాతకముస్తకమ్. 195
కర్షప్రమాణం ప్రత్యేకం ప్రస్థార్ధం మాక్షికస్య చ,
పంక్తిశూలం నిహంత్యేతద్దోషత్రయభవం చ యత్. 196
ఛర్ద్యమ్లపిత్తమూర్ఛాశ్చ కాసశ్వాసారోచకమ్,
హృచ్ఛూలం రక్తపిత్తం చ పృష్ఠశూలం చ నాశయేత్. 197
రసాయనమిదం శ్రేష్ఠం ఖండామలకసంజ్ఞకమ్,

తా॥ బాగుగరసముపిండి నేతిలో వేఁగించిన పెద్దగుమ్మడికాయముక్కలు ౫౦ పలములు, అర్ధప్రస్థము కలకండ, అర్ధప్రస్థముసిరికాయపండ్లరసము, వడియగట్టిన గుమ్మడికాయరసము ౧ ప్రస్థము వీటినన్నియు నొకభాండమునందునిచి దర్విలో కలియబెట్టుచు వండి గరిటనంటునట్లు పాకమురాగా నందు పిప్పళ్లు, జీలకఱ్ఱ, శొంఠి, ఇవి ప్రత్యేకము ౨ పలములు, మిరియాలు ౧ పలము, తాళీసపత్రి, ధనియాలు, లవంగపట్ట, లవంగపత్రి, యాలకులు నాగకేసరములు, తుంగముస్తలు, ఇవి ప్రత్యేకమొకకర్షము వీటినన్నియుచూర్ణించివైచి చల్లారినపిదప తేనె ౦ పలములు చేర్చికలిపి నేతితోమాగిన కుండయందునిచి కర్షప్రమాణము సేవించిన త్రిదోషజన్యమగు పంక్తి శూల, ఛర్ది, అమ్లపిత్తము, మూర్ఛ, కాస, శ్వాస, అరుచి, హృదయశూల, రక్తపిత్తము, పృష్ఠశూల ఇవి నివర్తించు.

—॥ వాతశూలకు నాభిలేపనము ॥—

రాజికాశిగ్రుకల్కం చ గోతక్రేణ చ పేషితమ్. 198
నాభిలేపాన్నిహంత్యాశు శూలం వాతసముద్భవమ్,

తా. ఆవాలు, మునగవేరుపట్ట, వీటిని ఆవుమజ్జిగతో నూరి నాభికి లేపనము జేసిన వాతశూల నివర్తించును.

—॥ కుబేరాక్షయోగము ॥—

ఏకఏవ కుబేరాక్షో హన్తి శూలశతత్రయమ్, 199
కిం పునర్లశునోపేతస్సైంధవేన చ హింగునా,

తా. ఒక్కగచ్చపప్పును నూరిభక్షించిన, మున్నూరుశూలలు నివర్తించు. మరియు, గచ్చపప్పు, వెల్లుల్లి, సైంధవలవణము, ఇంగువ, వీటిని చేర్చి సేవించిన దీని ప్రభావమేమని వర్ణించెద.

—॥ శూలలకు ఖండపిప్పలి ॥—

కణాచూర్ణం చ కుడవం షట్పలం హవిషస్తథా. 200
పలషోడశకం ఖండం శతావర్యాః పలాష్టకమ్,
క్షీరప్రస్థద్వయే సార్ధే లేహీభూతే తదుద్ధరేత్. 206
త్రిజాతముస్తధాన్యాకం శుంఠీమాంసీద్విజీరకమ్,
అభయామలకం చైషాంచూర్ణం ద్వాదశకార్షికమ్. 202
తదర్ధం మారిచం భాగం సారం ఖాదిరమేవచ,
మధుత్రిపలసంయుక్తం ఖాదేత్స్నిగ్ధం యథాబలమ్. 203
శూలారోచకహృల్లాసచ్ఛర్దిపిత్తామ్లరోగనుత్,
అగ్నిసందీపనీ హృద్యా ఖండపిప్పలికా మతా. 204

తా. పిప్పలిచూర్ణము ౪ పలములు, నెయ్యి ౬ పలములు, కలకండ ౧౬ పలములు, చల్లపిల్లిగడ్డలు ౮ పలములు, పాలు ౨౹ ప్రస్థములు వీనినన్నియు నేకముగ జేర్చి లేహ్యపక్వముగవండి, అందు లవంగపట్ట, యాలకులు, లవంగపత్రి, తుంగముస్తలు, ధనియాలు, శొంఠి, జటామాంసి, తెల్లజీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ,కరక్కాయపొలుపు, ఉశిరికెపొలుపు, ఇవి ప్రత్యేకము ౩ పలములు, మిరియాలు, చంద్రచేవ, కరక, తాడి, ఉశిరికెలు, వీటిని ప్రత్యేకము ౧౹ పలమువంతున చూర్ణించిచేర్చి ౩ పలములు తేనెచేర్చి కలిపి, అగ్నిబలానుసారముగ సేవించిన శూల, అరుచి హృల్లాసము, ఛర్ది, అమ్లపిత్తము, వీటిని నివర్తింపంజేయుటయేగాక, అగ్నిదీప్తిని బాగా గలుగంజేయు.

శూలరోగమునకు పథ్యములు

ఛర్దిస్స్వేదో లంఘనం పాయువర్తిర్వస్తిర్నిద్రా రేచనం పాచనం చ,
అబ్దోత్పన్నాశ్శాలయష్షష్టిమండస్తప్తక్షీరం జాంగలానాం రసాశ్చ.
పటోలసౌభాంజనకారవేల్లం శాకం చ కోశాఢ్యభినవాస్తుకానామ్,
సాముద్రసౌవర్చలహింగువిశ్వం బిడం శతాహ్వాలశునం లవంగమ్.
ఏరండతైలం సురభీజలం చ తథాంబు జంబీరరసోపి శస్తమ్,
లఘూని చ క్షారరజాంసి చేతి వర్గో హితో శూలగదార్దితేభ్యః.

తా. వాన్తి చమటదీయుట, లంఘనము, గుదవర్తి, వస్తికర్మ, నిద్ర, విరేచనము, పాచనము, పాతబియ్యపన్నము, అరవైదినములకుపండిసంవత్సరముగడచిన పాతబియ్యము మండము, కాచినపాలు, జాంగలమాంసరసము, పొట్లకాయ, మునగకాయ, కాకరకాయ, చక్రవర్తికూర, చకోరపుకూర, ఉప్పు, సూగస్తునల్లనుప్పు ఇంగువ, శొంఠి, వాయువిడంగము, సోపు, వెల్లుల్లి, లవంగములు, ఆముదము, గోమూత్రము, వట్టివేరు, నిమ్మపండ్లరసము, చంగల్వకోష్టు, లఘుకరములగు అన్నములు, క్షారరసము, ఇవి శూల రోగముగలవారలకు పథ్యములని చెప్పబడియె.

అపథ్యములు

విరుద్ధాన్యన్నపానాని జాగరం విషమాశనమ్,
రూక్షతిక్తకషాయాణి శీతలాని గురూణి చ. 208
వ్యాయామం మైథునం మద్యం వైదళం కటుకాని చ.
వేగరోధం శుచం క్రోధం వర్జయేచ్ఛూలవాన్నరః. 209

తా. విరుద్ధములగు అన్నపానములు, జాగరణ, విషమాశనము, గూక్షము చేదు వగరు శీతలము గురువు ఇవి గల పదార్థముల సేవించుట, వ్యాయామము, మైథునము, మద్యము పప్పుపదార్థములు, కారముగల పదార్థములు, మలమూత్రనిరోధము, దుఃఖము, క్రోధము, వీటిని శూలరోగి వర్జించవలయును.

---

శ్రీ ర స్తు.

శ్రీధన్వంతరయే నమః.

ఆంధ్ర తాత్పర్య సహిత

# వైద్య చింతామణౌ

## ఆనాహ ప్రకరణమ్.

### ఆనాహ - ఉదావర్త - కర్మవిపాకము

శ్లో. దేవద్విజక్షేత్రతటాకవల్మీకకూపాదీనాం యో భేదనం కరోతి,
తంవాయసోనామగ్రహంగృహ్ణాతితల్లక్షణమాధ్మానోదావర్తజ్వరారు
చిమాన్పాదదాహీచజాయతే. 1

తా. దేవక్షేత్రము, బ్రాహ్మణక్షేత్రము, తటాకము, వల్మీకము, కూపము మొదలగువాటిని, యేమనుజుడు నశింపంజేయుచున్నాడో వానిని వాయసమని చెప్పంబడిన గ్రహముగ్రహించు. తల్లక్షణము లెవ్వియనిన, ఆధ్మానము, ఉదావర్తము, జ్వరము, అరుచి, పాదదాహము, ఇవియని యెఱుంగవలయు.

### జ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

మధ్యేపాపగ్రహయోశ్చంద్రేమదనేస్థితేఽర్కజే జంతోః,
శ్వాసక్షయవిద్రధిగుల్మప్లీహాదిపీడితస్సనరః. 2

తా. ఏవనిజననకాలమునందు చంద్రునికి పాపగ్రహమధ్యస్థితిగలిగియుండి జన్మలగ్నమునకు ౭ వయింట శనిస్థితిగలిగియుండునో ఆమనుజుడు శ్వాస, క్షయ విద్రధి, గుల్మము, ప్లీహ, ఇవి గలవాడుగ జనించు.

### ఉదావర్తనిదానము

వాతవిణ్మూత్రజృంభాస్రక్షవోద్గారవమీంద్రియైః,
క్షుత్తృష్ణోచ్ఛ్వాసనిద్రాణాం.ధృత్యోదావర్తసంభవః. 3

తా. అపానవాతము, మలము, మూత్రము, ఆవలింత, కన్నీళ్లు, తుమ్ము, త్రేనుపు,వమనము, శుక్రము, ఆకలి, దప్పి, శ్వాస, నిద్ర వీటిని నిరోధించుటవలన ఉదావర్తరోగము ౧౩ విధంబులుగ జనించు.

## వాతనిరోధజన్య ఉదావర్తనిదానము

వాతమూత్రపురీషాది సంగాధ్మానక్లమారుజాః,
జఠరే వాతజాశ్చాన్యే రోగాస్స్యుర్వాతనిగ్రహాత్. 4

తా. అపానవాయువు యొక్క వేగనిరోధమువలన గలిగిన వాతజోదావర్తము నందు అపానవాతము, మూత్రము, మలము వీటిబంధము, అధ్మానము, గ్లాని, పోట్లు ఉదరమునందు, వాతరోగములు ఇవి జనించుటయేగాక ఇతరరోగములు సగా జనించు.

## పురీషనిరోధజన్యఉదావర్తము

ఆటోపశూలేపరికర్తికా చ సంగః పురీషస్య తథోర్ధ్వవాతః,
పురీషమాస్యాదథవా నిరేతి పురీషవేగేభిహతే నరస్య. 5

తా. కడుపుయందు గుడగుడశబ్దము, శూల, కడుపుయందు కోసినటులనుండుట, మలబద్ధము, ఊర్ధ్వవాతము, లేక నోటివలన మలయువెడలుట, ఇట్టిలక్షణములుగలది పురీషనిరోధజన్య ఉదావర్తమని యెరుంగవలయు.

## మూత్రనిగ్రహజన్యఉదావర్తము

వస్తిమేహనయోశ్శూలం మూత్రకృచ్ఛ్రం శిరోరుజా,
వినామో వంక్షణానాహస్స్యాల్లింగం మూత్రనిగ్రహే. 6

తా. మూత్రమును నిరోధించుటవలన జనించు మూత్రనిగ్రహోదావర్తము, నందు పొత్తికడుపు, శిశ్నము, వీటియందుశూల, మూత్రకృచ్ఛ్రము, తలనొప్పి, శరీరము వంగియుండుట, గజ్జలయందుబ్బుట, ఇట్టి లక్షణములు గలిగియుండు.

## జృంభనిరోధజన్యఉదావర్తము

మన్యాగళస్తంభశిరోవికారాజృంభోపఘాతాత్పవనాత్మకాస్స్యుః,
తథాక్షినాసావదనామయాశ్చ భవంతి తీవ్రాస్సహ కర్ణరోగైః. 7

తా. ఆవలింతను నిరోధించుటవలనజనించు జృంభనిరోధజ ఉదావర్తమునందు పెడతలనరము కంఠము ఇవి స్తంభించుట, శిరస్సుయందువేదన, ఇతర వాతవికారములు, నేత్రములు నాసికము ముఖము చెవులు వీటియందురోగములు సగా జనించు.

## అశ్రునిరోధజన్యఉదావర్తము

ఆనందజంవాప్యథ శోకజం వా నేత్రోదకం ప్రాప్తమముంచతోహి,
శిరోగురుత్వం నయనామయాశ్చ భవన్తి తీవ్రాస్సహ పీనసేన. 8

తా. సంతోషమువలనగాని శోకమువలనగాని జనించిన నేత్రోదకమును విడువనివానికి గలిగిన అశ్రునిరోధజోదావర్తమునందు తలబరువు, పీనస, నేత్రరోగము ఇవి గలిగియుండును.

### క్షుతనిరోధజన్యఉదావర్తము

మన్యాస్తంభశ్శిరశ్శూలమర్దితార్ధవిభేదకౌ,
ఇంద్రియాణాం చ దౌర్బల్యం క్షవథోస్స్యాద్విధారణాత్. 9

తా. తుమ్మునునిరోధించుటవలన జనించిన క్షుతనిరోధజ ఉదావర్తమునందు పెడతలనరము బిగబట్టుట, తలపోటు, అర్దితవాయువు, అర్ధావభేదకము, ఇంద్రియ దౌర్బల్యము, ఇట్టిలక్షణములు గలిగియుండు.

### ఉద్గారనిరోధజన్యఉదావర్తము

కంఠాస్యపూర్ణత్వమతీవ తోదః కూజశ్చ వాయోరథవా ప్రవృత్తిః,
ఉద్గారవేగేభిహతే భవన్తి జన్తోర్వికారాః పవనప్రసూతాః. 10

తా. త్రేనుపును నిరోధించుటవలన జనించిన ఉద్గారనిరోధజోదావర్తము నందు కంఠము నోరు దవడలు ఇవి పూరించియుండుట, మిక్కిలిపీడ, కడుపులో ధ్వనించుట, శ్వాసోచ్ఛ్వాసనిరోధము, ఇట్టి వాతజన్యవికారములు గలిగియుండును.

### ఛర్దినిగ్రహజన్యఉదావర్తము

కండూకోఠారుచివ్యంగశోథపాండ్వామయజ్వరాః,
కుష్ఠహృల్లాసవీసర్పాశ్ఛర్దినిగ్రహజా గదాః. 11

తా. వాంతిని నిరోధించినందువలనజనించిన ఛర్దినిగ్రహజోదావర్తమునందు శరీరమునందు దురద, దద్దులు, అరుచి, అంగవైకల్యము, వాపు, పాండురోగము, జ్వరము, కుష్ఠువు, గ్లాని ఇట్టిలక్షణములు గలిగియుండును.

### శుక్రనిగ్రహజన్య ఉదావర్తలక్షణము

మూత్రాశయే వై గుదముష్కయోశ్చ శోథో రుజా మూత్రవినిగ్రహశ్చ,
శుక్రాశ్మరీ తత్స్రవణం భవేచ్చ తత్తద్వికారాభిహతే తు శుక్రే. 12

తా. మైథునకాలమునందు యేదో వొకకారణముచే శుక్రమునునిరోధించుట వలన జనించిన శుక్రనిరోధజోదావర్తమునందు మూత్రాశయము గుదము వృషణములు వీటియందు వాపు, నొప్పి, మూత్రబంధము, శుక్రము రాతివలె స్తంభించుట, లేక శుక్రస్రావము, ఇట్టి లక్షణములు గలిగియుండును.

### క్షుద్విఘాతజనితోదావర్తలక్షణము

తంద్రాంగమర్దావరుచిశ్శ్రమశ్చ క్షుధోపఘాతాత్కృశతా చ దృష్టేః,

తా. ఆకలిని అణుచుటవలన జనించిన క్షుద్విఘాతజోదావర్తమునందు తంద్ర, ఒడలువిరుపు, అరుచి, శ్రమ, దృష్టిమాంద్యము, ఇట్టి లక్షణములు గలిగియుండును.

### తృష్ణానిరోధజోదావర్తలక్షణము

కంఠాస్యశోషః శ్రవణావరోధ స్తృష్ణాభిఘాతాద్ధృదయవ్యథా చ.

తా. దప్పిని నిగ్రహించుటవలన జనించిన తృష్ణానిరోధజోదావర్తమునందు కంఠము నోరు ఇవియెండుట, చెవుడు, హృదయమందు వ్యథ. ఇట్టి లక్షణములు గలిగియుండు.

### శ్వాసనిగ్రహజోదావర్తలక్షణము

శ్రాన్తస్య నిశ్వాసవినిగ్రహేణ హృద్రోగమోహావథవాపి గుల్మః,

తా. శ్వాసనిరోధమువలన జనించిన శ్వాసనిగ్రహజోదావర్తమునందు హృద్రోగము, మోహము, లేక గుల్మము ఇట్టి లక్షణములు గలిగియుండును.

### నిద్రాభిఘాతజోదావర్తలక్షణము

జృంభాంగమర్దోఽక్షిశిరోఽతిజాడ్యం నిద్రాభిఘాతాదథవాపి తంద్రా. 14

తా. నిద్రమేల్కొనియుండుటవలన జనించిన నిద్రాభిఘాతజోదావర్తమునందు ఆవలింతలు, ఒళ్లువిరుపు, కన్నులు శిరస్సు వీటియందుబరువు లేక తంద్ర, ఇట్టి లక్షణములు గలిగియుండును.

### రూక్షాదికుపిత వాతజోదావర్తలక్షణము

వాయుః కోష్ఠానుగై రూక్షైః కషాయకటుతిక్తకైః,
భోజనైః కుపితస్సద్యః ఉదావర్తం కరోతి చ. 15
వాతమూత్రపురీషాసృక్కఫమేదోవహాని చ,
స్రోతాంస్యుదావర్తయతి పురీషం చాతివర్తయేత్. 16
తతో హృద్వస్తిశూలార్తో హృల్లాసారతిపీడితః,
వాతమూత్రపురీషాణి కృచ్ఛ్రేణ లభతే నరః. 17
శ్వాసకాసప్రతిశ్యాయదాహమోహతృషాజ్వరాన్,
వమిహిక్కాశిరోరోగమనశ్శ్రవణవిభ్రమాన్. 18
బహూనన్యాంశ్చ లభతే వికారాన్వాతకోపజాన్,

తా. రూక్షపదార్థములు, వగరు కారము చేదు ఇవిమొదలగు పదార్థములు, సేవించుటవలన, కోష్ఠగతవాయువు ప్రకోపించి సద్యస్కాలమునందే వాతము, మూత్రము, పురీషము, రక్తము, కఫము, మేదస్సు, వీటిని వహింపుచుండెడి నాడుల నడ్డగించి, పురీషమును శోషింపజేసి పిదప హృదయము పొత్తికడుపు వీటియందు శూల, హృల్లాసము, అరతి, వీటిచేపీడ, మరియు అపానవాయువు, మూత్రము, పురీషము వీటిని అతికష్టముగవిడుచుట, శ్వాస, కాస, పీనస, దాహము, మోహము,

## క్షుతనిరోధజన్యఉదావర్తము

మన్యాస్తంభశ్శిరశ్శూలమర్దితార్ధవిభేదకౌ,
ఇంద్రియాణాం చ దౌర్బల్యం క్షవథోస్స్యాద్విధారణాత్. 9

తా. తుమ్మునునిరోధించుటవలన జనించిన క్షుతనిరోధజ ఉదావర్తమునందు పెడతలనరము బిగబట్టుట, తలపోటు, అర్దితవాయువు, అర్ధావభేదకము, ఇంద్రియదౌర్బల్యము, ఇట్టిలక్షణములు గలిగియుండు.

## ఉద్గారనిరోధజన్యఉదావర్తము

కంఠాస్యపూర్ణత్వమతీవ తోదః కూజశ్చ వాయోరథవా ప్రవృత్తిః,
ఉద్గారవేగేభిహతే భవన్తి జన్తోర్వికారాః పవనప్రసూతాః. 10

తా. త్రేనుపును నిరోధించుటవలన జనించిన ఉద్గారనిరోధజోదావర్తమునందు కంఠము నోరు దవడలు ఇవి పూరించియుండుట, మిక్కిలిపీడ, కడుపులో ధ్వనించుట, శ్వాసోచ్ఛ్వాసనిరోధము, ఇట్టి వాతజన్యవికారములు గలిగియుండును.

## ఛర్దినిగ్రహజన్యఉదావర్తము

కండూకోఠారుచివ్యంగశోథపాండ్వామయజ్వరాః,
కుష్ఠహృల్లాసవీసర్పాశ్ఛర్దినిగ్రహజా గదాః. 11

తా. వాంతిని నిరోధించినందువలనజనించిన ఛర్దినిగ్రహజోదావర్తమునందు శరీరమునందు దురద, దద్దులు, అరుచి, అంగవైకల్యము, వాపు, పాండురోగము, జ్వరము, కుష్ఠువు, గ్లాని ఇట్టిలక్షణములు గలిగియుండును.

## శుక్రనిగ్రహజన్య ఉదావర్తలక్షణము

మూత్రాశయే వై గుదముష్కయోశ్చ శోథో రుజామూత్ర
వినిగ్రహశ్చ,
శుక్రాశ్మరీ తత్ స్రవణం భవేచ్చ తత్తద్వికారాభిహతే తు శుక్రే. 12

తా. మైథునకాలమునందు యేదో వొకకారణముచే శుక్రమునునిరోధించుటవలన జనించిన శుక్రనిరోధజోదావర్తమునందు మూత్రాశయము గుదము వృషణములు వీటియందు వాపు, నొప్పి, మూత్రబంధము, శుక్రము రాతివలె స్తంభించుట, లేక శుక్రస్రావము, ఇట్టి లక్షణములు గలిగియుండును.

## క్షుద్విఘాతజనితోదావర్తలక్షణము

తంద్రాంగమర్దావరుచిశ్శ్రమశ్చ క్షుధోపఘాతాత్కృశతాచదృష్టేః,

తా. ఆకలిని అణుచుటవలన జనించిన క్షుద్విఘాతజోదావర్తమునందు తంద్ర, ఒడలునొప్పు, అరుచి, శ్రమ, దృష్టిమాంద్యము, ఇట్టి లక్షణములు గలిగియుండును.

తృష్ణానిరోధజోదావర్తలక్షణము.

కంఠాస్యశోషః శ్రవణావరోధస్తృష్ణాభిఘాతాద్ధృదయవ్యథా చ.

తా. దప్పిని నిగ్రహించుటవలన జనించిన తృష్ణానిరోధజోదావర్తమునందు కంఠము నోరు ఇవియెండుట, చెవుడు, హృదయమందు వ్యథ. ఇట్టి లక్షణములు గలిగియుండు.

శ్వాసనిగ్రహజోదావర్తలక్షణము

శ్రాన్తస్య నిశ్వాసవినిగ్రహేణ హృద్రోగమోహావథవాపి గుల్మః,

తా. శ్వాసనిరోధమువలన జనించిన శ్వాసనిగ్రహజోదావర్తమునందు హృద్రోగము, మోహము, లేక గుల్మము ఇట్టి లక్షణములు గలిగియుండును.

నిద్రాభిఘాతజోదావర్తలక్షణము

జృంభాంగమర్దోఽక్షిశిరోతిజాడ్యం నిద్రాభిఘాతాదథవాపి తంద్రా. 14

తా. నిద్రమేల్కొనియుండుటవలన జనించిన నిద్రాభిఘాతజోదావర్తమునందు ఆవలింతలు, ఒళ్లువిరుపు, కన్నులు శిరస్సు వీటియందుబరువు లేక తంద్ర ఇట్టి లక్షణములు గలిగియుండును.

రూక్షాదికుపితవాతజోదావర్తలక్షణము

వాయుః కోష్ఠానుగైః రూక్షైః కషాయకటుతిక్తకైః,
భోజనైః కుపితస్సద్యః ఉదావర్తం కరోతి చ. 15
వాతమూత్రపురీషాస్రకఫమేదోవహాని చ,
స్రోతాంస్యుదావర్తయతి పురీషం చాతివర్తయేత్. 16
తతో హృద్వస్తిశూలార్తో హృల్లాసారతిపీడితః,
వాతమూత్రపురీషాణి కృచ్ఛ్రేణ లభతే నరః. 17
శ్వాసకాసప్రతిశ్యాయదాహమోహాంస్తృష్ణాజ్వరాన్,
వమిహిక్కాశిరోరోగమనశ్శ్రవణవిభ్రమాన్. 18
బహూనన్యాంశ్చ లభతే వికారాన్వాతకోపజాన్,

తా. రూక్షపదార్థములు, వగరు కారము చేదు ఇవిమొదలగు పదార్థములు, సేవించుటవలన, కోష్ఠగతవాయువుప్రకోపించి సద్యస్కాలమునందే వాతము, మూత్రము, పురీషము, రక్తము, కఫము, మేదస్సు, వీటిని వహించుచుండెడి నాడుల నడ్డగించి, పురీషమును శోషింపజేసి పిదప హృదయము పొత్తికడుపు వీటియందు శూల, హృల్లాసము, అరతి, వీటిచేపీడ, మరియు అపానవాయువు, మూత్రము, పురీషము వీటిని అతికష్టముగవిడుచుట, శ్వాస, కాస, పీనసు, దాహము, మోహము,

తృష్ణ, జ్వరము, వాంతి, ఎక్కిళ్లు, శిరోరోగము, మనోవిభ్రమము, శ్రవణవిభ్రమము, వాతకోపజవికారములు ఇట్టి లక్షణములుగల ఉదావర్తమును గలుగంజేయును.

అధోవాతజన్యఉదావర్తచికిత్స.

అధోవాతనిరోధోత్థే తూదావర్తే హితం మతం స్నేహపానం
తథా స్వేదో వస్తిర్వ్యచ్చానులోమనమ్,

తా. స్నేహపానము, స్వేదనము, వస్తికర్మ, అనులోమకర ఔషధములు సేవించుట వీనిని జేసిన అధోవాతనిరోధ జన్యఉదావర్తము నివర్తించును.

మలనిరోధజన్యఉదావర్తచికిత్స.

విడ్విఘాతసముత్పన్నే విడ్భేద్యన్నం తథౌషధమ్. 20
వర్త్యభ్యంగావగాహాశ్చ స్వేదో వస్తిర్హితో మతః,

తా. భేదిని కలుగజేయు అన్నము, ఔషధము, వర్తి, అభ్యంగము, అవగాహ, స్నానము, స్వేదనము, వస్తిధర్మము, వీటిని జేసిన విడ్విఘాత ఉదావర్తము నివర్తించును.

మూత్రనిరోధజన్య ఉదావర్తచికిత్స

మూత్రావరోధజనితే క్షీరం వారి చ వా పిబేత్. 21
దుస్పర్శాస్వరసం చాపి కషాయం కకుభస్య చ,

తా. పాలు నీళ్లు వీటిని కలిపి పుచ్చుకొనినను లేక దూలగొండి వేళ్లస్వరసముగాని లేక మద్దిపట్టకషాయమునుగాని పుచ్చుకొనిన మూత్రనిరోధజోదావర్తము నివర్తించును.

జృంభానిరోధజోదావర్తచికిత్స.

జృంభానిరోధజే స్నేహం స్వేదం చాపి ప్రయోజయేత్. 22
అన్యానపి ప్రయుంజీత సమీరణహరాన్విధీన్,

తా. స్నేహము, చెమటదీయుట, వీటిని జేసిన ఆవలింతను నిరోధించినందువలన జనించిన ఉదావర్తము,నశించును, మఱియు ఇతరములగు వాతహరకోపచారములంజేసిన మానును.

బాష్పావరోధజ క్షుతనిరోధజ ఉదావర్త చికిత్స.

నేత్రనీరావరోధోత్థే ముంచేదుచ్చైర్ద్రుశోజలమ్. 23
స్వప్యాత్సుఖేన తస్యాగ్రే కథయేచ్చ శుభాః కథాః,
శిక్కావిఘాతజే తీక్ష్ణఘ్రాణనస్యార్కదర్శనైః. 24
ప్రవర్తతే క్షుతం సక్తస్నేహస్వేదా చ శీలయేత్,

తా. కంటినీరును నిరోధించినందువలనజనించిన ఉదావర్తమునందు ఎక్కువగా కన్నులనీరువిడువవలయు. మరియు సుఖముగా శయనించవలెను. వానిరోధించుట శుష్కములగు కథలం జెప్పవలయును. తుమ్మునునిరోధించినందునలన జనించిన ఉదావర్తమునందు తీక్ష్ణపదార్థముల ఆఘ్రాణించుట, లేక నస్యముచేయుట, సూర్యునిచూచుట, ఇట్టి యుపాయములచే తుమ్ములువచ్చునటుల జేసి చమటదీయించి స్నేహపానమును చేయించవలయును.

—ఉద్గారఛర్దినిరోధజోదావర్తచికిత్స—

ఉద్గారస్యావరోధే తు స్నైహికం ధూమమాచరేత్.
ఛర్దినిగ్రహసంజాతే వమనం లంఘనం హితమ్, 25
విరేచనం చాత్ర మతం తైలేనాభ్యంజనం హితమ్. 26
వస్తిశుద్ధికరైస్సిద్ధం చతుర్గుణజలం పయః,

తా. తేపులను నిరోధించినందున జనించిన ఉదావర్తమునందు స్నిగ్ధపదార్థములను నిప్పుపైనునిచి పొగత్రాగవలయు. వాంతినిరోధమువలనజనించిన ఉదావర్తమునందు, వమనము, లంఘనము, విరేచనము, తైలాభ్యంగము, వస్తిశుద్ధికరములగు ఓషధులకషాయమునందు నాలవభాగము పాలుచేర్చి శక్తిని ఇవ్వవలయు.

—ఛర్ద్యాఘాతజోదావర్తచికిత్స—

ఛర్ద్యాఘాతం తథా దోషం నస్యస్నేహాదిభిర్జయేత్. 27
భుక్త్వా ప్రచ్ఛర్దనం ధూమో లంఘనం రక్తమోక్షణమ్,

తా. ఇంకనువాంతినినిరోధించుటచేగలిగిన ఉదావర్తమునందు నస్యము, స్నేహము, మొదలగువాటిచే నివారించవలయు. భోజనముచేసినపిదప వాంతినిచేయించవలయు. మరియు ధూమపానము, లంఘనము, రక్తమోక్షము వీటినిచేయవలయును.

—క్షుధాతృష్ణోత్థఉదావర్తచికిత్స—

క్షుద్విఘాతసముద్భూతే స్నిగ్ధముష్ణం తథా లఘు. 28
రుచ్యమల్పం హితం భక్ష్యం పుష్పం సేవ్యం సుగంధి యుక్,
తృష్ణావిఘాతసంభూతే శీతస్సర్వో విధిర్హితః. 29
కర్పూరశిశిరం స్వల్పం పిబేత్తోయం శనైశ్శనైః,

తా. స్నిగ్ధపదార్థములు, ఉష్ణపదార్థములు, లఘుపదార్థములు, రుచికరపదార్థములు, హితకరపదార్థములు, సుగంధయుక్తములగు పుష్పములు వీటిని సేవించిన క్షుద్విఘాతజనిత ఉదావర్తమునివర్తించును. మరియు శీతోపచారములు కర్పూర

ముతో చల్లగను లఘువుగనునుండు నుదకపానంబొనరించిన తృష్ణాఘాతజనితఉదావర్తము నివర్తించు.

—శ్రమ నిద్ర వీటినిరోధమువలనజనించిన ఉదావర్తచికిత్స—

శ్రమశ్వాసకృతే శస్తో విశ్రామస్సరసోదనః. 30
నిద్రావేగవిఘాతోత్థే పిబేత్క్షీరం సితాయుతమ్,
సంవాహనం సుశయ్యాత్ర హితస్స్వప్నః ప్రియాః కథాః. 31

తా. సుఖముగ కూర్చుండుట, రసయుక్తమగు అన్నమును భుజించుట, వీటి వలన శ్రమజనిత ఉదావర్తము నివర్తించును. మరియు చక్కెరచేర్చిన పాలుత్రాగుట, ఒడలుపిసికించుకొనుట, సుఖశయ్యయందు నిద్రించుట, ప్రియగోష్ఠి వీటిచే నిద్రావిఘాతజనిత ఉదావర్తము తొలగును.

—నారాచచూర్ణము—

ఖండపలం త్రివృతాక్షః కృష్ణాకర్షద్వయం కృతం చూర్ణమ్,
ప్రాగ్భోజనస్య మధునా, బిడాలపదకం నరో లిహ్యాత్. 32
ఏతద్గాఢపురీషే జ్ఞేయం విదుషాప్యుదావర్తే,
మధురం నరపతియోగ్యం చూర్ణం నారాచకం నామ. 33

తా. కలకండ ౧ పలము తెగడ కర్షప్రమాణము పిప్పళి ౪ పలము వీటిని చూర్ణముజేసి తేనెలో ౧ రూపాయయెత్తు భోజనాత్పూర్వము పుచ్చుకొనిన మలబద్ధము ఉదావర్తము ఇవి నివర్తించు. ఇది మధురముగనుండుగాన రాజయోగ్యకరమని తెలియవలయు.

—హరీతక్యాదిచూర్ణము—

హరీతకీయవక్షార పీలునీ త్రివృతా తథా,
ఘృతే చూర్ణమిదం పేయముదావర్తం వినాశనమ్. 34

తా. కరక్కాయపొలుపు, యవక్షారము, వరగోగు, తెగడ, వీటిని సమముగ జేర్చి చూర్ణించి నెయ్యితో సేవించిన ఉదావర్తము తొలంగు.

—ఉదావర్తమునకు పథ్యములు—

ఉదావర్తే హితం సర్వం పాచనం లఘు భోజనమ్,

తా. ఉదావర్తరోగమునందు పాచనము, లఘుభోజనము, వీటిని జేసిన హితముగనుండు.

—అ ప థ్య ము లు—

విష్టంభీని విరుద్ధాని కషాయాణి గురూణి వా. 35
ఉదావర్తే ప్రయత్నేన వర్జయేత్సతతం నరః,

తా. ఉదావర్తమునందు మలబంధకరపదార్థములు, విరుద్ధపదార్థములు, వగరు పదార్థములు, గురుపదార్థములు వీటిని అతిప్రయత్నముచే విడువవలయును.

—ఆ నా హ ని దా న ము—

ఆమం శకృద్వానిచితం క్రమేణ భూయో విబద్ధం విగుణానిలేన. 36
ప్రవర్తమానం న యథా స్వమేనం వికారమానాహముదాహరంతి,

తా. ఆమముగాని లేక మలముగాని దినక్రమముగ చేర్చబడి దుష్టవాయువుచే శోషించి యథాస్థితిగ మలద్వారమునుండి బయలువెడలక పోవుటయే ఆనాహమని తెలియవలయును.

—ఆమజన్య ఆనాహనిదానము—

తస్మిన్భవంత్యామసముద్భవే తు తృష్ణాప్రతిశ్యాయశిరోవిదాహాః. 37
ఆమాశయే శూలమథో గురుత్వం హృత్స్తంభ ఉద్గారవిఘాతనం చ,
స్తంభః కటీపృష్ఠపురీషమూత్రే శూలంచ మూర్ఛాశకృతోవమిశ్చ.

తా. ఆమాశయజన్య ఆనాహమునందు దప్పి, పీనస, శిరోదాహము, ఆమాశయమునందు శూల, గురుత్వము, హృదయము స్తంభించుట, తేనుపురాకయుండుట, కటిప్రదేశము వీపు ఇవి బిగియబట్టుట, మలమూత్రములు బంధించుట, శూల, మూర్ఛ, మలమును గ్రక్కుట ఇవి జనించు

—పక్వాశయజన్యఆనాహము—

శ్వాసాశ్చ పక్వాశయజే భవన్తి తథాలసోక్తాని చ లక్షణాని,

తా. పక్వాశయమునందు జనించు ఆనాహమునందు శ్వాస, కడుపు మిగుల వంగుట, గ్లానిని పొందుట, భూమిమీదపడి అరుచుట, వాతమునకు అధోవ్యాప్తినిజేయకుండుటవలన కుక్షికి పైభాగమునందు వాతముసంచరించుట, వాతము మలము ఇవి బద్ధగించుట, దప్పి ఓకిరింత ఇట్టి అలసకరోగమునందు చెప్పబడిన లక్షణములు గలిగియుండును.

—ఉదావర్తఅసాధ్యలక్షణము—

తృష్ణార్దితం పరిక్లిష్టం క్షీణం శూలైరుపద్రుతమ్. 39
శకృద్వమంతం మతిమానుదావర్తినముత్సృజేత్,

తా. దప్పి, శ్రమ, శరీరము క్షీణించుట, శూల, ఈయుపద్రవములతోఁగూడు కొనియుండుట, మలమును గ్రక్కుట ఇట్టిలక్షణములుగల ఉదావర్తము అసాధ్యమని తెలియవలయు.

హింగ్వాది చూర్ణము

ద్వ్యుత్తరాహింగువచాసకుష్ఠసువర్చికా చేతి విడంగచూర్ణమ్. 40
సుఖాంబునాఽనాహవిషూచికార్తిహృద్రోగగుల్మోర్ధ్వసమీరణఘ్నమ్,

తా. ఇంగువ ౧ భాగము, వస ౩ భాగములు, చెంగల్వకోష్ఠు ౫ భాగములు, సర్జక్షారము ౭ భాగములు, వాయువిడంగములు ౯ భాగములు, వీటిని చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన ఆనాహము, విషూచి, హృద్రోగము, గుల్మము, అర్ధాంగవాతము ఇవి నివర్తించు.

ఫలచూర్ణము

ఫలంచమూలంచవిరేచనోక్తంహింగ్వర్కమూలందశమూలగ్ర్యమ్.
స్నుక్చిత్రకశ్చేతి పునర్నవా చ తుల్యాని సర్వైర్లవణాని పంచ,
స్నేహైస్సమగ్రైస్సహజర్జరాణి సశంఖసంధౌ విపచేత్సులిప్తే. 42
పక్వంసుపిష్టంలవణం తదన్నైః పానైస్తథానాహరుజామయఘ్నమ్,

తా. విరేచనకరములగు ఫలములుగు (కేల-శరక మొ॥), వేళ్లు (తెగడ మొ॥), ఇంగువ, జిల్లేడువేళ్లు, శ్రేష్ఠమగు దశమూలములు, జెముడు పాలు, చిత్రమూలము, తెల్లగలిజేరు, ఇవి సమాంశములు, వీటికి సమము పంచలవణములు వీటన్నిఁటిని నేతితోఁగలిపి మర్దించి శంఖమునందునిచి దానిముఖమునకు సీలుమన్ను లేపనము జేసి పుటమిడి సాంగశీతలమువదీసి ఖల్వమునందునిచి చూర్ణించి ఆయుష్వాను అన్నముతోఁగాని ఉదకముతోఁగాని పుచ్చుకొనిన ఆనాహము నివర్తించు.

తుంబురుచూర్ణము

తుంబురుశ్చాభయాహింగుపౌష్కరం లవణత్రయమ్. 43
యవానీ చ యవక్షారం విడంగేన సమాని చ,
త్రివృత్త్రిగుణితం చూర్ణం పిబేదుష్ణేన వారిణా. 44
ఆనాహముదరాణ్యష్టౌ విడ్బంధం చాపి నాశయేత్,

తా. * ధనియాలు, కరక్కాయపొలుపు, ఇంగువ, పుష్కరమూలము, † లవణత్రయము, ఓమము, యవక్షారము, వాయువిడంగములు, ఇవి సమభాగములు,

* తుంబురులని ధనియములలో భేదము.

† లవణత్రయమనగా:- సైంధవము, సౌవర్చలము, బిడము.

తెగడ 3 భాగములు వీటినన్నిటిని చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన అనాహము అష్టోదరరోగములు మలబంధము ఇవి నివర్తించు.

వచాదిచూర్ణము

వచాభయాచిత్రక యావశూకాః స పిప్పలీకాంత్స విషాన్నసుష్ఠాః.
ఉష్ణాంబునానాహవిమూఢవాతా న్పీత్వాజగుల్మోస్నే దహింతోదనాశీ.

తా. వస, కరక్కాయపొలుపు, చిత్రమూలము, యావక్షారము, పిప్పలి, అతివస, చెంగల్వకోష్ఠు వీటినిచూర్ణించి ఉష్ణోదకముతో సేవించి ఉదకయుక్తముగ ఉత్తమభోజనము జేసిన ఆనాహము మూఢవాతము ఇవి నివర్తించు.

---

# గుల్మరోగప్రకరణమ్.

గుల్మరోగ కర్మవిపాకము

గురుప్రత్యర్థితాం యాతో గుల్మవాన్ జాయతేనరః,
ఆచరేత్తన్నివృత్త్యర్థం మాసమేకం పయోవ్రతమ్. 1

తా. గురువును ద్వేషించినవాడు గుల్మరోగముగలవాడగు. అది నివర్తించుటకై, ఒకమాసము పయోవ్రతమును జేయవలయు.

గుల్మనిదానము

దుష్టా వాతాదయోత్యర్థం మిథ్యాహారవిహారతః,
కుర్వంతి పంచధా గుల్మం కోష్ఠాంతర్గ్రంథిరూపిణమ్. 2

తా. విరుద్ధాహారవిహారాదులవలన, వాతపిత్తకఫములు మిగుల ప్రకోపమును జెంది, ఆమాశయాదికోష్ఠమధ్యమునందు వాతపిత్తకఫసన్నిపాతరక్తజములని ౫ విధములుగ గ్రంథిరూపములుగనుండు గుల్మములను గలుగంజేయును.

గుల్మరోగస్థానములు

తేషాం పంచవిధం స్థానం పార్శ్వహృన్నాభివస్తయః,

తా. ఇరుపక్కలు, హృదయము, నాభి, పొత్తికడుపు ఈ ౫ స్థానములు గుల్మస్థానంబులని యెరుంగవలయు.

గుల్మరూపము

హృన్నాభ్యోరంతరే గ్రంథిస్సంచారీ యదివాచలః, 3
వృత్తశ్చయాపచయవాన్ సగుల్మ ఇతి కీర్తితః,

తా. హృదయము, నాభి, వీటిమధ్యమునందు సంచరించుచుగాని లేక సంచరించకగాని వృద్ధిగలిగిగాని లేక క్షీణించినదిగగాని గుండ్రముగజనించు గ్రంధి గుల్మమనంబడు.

### గుల్మరోగసామాన్యలక్షణము

అరుచిః కృచ్ఛ్రవిణ్మూత్రమగ్నిమాంద్యాంత్రకూజనే. 4
ఆనాహశ్చోర్ధ్వవాతత్వం సర్వగుల్మేషు లక్షయేత్,

తా. అరుచి, మలమూత్రములు మిగులశ్రమచేవెడలుట, అగ్నిమాంద్యము, వాయువువలన పేగులరచుట, ఆనాహము, వాతమూర్ధ్వముగ ప్రసరించుట, ఇవి సర్వగుల్మములకు సాధారణలక్షణములని తెలియవలయు.

### గుల్మరోగసంప్రాప్తిభేదములు

సవ్యస్తైర్జాయతే దోషైస్సమస్తైరపిచోచ్ఛ్రితైః. 5
పురుషాణాం తథా స్త్రీణాం జ్ఞేయో రక్తేన చాపరః,

తా. వాత పిత్త కఫములు మూడునుచేరిగాని, లేక ప్రత్యేకముగగాని ప్రకోపించి, వాత పిత్త శ్లేష్మ సన్నిపాతములని నాలుగువిధములుగ గుల్మములను స్త్రీలకుగాని, పురుషులకుగాని గలుగంజేయు. మరియు, అయిదవదియగు రక్తజగుల్మము, స్త్రీలకే జనించునని తెలియవలయు.

### గుల్మరోగపూర్వరూపము

ఉద్గారబాహుళ్యపురీషబంధ స్తృప్త్యక్షమత్వాంత్రవికూజనాని.
ఆటోపమాధ్మానమపక్తిశక్తిరాసన్నగుల్మస్య వదన్తి చిహ్నమ్,

తా. మిగులత్రేపులు, మలబంధము, అన్నమునందిష్టములేకయుండుట, పనులుచేయలేకయుండుట, పేగులరుచుట, కడుపుయందు నొప్పితో ఆరాటముగనుండుట, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, అశక్తి ఇవి గుల్మములకు పూర్వరూపములని తెలిసికొనవలయు.

### వాతగుల్మనిదానలక్షణములు

రూక్షాన్నపానం విషమాతిమాత్రం విచేష్టనం వేగవినిగ్రహాశ్చ.7
శోకోఽభిఘాతో మలసంక్షయశ్చ నిరన్నతా చానిలగుల్మహేతుః,
యత్స్థాన సంస్థానరుజావికల్పం విడ్వాతసంగం గళవక్త్రశోషం. 8
శ్యావారుజత్వం శిశిరజ్వరం చ హృత్కుక్షిపార్శ్వాంసశిరోరుజశ్చ
కరోతి జీర్ణేత్యధికప్రకోపం భుక్తే మృదుత్వం సముపైతి యశ్చ. 9

వాతాత్సగుల్మో న చ తత్ర రూక్షం కషాయతిక్తం కటువోపశేతే,

తా. రూక్షముగను విషమముగనునుండు అన్నపానములను మిక్కుటముగ సేవించుట, విరుద్ధచేష్ట, మలమూత్రముల వేగనిరోధము, శోకము, అభిఘాతము, విరేచనాదులచే అతిమలక్షయము, ఉపవాసము, ఇవి వాతగుల్మనిదానములు. ఇందు నాభియందుగాని పార్శ్వములయందుగాని పొత్తికడుపునందుగాని చిన్నదిగగాని గొప్పదిగగాని గుండ్రముగగాని దీర్ఘముగగాని కొంచెము వేదనతోగాని లేక మిగుల వేదనతోగాని గుల్మముజనించి మలము అపానవాయువు వీటిబంధము,కంఠము ముఖము వీటియందుశోష, శరీరము నల్లగ లేక యెఱ్ఱగనుండుట, శీతజ్వరముగలుగుట, హృదయము కుక్షి పార్శ్వములు భుజ శిరస్సులు తల వీటియందుపీడ, అన్నము జీర్ణమగునపుడు ప్రకోపించుట, అన్నముభుజించునపుడు మృదుత్వమును పొందుట, ఇట్టిలక్షణములతో గూడియుండును. ఇది వాతగుల్మమనంబడు. దీనియందు రూక్షము, వగరు, చేదు, కారము, ఇట్టిపదార్థములు సేవింపంజనదు.

## పిత్తగుల్మనిదానలక్షణములు

కట్వమ్లతీక్ష్ణోష్ణవిదాహరూక్షక్రోధాతిమద్యార్కహుతాశసేవా. 10

ఆమాభిఘాతోరుధిరం చ దుష్టం పిత్తస్య గుల్మస్య నిమిత్తముక్తమ్,

జ్వరః పిపాసావదనాంగరాగశ్శూలం మహజ్జీర్యతి భోజనే చ. 11

స్వేదోవిదాహోవ్రణవచ్చగుల్మస్స్పర్శాసహః పైత్తికగుల్మరూపమ్,

తా. కారము, పులుసు, తీక్ష్ణము, ఉష్ణము, విదాహము, రూక్షము, ఇట్టివిగల పదార్థములను సేవించుట, క్రోధము, మిక్కుటముగ మద్యపానము, యెండయందు సంచరించుట, నిప్పుసెగయందుండుట, ఆమదోషము, అభిఘాతము, రక్తదోషము అనునవి పిత్తగుల్మమును గలుగంజేయును, అందు, జ్వరము, దప్పి, ఇవిగలుగుట, ముఖము శరీరము యెఱ్ఱగనుండుట, అన్నము జీర్ణమగునపుడు మిగుల శూల, చెమటు, విదాహము, గుల్మప్రదేశమున స్పర్శను ఓర్చకుండుట, ఇట్టిలక్షణములు గలిగియుండు.

## కఫజసన్నిపాతజ గుల్మనిదానలక్షణములు

శీతం గురుస్నిగ్ధమచేష్టనం చ సంపూరణం ప్రస్వపనం దివా చ. 12

గుల్మస్య హేతుః కఫసంభవస్య సర్వస్తు దిష్టో నిచయాత్మకస్య,

స్తైమిత్యశీతజ్వరగాత్రసాదహృల్లాసకాసారుచిగౌరవాణి. 13

శైత్యం రుగల్పా కఠినోన్నతత్వం గుల్మస్య రూపాణి కఫాత్మకస్య,

తా. శీతలము, గురుత్వము, స్నిగ్ధత్వముగల పదార్థములను సేవించుట, వ్యాపారములేకయుండుట, మిక్కుటముగ భుజించుట, పగలునిద్రబోవుట, వీటివలనజనించినదై శరీరము మొద్దుబారియుండుట, శీతజ్వరము, శరీరకృశత్వము, హృల్లాసము, కాస, అరుచి, గురుత్వము, శైత్యము, సన్ననినొప్పి, వీట్లతోగూడి కఠినముగను, ఉన్నతముగను నుండునది కఫగుల్మమనంబడును. మరియు, పూర్వోక్త వాత పిత్త కఫగుల్మ కారణమునన్నిటివలన సన్నిపాతగుల్మము జనించు.

## ద్వంద్వజగుల్మనిదానము

నిమిత్తలింగానుపలభ్య గుల్మే సంసర్గజే దోషబలాబలం చ. 14
వ్యామిశ్రలింగానపరాంశ్చ గుల్మాన్ త్రీనాదిశేదౌషధకల్పనార్థమ్,

తా. వాతాదిగల్మములలో గుల్మద్వయ కారణములవలన జనించి యాయాలక్షణములు గలిగియుండునవి ద్వంద్వజగుల్మము లనంబడు. అందు దోషబలాబలముల నెరింగి చికిత్సలజేయందగు.

## సన్నిపాతగుల్మలక్షణము

మహారుజందాహపరీతమశ్మవత్ ఘనోన్నతంశీఘ్రవిదాహదారుణమ్,
మనశ్శరీరాగ్నిబలాపహారిణమ్ త్రిదోషం గుల్మమసాధ్యమాదిశేత్,

తా. మిగుల వేదన, దాహము, రాయివలె ఘట్టిగను ఉన్నతముగనుండుట, మాటిమాటికితాపము, మనోవైకల్యము, శరీరవైకల్యము అగ్నివైకల్యము బలవైకల్యము. వీటిని గలుగంజేయుట, ఇట్టిలక్షణములుగలది సన్నిపాత గుల్మమనంబడు. ఇది యసాధ్యము.

## సంప్రాప్తిపూర్వకరక్తగుల్మనిదానలక్షణములు

నవప్రసూతాహితభోజనాయాయాచామగర్భం విసృజేదృతౌ వా. 16
వాయుర్హి తస్యాః పరిగృహ్యరక్తం కరోతిగుల్మం సరుజంసదాహమ్,
పిత్తస్య లింగేన సమానలింగం విశేషణం చాప్యపరంనిబోధ. 17
యః పిండవత్ పిండితఏవనాంగైః చిరాత్సశూలః సమగర్భలింగః,
సరౌధిరస్త్రీభవ ఏష గుల్మో మాసే వ్యతీతే దశమే చికిత్స్యః. 18

తా. నూతనగర్భప్రసూతియందును, లేక, గర్భస్రావాదులయందును, ఋతుకాలమునందును, అపథ్యాహారములవలన వాయువుప్రకోపించి రక్తమునుగ్రహించి, నొప్పి, మంట, వీటినిగలుగంజేయుచు, పిత్తగుల్మలక్షణములు గలిగియుండు రక్తగుల్మమును గలుగంజేయు. అయినను దీనియందొకవిశేషముగలదు. అదియెట్టులనిన, ఈ

రక్తగుల్మము అవయవలక్షణములతో గూడియుండక పిండమువలెనుండి, శూలతో గూడి గర్భలక్షణయుక్తమై (అనగా) ఋతువుడుగుట,నోట నీరువూరుట, స్తనాగ్రభాగము నల్లనగుట, ఇవిమొదలగునవిగలిగి దీర్ఘకాలమువరకు గుండ్రముగ సంచరింపుచుండు, ఈరక్తగుల్మము స్త్రీలకే జనించు. దీనియందు పదియవమాసము గడచిన పిదప చికిత్సను చేయవలయు. దీనిని కొందరు గర్భమనియు,మరికొందరు రక్తగుల్మమనియును వచించెదరు. కావున నట్టియనుమానము తీరవఱకు చికిత్సింపజనదని భావము.

## గుల్మరోగాసాధ్యలక్షణము

సంచితః క్రమశో గుల్మో మహావాస్తుపరిగ్రహః,
కృతమూలశ్శిరానద్ధో యదా కూర్మ ఇవోన్నతః. 19
దౌర్బల్యారుచిహృల్లాసకాసచ్ఛర్ద్యరతిజ్వరైః,
తృష్ణాతంద్రాప్రతిశ్యాయైర్యుజ్యతే న ససిధ్యతి. 20
గృహీత్వా సజ్వరశ్వాసం ఛర్ద్యతీసారపీడితమ్,
హృన్నాభివస్తిపాదేషు శోఫః కర్షతి గుల్మినమ్. 21
శ్వాసశూలపిపాసాన్నవిద్వేషో గ్రంథిమూఢతా,
జాయతే దుర్బలత్వం చ గుల్మినాం మరణాయ చ. 22

తా. గుల్మము క్రమముగవృద్ధిజెంది యుదరమంతయువ్యాపించి అంతర్ధాతువుల ప్రవేశించి శిరలచేకట్టబడి తాబేటివీపువలె ఉన్నతంబై దౌర్బల్యము, అరుచి, హృల్లాసము, దగ్గు, వాంతి, దేనియందిచ్ఛలేకపోవుట, జ్వరము, దప్పి, తంద్రి, పీనస, ఇట్టి లక్షణములుంగలిగినను జ్వరము, శ్వాస, వాంతి, అతిసారము, ఇవిగలిగి పిదప హృదయము నాభి పొత్తికడుపు పాదములు వీటియందు వాపు ఇవిగలిగినపిదప శ్వాస, శూల, దప్పి, అన్నద్వేషము, గుల్మము గనుపించకయుండుట, దుర్బలత్వము ఇట్టి లక్షణములు గలిగియుండినను నది అసాధ్యమని తెలిసికొనవలయును.

## గుల్మవిద్రధులకుండెడి భేదము

నానుబంధోస్తి గుల్మస్య విద్రధిస్సనిబంధనః,
గుల్మస్తిష్ఠతి దోషేషు విద్రధిర్మాంసశోణితే. 23
విద్రధిః పచ్యతే యస్మాత్తస్మాద్గుల్మో న పచ్యతే,

తా. గుల్మవిద్రధులకు భేద మేమనిన గుల్మము నిరాశ్రయము గను విద్రధి ఆశ్రయముగలదిగను నుండు. అదెటులనిన గుల్మము కేవలవాతాదిదోషములవలన జనించు. విద్రధి దుష్టమగుమాంసరక్తముల నాశ్రయించి జనించు. మరియును విద్రధిమాంసరక్త

సంబంధముగలదిగాన పక్వంబగు అదిలేకపోవుటవలన గుల్మము పక్వము కానేరదు, ఇటుల, గుల్మవిద్రధులకు భేదముఁలం దెలిసికొనవలయు.

—॥ వాతగుల్మమునకు విడంగకల్కము ॥—

విడంగం దాడిమం హింగు సైంధవేలాసువర్చలమ్, 24
మాతులుంగరసైః పీతం కర్షైకం సురయా దివా,
వాతగుల్మం హరేత్పీతః ప్రాణనాథో రసోపి వా,

తా. వాయువిడంగములు, దాడింబవోలుపు, ఇంగువ, సైంధలవణము, ఏలకులు, సౌవర్చలవణము వీటినన్నియు కల్కముజేసి యొకకర్షముచొప్పున మద్యముజేర్చిగాని పుచ్చుకొనిన వాతగుల్మము నివర్తించు. లేక ప్రాణనాథరసమును సేవించినను నివర్తించు.

—॥ ద్వంద్వజగుల్మమునకు ద్రాక్షాదికల్కము ॥—

ద్రాక్షాచందనయష్ట్యాహ్వా పద్మకం తండులోదకైః. 25
పిష్ట్వా క్షీరవిదారీం చ సక్షౌద్రాం పాయయేదను,
పంచవక్త్రో రసో దేయో గుల్మే తు కఫవాతజే. 26

తా. ద్రాక్ష, చందనము, యష్టిమధుకము, పద్మకాష్ఠము, నేలగుమ్ముడుగడ్డ వీటిని బియ్యపుకడుగుతోనూరి కల్కముజేసి అందు తేనె చేర్చి పుచ్చుకొనినను పంచవక్త్రరసమును సేవించినను కఫవాతగుల్మము నివర్తించు.

—॥ సన్నిపాతగుల్మమునకు వరుణాదికషాయము ॥—

వరుణాదికషాయస్తు గుల్మం దోషత్రయోత్థితమ్,
హంతి హృత్పార్శ్వశూలాఢ్యం హ్యపిసోపద్రవం ధ్రువమ్. 27

తా. వరుణాదికషాయమును పుచ్చుకొనిన సన్నిపాతగుల్మము, హృదయశూలి పార్శ్వశూల దీనితోగూడి యుపద్రవయుక్తమైనను నిశ్చయముగా హరింమును.

—॥ వరుణాదిగణము ॥—

వరుణో బకపుష్పశ్చ బిల్వాపామార్గచిత్రకాః,
అగ్నిమంథద్వయం శిగ్రుద్వయం చ బృహతీద్వయమ్. 28
సైరేయత్రయం మూర్వా మేషశృంగీకిరాతకః,
అజగంధాచ బింబం చ కరంజశ్చ శతావరీ. 29
వరుణాదిగణోహ్యేషకఫమేదోహరస్మృతః,
హన్తి గుల్మం శిరశ్శూలం తథాభ్యన్తరవిద్రధీమ్. 30

తా. ఉలిమిడిపట్ట, *బకపుష్పి, మాశేడు, ఉత్తరేణు, చిత్రమూలము, చిన్నకూరసెల్లి, పెద్దకూరసెల్లి, కొరుమునగపట్ట, మంచిమునగపట్ట, ములక, వాకుడు, తెల్లగోరింట, నల్లగోరింట, పచ్చగోరింట, చాగదుంప, ఒద్ది, సీమనేలవేము, వావింట చేదుదొండవేరు, కొనుగ, పిల్లిపీచర, ఈదినుసుల వరుణాదిగణమనబడును. ఇది కషాయము బెట్టి పుచ్చుకొనిన కఫమేదోరోగములు, మస్తకశూల, గుల్మము, అన్తర్విద్రధి ఇవి నివర్తించు.

రక్తగుల్మమునకు తిలకషాయము

తిలక్వాథో గుడఘృత వ్యోషభార్గీరజోన్వితః,
పీతో రక్తభవే గుల్మే నష్టే రక్తేచ యోషితః. 31

తా. నువ్వులకషాయమునందు శొంఠి, పిప్పలి, మిరియాలు, గంటుభారంగి వీటి చూర్ణమునువైచి నెయ్యి బెల్లముచేర్చి పుచ్చుకొనిన రక్తగుల్మము స్త్రీలయొక్క నష్టరక్తము ఇవి నివర్తించు.

రక్తగుల్మమునకు శతాహ్వాదికల్కము

శతాహ్వాచిరబిల్వత్వగ్దార్వీభార్గీకణోద్భవః,
కల్కః పీతో హరేద్గుల్మం తిలక్వాథేన రక్తజమ్. 32

తా. పిల్లపీచర, కానుగపట్ట, దాల్చిని, మానిపసుపు, గంటుభారంగి, పిప్పళ్లు దీనికల్కము నువ్వులు కషాయముతో పుచ్చుకొనిన రక్తగుల్మము మానును.

చిత్రకాదికషాయము

చిత్రకగ్రంధికైరండశుంఠీక్వాథః పరంహితః,
గుల్మానాహవిబంధేషు సహింగుబిడసైంధవః. 33

తా. చిత్రమూలము, పిప్పలిమూలము, ఆముదపువేరు, శొంఠి వీటినికషాయము బెట్టి అందు ఇంగువ, బిడాలవణము, సైంధలవణము వీటిని చేర్చిపుచ్చుకొనిన గుల్మము ఆనాహము మలబంధము ఇవి నివర్తించు.

వాతగుల్మమునకు శిఖిబాడబరసము

మారితం సూతతామ్రాభ్రగంధకం మాక్షికం సమమ్,
మర్దయేచ్చిత్రకద్రావైర్వ్యోషక్షారయుతం దినమ్. 34
త్రిగుంజం భక్షయేన్నిత్యం నాగవల్లీదళేన చ,
వాతగుల్మహరః ఖ్యాతో రసోయం శిఖిబాడబః. 35

* రెల్లుకావచ్చునని తోచెడిని.

తా. రసభస్మము, తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధగంధకము, స్వర్ణమాక్షికభస్మము, యవక్షారము వీటినన్నియు సమముగ ఖల్వమునందునిచి, చిత్రమూలరసముచే ౧ దినము మర్దించి, మూడుగుంజములయెత్తు తమలపాకుతో సేవించిన, వాతగుల్మము నశించు.

### పైత్యగుల్మమునకు దండాపరరసము

శుద్ధసూతం సమం గంధం సూతాంశం మృతతామ్రకమ్,
పంచాగ్యాశ్శాకవృక్షస్య ద్రవైర్మర్ద్యం దినత్రయమ్. 36
సర్పాక్ష్యాశ్చ ద్రవైశ్చాపి హ్నా రుద్ధ్వాలఘుపుటే పచేత్,
పంచధా భూధరే వాస్య చూర్ణం నేపాళతుల్యకమ్. 37
ద్విగుంజం భక్షయేచ్చాజ్యైః పిత్తగుల్మప్రశాంతయే,
ద్రాక్షాహారీతకీక్వాథమనుపానం ప్రకల్పయేత్. 38
రసోదండామరో నామ పిత్తగుల్మం నియచ్ఛతి,

తా. శుద్ధరసము, శుద్ధగంధకము, తామ్రభస్మము, వీటిని సమాంశములుగ ఖల్వమునందునిచి, టేకుసమూలరసములచే, 3 దినములు మర్దించి పిదప, సర్పాక్షిరసముతో ౧ దినము మర్దించి, భూధరయంత్రమున లఘుపుటంబిడవలయు. ఇటుల ౫ మార్లు లఘుపుటంబిడి, మరల చూర్ణించి, చూర్ణమునకు సమముగ శుద్ధిచేసిన నేపాళపువిత్తులుజేర్చి మర్దించి, ౨ గుంజములయెత్తు నేతితో నాకి ద్రాక్షకరకపిందెలు వీటికషాయముత్రాగిన పిత్తగుల్మము నివర్తించు.

### శ్లేష్మగుల్మమునకు విద్యాధరరసము

రసో గంధస్తాలకస్తామ్రతాప్యేతుత్థం సర్వం ఖల్వమధ్యే తు పిష్ట్వా. 39
కృష్ణాక్వాథస్నుక్పయోభావితం
వాబొస్త్రైర్యాత్రైర్నామ విద్యాధరస్స్యాత్,
నిష్కార్ధోయం శ్లేష్మగుల్మం నిహన్యా
త్పథ్యం యుక్తం సర్వరోగే ప్రశస్తమ్. 40
ఆదౌ గుల్మే రక్తమోక్షం విధాయ
పొధః కార్యో యోవిధిస్సర్వజే వా,

తా. శుద్ధరసము, శుద్ధగంధకము, తాళకభస్మము, తామ్రభస్మము, సువర్ణమాక్షికభస్మము, తుత్థభస్మము వీటిని సమముగ ఖల్వమునందునిచి, పిప్పలికషాయము, బొంతజముడుపాలు, గోత్రపంచితము, వీటితో ప్రత్యేకము భావనజేసి, అర్ధనిష్కము వంతున తేనతో 3 నెలలు సేవించి యుక్తమగు పథ్యము భుజించిన, శ్లేష్మగుల్మము

నివర్తించు. మొదట సన్నిపాతగుల్మమునందు రక్తమోక్షముజేసి విరేచనాదివిధిని నడిపించి పిమ్మట నీయౌషధమును వాడవలెను.

## గుల్మోదరగజారాతిరసము

సూతగంధకణాపథ్యాతుత్థారగ్వధకాన్ దృషమ్, 41
మర్దయేద్వజ్రిదుగ్ధేన నిష్కార్ధం ఖాదయేద్దినమ్,
గుల్మోదరగజారాతినామ్నా భైరవనిర్మితః. 42
స్త్రీణాం జలోదరం హంతి పథ్యం శాల్యోదనం దధి,
చించాఫలరసస్యాపి పానమస్మిన్ ప్రయోజయేత్. 43

తా. శుద్ధరసము, శుద్ధగంధకము, పిప్పలి, కరక్కాయబోలుపు, తుత్థము, రేలగిజరు వీటిని సమాంశములుగ ఖల్వమునందునిచి, బొంతజెముడుపాలచే నొక దినము మర్దించి, అర్ధమాషమువంతున సేవించిన గుల్మము, ఉదరరోగము, స్త్రీలకు జనించెడి జలోదరము ఇవి నివర్తించు. ఇందుకు పథ్యము, సంబావియ్యపు అన్నము పెరుగు భుజించి, చింతపులుసు పానముజేయవలయు.

## పిత్తగుల్మమునకు ఉద్దామాఖ్యరసము

సూతః కర్షశ్శంఖపుష్ప్యా నీరైస్సర్పాక్ష్యాద్భిః పేషయేద్దస్రమేకమ్,
భూమేఃకుష్ట్యాంపంచధైవం పుటిత్వా యుంజ్యాత్తుల్యం చాస్యశే
పాలచూర్ణమ్. 44
ఉద్దామాఖ్యస్యాస్యద్రసస్సర్పిషాయంగుంజాయుగ్మం పిత్తగుల్మం
నిహంతి,
ద్రాక్షాపథ్యాక్వాథపేవానుపానేవర్జ్యం సర్వం పిత్తలందాహకారి. 45

తా. శుద్ధరసభస్మము ౧ కర్షమెత్తు ఖల్వమునందునిచి శంఖపుష్పి, సర్పాక్షి వీటి రసములతో నొకదినము మర్దించి రసమునకు సమము శుద్ధిచేసిన నేపాళపు గింజల చూర్ణమునుజేర్చి భూపుటంబిడి సాంగశీతలమునదీసి ఇటుల ౫ పుటంబులిడిన రసము సిద్ధమగు. పిదప ౨ గుంజములయెత్తు నేతితో గాని ద్రాక్ష కరక వీటికషాయముతో గాని సేవించి పిత్తకరపదార్థములు దాహకరపదార్థములు వీటిని వర్జించిన పిత్తగుల్మము నివర్తించు.

## గుల్మనారాచరసము

శుద్ధసూతసమం గంధం జేపాలం త్రిఫలాసమమ్. 46
త్రికటుం పేషయేత్క్షౌద్రమిశ్రం గుల్మం లిహన్హరేత్,
ఉష్ణోదకంపిబేచ్చాను నారాచోయం రసోత్తమః. 47

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము, శుద్ధిజేసిన నేపాళములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉశిరికెలు వీటినన్నియు ఖల్వమునందునిచి, తేనెతోనూరి తేనెతో సేవించి పిదప ఉష్ణోదకమును పానముజేసిన గుల్మము నివర్తించు. ఇది నారాచరసము.

### గుల్మకుఠారము

టంకణం పారదం గంధం త్రిఫలావ్యోష తాళకే,
విషం తామ్రం సనేపాళం భృంగద్రావేణ మర్దితమ్. 48
హన్యాద్ గుల్మకుఠారో౽యం గుల్మాంశ్చ క్రిమివాసురాన్,

తా. వెలిగారము, శుద్ధిచేసినపాదరసము, శుద్ధిజేసినగంధకము, త్రిఫలములు, త్రికటుకములు, శుద్ధిజేసినతాళకము, శుద్ధిచేసిననాభి, తామ్రభస్మము, శుద్ధ నేపాళములు ఇవన్నియు సమాంశములు, వీటినన్నియు ఖల్వమునందునిచి, గుంటగలగరాకు రసముచే మర్దించి, కరాటమున నునిచి (చిన్న మెత్తు అనుపానయుక్తముగ) సేవించిన, గుల్మము మానును.

### వాతగుల్మమునకు హింగ్వాదిచూర్ణము

హింగుసైంధవవృక్షామ్లరాజికానాగరై స్సమైః. 49
చూర్ణం గుల్మప్రశమనం స్యాదేతద్ధింగుపంచకమ్,

తా. ఇంగువ, సైంధవలవణము, వృక్షామ్లము, (పులిచింతబెరడు) ఆవాలు, శొంఠి వీటిని సమముగ చూర్ణించి సేవించిన, వాతగుల్మము నివర్తించు.

### పిత్తగుల్మమునకు ద్రాక్షాదిచూర్ణము

ద్రాక్షాభయారసం గుల్మే పైత్తికే సగుడం పిబేత్. 50
సశర్కరం వా విలిహే త్త్రిఫలాచూర్ణముత్తమమ్,

తా. ద్రాక్ష, కరకవొలుపు వీటిరసమునందు బెల్లముచేర్చి పుచ్చుకొనినను, లేక త్రిఫలాచూర్ణమునందు చక్కెరచేర్చి పుచ్చుకొనినను, పిత్తగుల్మము నివర్తించు.

### శ్లేష్మగుల్మమునకు యవానీచూర్ణము

యవానీచూర్ణితం తక్రే బిడేన లవణీకృతం. 51
శ్లేష్మగుల్మే పిబేద్వాతమూత్రవర్చోనులోమనమ్,

తా. ఓమము, బిడాలవణము వీటిని చూర్ణించి మజ్జిగలో కలిపి పుచ్చుకొనిన శ్లేష్మగుల్మము నివర్తించుటయేగాక, మలమూత్రానులోమనమునను జేయు.

### మహాహింగ్వాదిచూర్ణము

హింగుగ్రంథికధాన్య జీరకవచాచవ్యాగ్నిపాఠాశఠీ. 52
వృక్షామ్లం లవణత్రయం త్రికటుకం క్షారద్వయం దాడిమమ్,
పథ్యాపౌష్కరవేతసామ్ల హపుషాజాజ్యస్తదేభిః కృతం. 53
చూర్ణం భావితమేతదార్ద్రికరసైః స్యాద్బీజపూరద్రవైః,
గుల్మాధ్మానగుదాంకురగ్రహిణికోదావర్తసంజ్ఞా గదా. 54
ప్రత్యాధ్మానగదోదరాశ్మరియుతాంస్తూనీద్వయారోచకాన్,
ఊరుస్తమ్భమతిభ్రమం చ మనసో బాధిర్యమష్ఠీలికామ్. 55
ప్రత్యష్ఠీలికయాసహాపహరతిప్రాక్పీతముష్ణాంబునా,
హృత్కుక్షివంక్షణకటీజఠరాన్తరేషు
వస్తిస్తనాంసఫలకేషు చ పార్శ్వయోశ్చ. 56
శూలాని నాశయతి వాతబలాసజాని
హింగ్వాద్యమాద్యమిదమాశ్వినసంహితోక్తమ్,
శ్వాసాశ్చ పక్వాశయజే భవన్తి తథాలసోక్తాని చ లక్షణాని,

తా. ఇంగువ, పిప్పలిమూలము, ధనియాలు, జీలకఱ్ఱ, వస, చవ్యము, చిత్రమూలము, విషబొద్ది, కచ్చూరములు, వృక్షామ్లము, లవణత్రయము, త్రికటుకములు, యవక్షారము, వెలిగారము, దాడింబపోలుపు, కరకపిందెలు, పుష్కరమూలము, పుల్లప్రబ్బలి, బోడతరము, నల్లజీలకఱ్ఱ, వీటిని సమాంశములుగ గ్రహించి చూర్ణించి, అల్లపురసము, మాదీఫలరసము వీటిచే భావనచేసి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన, గుల్మము, ఆధ్మానము, మూలవ్యాధి, సంగ్రహణి, ఉదావర్తము, ప్రత్యాధ్మానము, ఉదరము, అశ్మరి, తూని, ప్రతూని, అరుచి, ఊరుస్తంభము, మనోవిభ్రమము, చెవుడు, అష్ఠీల, ప్రత్యష్ఠీల, హృదయశూల, కుక్షిశూల, గజ్జలయందలిశూల, కటిశూల, జఠలశూల, వస్తిశూల, స్తనజశూల, అంసశూల, పార్శ్వశూల, వాతబలాసము ఇవి యన్నియు నివర్తించు.

### రక్తగుల్మమునకు భార్గ్యాదిచూర్ణము

భార్గీకృష్ణాకరంజత్వక్ గ్రంధికామర దారుజమ్. 57
చూర్ణం తిలానాం క్వాథేన రక్తగుల్మరుజాపహమ్,

తా. భారంగి, పిప్పళ్లు, కానుగపట్ట, పిప్పలిమూలము, దేవదారు, వీటిని సమాంశములుగ చూర్ణించి నువ్వులకషాయమునందు చేర్చి పుచ్చుకొనిన రక్తగుల్మము నివర్తించు.

### తిలమూలాదిచూర్ణము

తిలమూలం చ శిగ్రుం చ బ్రహ్మదండీయమూలకమ్. 58
మధుయష్టీత్రికటుకై ర్యుతం చూర్ణముపాసితమ్,
పుష్పరోధేరక్తగుల్మే స్త్రీణాం సద్యస్సుఖావహామ్. 59

తా. నువ్వుచెట్టు వేరు, మునగవేరు, బ్రహ్మదండివేరు, యష్టిమధుకము, త్రికటుకములు వీటిని చూర్ణించి సేవించిన స్త్రీలయొక్క నష్టపుష్పములు రక్తగుల్మము ఇవి నివర్తించు.

### అగ్నిముఖచూర్ణము

హింగుభాగో భవేదేకో వచా చ ద్విగుణా భవేత్,
పిప్పలీ త్రిగుణా జ్ఞేయా శృంగబేరం చతుర్గుణమ్. 60
యవానికాపంచగుణాషడ్గుణాచ హారీతకీ,
చిత్రకం సప్తగుణితం కుష్ఠం చాష్టగుణం భవేత్. 61
ఏతద్వాతహరం చూర్ణం పీతమాత్రం ప్రసన్నయా,
పిబేద్దధ్నా మస్తు నావాసురయా కోష్ణవారిణా. 62
ఉదావర్తమజీర్ణం చ ప్లీహానముదరం తథా,
అంగాని యస్య శీర్యంతే విషం వా యేన భక్షితమ్. 63
అర్శోహరో దీపనశ్చ శూలఘ్నో గుల్మనాశనః,
చూర్ణోహ్యగ్నిముఖో నామ్నా న క్వచిత్ప్రతిహన్యతే. 64

తా. ఇంగువ ౧ భాగము, వస ౨ భాగములు, పిప్పలి ౩ భాగములు, శొంఠి ౪ భాగములు, ఓమము ౫ భాగములు, కరకవొలుపు ౬ భాగములు, చిత్రమూలము ౭ భాగములు, కోష్ఠువు ౮ భాగములు, వీటినన్నియు చూర్ణించి, పెరుగుమీదితేట, సారాయి, కొంచము ఉష్ణముగనుండు నుదకము, వీటిలో నేదినిచేనైనను పుచ్చుకొనిన, ఉదావర్తము, అజీర్ణము, ప్లీహ, ఆసాహాము, ఉదరము, అవయవములు కుషిక్కించుట, విషభక్షణమువలన గలిగినదోషము, అర్శస్సు, శూల, గుల్మము, కాస, శ్వాస, క్షయ, ఇవియన్నియు నివర్తించుటయేగాక, దీపనము సహితము గలుగును. ఇది యగ్నిముఖచూర్ణ మనబడు.

### చిత్రకాదిచూర్ణము

చిత్రకో నాగరం హింగుపిప్పలీపిప్పలీ జటా,
చవ్యాజమోదామరిచం ప్రత్యేకం కర్షసమ్మితమ్. 65
స్వర్జికాచయవక్షార స్సింధుసౌవర్చలం బిడమ్,

సాముద్రకం రోమకం చ కోలమాత్రాణి కారయేత్. 66
ఏకీకృత్యాఖిలం చూర్ణం భావయేన్మాతులుంగజైః,
రసైర్దాడిమజైర్వాపి శోషయేదాతపేన చ. 67
ఏతచ్చూర్ణం జయేద్గుల్మం గ్రహణీమామజాం రుజమ్,
అగ్నిం చ కురుతే దీప్తం రుచికృత్కఫనాశనమ్. 68

తా. చిత్రమూలము, శొంఠి, ఇంగువ, పిప్పలి, పిప్పలిమూలము, చవ్యము, అజామోదము, మిరియాలు, ఇవి ప్రత్యేకము ౧ కర్షము, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సాముద్రలవణము, రోమకలవణము (చవిటిఉప్పు) ఇవిప్రత్యేకము కోలప్రమాణము ఇవియన్నియు చూర్ణించి, మాదీఫలరసము, దాడింబవిత్తులరసము, వీటిచే భావనజేసి, యెండించి సేవించిన గుల్మము, గ్రహణి, ఆమరోగము, కఫము, వీనిని నశింపజేయుటయేగాక, అగ్నిదీప్తి రుచి, వీటిని సగా గలుగంజేయు.

పూతీకాదిచూర్ణము

పూతీకపత్రగజచిర్భటచవ్యవహ్ని
వ్యోషం చ యుక్తరచితం లవణోపధానమ్,
దధ్నా విచూర్ణ్య దధిమస్తుయుతం ప్రయోజ్యం
గుల్మోదరశ్వయథుపాండుగదోద్భవేషు. 69

తా. కంపుకానుగఆకులు, పాపరబుడమవేరు, చవ్యము, చిత్రమూలము, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము వీటిని సమభాగములుగ చూర్ణించి పెరుగు, పెరుగుమీదితేట వీటితో సేవించిన, గుల్మము, ఉదరము, వాపు, పాండువు ఇవి నివర్తించు.

హస్తికర్ణ్యాదిచూర్ణము

తక్రైర్గుల్మోదరహరీ హస్తికర్ణీ చ కర్షికా,
తిలమూలకషాయేణ బ్రహ్మదండ్యాస్తు మూలకమ్. 70
యష్టీ త్రికటుచూర్ణం చ యుక్తం పానేథ గుల్మజిత్,

తా. బలరక్కసిగడ్డ ౧ కర్షము మజ్జిగతో నూరి పుచ్చుకొనిన, గుల్మోదరములు హరించు. బ్రహ్మదండివేరు, యష్టిమధుకము, త్రికటుకములు వీటిని చూర్ణించి నువ్వువేరు కషాయమునందు సేవించినను గుల్మము నివర్తించు.

## క్షారాదిచూర్ణము

క్షారద్వయానలవ్యోషనీలీలవణపంచకమ్. 71
చూర్ణితం సర్పిషా పేయం సర్వగుల్మోదరాపహమ్,

తా. సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలము, శొంఠి, పిప్పలి, మిరియాలు, నీలిచేరు, పంచలవణములు వీటినన్నియు చూర్ణించి నెయ్యితో సేవించిన సర్వగుల్మములు, ఉదరము వీనిని నివర్తింపజేయు.

## దన్త్యాదిఘుటికలు

దన్తిహింగుయవక్షారా లాబుబీజం కణా గుడః. 72
స్నుహిక్షీరేణ గుటికా సర్వేషాం కర్షమాత్రికా,
భక్షితా రక్తగుల్మఘ్నీ రుధిరస్రావకారిణీ. 73

తా. దంతివేళ్లు, ఇంగువ, యవక్షారము, సొరవిత్తులు, పిప్పళ్లు వీటిని చూర్ణించి బెల్లముజేర్చి బొంతజముడుపాలతో నూరి కర్షప్రమాణము మాత్రలు జేసి అందొకమాత్ర చొప్పున సేవించిన రక్తగుల్మము నివర్తించుటయేగాక రుధిర స్రావమునుం జేయు.

## పారదాదిఘుటికలు

పారదం శిఖితుత్థం చ జేపాలం గంధకం సమమ్,
ఆరగ్వధఫలం కృష్ణాం వజ్రక్షీరేణ మర్దయేత్. 74
మాషమాత్రాం వటీం ఖాదేత్ స్త్రీణాం గుల్మోదరప్రణుత్,

తా. శుద్ధిచేసిన పాదరసము, శుద్ధిజేసిన మైలుతుత్తము, శుద్ధిసేసిన నేపాళములు, శుద్ధిజేసినగంధకము, రేలగిజరు, పిప్పళ్లు వీటినన్నియు సమభాగములుగ ఖల్వమునందునిచి బొంతజెముడుపాలతో మర్దించి మాషమాత్రము వటికలుజేసి అందొకమాత్ర చొప్పున భక్షించిన స్త్రీలయొక్క గుల్మోదరము మానును.

## శఠ్యాదికాంకాయనగుటికలు

శఠీం పుష్కరమూలం చ దన్తీంచిత్రకమాఢకీమ్. 75
శృంగిబేరం వచాం చైవ పలికాని సమాహరేత్.
త్రివృతాయాః పలం చైవ కుర్యాత్త్రీణి చ హింగునః. 76
యవక్షారం పలే ద్వే చ పలే చామ్లవేతసమ్,
యవాన్యజాజీమరిచం ధాన్యకం చేతి కార్షికమ్. 77
ఉపకుల్యాజమోదాభ్యాం తథాచాష్టమికామపి,

మాతులుంగరసోపేతాం గుటికాం కారయేద్భిషక్. 78
తాసాం త్వేకాపిబేద్ద్వే వా తిస్రోవాథ సుఖాంబునా,
అమ్లైశ్చ మద్యైర్యూషైశ్చ ఘృతేన పయసాథవా. 79
ఏషా కాంకాయనేనోక్తా గుటికా గుల్మనాశనీ,

తా. కచ్చూరములు, పుష్కరమూలము, నేపాళములు, చిత్రమూలము, తువరిమన్ను, శొంఠి, వస, తెగడ, ఇవి ప్రత్యేకము ౧ పలము; ఇంగువ 3 తులములు, యవక్షారము, అమ్లవేతసము ఇవి ప్రత్యేకము ౨ పలములు; ఓమము, జీలకఱ్ఱ, మిరియాలు, ధనియాలు ఇవి ప్రత్యేకము ఒకకర్షము; పిప్పలిచూర్ణము, అజామోద చూర్ణము ఇవి ౮ పలములు; వీటిసన్నిటిని మాదీఫలరసముచే మర్దించి మాత్రలుచేసి అందొకమాత్రగాని, రెండుగాని, మూడుగాని, ఉష్ణోదకముతో గాని అమ్లవర్గముతో గాని, మద్యముతో గాని, యూషము, ఘృతము, పాలు వీటితో గాని పుచ్చుకొనిన గుల్మము నివర్తించు. ఇది కాంకాయనమునిచే జెప్పబడిన కాంకాయనగుటికయనబడు.

యవాన్యాదిగుటికలు

యవానీజీరకం ధాన్యం మరిచం గిరికర్ణికా. 80
అజమోదోపకుంచ్యో చ చతుశ్శాణం పృథక్ పృథక్,
హింగుషట్ శాణకం కార్యం శాణం లవణపంచకమ్. 81
త్రివృతాష్టమితైశ్శాణైః ప్రత్యేకం కల్పయే త్సుధీః.
దన్తీ శఠీ పౌష్కరం చ విడంగం దాడిమం శివా. 82
చిత్రామ్లవేతసశ్శుంఠీ శాణైష్షోడశభిః పృథక్,
బీజపూరరసేనైషాం గుటికాం కారయేద్బుధః. 83
ఘృతేన పయసా చామ్లరసైరుష్ణోదకేన వా,
పిబేత్కాంకాయనప్రోక్తా గుటికా గుల్మనాశినీ. 84
మద్యేన వాతికం గుల్మం గోక్షురేణ చ పైత్తికమ్.
మూత్రేణ కఫగుల్మం చ దశమూలైస్త్రిదోషజమ్. 85
ఉష్ట్రీదుగ్ధేన నారీణాం రక్తగుల్మం నివారయేత్,
హృద్రోగం గ్రహణీశూలం క్రిమునర్శాంసి నాశయేత్. 86

తా. ఓమము, జీలకఱ్ఱ, ధనియాలు, మిరియాలు, తెల్లగంటెన, అజామోదము, సన్నయాలకులు ఇవి ప్రత్యేకము నాలుగుశాణములు, ఇంగువ ఆరు శాణములు, పంచలవణములు ప్రత్యేకము ౧ శాణము, తెల్లతెగడ ౮ శాణములు, నేపాళ

ములు, కచ్చూరములు, పుష్కరమూలము, వాయువిడంగములు, దాడింబపోలుపు, పుళిరికపోలుపు, పిప్పలి, అమ్లవేతసము, శొంఠి ఇవిప్రత్యేకము ౧౽ తూణ ములు వీటినన్నియు; నేకముగజేర్చి చూర్ణించి మాదీఫలరసముతో మర్దించి మాత్రలుజేసి అందొకమాత్రచొప్పున నెయ్యి, పాలు, ఆమ్లరసము, ఉష్ణోదకము వీటిలో దేనితోనైననుపుచ్చుకొనిన, గుల్మము నివర్తించు. మరియు మద్యముతో సేవించిన వాతగుల్మము, పల్లేరువేళ్లకషాయముతో పుచ్చుకొనిన పైత్యగుల్మము, గోమూత్రముతో పుచ్చుకొనిన కఫగుల్మము, దశమూలకషాయముతో పుచ్చుకొనిన సన్నిపాతగుల్మము, ఒంటెపాలతో సేవించిన స్త్రీలయొక్కరక్తగుల్మము, హృద్రోగము, గ్రహణిశూల, క్రిమి, అర్శస్సు ఇవి నశించు.

—॥ నాగాదిగుటికలు లేక గుల్మకుఠారము ॥—

నాగవంగాభ్రకం కాన్తం సమం తామ్రం సమాంశకమ్,
జంబీరస్వరసైర్ఘృష్ట్వా వటీగుంజాప్రమాణికా. 87
మధునార్ద్రకనీరేణ క్షారయుగ్మేన సేవితా,
అజీర్ణమమ్లపిత్తం చ హృత్పార్శ్వోదరశూలకమ్. 88
నామ్నా గుల్మకుఠారోఽయం సర్వాన్గుల్మాన్వ్యపోహతి,

తా. నాగభస్మము, వంగభస్మము, అభ్రకభస్మము, కాన్తభస్మము ఇవి సమములు వీటికన్నిటికి సమం తామ్రభస్మము, వీటిని ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముతో నూరి గురిగింజలంత గుళికలుజేసి అందొకగుళికచొప్పున సర్జక్షారము, యవక్షారము వీటిని చూర్ణించి అల్లపురసము తేనె చేర్చి ఈ అనుపానముతో సేవించిన అజీర్ణము, ఆమ్లపిత్తము, హృదయశూల, పార్శ్వశూల, ఉదరశూల, సర్వగుల్మములు నివర్తించు.

—॥ చించాశంఖ వటికలు ॥—

చించాక్షారం స్నుహీక్షారమర్కక్షారం పలం పలమ్. 89
ద్విపలం శంఖభూతిం చ రామఠం చ పలార్ధకమ్,
లవణాని చ సర్వాణి పలమాత్రాణి యోజయేత్. 90
క్షారద్వయం పలార్ధంచ సర్వమేకత్ర చూర్ణయేత,
జంబీరకరసైర్మర్ద్య మనలేన దినత్రయమ్. 91
భృంగరాజస్య నిర్గుండీముండ్యోశ్చైవ ద్రవైః పృథక్,
ఆర్ద్రకస్య రసేనైవ ప్రత్యేకం మర్దయేద్దినమ్. 92
బదరీబీజమాత్రాం తు వటికాం కారయేద్భిషక్,

ఏకైకాం భక్షయేత్ప్రాతః పంచగుల్మాన్వ్యపోహతి. 93
సర్వశూలం నిహన్త్యాశు హ్యజీర్ణం చ విషూచికామ్,
మందాగ్నిం నాశయేచ్ఛీఘ్రం పథ్యం తైలామ్లవర్జితమ్. 94
చించాశంఖవటీనామ్నా గ్రహణీరోగహృత్పరా,

తా. తింత్రిణీక్షారము, బొంతజెముడుక్షారము, జిల్లేడుక్షారము వీటిని ప్రత్యేకము ౧ పలము, శంఖభస్మము ౨ పలములు, ఇంగువ అరపలము, పంచలవణములు ప్రత్యేకము ౧ పలము, యవక్షారము, సర్జక్షారము ఇవి ప్రత్యేకము అరపలము వీటి నన్నియు ఖల్వమునందునిచి చూర్ణించి నిమ్మపండ్లరసముచే మర్దించి పిదప చిత్రమూల కషాయముతో మూడుదినములు మర్దించి గుంటగలగర, వావిలి, నేలతాడిగడ్డలు, అల్లము వీటిరసములతో ప్రత్యేకము ఒక్కొకదినము భావనజేసి రేగుగింజలంత మాత్రలుజేసి యొక్కొక్కమాత్ర చొప్పున ప్రాతఃకాలమునందు సేవించిన పంచ గుల్మములు, సర్వశూలలు, అజీర్ణము, విషూచిక, మందాగ్ని, గ్రహణిరోగము ఇవి నివ ర్తించు. దీనికి పథ్యము నూనె పులుసు వీటిని వర్జించవలయు.

### శంఖద్రావకము

స్ఫటికం పలమేకం చ సైంధవం పలమేవ చ. 95
ద్విపలం యవజక్షారం ద్విపలం నవసాగరమ్,
చతుఃపలం సురాక్షారం కాసీసంచ పలార్ధకమ్. 96
డమరూయంత్రయోగేన ఛుల్ల్యాం సై బదరీం ధనైః,
సాధయేల్లాఘవాత్తూర్ణం శంఖద్రావరసః పరః. 97
గుల్మాదిసర్వరోగేషు దేయస్సర్వసుఖప్రదః,

తా. పటిక ౧ పలము, సైంధవలవణము ౧ పలము, యవక్షారము ౨ పలములు, నవాసారము ౨ పలములు, సురాక్షారము ౪ పలములు, కాసీసము ౪ పలము వీటిని డమరూయంత్రమునందునిచి పొయిమీద బెట్టి, రేగుకట్టెలచే మంటవేసి, లాఘవముగ ద్రావకమును దించుకొని దానినిసేవించిన, గుల్మాదిసర్వరోగములు నివర్తించి సుఖమును గలుగంజేయు.

### అన్యచ్చ

సైంధవం చ యవక్షారం నవసారంతథైవచ. 98
ప్రత్యేకం ద్విపలం గ్రాహ్యం సురాక్షారం చతుఃపలమ్,
స్ఫటికం పలమేకం చ కాసీసంచ పలార్ధకమ్. 99

సర్వమేకత్ర సంయోజ్యం డమరూయంత్రమధ్యగే,
శుల్వాం ప్రరోహయేత్తత్తు జ్వాలయేత్తది రేంధనైః. 100
ద్రావితం తత్సమాదాయ తేజోరూపం జలప్రభమ్,
ద్రావయేదఖిలాన్ ధాతూన్ వరాటాంశ్చ న సంశయః. 101
శంఖద్రావరసో నామగుల్మోదరహరః పరః,

తా. సైంధవలవణము, యవక్షారము, నవాసారము ఇవిప్రత్యేకము ౨ పలములు, సురాకారము ౪ పలములు, పటిక ౧ పలము, కాసీసము ౪ పలము వీటి నన్నియు నేకముగజేర్చి, డమరూయంత్రమధ్యమునవైచి, పొయిమీద నునిచి, చంద్రకఱ్ఱలచే మంటవైచి క్రమముగ ద్రావకమునుదీసిన, అది స్వచ్ఛముగ నీరువలెనుండు. అది అఖిలధాతువులను, గవ్వలు మొదలైనవాటిని ద్రవింపజేయు. దీనిని సేవించిన గుల్మోదరములు నివర్తించు.

## వాతగుల్మమునకు హపుషాదిఘృతము

హపుషాజాజిపృథ్వీకా పిప్పలీమూలచిత్రకైః. 102
క్షీరమూలక కోలానాం రసైశ్చ విపచేద్ఘృతమ్,
వాతగుల్మారుచిశ్వాసశూలా నాహజ్వరార్శసామ్. 103
గ్రహణీయోనిదోషాణాం ఘృతమేతన్నివారకమ్,

తా. బోడతరము, జీలకఱ్ఱ, పెద్దయాలకులు, మోడి, చిత్రమూలము వీటినికషాయము, పాలు, రేగుఆకు రసము, నెయ్యి వీనినిచేర్చి ఘృతపాకముగవండి సేవించిన వాతగుల్మము, అరుచి, శ్వాస, శూల, ఆనాహము, జ్వరము, అర్శస్సు, గ్రహణి, యోనిదోషము ఇవియన్నియు నివర్తించు.

## హింగ్వాదిఘృతము

హింగుసౌవర్చలత్ర్యూషసింధుదాడిమబీజకైః. 104
పుష్కరాజాజిధాన్యాకై రమ్లవేతసచిత్రకైః,
అశ్వగంధావచాభిశ్చ నిర్గుండీసకచూరకైః. 105
పృథక్చూర్ణైః కర్షమితైః ప్రస్థం చైవ ఘృతం పచేత్,
యావద్ఘృతావశేషం స్యాత్ పలార్ధమనుశీలయేత్. 106
వాతగుల్మం చ శూలం చాప్యానాహం చ వినాశయేత్,

తా. ఇంగువ, సౌవర్చలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, దాడింబవిత్తులు, పుష్కరమూలము, జీలకఱ్ఱ, ధనియాలు, అమ్లవేతసము, చిత్రమూ

లము, పెన్నేరుగడ్డ, వస, వావిలి, కచ్చూరములు వీటినన్నియు ప్రత్యేకము ౧ కర్షము చూర్ణించి, ప్రస్థము నెయ్యియందువైచి, నెయ్యి మిగులునటుల ఘృతపక్వముగ కాచి, అరపలమువంతున పుచ్చుకొనిన, వాతగుల్మము, శూల, ఆనాహము ఇవి నివర్తించు.

## పిత్తగుల్మమునకు ద్రాక్షాదిఘృతము

ద్రాక్షామధుకఖర్జూర విదారీః సశతావరీః. 107
పరూషకాణి త్రిఫలాం సాధయేత్పలసమ్మితాః,
జలాఢకే పాదశేషే. రసమామలకస్య చ. 108
ఘృతమిక్షురసం క్షీరమభయాకల్కపాదికమ్,
సాధయేచ్చ ఘృతం సిద్ధం శర్కరాక్షౌద్రపాదికమ్. 109
ప్రయోజ్యం పిత్తగుల్మఘ్నం సర్వగుల్మవికారనుత్,

తా. ద్రాక్ష, యష్టిమధుకము, ఖర్జూరము, నేలగుమ్ముడు, చల్లపిల్లిగడ్డలు, చిట్టీత, త్రిఫలములు వీనినన్నియు ప్రత్యేకము ౧ పలముచొప్పున ఒక ఆఢకప్రమాణముదకమునందువైచి నాలవపాలు మిగులునటుల కషాయముకొాచి అందు ఉసిరికెపండ్ల రసము, నెయ్యి, చెరుకురసము, పాలు, కరక్కాయకల్కము, చక్కెర వీటిని పైకషాయమునకు ప్రత్యేకము నాలవపాలుచేర్చి, ఘృతపక్వముగ కాచి నాలవపాలు తేనెచేర్చి కలిపి పుచ్చుకొనిన పిత్తగుల్మము, సర్వగుల్మములు నివర్తించు.

## త్రాయమాణఘృతము

జలే దశగుణే క్వాథ్యం త్రాయమాణా చతుఃపలమ్. 110
పంచభాగావశిష్టంతుకల్కైస్సంయోజ్య కార్షికైః,
రోహిణీ కటుకా ముస్తాత్రాయమాణా దురాలభా. 111
ద్రాక్షా తామలకీ వీరాజీవన్తీ చందనోత్పలైః,
రసస్యామలకానాం చ క్షీరస్య చ ఘృతస్య చ. 112
పలానిపృథగష్టాష్టౌసమ్యగ్దత్వావిపాచయేత్,
పిత్తగుల్మం రక్తగుల్మం విసర్పం పిత్తజం జ్వరమ్. 113
హృద్రోగం కామలాం కుష్ఠం హన్యాదేతద్ఘృతోత్తమమ్,

తా. కలుగ్రానుగు ౪ పలములు, ౪౦ పలముల నీళ్లయందునిచి అయిదవ భాగము మిగులునటుల కషాయముకొాచి వడియగట్టి అందు కరకహింజలు కటుకరోహిణి, తుంగముస్తలు కలుగ్రానుగు, దూలగొండి, ద్రాక్ష, నేలయుసిరికె కలబంద, తిప్పతీగె, చందనము, కలువదుంప యీఔషధములను ప్రత్యేకము ౧ తులము

చొప్పున చేర్చి కల్కముజేసి అల్లపురసము నెయ్యి పాలు వీనిని ప్రత్యేకము ౮ పలములుచేర్చి ఘృతము మిగులునటుల కాచి సేవించిన పిత్తగుల్మము, రక్తగుల్మము, విసర్పి, పిత్తజ్వరము, హృద్రోగము, కామిల, కుష్ఠు ఇవి నివర్తించు.

⸻ కఫగుల్మమునకు పిప్పలీఘృతము ⸻

పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరైః. 114
పలికైస్సయవక్షారైః ఘృతప్రస్థం విపాచయేత్,
క్షీరప్రస్థేన తత్సర్పిర్హన్తిగుల్మం కఫాత్మకమ్. 115
గ్రహణీపాండురోగఘ్నం ప్లీహాకాసజ్వరాపహమ్,

తా. పిప్పలి, పిప్పలిమూలము, చవ్యము, చిత్రమూలము, శొంఠి వీనిని ప్రత్యేకము ౧ పలమువంతున జేర్చి అష్టమాంశము మిగులునట్లుగ కాచి అందు నెయ్యి యవక్షారము పాలు వీనిని ప్రత్యేకము ౧ ప్రస్థముచేర్చి ఘృతపక్వముగ కాచి సేవించిన కఫగుల్మము, గ్రహణి, పాండురోగము, ప్లీహ, కాస, జ్వరము ఇవి నివర్తించు.

⸻ గుల్మోదరమునకు షట్పలఘృతము ⸻

షడ్భిః పలైర్మగధజాఫలమూలచవ్య విశ్వౌషధజ్వలనయావకకల్క-
పక్వమ్. 116
ప్రస్థం ఘృతస్యదశమూల్యురుబూకభార్జీక్వాథపిగోపయసి
దధ్ని చ షట్పలాఖ్యమ్,
గుల్మోదరారుచిభగందరవహ్నిమాంద్యకాసజ్వరక్షయశిరోగ్రహ
జాన్వికారాన్. 117
సద్యశ్శమం నయతి యే చ కఫానిలోత్థాస్సర్పిస్తు షట్పలమిదం
ప్రవదన్తి తజ్జ్ఞాః,

తా. పిప్పలి, పిప్పలిమూలము, చవ్యము, శొంఠి, చిత్రమూలము, యవక్షారము వీనిని ప్రత్యేకము ౧ పలమువంతున జేర్చి కల్కముజేసి యీకల్కము, నెయ్యి ఒక ప్రస్థము, దశమూలములు ఆముదపువేరు గంటుభారంగి వీటికషాయము, పాలు ప్రత్యేకము ౬ ప్రస్థములు, వీనినన్నియు నేకముగజేర్చి ఘృతపక్వముగవండి సేవించిన పెరుగు ఇవి గుల్మము, ఉదరము, అరుచి, భగందరము, అగ్నిమాంద్యము, కాస, జ్వరము, క్షయ, శిరశ్శూల, కఫవాతజనితవ్యాధులు ఇవి నివర్తించు.

⸻ స్నుహీక్షీరాదిఘృతము ⸻

స్నుహీక్షీరం పలే ద్వే తు ప్రస్థార్ధం చైవ సర్పిషః. 118

కంపిల్లం పలమేకం తు పలార్ధం సైంధవస్య చ,
త్రివృతాయాః పలం చైకం ధాత్ర్యాః కుడుపమేవ చ. 119
తోయప్రస్థేన విపచేచ్చైవం మృద్వగ్నినా భిషక్,
కర్షప్రమాణం దాతవ్యం జఠరప్లీహగుల్మినే. 120
తథా కఫజరోగేషు యుంజీత మతిమాన్భిషక్,
ఏతద్గుల్మాన్ సమీరోత్థాన్ నిహన్తి సపరిగ్రహాన్. 121
నిహన్త్యేష ప్రయుక్తోఽపి వాయుర్జలధరానివ,
పంచగుల్మవధోపాయః సర్పిరేతత్ప్రకీర్తితమ్. 122
సర్వాసురవధార్థాయ యథా వజ్రం సురప్రభోః,

తా. బొంతజెముడుపాలు ౨ పలములు, నెయ్యి ౭ పలములు, కంపిల్లము ౨ పలములు, సైంధవలవణము ౪ పలము, తెగడ ౧ పలము, ఉశిరికెవోలుపు ౮ పలములు వీనిని ౧౬ పలముల నీళ్లయందువైచి మృదాగ్నిచే ఘృతపక్వముగవండి పిదప కర్షప్రమాణమువంతున సేవించిన ఉదరము, ప్లీహ, గుల్మము, కఫరోగము, వాతగుల్మములు మొదలగు పంచగుల్మములు ఇవి అన్నియు నివర్తించు.

## కుష్ఠాదితైలము.

శ్వేతకుష్ఠం తథా హింగు ప్రతినిష్కద్వయం ద్వయమ్. 123
క్షారం తత్త్రిఫలాచూర్ణం దశభాగం సుచూర్ణితమ్,
కల్కం గోక్షీరతః పిష్ట్వా పూర్వం తైలం స్నుహీప్లుతమ్. 124
పచేత్తైలావశేషం తు పిబేన్నిష్కద్వయం ద్వయమ్,
విరేకాన్తే తు తక్రేణ శాల్యన్నం భోజయేల్లఘు. 125
చతుర్దినాన్తే దాతవ్యమిదం తైలం న నిత్యశః,
గుల్మం జలోదరం ప్లీహం శూలంచ శ్వయథుం జయేత్. 126

తా. తెల్లచెంగల్వకోష్టు ౧ భాగము, ఇంగువ ౧ భాగము, కుంపట్లగడ్డలు ౧ భాగము, త్రిఫలచూర్ణము ౧౦ భాగములు, వీనిని గోమూత్రముతో కల్కముజేసి అందు నూనె బొంతజెముడుపాలుజేర్చి తైలము మిగులునట్టుల కాచి రెండునిష్కములు పానముజేసిన భేదులగు. పిదప శాల్యన్నమును మజ్జిగతో లఘువుగ భుజింపవలయును. ఇటుల నాలుగుదినముల కొకపర్యాయము పుచ్చుకొనవలయును. ప్రతిదినము తీసుకొనందగదు. ఇటులంజేసిన గుల్మము, జలోదరము, ప్లీహ, శూల, వాపు ఇవి నశించు.

### దశమూలాదితైలము

దశమూలకణా ద్రాక్షా శ్యామా ధాత్రీ పలం పలమ్,
ప్రస్థమేరండతైలస్య ప్రస్థషట్కం గవాం పయః. 127
పచేత్తైలావశేషం తు తత్తైలం కఫగుల్మనుత్,

తా. దశమూలములు, పిప్పళ్లు, ద్రాక్షు, కరక్కాయ, ఉశిరికెవొలుపు వీనిని ప్రత్యేకము ౧ పలముచేర్చి కషాయముకాచి అందు ఆముదము ౧౬ పలనులు, ఆవుపాలు ౯౬ పలములుజేర్చి తైలము మిగులునటుల కాచి సేవించిన కఫగుల్మము నివర్తించు.

### సైంధవాదితైలము

సైంధవం చిత్రకం దంతీ శక్రాహ్వాం చ పలం పలమ్. 128
ద్వాత్రింశత్పలగోమూత్రైః పచేదష్టావశేషకమ్,
కషాయస్య సమం తైలం క్షిప్త్వా తం చ విపాచయేత్. 129
తైలావశేషముత్తార్య మనుపానైః పిబేత్సదా,

తా. సైంధవలవణము, చిత్రమూలము, నేపాళములు, కొడిశపాల వీనిని ప్రత్యేకము ౧ పలమువంతునను, ౩౦ పలముల గోమూత్రమునందువైచి యెనిమిదవ పాలు మిగులునటుల కాచి కషాయమునకు సమము తైలముజేర్చి తైలము మిగులు నటుల కాచి అనుపానయుక్తముగ పుచ్చుకొనిన గుల్మరోగము నివర్తించు,

### గుల్మమునకు పథ్యములు

స్నేహాస్స్వేదో విరేకశ్చ వస్తిర్బాహుశిరావ్యథః. 130
లంఘనం వర్తిరభ్యంగః స్నేహాపక్వే తు పాటనమ్,
సంవత్సరసముత్పన్నాః కలమా రక్తశాలయః. 131
ఖండః కులుత్థయూషశ్చ ధన్వమాంసరసస్సురా,
గవామజాయాశ్చ పయో మృద్వీకా చ పరూషకమ్. 132
ఖర్జూరం దాడిమం ధాత్రీ నాగరం చామ్లవేతసమ్,
తక్రమేరండతైలం చ లశునం బాలమూలకమ్. 133
పత్తూరో వాస్తుకం శిగ్రు యవతిక్తో హరీతకీ,
రామఠం మాతులుంగం చ త్ర్యూషణం సురభీజలమ్. 134
యదన్నం స్నిగ్ధముష్ణం చ బృంహణం లఘుదీపనమ్,
వాతానులోమనం చైవ పథ్యం గుల్మే నృణాం భవేత్. 135

తా. స్నేహము, చమటదీయుట, విరేచనము, వస్తికర్మ, బాహుశిరావేధ,

లంఘనము, గుదవర్తి, అభ్యంగము, స్నేహపానముచే పక్వమైనపిదప శస్త్రకర్మను జేయుట, మరియు, సంవత్సరముగడచిన యెఱ్ఱబియ్యపుఅన్నము, ఖండశర్కర, ఉలవలయూషము, ఆరణ్యజంతుమాంసరసము, మద్యము, ఆవుపాలు, మేకపాలు, ద్రాక్ష, ఫాలసాపండు, ఖర్జూరము, దాడింబపండు, ఉసిరికెవొలుపు, శొంఠి, అమ్లవేతసము, మజ్జిగ, ఆముదము, వెల్లుల్లి, లేతముల్లంగి, మొగ్గుబచ్చలి, చకోరపుకూర, మునగకాయ, యవక్షారము, కరక, ఇంగువ, మాదీఫలము, త్రికటుకములు, గోమూత్రము, మరియు స్నిగ్ధము ఉష్ణము బృంహణము లఘువు దీపనము ఇవిగలఅన్నములు వాతానులోమనము ఇవి గుల్మరోగమునందు పథ్యములని తెలియవలయు.

### అపథ్యములు

వాతకారీణి సర్వాణి విరుద్ధాన్యశనానిచ,
వల్లూరం మూలకం మత్స్యం మధురాణి ఫలానిచ. 136
శుష్కం శాకం శమీధాన్యం విష్టంభీని గురూణిచ,
అధోవాయుశ్శకృన్మూత్ర వేగమస్రువిధారణమ్. 137
వమనం జలపానం చ గుల్మరోగీ పరిత్యజేత్,

తా. వాతకరములగు సర్వపదార్థములు, విరుద్ధములగుఅన్నములు, శుష్కమాంసము, ముదర ముల్లంగి, మత్స్యములు, మధురములగుఫలములు, శుష్కశాకములు, ద్విదళధాన్యము, మలబద్ధకరములగు అన్నములు, గురుకరాన్నములు, అధోవాయువు, మలము మూత్రము కన్నీరు వీటివేగనిరోధము, వమనము, మిక్కిలి జలపానము వీటిని గుల్మరోగి విడువవలయు.

---

# హృద్రోగప్రకరణమ్.

### హృద్రోగకర్మవిపాకము

ఉదక్యా వీక్షితం భుక్త్వా జాయతే క్రిమిలోదరః,
గోమూత్రయావకాహారస్సప్తరాత్రేణ శుధ్యతి. 1

తా. బహిష్ఠయైనస్త్రీచే చూడబడిన అన్నమును భుజించినవాడు ఉదరమధ్యమున క్రిములుగలవాడుగ జనించు. ఇదియ హృద్రోగమనంబడు. తన్నివృత్తికై ఏడుదినములు గోమూత్రమునందు యవలను పచనజేసి భుజించవలయు.

అన్యచ్చ—
అభక్ష్యభక్షణే చైవ జాయన్తే కృమయో హృది,
అథవా తద్విశుద్ధ్యర్థ ముపోష్యం భీష్మపంచకమ్. 2

తా. అభక్ష్యపదార్థభక్షణముచే సగా ఉదరమున క్రిములుగలుగు. అది నివర్తించుటకై భీష్మపంచకమునను ఉపవాసమునుం జేయవలయు.

అన్యచ్చ—
గజే చ నిహతే వాశ్వే కృమికుక్షిస్తు జాయతే,

తా. ఏనుగు లేక అశ్వము వీటిని జంపినవానికి ఉదరమున క్రిములు జనించు. అది నివర్తించుటకై పూర్వోక్తప్రాయశ్చిత్తములం జేయవలయు.

మృతే భర్తరి యా నారీ నీలవస్త్రం ప్రధారయేత్. 3
సా మృతా నరకం యాతి కృమికుక్షిస్తతః పరమ్,

తా. భర్తమగణమును జెందినపిదప యేస్త్రీ నీలివస్త్రమును ధరించినో ఆ స్త్రీమరణమును పొంది నరకబాధ ననుభవించి రెండవజన్మమునందు ఉదరమున క్రిములుగలదిగ జనించు.

## జ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

పాటితహృదయో హిబుకే నిర్వాహనబాంధవార్త్యరతిసౌఖ్యః.
బాల్యే వ్యాధితదేహో నఖరో మధరో భవేత్సౌరౌ,

తా. జన్మకాలమునందు జన్మలగ్నమునకు నాలవయింటిలో శనియుండిన రొమ్ము నొప్పి వాహనాభావము బంధుపీడ భార్యాసుఖము బాల్యమునందే వ్యాధి నఖకేశధారణము ఇట్టి లక్షణములు గలుగు.

## హృద్రోగనిదానము

అత్యుష్ణగుర్వమ్లకషాయతిక్తశ్రమాభిఘాతాధ్యయనప్రసంగైః. 5
సంచింతనైర్వేగవిధారణైశ్చ హృదామయః పంచవిధః ప్రదిష్టః,

తా. అత్యుష్ణము, గురుత్వము, పులుసు, వగరు, చేదు, ఇవిగలపదార్థముల సేవించుట, శ్రమ, అభిఘాతము, యెల్లపు డధ్యయనముచేయుట, మైథునము, మలమూత్రవేగవిధారణము ఇట్టి కారణములవలన హృద్రోగము జనించు. అది వాతాదిభేదములచే అయిదువిధములుగ నుండు.

## హృద్రోగసంప్రాప్తి

దూషయిత్వా రసం దోషా విగుణా హృదయం గతాః. 6
హృది బాధాం ప్రకుర్వన్తి హృద్రోగం తం ప్రచక్షతే,

తా. వాతాదులు ప్రకోపించి రసధాతువును దూషితముగజేసి హృదయము నందు ప్రవేశించి బాధను గలుగంజేయుదానిని హృద్రోగ మని యెదరు.

—౷ వాతజహృద్రోగలక్షణము ౹—

అయమ్యతే మారుతజే హృదయం తుద్యతే తథా. 7
నిర్మథ్యతే దీర్యతే చ స్ఫోట్యతే పాట్యతే తథా,

తా. రొమ్మునీడ్చిపట్టుట, సూదులతో పొడిచినటులనుండుట, కవ్వముచే కలియ బెట్టబడినటులనుండుట, రెండుగ పగలగొట్టబడినటులనుండుట, చీల్చబడినటుల నుండుట, గొడ్డలిచే నరకబడినటులనుండుట, ఇట్టిలక్షణములుగలది వాతజహృద్రోగ మని తెలియవలయు.

—౷ పిత్తజహృద్రోగలక్షణము ౹—

తృట్ శోషదాహామూర్ఛాస్స్యుః పైత్తికే హృదయక్లమః. 8
ధూమాయనం చ మూర్ఛా చ స్వేదశ్శోషో ముఖస్యచ,

తా. దప్పి, కంఠముయెండుట, సర్వాంగదాహము, మూర్ఛ, హృదయమున వ్యాకులముగ నుండుట, కంఠమునుంచి పొగవాసనగల తేపులువచ్చుట, మోహము, స్వేదము, నోరుయెండుట ఇట్టి లక్షణములుగలది పిత్తజహృద్రోగమని తెలిసికొన వలయు.

—౷ కఫజహృద్రోగలక్షణము ౹—

గౌరవం కఫసంస్రావోఽరుచిస్తమ్భోఽగ్నిమార్దవమ్. 9
మాధుర్యమపి చాస్యస్య బలాసావర్తితే హృది,

తా. హృదయమునందు కఫము వ్యాపించుటవలన గురుత్వము, కఫస్రావము, అరుచి, నిశ్చలత్వము, అగ్నిమాంద్యము, నోరు తియ్యగనుండుట ఇట్టి లక్షణములు గలది కఫజహృద్రోగమని తెలియవలయు.

—౷ సన్నిపాతజహృద్రోగలక్షణము ౹—

విద్యాత్త్రిదోషం త్వపి సర్వలింగమ్. 10

తా. వాతపిత్తకఫజహృద్రోగలక్షణములన్నియు గలిగియుండిన నది సన్ని పాతజహృద్రోగమని తెలియవలయు.

—౷ కృమిజహృద్రోగలక్షణము ౹—

తీవ్రార్తితోదః కృమిజే సకండూః శ్లేష్మోదసంస్రవాః,
తమః శూలంచ హృల్లాసః అరుచిశ్శ్యావనేత్రతా. 11

తా. తీవ్రమగుబాధ, పోటు, దురద, ఓకరింత, ఉమియుట, కండ్లు చీకటి, శూల, గుండెలో కలియబెట్టుట, అరుచి నేత్రములు నల్లగనుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన కృమిజహృద్రోగమని తెలియవలయు.

హృద్రోగోపద్రవములు

క్లోమసాదో భ్రమశ్శోషో జ్ఞేయా స్తేషాముపద్రవాః,
కృమిజే కృమిజాతీనాం శ్లేష్మకాణాం చ యేమతాః. 12
సంస్తమ్భస్సజ్వరో ఘోరో రౌక్ష్యం స్పర్శాసహిష్ణుతా,
ఆధ్మానకుక్షిహృత్కంఠవాతవిణ్మూత్రరోధితాః. 13
తంద్రారోచకశూలాని తస్య లింగాని నిర్దిశేత్,

తా. క్లోమము కృశించియుండుట, భ్రమ, శోష, ఇవి హృద్రోగోపద్రవములని తెలియవలయు. మరియు కృమిహృద్రోగమునందు ఓకిరింత, జొల్లుకారుట, అతిపాకము, అరుచి, మూర్ఛ, వాంతి, తృష్ణ, కడుపుబ్బరము, కృశత్వము, వాపు, పీనస, ఇట్టి శ్లేష్మహృద్రోగమునగలిగెడు ఉపద్రవములును, శరీరము స్తంభించియుండుట, ఘోరమగుజ్వరము, రూక్షత, స్పర్శమును సహించలేకయుండుట, కడుపుబ్బరము, కుక్షి హృదయము కంఠము ఇవి అదుచుకొనుట, అపానవాయువు మలము మూత్రము ఇవి నిరోధింపబడుట, తంద్ర, అరోచకము శూల ఇవియును గలిగియుండు.

పౌష్కరాదికషాయము

క్వాథః కృతః పౌష్కరమాతులుంగపలాశపూతీకశటీసురాహ్వైః.
సనాగరాజాజివచాయవాహ్వాస్సక్షారఉష్ణో లవణేన పేయః,

తా. పుష్కరమూలము, మాదీఫలపువేరు, మోదుగవేరు, సిమలదుంగువేరు, కచ్చూరములు, దేవదారు, శొంఠి, జీలకఱ్ఱ, వస వీటిని సమముగ చేర్చి కషాయము పెట్టి అందు యవక్షారము సర్జక్షారము సైంధవలవణము చేర్చి ఉష్ణముగ పుచ్చుకొనిన హృద్రోగము నివర్తించు.

దశమూలాదికషాయము

దశమూలకృతః క్వాథః సయవక్షారసైంధవః. 15
హృద్రోగగుల్మశూలార్తిః కాసం శ్వాసం చ నాశయేత్,

తా. దశమూలములను కషాయముబెట్టి అందు యవక్షారము సైంధవలవణము చేర్చి పుచ్చుకొనిన హృద్రోగము, గుల్మము, శూల, కాస, శ్వాస ఇవి నివర్తించు.

ఏరండాదికషాయము

పవనారిజటాద్విపలాష్టగుణే సలిలే పచితాయవజేన యుతమ్. 16

క్వథనం హృదయోద్భవపార్శ్వకటీ వ్యధనస్య విదారణసింహ నఖమ్,

తా. ఆముదపువేరు ౨ పలములు ౧౬ పలములనీళ్ళయందువైచి కషాయముగు కాచి అందు యవక్షారముకలిపి పుచ్చుకొనిన హృదయశూల పార్శ్వశూల కటిశూల ఇవి నివర్తించుటకు సింహపుగోళ్లవలె పనిచేయును.

బాంహ్లీకాదికషాయము

బాంహ్లీకవిశ్వదహనా యవయావయావశూక
పథ్యామయాబిడకణారుచకైర్నిహన్యాత్. 17
క్వాథస్సపుష్కరజటాభవవారిపీతో
హృద్రోగమగ్నివికలత్వమతి ప్రబద్ధమ్,

తా. ఇంగువ, శొంఠి, చిత్రమూలము, యవలు, యవక్షారము, కరక్కాయ వోలుపు, కోష్ఠము, బిడాలవణము, పిప్పళ్లు, పాదిరిలవణము, పుష్కరమూలము వీటిని సమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన హృద్రోగము, అగ్నిమాంద్యము, మలబంధము ఇవి నివర్తించు.

నాగరాదికషాయము

నాగరస్య పిబేదుష్ణం కషాయం చాగ్నివర్ధనమ్. 18
కాసశ్వాసానిలహరం శూలహృద్రోగనాశనమ్,

తా. శొంఠికషాయముబెట్టి కొంచెము ఉష్ణముగ పుచ్చుకొనిన అగ్నిదీప్తిని గలుగజేయుటయేగాక కాస, శ్వాస, వాతము, శూల, హృద్రోగము ఇవి నివర్తించు.

వాతజహృద్రోగమునకు పిప్పల్యాదిచూర్ణము

పిప్పల్యేలావచాహింగు యవక్షారోథ సైంధవమ్. 19
సౌవర్చలమథో శుంఠీ దీప్యశ్చేతి విచూర్ణితమ్,
ఫలం ధాన్యామ్లకౌలుత్థ దధిమద్యరసాదిభిః. 20
పాయయేచ్ఛుద్ధదేహస్య వాతహృద్రోగశాన్తయే,

తా. పిప్పళ్లు, ఏలకులు, వస, ఇంగువ, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, శొంఠి, ఓమము వీటిని సమాంశములుగ చూర్ణించి ౧ పలముచొప్పున ధాన్యామ్లము లేక కులుత్థకషాయము లేక పెరుగు లేక మద్యము లేక మాంసరసము వీటిలో దేనితోనైనను వమనరేచనాదులచే శుద్ధుడగు మనుజునికిచ్చిన వాతజహృద్రోగము నివర్తించు.

త్రివృతాదిచూర్ణము

త్రివృచ్ఛఠీ బలా రాస్నా శుంఠీ పథ్యాస్సపౌష్కరాః. 21
చూర్ణితావాపితా మూత్రే పాతవ్యాః కఫహృద్గదే,

తా. తెగడకచ్చూరములు, చిట్టాముట్టివేరు, రాస్న, శొంఠి, కరకపొలుపు, పుష్కరమూలము వీటిని చూర్ణించి గాని కషాయము బెట్టిగాని గోమూత్రమునందుజేర్చి పుచ్చుకొనిన హృదయరోగము నివర్తించు.

సూక్ష్మైలాదిచూర్ణము

సూక్ష్మైలా మాగధీమూలం ప్రలీఢం సర్పిషా సహ. 22
నాశయేదాశు హృద్రోగం కఫజం సపరిగ్రహమ్,

తా. సన్నయాలకులు, మోడి వీటిని చూర్ణించి నేతితో పుచ్చుకొనిన ఉపద్రవయుక్తమగు కఫజహృద్రోగము నివర్తించు.

హింగుపంచకచూర్ణము

విశ్వౌషధేన రుచకేన సదాడిమేన
స్యాచ్చామ్లవేతసయుతః కృతహింగుభాగః. 23
తద్దింగుపంచకమిదం హృదయామయఘ్నం
భేడాభిధానమునినాగదితం మునిభ్యః,

తా. శొంఠి, సౌవర్చలవణము, దాడింబపొలుపు, అమ్లవేతసము, వేల్చిన ఇంగువ వీటిని సమాంశములుగ చూర్ణించి పుచ్చుకొనిన హృదయరోగము నివర్తించు. ఇది భేడనామకమునిచే జెప్పబడిన హింగుపంచకచూర్ణమని తెలియవలయు.

హింగ్వాదిచూర్ణము

హింగూగ్రగంధా విడవిశ్వకృష్ణా కుష్ఠాభయాచిత్రకయావశూకైః.24
పిబేత్ససౌవర్చలపుష్కరాఖ్యం యవాంభసా శూలహృదామయఘ్నమ్,

తా. ఇంగువ, వస, బిడాలవణము, శొంఠి, పిప్పళ్లు, చెంగల్వకోష్టు, కరకపొలుపు, చిత్రమూలము, యవక్షారము, సౌవర్చలవణము, పుష్కరమూలము వీటిని చూర్ణించి యవలకషాయమునందుజేర్చి పుచ్చుకొనిన శూల, హృద్రోగము ఇవి నివర్తించు.

పాఠాదిచూర్ణము

పాఠా వచా యవక్షారమభయాచామ్లవేతసమ్. 25
దురాలభా చిత్రకం చ త్ర్యూషణం చ ఫలత్రికమ్,

శుంఠీపుష్కరమూలం చ తింత్రిణీకం సదాడిమమ్. 26
మాతులుంగస్య మూలాని శ్లక్ష్ణచూర్ణాని కారయేత్,
ఉష్ణోదకేన మద్యైర్వా హృత్వాన్యేతాని పాయయేత్. 27
అర్శశ్శూలే చ హృద్రోగం గుల్మం చాశు వ్యపోహతి,

తా. విషబొద్దివేరు, వస, యవక్షారము, కరకవొలుపు, అమ్లవేతసము, సూల గొండివేళ్లు, చిత్రమూలము, త్రికటుకములు, త్రిఫలములు, * శొంఠి పుష్కరమూలము, చింతబెరడు, దాడింబవొలుపు, మాదీఫలపువేళ్లు వీనిని సమాంశములుగ మెత్తగ చూర్ణించి ఉష్ణోదకము లేక మద్యముతో సేవించిన అర్శస్సు, శూల, హృద్రోగము, గుల్మము ఇవి నివర్తించు

## హృదయార్ణవరసము

సూతార్కగంధం క్వాథేన వరాయామర్దయేద్దినమ్. 28
కాకమాచ్యావటీం కృత్వా చణమాత్రాం తు భక్షయేత్,
హృదయార్ణవనామాయం హృద్రోగదళనో రసః. 29

తా. శుద్ధిజేసినరసము, తామ్రభస్మము, శుద్ధగంధకము, వీటిని సమాంశము లుగ ఖల్వమునందువైచి త్రిఫలకషాయముచే నొకదినము మర్దించి, మరల కొమంచి ఆకురసముచే నొకదినము మర్దించి శనగలంతమాత్రలుజేసి అందొకమాత్ర చొప్పున భక్షించిన హృదయరోగము మానును. ఇది హృదయార్ణవరసము.

## రసాయనము

రసగంధాభ్రభస్మాని పార్థవృక్షత్వగంబునా,
ఏకవింశతిధా ఘర్మే భావితాని విధానతః. 30
మాషమాత్రమిదం చూర్ణం మధునా సహ లేహయేత్.
వాతజం పిత్తజం శ్లేష్మసంభూతం వా త్రిదోషజం. 31
కృమిజం చాపి హృద్రోగం హరత్యేవ న సంశయః,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము, అభ్రకభస్మము, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి మద్దిపట్టరసముచే ౨౧ భావనలుజేసి ఎండించి మాషమాత్రము తేనెతో పుచ్చుకొనిన వాతజ పిత్తజ కఫజ త్రిదోషజ కృమిజ హృద్రోగములు నివర్తించు.

* ఇందు శొంఠి రెండుభాగములు వేయవలెను.

### వల్లభకఘృతము

శతార్థమభయానాం తు సౌవర్చలపలద్వయమ్. 32
పచేత్కార్షైర్ఘృతప్రస్థం దత్వా క్షీరం చతుర్గుణమ్,
ఘృతం వల్లభకం నామ్నా శ్రేష్ఠం హృద్రోగనాశనమ్. 33

తా. విత్తులుదీసినయాభైకరక్కాయలు రెండుపలముల సౌవర్చలవణచూర్ణము పదహారుపలములు నెయ్యి నెయ్యికి నాలుగింతలు పాలు వీనిని నేకముగజేర్చి ఘృతపక్వముగవండి సేవించిన హృద్రోగము నివర్తించు.

### యష్ట్యాదిఘృతము

యష్టినాగబలోదీచ్యార్జునైస్సర్పిస్సుసాధితమ్,
హృద్రోగక్షయ పిత్తాస్రశ్వాసకాసజ్వరార్తిజిత్. 34

తా. యష్టిమధుకము, నాగముత్తవపులగ, వట్టివేరు, మద్దిపట్ట వీటిచే సిద్ధము చేయబడుఘృతమును పానముజేసిన హృద్రోగము, క్షయ, పిత్తరక్తము, శ్వాస, కాస, జ్వరము, పీడ ఇవి నివర్తిచు.

### పునర్నవాదితైలము

పునర్నవాదారుసపంచమూలరాస్నాయవాశ్కోలకపిత్థబిల్వామ్,
పక్త్వా జలే తేన పచేచ్చతైలమభ్యంగపానే నిలహృద్గదఘ్నమ్. 35

తా. తెల్లగలిజేరు, దేవదారు, బృహత్పంచమూలములు, రాస్న, యవలు, రేగువేరు, వెలగవేరు, బిల్వఫలము వీటికషాయమునందు నూనెచేర్చి తైలపక్వముగ కాచి అభ్యంగనము పానము వీనినిజేసిన వాతహృద్రోగము నివర్తించు.

### గోమూత్రపానము

కృమిజే చ పిబేన్మూత్రం విడంగామయసంయుతమ్,
హృది స్థితాః పతంత్యేవ హ్యసాధ్యాః కృమయో నృణామ్. 36

తా. వాయువిడంగములు, కోష్ఠు వీనిని చూర్ణించి గోమూత్రమునవైచి పుచ్చుకొనిన హృదయమందుండు అసాధ్యములగు క్రిములుపడును.

### దుగ్ధపానము

చతుర్వింశతిపలం క్షీరం గవామథ పచేచ్ఛనైః,
ద్విరష్టపలకం యావత్తావత్కుర్యాత్తుశీతలమ్. 37
సితా క్షౌద్రం ఘృతం తస్మిన్ దుగ్ధే చార్ధపలం క్షిపేత్,
కర్షైకం పిప్పలీచూర్ణం క్షిప్త్వా పేయం హితం పరమ్. 38

సర్వదోషోత్థహృద్రోగం జ్వరం కాసం క్షయం హరేత్,

తా. ఆవుపాలు 8 పలములుమందాగ్నిచే పదునారుపలములు మిగులునటుల కాచి చల్లార్చి అందుచక్కెర తేనె నెయ్యి వీనిని ప్రత్యేకము 4 పలముచొప్పున వైచి పిప్పలి చూర్ణమొకకర్షముచేర్చి పుచ్చుకొనిన సర్వదోషములవలన గలిగిన హృద్రోగము, జ్వరము, కాస, క్షయ, ఇవి నివర్తించు.

నాగబలాదిదుగ్ధపాకము

మూలం నాగబలాయాస్తు గోదుగ్ధేన చ పాచయేత్,
హృద్రోగశ్వాసకాసఘ్నం కుక్కుట్యాశ్చాపివల్కలమ్. 39
రసాయనం పరం బల్యం వాతజిన్మాసయోజితమ్,
సంవత్సరప్రయోగేణ జీవేద్వర్షశతం ధ్రువమ్. 40

తా. నాగబలామూలమును ఆవుపాలలోవైచి కాచి పుచ్చుకొనిన హృద్రోగము శ్వాస కాస ఇవి నివర్తించు. మరియు బూరుగపట్ట పాలయందువైచి కాచి పుచ్చుకొనిన మిక్కిలి బలమును గలుగజేయుటయేగాక వాతమును నశింపజేయు. దీనిని సంవత్సరము పుచ్చుకొనిన నూరుసంవత్సరములు జీవించు.

హారిణశృంగభస్మము

శరావసంపుటే దగ్ధ్వా శృంగం హారిణజం పిబేత్,
గవ్యేన సర్పిషా పిష్టం హృచ్ఛూలం నాశయేద్ధ్రువమ్. 41

తా. లేడికొమ్ముభస్మమును ఆవునేతితో పుచ్చుకొనిన హృదయశూల నివర్తించు.

హృద్రోగపథ్యములు

స్వేదో విరేకో వమనం చ లంఘనం వస్తిర్విలేపోచిరరక్తశాలయః,
మృగద్విజాజాంగలసంజ్ఞయాన్వితాయూషారసా ముద్గకులిత్థసమ్భవాః.
రాగాః ఖలీ కాంబలికాశ్చ ఖాండవాఃభవ్యం పటోలం కదలీ ఫలాన్యపి,
పురాణకూష్మాండరసాలదాడిమం శమ్యాకశాకం నవమూలకాన్యపి. 43
ఏరండతైలం గగనాంబుసైంధవంప్యాజావితక్రం చ పురాతనో గుడః,
శుంఠీ యవానీ లశునం హరీతకీ కుష్ఠం చ కుస్తుంబరుకృష్ణయార్ద్రికమ్.
సౌవీరశుక్లం మధువారుణీరసః కస్తూరికా చందనచర్చనం తథా,
తాంబూలమప్యేషగణఃసఖా భవేన్మర్త్యస్య హృద్రోగనిపీడితాత్మనః.

తా. చెమటదీయుట, విరేకము, వాంతి, లంఘనము, వస్తి, లేపనము, పాత రొట్టిబియ్యము, ఆరణ్యపశు పక్షిమాంసరసము, పెసలు, ఉలవలు, పిట్టియూషము,

రాగము, ఖలిక, అంబలిక, ఖాండవము, భవ్యం, పొట్లకాయ, లేతఅరటికాయ, పాత గుమ్మడికాయ, మామిడి, దాడింబ, లేలేఆకులు, కొత్తమినుములు, ఆసుదము, వానసీరు సైంధవలవణము, మేక, గొఱ్ఱె, పేటిమజ్జిగ, పాతబెల్లము, శొంఠి, ఓమము, వెల్లుల్లి కరక, కోష్ఠము, ధనియాలు, మిరియాలు, అల్లము, కాంజికము, తెల్లని తేనె, మద్యము కస్తూరి, చందనముపూత, విడియము ఇవి హృద్రోగముగల పురుషునికి, పథ్యములని తెలియవలయు.

## అపథ్యములు

తృట్ఛర్దిమూత్రానిలశుష్కకాసోద్గారశ్రమశ్వాసవిడశ్రునిరోధః.
సింధ్వింధువింధ్యాద్రినదీజలాని మేషీపయోదుష్టజలం కషాయం,
అమ్లంచ యష్టీమధుదన్తకాష్ఠం నేష్టం హిహృద్రోగిషురక్తమోక్షః.

తా. దప్పి, వాంతి మూత్రము, వాయువు, పొడిదగ్గు, ఉద్గారము, శ్రమశ్వాస మలము, కన్నీరు, వీటివేగము నిరోధించుట సింధునదము హిమవత్పర్వతము వింధ్య పర్వతము వీటినదులయందలి ఉదకము, మేకపాలు, దుష్టోదకము, కషాయరసము, పులుసు, అతిమధురము, దన్తకాష్ఠము, రక్తముదీయుట ఇవి హృద్రోగి వర్జించవలయు.

---

# ఉదరరోగప్రకరణమ్.

## ఉదరరోగ కర్మవిపాకము

యో బ్రహ్మవిష్ణురుద్రాణాం మధ్యే చైకం విభావయేత్,
సాధయేదుదరవ్యాధియుక్తో భవతి మానవః. 1

తా. ఏమనుజుడు బ్రహ్మ విష్ణు రుద్రులలో నొకని అధికముగ భావించి సాధించునో ఆమనుజుడు ఉదరవ్యాధిగలవాడుగ జనించు.

## శాన్తి

కుర్యాత్కృచ్ఛ్రం చాతికృచ్ఛ్రం చాంద్రాయణమథాపరమ్,
సహస్రకలశస్నానమీశ్వరస్య తు కారయేత్. 2

తా. కృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగు ప్రాయశ్చిత్తము లను, ఈశ్వరునికి సహస్రఘటాభిషేకమునుం జేసిన ఉదరవ్యాధి నివర్తించు.

జలోదరకర్మవిపాకము

రాజ్ఞా వా తు నియుక్తేన నియుక్తో ధర్మనిశ్చయే,
పురోహితః ప్రాడ్వివాకస్సచివో వాన్యథా చరేత్. 3
జలోదరత్వం ప్రాప్నోతి తస్య వక్ష్యామి నిష్కృతిమ్,

తా. ధర్మనిశ్చయమునకై నిర్ణయింపబడిన రాజుగాని లేక రాజుచే నియుక్తుడగు పురోహితుడుగాని న్యాయాధిపతిగాని మంత్రిగాని న్యాయవిరోధము జేసినేని జలోదరరోగముగలవారుగ జనింతురు. అట్టిజలోదరమునకు శాంతిఁ జెప్పెద.

శాంతి

పయసావర్తయేన్మాసత్రితయం వ్రతముత్తమమ్. 4
సహస్రకలశస్నానం మహాదేవస్య చైవహి,
భోజయేచ్ఛ శతం విప్రాన్ ముచ్యతే కిల్బిషాత్తతః. 5

తా. మూడుమాసములు పయోవ్రతముఁజేసి ఈశ్వరునకు సహస్రఘటాభిషేకమునుంజేసి ౧౦౦ బ్రాహ్మణులకు భోజనంబిడిన జలోదరము నివర్తించు.

ఉదరకర్మవిపాకము

గర్భపాతనజారోగా యకృత్ప్లీహజలోదరాః,
తేషాం ప్రశమనార్థాయ ప్రాయశ్చిత్తమిదం స్మృతమ్. 6

తా. గర్భపాతమును గలుగజేయుటచే యకృత్ప్లీహములు జలోదరము ఇవి జనించు. వీటి శమనకై ప్రాయశ్చిత్తములఁ జెప్పెద.

శాంతి

ఏతేషు దద్యాద్విప్రాయ జలధేనుం విధానతః,
సువర్ణరౌప్యతామ్రాణాం పలత్రయసమన్వితామ్. 7

తా. మూడుపలముల సువర్ణమునుగాని వెండినిగాని తామ్రమునుగాని జలధేనుసహితముగ బ్రాహ్మణునికి దానంబొసంగిన పైజెప్పబడు రోగములు నివర్తించు.

ప్లీహోదరకర్మవిపాకము

భృతకాధ్యాపకో యస్తు కన్యాదూషణతత్పరః,
ప్లీహవాన్సంభవేద్విప్రో జపేచ్ఛ్రీసూక్తమేవ హి. 8

తా. జీతమునుగ్రహించి అధ్యయనము జెప్పెడివాఁడును, కన్యాదూషణము జేయువాఁడును ప్లీహోదరపీడితుడగు. తన్నివృత్తికై శ్రీసూక్తమును జపించవలయు.

శమనము

అయుతత్రయసంఖ్యాకం ప్లీహోదరవిముక్తయే,
ప్రత్యృచం చ భవేద్ధోమశ్చరుణా సర్పిషా పృథక్. 9

తా. ప్లీహోదరనివృత్తికై ముప్పదివేలు శ్రీసూక్తమునుజపించి ప్రతి ఋక్కుచే చర్వాజ్యములతో ప్రత్యేకము హోమముజేయవలయు.

ఉదరరోగనిదానము

రోగాస్సర్వేపి మందేగ్నౌ సుతరాముదరాణిచ,
అజీర్ణాన్మలినైశ్చాన్నైర్జాయంతే మలసంచయాత్. 10

తా. మందాగ్ని త్రిదోషజనితంబుగాన సర్వరోగములుత్పన్నంబులగు. అందు ఉదరరోగము ముఖ్యముగ జనించు. మరియు అజీర్ణము, మలినాన్నము, (అనగా విరుద్ధాన్నము) మలసంచయము వీటివలన ఉదరరోగము జనించునని తెలియవలయు.

ఉదరరోగసంప్రాప్తి

రుద్ధ్వా స్వేదాంబువాహీని దోషాస్స్రోతాంసి సంచితాః,
ప్రాణాగ్న్యపానాన్సందూష్య జనయత్యుదరం నృణామ్. 11

తా. వాతాదిదోషములు స్వేదము ఉదకము వీటినివహించు స్రోతస్సులను నిరోధించి వృద్ధిని జెందినవై ప్రాణవాయువు అగ్ని అపానవాయువు వీటినిదూషితములుగ జేసి మనుజులకు ఉదరరోగముల జనింపజేయు.

ఉదరరోగసామాన్యలక్షణము

ఆధ్మానం గమనేఽశక్తిర్దౌర్బల్యం దుర్బలాగ్నితా,
శోథస్సదనమంగానాం సంగో వాతపురీషయోః. 12
దాహస్తంద్రా చ సర్వేషు జఠరేషు భవన్తిహి,

తా. కడుపుబ్బుట, నడుచుటకుశక్తిలేకయుండుట, దుర్బలత్వము, మందాగ్ని, వాపు, అవయవములు పట్లులేకుండుట, వాతము మలము ఇవి బద్ధగించుట, దాహము, తంద్ర ఇట్టిలక్షణములు సర్వోదరరోగములయందుండునని తెలియవలయు.

ఉదరసామాన్య లక్షణము

యేన శుష్యతి సర్వాంగం జఠరం వర్ధతే భృశమ్. 13
ఉదరం తం విజానీయాత్తదష్టవిధముచ్యతే,

తా. సర్వావయవములుశుష్కించి ఉదరము మిక్కిలి వృద్ధిపొందిన ఉదరరోగమని తెలియవలయు. ఇది ౮ విధములుగనుండు.

—— ఉదరరోగభేదములు ——

పృథగ్దోషైస్సమస్తైశ్చ ప్లీహబద్ధక్షతోదకైః. 14
సంభవంత్యుదరాణ్యష్టౌ తేషాం లింగం పృథక్ శృణు,
క్షతమూర్ధ్వమధో బద్ధముదకంతుసమంతతః. 15
నాభేః ప్లీహా వామపార్శ్వే దోషజం దోషలక్షణమ్,
సాధ్యం ప్లీహం చైకదోషం శేషం త్యాజ్యం చతుష్టయమ్. 16

తా. వాతోదరము, పిత్తోదరము, కఫోదరము, సన్నిపాతోదరము, ప్లీహోదరము, బద్ధగుదోదరము, క్షతోదరము, జలోదరము, ఇటుల ఉదరరోగంబులు యెనిమిదివిధంబులుగనుండు. వాటిలక్షణంబుల ప్రత్యేకముగ వివరించెద. మరియు నాభికిపైభాగంబునబుట్టునది క్షతోదరమనియు, నాభికిక్రిందిభాగమునబుట్టునది బద్ధోదరమనియు, నాభికిచుట్టూజనించునది జలోదరమనియు, నాభికియెడమపార్శ్వమున బుట్టునది ప్లీహోదరమనియు, వాత పిత్త శ్లేష్మములవలన బుట్టునవి దోషజోదరములనియు వాతపిత్తశ్లేష్మలక్షణసహితంబై పుట్టునది సన్నిపాతోదరమనియు తెలియవలయు. అందు ప్లీహోదరము వాతోదరము పిత్తోదరము శ్లేష్మోదరము యీనాలుగు సాధ్యంబులు; మిగిలిననాలుగు అసాధ్యంబులని తెలిసికొనవలయు.

—— వాతోదరలక్షణము ——

తత్ర వాతోదరే శోథః పాణిపన్నాభికుక్షిషు,
కుక్షిపార్శ్వోదరకటీపృష్ఠరుక్పర్వభేదనమ్. 17
శుష్కకాసాంగమర్దోఽధోగురుతామలసంగ్రహః,
శ్యావారుణత్వగాదిత్వమకస్మాద్వృద్ధిహ్రాసవత్. 18
సతోదమేతదుదరం తనుకృష్ణశిరాతతమ్,
ఆధ్మాతదృతివచ్ఛబ్దమాహతం ప్రకరోతి చ. 19
వాయుశ్చాత్ర సరుక్శబ్దో విచరేత్సర్వతోగతిః,

తా. వాతోదరమునందు హస్తములు పాదములు నాభి కుక్షి వీటియందు వాపు, మరియు కుక్షి పార్శ్వములు ఉదరము కటిప్రదేశము పృష్ఠభాగము వీటియందు పీడ, సంధులయందునొప్పి, పొడిదగ్గు, వొడలువిరుపు, నాభిక్రిందిభాగమునందు గురుత్వము, మలసంచయము, చర్మము నేత్రములు చెవులు మొదలగు వీనియందునలుపు యెరుపువర్ణముగలుగుట, అకస్మాత్తుగ కారణములేకనే ఉదరరోగము వృద్ధియగుట, మరియు ఈవాతోదరము సర్వకాలములయందు నొప్పితోగూడి సూక్ష్మముగను కృష్ణవర్ణములగు సిరలతో వ్యాప్తమైయుండు. మరియు కడుపుబ్బరము, కడుపు

వాయించిన గాలిచేనిండిన తిత్తివలె శబ్దించుట, ఉదరమునందుండు వాయువు నొప్పి శబ్దము వీటితో గూడినదై ఉదరమునంతట సంచరించుట, ఇట్టిలక్షణములుగలిగియుండు.

## పిత్తోదరలక్షణము

పిత్తోదరే జ్వరో మూర్ఛాదాహా స్తృట్కటుకాస్యతా. 20
భ్రమోతిసారః పీతత్వం త్వగాదావుదరం హరిత్,
పీతతామ్రశిరానద్ధం సస్వేదం సోష్మదహ్యతే. 21
ధూమాయతి మృదుస్పర్శం క్షిప్రపాకం ప్రదూయతే,

తా. పిత్తోదరమునందు జర్వము, మూర్ఛ, దాహము, దప్పి, నోరు కారముగ నుండుట, భ్రమ, అతిసారము, చర్మము మొదలైన వాటియందు పీతవర్ణము, మరియు ఉదరముపసపువర్ణముగగాని పసరువర్ణముగగాని తామ్రవర్ణముగగానియుండెడి సిర లతో వ్యాప్తమై చమటగలిగి ఉష్ణముగనుండి మినమినలాడుచు ముఖద్వారమువలన ధూమయుక్తమగు ఉద్గారము వెడలుచు మృదుస్పర్శ, త్వరితముగపాకము నొప్పి ఇవి గలిగియుండు.

## కఫోదరలక్షణము

శ్లేష్మోదరేంగసాదశ్చ స్వాపశ్శ్వయథుగౌరవే. 22
నిద్రోత్క్లేదోఽరుచిశ్శ్వాసః కాసశ్శుక్లత్వగాదితా,
ఉదరం స్తిమితం స్నిగ్ధం శుక్లరాజీతతం మహత్. 23
చిరాభివృద్ధికఠినం శీతస్పర్శం గురుస్థిరమ్,

తా. శ్లేష్మోదరమునందు శరీరముసడలుట, మొద్దుబారుట, వాపు, శరీరము బరువు, నిద్ర, శరీరము వెలవెలబోవుట, అరుచి, శ్వాస, కాస ఇవిగలుగుట, మలము మూత్రము చర్మము ఇవి తెలుపుబారుట,మరియు ఉదరము నిశ్చలముగ మినమినలాడుచు శుక్లశిరలతోవ్యాప్తమైయుండుట, చిరకాలముమీద వృద్ధియగుట, కఠినము శీతసర్శ గురుత్వము స్థిరము ఇవిగలిగి, బరువుగనుండుట, స్థిరముగ నుండుట ఇట్టి లక్షణములం గలిగియుండు.

## సన్నిపాతోదరనిదానము

స్త్రియోన్నపానం నఖరోమ మూత్రవిడార్తవైర్యుక్తమసాధువృత్తాః.
యస్మైప్రయచ్ఛంత్యరయోగరాంశ్చ దుష్టాంబు దూషీవిష సేవనాద్వా,
తేనాశురక్తం కుపితామలాశ్చ కుర్వన్తి ఘోరం జఠరం త్రిలింగమ్. 25

తా. ఏమనుజునికి తమయందధికప్రేమకలుగవలెనని కార్యాకార్యవివేకశూన్యలగు స్త్రీలు, గోళ్లు వెండ్రుకలు మూత్రము మలము ఆర్తవము వీటితో దుష్టమైన

అన్నపానాదుల నిచ్చుచున్నారో వానికిని, శత్రువుచేఁ బెట్టబడినవిషమును భుజించిన వానికిని, దుష్టోదకపానముఁజేయువానికిని, వాతాదిదోషములు కుపితములై రక్తమును జెరచి అత్యంతఘోరమగు సన్నిపాతజ ఉదరమును గలుగంజేయుచున్నయవి. దానినే త్రిదోషజ ఉదరమని యందురు.

### సన్నిపాతోదరలక్షణము

తచ్ఛీతవాతాతపదుర్దినేషు విశేషతః కుప్యతి దహ్యతే చ,
సచాతురో మూర్ఛతి ముహ్యతే చ పాండుః కృశశ్శుష్యతి తృష్ణయాచ.
దూష్యోదరం కీర్తితమేతదేవ

తా. పూర్వోక్తమగుసన్నిపాతోదరము శీతము వాయువు ఎండ దుర్దినము వీనివలన మిక్కిలి ప్రకోపించి దహించుచుండుగాన నారోగిమూర్ఛితుఁడై మోహము నుఁ జెందు. మరియు శరీరము తెలుపుబారుట, శుష్కించుట, దప్పిచే శోషించుట ఇట్టి లక్షణములుగలది సన్నిపాతోదరమని యెఱుంగవలయు దీనినే దూష్యోదరమని యును చెప్పుచున్నారు.

### ప్లీహోదరలక్షణము

ప్లీహోదరం కీర్తయతో నిబోధ,
విదాహ్యభిష్యందిరతస్య జన్తోః ప్రదుష్టమత్యర్థమసృక్కఫశ్చ. 27
ప్లీహాభివృద్ధిం కురుతః ప్రవృద్ధౌ ప్లీహోదరం తత్ప్రవదన్తి తజ్జ్ఞాః,
తద్వామపార్శ్వే పరివృద్ధిమేతి విశేషతస్సీదతి చాతురశ్చ. 28
మందజ్వరాగ్నిః కఫపిత్తలింగై రుపద్రుతః క్షీణబలోతిపాండుః,

తా. ప్లీహోదరలక్షణమునుంజెప్పెద వినుడు. విదాహకరపదార్థములు అభిష్యందిపదార్థములు వీనిని సేవించుటవలన రక్తము కఫము ఇవి మిక్కిలి దుష్టంబులై వృద్ధినిజెంది యెడమపార్శ్వమున ప్లీహాభివృద్ధిని గలుగంజేయు. దీనినే ప్లీహోదరమని జెప్పెదరు. అందు శరీరశిథిలత్వము మందజ్వరము అగ్నిమాంద్యము కఫపిత్తోదరలక్షణములు బలక్షయము శరీరము తెల్లగనుండుట ఇట్టిలక్షణములు గలిగియుండు. ఇది యసాధ్యము.

### యకృద్దాల్యుదర లక్షణము

సవ్యేతరస్మిన్యకృతి ప్రదుష్టే జ్ఞేయం యకృద్దాల్యుదరం తదేతత్. 29
తా. కుడిపార్శ్వమున నాభికి ఊర్ధ్వభాగమందు యకృత్ అను పేరుగల

మాంసపిండముగలదు, దానికి వికారము గలిగినపుడు ఉబ్బుచునుండునుగాన దానిని యకృద్దాల్యుదరమని జెప్పెదరు.

బద్ధగుదోదరలక్షణము

యస్యాంత్రమన్నైరుపలేపిభిర్వావాలాశ్మభిర్వాపి హితం యథావత్
సంచీయతే యస్య మలస్సదోషశ్శనైశ్శనైస్సంకరవత్తునాడ్యామ్. 30
నిరుధ్యతే యస్య గుదే పురీషం నిరేతి కృఛ్రాదపి చాల్పమల్పమ్,
హృన్నాభిమధ్యే పరివృద్ధిమేతి తస్యోదరం బద్ధగుదం వదన్తి. 31

తా. జిగటగనుండు అన్నము శాకము మొదలగువానిసేవనవలనను, సూక్ష్మమగు వెండ్రుకలు రాళ్లు ఉదరమున బ్రవేశించుటవలనను, మలవాహినులగు స్రోతస్సు లడ్డగింపబడి అందువలన వాతపిత్తశ్లేష్మంబులు దుష్టంబులై వాటితోడ మలము గలసి గుదస్థానమునందుండు పెద్దనరములయందు చిమ్మబడిన పెంటవలె క్రమముగ సంచితంబై మిక్కిలి కష్టముగ కొంచకొంచముగ మలము బయలువెడలింపజేయు. అందువలన ఉదరము హృదయము వీనియొక్క మధ్యమునందు వృద్ధిని జెందు. దానిని బద్ధగుదోదరమని జెప్పెదరు.

క్షతోదరలక్షణము

శల్యం తథాన్నోపహితం యదంత్రం భుక్తం భినత్త్యాగతమన్యథావా,
తస్మాత్స్రుతోంత్రాత్సలిలప్రకాశస్స్రావస్స్రవేద్వై గుదతస్తుభూయః,
నాభేరధశ్చోదరమేతి వృద్ధిం నిస్తుద్యతే దాల్యతిచాతిమాత్రమ్,
ఏతత్పరిస్రావ్యుదరం ప్రదిష్టమ్. 33

తా. శల్యములు ముండ్లు గులకరాళ్లు ఇవి అన్నముతోగలసి పక్వాశయంబున జేరి బయలువెడలునపుడు ప్రేవులయం దడ్డపడుటవలనగాని లేక ఆవలింత, అధికముగ భక్షించుట వీనివలనగాని పేగులు భిన్నంబులై వానిరంధ్రంబులవలన మాటిమాటికి స్రవించెడునీరు గుదమునుండి వెడలుచు నాభికి అధోభాగంబున ఉదరమును జనింపజేయు. దీనినే క్షతోదరమనియు పరిస్రావ్యుదరమనియు గ్రంథాంతరమున ఛిద్రోదరమనియును వచించెదరు. (దీనియందు సూదులతో పొడిచినటులను పగలగొట్టినటులను మిక్కిలి వేదనగలుగుగాన దీనిను పేక్షించిన జలోదరంబగును.)

జలోదరలక్షణము

జలోదరం కీర్తయతో నిబోధ స్నేహప్రపీతోప్యనువాసతో వా
వాన్తో విరిక్తోప్యథవా నిరూఢః పిబేజ్జలం శీతలమాశు తస్య. 34

స్రోతాంసి సందుష్యహితద్వహాని స్నేహయాపలి ప్తేష్వథవాపి తేషు,
దకోదరం పూర్వవదభ్యుపైతి స్నిగ్ధం మహా త్తత్పరివృ త్తనాభి. 35
భృశోన్నతం పూర్ణమివాంబుపానాత్,
యథాదృతిః క్షుభ్యతి కంపతే చ శబ్దాయతే చాప్యుదకోదరం తత్.

తా. జలోదరలక్షణమును వచించెద; స్నేహపానము, అనువాసనవస్తి, వమనము, విరేచనము, నిరూహాస్తి వీటిలో దేనినైన జేయువాడు శీతోదకపానము జేసినేని వానిశరీరమున ఉదకమునువహించెడి స్రోతస్సులు తత్క్షణముననే దుష్టములై ఆస్రోతస్సులు స్నేహముచే ఉపలిప్తములైయుండగా మొదట అన్నరసము ఉపస్నేహన్యాయముచే (అనగా పొక్కి వెలపలికివచ్చి) ఉదరమును గలుగచేయుచున్నది. అదియ జలోదరమనంబడు. దానిపై మినమినలాడుచు లావుగ బొడ్డుదగ్గిర నుబ్బుగలిగి నాలుగుపార్శ్వముల మంటగలదై నీరుచే కడుపునిండినటులనుండి తోలుతిత్తివలె గుడగుడలాడుచు మిక్కిలి శబ్దించుచుండిన దానిని జలోదర మనిరెుదరు.

సాధ్యాసాధ్యవిచారము

జన్మనైవోదరం సర్వం ప్రాయః కృచ్ఛ్రతమం విదుః,
బలిన స్తదజాతాంబు యత్నసాధ్యం నవోత్థితమ్. 37

తా. ఉదరరోగములన్నియు పుట్టుకతోనే కష్టసాధ్యములని తెలియవలయు. మరియు, బలముగల మనుజునికి నూతనముగ జనించిన అజాతోదకోదరము నవీనంబయ్యేనేని ప్రయత్నసాధ్యమగు ఆ అజాతోదకోదరలక్షణమును చరకమున సూచికొనవలయు *

అన్యచ్చ—

పక్షాద్బద్ధగుదం తూర్ధ్వం సర్వం జాతోదకం తథా,
ప్రాయో భవత్యభావాయ ఛిద్రాంత్రం చోదరం నృణామ్. 38

తా. బద్ధగుదోదరము ౧౫ దినములకుపైన నసాధ్యమగు. ఇటులనే సర్వోదరంబులు నీరుపట్టిన వెనుక మృత్యుప్రదంబులు. మరియు ఛిద్రాంత్రోదరము తరుచు మృత్యువును గలుగంజేయు. అనగా పోకానోకప్పుడు శల్యచికిత్సవలన (శస్త్రచికిత్స వలన) ఉదకపూరితమగు ఛిద్రాంత్రోదరము బద్ధగుదోదరము ఇవి సాధ్యములగునని తెలియవలయు.

* "అజాతోదక" మనగా నుపేక్షచే నన్నియు జలోదరముక్రిందికి మారును గాన నట్టి యవస్థరాకుండునప్పుడని తాత్పర్యము.

### అసాధ్యలక్షణము

శూనాక్షం కుటిలోపస్థ ముపక్లిన్నతనుత్వచమ్,
బలశోణితమాంసాగ్ని పరిక్షీణం చ వర్జయేత్. 39

తా. కన్నులుబ్బుట, శిశ్నము వంకరగనగుట, చర్మము క్లేదయుక్తమై పచ్చగ నుండుట, బలము, రక్తము, మాంసము, అగ్ని ఇవి క్షీణించుట, ఇట్టి లక్షణములుగల ఉదరరోగిని త్యజించవలయు.

అన్యచ్చ—

పార్శ్వభంగాన్నవిద్వేషశోభాతీసారపీడితమ్,
విరిక్తం చాప్యుదరిణం పూర్యమాణం వివర్జయేత్. 40

తా. పార్శ్వములు పగిలినటులనుండుట, అన్నద్వేషము, వాపు, అతిసారము, విరేచనములయినను తిరిగిపూరించుట, ఇట్టి లక్షణములుగల ఉదరరోగిని విసర్జించవలయు.

### వాతోదరమునకు కషాయము

ఏరండతైలం దశమూలమిశ్రం గోమూత్రయుక్తం త్రిఫలారజోవా,
నిహన్తి వాతోదరశోఫశూలం క్వాథస్సమూత్రో దశమూలజశ్చ.

తా. దశమూలచూర్ణమును ఆముదములో కలిపిగాని, త్రిఫలచూర్ణమును గోమూత్రమునందు వైచిగాని, దశమూలకషాయమునందు గోమూత్రముచేర్చిగాని పుచ్చుకొనిన వాతోదరము, వాపు, శూల, ఇవి నివర్తించు.

### ప్లీహోదరమునకు శరపుంఖాకల్కము

శరపుంఖామూలరజః పీతస్తక్రేణ నాశయత్యచిరాత్,
బహుతరకాలసముత్థం ప్లీహానం రూఢమవగాఢమ్. 42

తా. వెంపలివేరును కల్కముజేసి మజ్జికతో కలిపి పుచ్చుకొనిన చిరకాలోత్పన్నమగు ప్లీహోదరము నివర్తించు.

### రోహితకాదికల్కము

రోహీతకాభయాకల్కో గోమూత్రేణ విభావితః,
పీతస్సర్వోదరప్లీహామేహార్శః కృమిగుల్మనుత్. 43

తా. ములుమోదుగ కరక వీనిని కల్కముజేసి గోమూత్రములోగలిపి పుచ్చుకొనిన సర్వోదరములు, ప్లీహ, మేహము, అర్శస్సు, కృమి, గుల్మము ఇవి నివర్తించు.

### శిగ్రుకషాయము

శోఫం ప్లీహోదరం హన్తి పిప్పలీమరిచాన్వితః,

ఆమ్లవేతససంయుక్తశ్శిగ్రుక్వాథస్ససైంధవః. 44

తా. మునగవేరుపట్ట పిప్పళ్లు మిరియాలు ఆమ్లవేతసము వీటిని కషాయముబెట్టి అందు సైంధవలవణముజేర్చి పుచ్చుకొనిన వాపు ప్లీహోదరము ఇవి నివర్తించు.

యకృద్దాల్యుదరమునకు పిప్పలీకల్కము

పిప్పలీకల్కసంయుక్తం ఘృతం క్షీరం చతుర్గుణమ్,
పక్త్వా పిబేద్యథావహ్ని యకృద్దాల్యుదరాపహమ్. 45

తా. పిప్పలీకల్కమునందు కల్కమునకు ప్రత్యేకము నాలుగింతలు పాలు నెయ్యి చేర్చి కాచి చల్లార్చి పుచ్చుకొనిన యకృద్దాల్యుదరము నివర్తించుటయేగాక అగ్నిదీప్తి సగా గలుగు.

శోఫోదరములకు హరీతక్యాదికషాయము

హరీతకీనాగరదేవదారుపునర్నవాచ్ఛిన్నరుహాకషాయః,
సగుగ్గులుస్మూత్రయుతశ్చ పేయశ్శోఫోదరాణాం ప్రవరః ప్రయోగః.

తా. కరకవొలుపు, శొంఠి, దేవదారుచక్క, తెల్లగలిజేరువేరు, తిప్పతీగ వీనిని కషాయముబెట్టి అందు గుగ్గిలచూర్ణమువైచి గోమూత్రములోకలిపి సేవించిన శోఫోదరములు నివర్తించు.

పునర్నవాదికషాయము

పునర్నవా నింబపటోలశుంఠీ తిక్తామృతాదార్వ్యభయా కషాయః,
సర్వాంగశోఫోదరకాసశూల శ్వాసాన్వితం పాండుగదం నిహంతి.

తా. తెల్లగలిజేరువేరు, వేపఈనెలు, చేదుపొట్లు, శొంఠి, సీమనేలవేము, తిప్పతీగ, మానిపసపు, కరక వీనిని కషాయముబెట్టి సేవించిన సర్వావయవములయందలి వాపు ఉదరము దగ్గు శూల శ్వాస పాండువు ఇవి నివర్తించు.

వాతోదరమునకు సాముద్రాదిచూర్ణము

సాముద్రసౌవర్చలసైంధవాని క్షారో యవానామజమోదయుక్తః,
సపిప్పలీచిత్రకశృంగబేరహింగూవిడంగాని సమాని కుర్యాత్. 48
ఏతాని చూర్ణాని ఘృతప్లుతానిభుంజీతపూర్వైః కబళైః ప్రశస్తమ్,
వాతోదరం గుల్మమజీర్ణముగ్రం వాతప్రకోపం గ్రహణీం చ దుష్టామ్.
అర్శాంసి దుష్టాని చ పాండురోగం భగందరం చాపి నిహంతి సద్యః,

తా. సముద్రలవణము, సౌవర్చలవణము, సైంధవలవణము, యవక్షారము, ఓమము, పిప్పళ్లు, చిత్రమూలము, శొంఠి, ఇంగువ, వాయువిళంగములు వీనినన్నియు సమాంశ

ములుగచేర్చి చూర్ణించి భోజనముజేయునపుడు అన్నముతో జేర్చి నెయ్యివైచి మొదటి కవళముభక్షించిన వాతోదరము, గుల్మము, ఉగ్రమగు అజీర్ణము, వాతప్రకోపము, దుష్టమగు గ్రహిణి, దుష్టములగు అర్శస్సులు, పాండురోగము, భగందరము ఇవి నివర్తించు.

## ప్లీహోదరమునకు విడంగాదిచూర్ణము

విడంగాని యవానీచ చిత్రకశ్చేతి తత్సమమ్. 50
ద్విగుణం దేవదారుం చ నాగరం సపునర్నవమ్,
త్రివృద్భాగాశ్చచత్వార స్తత్సర్వం కల్కపేషితమ్. 51
క్షీరేణోష్ణేన పాతవ్యం శ్రేష్ఠం ప్లీహవినాశనమ్,
అథ చైతాని చూర్ణాని గవాం మూత్రేణ పాయయేత్. 52
ఉదరీభూతమప్యేవం ప్లీహానం సంప్రణాశయేత్,

తా. వాయువిళంగములు, ఓమము, చిత్రమూలము ఇవి యొక్కొకభాగము దేవదారు, శొంఠి, తెల్లగలిజేరువేరు ఇవి ప్రత్యేకము ౨ భాగములు, తెగడ ౪ భాగములు వీనినన్నిటియు నూరి కల్కముజేసి కొంచెము ఉష్ణముగనుండు పాలతోగాని, ఉష్ణోదకముతోగాని సేవించినను, లేక వీనిచూర్ణమును ఆవుపంచితములో కలిపి సేవించినను మహోదరము నివర్తించు.

## ఉదరములకు నారాయణచూర్ణము

చిత్రకం త్రిఫలావ్యోషం జీరకం హపుషా వచా. 53
యవానీ పిప్పలీమూలం శతపుష్పాఽజగంధికా,
అజామోదా శఠీ ధాన్యం విడంగం స్థూలజీరకమ్. 54
హేమాహ్వాపౌష్కరం మూలం క్షారౌ లవణపంచకమ్,
కుష్ఠం చేతి సమాంశాని విశాలా స్యాద్ద్విభాగికా. 55
త్రివృత్త్రిభాగా విజ్ఞేయా దన్త్యాభాగత్రయం భవేత్,
చతుర్భాగా సాతలాస్యాత్సర్వాణ్యేకత్ర చూర్ణయేత్. 56
పాచనస్నేహనాద్యైశ్చ స్నిగ్ధకోష్ఠస్య రోగిణః,
దద్యాచ్చూర్ణం విరేకాయ సర్వరోగప్రణాశనమ్. 57
హృద్రోగే పాండురోగే చ కాసే శ్వాసే భగందరే,
మందేఽగ్నౌ చ జ్వరే కుష్ఠే గ్రహణ్యాం చ గళగ్రహే. 58
దద్యాద్వ్యుక్త్యానుపానేన తథాధ్మానే సురాదిభిః,
గుల్మే బదరనీరేణ విట్సంగే దధిమస్తునా. 59

ఉష్ణాంబుభిరజీర్ణే చ వృతప్లైః పరికర్తిషు,
ఉష్ట్రీదుగ్ధేనోదరేషు తథా తక్రేణ వా గవామ్. 60
ప్రసన్నయా వాతరోగే దాడిమాంభోభిరర్శసి,
ద్వివిధే చ విషే దద్యాద్ఘృతేన విషనాశనమ్. 61

తా. చిత్రమూలము, త్రిఫలములు, శొంఠి, పెప్పలి, మిరియాలు, జీలకఱ్ఱ, బోడతరము, వస, అజామోదము, పిప్పలిమూలము, సదాప, వాయింటవేరు, ఓమము,కచ్చూరములు, ధనియాలు, వాయువిడంగములు, నల్లజీలకఱ్ఱ,కంటస్థము, పుష్కరమూలము, సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు, కోష్ఠువు ఇవి సమాంశములు, పాపరవేరు ౨ భాగములు, తెగడ ౩ భాగములు, దన్తివేరు ౩ భాగములు, సంబరేణి ఆకు ౪ భాగములు వీనినన్నియు చూర్ణించి యీచూర్ణము పాచన స్వేదనాదులచే లఘుకోష్ఠముగల రోగికి విరేచనార్థ మివ్వవలయు. మరియు యుక్తానుపానముచే పుచ్చుకొనిన హృద్రోగము, పాండురోగము, కాస,శ్వాస, భగందరము,మందాగ్ని,జ్వరము, కుష్ఠువు, గ్రహణి, గళగ్రహము ఇవి నివర్తించు. మరియు మద్యాదులచే పుచ్చుకొనిన ఆధ్మానము, రేగువేళ్లకషాయముచే పుచ్చుకొనిన గుల్మము, పెరుగుమీది తేటతో పుచ్చుకొనిన మలబద్ధము, ఉష్ణోదకముతో పుచ్చుకొనిన అజీర్ణము, చింతబెరడు కషాయముతో సేవించిన పరికర్తికారోగములు, ఒంటెపాలతోగాని ఆవుమజ్జిగతోగాని పుచ్చుకొనిన ఉదరములు, ప్రసన్నతో పుచ్చుకొనిన వాతరోగము, దాడింబవిత్తులరసముచే పుచ్చుకొనిన అర్శస్సు, నేతితోపుచ్చుకొనిన స్థావరజంగమవిషములు ఇవి యన్నియు నివర్తించు.

## హపుషాదిచూర్ణము

హపుషా త్రిఫలా చైవ త్రాయమాణా చ పిప్పలీ,
హేమక్షీరీ త్రివృచ్చైవ సాతలా కటుకా వచా. 62
నీలినీ సైంధవం కృష్ణా లవణం చేతి చూర్ణయేత్,
ఉష్ణోదకేన మూత్రేణ దాడిమత్రిఫలారసః. 63
తథా మాంసరసేనాపి యథాయోగ్యం పిబేన్నరః,
అజీర్ణే ప్లీహ్ని గుల్మేషు శోఫార్శోవిషమాగ్నిషు. 64
హలీమకామలాపాండుకుష్ఠాధ్మానోదరేష్వపి,

తా. బోడతరము, త్రిఫలములు, కలుగ్రానుగ, పిప్పలి, కంటస్థము, తెగడ, సంబరేణి, కటుకరోహిణి, వస, నీలిచెట్టు, సైంధవలవణము, పిప్పళ్లు, సౌవర్చలవణము వీనిని చూర్ణించి ఉష్ణోదకముతోగాని గోమూత్రముతోగాని లేక దాడింబరసముతో

గాని త్రిఫలకషాయముతోగాని మాంసరసముతోగాని యథాయోగ్యముగ సేవించిన అజీర్ణము, ప్లీహ, గుల్మము, వాపు, అర్శ, విషమాగ్ని, హలీమకము, కామిల, పాండువు, కుష్ఠువు, అధ్మానము, ఉదరము ఇవి నివర్తించు.

ప్లీహాగుల్మోదరములకు ఉదరావరరసము

భస్మసూతస్యవంగస్య పలైకైకంప్రయోజయేత్. 65
మృతం తామ్రం గంధకం చ ప్రత్యేకం చ పలం పలమ్,
అర్కక్షీరైర్దినం మర్ద్యం సర్వం తద్గోళకీకృతమ్. 66
రుద్ధ్వా తద్భూధరే పక్త్వా పుటైకేన సముద్ధరేత్,
ఏష వంగేశ్వరో నామ ప్లీహగుల్మోదరం జయేత్. 67
ఘృతే గుంజాద్వయం లేహ్యోకల్కైః పౌనర్ణవైస్తథా,

తా. రసభస్మము, వంగభస్మము, తామ్రభస్మము, శుద్ధిజేసిన గంధకము వీనిని ప్రత్యేకము ౧ పలమును జేర్చి ఖల్వమునందునిచి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి ముద్దజేసి మూకుటియందునిచి చీలమన్ను ఘుచ్చి భూధరపుటమిడి సాంగశీతలమున దీసి ౨ గురిగింజలయెత్తు నేతిలో తెల్లగలిజేరువేరు చూర్ణముచేర్చి దానితో పుచ్చుకొనిన ప్లీహ, గుల్మోదరములు నివర్తించు.

జలోదరమునకు త్రైలోక్యడంబరరసము

రసగంధకతామ్రాణి లోహమభ్రం విషం తథా. 68
టంకణం సర్జికాక్షారం దరదం చ కపర్దకమ్,
అర్కక్షీరేణ ఖల్వే చ వజ్రక్షీరేణ భావయేత్. 69
నిర్గుండ్యాభృంగరాజేన చార్ద్రద్రావేణ భావయేత్,
గుల్మే జలోదరే రోగే శోథే పాండౌ క్షయే తథా. 70
శూలే విషూచికాయాం చ హ్యనుపానైః ప్రయోజయేత్,
త్రైలోక్యడంబరో నామ కథితో రోగశాన్తయే. 71
వల్లమాత్రప్రమాణేన త్రిసప్తాహం ప్రదాపయేత్,
అత్రోదయాఖ్యమార్తాండో దేయఇత్యపి సంజ్ఞకః. 72

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, తామ్రభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, నాభి, వెలిగారము, సర్జక్షారము, ఇంగిలీకము, గవ్వలభస్మము వీనిని సమాంశములుగ ఖల్వమునందునిచి జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు, వావిలిరసము, గుంటగలిజేరుఆకురసము, అల్లపురసము వీనిచే ప్రత్యేకముగ భావనలుజేసి వల్లమాత్రము యుక్తానుపానములతో ౨౧ దినములు పుచ్చుకొనిన గుల్మము, జలోదరము,

వాపు, పాండువు, క్షయ, శూల, విషూచి ఇవి నివర్తించు. పై రోగములయందుదయ మార్తాండరసమునుకూడ వాడవలెనని చెప్పెదరు.

### జలోదరవిరేచనరసము

భృష్టటంకణతుల్యాం తు మరిచం చ రసం సమమ్,
గంధకం పిప్పలీ శుంఠీ ద్వౌ ద్వౌ భాగౌ విచూర్ణయేత్. 73
సర్వతుల్యం క్షిపేద్దన్తీబీజం సర్వమకల్మషమ్,
ద్విగుంజం రేచనం చైతదుదరాణి వ్యపోహతి. 74

తా. పేల్చినవెలిగారము, మిరియాలు, శుద్ధరసము ఇవి ప్రత్యేకము ౧ భాగము, శుద్ధగంధకము ౨ భాగములు, పిప్పళ్లు ౨ భాగములు, శొంఠి ౨ భాగములు, వీనిని చూర్ణించి వీనికన్నిటికి సమము శుద్ధిజేసిన నేపాళవిత్తులచూర్ణమును జేర్చి రెండు గురిగింజలయెత్తు సేవించిన విరేచనమును జేయుటయేగాక ఉదరరోగముల నివర్తింపజేయు.

### ఇచ్ఛాభేదిరసము

శుంఠీ మరిచసంయుక్తా రసగంధకటంకణాః,
జేపాలో త్రిగుణః ప్రోక్తో సర్వమేకత్ర మర్దితమ్. 75
ఇచ్ఛాభేదిరసో హ్యస్య ద్విగుంజం స సితం పిబేత్,
యావచ్చులకాః పీతాస్తావద్వారైర్విరిచ్యతే. 76
తక్రోదనం చ దాతవ్యం పథ్యమత్ర విజానతా,

తా. శొంఠి, మిరియాలు, పాదరసము, గంధకము, వెలిగారము ఇవి సమభాగములు, నేపాళము 3 భాగములుచేర్చి మర్దించి రెండు గురిగింజలయెత్తు పంచదారతో పుచ్చుకొని పిదప యెన్నిపుడిసిళ్ల నీళ్లుతాగిన నన్నిమార్లు భేదులగు. పథ్యము మజ్జిగ అన్న మిడవలయు.

### జలోదరమునకు వహ్నిరసము

చతుస్సూతంచగంధోష్టౌ రజనీ త్రిఫలా శిలా. 77
ప్రత్యేకం చద్విభాగంస్యాత్త్రివృజ్జేపాలచిత్రకే,
ప్రత్యేకం చ త్రిభాగం స్యాత్సూత్రిమణాం దన్తిజీరకమ్. 78
పత్యేకమష్టభాగం స్యా దేకీకృత్య విచూర్ణయేత్,
జయన్తీస్నుక్పయోభృంగవహ్నివాతారితైలకైః. 79
ప్రత్యేకేన క్రమాద్భావ్యం సప్తవారం పృథక్పృథక్,
మహావహ్నిరసో నామ నిష్కముష్ణజలైః పిబేత్. 80

విరేచనం భవే త్తేన తక్ర భక్తం ససైంధవమ్,
దినాన్తే దాపయేత్పథ్యం వర్జయేచ్ఛీతలం జలమ్. 81
సర్వోదరహరః ప్రోక్తో మూఢవాతహరః పరః,

తా, శుద్ధిజేసినపాదరసము ౪ భాగములు, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు, పసపు, త్రిఫలములు, మనశిల ఇవి ప్రత్యేకము ౨ భాగములు, శుద్ధిజేసిన తెల్ల తెగడ, శుద్ధిచేసిన నేపాళములు, చిత్రమూలము ఇవి ప్రత్యేకము 3 భాగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు. దన్తివేరు, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకము ౨ భాగములు, వీటినన్నిటిని నేకముగచేర్చి చూర్ణించి తక్కలిరసము, బొంత జెముడు పాలు, గుంటగలగరాకురసము, చిత్రమూలరసము, అముదము వీనిచే వేరువేరుగ నేడేసిమార్లు భావనలుజేసి నిష్కమాత్రము వేడినీళ్లతో పుచ్చుకొనిన విరేచనం బగుటయేగాక సర్వోదరములు మూఢవాతము ఇవి నివర్తించు. సాయంకాలమున మజ్జిగన్నమును భక్షించుట సైంధలవణమును చేర్చుకొనుట ఉష్ణోదకపానము ఇవి పథ్యములని తెలియవలయు.

## వాతోదరమునకు ఘృతము

దశమూలకషాయేణ రాస్నానాగరదారుభిః. 82
పునర్నవాభ్యాం చ ఘృతం సిద్ధం వాతోదరాపహమ్,

తా. దశమూలములు, రాస్న, శొంఠి, దేవదారు, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు వీనికషాయముచే సిద్ధమగు ఘృతమును సేవించిన వాతోదరము నివర్తించు.

## రోహితకఘృతము

రోహీతకాత్పలశతం సంశుద్ధ్య బదరాఢకమ్. 83
సాధయిత్వా జలద్రోణే చతుర్భాగావశేషితే,
ఘృతప్రస్థం సమావాప్య ఛాగక్షీరం చతుర్గుణమ్. 84
తస్మిన్ ద్రవ్యాణి సర్వాణి ప్రదద్యాత్కార్షికానిచ,
వ్యోషం ఫలత్రికం హింగుయవానీం తుంబురుం బిడమ్. 85
విడంగం చిత్రకం చైవ హపుషాం చవికం వచామ్,
అజాజీంకృష్ణలవణం దాడిమం దేవదారు చ. 86
పునర్నవాం విశాలాంచ యవక్షారం సపౌష్కరమ్,
ఏతైర్ఘృతం విపక్వం తు నిదధ్యాద్దృఢభాజనే. 87
పాయయేచ్చ పలం మాత్రాం రసయూషపయోంబుభిః.
యకృత్ప్లీహోదరం శూలమగ్నిమాంద్యం చ నాశయేత్. 88

కుక్షిశూలం పార్శ్వశూలం కటిశూలమరోచకమ్,
విబంధశూలం శమయేత్పాండురోగం స కామలమ్. 89
ఛర్ద్యతీసారశమనం తంద్రాజ్వరనివారణమ్,
మహారోహీతకం నామ్నా ప్లీహఘ్నం తు విశేషతః. 90

తా. ములుమోదుగవేరు ౧౦౦ పలములు, శేగువేరు ౨౮ పలములు, వీనిని నలియగొట్టి ద్రోణప్రమాణోదకమునందువైచి నాలవపాలు మిగులునటుల కషాయము కాచి వడియగట్టి అందొక ప్రస్థము నెయ్యి, నాలుగుప్రస్థములు మేకపాలు, త్రికటుకములు, త్రిఫలములు, ఇంగువ, ఓమము, ధనియాలు, బిడాలవణము, వాయువిడంగములు, చిత్రమూలము, బోడతరము, చవ్యము, వస, జీలకఱ్ఱ, కృష్ణలవణము, దాడింబవోలుపు, దేవదారు, తెల్లగలిజేరు, శాపరవేరు, యవక్షారము, పుష్కరమూలము వీనినన్నియు ప్రత్యేకము ౧ కర్ష మెత్తుచూర్ణించిచేర్చి ఘృతపక్వముగవండి పలమాత్రము మాంసరసము యూషము పాలు గోమూత్రము వీనితో పానముజేసిన యకృత్ప్లీహోదరము, శూల, అగ్నిమాంద్యము, కుక్షిశూల, పార్శ్వశూల, కటిశూల, అరుచి, విబంధశూల, పాండురోగము, కామిల, ఛర్ది, అతిసారము, తంద్ర, జ్వరము, ఇవి నశించును. ఇది విశేషించి ప్లీహోదరమును నివర్తింపజేయు మహారోహీతాది ఘృతము.

— చిత్రకాదిఘృతము —

చిత్రకస్య తులాక్వాథే ఘృతప్రస్థం విపాచయేత్,
ఆరనాళం ద్విగుణితం దధిమండం చతుర్గుణమ్. 91
పంచకోలకతాళీసద్విక్షార పటుపంచకమ్,
యవాన్యౌ ద్వే చ జరణే మరిచం చాక్షసమ్మితమ్. 92
ఏతైర్యుక్త్వా ఘృతం సిద్ధం మాత్రయా చ పిబేత్ప్రగే,
ప్లీహాశో ఘోద రార్శోఘ్నం విశేషాదగ్నిదీపనమ్. 93

తా. చిత్రమూలము ౧౦౦ పలములువైచి నాల్గునీరులో నాలవపాలు మిగులునట్లు కషాయము బట్టి వడియగట్టి అందొక ప్రస్థము నెయ్యి, కాంజికము ౨ ప్రస్థములు, పెరుగుమీదితేట నాలుగు ప్రస్థములు, పంచకోలములు, తాళీసపత్రి, యవక్షారము, సర్జక్షారము, పంచలవణములు, ఓమము, కురాసానిఓమము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, మిరియాలు వీనినన్నియు ప్రత్యేకము అక్షప్రమాణములుగ జేర్చి చూర్ణించివైచి ఘృతపక్వముగవండి ప్రాతఃకాలమునందు సప్రమాణముగ పుచ్చుకొనిన ప్లీహశోఫోదరము, అర్శస్సు ఇవి నివర్తించుటయేగాక విశేషముగ అగ్నిదీప్తియును కలుగు

## బిందుఘృతము

అర్కక్షీరం పలే ద్వేతు స్నుహిక్షీర పలాని షట్,
పథ్యాత్వాకంపిల్లకం శ్యామాశమ్యాకం గిరికర్ణికా. 94
నీలినీ త్రివృతా దన్తీ శంఖినీ చిత్రకం తథా,
ఏషాం చ పలికై ర్భాగై ర్ఘృతప్రస్థం విపాచయేత్. 95
అథాస్య మలినేకోష్ఠే బిందుమాత్రం ప్రదాపయేత్,
యావదస్య పిబేద్బిందూంస్తావద్వేగాద్విరిచ్యతే. 96
కుష్ఠం గుల్మముదావర్తం శ్వయథుం సభగందరమ్,
శమయత్యుదరాన్యష్టౌ వృక్షమింద్రాశనిర్యథా. 97
ఏతద్బిందుఘృతం నామ యేనాభ్యక్తో విరిచ్యతే,

తా. జిల్లేడుపాలు ౨ పలములు, బొంతజెముడుపాలు ౬ పలములు, కరక్కాయవోలుపు, కంపిల్లము, నల్లతెగడ, రేలగిజరు, శ్వేతగిరికర్ణిమూలము, నీలి, ఆలతెగడ, నేపాళవిత్తులు, శంఖిని, చిత్రమూలము వీనిని ప్రత్యేకము ౧ పలము వంతున జేర్చి కషాయము బెట్టి వడియగట్టి ఆకషాయమునం దొక ప్రస్థము నెయ్యిజేర్చి ఘృతపక్వముగవండి మలినకోష్ఠముగల మనుజు డొకబిందుమాత్రము పుచ్చుకొనిన నుత్తరక్షణమునందే విరేచనమవుటయేగాక కుష్ఠము, గుల్మము, ఉదావర్తము, వాపు, భగందరము, అష్టోదరములు ఇవి నివర్తించునని తెలియవలయు, మఱియు నీఘృత మెన్ని బిందువులు పానముచేసిన నన్ని విరేచనము లగును.

## నారాచఘృతము

త్రిఫలా చిత్రకోద న్తీ బృహతీ కంటకారికా. 98
స్నుహీచార్కవిడంగేనఘృతస్య కుడవే పచేత్,
తస్య మృద్వగ్నిసిద్ధస్య కర్షార్ధం పాయయేన్నరమ్. 99
శోఫగుల్మోదరానాహప్లీహోదరజలోదరాన్,
నాశయత్యుల్బణానేతాన్ సర్పిర్నారాచసంజ్ఞితమ్. 100

తా. త్రిఫలములు, చిత్రమూలము, నేపాళపువిత్తులు, వాకుడు, ములక, వీటి వేళ్లు బొంతజెముడువేళ్లు, జిల్లేడువేళ్లు, వాయువిడంగములు వీనిని కషాయముబెట్టి వడియగట్టి అందు నెయ్యి ఒకకుడువము జేర్చి, మందాగ్నిచే ఘృతము సిద్ధపరిచి అర్ధకర్షము సేవించిన శోఫ, గుల్మము, ఉదరము, కడుపుబ్బు, ప్లీహోదరము, జలోదరము, వీటి ఉల్బణములు అన్నియు నివర్తించు.

## శుక్తిక్షారయోగము

పాతవ్యో యుక్తితః క్షారః క్షీరేణోదధిశుక్తిజః,
పయసా వా ప్రయోక్తవ్యాః పిప్పల్యః ప్లీహనాశకాః. 101

తా. సముద్రమునందుబుట్టిన ఆలుచిప్పలయొక్క క్షారను పాలలోకలిపి పుచ్చుకొనినను, లేక పిప్పలిచూర్ణమును పాలతో సేవించినను ప్లీహోదరము నివర్తించు.

## వజ్రక్షారము

సౌవర్చలం యవక్షారం సాముద్రం కాచసైంధవే,
టంకణం స్వర్జికాక్షారం తుల్యమేకత్ర చూర్ణయేత్. 102
అర్కదుగ్ధైః స్నుహీదుగ్ధైర్భావయేదాతపేత్ర్యహమ్,
ఊర్ధ్వాధస్థైః క్రమాత్తస్య తత్తుల్యైరర్కపల్లవైః. 103
భాండే సంస్థాప్య మృల్లిప్తే రుద్ధ్వా గజపుటే పచేత్,
స్వాంగశీతం తు సంచూర్ణ్య చూర్ణమేషాం తు మేళయేత్. 104
త్ర్యూషణం చ విడంగం చ రాజికాం త్రిఫలామపి,
చవ్యం చ హింగుసంభృష్టం తక్రేణాద్యాద్యథాబలమ్. 105
వజ్రక్షారాభిధం చూర్ణముదరాణి వినాశయేత్,
శోథం గుల్మం తథాష్ఠీలాం మందాగ్నిమరుచిం తథా. 106
ప్లీహానం యకృదాల్యాఖ్య ముదరం చ విశేషతః,

తా. సౌవర్చలవణము, యవక్షారము, సాముద్రలవణము, కాచలవణము, సైంధవలవణము, వెలిగారము, సర్జక్షారము వీటిని సమాంశములుగ గ్రహించి చూర్ణించి జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు వీనిచే మూడుదినములు భావనచేసి యెండించి మూకుడుయందు జిల్లేడుఆకులుంచి అందుపై ఈ ఔషధమునునిచి మరల పైని జిల్లేడు ఆకులుంగప్పి మూకుడుబోర్లించి చీలమన్నుయిచ్చి గజపుటంబిడి సాంగశీతలమునదీని చూర్ణించి శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, తెల్లఆవాలు, త్రిఫలములు, చవ్యము, వేల్చినఇంగువ, వీనినన్నియుచూర్ణించి కలిపి మజ్జిగతో బలానుసారముగ పుచ్చుకొనిన అష్టోదరములు, శోఫ, గుల్మము, అష్ఠీల, మందాగ్ని, అరుచి, ప్లిహ, యకృద్దాల్యోదరము ఇవి నివర్తించు.

## క్షారాదియోగము

క్షారం వా బిడకృష్ణాభ్యాం పూతీకస్యాంబుమిశ్రితమ్. 107
యకృత్ప్లీహప్రశాంత్యర్థం పిబేత్ప్రాతర్యథాబలమ్,

తా. నెమలిచెక్క కషాయమునందు యవక్షారము, బిడాలవణము, పిప్పలి చూర్ణముచేర్చి ప్రాతఃకాలమున బలానుసారముగ పుచ్చుకొనిన యకృత్ప్లీహోదరములు నివర్తించు. లేక నెములడుగుచెక్క కాల్చిన బూడిదతో సిద్ధమైనక్షారము. బిడాలవణము, పిప్పళ్లు వీనిచూర్ణముమ నీటిలోగలిపి పుచ్చుకోవలెను.

అగ్నిముఖలవణము

చిత్రకత్రివృతాదన్తీత్రిఫలారుచకైస్సమైః. 108
యావన్త్యేతాని చూర్ణాని చూర్ణతావత్తుసైంధవమ్,
భావయిత్వా స్నుహిక్షీరైః స్నుక్కాండే ప్రక్షిపేత్తతః. 109
మృత్పంకేనానులిప్త్వాథ ప్రక్షిపేజ్జాతవేదసి,
సుదగ్ధం చ తతో జ్ఞాత్వా శనైర్వైద్యస్సముద్ధరేత్. 110
తక్రేణ పీతం తచ్చూర్ణం యకృత్ప్లీహోదరాపహమ్,
ఏతదగ్నిముఖం నామ్నా లవణం వహ్నివర్ధనమ్. 111

తా, చిత్రమూలము, తెగడ, దంతిబీజములు, త్రిఫలములు, సౌవర్చలవణము వీనిని సమముగచూర్ణించి యీచూర్ణమునకు సమము సైంధవలవణమునుజేర్చి బొంత జెముడు పాలతో భావనజేసి ముద్దజేసి బొంతజెముడు కఱ్ఱయందు బిలంబొనర్చి అందునిచి మూతమూసి చీలజేసి అగ్నియందునిచికాల్చి బాగుగ కాలినపిదప మెల్లగదీసి చూర్ణించి ఆచూర్ణమును బలానుసారముగ మజ్జిగలోగలిపి పుచ్చుకొనిన యకృత్ప్లీహోదరములు మానుటయేగాక అగ్నిదీప్తిని సగాగలుగంజేయు ఇది అగ్నిముఖ లవణమనంబడు.

వర్ధమానపిప్పలి

త్రిభిరథ పరివృద్ధం పంచభిస్సప్తభిర్వా దశభిరథ వివృద్ధం పిప్పలీవర్ధమానమ్,
ఇతి పిబతి యువా యస్తస్య న శ్వాసకాసజ్వరజఠరగుదార్శోవాతరక్తక్షయాస్స్యుః. 112

తా. మూడు, అయిదు, యేడు, పది ఇటుల క్రమవృద్ధిగ పిప్పలిని సేవించిన వానికి శ్వాస, కాస, జ్వరము, ఉదరము, గుదార్శస్సు, వాతరక్తము, క్షయ ఇవి బాధించవు. ఇది వర్ధమానపిప్పలి యనంబడు.

శోథోదరమునకు పునర్నవాదియోగము

పునర్నవాదారుమహౌషధాంబుగోమూత్రసిద్ధశ్శ్వయథుంనిహన్తి,
తథా కణాశుంఠిగుడోత్థచూర్ణం శోథామశూలఘ్నమజీర్ణహారి. 113

గవాం క్షీరం పరామిశ్రం శోఫోదరవినాశనమ్,
గోమూత్రేణ సమాయుక్తం మహిషీణాం పయోథవా. 114

తా. తెల్లగలిజేరువేరు, దేవదారు, శొంఠి వీనిని గోమూత్రమునందువైచి కాచి పుచ్చుకొనిన వాపు నివర్తించు. పిప్పళ్ళు, శొంఠి, వీనినిచూర్ణించి బెల్లముచేర్చి పుచ్చుకొనిన శోఫ, ఆమశూల, అజీర్ణము ఇవి నివర్తించు. మరియు త్రిఫలాచూర్ణమును ఆవుపాలలోకలిపి పుచ్చుకొనిన శోఫోదరము నివర్తించు; లేక గోమూత్రముతోగాని బర్రెపాలలోగాని కలిపి పుచ్చుకొనినను శోఫోదరము నివర్తించు.

ఉదరరోగమునకు పథ్యములు

విరేచనం లంఘనమబ్దసంభవాశ్శాలయో యవాః,
మృగద్విజా జాంగలసంజ్ఞయాన్వితా పేయా సురామాక్షికసింధుమాషకాః. 115
తక్రం రసోనోఽసుబుత్తైలమార్ద్రికంశాలించశాకంసలకంకటిల్లకమ్,
పునర్నవాశిగ్రుఫలంహరీతకీతాంబూలమేలాయసశూకమాయసమ్. 116
అజాగవోష్ట్రీమహిషీపయోజలం లఘూని తీవ్రాణి చ దీపనాన్యపి,
యథాబలంపథ్యగణోయమాశ్రితోఽసుఖాన్నృణాం స్యాదుదరామయేసతి.

తా. రేచనము, లంఘనము, సంవత్సరముగడిచిన వులసలు, వసలు, యొఱ్ఱవడ్లు, యవలు, జాంగలమృగములు, జాంగలపక్షులు వీనిమాంసము, మద్యము, తేనె, సైంధవలవణము, బిడాలవణము, మజ్జిగ, ఉల్లిగడ్డలు, ఆముదము, అల్లము, పొన్నగంటికూర, చేదుపొట్లకాయ, కాకరకాయ, తెల్లగలిజేరుఆకు, మునగకాయలు, కరక్కాయలు, తాంబూలము, ఏలకులు, యవక్షారము, లోహము, మేక ఆవు ఒంటె బర్రె వీనిపాలు, వీనిమూత్రము, లఘుపదార్థములు, కారమగుపదార్థములు, అగ్నిదీపకపదార్థములు వీనిని ఉదరరోగముగలవారలకు దోషబలాబలముల నెరింగి పథ్యంబిడవలయు.

అపథ్యములు

సంస్నేహనం ధూమపానం జలపానం శిరావ్యధః,
ఛర్ది ర్వ్యానందివానిద్రా వ్యాయామం పిష్టసైకృతమ్. 118
ఔదకానూపమాంసాని పత్రశాకాస్తిలాఅపి,
తృష్ణాతీవవిదాహీని లవణాన్యశనాని చ. 119
మహేంద్రగిరిజాతానాం సరితాం సలిలానిచ,
శింబీధాన్యం విరుద్ధాన్నం దుష్టనీరం గురూణి చ. 120

విష్టంభీని విశేషేణ స్వేదవిష్టంభసంభవౌ,
వర్జయేదుదరవ్యాధౌ వైద్యో రక్షన్నిజం యశః. 121

తా. స్నేహానము, ధూమపానము, జలపానము, శిరావేధనము, వాంతి, మార్గగమనము, పగటినిద్ర, వ్యాయామము, పిండితో చేసినపదార్థములు, మరియు ఉదకమునందుండు జంతువులు, జలసమీపమునందుండు మత్స్యాదులు వీనిమాంసము, అరుకూరలు, నువ్వులు, దప్పి, విదాహకరఅన్నము, లవణయుక్తమగు అన్నము మహేంద్రపర్వతసంబంధముగల నదులఉదకము, పప్పులు, క్షీరముతో వ్యాధివిరుద్ధాన్నము, దుష్టోదకము, గురుకరాన్నము, మలబంధకరఅన్నము, చమటనుదీయుట, మలబంధనము వీనిని ఉదరరోగి వర్జించవలయు.

---

# అండవృద్ధిప్రకరణమ్.

## అండవృద్ధి-సంప్రాప్తి

క్రుద్ధోనూర్ధ్వగతిర్వాయుశ్శోథశూలకరశ్చరన్,
ముష్కౌ వంక్షణతః ప్రాప్య ఫలకోశాభివాహినీః. 1
ప్రపీడ్య ధమనీర్వృద్ధిం కరోతి ఫలకోశయోః,

తా. అన్నపానాదివిరోధములవలన అధోముఖముగ సంచరించువాతము ప్రకోపించి వృషణములయందు వ్యాపించి వాపు పోట్లు వీనిని గలుగజేసి గజ్జలు వృషణకోశములు వీనియందు వ్యాపించియుండునాడులను దుష్టములుగజేసి ఒకటినిగాని లేక రెంటినిగాని అండములను వృద్ధిజేయుచున్నయది.

## అండవృద్ధిభేదములు

దోషాస్రమేదోమూత్రాంత్రైస్సవృద్ధిస్సప్తధా గదః. 2
మూత్రాంత్రజావప్యనిలాద్ధేతుభేదస్తు కేవలమ్,

తా. వాతజము, పిత్తజము, శ్లేష్మజము, రక్తజము, మేదోజము, మూత్రజము, ఆంత్రజములన ఇటుల అండవృద్ధి యేడువిధములుగనుండు. అందు మూత్రజము ఆంత్రజము యీ రెండును వాతములవలన జనించినవైనను కారణముమాత్రము భేదముగనుండు.

## వాతాద్యండవృద్ధిలక్షణము

వాతాత్ పూర్ణదృతిస్పర్శో రూక్షో వాతాదహేతురుక్. 3

పక్వోదుంబరసంకాశః పిత్తాద్దాహోష్మపాకవాన్,
కఫాచ్ఛీతో గురుస్స్నిగ్ధః కండూమాన్ కఠినోల్పరుక్. 4
కృష్ణస్ఫోటావృతః పిత్తవృద్ధిలింగశ్చ రక్తజః,
కఫవన్మేదసో వృద్ధిర్మృదుస్తాలఫలోపమః. 5

తా. వాయువువలన నిండింపబడిన తిత్తిని స్పృశించిన యెట్టిస్పర్శ గలుగునో అట్టి స్పర్శతో తుల్యమై, రూక్షత, నిష్కారణముగ నొప్పి ఇవి గలిగియుండునది వాతజాండవృద్ధియనియు, పండిన మేడిపండుతో తుల్యంబై, తాపము, ఉష్ణము, పాకము, వీనితో గూడియుండునది పిత్తజాండవృద్ధియనియు, శీతము, జడము, నునుపు, దురద, కాఠిన్యము, స్వల్పవేదన ఇవి గలిగియుండునది శ్లేష్మజాండవృద్ధియనియు, నల్లనిపొరుపులతో గూడుకొని పిత్తవృద్ధిలక్షణయుక్తమై యుండునది రక్తజాండవృద్ధియనియు, కఫలక్షణములతో గూడి మృదువుగ పక్వతాళఫలమువలె నల్లనికాంతిగలిగి గుండ్రముగ నుండునది మేదోజాండవృద్ధియనియును తెలియవలయు.

మూత్రజఅండవృద్ధిలక్షణము

మూత్రధారణశీలస్యమూత్రజస్సతుగచ్ఛతః,
అంభోభిఃపూర్ణదృతివత్ క్షోభంయాతిసరుజ మృదుః. 6
మూత్రకృఛ్రమథస్యాచ్చచలయోఃఫలకోశయోః,

తా. మూత్రమును బిగబట్టునభ్యాసముగల మనుజునియొక్క అండము నడుచుచుండుకాలమున, నుదకముతో నిండినతోలుతిత్తివలె క్షోభ కొంచెము నొప్పి స్పృశించినమృదువు ఇవి గలదై మూత్రము సాధారణముగ వెడలక అండకోశముల యందు నిండింపబడి ఇటునటుకదలుచుండిన మూత్రజఅండవృద్ధియని తెలియవలయు.

అంత్రజవృద్ధిలక్షణము

వాతకోపిభిరాహారైశ్శీతతోయావగాహనైః. 7
ధారణేరణభారాధ్వవిషమాంగప్రవర్తనైః,
క్షోభణైఃక్షుభితోన్యైశ్చక్షుద్రాంత్రావయవంయదా. 8
పవనోవిగుణీకృత్యస్వనివేశాదధోనయేత్,
కుర్యాద్వంక్షణసంధిస్థోగ్రంధ్యాభం శ్వయథుం తథా. 9

తా. వాతప్రకోపకరములగు ఆహారములవలనను, శీతోదకమునందు స్నానాదులవలనను, సమీపించు మలమూత్రాదివేగముల నడ్డగించుటవలనను, శీఘ్రముగ రానిమలమూత్రాదులను ప్రేరణచేయుటవలనను, మిక్కిలి భారమును మోయుట మిక్కిలి దూరమునడుచుట వక్రముగనడుచుట వీనివలనను, ఇతరులచే చేయబడు బల

నద్విగ్రహాదులచే మనఃక్షోభముగలుగుటవలనను, వాతము ప్రకోపించి చిన్న పేగుల యందొకభాగమును ఆశ్రయించి దానిని చెరచి స్వస్థానమునుంచి క్రిందికి దిగునట్లు చేయును. అపుడు గజ్జలసంధులయందు గ్రంధివలె వాపును గలుగంజేయు.

ఉపేక్షితాండవృద్ధిపరిణామము

ఉపేక్షమాణస్య చ ముష్కవృద్ధిం ఆధ్మానరుక్ స్తంభవతీం సవాయుః,
ప్రపీడితోఽంతస్స్వన వాన్ప్రయాతి ప్రధ్మాపయన్నే తిపునశ్చముక్తః.

తా. అట్లు వాపు పొట్లు ఈడుపుగల అంత్రమాండవృద్ధియందు చికిత్సచేయక నుపేక్షించిన అండమును బిసికిన యందలి వాతము కోకోయని శబ్దమునుజేయుచు పైకేగును. దానినివిడిచిన మరలదిగి యండమునందు వాపునుగలుగంజేయు

అసాధ్యాండవృద్ధిలక్షణము

క్షుద్రాంత్రావయవాత్ శ్లేష్మా ముష్కయోర్యత్ర సంచితః,
ఆంత్రవృద్ధిరసాధ్యోఽయం వాతవృద్ధిసమాకృతిః. 11

తా. చిన్న పేగుయొక్క భాగముగుండ అండములయందు శ్లేష్మముజేరుటవలన వాతవృద్ధిలక్షణయుక్తమై జనించిన అంత్రవృద్ధి అసాధ్యము.

వర్ధ్మలక్షణము

అత్యభిష్యందిగుర్వమ్లసేవనాన్నిచయం గతః,
కరోతిగ్రంధివచ్ఛోఫం దోషో వంక్షణసంధిషు. 12
జ్వరశూలాంగదాహాఢ్యం తం వర్ధ్మమితి నిర్దిశేత్,

తా. అత్యంతస్రోతస్స్రావులగునట్టియు, గురుత్వము పులుసుగల పదార్థసేవన వలన, వృద్ధిజెందినదోషము గజ్జలయొక్క సంధులయందు గ్రంధివలె వాపునుగలుగంజేయు. అందువలన జ్వరము, శూల, శరీరతాపము, ఇవి గలిగియుండు. దీనినే వర్ధ్మయని జెప్పెదరు. (దీనిని కురండమందురు)

అసాధ్యాంత్రవృద్ధి నిదానము

వృద్ధిస్సప్తవిధా జ్ఞేయా ఫలకోశవిదూషణాత్. 13
ఆంత్రజోధ్మాతవస్తిశ్చ శ్వాసశూలీ న సిధ్యతి,

తా. అపానవాయువు ప్రకోపించి వృషణములదూషింపజేయుటచేత సప్త వృద్ధులనుగలుగంజేయు. ఆయపానవాతము అండములయందు వ్యాపించి దోషయుక్తముగచేసి పొత్తికడుపుయందు ప్రేగులనుబ్బించినగాని లేక శ్వాస శూల ఇవి గలిగి యుండినగాని అట్టి అంత్రవృద్ధి యసాధ్యమని తెలియవలయు.

⟶ పిత్తజాండవృద్ధికి పంచవల్కలాదికల్కము ⟵

పంచవల్కలకల్కేన సఘృతేన ప్రలేపనమ్. 14
పానం వాపి కషాయస్య పిత్తవృద్ధౌ ప్రశస్యతే,

తా. మఱ్ఱి, అత్తి, జువ్వి, కలజువ్వి, మామిడి వీనిపట్ట కల్కముజేసి నెయ్యి చేర్చి లేపనముజేసినను లేక కషాయముపెట్టి పుచ్చుకొనినను పిత్తజాండవృద్ధి నివర్తించు.

⟶ కఫజాండవృద్ధికి త్రికట్వాదికషాయము ⟵

త్రికటుత్రిఫలాక్వాథం సక్షారలవణం పిబేత్. 15
కఫవాతప్రకోపఘ్నం విరేకాత్కఫవృద్ధిజిత్,

తా. త్రికటుకములు, త్రిఫలములు వీనిని కషాయముబెట్టి అందు యవక్షారము, సైంధవలవణము వీనినిచేర్చి పుచ్చుకొనిన కఫవాతకోపము నడచి విరేచనమగుట వలన కఫవృద్ధి నివర్తించు.

⟶ రక్తజాండవృద్ధికి త్రివృతాదికషాయము ⟵

త్రివృతంప్రపిబేత్క్షౌద్రే శర్కరాసహితం ముహుః. 16
పిత్తగ్రంధిక్రమం కుర్యా దామే పక్వే చ రక్తజే,

తా. తెగడకషాయమునందు చక్కెర తేనెచేర్చి మాటిమాటికి పుచ్చుకొనిన రక్తజాండవృద్ధి నివర్తించు. మరియు ఆమరక్తజవృద్ధి పక్వరక్తజవృద్ధి వీనికి పిత్త గ్రంధికిజేయు ఉపచారములం జేయవలయు.

⟶ రాస్నాదికషాయము ⟵

రాస్నాయష్ట్యమృతైరండం పటోలం రేణుకాబలా. 17
వృషస్యాత్క్వథితో వృద్ధిం హన్యాచ్చిత్రకతైలవాన్,

తా. రాస్న, యష్టిమధుకము, తిప్పతీగ, ఆముదపువేరు, చేదుపొట్ల, రేణుకలు, చిట్టాముట్టి, అడ్డసరము, వీనిని కషాయముబెట్టి అందు ఆముదముచేర్చి పుచ్చుకొనిన అండవృద్ధి నివర్తించు.

⟶ వాతశ్లేష్మజవృద్ధికి త్రిఫలాదికషాయము ⟵

ఫలత్రికోద్భవం క్వాథం గోమూత్రేణైవ పాయయేత్. 18
వాతశ్లేష్మకృతం హన్తి శోథం వృషణసంభవమ్,

తా. త్రిఫలములను గోమూత్రమునందువైచి కషాయముకాచి పుచ్చుకొనిన వాతశ్లేష్మజన్యమగు వృషణశోఫ నివర్తించు.

⟶ అంత్రవృద్ధికి రాస్నాదికషాయము ⟵

రాస్నామృతా బలా యష్టి గోకంటైరండజశ్శృతః. 19

ఏరండతైలసంయుక్తో వృద్ధిమంత్రభవాం జయేత్,

తా. రాస్న, తిప్పతీగ, చిట్టాముట్టి, యష్టిమధుకము, పల్లేరు, ఆముదపువేరు, వీనిని సమాంశములుగ కషాయముబెట్టి అందు ఆముదముకలిపి పుచ్చుకొనిన అంత్రవృద్ధి నివర్తించు.

వర్ధ్మరోగమునకు కల్కము

భృష్టశ్చైరండతైలేన కల్కః పథ్యాసముద్భవః. 20
కృష్ణాసైంధవసంయుక్తోవర్ధ్మరోగహరః పరః,

తా ఆముదములో వేచిన కరకచూర్ణము, పిప్పలిచూర్ణము, సైంధవలవణము, వీటిని కలిపిపుచ్చుకొనిన వర్ధ్మరోగము నివర్తించు

కురంటకమునకు హారీతకీచూర్ణము

గోమూత్రసిద్ధాంరుబుతైలభృష్టాంహారీతకీంసైంధవచూర్ణయుక్తామ్.
ఖాదేన్నరఃకోష్ణజలానుపానాన్నిహన్తికూరంటమతీవవృద్ధమ్,

తా. కరక్కాయలను గోమూత్రమునందు వండి పిదప ఆముదమునందు వేయించి చూర్ణించి సైంధవలవణమునుజేర్చి సుఖోష్ణముగనుండు నుదకములో పుచ్చుకొనిన మిక్కిలి వృద్ధినందిన కురంటకము నివర్తించు. (ఇదియే వర్ధ్మ)

వర్ధ్మరోగమునకు బిల్వాదిచూర్ణము

మూలం బిల్వకపిత్థయోరరళుకస్యాగ్నేర్బృహత్యోర్ద్వయోః. 22
శ్యామాపూతికరంజశిగ్రుతరుజంవిశ్వౌషధారుష్కరే,
కృష్ణాగ్రంథికవేల్లపంచలవణక్షారాజమోదాన్వితమ్. 23
పీతం కాంజికకోష్ణతోయమథితైశ్చూర్ణీకృతం వర్ధ్మజిత్,

తా. బిల్వమూలము, వెలగవేరు, దుండిగపువేరు, చిత్రమూలము, ములకవేరు, వాకుడువేరు, తెగడ, నెమలడుగువేరు, కానుగవేరు, మునగవేరు,శొంఠి,నల్లజీడివేరు,పిప్పళ్లు, మోడి, మిరియాలు, పంచలవణము, యవక్షారము, అజామోదము, క్షారములు వీనిని సమాంశములుగ చూర్ణించి కాంజికము లేక ఉష్ణోదకము లేక మజ్జిగ వీనితో పుచ్చుకొనిన వర్ధ్మరోగము మానును

శ్వదంష్ట్రాదిచూర్ణము

శ్వదంష్ట్రాసింధువిశ్వాబ్దదారుకృమిహారాశ్మభిత్. 24
లోహచూర్ణం ఘృతేనాద్యాద్వాతవర్ధ్మహారం పరమ్,

తా. పల్లేరు, సైంధవలవణము, శొంఠి, తుంగముస్తలు, దేవదారు, వాయు

విడంగములు, పాషాణభేది, లోహభస్మము వీటిని సమాంశములుగ చూర్ణించి నేతితో పుచ్చుకొనిన వాతవర్ధ్మరోగము నివర్తించు.

వృద్ధినాశనరసము

రసగంధౌ సమౌ తాభ్యాం ద్విగుణం హేమమాక్షికమ్. 25
పథ్యారసేన త్రిదినం రుబుతైలేన వాసరమ్,
మర్దితం సిద్ధమాయాతి రసేంద్రో వృద్ధినాశనః. 26

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము ఇవి సమభాగములు, వీనికి సమము శుద్ధిజేసిన హేమమాక్షికము వీనిని ఖల్వమునందునిచి కరకకషాయముచే మూడుదినములు మర్దించి, పిదప ఆముదముచే నొకదినముమర్దించి సేవించిన అండవృద్ధి నివర్తించు. ఇది వృద్ధినాశనరసము.

సర్వాంగసుందరరసానుపానము

బలాతైలేన వా లిహ్యాచ్ఛణకక్వాథతో ऽసి వా,
చేతకీయవశూకాభ్యాం పథ్యారుబుకతైలయుక్. 27
వృద్ధ్యాటవీకుఠారోయం రసస్సర్వాంగసుందరః,

తా. సర్వాంగసుందరరసమును బలాతైలముతోగాని లేక శనగలకషాయముతోగాని లేక కిరకయవక్షారము వీనిచూర్ణముతోగాని లేక ఆముదముతోగాని సేవించిన అండవృద్ధి నివర్తించు.

పిత్తవృద్ధికి చందనాదిలేపము

చందనం మధుకం పద్మముశీరం నీలముత్పలమ్. 28
క్షీరపిష్టైః ప్రలేపస్స్యాత్పిత్తవృద్ధిరుజాపహః,

తా. చందనము, అతిమధురము, కమలములు, వట్టివేళ్లు, నల్లకలువలు వీటిని పాలతోనూరి లేపనముజేసిన పిత్తజాండవృద్ధి నివర్తించు.

వచాదిలేపము

వచాసర్షపకల్కేన ప్రలేపశ్శోఫనాశనః. 29

తా. వస ఆవాలు వీనినినూరి కల్కముజేసి లేపనముజేసిన అండశోఫ నివర్తించు.

అజాజ్యాదిలేపము

అజాజీ హపుషా కుష్ఠం గోమయం బదరాన్వితమ్,
కాంజికేన తు సంపిష్టం కుర్యాద్వర్ధ్మప్రలేపనమ్. 30

తా. జీలకఱ్ఱ, బోడతరము, చంగల్వకోష్టు, గోమయము రేగుబెరడు వీనిని కాంజికముతోనూరి లేపనముజేసిన వర్ధ్మరోగము నివర్తించు.

—లాక్షాదిలేపనము—

లాక్షాకరంజబీజం చ శుంఠీ దారుసగైరికమ్,
కుందరం చ సమం కృత్వా చూర్ణయేన్మతిమాన్భిషక్. 31
కాంజికేన తు సంపేష్య లేపాత్ శ్వయథునాశనః,

తా. లక్క, కానుగువిత్తులు, శొంఠి, దేవదారు, కావిరాయి, కుందురుగడ్డి వీనిని సమాంశములుగ కాంజికముతో నూరి లేపనముజేసిన అండము వాపు నివర్తించు.

—పిప్పల్యాదిలేపము—

పిప్పలీ జీరకం కుష్ఠం బదరం శుష్కగోమయమ్. 32
కాంజికేన ప్రలేపోయ మంత్రవృద్ధివినాశనః,

తా. పిప్పళ్లు, జీలకఱ్ఱ, చంగల్వకోష్ఠు, రేగుగింజలలోనిపప్పు, యెండు ఆవుపేడ వీనిని కాంజికముతోనూరి లేపనముజేసిన అంత్రవృద్ధి నివర్తించు.

—అంత్రవృద్ధికి దేవదార్వాదిలేపము—

దేవదారుమిశీవాసాలాంకలీమూలసైంధవైః. 33
క్షౌద్రయుక్తైశ్చ తైర్లేపో వృద్ధిమంత్రభవాం జయేత్,

తా. దేవదారు, సోపు, అడ్డసరము * లాంకలీమూలము, సైంధవలవణము వీనిని తేనెతోనూరి లేపనముజేసిన అంత్రవృద్ధి నివర్తించు.

—కురుంటకమునకు లేపము—

గవాం ఘృతేన సంయుక్తం కృత్వా సైంధవచూర్ణకమ్. 34
పిబేత్ప్రతిదినం యావత్తావల్లేపః కురంటకే,

తా. సైంధవలవణచూర్ణమును ఆవునేతితో ౭ దినములు పుచ్చుకొని ఇదే లేపనముజేసిన కురుంటకము నివర్తించు.

సంచూర్ణితంసైంధవమాజ్యయుక్తంసంమర్ద్యతోయస్థితమేవసోష్ణమ్.
ముహుర్ముహుర్యః కురుతేప్రలేపం విలీయతే తస్య కురండరోగః,

తా. సైంధవలవణచూర్ణము నెయ్యి వీనిని మర్దించి, వేడియగు నుదకమునందుంచి కొంచెము ఉష్ణముగజేసి మాటిమాటికి లేపనముజేసిన కురండరోగము నివర్తించు.

తండులవారివిమిశ్రం ఘృత పత్రకసంజ్ఞముచ్యతే యత్తు, 36
తన్మూలపిష్టలేపం కురంటగళగండయోః కుర్యాత్,

* పొత్తిదుంప.

తా. నెమలడుగువేరును తండులోదకముతో చాది లేపనముజేసిన కురండమును గళగండము నివర్తించు.

ఈశ్వరీమూలమేరండ మూలంమూషకచర్మ చ. 37
లేపఏషాంకురంటాఖ్యరోగవిచ్ఛేదకారకః,

తా. ఈశ్వరివేరు ఆముదపువేరు యెలుకతోలు వీనిని నూరి లేపనముజేసిన కురంటకరోగము నివర్తించు.

బ్రాహ్మణయష్ట్యాదిలేపను

సుమషితం బ్రాహ్మణయష్టికాయా మూలం సమం తండుల ధావనేన.
నిహన్తి లేపాద్గళగండమాలాం కురంటముఖ్యానఖిలాన్వికారాన్,

తా. భారంగి తండులోదకముతో నూరి లేపనముజేసిన గలగండ, గండమాలలు కురంటకము మొదలగు అఖిలవికారములు నివర్తించు.

తరుమూషికచర్మణా నిబద్ధః ప్రవిలేపాదథ చేశ్వరీజటాయాః. 39
ఉపశాన్తిముపైతి మానవానామచిరేణైవకురండసంజ్ఞరోగః,

తా. చెట్టుకు ఎలుకచర్మమును కట్టినను, లేక ఈశ్వరివేరునూరి లేపనము జేసినను కురంటకరోగము శాంతినిజెందు.

శంబుకాదిలేపను

శంబూకోదరనిహితం గవ్యం సప్తాహమాతపేసర్పిః. 40
స్థితమపి హన్తి కురటం సైంధవచూర్ణాన్వితం లేపాత్,

తా. ఆవునెయ్యి క్షుద్రశంఖములయందునిచి యేడుదినములు యెండయందునిచి పిదప సైంధవలవణచూర్ణము కలిపి లేపనముచేసిన కురంటకము నివర్తించు.

వర్ధ్మమునకు లేపను

సద్యో మృతస్య కాకస్య మలేన పరిలేపనాత్. 41
వర్ధ్మరోగః ప్రయాత్యాశు రవిణాతిమిరం యథా,
పక్వే తు దారణం కృత్వా ప్రకర్తవ్యా వ్రణక్రియా. 42

తా. సద్యఃకాలమునందు మృతమైన కాకియొక్క మలమును లేపనము జేసిన వర్ధ్మరోగము నివర్తించు. మరియు దానివలన పక్వమైయుండిన వ్రణక్రియను జేయవలయు.

వాతవృద్ధికి ఏరండతైలయోగము

సక్షీరం వా పిబేత్తైలం మాసమేరండసంభవమ్,
గుగ్గులుం దుబుతైలం వా గోమూత్రేణ పిబేన్నరః. 43

వాతవృద్ధిం నిహన్త్యాశు చిరకాలానుబంధినీమ్,

తా॥ పాలు ఆముదము వీనినికలిపి ౧ మాసము పుచ్చుకొనినను, గుగ్గిలచూర్ణము ఆముదము వీనిని గోమూత్రములోచేర్చి పుచ్చుకొనినను చిరకాలమునుంచి యుండు వాతవృద్ధి నివర్తించు.

కఫవృద్ధిచికిత్స

కఫవృద్ధౌ మూత్రపిష్టైరుష్ణవీర్యైః ప్రలేపనమ్. 44
పాతవ్యో మూత్రసంయుక్తః కషాయః పీతదారుణః,

తా॥ ఉష్ణవీర్యములుగనుండు ఔషధముల గోమూత్రముతోనూరి లేపనము జేసినను మానిపసపుకషాయమునందు గోమూత్రముచేర్చి పుచ్చుకొనినను కఫవృద్ధి నివర్తించు.

శిరావేధ

శంఖోపరిచకర్ణాన్తేత్యక్త్వా సేవనిమాదరాత్. 45
వ్యత్యాసాద్వా శిరాం వింధ్యేదంత్రవృద్ధినివృత్తయే,

తా॥ కణతలయందుగాని కర్ణాంతమునందుగాని సేవనీయయను నాడిని విడిచి * వ్యత్యాసముగ శిరను వేధించిన అంత్రవృద్ధి నివర్తించు.

కర్ణశిరావేధ

కర్ణకోశస్య మధ్యే తు రక్తాం నిర్ధారయేచ్ఛిరామ్. 46
ఉభాభ్యాం ద్వే శిరే వేధ్యే తేన వా తత్సుఖం భవేత్,

తా॥ కర్ణకోశమధ్యమునందుండు రక్తయుక్తమగు నరమునుపొడిచిన అండవృద్ధి నివర్తించి సుఖమును జెందు.

గోమూత్రయోగము

గుగ్గులుం రుబుతైలం వా గోమూత్రేణ పిబేన్నరః. 47
అంత్రవృద్ధిం నిహంత్యాశు చిరకాలానుబంధినీమ్,

తా॥ గుగ్గిలము లేక ఆముదము గోమూత్రములో కలిపి పుచ్చుకొనిన చిరకాలమునుంచియుండు అంత్రవృద్ధి నివర్తించు.

నారాయణతైలప్రయోగము

సక్షీరం వా పిబేత్తైలం మాసమేరండసంభవమ్. 48
తైలం నారాయణం యోజ్యం పానాభ్యంజనవస్తిషు,

---

* అనగా కుడివైపువృద్ధి కెడమవైపునను, ఎడమవైపువృద్ధికి కుడివైపునను వేధించవలెనని భావము.

తా. ఆముదమునందు పాలుచేర్చిగాని లేక ఆముదపువిత్తులలోని పప్పు నూరిచేర్చిగాని ౧ మాసము పుచ్చుకొనినను, లేక నారాయణతైలమును స్నానము అభ్యంజనము చేసికొనినను వస్తికర్మను జేసినను అండవృద్ధి నివర్తించు.

అంగుష్ఠావరయోగము

అంగుష్ఠమధ్యత్వక్ఛిత్వా దహేదంగవిపర్యయం. 49

తా. పాదమునందుండు అంగుష్ఠమధ్యమునందు చర్మమును ఛేదించి * వ్యత్యాసముగా నరమునుకాల్చిన అండవృద్ధి నివర్తించు.

కజ్జలీయోగము

గోమూత్రైరండతైలాభ్యాం రసగంధకకజ్జలీమ్,
పీత్వా నిహన్తి సహసా వృద్ధిం వృషణసంభవామ్. 50

తా. రసము గంధకము వీనిని కజ్జలి గోమూత్రము ఆముదము వీనితో సేవించిన వృషణమువాపు నివర్తించు.

ఏరండతైలయోగము

తైలమేరండజం పీత్వా బలాసిద్ధపయోన్వితమ్,
ఆధ్మానశూలోపచితామాంత్రవృద్ధిం జయేన్నరః. 51

తా. చిట్టాముట్టికషాయమునందు ఆముదమునుకలిపి పుచ్చుకొనిన ఆధ్మానము శూల వీనితోగూడి వృద్ధిపొందింపబడిన అంత్రవృద్ధి నివర్తించు.

† ఇంద్రవారుణికామూలయోగము

ఇంద్రవారుణికామూలం తైలం పుష్కరజం తథా,
సంమర్ద్య చనగోదుగ్ధం పిబేజ్జన్తుః కురంటకే. 52

తా. పాపరవేరు చూర్ణమును ఆముదముతో మర్దించి ఆవుపాలలో కలిపి పుచ్చుకొనిన కురంటకము మానును.

† మఱియొక ఇంద్రవారుణీమూలయోగము

వాతారితైలమృదితం సురవారుణీజం
మూలం నరః పిబతి యో మసృణం విచూర్ణ్య,

---

* అనగా కుడివైపువృద్ధి కెడమవైపునను, ఎడమవైపువృద్ధికి కుడివైపునను ఛేదించవలెనని భావము.

† ఈయోగములు రెండును వెవ్వేరు గ్రంథములలోనుండి యెత్తబడిన వేగాని భేదమేమియు లేదు.

గవ్యే నిధాయపయసి త్రిదినావసానే
తస్య ప్రణశ్యతి కురంటకృతో వికారః. 53

తా. పాపరవేరును ఆముదముతో మెత్తగానూరి ఆవుపాలతో కలిపి పుచ్చుకొనిన మూడుదినములలో కురంటజవికారములు నశించు.

బాలకురంటకమునకు కర్ణవేధ

యః పిత్తదోషేణ కురంటరోగో భవేచ్ఛిశోర్దక్షిణముష్కభాగే,
తస్యోర్ధ్వభాగశ్రవణస్య విధ్యేద్వామస్య వామప్రభవేఽపరస్య. 54

తా. పిత్తదోషముచే శిశువులకుకలుగు కురంటరోగమునందు దక్షిణభాగమునందైన ఎడమ చెవియును, యెడమభాగమునందైన కుడి చెవియు మీదికొనకను కుట్టిన ఆరోగము నివర్తించు.

సప్తవృద్ధులకుచికిత్స

సరామఠం కుబేరాక్షి కుళుత్థలశునైశ్శృతమ్,
సలిలం ఘృతసంయుక్తం సప్తవృద్ధిషు పాయయేత్, 55
ఇంద్రవల్లీ ప్రసారిణ్యోః క్వాథస్స్యాత్సప్తవృద్ధిజిత్,
మహిషాక్షస్య చూర్ణం తు శర్కరామధుసంయుతమ్. 56
పిబేద్గుడూచీక్వాథేన సప్తవృద్ధ్యుపశాన్తయే,

తా. ఇంగువ, గచ్చపప్పు, ఉలవలు, వెల్లుల్లి వీనిని ఉదకమునందునిచి కషాయముకాచి అందు నెయ్యిచేర్చి పుచ్చుకొనినను, మరియు పాపరవేరు గొంతెమగోరువేరు వీనిని కషాయముకాచి పుచ్చుకొనినను, మరియు తిప్పతీగ కషాయమునందు మహిసాక్షిచూర్ణము శర్కర తేనె వీనినిచేర్చి పుచ్చుకొనినను సప్తవృద్ధులు నివర్తించు.

అంత్రవృద్ధికి మాంస్యాదిఘృతము

మాంసీకుష్ఠం పత్రకైలా రాస్నాః శృంగీ చ చిత్రకమ్. 57
కృమిఘ్నమశ్వగంధా చ శైలేయం కటురోహిణీ,
సైంధవం తగరం చైవ కుటజాతివిషైస్సమైః. 58
ఏతైశ్చ కార్షికైః కల్కైర్ఘృతప్రస్థం విపాచయేత్,
వృషముండీనవైరండనింబపత్రభవం రసమ్. 59
కంటకార్యాశ్చాపి దుగ్ధంచ ప్రస్థం తస్మిన్ వినిక్షిపేత్,
సిద్ధమేతద్ఘృతం పీతమంత్రవృద్ధిం వ్యపోహతి. 60
వాతవృద్ధిం పిత్తవృద్ధిం మేదోవృద్ధిమథాపివా,
మూత్రవృద్ధిం చ హన్త్యేతత్సర్పిరాశు న సంశయః. 61

తా. జటామాంసి, చంగల్వకోష్ఠు, లవంగపత్రి, ఏలకులు, రాస్న, కర్కాటకశృంగి, చిత్రమూలము, వాయువిడంగములు, పెన్నేరుగడ్డ, శిలాజిత్తు, కటుకరోహిణి, సైంధవలవణము, గ్రంధితగరము, కొడిశపాల, అతివస వీటినన్నియు ప్రత్యేకము ౧ కర్షముజేర్చి కల్కముజేసి ౧ ప్రస్థము నెయ్యి, అడ్డసరపాకురసము, బోడతరపురసము, తెల్లఆముదపుఆకురసము, వేపాకురసము, చిన్నములకరసము, పాలు వీటినన్నియు ప్రత్యేకము ౧ ప్రస్థముచేర్చి ఘృతపక్వముగవండి సేవించిన అంత్రవృద్ధి వాతవృద్ధి పిత్తవృద్ధి మేదోవృద్ధి మూత్రవృద్ధి ఇవియన్నియు నివర్తించు.

అంత్రవృద్ధికి పునర్నవాదితైలము

పునర్నవామృతాదారు సక్షారం లవణత్రయమ్,
కుష్ఠం శఠీ వచా ముస్తా రాస్నా కట్ఫలపుష్కరే. 62
యవానీ హపుషా హింగుశతాహ్వా చాజమోదకః,
విడంగాతివిషాయష్టీ పంచకోలకసంయుతైః. 63
ఏతైః కల్కైస్సమైరక్షైస్తైలప్రస్థం విపాచయేత్,
గోమూత్రం ద్విగుణం దేయం కాంజికం చ తథైవచ. 64
పునర్నవాద్యమేతత్తు వస్తౌ పానే తథోత్తమమ్,
కట్యూరుపృష్ఠమేఢ్రేషు కుక్షౌ చ వృషణే శ్రితమ్. 65
కఫవాతోద్భవం శూలమంత్రవృద్ధిం వినాశయేత్,

తా. తెల్లగలిజేరు, తిప్పతీగె, దేవదారు, యవక్షారము, సైంధవలవణము, బిడాలవణము, కాచలవణము, చంగల్వకోష్ఠు, కచూరములు, వస, తుంగముస్తలు, రాస్న, కాయఫలము, పుష్కరమూలము, ఓమము, సోపు, ఇంగువ, చల్లపిల్లిగడ్డలు, అజామోదము, వాయువిడంగములు, అతివస, యష్టిమధుకము, పంచకోలములు వీటినన్నియు అక్షప్రమాణములుగ గ్రహించి చూర్ణించి నూనె ౧ ప్రస్థము గోమూత్రము ౨ ప్రస్థములు కాంజికము ౨ ప్రసములు వీటినన్నియు నేకముగజేర్చి తైలపక్వముగకాచి వస్తిపానములయం దుపయోగించిన కటి, తొడలు, పృష్ఠము, మేఢ్రము, కుక్షి, వృషణములు వీట్లయందలిశూల కఫవాతజశూల, అంత్రవృద్ధి ఇవియన్నియు నివర్తించు.

అంత్రవృద్ధియందు పథ్యములు

సంశోధనం వస్తిరసృగ్విమోక్షస్స్వేదః ప్రలేపో౽రుణశాలయశ్చ,
ఏరండతైలం సురభీజలం చ ధన్వామిషం శిగ్రుఫలం పటోలమ్,
పునర్నవాగోక్షురకాగ్నిమంథ తాంబూలపథ్యారసనారసోనమ్. 67

వాన్త్యంగనాగ్యం జనకంమధూని కౌంభంఘృతంతప్తజలంచతక్రమ్,
అర్ధేందువద్వంక్షణయోశ్చ దాహోవ్యత్యాసతోబాహుసిరావ్యధశ్చ.
యథామయం శస్త్రవిధిశ్చవర్గోస్యుర్వర్ధ్మ వృద్ధామయినాంసుఖాయ,

తా. విరేచనము, వస్తికర్మ, వీటిని జేయుట, రక్తముదీయుట, చెమటదీయుట, లేపము, ఎఱ్ఱబియ్యము, ఆముదము గోమూత్రము, నిర్జలప్రదేశమునందలి జంతుమాంసము, మునగకాయ, పొట్లకాయ, గలిజేరు, పల్లేరు, కూరవెల్లి, తాంబూలము, కరక్కాయ, సన్నరాస్న, వెల్లుల్లి వీటిని సేవించుట, వమనములు జేయించుట, స్త్రీసంగమము, ఎఱ్ఱఉల్లిగడ్డ, తేనె, కుండలోనునిచి ప్రాతపడిన నెయ్యి, ఉష్ణోదకము, మజ్జిగ, వీటిని సేవించుట. అండసంధులయం దర్ధచంద్రాకారముగ వాతవేయుట, కుడితట్టు వృద్ధిపొందియుండిన యెడమచేతియొక్క సిరను వేధించుట, యెడమతట్టుఅయిన కుడిచేతి సిరను వేధించుట, శస్త్రవిధి ఇవి వర్ధ్మ, అండవృద్ధి వీటికి పథ్యంబులని యెఱుంగవలయు.

### అండవృద్ధియందపథ్యములు

అనూపమాంసాని దధీని మాషాః పిష్టాన్నదుష్టాన్నముపోదికాంచ.
గుర్వాణి శుక్రోత్థితవేగరోధస్స్యుర్వర్ధ్మవృద్ధ్యామయినామమిత్రమ్,

తా. జలముగలప్రదేశమునందుండు జంతుమాంసము, పెరుగు, మినుములు, పిష్టాన్నము, దుష్టమైనయన్నము, బచ్చలికూర, గురుకరపదార్థములు, వీటిని సేవించుట శుక్రవేగమునడ్డగించుట, ఇవి వర్ధ్మ అండరోగము వీటియందపథ్యములని యెఱుంగవలయు.

అన్యచ్చ—

వేగాహతిః పృష్ఠయానం వ్యాయామం మైథునం తథా. 70
అత్యాశనమథాధ్వానముపవాసం పరిత్యజేత్,

తా. మలమూత్రవేగముల నడ్డగించుట, గుఱ్ఱముమొదలగువానినెక్కి సంచరించుట; శ్రమనుపొందుట, అతిమైథునము, మిక్కుటముగ భోజనముసేయుట మార్గమునడుచుట, ఉపవాసము వీనిని వదలుకొనవలయు.

# మేదోరోగప్రకరణమ్.

మేదోనిదానము

అవ్యాయామదివాస్వప్నశ్లేష్మలాహారసేవినః,
మధురాన్నరసైః ప్రాయస్స్నేహాన్మేదో వివర్ధతే. 1

తా. వ్యాపారములేకయుండుట, దివానిద్ర, కఫకరపదార్థసేవన, మధురాన్నము, మధురరసము వీటిని సేవించుట, ఘృతపక్వ గోధుమాది స్నేహభక్ష్యసేవనము వీటివలన మేదోరోగము జనించు.

సంప్రాప్తి

మేదసావృతమార్గత్వాత్పుష్యంత్యన్యే చ ధాతవః,
మేదస్తు చీయతే యస్మాదశక్తస్సర్వకర్మసు. 2

తా. పూర్వోక్తమగు మేదస్సుచే స్రోతోమార్గములు ఆవరింపబడినందువలన ఇతరధాతువులు వృద్ధినంది దానిచే మేదస్సు మిక్కిలి వృద్ధిబొంది సర్వకర్మలచేయుట యందు అశక్తముగ నుండు.

వర్ధమానమేద ఉపద్రవములు

క్షుద్రశ్వాసతృషామోహస్వప్నకంఠావసాదనైః,
యుక్తః క్షుత్స్వేదదౌర్గంధ్యైరల్పప్రాణోల్పమైథునః. 3

తా. కొంచెముగశ్వాస, దప్పి, మోహము, నిద్ర, గొంతుస్వరము తగ్గుట, చమట, శరీర దౌర్గంధ్యము, దౌర్బల్యము, అల్పమైథునము ఇవి మేదోవృద్ధ్యుపద్రవములని తెలియవలయు.

మేదఃస్థానములు

మేదస్తు సర్వభూతానాముదరేష్వస్థిషు స్థితమ్,
అతఏవోదరే వృద్ధిః ప్రాయో మేదస్వినో భవేత్. 4

తా. సర్వప్రాణులకు ఉదరము అస్థులు వీటియందు మేదస్సుండునుగాన మేదోరోగముగలపురుషునికి ఉదరమునందే వృద్ధిగలిగియుండును.

మేదసావృతమార్గత్వాద్వాయుః కోష్ఠే విశేషతః,
చరన్సంధుక్షయత్యగ్నిం ఆహారం శోషయత్యపి. 5

తస్మాత్సశీఘ్రం జరయత్యాహారం చాపి కాంక్షతి,
వికారాంశ్చాశ్నుతే ఘోరాన్కాంశ్చిత్కాలవ్యతిక్రమాత్. 6

తా. మేదస్సుచే సిరామార్గములడ్డగింపబడుటవలన వాయువు కోష్ఠస్థానమున విశేషముగ సంచరించుచు విశేషముగ అగ్నిదీప్తినిగలుగజేసి ఆహారమునుశోషింపంజేసి శీఘ్రముగ జీర్ణింపజేయుచు మరల నాహారమునుగోరుచు కొంతకాలము గడచినపిదప ఘోరములగు వికారములను గలుగంజేయు

మేదోరోగాసాధ్యత్వము

మేదస్యతివిసంవృద్ధే సహసై వానిలాదయః,
వికారాన్దారుణాన్కృత్వా నాశయంత్యాశు జీవితమ్. 7

తా. మేదస్సుమిక్కుటముగ వృద్ధిజెందుటవలన వాతాదిదోషంబులు దుష్టంబులై యకస్మాత్తుగభయంకరవికారములను (ప్రమేహపిటికాజ్వరభగందరవిద్రధి వాతరోగముల) గలుగంజేసి శీఘ్రముగ ప్రాణముల హరింపంజేయు.

అతిస్థూలలక్షణము

మేదోమాంసాతివృద్ధత్వాచ్చలస్ఫిగుదరస్తనః,
అయథోపచయోత్సాహో నరోఽతిస్థూల ఉచ్యతే. 8

తా. మేదస్సు మాంసము మిక్కిలివృద్ధిజెందుటవలన నరునియొక్క స్ఫిక్కు (తొడలు) ఉదరము, స్తనములు నడుచునపుడు దిగబడికదులుట, పూర్వమువలె శరీరవృద్ధి ఉత్సాహములేకయుండుట ఇట్టిలక్షణములుగలిగియుండిన అతిస్థూలరోగమని యెరుంగవలయు.

మేదోరోగమునకు చవ్యాదిమార్గము

సచవ్యజీరకవ్యోషహింగుసౌవర్చలానలాః,
మధునా సక్తవః పీతా మేదోఘ్నా వహ్నిదీపనాః. 9

తా. వేచినవియ్యపుపిండి, చవ్యము, జీలకఱ్ఱ, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇంగువ, సౌవర్చలవణము, చిత్రమూలము, వీనినిచూర్ణించి తేనెతో పుచ్చుకొనిన మేదోరోగము నివర్తించుటయేగాక అగ్నిదీప్తిని సగాగలుగంజేయు.

ఫలత్రికాదిచూర్ణము

ఫలత్రయం త్రికటుకం సతైలం లవణాన్వితమ్,
షణ్మాసముపభుక్తం చేత్కఫమేదోనిలాపహమ్. 10

తా. ఫలత్రయము, త్రికటుకములు, సైంధవలవణము, వీటినిచూర్ణించి తైలము చేర్చి ఆరుమాసములు పుచ్చుకొనిన కఫజమేదోరోగములు వాతము ఇవి నివర్తించు.

### త్రికటుకాదిచూర్ణము

త్ర్యూషణం కటుకం శిగ్రు బృహతీ కంటకారికా,
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ వారాహీ చ సువర్చలమ్. 11
ద్విసిశాతివిషాహింగుయవాన్యోజీరకద్వయమ్,
విడంగం హాపుషా ధానాస్సర్వం మేదోత్థితిం జయేత్. 12

తా. త్రికటుకములు, కటుకరోహిణి, కారుమునగ, ములక, వాకుడు, కోలపొన్న, నేలపొన్న, నేలతాడిగడ్డలు, సౌవర్చలవణము, పసపు, మ్రానిపసపు, అతివస, ఇంగువ, కొడిశపాల, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, వాయువిడంగములు, బోడతరము, ధనియాలు వీనిని సమభాగములుగ చూర్ణించి (దీనికి సమముగ లోహభస్మమునుకలిపి తేనెతో) పుచ్చుకొనిన మేదోరోగముచే జనించిన స్థౌల్యరోగము నివర్తించు.

### బడబాగ్నిరసము

శుద్ధసూతం మృతం తామ్రం తాళం బోళం సమం సమమ్,
అర్కక్షీరైర్దినం మర్ద్యం క్షౌద్రైర్లేహ్యం ద్విగుంజకమ్. 13
బడబాగ్నిరసోనామ స్థౌల్యబృందం నియచ్ఛతి,
పలం క్షౌద్రం పలం తోయమనుపానం పిబేత్సదా. 14

తా. రసభస్మము, తామ్రభస్మము, శుద్ధిచేసిన తాళకము, రక్తబోళము వీటిని సమాంశములుగ ఖల్వమునందునిచి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి రెండుగురిగింజలయెత్తు మాత్రలుచేసి తేనెతో సేవించిన పిదప పలప్రమాణోదకములో పలప్రమాణము తేనెకలిపి సేవించిన స్థౌల్యరోగము నివర్తించు.

### స్థౌల్యాస్తకరసము

వంధ్యా కర్కోటకీకంద ద్రవైర్మర్ద్యం దినత్రయమ్,
తాళకం చ మృతం తామ్రం ద్విగుంజం మధునా లిహేత్. 15
పిబేత్ క్షారోదకం చానుస్థౌల్యరోగం వినాశయేత్,

తా. తాళకభస్మము, తామ్రభస్మము వీటిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందునిచి గొడ్డుకాకరగడ్డరసముతో 3 దినములు మర్దించి రెండుగురిగింజలయెత్తు తేనెతో సేవించి పిదప క్షారపునీళ్లుత్రాగిన స్థౌల్యరోగము మానును.

### త్రిమూర్తిరసము

సూతం గంధమయో భస్మ సమం సమ్మేళ్య భావయేత్. 16
నిర్గుండీపత్రతోయేన ముసలీకందవారిణా,
తతస్సిద్ధమముం మాషమాత్రం రసమనుత్తమమ్. 17

లోధ్రక్షౌద్రేణ చాశ్నీయాచ్చూర్ణం మాషోన్మితం హితమ్,
షట్కటుత్రిఫలా పంచ లవణా వల్గుజం చ తత్. 18
మేదశ్శోథాగ్నిమాంద్యామవాతశ్లేష్మగదప్రణుత్,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము, అయోభస్మము, వీనిని సమాంశము లుగ జేర్చి ఖల్వమునవైచి వావిలి ఆకురసము నేలతాడిగడ్డలరసము వీటిచే మర్దించి మాషమాత్రము ఔషధము, మాషమాత్రము లొద్దుగచూర్ణము వీటిని తేనెలో కలిపి పుచ్చుకొని పిదప శొంఠి, పిప్పలి, మిరియాలు, మోడిచవ్యము, చిత్రమూలము, కరక, తాడి, ఉశిరికెలు, పంచలవణములు, భావంచివిత్తులు వీటిని చూర్ణించి యీచూర్ణమును పుచ్చుకొనిన మేదస్సు అగ్నిమాంద్యము ఆమవాతము శ్లేష్మరోగము ఇవి నివర్తించు.

## త్ర్యూషణాదిలోహము

త్ర్యూషణం త్రిఫలా చవ్యం చిత్రకం బిడమౌద్భిదమ్. 19
వాకుచీసైంధవం చైవ సౌవర్చలమయోరజః.
మాషమాత్రమతశ్చూర్ణం లిహ్యాదాజ్యమధుప్లుతమ్. 20
అతిస్థౌల్యమిదం చూర్ణం నిహంత్యగ్నివివర్ధనమ్,
మేదోఘ్నం మేహకుష్ఠఘ్నం శ్లేష్మవ్యాధినిబర్హణమ్. 21
నాహారే నియమశ్చాత్ర విహారే వా విధీయతే,
త్ర్యూషణాద్యమిదం చూర్ణం రసాయనమనుత్తమమ్. 22

తా. త్రికటుకములు, త్రిఫలములు, చవ్యము, చిత్రమూలము, బిడాలవణము, చవటిపుప్పు, బావంచివిత్తులు, సైంధవలవణము, సౌవర్చలవణము, లోహభస్మము వీటిని సమభాగములుగ జేర్చి చూర్ణించి మాషమాత్రము ఔషధమును నెయ్యి తేనె వీటిలో పుచ్చుకొనిన అతిస్థౌల్యము మేదస్సు, మేహము, కుష్ఠువు, శ్లేష్మవ్యాధి ఇవి నివర్తించు టయేగాక అగ్నిదీప్తిగలుగు. ఆహారవిహారాదులయందు నియమములేదని తెలియ వలయు. ఇది త్ర్యూషణాది లోహచూర్ణ మనబడును.

## రసభస్మయోగము

రసభస్మవల్లమాత్రం లీఢ్వా మధునా పిబేదనుక్షౌద్రమ్,
కోష్ణాంబునా సమేతం స్థౌల్యం మేదకృతం జయతి. 23

తా. వల్లపరిమాణము రసభస్మము తేనెతో పుచ్చుకొని పిదప కొంచెము ఉష్ణ ముగనుండు ఉదకములో తేనెవైచిపుచ్చుకొనిన మేదస్సువలన జనించిన స్థౌల్యము నివర్తించు.

## తామ్రభస్మయోగము

మృతతామ్రం కణాక్షౌద్రం మాషమాత్రం నియోజయేత్,

తా. తామ్రభస్మము, పిప్పలిచూర్ణము వీటినిచేర్చి ౧ మాషమెత్తు తేనెతో కలిపిపుచ్చుకొనిన స్థౌల్యరోగము నివర్తించు.

## గంధకయోగము

గంధం మధూకతైలం చ కర్షమాత్రం లిహేత్సదా. 24
మేదోవాతకఫం హన్తి మాసమాత్రే న సంశయః,

తా. శుద్ధగంధకమును ఇప్పనూనెతో చేర్చి ౧ కర్షమువంతున మాసము సేవించిన మేదోరోగము వాతకఫరోగము ఇవి నివర్తించు.

## త్రిఫలాదితైలము

త్రిఫలాతివిషా మూర్వా త్రివృచ్చిత్రకవాసకైః. 25
నింబారగ్వధషడ్గ్రంథాసప్తపర్ణనిశాహ్వయైః,
గుడూచీంద్రయవాకృష్ణాకుష్ఠసర్షపనాగరైః. 26
తైలమేభిస్సమం పక్వం సురసాదిరసప్లుతమ్,
పానాభ్యంజనగండూషనస్యవస్తిషు యోజితమ్. 27
స్థూలతాలస్యకండ్వాదిజయేత్కఫకృతాస్సదా,

తా. త్రిఫలములు, అతివస, చాగ, తెగడ, చిత్రమూలము, అడ్డసరము, వేప, రేల, వస, యేడాకులఅరటిగడ్డ, మానిపసపు, తిప్పతీగ, కొడిశపాల, పిప్పళ్లు, కోష్ఠు, ఆవాలు, శొంఠి, యీ ఔషధములు చేర్చి, సర్పాక్షి, వావిలి వీటిరసములు వీటి నన్నియుచేర్చి తైలపక్వముగ వండి పానము అభ్యంజనము గండూషము నస్యము వస్తి వీటినిం జేసిన స్థూలత్వము కండు కఫరోగములు ఇవి నివర్తించు.

## మేదోరోగమునకుపథ్యములు

చింతా శ్రమోజాగరణం వ్యవాయః ప్రోద్వర్తనం లంఘనమాతపశ్చ.
హస్త్యశ్వయానం భ్రమణం విరేకః ప్రచ్ఛర్దనంచాప్యథ తర్పణం చ,
పురాతనావైణవకోరదూషశ్యామాకనీవారకకోరదూషాః. 29
యవాః కుళుత్థాశ్చణకా మసూరాముద్గాస్తువర్యస్తుమధూవిలాజాః,
కటూని తిక్తాని కషాయకాని తక్రం సురాపింగళమత్స్యఏవ. 30
దగ్ధాని వార్తాకఫలాని చాపి ఫలత్రియం గుగ్గులుపాయసం చ,
కటుత్రయం సర్షపతైలమేలాక్షారాణి సర్వాణ్యపిచాక్షతైలమ్. 31

పత్రోత్థశాకాగరులేపనాని ప్రతప్తనీరాణి శిలాజతూని,
ఏతాని సర్వాణి నిషేవితాని మేదోగదం సత్వరమాక్షిపంతి. 32

తా. చింత, శ్రమ, జాగరణ, స్త్రీసంగమము, నలుగుబెట్టుకొనుట, లంఘనము, యెండ, ఏనుగు, అశ్వము మొదలగువాటినెక్కి సంచరించుట, విరేచనము, వాంతి, తర్పణము, పాతవెదురుబియ్యము, అళ్లు, చామలు, నీవారధాన్యము, కొఱ్ఱలు, యవలు, ఉలవలు శనగలు, చిరుశనగలు, పెసలు, కందులు, తేనె, పేలాలు, కారము, చేదు, వగరు ఈరసములు, మజ్జిగ, మద్యము, పింగళవర్ణముగల మత్స్యములు, కాల్చిన వంకాయలు, త్రిఫలములు, గుగ్గిలము, పాయసము, త్రికటుకములు, తెల్లావనూనె, ఏలకులు, సర్వక్షారములు, తాండ్రినూనె, ఆకుకూరలు, అగరులేపనములు, ఉష్ణోదకము, శిలాజిత్తు, వీటిసేవనవలన మేదోరోగము నివర్తించు.

మేదోరోగమునకు అపథ్యములు

స్నానం రసాయనం శాలీన్ గోధూమాన్సుఖశీలతామ్,
క్షీరేక్షువికృతిం మాషాన్ సౌహిత్యం స్వేదనానిచ. 33
మత్స్యమాంసం దివానిద్రాం సుగంధాన్మధురాణి చ,
అతిమాత్రం తుపచితం విశేషాద్వమనక్రియామ్. 34
స్వభావస్థత్వమన్విచ్ఛన్ మేదస్వీ పరివర్జయేత్,

తా. స్నానము, రసాయనము, శాలిబియ్యము, గోధుమలు, సుఖము, పాలు, చెరకువలన ఉత్పత్తిజేయబడుపదార్థములు, మినుములు, తృప్తికరభక్షణము, చెమటదీయుట, మత్స్యములు, మాంసములు, దివానిద్ర, సుగంధపదార్థములు, మధురాన్నము, చిమిడినయన్నము, వమనము వీటిని మేదోరోగముగలవాడు విసర్జించవలయు.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక
సకలవిద్యాప్రవీణ, శ్రీపరమేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్య
విద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్రకంఠవల్లభా
చార్యవిరచిత, వైద్యచింతామణౌ, శూల, ఉదావర్త, ఆనాహ,
గుల్మ, హృద్రోగ, ఉదరరోగ, అండవృద్ధి,
మేదోరోగ ప్రకరణంనామ.
ద్వాదశోవిలాసః.

# వాతరక్తప్రకరణమ్.

## వాతరక్తమునజ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

వ్యోమస్థానే మహీపుత్రశ్శనిదృష్టో యదా భవేత్,
జన్మకాలే యస్య జంతో స్సవాతరుధిరార్దితః, 1

తా. జన్మకాలమునందు జన్మలగ్నమునకు ౧౦ వయింట అంగారకుడుండి శనిచేతచూడబడిన మనుజుడు వాతరక్తముచే పీడితుడగు.

## శమనము

వ్యోమస్థానస్థితశనిదృష్టభౌమజనితరక్తదోషోపశాంతయే,
గ్రహప్రీతయే పూర్వోక్తమేవ జపాదికం కుర్యాత్. 2

తా. పదియవయింట అంగారకుడుండి శనిచేచూడబడుటవలన జనించిన వాతరక్తదోషశాంతికై అంగారకతృప్తికొరకు పూర్వోక్తజపాదికములం జేయవలయు.

## వాతరక్తనిదానము

లవణామ్లకటుక్షార స్నిగ్ధోష్ణాజీర్ణభోజనైః,
క్లిన్నశుష్కాంబుజానూపమాంసపిణ్యాకమూలకైః. 3
కులుత్థమాషనిష్పావశాకాదిలవణేక్షుభిః,
దధ్యారనాళసౌవీరసూక్తతక్రసురాసవైః. 4
విరుద్ధాధ్యశనక్రోధదివాస్వప్నప్రజాగరైః,
ప్రాయశస్సుకుమారాణాం మిథ్యాహారవిహారిణామ్. 5
స్థూలానాం సుఖినాం వాపి కుప్యతే వాతశోణితమ్,

తా. ఉప్పు, పులుసు, కారము, క్షారము, స్నిగ్ధము, ఉష్ణము, అపక్వము పాచినది, ఎండినది ఇట్టిపదార్థముల సేవనము, మరియు, జలచరములగు మత్స్యాదిమాంస కారండవచక్రవాకాది మాంసము, గానుగపిండి, ముల్లంగి, ఉలవలు, అనుములు మొదలయిన శింబిధాన్యములు, ఆకుకూరలు, వేయించిన నువ్వుపిండి, చెరకుపాలు, పెరుగు, కాంజికము, చద్దిఅన్నము, మజ్జిగ, కల్లు, సారాయి, విరుద్ధాన్నము, వీటిని మిక్కిలి భుజించుట, క్రోధము, దివానిద్ర, రాత్రిజాగరణ యీకారణములచే తరుచుగ సుకుమారులుమిథ్యాహారవిహారములను జేయువారు, స్థూలశరీరులు, సుఖవంతులు ఇట్టివారలకు ముఖ్యముగ వాతరక్తము జనించు.

## వాతరక్తసంప్రాప్తి

హస్త్యశ్వోష్ట్రైర్గచ్ఛతశ్చాశ్నతశ్చ విదాహ్యన్నం సవిదాహాశనస్య.
కృత్స్నం రక్తం విదహత్యాశు తచ్చ దుష్టం స్రస్తం పాదయో
ర్చీయతే తు,
తత్సంయుక్తం వాయునా దూషితేన తత్ప్రాబల్యాదుచ్యతే
వాతరక్తమ్. 7

తా. ఏనుగ గుఱ్ఱము ఒంటె వీటిపై నెక్కి గమనముజేయువారు, విదాహముసు గలుగజేయు అన్నమును భక్షించువారు, ఇట్టిమనుజులయొక్క సర్వశరీరమునందలి రక్తము దూషితమై కాళ్లయందుచేరి పిదప చెడ్డవాయువులో గలిసియుండుయీరోగమునందు వాయువు ప్రబలముగ నుండుగాన, దీనిని వాతరక్తమనియెదరు.

## వాతరక్తమునందుఅన్యదోషసంబంధలక్షణము

తద్వాత్పిత్తందూషితేనాసృజాక్తం శ్లేష్మాదుష్టోదూషితేనాసృజాక్తః,
స్పర్శోద్విగ్నౌ భేదతోదప్రశోష స్వాపోపేతౌ వాతరక్తేన పాదౌ. 8
పిత్తాసృగ్భ్యాముగ్రదాహాభవేతామత్యర్థోష్ణౌరక్తశోఫౌమృదూచ,
కండూమంతౌ స్వేదశీతౌసశోఫౌ పీనౌ స్తబ్ధౌ శ్లేష్మదుష్టే తు రక్తే. 9
సర్వైర్వద్భిస్త్రైశ్శోణితైర్వాపిదోషాఃస్వంస్వంరూపంపాదయోర్దర్శయంతి,

తా. వాతరక్తమునందు వాతసంబంధముచే పిత్తకఫములు దూషితములై దుష్టరక్తముతోగలసి కాళ్లయందుజేరుటవలన కాళ్లుస్పృశించిన నొప్పి పోట్లు శుష్కత్వము స్తబ్ధత్వము వీటిని గలుంగంజేయు. మరియు పిత్తసంబంధమువలన ఉగ్రతాపముగలవై మిక్కిలిఉష్ణము మృదుత్వము యెఱ్ఱనివాపు ఇవిగలవిగనుండు. మరియు కఫసంబంధముచే రక్తము దుష్టమగుటవలన దురద చమట శీతలము వాపు ఉబ్బు స్తబ్ధత్వము ఇవిగలవిగనుండు. మరియు వాత పిత్త కఫ శోణితములు అన్నియు దుష్టములైనందువలన నాయాదోషములు వాటివాటిరూపములగు కాళ్లయందు కనుపరచుచునుండు.

## పూర్వరూపము

స్వేదోత్యర్థం నవా కార్ష్ణ్యం స్పర్శాజ్ఞత్వం క్షతేతి రుక్. 10
సంధిశైథిల్యమాలస్యం సదనం పిటికోద్గమః,
జానుజంఘోరుకట్యంసహస్తపాదాదిసంధిషు. 11

నిస్తోదః స్ఫురణం భేదో గురుత్వం సుప్తిరేవ చ,
కండూస్సంధిషు రుగ్భూత్వా భూత్వా నశ్యతి చాసకృత్. 12
వైవర్ణ్యం మండలోత్పత్తిర్వాతాసృక్ పూర్వలక్షణమ్,

తా॥ మిక్కిలిచమటపడియుంట లేక మిక్కిలిచమటలేకయుండుట, శరీరము నల్లగ నుండుట, స్పర్శజ్ఞానము లేకపోవుట, * క్షతమందు మిక్కిలిపోట్లు, సంధులువదిలినటులుండుట, మాంద్యము, శరీరముచిక్కుట, శరీరమునందుదద్దులుకట్టుట, మోకాళ్లు పిక్కలు తొడలు నడుము భుజములు చేతులు మొదలగు సంధులయందు శూలగలుగుట శరీరముఅదరుట, పోట్లు, శరీరముబరువుగనుండుట, నిస్సత్తువ, దురద, సంధులయందు శూల, మంట, వీటివలన చిక్కిపోవుట, వైవర్ణ్యము, శరీరమునందుమండలములు జనించుట, ఇవి వాతరక్తమునకు పూర్వరూపములని తెలియవలయు.

వాతరక్తమునందు అన్యదోషోపద్రవములు

వాతాధికేధికం తత్ర శూలస్ఫురణతోదనమ్. 13
శోథశ్చ రౌక్ష్యం కృష్ణత్వశ్శ్యావతావృద్ధిహానయః,
ధమన్యంగుళిసంధీనాం సంకోచోంగగ్రహోతిరుక్. 14
శీతద్వేషానుపశయస్తంభవేపథుసుప్తయః,

తా॥ వాతరక్తమునందు వాతాధిక్యమగునపుడు మిగులశూల, శరీరముఅదురుట, నొప్పి, వాపు, రూక్షత్వము, నలుపు లేక శ్యామలవర్ణము వీటికి వృద్ధిక్షీణములు గలుగుట, మరియు ధమనీ (నాడి) అంగుళసంధులు వీటికి సంకోచము, సర్వావయవము లీడ్చిపట్టుట, పోట్లు, శీతలపదార్థద్వేషము, శీతపదార్థమును ప్రమాదముచే సేవించిన సరిపడకుండుట, స్తబ్ధత్వము, వణుకు, తిమ్మిరి ఇవి గలిగియుండు.

రక్తాధికవాతరక్తపిత్తాధికవాతరక్తలక్షణములు

రక్తేశోథోతిరుక్క్లేదస్తామ్రశ్చిమచిమాయతే. 15
స్నిగ్ధరూక్షైశ్శమం నైతి కండూక్లేదసమన్వితః,
పిత్తే విదాహస్సంమోహః స్వేదోమూర్ఛామదస్తృట్. 16
స్పర్శాసహత్వం రుగ్రాగశోథపాకౌ భృశోష్ణతా,

తా॥ వాతరక్తమునందు రక్తాధిక్యమగునపుడు వాపు, మిక్కిలిపీడ, శరీరమునందుబంక, చర్మము ఎఱ్ఱనై చిమచిమలాడుట, స్నిగ్ధ రూక్ష పదార్థసేవనలచే నుపశమించకయుండుట, సర్వకాలమునందు దురద, చెమ్మ, ఇవిగలిగియుండు. మరియు వాతరక్తమునందు పిత్తాధిక్యమైనయెడల విదాహము, మోహము, చెమట, మూర్ఛ,

* అనగా దెబ్బతగిలినచో నెక్కువబాధ.

మదము, దప్పి, స్పర్శమునోర్చకుండుట, శరీరము నలియగొట్టినటులనుండుట, వాపు గలుగుట, అదిపండుట, ఉష్ణముగనుండుట ఇట్టిలక్షణములు గలిగియుండు.

కఫాధికసన్నిపాతజవాతరక్తలక్షణములు

కఫే స్తైమిత్యగురుతాసుప్తస్నిగ్ధత్వశీతతాః. 17
కండూర్మందా చ రుక్ ద్వంద్వే సర్వలింగం చ సంకరే

తా. వాతరక్తమునందు కఫాధిక్యమైనయెడల శరీరమునందు స్తబ్ధత్వము, బరువు, నిశ్చేష్టత్వము, స్నిగ్ధము, శీతత్వము, దురద, కొంచెమునొప్పి ఇవిగలుగు. మరియు ద్వంద్వజవాతరక్తమునందు రెండింటియందలి లక్షణములుగలుగు, త్రిదోషజవాతరక్తమునందు మూడుదోషముల లక్షణములుగలుగుచున్నయవి.

అంగనియమము

పాదయోర్మూలమాస్థాయ కదాచిద్ధస్తయోరపి. 18
ఆఖోర్విషమివ క్రుద్ధం తద్దేహమనుసర్పతి.

తా. వాతరక్తవ్యాధి మొదట కాళ్లు చేతులు వీటిమూలమునందుపుట్టి ఎలుక విషమువలె ప్రకోపించి సర్వదేహమందు వ్యాపించుచుండు.

వాతరక్తఅసాధ్యలక్షణము

ఆజానుస్ఫుటితం యచ్చ ప్రభిన్నం ప్రస్రుతం చ యత్. 19
ఉపద్రవైర్యచ్చ జుష్టం ప్రాణమాంసక్షయాదిభిః,
వాతరక్తమసాధ్యం స్యాద్యాప్యం సంవత్సరోషితమ్. 20

తా. మోకాళ్లవరకు వ్యాపించినదై పగిలి స్రవించుచు బలమాంసములను క్షీణింపజేసెడిదియు నుపద్రవములుగలదియునగు వాతరక్తము అసాధ్యమని తెలియవలయు. మరియు నిది సంవత్సరముగడిచిన యాప్యమనంబడు.

వాతరక్తోపద్రవములు

అస్వప్నారోచకశ్వాసమాంసకోథశిరోగ్రహాః,
సంమూర్ఛామందరుక్ తృష్ణాజ్వరమోహప్రవేపకాః 21
హిక్కాపాంగుళ్యవిసర్పపాకతోదభ్రమక్లమాః,
అంగుళీవక్రతాస్ఫోట దాహమర్మగ్రహార్బుదాః. 22
ఏతైరుపద్రవైర్వర్జ్యం మోహేనైకేన చాపి యత్,

తా. నిద్రలేకయుండుట, అరుచి, శ్వాస, మాంసముకుళ్లుట, తలబట్టినటుల నుండుట, మూర్ఛ, కొంచెమునొప్పి, దప్పి, జ్వరము, మోహము, వణుకు, ఎక్కిళ్లు, కుంటితనము, విసర్పి, పండుట, పోట్లు, భ్రమ, శ్రమ, వేళ్లువంకరలగుట, కురుపులు,

దాహము, మర్మస్థానమునందుపీడ, అర్బుదము ఈ యుపద్రవములు గల వాతరక్తము అసాధ్యము. లేక మోహ మొకటిమాత్రముండినను అసాధ్యమని తెలియవలయు.

సాధ్యాసాధ్యలక్షణము

అకృతోఽనుపద్రవం యాప్యం సాధ్యం స్యాన్నిరుపద్రవమ్. 23
ఏకదోషానుగం సాధ్యం నవం యాప్యం ద్విదోషజమ్,
త్రిదోషజమసాధ్యం స్యాద్యస్య చ స్యురుపద్రవాః. 24

తా. వాతరక్తమునందు కొన్నియుపద్రవములు మాత్రముండిన యాప్యమనియు, ఉపద్రవములులేనిది సాధ్యమనియు, ఏకదోషయుక్తమగునది సాధ్యమనియు. ద్విదోషయుక్తమగునది యాప్యమనియు, త్రిదోష లేక సర్వోపద్రవములతో గూడియుండునది అసాధ్యమనియును తెలియవలయు.

వాతరక్తమునకు సామాన్యచికిత్స

వాతశోణితినో రక్తం స్నిగ్ధస్య బహుశో హరేత్,
అల్పాల్పం రక్షయేద్వాయుం యథాదోషం యథాబలమ్. 25

తా. వాతరక్తరోగికి మొదట స్నేహపానమును జేయించి మాటిమాటికి దోషబలాబలముల నెరింగి కొంచెకొంచెముగ రక్తమోక్షమునుంజేసి వాతరక్షణ జేయవలయు.

రక్తమోక్షణప్రకారములు

ఉగ్రాంగదాహాతోదేషు జలౌకాభిర్వినిర్హరేత్,
శృంగతుంబైశ్చిమిచిమాకండూఃరుగ్వేదనాన్వితమ్. 26
ప్రచ్ఛన్నేన సిరాభిర్వా దేశాద్దేశాంతరం వ్రజేత్,

తా. వాతరక్తరోగమునందు ఉగ్రదాహయుక్తమగు పోట్లుగలిగియుండిన జలగలనంటించి రక్తమును దీయవలయు. మరియు చిమచిమ, దురద, పోట్లు, వేదన వీటితోగూడియుండిన శృంగములు అలాబుఅనువాటిచేగాని, గంట్లుపెట్టిగాని, సిరావేధచేగాని రక్తమునుదీయవలయు. రక్తమును దీయకనుండిన దోషములు సిరామార్గముగ ఇచ్చటచ్చట దిరుగుచుండు.

విరేకాది ప్రకారము

విరేచయేచ్చ పిత్తాఢ్యం స్నేహయుక్తైర్విరేచనైః. 27
బాహ్యామాలేప నాభ్యంగపరిషేకోపనాహనైః,
విరేకాస్థాపనస్నేహపానైర్గంభీరమాచిరేత్. 28

తా. పిత్తాధికవాతరక్తమునందు స్నేహయుక్తముగ విరేచనమును నివ్వవలయు.

మరియు బాహ్యవాతరక్తమునందు లేపనము అభ్యంగము నీళ్లుపోయుట పిసుకుట ఈ యుపచారములం జేయవలయు. గంభీరవాతరక్తముపై రేచనము నిరూహవస్తి స్నేహపానము ఈయుపచారములం జేయవలయు.

వాసాదికషాయము

వాసాగుడూచీచతురంగుళానామేరండతైలేన పిబేత్కషాయమ్,
క్రమేణ సర్వాంగజమప్యశేషం జయేదసృగ్వాతభవం వికారమ్. 29

తా. అడ్డసరపుయాకులు, తిప్పతీగ, రేలగిజరు, వీటినికషాయము బెట్టి అందు ఆముదముచేర్చి పుచ్చుకొనిన సర్వశరీరమునందు రక్తవాతమువలన జనించిన వికారము నివర్తించు.

మంజిష్ఠాదికషాయము

మంజిష్ఠాకుటజామృతాఘనవచాశుంఠీహరిద్రాద్వయం,
వాసాపర్పటసారిబాప్రతివిషానంతావిశాలాజలమ్. 30
క్షుద్రారిష్టపటోలకోష్ఠకటుకాభార్గీవిడంగాగ్నికం,
మూర్వాదారుకలింగభృంగమగధాత్రాయంతి పాఠాపరీ, 31
గాయత్రీ త్రిఫలా కిరాతక మహానింబో సనారగ్వధం,
శ్యామావల్గుజచందనం సవరుణం పూతీకశాకోటకమ్. 32
మంజిష్ఠాదిమముం కషాయవిధినా నిత్యం పుమాన్యఃపిబే,
త్త్వగ్దోషాద్యచిరేణ యాంతి విలయం కుష్ఠాని చాష్టాదశ. 33
వాతరక్తే ప్రసుప్తే చ విసర్పే విద్రధౌ తథా,
సర్వేషు రక్తదోషేషు మంజిష్ఠాదిః ప్రశస్యతే. 34

తా. మంజిష్ఠ, కొడిశపాల, తిప్పతీగ, తుంగముస్తలు, వస, శొంఠి, పసపు, మానిపసపు, అడ్డసరపుయాకులు, పర్పాటకము, సుగంధపాల, అతివస, దూలగొండి, పాపరవేరు, కురువేరు, వాకుడు, వేపయాకులు, చేదుపొట్లు, చంగల్వకోష్టు, కటుకరోహిణి, భారంగి, వాయువిడంగములు, చిత్రమూలము, చాగ, దేవదారు, చేదుపుచ్చ, గుంటగలగర, పిప్పళ్లు, కలుపొనుగ, విషబొద్ది, చల్లపిల్లిగడ్డలు, చంద్ర, కరక, తాడి, ఉసిరికలు, నేలవేము, పెద్దమానిచెక్క, రేల, నల్లతెగడ, బావంచి విత్తులు, చందనము, ఉలిమిడిపట్టు, కానుగ, శాకోటకము (బేకు) వీటిని సమభాగములుగ కషాయముబెట్టి సేవించిన త్వగ్దోషము అష్టాదశకుష్ఠువులు వాతరక్తము సుప్తవాతము విసర్పి విద్రధి సర్వరక్తదోషములు ఇవియన్నియు నివర్తించు.

### లఘుమంజిష్ఠాదికషాయము

మంజిష్ఠా త్రిఫలా తిక్తా వచా దారునిశా మృతా,
నింబశ్చైషాం కృతః క్వాథో వాతరక్తవినాశనః. 35
పామాకపాలికాకుష్ఠ రక్తమండలజిన్మతః,

తా. మంజిష్ఠ, కరక, తాడి, ఉశిరికలు, కటుకరోహిణి, వస, మానిపసపు, తిప్పతీగ, వేపయీనెలు వీటిని సమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతరక్తము, గజ్జి, కపాలకుష్ఠు, రక్తమండలములు ఇవి నివర్తించు.

### పటోలాదికషాయము

పటోలీ త్రిఫలా తిక్తా గుడూచీ చ శతావరీ. 36
ఏషాం క్వాథో జయేత్పీతో వాతాస్రం దాహసంయుతమ్,

తా. చేదుపొట్ల, కరక, తాడి, ఉశిరికలు, కటుకరోహిణి, తిప్పతీగ, పిల్లపీచర వీటిని కషాయముబెట్టి పుచ్చుకొనిన దాహముతోగూడిన వాతరక్తము నివర్తించు.

### దార్వ్యాది కషాయము

దార్వీగుడూచీకటుకోగ్రగంధామంజిష్ఠనింబత్రిఫలాకషాయః. 37
వాతాస్రముచ్చైర్నవకర్షికాఖ్యో జయేచ్చకుష్ఠాన్యఖిలానిపుంసామ్,

తా. మానిపసపు, తిప్పతీగ, కటుకరోహిణి, వస, మంజిష్ఠ, వేపయీనెలు, కరక, తాడి, ఉశిరికలు వీటినికషాయముబెట్టి పుచ్చుకొనిన వాతరక్తము, సమస్తకుష్ఠువులు ఇవియన్నియు నశించు. (దీనినే నవకార్షికకషాయమందురు.)

### గుడూచ్యాదికషాయము

గుడూచీవాకుచీ చక్రమర్దశ్చ పిచుమందకః.
హరీతకీహరిద్రా చ ధాత్రీ వాసా శతావరీ,
వాలంనాగబలా యష్టీమధూకం క్షురకోపిచ. 39
పటోలస్య లతోశీరం మంజిష్ఠారక్తచందనమ్,
గుడూచ్యాదిరయం క్వాథో వాతరక్తాంతకారకః. 40
కుష్ఠానామపి సంహర్తా కండూమండలఖండనః,
వాతికాన్ రౌధిరాన్సర్వాన్వికారానాశు నాశయేత్. 41
మునిభిః కరుణాక్రాన్తైః కషాయోయం ప్రకాశితః,

తా. తిప్పతీగ, బావంచివిత్తులు, తగిరిశ, వేపయీనెలు, కరక, పసపు, ఉశిరికె వొలుపు, అడ్డసరము, చల్లపిల్లిగడ్డలు, కురువేరు, నాగముత్తవపులగ, అతిమధురము, తిలకపుష్పములు, చేదుపొట్ల, వట్టివేరు, మంజిష్ఠ, రక్తచందనము వీటిని సమభాగము

లుగ కషాయము జెట్టి పుచ్చుకొనిన వాతరక్తములు, సర్వవాతవికారములు ఇవి యన్నియు నివర్తించు. ఈకషాయము కరుణగలమునులు ప్రకాశించిరి.

—౷ వృషాదికషాయము ౷—

క్వాథో వృషారగ్వధకుండలీనా మేరండతైలేన సమం నిపీతః. 42
జయేదసృగ్వాతభవం వికారం సర్వాంగశోఫప్రవిదాహయుక్తమ్,

తా. అడ్డసరము, రేలగిజరు, తిప్పతీగ, వీటినికషాయము జెట్టి అందు ఆముదము చేర్చిపుచ్చుకొనిన సర్వావయవములయందు వాపు, మంటలతోగూడియుండు వాతరక్తము ఇవి నివర్తించు.

—౷ లాంగల్యాదిచూర్ణము ౷—

లాంగల్యాః కందచూర్ణం త్రికటుకలవణ్ణైర్యోగరాజోభిమిశ్రం. 43
గవ్యేనాలిహ్యాచూర్ణం మధుఘృతసహితం చాక్షమాత్రం హితాశీ,
నానారుక్ పాదదోషస్ఫుటనవిమథనైర్మర్మజం తత్ప్రికృష్టం. 44
దుస్సాధ్యం వాతరక్తం జయతి సనియతం కుష్ఠమత్యుగ్రరూపమ్,

తా. శుద్ధిచేసినవపొత్తి దుంపచూర్ణమునందు త్రికటుకములు సైంధవలవణము యోగరాజగుగ్గులు వీనిచూర్ణముజేర్చి ఏకముగకలిపి ఆవునేతితోగాని తేనెలోగాని అక్షమాత్రముపుచ్చుకొని పథ్యముగభుజించిన నానారక్తవికారములు పాదదోషము కాళ్లుపగులుట మర్మములయందలిపీడ దుస్సాధ్యవాతరక్తము కుష్ఠము ఇవి నివర్తించు.

—౷ పంచామృతరసము ౷—

పారదం చ క్రియాశుద్ధం తుల్యం శుద్ధం చ గంధకమ్. 45
అభ్రకం తు ద్వయోస్తుల్యం త్రిభిస్తుల్యస్తు గుగ్గులుః,
సర్వాంశమమృతాసత్వం భావయేద్రావద్రైః పృథక్. 46
నిర్గుండీగోక్షురచ్ఛిన్నాకోకిలాక్ష్యంఘ్రిజై రసైః,
సప్తవారం తతో యుంజ్యాద్వాతరక్తే త్రివల్లకమ్. 47
కోకిలాక్షస్య మూలానాం కషాయమనుపాయయేత్,

తా. శుద్ధరసము ౧ భాగము, శుద్ధగంధకము ౧ భాగము, అభ్రకభస్మము ౨ భాగములు, గుగ్గిలము ౪ భాగములు తిప్పసత్తు ౮ భాగములు, ఇవియన్నియు ఖల్వమునందునిచి వావిలివేరు, పల్లేరువేరు, తిప్పతీగ. గొలిమిడివేరు వీనిరసములచే ప్రత్యేకము ఏడేసిభావనలుజేసి మూడువల్లములపరిమాణము గొబ్బివేళ్లరసముతో సేవించిన వాతరక్తము నివర్తించు.

### తాలకేశ్వరరసము

తాలకస్య తు యస్యేహ పత్రాణి స్యుః పృథక్ పృథక్. 48
అభ్రికస్యేవ తద్గ్రాహ్యం హరితాళం విచక్షణైః,
పునర్నవాయాస్స్వరసే తాలకం తద్విమర్దయేత్. 49
దినమేకం తతస్తస్మిన్ ఘనత్వం గమితే సతి,
కుర్వీత చక్రికాం తాం తు శోషయేత్సమ్యగాతపే. 50
పునర్నవాసమస్తాంగక్షారైః స్థాలీంగలావధి,
పూరయేత్తు తతః క్షారం దృఢయేత్పీడనేన హి. 51
క్షారస్యోపరి తాం సమ్యక్ దత్వా తత్తాలచక్రికామ్,
తతఆచ్ఛాదనం దత్త్వా ముద్రాం కృత్వా విశోషయేత్. 52
స్థాలీం చుల్ల్యాం నిధాయాగ్నిమమందం జ్వాలయేద్భిషక్,
నిరంతరమహోరాత్రపంచకం తేన సిధ్యతి. 53
స్వాంగశీతం సముత్తార్య గృహ్ణీయాద్రసముత్తమమ్,
తాలకేశ్వరనామాయం రసో గుంజామితోఽశితః. 54
గుడూచ్యాదికషాయేణ గదానేతాన్వినాశయేత్,
సోపద్రవం వాతరక్తం కుష్ఠాన్యష్టాదశాపిచ. 55
ఫరంగదేశజం జంతోర్హంతి రోగం సుదుస్తరమ్,
విసర్పం మండలం కండూం పామాం విస్ఫోటకం తథా. 56
వాతరక్తకృతాన్రోగానన్యానపి వినాశయేత్,
ఏతద్భేషజసేవీతు లవణామ్లౌ వివర్జయేత్. 57
తథా కటురసం వహ్నిమాతపం దూరతస్త్యజేత్,
లవణం యః పరిత్యక్తుం న శక్నోతి కథంచన. 58
సతు సైంధవమశ్నీయాన్మధురోపరసం హితత్,

తా. శుద్ధతాళకముయొక్క పొరలను అభ్రకపుశేరులవలె విడదీసి ఖల్వమునం దునిచి తెల్లగలిజేరురసముచే ౧ దినము మర్దించి అది ఘట్టిపడినపిదప బిళ్లచేసి బాగుగ నెండించి పిదప తెల్లగలిజేరు సమూలములు కాల్చిన క్షారమును గ్రహించి ఆక్షారమును మూసకంఠమువరకు నిండించి దానిపై బిళ్లనునిచి పైని క్షారముపోసి దంచి మూతమూసి చీలమన్నుయిచ్చి యెండించి పొయిమీదనునిచి గాఢాగ్నిచే ౫ అహోరాత్రములు పచనముజేసి స్వాంగశీతలమునదీసిన తాలకేశ్వరరసమనంబను. దానిని గురిగింజయెత్తు తిప్పతీగ మొదలగువాటి కషాయములచే పుచ్చుకొనిన ఉపద్రవసహిత వాతరక్తము,

అష్టాదశకుష్ఠువులు, ఫిరంగోపదంశము, విసర్పి, మండలములు, గురద, గజ్జి, విస్ఫోటము, వాతరక్తమువలన జనించిన ఇతరరోగములు ఇవి నివర్తించు. మరియు నీయౌషధసేవజేసినమనుజుడు ఉప్పు, పులుసు, కారము, అగ్ని, యెండ వీనిని వర్జించవలయు. మరియు లవణమును వర్జించుటకు శక్తుడుగానియెడల సైంధవలవణమునుమాత్రము జేర్చుకొనవలయు. సైంధవము మధురానురసముకలదిగాన బాధింపదు.

### సర్వేశ్వరరసము

రసహింగుళలోహానాం త్రయః కర్షాః పలద్వయమ్. 59
తామ్రగంధకయోస్సర్వం జంబీరాద్భిర్విమర్దయేత్,
విషముష్ట్యర్క హేమస్నుక్ కరవీరజలైః పునః. 60
సప్తధా గోలకం కృత్వా స్వేదయేద్దివసద్వయమ్,
వాలుకాయంత్రమధ్యస్థం శీతే నిష్కం విషస్యచ. 61
కర్షం కణానాం సూతస్స్యాత్సర్వేశో వాతరక్తజిత్,
గుంజామాత్రాస్యదాతవ్యా ద్వయంవా స్మత్త వారిణా. 62
రక్తప్రకోపనం తీవ్రం పిత్తలం పరివర్జయేత,

తా. శుద్ధరసము, హింగుళము, లోహభస్మము ఇవిప్రత్యేక మూడుకర్షము, తామ్రభస్మము, శుద్ధగంధకము ఇవి ప్రత్యేకము ౨ పలములు, వీనిని ఖల్వమునంనునిచి నిమ్మపండ్లరసముచే మర్దించి విషముష్టి, జిల్లేడు, ఉమ్మెత్త, బొంతజెముడు, కరవీరము వీని రసములచే ౭ భావనలుజేసి ముద్దచేసి పైవానిరసములలోనే డోలాయంత్రమున వండి షాంగశీతలమునదీసి నాభి ౧ నిష్కము పిప్పలిచూర్ణము ౧ కర్షము కలిపిన సర్వేశ్వర రసమనంబడు. దీనిని గుంజమెత్తుగాని లేక ౨ గుంజములయెత్తుగాని నల్లఉమ్మెత్తాకు రసముతో సేవించిన వాతరక్తము నివర్తించు. మరియు రక్తప్రకోపము, ఉష్ణము, పిత్తము వీనిని గలుగంజేయుపదార్థముల వర్జించవలయు.

### అర్కేశ్వరరసము

చతుఃపలం రసస్యాపిబలేర్ద్వాదశతత్సమమ్ తామ్రంచ చక్రికాదేయా రసస్యార్ధశరావకం. 63
దత్వా విరుధ్వా తద్భాండే పూరయేద్భస్మనా దృఢం,
అగ్నిం ప్రజ్వాలయేద్యామద్వయం శీతం విచూర్ణయేత్. 64
పుటే ద్వాదశధా సూర్యదుగ్ధేనాలోడితం పునః,
వరాపావకశృంగాణాం ద్రవైస్త్రిస్త్రిశ్చ భావయేత్. 65
అయమర్కేశ్వరో వాతరక్తమండలసుప్తజిత్,
గుంజాద్వయం దదీతాస్య లవణాది వివర్జయేత్. 66

తా. శుద్ధపాదరసము ౪ పలములు, శుద్ధగంధకము ౧౨ పలములు ఖల్వమునం దునిచి కజ్జలిజేసి ౧౨ పలములతామ్రపత్రములను గ్రహించి యాశేరులకు లేపనము జేసి ఆశేరులను మూకుడియందునిచి పైన మూకుడుబోర్లించి చీలమన్నుయిచ్చి ఒక భాండమునందు భస్మమును నిండించి అందు యీశరావమునునిచి అగ్నిచే రెండు యామములువండి సాంగశీతలమునదీసి చూర్ణించి జిల్లేడుపాలచే మర్దించుచు సంద్రెండు పుటంబులిడి, పిదప త్రిఫలములు, చిత్రమూలము, కర్కాటకశృంగి వీనిరసములచే మూడుభావనలుజేసిన సిద్ధమగు. దీనిని రెండుగుంజములయెత్తు సేవించిన వాతరక్తము, మండలములు, మోహము, ఇవి నివర్తించు. ఉష్ణ, పులుసు మొదలగునవి విడువవలయు.

### యోగసారామృతరసము

శతావరీనాగబలే ఉచ్చటాన్వృద్ధదారుకమ్,
పునర్నవా మృతా కృష్ణా వాజిగంధా త్రికంటకమ్. 67
పృథక్ దశపలాన్యేషాం శ్లక్ష్ణచూర్ణాని కారయేత్,
తదర్ధశర్కరాయుక్తం చూర్ణం తస్యార్ధయేద్బుధః. 68
స్థాపయేత్తు దృఢే భాండే మధ్వర్ధాంశకసంయుతమ్,
ఘృతప్రస్థేనావలోడ్య త్రిసుగంధిపలేన చ. 69
యః ఖాదేన్నష్టచేష్టాగ్నిర్యద్వా చ వికలేంద్రియః,
వాతరక్తం క్షయం కుష్ఠం పిత్తం పిత్తాస్రసంభవమ్. 79
వాతపిత్తకఫోత్థాంశ్చ రోగానన్యాంశ్చ తద్విధాన్,
హత్వా కరోతి పురుషం వలీపలితవర్జితమ్. 71
యోగసారామృతో నామ్నా లక్ష్మీకాంతివివర్ధనః,

తా. పిల్లిపీచర, నాగముత్తవపులగ, గురిగింజవేరు, వృద్ధదారు, తెల్లగలిజేరు, తిప్పతీగ, పిప్పళ్లు, పెన్నేరు, పల్లేరు, వీనిని ప్రత్యేకము ౧౦ పలములుచేర్చి మెత్తగ చూర్ణించి చూర్ణమునకు సగముచక్కెరచేర్చి మర్దించి భాండమునందునిచి అర్థ అధికము తేనె ఒకప్రస్థము నెయ్యి వైచి అందు ఏలకులు లవంగములు ఆకుపత్రి వీటిని ప్రత్యేకము పలప్రమాణము చూర్ణించి చేర్చి కలియబెట్టి సేవించిన నష్టచేష్ట, వికలేంద్రియము, వాతరక్తము, క్షయ, కుష్ఠువు, పిత్తము, పిత్తరక్తప్రకోపముగల వాతరక్తము, వాతరక్తము, వాతపిత్తకఫములచే జనించు ఇతరరోగములు ఇవి నివర్తించుటయేగాక పురుషుని వలీపలితరహితునిగజేయు. మరియు లక్ష్మికాంతి వీటిని సగా వృద్ధింజేయు. ఇది యోగసారామృతమని చెప్పబడును.

అమృతభల్లాతకావలేహము

నిమజ్జంతి జలే యాస్తు భల్లాతక్యశ్చ తా హితాః. 72
తాశ్చ సర్వా విధాతవ్యా సంఛిన్నముఖముద్రికాః,
తాసాం ప్రస్థద్వయం ఛిత్వా జలద్రోణే పరిక్షిపేత్. 73
ప్రస్థద్వయం గుడూచ్యాశ్చ చూర్ణం తత్రాంభసి క్షిపేత్,
చతుర్థాంశావశేషం తు కషాయమవతారయేత్. 74
వస్త్రపూతే కషాయే చ వక్ష్యమాణాని నిక్షిపేత్,
సర్వాణ్యేకత్ర భాండే తు పచేన్మృద్వగ్నినా శనైః. 75
సర్వద్రవ్యే ఘనీభూతే పావకాదవతారయేత్,
తత్ర క్షేప్యాని చూర్ణాని బ్రూమో విశ్వౌషధోఽమృతా. 76
వాకుచీ చక్రమర్దశ్చ పిచుమందో హరీతకీ,
ధాత్రీ రాత్రిశ్చ మంజిష్ఠా మరిచం నాగరం కణా, 77
యవానీ సైంధవం ముస్తం త్వగేలా నాగకేసరమ్,
పర్పటః పత్రకం వాలముశీరం చందనం తథా. 78
గోక్షురస్య చ బీజాని కచ్చూరో రక్తచందనమ్,
పృథక్ పలార్థమానానామేషాం చూర్ణమిదం క్షిపేత్. 79
సమ్యక్ సంమిశ్ర్య తద్రక్షేద్భాజనే మృణ్మయే నవే,
ప్రభాతే భక్షితే జీర్ణేఽమృతభల్లాతకాభిధమ్. 80
అవలేహం సమశ్నీయాత్పలమాత్రం జలేన హి,
ప్రకృత్యా దేహినో యస్య సహతే రుష్కరో న చేత్. 81
సోరుష్కరస్య సంసర్గం సదా దూరాత్పరిత్యజేత్,
భల్లాతకావలేహోఽయం వాతరక్తాంతకృన్మతః. 82
వాతరక్తసముద్భూతాన్వికారానాశు నాశయేత్,
కుష్ఠాని సకలాన్యేవ దుర్నామాని హరేదరమ్. 83
విసర్పం మండలం కండూం శమయేదేవ సేవితః,
వికారాన్వాతికాన్సర్వాంస్తథా రుధిరసంభవాన్. 84
హరత్యేవ ప్రయోగోఽయం యత్నతస్సేవితస్సదా,
వ్యాయామమాతపం వహ్నిమమ్లం మాంసం దధిస్త్రియమ్. 85
తైలాభ్యంగం తథాధ్వానం నరో భల్లాతకే త్యజేత్,

తా. నీటియందువైచిన మణిగెడి జీడిగింజలను రెండుప్రస్థములు గ్రహించి వాటిముఖములనుగోసి ద్రోణప్రమాణోదకమునందువైచి రెండుప్రస్థములు తిప్పతీగ నలియగొట్టివైచి నాలవపాలు మిగులునటుల కషాయముకాచి వడియగట్టి అందు శొంఠి, తిప్పతీగ, బావంచివిత్తులు, తగిరిసవిత్తులు, వేప, కరక్కాయ, ఉశిరిక వీనిపోపులు, పసపు, మంజిష్ఠ, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఓమము, సైంధవలవణము తుంగగడ్డ, లవంగపట్ట, ఏలకులు, నాగకేసరములు, పర్పాటకము, తాళిసపత్రి, వరు వేరు, వట్టివేరు, చందనము, పల్లేరుకాయ, కచ్చూరములు, రక్తచందనము, వీనిని ప్రత్యేకము అరపలమువంతున చూర్ణించివైచి మృద్వగ్నిచే గట్టిపడువరకు వండిదించు కొని కొత్తకుండయందునిచి ప్రాతఃకాలమున నొకపలము ఉదకముతో సేవించవల యు. స్వభావముచే ఏమనుజునికి జీడిగింజలు ఒంటవో మ్మవో వాడు పుచ్చుకొనంద గదు వొమ్మినమనుజుడు పుచ్చుకొనిన వికారములతోగూడిన వాతగస్తము సంపూర్ణ కుష్ఠము మూలవ్యాధి విసర్పము మండలము కండు సంపూర్ణమగు వాతవికారము, రక్తవికారము వీనిని నివర్తింపంజేయు. మరియు మిగుల సంచరించుట, యెండ, అగ్ని, పులుసు, మాంసము, పెరుగు, స్త్రీసంగమము, తైలాభ్యంగము, మార్గగమనము వీనినన్నిటిని విడువవలయు.

## బృహన్మరీచాది తైలము

మరిచం త్రివృతా దంతీ క్షీరమార్కం శకృద్రసః. 86
దేవదారుహరిద్రే ద్వే మాంసీ కుష్ఠం సచందనమ్,
విశాలం కరవీరం చ హరితాలం మనశ్శిలా. 87
చిత్రకం లాంగలీచాపి విడంగం చక్రమర్దకమ్,
శిరీషం కుటజో నింబస్సప్తపర్ణో మృతా స్నుహీ. 88
శమ్యాకో నక్తమాలశ్చ ఖదిరం పిప్పలీ వచా,
జ్యోతిష్మతీ చ పలికా విషస్య ద్విపలం మతమ్. 89
ఆఢకం కటుతైలస్య గోమూత్రం చ చతుర్గుణమ్,
మృత్పాత్రే లోహపాత్రే వా శనైర్మృద్వగ్నినా పచేత్. 90
ఏతత్తైలం విశేషేణ నాశయేత్కుష్ఠజాన్ వ్రణాన్,
వాతరక్తభవాన్వ్యాధీన్పామావిస్ఫోటచర్చికాః. 91

తా. మిరియాలు, తెగడ, దంతివేరు, జిల్లేడిపాలు, ఆవుపేడరసము, దేవదారు, మానిపసపు, జటామాంసి, చంగల్వకోష్ఠు, చందనము, పాపగ, వాడగన్నేరు, హరి తాళము, మణిశిల, చిత్రమూలము, నీటిపిప్పలి, (పొత్తి), వాయువిడంగములు,తగిరిశ,

దిరిశనపుపట్ట, గిరిమల్లి, వేప, ఏడాకులఅరటి, తిప్పతీగ, బొంతజెముడు, రేల, కానుగ, చంద్ర, పిప్పలి, వస, జ్యోతిష్మతివిత్తులు ఇవి ప్రత్యేకము ౧ పలము, వత్సనాభి రెండుపలములు వీనినన్నియు నలియగొట్టి మృద్భాండమునందుగాని, లోహభాండము నందుగానివైచి అందు ఆవనూనె ఒక అఢకము గోమూత్రము నాలుగు అఢకములు చేర్చి మృద్వగ్నిచే తైలము మిగులువరకు కాచి లేపనాదులంజేసికొనిన కుష్ఠువలన జనించిన వ్రణములు వాతరక్తమునలనకలిగిన వ్యాధులు గజ్జి విస్ఫోటము ఇవి నివర్తించు.

## గుడూచ్యాదితైలము

తులాం పచేద్గుడూచ్యాస్తు జలద్రోణచతుష్టయే,
పాదశేషః కషాయస్తు గోదుగ్ధం ద్రోణసమ్మితమ్. 92
తిలతైలాఢకం తాభ్యాం పచేన్మృద్వగ్నినా భిషక్,
వక్ష్యమాణైస్తతో ద్రవ్యైస్సమ్యక్కల్కీకృతైః పచేత్. 93
మంజిష్ఠామధుకం కుష్ఠం జీవనీయగణస్తథా,
ఏలారుచకమృద్వీకా మాంసీ వ్యాఘ్రనఖంసఖీమ్. 94
హరేణుశ్శారివణీవ్యోషం స్థిరాతామలకీ తథా,
శృంగీ శ్యామా శతాహ్వా చ విష్ణుక్రాంతా చ పత్రకమ్. 95
నాగకేసరవాలత్వక్ పద్మకోత్పలచందనమ్
ఏతాని కల్కవస్తూని కథితానీహ కోవిదైః. 96
పానేభ్యంగేనువాసే చ తైలమేతన్నిషేవితమ్,
వాతరక్తం తదుద్భూతోపద్రవాంశ్చాశు నాశయేత్. 97
ధన్యం పుంసవనం స్త్రీణాం గర్భదం వాతపిత్తనుత్,
స్వేదకండూరుజాపామాశిరఃకంపార్దితామయాన్. 98
హన్యాద్వ్రణకృతాన్ దోషాన్ గుడూచీతైలముత్తమమ్.

తా. నూరుపలములు తిప్పతీగనునలియగొట్టి నాలుగుద్రోణముల ఉదకమునందు వైచి నాలవపాలు మిగులునటుల కాచి వడియగట్టి అందొకద్రోణము ఆవుపాలు ఒక అఢకము నువ్వులనూనెజేర్చి మృద్వగ్నిచేకాచుచు మంజిష్ఠ, యష్టిమధుకము చెంగల్వ కోష్ఠు, జీవనీయగణమునందుఁ జెప్పంపబడిన ఓషధులు; ఏలకులు, సైంధవలవణము, ద్రాక్ష, జటామాంసి, గొంతెమగోరు, నఖమనుగ్రంధ్యము, రేణుకలు, బోడతరము, త్రికటుకములు, మయ్యాకుపొన్న, నేలవుశిరిక, కర్కాటకశృంగి, నల్లతెగడ,

పిల్లపీచర, విష్ణుక్రాంతము, ఆకుపత్రి, నాగకేసరములు, కురువేరు, లవంగపట్ట, పద్మకము, కలువదుంప, చందనము, వీనిని చూర్ణించివైచి మృద్వగ్నిచే తైలము కాచి పానము అభ్యంగనము అనువాసనవస్తి వీనినిజేసిన వాతరక్తము, వాతరక్తమువలన జనించు ఇతరోపద్రవములు వాతపైత్యములు చెమట గురద పోట్లు, తలవణుకు, అర్దితవాతము, ప్రణదోషము, వీనిని నశింపజేయుటయేగాక, స్త్రీలు సేవించిన పుత్రోత్పత్తియగు ఇదియే గుడూచీతైలము.

## నాగబలాతైలము

సిద్ధాం పచేన్నాగబలాతులాం చ జలార్మణే పాదకషాయశిష్టమ్. 99
పాచ్యం తు తైలాఢకమత్ర శస్తమజాపయస్తుల్యవిమిశ్రితం చ,
నతస్య యష్టీమధుకస్య కల్కం దత్వా పృథక్ పంచపలం విపక్వమ్.
తద్వాతరక్తం శమయత్యుదీర్ణం వస్తిప్రదానేన హి సప్తరాత్రాత్,
దశాహయోగేన కరోత్యరోగం పీతంచ తైలోత్తమనూశ్వినోక్తమ్.

తా. నాగముత్తవపులగము ౧౦౦ పలములు గ్రహించి నలియగొట్టి ౫౦౦ పలముల నీళ్లయందువైచి నాలవపాలు మిగులునటుల కషాయము కాచి ఆ కషాయమునకు సమము మేకపాలు ఒకఆఢకమునూనె చేర్చి కాచుచు అందునట్టివేళ, యష్టిమధుకము వీటికల్కమును ప్రత్యేకము ౫ పలములుచేర్చి కాచి ౭ దినములు వస్తికర్మమునుంజేసిన వాతరక్తము నివర్తించు. ౧౦ దినములు సేవించిన రోగరహితునిగ జేయు. ఇది అశ్వినేయులచే జెప్పబడిన బలాతైలము.

## శతావరీఘృతము

శతావరీ కల్కగర్భం రసే తస్యాశ్చతుర్గుణే,
క్షీరతుల్యం ఘృతం సిద్ధం వాతరక్తం హరం పరమ్. 102

తా. పిల్లపీచరకల్కము, పాలు, పాలకుసమము నెయ్యి, నెయ్యికినాలుగింతలు పిల్లపీచరరసము, వీటిని నేకముగ చేర్చి కాచి సేవించిన వాతరక్తము నివర్తించు.

## అమృతాదిఘృతము

అమృతా మధుకం ద్రాక్షా త్రిఫలా నాగరం బలా,
వాసారగ్వధవృశ్చీరదేవదారుత్రికంటకమ్. 103
కటుకా రోహిణీ కృష్ణా కాశ్మర్యాశ్చ ఫలాని చ,
రాస్నేక్షురకగంధర్వ దేవదారుబలోత్పలైః. 104
కల్కైరేభిస్సమైః కృత్వా సర్పిః ప్రస్థం విపాచయేత్,
ధాత్రీరసస్సమో దేయో పయస్త్రిగుణసంయుతః. 105

సమ్యక్ సిద్ధం తు విజ్ఞాయ భోజ్యే పానే చ శస్యతే,
బహుదోషోత్థితం వాతంరక్తేన సహమూర్ఛితమ్. 106
ఉత్తానంవాపి గంభీరం త్రికజం ఘోరుజానుజమ్,
క్రోష్టుశీర్షం మహాశూలమామవాతం సుదారుణమ్. 107
మహారోగోపసృష్టస్య వేదనాం చాతిదుస్తరామ్,
మూత్రకృఛ్రముదావర్తం ప్రమేహం విషమజ్వరాన్. 108
ఏతాన్సర్వాన్నిహంత్యాశు వాత పిత్తకఫోత్థితాన్,
సర్వకాలోపయోగేన వర్ణాయుర్బలవర్ధనమ్. 109
అశ్విభ్యాం నిర్మితం శ్రేష్ఠం ఘృతమేతదనుత్తమమ్,

తా. తిప్పతీగ, యష్టిమధుకము, ద్రాక్ష, త్రిఫలములు, శొంఠి, చిట్టాముట్టి, అడ్డసరము, శేల, తెల్లగలిజేరు, దేవదారు, పల్లేరు, కటుకరోహిణి, పిప్పలి, చల్ల గుమ్మడుపండ్లు, రాస్న, గొబ్బి, అసుదపువేరు, మానిపసపు, కలువదుంప వీనిని సమభాగములుగ గ్రహించి కల్కముజేసి ౧ ప్రస్థము నెయ్యి, ఉశిరికెరసము ౧ ప్రస్థము, పాలు ౩ ప్రస్థములు చేర్చి ఘృతము సిద్ధపరచి భోజనార్హద్రవ్యమునను పానమునందుజేర్చుకొనిన ప్రశస్తముగనుండును. మరియు దీనిని సేవించిన, బహు దోషమువలన జనించి వాతరక్తములచేగూడిన ఉత్తానవాతరక్తము, గంభీరవాతరక్తము పృష్టభాగము, పిక్కలు, తొడలు, మోకాళ్లు, వీనియందలివాతము, క్రోష్టుశీర్షము, మహాశూల, దారుణమగు ఆమవాతము * మహారోగముచేగలుగు దుస్తరమగు వేదన, మూత్రకృఛ్రము, ఉదావర్తము, ప్రమేహము, విషమజ్వరము, వాతపిత్తకఫములచే జనించు సకలరోగములు ఇవియన్నియు నివర్తించు. మరియు సర్వకాలము సేవించు చుండిన శరీరకాంతి, ఆయుష్యము, బలము ఇవి వృద్ధిజెందు. ఇది అశ్వినీదేవతలచే జెప్పబడిన అమృతాదితైలము.

ప్రపౌండరీకాదిలేపనము

ప్రపౌండరీకమంజిష్ఠాదార్వీమధుకచందనైః. 110
శీతోపలైలాసకృష్ణాభిరబ్జసూరోశీరపద్మకైః,
లేపో రుగ్దాహవీసర్పరోగశోఫనివారణః. 111

తా. ప్రపౌండరీకము, మంజిష్ఠ, మానిపసపు, అతిమధురము, చందనము,

* మహారోగమనగా కుష్ఠమని యభిప్రాయమై యుండవచ్చును. దీనిని తెలుగులో పెద్దరోగమందురు. దీనికి సంస్కృతభాషాంతరీకరణమని తోచెడిని.

కలకండ, ఏలకులు, వేచినబియ్యాపుపిండి, మనూరనులు, వట్టివేరు, పద్మకనులు, వీనిని నూరి లేపనముజేసిన నొప్పి, మంట, విసర్పము, వాపు ఇవి నివర్తించు.

వాతరక్తలేపము లేక అభ్యంగము

లేపః పిష్టాస్తిలాస్తద్వత్ భృష్టాః పయసి నిర్వృతాః,
క్షీరపిష్టముపాలేపో హ్యేరండస్య ఫలాని చ. 112
కుర్యాచ్ఛూలనివృత్త్యర్థం శతాహ్వాచాధికేనిలే,
మూత్రక్షీరసురాసిద్ధం ఘృతమభ్యంజనే హితమ్. 113
సిద్ధం తు మధుసూక్తం తు సేకాభ్యంగై కఫలోత్తరమ్,
గృహధూమం వచా కుష్ఠం శతాహ్వా రజనీద్వయమ్. 114
ప్రలేపశ్శూలనుద్వాతరక్తే వాతకఫోత్తరే,
ప్రభూతకాలమాసేవ్యం ముచ్యతే వాతశోణితాత్. 115

తా. నువ్వులు బాగుగనూరి పిదపవేయించి పాలతో ఉడికించినగాని, లేక ఆముదపువిత్తులలోని పప్పునునూరి వేయించి పాలలో ఉడికించినగాని, లేక పిల్లిపీచర వేళ్లనునూరి లేపనముజేసినగాని వాతాధికశూల నివర్తించు. మరియు ఆవుపంచితము, పాలు, తేనె, వీనిచే సిద్ధపరచిన ఘృతముతో అభ్యంజనము, మధుసూక్తమును సిద్ధము జేసి సేకము, లేక అభ్యంగము వీనినిచేసిన సన్నిపాతాధిక వాతరక్తమునకు హితముగ నుండు. మరియు కరిధూపము, వస, కుష్ఠము, పిల్లిపీచర, పసుపు, మానిపసుపు వీనిని నూరి లేపనముజేసిన చిరకాలమునుండియుండు కఫాధికరక్తవాతము నివర్తించు.

శతాహ్వాదిలేపము

ఉభే శతాహ్వే మధుకం విశాలా బలా ప్రియాలేచకచూరమబ్దమ్,
ఘృతం విదారీం చ శితోపలాం చ కుర్యాత్ప్రలేపం పవనే సరక్తే.

తా: సోపు, బాలింతసోపు, అతిమధురము, పాపర, చిట్టాముట్టి, సారపప్పు, కచోరములు, తుంగముస్తలు, నెయ్యి, నేలగుమ్ముడు, ఖండశర్కర వీనిని నూరి లేపనముజేసిన వాతరక్తము నివర్తించు.

కనకాదిలేపము

కనకభుజగవల్లీమాలతీపత్రమూర్వా
దళరసకునటీభిర్మర్దితం తైలయోగాత్,
అపహరతి రసేంద్రః కుష్ఠకండూవిసర్ప
స్ఫుటితచరణవక్త్రశ్యామలత్వం నరాణామ్. 117

తా. నల్లవుష్మెత్త, తమలపాకులు, జాజిఆకులు, చాగమట్టలు, మనుశిల, వీని చూర్ణమును తైలమునందు మర్దించి లేపనముజేసిన కుష్ఠము, దురద, విసర్పము, కాళ్ల పగుళ్లు, మంగు, మచ్చలు ఇవి నివర్తించు.

వాతరక్తమునకు పథ్యములు

ఉత్తానేభ్యంజనం సేక ఉపనాహాశ్చ లేపనమ్,
గంభీరేస్నేహపానం చ స్థాపనం చ విరేచనమ్. 118
సర్వత్రాస్రస్రుతిః సూచీజలౌకాశృంగ్యలాబుభిః,
శతధౌతఘృతాభ్యంగో మేషీదుగ్ధావసేచనమ్. 119
యవషష్టికనీవారకలమారుణశాలయః,
గోధూమాశ్చణకా ముద్గాస్తువర్యోపి మకుష్టకాః. 120
అజావిమహిషీణాం చ గవామపి పయాంసి చ,
ఉపోదికాకాకమాచీవేత్రాగ్రం సునిషణ్ణకమ్. 121
వాస్తుకం కారవేల్లం చ తండులీయం పటోలకమ్,
ధాత్రీఫలం శృంగబేరం సూరణం శ్వేతశర్కరా. 122
మృద్వీకా వృద్ధకూష్మాండం నవనీతం నవం ఘృతమ్,
లావతిత్తిరవార్తీకతామ్రచూడకివిష్కిరాః. 123
ప్రతుదాశ్శుకదాత్యూహాకపోతచటకాదయః,
శశీ చాగరుదేవాహ్వాసరళాస్నేహమర్దనమ్. 124
తిక్తం చ పథ్యముద్దిష్టం వాతరక్తగదే నృణామ్.

తా. ఉత్తానవాతరక్తమునకు అభ్యంజనము, జలసేకము, వత్తడము వేయుట, లేపనము వీనిని చేయవలయు. గంభీరవాతరక్తమునకు స్నేహపానము, వస్తికర్మ, రేచకము, సూదులు, జలగలు, కొమ్ములు అలాబు మొదలగువాటిచే రక్తమునదీయుట, మరియు నూరుమార్లు నీళ్లతో కడిగిన నేతితో అభ్యంగము, మేకపాలతో సేచనము, యవలు, అరవైదినములకు పండెడి ధాన్యము, తృణధాన్యము, వడ్లు, యెఱ్ఱవడ్ల బియ్యము, గోధుమలు, శనగలు, పెసలు, కందులు, అడవిపెసలు, మేక, గొఱ్ఱె, యెనుము, గోవు వీనియొక్క పాలు, బచ్చలికూర, కాచికూర, వెదురు మొలకలు, చంచలికూర, కాకరకాయ, చిత్తికూర, పొట్లకాయ, ఉసిరికపండు, అల్లము, కంద, మునగ, చక్కెర, ద్రాక్షపండు, గుమ్మడికాయ, వెన్న, సద్యోఘృతము, లావుకపిట్ట తిత్తిరపక్షి పూరపిచ్చుక కోడి వినిష్కిరమనుపక్షి ప్రతుదమనుపక్షి చిలుక వానకోయిల పావురము మొదలగు పక్షులయొక్క మాంసము, పచ్చకర్పూరము, అగరు, దేవదారు, సరళ

దేవదారు, వీనిచూర్ణమును తైలాదులయందుచేర్చి మర్దించుట, ఇవియన్నియు వాతరక్తమునకు పథ్యములని తెలియవలయు.

అపథ్యములు

దివాస్వాపాగ్నిసంతాప వ్యాయామాతపమైథునమ్. 125
మాషాః కులుత్థా నిష్పావాః కలాయాః క్షారసేవనమ్,
అండజానూపమాంసాని విరుద్ధాని దధీనిచ. 126
ఇక్షవో మూలకం మద్యం తాంబూలం కాంజికం తిలాః,
కటూష్ణం గుర్వభిష్యందిలవణాని చ సక్తవః. 127
ఏతాని వాతరక్తేషు నైవ యుంజ్యాద్భిషగ్వరః,

తా. దివానిద్ర, అగ్నిసంతాపము, వ్యాయామము, యెండ, మైథునము, మినుములు, ఉలవలు, అనుములు, బటాణీలు, క్షారములు, వీనిని సేవించుట, పథ్యమునందు చెప్పంబడిన పక్షులకు ఇతరములగు పక్షులయొక్క మాంసము, నిర్జలదేశమందలి జంతుమాంసము, విరుద్ధభోజనము, పెరుగు, చెరుకు, ముల్లంగి, మద్యము, తాంబూలము, కాంజికము, నువ్వులు, కారము, ఉష్ణము, గురుత్వము, జిగట తీపు ఇవిగల పదార్థములు, పిండి వంటలు వీనిని వాతరక్తముగల మనుజునికి ఇవ్వందగదు.

---

# ఊరుస్తంభప్రకరణమ్.

ఊరుస్తంభ నిదానసంప్రాప్తి లక్షణములు

శీతోష్ణద్రవసంశుష్క గురుస్నిగ్ధైర్నిషేవితైః,
జీర్ణాజీర్ణా త్తథాయాససంక్షోభస్వప్నజాగరైః. 1
సశ్లేష్మమేదః పవనః సామమత్యర్థసంచితమ్,
అభిభూయేతరం దోషమూరూ చేత్ప్రతిపద్యతే. 2
సక్థ్యస్థీని ప్రపూర్యాంతః శ్లేష్మణా స్తిమితేన చ,
తదా స్తభ్నాతి తేనోరూ స్తబ్ధౌ శీతావచేతనౌ. 3
పరకీయావివ గురూ స్యాతా మతిభృశవ్యథౌ,
ధ్యానాంగమర్దస్తైమిత్యతంద్రాఛర్ద్యరుచిజ్వరైః. 4
సంయుక్తౌ పాదసదనకృచ్ఛ్రోద్ధరణసుప్తిభిః,
తమూరుస్తంభమిత్యాహురాఢ్యవాతమథాపరే. 5

తా. శీతము, ఉష్ణము, ద్రవము, శుష్కము, గురువు, స్నిగ్ధము ఇట్టిగుణములు గల అన్నముభుజించుట, బాగుగ జీర్ణముగాక యుండునపుడు మరలభుజించుట,ఆయాసము; మనఃక్షోభ, దివానిద్ర, రాత్రిజాగరణ, ఈకారణమువలన కఫముతోచేరిన వాయువు మేదస్సుతోగలసి పిత్తమును నశింపజేసి తొడలయందుజేరుటవలన కఫమేదస్సులచే తొడలయొముకలలోపల నిండింపబడుటవలన తొడలు శీతలములు అచేతనములునై చింత, ఒడలునులుపు, నిశ్చేష్టిత, మోహము, వాంతి, అరుచి, జ్వరము, కాళ్లుసన్నగించుట, మిక్కిలి ప్రయాసముచేనైనను కదలించలేకబోవుట ఈగుణములతో గూడియుండిన దానిని ఊరుస్తంభమనియును కొందరు ఆఢ్యవాతమనియును వచించెదరు.

## పూర్వరూపము

ప్రాగ్రూపం తస్య నిద్రాతిధ్యాన స్తిమితతా జ్వరాః,
రోమహర్షోరుచిశ్ఛర్దిర్జంఘోర్వో స్సదనం తథా. 6

తా. అతినిద్ర, ధ్యానము, (చింత), మందముగ కూర్చుండుట, జ్వరము, (గగుర్పాటు) అరుచి, వాంతి, మోకాళ్లు పిక్కలు తొడలు ఇవిచిక్కుట, ఇవి ఊరుస్తంభమునకు పూర్వరూపములని ఎరుంగవలయు.

## ఊరుస్తంభలక్షణము

వాతశంకిభిరజ్ఞానాత్తస్య స్యాత్స్నేహనాత్పునః,
పాదయోస్సదనం సుప్తిః కృచ్ఛ్రాదుద్ధరణం తథా. 7
జంఘోరుగ్లానిరత్యర్థంశశ్వచ్చానాహ వేదనా,
పదం చ వ్యథతే నిత్యం శీతస్పర్శం న వేత్తి చ. 8
సంస్థానే పీడనే గత్యాం చాలనే చాప్యనీశ్వరః,
అన్యస్యేవ హి సంభగ్నావూరూ పాదౌ చ మన్యతే. 9

తా. కొందరు వాతమును శంకచే అజ్ఞానమువలన స్నేహయుక్తచికిత్సజేసిన మిక్కిలి వృద్ధియగుచు అందువలన కాళ్లుచిక్కుట, శరీరమునందు మొద్దుబారుట, మిక్కిలి కష్టముచే కాళ్లుకదిలించుట, పిక్కలు, తొడలు వీనియందు మిక్కిలి నొప్పి, మాటిమాటికి మలమూత్రబంధము, యెల్లపుడు కాళ్లుపోట్లు, చల్లనిపదార్థముల స్పర్శజ్ఞానము లేకపోవుట, మరియు కాళ్లు సమముగ వుంచుట పిసికించుకొనుట నడుచుట కదిలించుట వీటియందు శక్తిలేకనుండుట, తొడలు మోకాళ్ళు ఇవి విరిగిపడినటుల నుండి అతిశ్రమవిగానట్లు తోచుట, ఇట్టి లక్షణములు గలిగియుండు.

## అసాధ్యలక్షణము

యదా దాహార్తితోదార్తో వేపనః పురుషో భవేత్,
ఊరుస్తమ్భస్తదా హన్యాత్సాధయేదన్యథా నవమ్. 10

తా. ఊరుస్తంభమునందు, రోగికి నెప్పుడు తాపము, పోట్లు, సూదులతో పొడిచినటులపీడ, వణుకు ఇవి గలిగినపుడది అసాధ్యమనియు యీలక్షణములన్నియును లేక నూతనముగనుండిన సాధ్యమనియును తెలియవలయు.

## భల్లాతకాదికషాయము

భల్లాతబీజోషణకాజటానాం కృతః కషాయో మధుసంప్రయుక్తః,
ఊరుగ్రహంఘోరమపిప్రవృద్ధంనిహన్తి గోమూత్రయుతాకణావా.

తా. జీడిగింజలు, పిప్పళ్ళు, మోడి, వీనిని సమముగవైచి కషాయము బెట్టి అందు తేనెచేర్చి పుచ్చుకొనినను లేక పిప్పలిచూర్ణము గోమూత్రములోకలిపి పుచ్చుకొనినను అత్యుగ్రమగు ఊరుస్తంభము నివర్తించు.

## అన్యద్భల్లాతకాదికషాయము

భల్లాతకామృతా శుంఠీ దారుపథ్యా పునర్నవా,
పంచమూలీద్వయక్వాథఊరుస్తమ్భనిబర్హణః. 12

తా. జీడిగింజలు, తిప్పతీగ, శొంఠి, దేవదారు, కరక్కాయవోలుపు, తెల్లగలిజేరువేరు, దశమూలములు, వీనిని సమాంశములుగవైచి కషాయము బెట్టిపుచ్చుకొనిన ఊరుస్తంభము నివర్తించు.

## పునర్నవాదికషాయము

పునర్నవానాగరదారుపథ్యాభల్లాతకఛిన్నరుహాకషాయః,
దశాంఘ్రిమిశ్రః పరిపేయఊరుస్తంభేథవామూత్రపురప్రయోగః.

తా. తెల్లగలిజేరువేరు, శొంఠి, దేవదారు, కరకవోలుపు, జీడిగింజలు, తిప్పతీగె, దశమూలములు, వీనిని సమాంశములుగ కషాయము బెట్టి పుచ్చుకొనినను లేక గోమూత్రమున గుగ్గిలము కలిపిపుచ్చుకొనినను ఊరుస్తంభము నివర్తించు.

## శేఫాలికాదికషాయము

శేఫాలికాదళక్వాథం కణాయుక్తం పిబేన్నరః,
కఫఘ్నం యచ్చతత్సర్వమూరుస్తమ్భే ప్రయోజయేత్. 14

తా. వావిలిఆకు కషాయముబెట్టి అందు పిప్పలి చూర్ణమును గలిపి పుచ్చుకొని కఫనాశకోపచారములుజేసిన ఊరుస్తంభము నివర్తించు.

### వచాదికషాయము

వచా ప్రతివిషా కుష్ఠం చిత్రకం దేవదారు చ,
పాఠా తేజోవతీ ముస్తా స్వర్ణక్షీరీ నిదిగ్ధికా. 15
వత్సకోనక్తమాలశ్చ మూర్వాకటుకరోహిణీ,
తర్కారీప్రగ్రహాశ్చైవపీలునింబఫలానిచ. 16
ఆసనః సప్తపర్ణశ్చత్రిఫలామరిచేనచ,
ఏతానిసమభాగానికషాయముపసాధయేత్. 17
మధుయుక్తం కషాయం చప్రయోగేణపిబేన్నరః,
ఊరుస్తమ్భంజయేదేవవృక్షమింద్రాశనిర్యథా. 18
ఏతాన్యేవతుచూర్ణానిమాక్షికేణవిలేహయేత్,
అనేనచకషాయేణభోజయేత్సిద్ధమోదనమ్. 19

తా. వస, అతివస, కోష్ఠము, చిత్రమూలము. దేవదారు, విషబొద్దివేరు, మాల్కాంగణీవిత్తులు, తుంగముస్తలు, కంకుష్ఠము, వాకుడు, కొడిశపాలు, రేల, చాగ, కటుకరోహిణి, తక్కాలి, రొజ్జుఆముదపువేరు, వరగోగుపండ్లు, వేపపండ్లు, వేగిసపట్ట, ఏడాకులఅరటిగడ్డ, త్రిఫలములు, మిరియాలు, వీనినన్నియు సమభాగములుగ గ్రహించి కషాయముబెట్టి అందు తేనెచేర్చి పుచ్చుకొనినను, లేక వీనిని చూర్ణించి తేనెచేర్చి పుచ్చుకొని వీనికషాయముచే సిద్ధపరిచిన అన్నమును భుజించిన ఊరుస్తంభము నివర్తించు.

### త్రిఫలాదికషాయము

త్రిఫలాచవ్యకటుకాగ్రంథికం మధునా లిహేత్,
ఊరుస్తంభవినాశాయ పురం మూత్రేణవాపిబేత్. 20

తా. త్రిఫలములు, చవ్యము, కటుకరోహిణి, మోడి, వీనినిచూర్ణించి తేనెతో పుచ్చుకొనినను, లేక గుగ్గిలచూర్ణమును గోమూత్రములో కలిపి పుచ్చుకొనినను, ఊరుస్తంభము నివర్తించు.

అన్యచ్చ.—

త్రిఫలాగ్రంథికవ్యోషచూర్ణం లిహ్యాత్సమాక్షికమ్, 21
ఊరుస్తంభవినాశాయ పురం మూత్రేణ వా పిబేత్.

తా, కరక, తాడి, ఉశిరికెలు, పిప్పలిమూలము, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీనిని సమములుగ చూర్ణముజేసి తేనెపుచ్చుకొనినను లేక గుగ్గిలచూర్ణమును గోమూత్రములోజేర్చి పుచ్చుకొనినను ఊరుస్తంభము నివర్తించు.

ఊరుస్తంభమునకు గుంజాగర్భరసాయనము

నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశకం బలిమ్,
గుంజాబీజం విషం నిష్కం నింబబీజం జయా తథా. 22
ప్రత్యేకం నిష్కమాత్రం తు మాషం నేపాలబీజకమ్,
జాతీజంబీరధుత్తూరరకాకమాచీద్రవైర్దినమ్. 23
మర్ద్యం సర్వం వటీం కుర్యాద్ఘృతైర్గుంజాద్వయం పిబేత్,
గుంజాగర్భరసో నామ హింగుసైంధవసంయుతమ్. 24
సమండం దాపయేత్పథ్యమూరుస్తంభప్రశాన్తయే,

తా. శుద్ధిచేసినరసము 3 నిష్కములు, శుద్ధిజేసినగంధకము ౧౨ నిష్కములు, గురిగింజలు నాభి నింబబీజములు తక్కలివిత్తులు ఇవి ప్రత్యేకము ౧ నిష్కము, నేపాళవిత్తులు ౧ మాషము, వీనినన్నియు నేకముగ ఖల్వమునందునిచి జాజి, నిమ్మపండ్లు, ఉమ్మెత, కాచి, వీనిరసములచే ప్రత్యేక మొక్కొకదినమర్దించి మాత్రలు జేసి రెండుగురిగింజలెత్తు నెయ్యితో సేవించి ఇంగువ సైంధవలవణము వీనితో గంజి తేట అన్నము భుజించవలయు. ఇది గుంజాగర్భ రసమని చెప్పబడును. ఊరుస్తంభ మును బోగొట్టును.

కుష్ఠాదితైలము

కుష్ఠం శ్రీవేష్టకోదీచ్యసరళం దారుకేసరమ్. 25
అజగంధాశ్వగంధా చ తైలం తైస్సార్షపం పచేత్,
సక్షౌద్రం మాత్రయా తస్మాదూరుస్తంభార్దితః పిబేత్. 26

తా. చంగల్వకోష్ఠు, శ్రీవేష్టమను ధూపద్రవ్యము, కురువేరు, సరళదేవ దారు, నాగకేసరములు, వావింటవేరు, పెన్నేరుగడ్డ వీటికషాయమునందుగాని లేక కల్కమునందుగాని ఆవనూనెచేర్చి తైలపక్వముగ కాచి తేనెచేర్చి పుచ్చుకొనిన ఊరుస్తంభము నివర్తించు.

సైంధవాదితైలము

ద్వే పలే సైంధవాజ్యం చ శుంఠీ గ్రంథికచిత్రకాః,
ద్వే ద్వే భల్లాతకాస్థీని వింశతిర్ద్వే తథాఢకే. 27
ఆరనాళే పచేత్ప్రస్థం తైలస్యైతం పిబేత్పలం,
గృధ్రస్యూరుగ్రహంచాపిసర్వవాతాన్వినాశయేత్. 28

తా. సైంధవలవణము ౨ పలములు, శొంఠి, పిప్పలిమూలము చిత్రమూలము

ఇవి ప్రత్యేకము ౨ పలములు, జీడిగింజలు ౨౨ పలములు, కాంజికము ౧ ఆఢకము, తిలతైలము ౧ ప్రస్థము, వీనినన్నియు నేకముగఁజేర్చి తైలపక్వముగఁ కాచి వకపలము వంతున పుచ్చుకొనిన గృధ్రసి, ఊరుస్తంభము, సంపూర్ణవాత వికారములు ఇవి నివర్తించు.

## ౼ త్రిఫలాదిగుగ్గులు ౼

త్రిఫలాత్రివృతా దన్తీ నీలినీ చతురంగుళైః,
పంచవింశతిసంఖ్యాకపలమాత్రైః పృథక్పృథక్. 29
క్వథితం కుట్టితై రేభిః చతుర్ద్రోణే ప్రమాణతః,
పచేత్తత్సలిలేతావద్యావద్ద్రోణావశేషితమ్. 30
పంచాశత్తత్ర నిక్షిప్య గుగ్గులోస్తుపలాన్యపి,
క్వాథయేద్ఘనం యావత్తావత్తత్పూర్వవత్పచేత్. 31
తావతాస్మిన్ఘనీభూతే త్వగేలానాగకేసరమ్,
త్రికటుత్రిఫలాపత్రం యవానీజీరకాని చ. 32
పిప్పలీదహనం చైవ హపుషా కృష్ణజీరకమ్,
బాష్పికాసాజమోదాచ తింత్రిణీ సామ్లవేతసా. 33
సౌవర్చలపటుశ్చైషాంసూక్ష్మచూర్ణం వినిక్షిపేత్,
ప్రత్యేకమేకపలికై ర్భాగై సమ్యగ్విచక్షణః. 34
తతోక్షమాత్రాఘుటికాభక్షయేత్తు దినేదినే,
ఊరుస్తంభగ్రధిగండగండమాలోదరార్దితః. 35
అనేన చైవ విధినా గిరిజం వా ప్రయోజయేత్,

తా. త్రిఫలములు, తెగడ, నేపాళపువిత్తులు, చిన్ననీలి, కేలగిజరు. వీనిని ప్రత్యేకము ౨౫ పలములు వలియఁగొట్టి నాలుగుద్రోణములనీళ్లయందువైచి ద్రోణము మిగులునటులకాచి వడియఁగట్టి అందు ౫౦ పలములు గుగ్గిలమును జేర్చి మరల గట్టి పడువరకుకాచి పిదప లవంగపట్ట, ఏలకులు, నాగకేసరములు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, కరక, తాడి, ఉశిరికెలు, ఆకుపత్రి, ఓమము, జీలకఱ్ఱ, గజపిప్పలి, చిత్రమూలము, సోపు, నల్లజీలకఱ్ఱ, అజామోదము, చింతబెరడు, పుల్లప్రబ్బలి, సౌవర్చలవణము వీటిని ప్రత్యేకము ౧ పలమువంతున చూర్ణించి వైచి కలిపి అక్షప్రమాణము వంతున సేవించిన ఊరుస్తంభము, గ్రంధి, గలగండము, గండమాల, ఉదరరోగములు ఇవియన్నియు నివర్తించు. మఱియు నీయోగమువలెనే శిలాజితును సగా జేసి సేవించిన పైజెప్పినరోగములన్నియు తొలగు.

లశునయోగము

పలమర్ధపలం వాపి సోనస్య సుకుట్టితమ్. 36
హింగుజీరకసింధూత్థసౌవర్చలకటుత్రికైః,
ఏతైస్సంచూర్ణితైస్సర్వైరుబుతైలేన సయుతమ్. 37
యథాగ్నిభక్షయేత్పార్జ్ఞో రుబుక్వాథానుపానతః,
ఏకమాసప్రయోగేణ సర్వాన్వాతాన్వియోజయేత్. 38
ఏకాంగసర్వాంగగతమూరుస్తంభం చ గృధ్రసీమ్,
కటిపృష్ఠాస్థిసంధిస్థమర్దితం చాపతంత్రకమ్. 39
జ్వరం ధాతుగతం జీర్ణం నిత్యశైత్యం కరాంఘ్రిజమ్,

తా. తెల్లఉల్లిపాయలు, ఇంగువ, జీలకఱ్ఱ, సైంధవలవణము, సౌవర్చలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు వీనిని ప్రత్యేకము ౧ పలముచొప్పున చూర్ణించి ఆముదముచేర్చి అగ్నిబలమును దెలిసి భక్షించి పిదప ఆముదపువేళ్లకషాయము త్రావుచు నిట్లొకమాసమువరకు పుచ్చుకొనిన సర్వవాతరోగములు, ఏకాంగవాతము, సర్వాంగవాతము, ఊరుస్తంభము, గృధ్రసి, కటి, పృష్ఠము, అస్థిసంధి వీనియందలి వాతము, అర్దితవాతము, అపతంత్రకవాతము, ధాతుగతజ్వరము, జీర్ణజ్వరము, యెల్లపుడుండు కరపాదశీతలము ఇవి నివర్తించు.

ఊరుస్తంభమునకులేపము

క్షౌద్రం సర్షపవల్మీకమృత్తికాసంయుతం భిషక్. 40
గాఢముత్సాదనం కుర్యాదూరుస్తంభే ప్రలేపనమ్,

తా. తేనె, ఆవాలు, పుట్టమన్ను వీనిని నూరి నలిచినను దట్టముగ లేపనము జేసినను ఊరుస్తంభము నివర్తించు.

అన్యచ్చ.—

మూలైర్వా హ్యశ్వగంధాయా మూలైరర్కస్య వా భిషక్. 41
పిచుమందస్య వా మూలై రథవా దేవదారుణా,
క్షౌద్రసర్షపవల్మీకమృత్తికాసంయుతైర్భిషక్. 42
గాఢముద్వంధనం కుర్యా దూరుస్తమ్భప్రశాన్తయే,

తా. పెన్నేరుగడ్డ లేక జిల్లేడువేళ్ళు లేక వేపవేళ్ళు లేక దేవదారు, తేనె, ఆవాలు, పుట్టమృత్తిక వీటిని బాగుగనూరి యుడికించి సుఖోష్ణముగ నుండునపుడు లేపనముజేసిన ఊరుస్తంభము తొలుగు.

శిలాజితుయోగము

శిలాజతుం గుగ్గులుం వా పిప్పలీమథ నాగరమ్. 43
ఊరుస్తమ్భే పిబేన్మూత్రై ర్దశమూలీజలేన వా,

తా. శిలాజతు, గుగ్గిలము, పిప్పళ్ళు, శొంఠి వీనిలో దేనినైన చూర్ణించి గోమూత్రముతో గలిపిగాని లేక దశమూల కషాయమునందుగాని పుచ్చుకొనిన ఊరుస్తంభము నివర్తించు.

ఊరుస్తంభమునకు పథ్యములు

రూక్షస్సర్వో విధిస్స్వేదః కోద్రవా రక్తశాలయః. 44
యవాః కులుత్థాశ్శ్యామాకా ఉద్దాలాశ్చ పురాతనాః,
సౌభాంజనం కారవేల్లం పటోలం వాస్తుకం తథా. 45
సునిషణ్ణం కాకమాచీం వేత్రాగ్రం తప్తవారి చ,
జాంగలై రఘృతై ర్మాంసై శ్శాకై శ్చాలవణైర్హితైః. 46
ఏతత్పథ్యం సముద్దిష్టమూరుస్తమ్భవికారిణామ్,

తా. ఊరుస్తంభరోగికి సర్వరూక్షోపచారములు, చమటదీయుట, మరియు కొఱ్ఱలు, ఎఱ్ఱవడ్లు, యవలు, ఉలవలు, చామలు, పాతపెద్దజొన్నలు, మునగకాయ, కాకరకాయ, పొట్లకాయ, చక్రోతపుకూర, చంచలికూర, కొంచి, వెదురుమొలకలు, వేడినీళ్ళు, నెయ్యి లేక పచనముజేసిన అడవిమృగ పక్షులమాంసము, ఉప్పు లేక వండినకూరలు ఇవి పథ్యములని తెలియవలయు.

అపథ్యములు

గురుశీతద్రవస్నిగ్ధ విరుద్ధాసాత్మ్యభోజనమ్. 47
విరేచనం స్నేహపానం చ వమనం రక్తమోక్షణమ్,
వస్తిశ్చ న హితం ప్రాహు రూరుస్తమ్భ వికారిణామ్. 48

తా. గురువు, శీతము, ద్రవము, స్నిగ్ధము, విరుద్ధము ఇవిగలపదార్థములు, తనకు పడని భోజనపదార్థములు, విరేచనము, స్నేహపానము, వాంతి, రక్తమును దీయుట, వస్తికర్మ ఇవి ఊరుస్తంభరోగికి అపథ్యములని తెలియవలయు.

# ఆమవాత ప్రకరణమ్.

## ఆమవాత కర్మవిపాకము

హుతాగ్నినిర్వాపకోహ్యామ వాతవానితి వచనాత్,
తదుక్తదోషశాంతయే అయుత సంఖ్యాకో గాయత్రీజపః. 1

తా. హోమాగ్నిని చల్లార్చినవానికి ఆమవాతము జనించు. తన్నివృత్తికై పదివేలు గాయత్రీమంత్రమును జపించవలయును.

## జ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

అష్టమో గురురామస్య కర్తాచేతి వచనాత్
అష్టమస్థానస్థితగురుజనితామవాతరోగోపశాంతయే,
తత్ప్రీతయే పూర్వోక్తమేవ జప హోమపూజాదానాదికం కుర్యా
త్తేన శామ్యతి. 2

తా. ఎవని జననకాలమునందు జన్మలగ్నమున కెనిమిదవయింట బృహస్పతి యుండునో, అట్టివానికి ఆమవాతము జనించు; తద్దోష నివారణమునకై పూర్వోక్త జప హోమ పూజాదానాదులంజేసిన నది శమించు.

## ఆమవాతనిదానము తత్సంప్రాప్తి

విరుద్ధాహారచేష్టస్య మందాగ్నేర్నిశ్చలస్య చ,
స్నిగ్ధం భుక్తవతోహ్యాన్నం వ్యాయామం కుర్వతస్తథా. 3
వాయునా ప్రేరితోహ్యామః శ్లేష్మస్థానం ప్రధావతి,
తేనాత్యర్థం విదగ్ధోసౌ ధమనీః ప్రతిపద్యతే. 4
వాతపిత్తకఫైర్భూయో దూషితస్సోన్నజో రసః,
స్రోతాంస్యభిస్పందయతి నానావర్ణోతిపిచ్ఛిలః. 5
యుగపత్కుపితావేతౌ త్రికసంధిప్రవేశకౌ,
స్తబ్ధం చ కురుతే గాత్రమామవాతస్స ఉచ్యతే. 6

తా. విరుద్ధాహారము, విరుద్ధచేష్టలు ఇవిజేయువాడు, మందాగ్నిగలవాడు, పనులంజేసి శ్రమించువాడును, స్నిగ్ధాన్నమును భుజించువాడును, మిగుల వ్యాయామముగల మనుజుడు, వీరలయొక్క ఆమరసము వాయువుచే కదిలింపబడి, శ్లేష్మస్థానమునుంజేరి, అచ్చట శ్లేష్మముచే దూషితమై ధమనీనాడులంజేరి, అచ్చోట వాతపిత్త

కఫములచే మరల దూషితమై. నానావర్ణములుగను జిగటగనుండి స్రోతస్సును కంపింప జేయుచు వాతకఫముల నేకకాలమునందే కుపితములుగజేసి. త్రికసంధియందు జేర్చి శరీరమును స్తబ్ధపరచునది ఆమవాతమని తెలియవలయు.

ఆమవాతసామాన్యలక్షణము

అంగమర్దో౽రుచి స్తృష్ణా హ్యాలస్యం గౌరవం జ్వరః,
ఆపాకశ్శూనతాంగానా మామవాతస్య ఉచ్యతే. 7

తా. ఒడలునులుపు, అరుచి, దప్పి, అలసట. శరీరముబరువు. జ్వరము, అన్నము పచనము కాకపోవుట, శరీరమువాచుట, యీలక్షణములుగలది ఆమవాతమని తెలియవలయు.

ఆమవాతోపద్రవములు

సకష్టస్సర్వరోగాణాం యదా ప్రకుపితో భవేత్,
హస్తపాదశిరోగుల్ఫ త్రికజానూరుసంధిషు. 8
కరోతి సరుజం శోథం యత్ర దోషైః ప్రపద్యతే,
సదేశో రుజ్యతేత్యర్థం వ్యావిద్ధఇవ వృశ్చికైః. 9
జనయేత్సోగ్నిదౌర్బల్యం ప్రసేకారుచిగౌరవమ్,
ఉత్సాహహానింవైరస్యం దాహం చ బహుమూత్రతామ్. 10
కుక్షౌ కఠినతాం శూలం తథా నిద్రావిపర్యయమ్,
తృట్ ఛర్ది భ్రమమూర్ఛాశ్చహృద్గ్రహం విడ్విబంధతామ్. 11
జాడ్యాంత్రకూజమానాహం కష్టాంశ్చాన్యానుపద్రవాన్,

తా. ఆమవాతమెపుడు ప్రకోపించుచున్నదో అపుడది సర్వరోగములకన్నను మిగుల కష్టసాధ్యము. మరియు చేతులు, కాళ్ళు, శిరస్సు, చీలమండలు, పృష్ఠప్రదేశము, మోకాళ్ళు, తొడలు, సంధులు వీనియందు పోట్లతోగూడినవాపు, వాతరోగమువలన ఆమమెక్కడెక్కడకు పోవుచున్నదో అక్కడక్కడ తేళ్ళుకుట్టినటుల వేదన, అగ్నిమాంద్యము, నోటనీరూరుట, అరుచి, శరీరముబరువు, ఖేదము, ముఖము విరసముగనుండుట, తాపము, బహుమూత్రము, కడుపు గట్టిగనుండుట, శూల, నిద్రపట్టకయుండుట, దప్పి, వాంతి, భ్రమ, మూర్ఛ, హృదయశూల, మలస్తంభము, జడత్వము, పేగులరచుట, కడుపుబ్బుట, ఖిలాయఖంజాది ఉపద్రవములు ఇవి గలిగియుండు.

ఆమవాతవిశేషలక్షణము

పిత్తాత్సదాహరాగం చ సశూలం పవనానుగమ్. 12

స్తైమిత్యం గురుకండూలం కఫజుష్టం తమాదిశేత్,

తా. ఆమవాతము, పిత్తాశ్రితమైయుండిన, తాపము, శరీరమంతట యెఱ్ఱగ నుండుట, మరియు వాతాశ్రితమైయుండినపోట్లు, మరియు కఫాశ్రితమైయుండిన, చల్లగను, బరువుగను, దురద గలదిగనునుండు.

రాస్నాదికషాయము

రసనామర్దదారురాజవృక్షత్రికటువ్యాఘ్రిపునర్నవామృతానామ్.
క్వథితం జలమామవాతమేషాం శమయేన్నాగరకల్కమిశ్రమాశు,

తా. రాస్న, దేవదారు, రేలగిజరు, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఎఱ్ఱఆముదపువేళ్ళు, తెల్లగలిజేరు, తిప్పతీగె, వీటిని సమాంశములుగ కషాయముబెట్టి, అందు శొంఠికల్కముగలిపి పుచ్చుకొనిన ఆమవాతము నివర్తించు.

రెండవప్రకారము

రాస్నామృతానాగరవాతశత్రుకటంకటేరీజనితః కషాయః. 14
ఏరండతైలేన సమన్వితోఽయం భేత్తా భవేదామసమీరణస్య,

తా. రాస్న, తిప్పతీగ, శొంఠి, ఆముదపువేరు, మానిపసపు వీనిని సమములుగ కషాయము బెట్టి అందు ఆముదమునుకలిపి పుచ్చుకొనిన ఆమవాతము నివర్తించు.

మహౌషధాదికషాయము

మహౌషధామృతాభవః కషాయకశ్చ సేవితః. 15
హినస్తి చామమారుతం చిరాయ సంధిసంశ్రితమ్,

తా. శొంఠి, తిప్పతీగె వీనిని సమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన చిరకాలమునుండియుండు ఆమవాతము తొలగు.

మహారాస్నాదికషాయము

రాస్నావాతారిమూలం చ వాసకస్సదురాలభః. 16
శఠీదారుబలాముస్తం నాగరాతివిషాభయాః,
శ్వదంష్ట్రావ్యాధిఘాతశ్చ మిశీధాన్యం పునర్నవా. 17
అశ్వగంధాఽమృతాకృష్ణా వృద్ధదారుశ్శతావరీ,
వచాసహాచరశ్చైవ చవికా బృహతీద్వయమ్. 18
సమభాగాని సర్వాణి రాస్నా తు ద్విగుణా మతా,
పిబేత్కషాయమేతేషామష్టభాగావశేషితమ్. 19
క్షిప్త్వా నాగరచూర్ణం చ ప్రక్షేపోఽత్ర యథాబలమ్,
సర్వేషు వాతరోగేషు సామేషు తు విశేషతః. 20

పక్షాఘాతేఽర్దితే కంపే కుబ్జే సంధిగతేనిలే,
జానుజంఘాస్థిపీడాసు గృధ్రస్యాం చ హనుగ్రహే. 21
ఊరుస్తంభే వాతరక్తే విశ్వాచ్యాం క్రోష్టుశీర్షకే,
హృదామయే చ దుర్నామ్ని యోనిశుక్రామయేషు చ. 22
పుంసాం మేఢ్రగతే వాతే స్త్రీషు వంధ్యాసు శస్యతే,
యోషితాం గర్భదం ముఖ్యం నాస్త్యస్మాదౌషధం పరమ్. 23
మహారాస్నాదికః క్వాథో వేధసాయం వినిర్మితః,

తా॥ సన్నరాస్న 3 భాగములు, ఆముదపువేరు, అడ్డసరయాకులు, దూలగొండివేరు, కచ్చూరములు, మానిపసపు, చిట్టాముట్టివేరు, తుంగముస్తలు, శొంఠి, అతివస, కరకవొలుపు, పల్లేరు, రేలవేరు, పెద్దసోపు, ధనియాలు, తెల్లగలిజేరు, పెన్నేరుగడ్డ, తిప్పతీగె, పిప్పలి, వృద్ధదారు, చల్లపిల్లిగడ్డలు, వస, గోరింట, చవ్యము, వాకుడు, ములక, వీనిని ప్రత్యేకము 1 భాగముచేర్చి యెనిమిదిరెట్లు నీరుపోసి యెనిమిదవభాగము మిగులునటుల కషాయముకాచి వడియగట్టి అందు శొంఠిచూర్ణమునుగలిపి దోషబలానుసారముగ పుచ్చుకొనిన, సర్వవాతరోగములు, ఆమవాతము, పక్షాఘాతము, అర్దితము, కంపవాతము, కుబ్జవాతము, సంధిగతవాతము, జానువాతము, జంఘావాతము, అస్థివాతము, గృధ్రసీవాతము, హనుస్తంభవాతము, ఊరుస్తంభవాతము, వాతరక్తము, విశ్వాచీవాతము, క్రోష్టుశీర్షకవాతము, హృద్రోగము, మూలవ్యాధి, యోనిరోగము, శుక్రరోగము, మేఢ్రగతవాతము, వంధ్యారోగము ఇవియన్నియు నివర్తించుటయేగాక, స్త్రీలకు గర్భమును గలుగంజేయు. ఇది బ్రహ్మచే నిర్మింపబడిన మహారాస్నాది కషాయము. దీనికన్న శ్రేష్ఠమగు ఔషధము వేరే మరియొండులేదని తెలియవలయు.

### లఘురాస్నాదికషాయము

రాస్నారగ్వధదేవదారుబుతుభూచ్ఛిన్నోద్భవాగోక్షురై. 24
రేరండేన యుతైః కషాయకవరోవిశ్వారజోమిశ్రితః,
నానాసంధిరుజాన్వితం విజయతే ఘోరామవాతామయం. 25
స్వర్భాంగికుచపద్మకుట్మలరుచిర్దీపోంధకారం యథా,

తా॥ రాస్న, రేల, దేవదారు, తెల్లగలిజేరు, తిప్పతీగె, పల్లేరు, ఆముదపువేరు, వీనిని సమములుగ కషాయముసు బెట్టి అందు శొంఠిచూర్ణముచేర్చి సేవించిన నానాసంధులయందు బాధనుజేయుచుండు ఘోరమగు ఆమవాతము నివర్తించు.

రాస్నాద్వాదశక షాయము

రాస్నాశతావరీవాసాగుడూచ్యతివిషాభయా. 26
శుంఠీదురాలభై రండ దేవదారువచాఘనైః,
క్వాథః పీతో జయత్యాశు చామవాతం సుదారుణమ్. 27
కట్యూరుత్రికజంఘాంఘ్రిగుల్ఫజానుసమాశ్రితమ్,

తా. రాస్న, చల్లపిల్లిగడ్డలు, అడ్డసరపుయీనెలు, తిప్పతీగె, అతివస, కరక్కాయవోలుపు, శొంఠి, దూలగొండివేరు, ఆముదపువేరు, దేవదారు, వస, తుంగముస్తలు వీనిని సమాంశములుగ కషాయము బెట్టి పుచ్చుకొనిన కటిప్రదేశము, తొడలు, పుడ్డిపూస, పిక్క, పాదములు, చీలమండలు, మోకాళ్లు వీనిని ఆశ్ర యించియుండు దారుణమగు ఆమవాతము నివర్తించు.

శుంఠ్యాదికషాయము

శుంఠీగోక్షురకక్వాథః ప్రాతః ప్రాతర్నిషేవితః. 28
ఆమవాతం కటీశూలం హన్తి పాచనదీపనః,

తా. శొంఠి, చిరుపల్లేరు వీనిని కషాయము బెట్టి ప్రాతఃకాలములయందే నిత్యము పుచ్చుకొనిన ఆమవాతము, కటిశూల ఇవినివర్తించుటయేగాక, జీర్ణమును గలుగం జేయు.

శఠ్యాదికషాయము

శఠీశుంఠ్యభయాచోగ్రాదేవాహ్వాతివిషామృతా. 29
కషాయమామవాతఘ్నం పాచనం రూక్షభోజనాత్,

తా. కచ్చూరములు, శొంఠి, కరకవోలుపు, వస, దేవదారు, అతివస, తిప్పతీగె వీనినికషాయముబెట్టి సేవించి, రూక్షపదార్థము భుజించిన, ఆమవాతము నివర్తించి పాచనమునుసగా గలుగంజేయు.

దశమూలాదికషాయము

దశమూలకషాయమిశ్రితం వాలలసేవిశ్వకషాయమిశ్రితం వా. 30
ప్రబిభేత్కటికుక్షివస్తిశూలేధృవమేరండజమేకమేవ తైలమ్,

తా. దశమూలకషాయమునందుగాని, శొంఠికషాయమునందుగాని, ఆముదము చేర్చి పుచ్చుకొనిన కటిశూల, పొత్తికడుపునందలి శూల ఇవి నివర్తించు.

అజామోదాదిచూర్ణము

అజామోదావిడంగాని సైంధవం దేవదారు చ. 31
చిత్రకః పిప్పలీమూలం శతపుష్పా చ పిప్పలీ,

మరిచం చేతి కర్షాంశం ప్రత్యేకం కారయేద్బుధః. 32
కర్షాస్తు పంచపథ్యాయా దశస్యుర్వృద్ధదారుకాత్,
నాగరాచ్చ దశైవ స్యుస్సర్వాణ్యేకత్ర కారయేత్. 33
పిబేత్కోష్ణజలేనైవ చూర్ణం శ్వయథునాశనమ్,
ఆమవాతరుజం హన్తి సంధిపీడాం చ గృధ్రసీమ్. 34
కటీపృష్ఠగుదస్థాం చ జంఘయోశ్చ రుజం జయేత్,
తూనీం ప్రతూనీం విశ్వాచీం కఫవాతామయాన్జయేత్. 35
సమేన వా గుడేనాస్య వటకాన్ కారయేత్సుధీః,

తా. అజామోదము, వాయువిడంగములు, సైంధవలవణము, దేవదారు, చిత్రమూలము, మోడి, పెద్దసోపు, పిప్పళ్ళు, మిరియాలు ఇవి ప్రత్యేకము ౧ కర్షము, కరకపిందెలు ౫ కర్షములు, * పెద్దమానిచెక్క ౧౦ కర్షములు, శొంఠి ౧౦ కర్షములు వీనినన్నియు చూర్ణించి, సుఖోష్ణముగనుండు ఉదకముతో పుచ్చుకొనిన వాపు, ఆమవాతము, సంధిశూల, గృధ్రసీవాతము, కటివాతము, పృష్ఠవాతము, గుదవాతము, పిక్కలయందుండుపోట్లు, తూని, ప్రతూని, విశ్వాచీవాతములు, కఫవాతము ఇవియన్నియు నివర్తించు. మరియు నీచూర్ణమునకు సమముగ బెల్లముచేర్చి, వటుకములుజేసి సేవించినను పైజెప్పంబడిన రోగములన్నియు తొలగు.

## పంచసమచూర్ణము

శుంఠీ హరీతకీ కృష్ణా త్రివృత్సౌవర్చలం తథా. 36
సమభాగాని సర్వాణి సూక్ష్మచూర్ణాని కారయేత్,
జ్ఞేయం పంచసమం చూర్ణమేతచ్ఛూలహరం పరమ్. 37
ఆధ్మానజఠరార్శోఘ్న మామవాతహరం స్మృతమ్,

తా. శొంఠి, కరకపిందెలు, పిప్పళ్లు, తెగడ, సౌవర్చలవణము వీనిని సమముగ చూర్ణించి సేవించిన శూల, కడుపుబ్బరము, ఉదరరోగము, మూలవ్యాధి, ఆమవాతము ఇవి నివర్తించు.

## త్రిఫలాదిచూర్ణము

త్రిఫలా నాగరం చైవ సూక్ష్మచూర్ణాని కారయేత్. 38
మస్త్వారనాళతక్రేణ పేయామాంసరసేన వా,
ఆమవాతం నిహంత్యాశు శ్వయథుం సంధిసంస్థితమ్. 39

* వృద్ధదారువనగా పెద్దమానుకాక నింకొకటిగా జెప్పెదరు.

తా. కరక, తాడి, ఉశిరికలు, శొంఠి వీనిని సమములుగ చూర్ణించి, పెరుగు మీదితేట, కాంజికము, మజ్జిగ, పేయము, మాంసరసము వీనిలో దేనితోనైనను సేవించిన ఆమవాతము, సంధులయందుండు వాపు ఇవి నివర్తించు.

### పునర్నవాదిచూర్ణము

పునర్నవాచ్ఛిన్నరుహాశతాహ్వా ముండీశఠీదారుకనాగరాణామ్,
చూర్ణం హి హన్యాత్కిలకాంజికేన దుష్టామవాతం చిరగృధ్రసీంచ.

తా. తెల్లగలిజేరు, తిప్పతీగ, చల్లపిల్లిగడ్డలు, బోడతరపువేళ్ళు, కచ్చూరములు, దేవదారు, శొంఠి వీనిని చూర్ణించి, కాంజికముతో పుచ్చుకొనిన దుష్టమగు ఆమవాతము, చిరకాలమునుండియుండు గృధ్రసీవాతము ఇవి నివర్తించు.

### వైశ్వానరచూర్ణము

మాణిమందస్యభాగాద్వౌ యవక్షారశ్చ తత్సమః,
తథాజమోదభాగశ్చ నాగరాద్భాగపంచకమ్. 41
దశ చైవ హారీతక్యాస్సూక్ష్మం చూర్ణం కృతం శుభమ్,
మస్త్వారనాళమూత్రైశ్చ సురయోష్ణోదకేన వా. 42
పీతం జయేదామవాతం గుల్మహృద్వస్తిజాన్గదాన్,
ప్లీహానమథశూలాదీనానాహం చార్శసాం హితమ్. 43
వాతానులోమనమిదం చూర్ణం వైశ్వానరం స్మృతమ్,

తా. సైంధవలవణము ౨ భాగములు, యవక్షారము ౨ భాగములు, శొంఠి ౫ భాగములు, అజామోదము ౨ భాగములు, కరక్కాయలు ౧౦ భాగములు, వీనిని మెత్తగచూర్ణించి, పెరుగుమీదితేట, కాంజికము, గోమూత్రము, మద్యము, ఉష్ణోదకము వీనిలో దేనిచేనైనను సేవించిన, ఆమవాతము, గుల్మము, హృద్రోగము, పొత్తికడుపునందలిరోగము, ప్లీహ, శూల, కడుపుబ్బరము, మూలవ్యాధి వీనిని నశింపజేయుటయేగాక, వాతానులోమనమును జేయు.

### చిత్రకాదిచూర్ణము

చిత్రకం కటుకాపాఠాకలింగాతివిషామృతాః. 44
దేవదారువచాముస్తానాగరాతివిషాభయాః,
పిబేదుష్ణాంబునా కృత్వా చూర్ణమామమరుత్ప్రణుత్. 45

తా. చిత్రమూలము, కటుకరోహిణి, విషబొద్ది, కొడిశపాల, అతివస, తిప్పతీగ, దేవదారు, వస, తుంగముస్తెలు, శొంఠి, అతివస, కరక్కాయవొలుపు వీనిని సమభాగములుగ చూర్ణించి, ఉష్ణోదకముతో పుచ్చుకొనిన ఆమవాతము నివర్తించు.

## అమవాతారిరసః

ప్రక్షిప్య గంధం రసపాదభాగం కలాప్రమాణం చ విషంసమస్తాత్,
కృశానుతోయేనచభావయిత్వావల్లందదీతాస్య మహత్పశాంత్యై.
అపస్మారే తథోన్మాదే సర్వాంగవ్యథనేపి చ,
ఏకాంగవాతే సామేవాదంష్ట్రాబంధే హిమే తథా. 47
దేయో రసో వల్లమాత్ర ఆమవాతారిసంజ్ఞకః,

తా. శుద్ధిజేసినరసము ౪ భాగములు, శుద్ధగంధకము ౧ భాగము వీటి రెంటిలో ౧౬వ భాగము శుద్ధిజేసిన నాభి వీనిని ఖల్వమునందునిచి, చిత్రమూల కషాయముతో భావనజేసి వల్లమాత్రముసేవించిన, వాతము, అపస్మారము, ఉన్మాదము, సర్వాంగబాధ, ఏకాంగవాతము, ఆమవాతము, హనుస్తంభము, శీతలము ఇవి యన్నియు నివర్తించు.

## మఱియొకవాతారిరసము

రసో గంధో వరావహ్నిర్గుగ్గులుః క్రమవర్ధితః. 48
ఏరండపత్రతోయేనశ్లక్ష్ణచూర్ణం విమర్దయేత్,
కర్షాంశైరండతైలేన హంత్యుష్ణజలపాయినః. 49
ఆమవాతవతే దేయం దుగ్ధముద్గాదివర్జయేత్,

తా. శుద్ధరసము, శుద్ధగంధకము, త్రిఫలములు, చిత్రమూలము, గుగ్గిలము వీనినన్నియు క్రమవృద్ధిగ గ్రహించి, ఖల్వమునందునిచి, మెత్తగచూర్ణించి, ఆముదపాకులరసముతో మర్దించి, ఒకకర్షము ఆముదముతోగాని లేక ఉష్ణోదకముతోగాని పుచ్చుకొనిన ఆమవాతము నివర్తించు. దీనికి పథ్యము పాలు, పెసలపప్పు మొదలగు వానిని విసర్జించవలయు.

## ఉదయభాస్కరరసము

పారదం గంధకం వ్యోషం ద్వౌ క్షారౌ లవణాని చ. 50
టంకణం చేతి తుల్యాని జేపాలం సకలైస్సమమ్,
భావనాబీజపూరస్య శుష్కం సూక్ష్మం విచూర్ణయేత్. 51
సంగ్రాహ్యాం రక్తికాయుగ్మమామవాతవినాశనమ్,
గోదుగ్ధం కేవలం పథ్యం దేయం ముద్గపయోథవా. 52
అన్నం చ వర్జయేత్తావదామశోఫం నివారయేత్,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, శొంఠి, పిప్పలి, మిరియాలు,

యవక్షారము, సర్జక్షారము, పంచలవణములు, పేల్చినవెలిగారము ఇవియన్నియు సమభాగములు, వీనికన్నిటికిసమము నేపాళపువిత్తులుచేర్చి, ఖల్వమునందునిచి, మాదీఫలపురసముచే (మర్దించి) భావనజేసి, పిదప రొండించి, చూర్ణముచేసి, అందు రెండుగురిగింజలంత సేవించిన ఆమవాతము నివర్తించు. ఆమవాతము నివర్తించువఱకు ముఖ్యముగ అవుపాలు మాత్రము పథ్యంబిడవలయు. పెసరకట్టుతో నన్నము నైన నిడవలెను.

## అభయాదిఘుటికలు

అభయాసైంధవం శింబీ విశాలా విశ్వభేషజమ్ 53
ఇంద్రవారుణికా మజ్జా తథా సర్వం విమర్దయేత్,
లోహభాండే వినిక్షిప్య దద్యాదగ్నిం శనైశ్శనైః. 54
బదరాభా ప్రమాణేన. వటీ కార్యా భిషగ్వరైః,
ఉష్ణోదకానుపానేన భుక్త్వా దోషాద్యపేక్షయా. 55
పథ్యం దధ్యోదనం దేయమామవాతం వినాశయేత్,

తా. కరకవోలుపు, సైంధవలవణము, శెలగిజరు, పాపరవేరు, శొంఠి, చేదు సొరగిజరు వీనినన్నియు సమభాగములుగ చేర్చి మర్దించి లోహభాండమునందునిచి పొయిమీద బెట్టి మందాగ్నిచే పచనజేసి రేగుగింజలంత మాత్రలుచేసి దోషబలాను సారముగ ఉష్ణోదకముతో సేవించి పథ్యము పెరుగన్నము భుజించిన ఆమవాతరోగము నివర్తించు.

## ఏరండాదిగుటికలు

ఏరండబీజమజ్జాసమవిశ్వాయుతాచ శర్కరాసహితా. 56
గుటీకృతా ప్రభాతే భుక్తాసామానిలం జయతి,

తా. ఆముదపుపప్పు, శొంఠిచూర్ణము, చక్కెర వీనిని సమభాగములుగ జేర్చి మర్దించి మాత్రలుజేసి ప్రాతఃకాలమున భుజించిన ఆమవాతము తొలగు.

## హారిగుటికలు

రస గంధకలోహార్క తుత్థటంకణసైంధవాః. 57
సమభాగాన్విచూర్ణ్యాథ చూర్ణాద్ద్విగుణగుగ్గులుమ్,
గుగ్గులోః పాదికం దేయం త్రిఫలాచూర్ణముత్తమమ్. 58
తత్సమం చిత్రకస్యాథ ఘృతేన వటికాం కృతామ్,
ఖాదేన్మాషద్వయం చేదం త్రిఫలాజలయోగతః. 59
ఆమవాతారిఘుటికా పాచికా భేదకా తథా,

ఆమవాతం నిహంత్యాశు గుల్మశూలోదరాణి చ. 60
యకృత్ప్లీహోదమష్ఠీలాం కామలాం పాండుతాం తథా,
హలీమకామ్లపిత్తే చ శ్వయథుం శ్లీపదార్బుదా. 61
గ్రంథిం శూలం శిరశ్శూలం గృధ్రసీవాతరోగకమ్,
గలగండం గండమాలాం కృమీన్కుష్ఠం వినాశయేత్. 62

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము, లోహభస్మము, తామ్రభస్మము, మైలతుత్థము, వెలిగారము, సైంధవలవణము వీనిని సమాంశములుగ చూర్ణించి, యీ చూర్ణమునకు రెండింతలు గుగ్గిలము, గుగ్గిలములో నాలవపాలు త్రిఫలాచూర్ణము, త్రిఫలాచూర్ణమునకు సమము చిత్రమూలచూర్ణము వీనినన్నియు నేకముగ చేర్చి నేతితో మర్దించి మాత్రలుచేసి రెండుమాషములయెత్తు త్రిఫలాకషాయముతో పుచ్చుకొనిన, పాచనము, భేది వీనిని గలుగజేయుటయేగాక, ఆమవాతము, గుల్మశూల, ఉదరరోగము, యకృత్ప్లీహ దోషములు, అష్ఠీల, కామిల, పాండురోగము, హలీమకము, ఆమ్లపిత్తము, వాపు, శ్లీపదము, అర్బుదము, గ్రంథి, శూల, శిరశ్శూల, గృధ్రసీవాతరోగము, గలగండము, గండమాల, కృమి, కుష్ఠము వీనినన్నిటిని నివర్తింపజేయు.

## సింహనాదగుగ్గులు

పలత్రయం వాతాప్యస్య త్రిఫలాయాస్సుచూర్ణితమ్,
సౌగంధికం పలం చైవ కౌశికస్య పలం తథా. 63
కుడవంచోరుబూకస్య తైలమాదాయ యత్నతః,
పాచయేత్పాకవిద్వైద్యః పాత్రే లోహమయే దృఢే. 64
హంతి వాతం తథా పిత్తం శ్లేష్మాణం ఖంజపంగుతే,
శ్వాసం సుదుర్జయం హంతి కాసం పంచవిధం తథా. 65
కుష్ఠాని వాతరక్తం చ గుల్మశూలోదరాణి చ,
ఆమవాతం జయేదేతదపి వైద్యైర్వివర్జితమ్. 66
ఏతదభ్యాసయోగేన జరాపలితనాశనమ్,
సర్పిస్తైలరసోపేతమశ్నీయాచ్ఛాలిషష్టికమ్. 67
సింహనాదఇతి ఖ్యాతో రోగవారణదర్పహా,
వహ్నేర్వృద్ధికరః పుంసాం భాషితో దండపాణినా. 68

తా. సువర్ణమాక్షికము 3 పలములు, త్రిఫలచూర్ణము ౧ పలము, శుద్ధగంధకము ౧ పలము, గుగ్గిలము ౧ పలము, ఆముదము ౪ పలములు వీనినన్నియు లోహ

పాత్రయందునించి పక్వముగవండి శక్త్యనుసారముగ సేవించిన పిత్తము శ్లేష్మము, ఖంజవాతము, పంగువాతము, దుర్జయమగుశ్వాస, పంచవిధకాసలు, కుష్ఠువు, వాతరక్తము, గుల్మము, శూల, అష్టోదరములు, ఆమవాతము ఇవియన్నియు నివర్తించు. దీనిని యెల్లపుడు అభ్యాసముజేయుచుండిన జరాపలితము నివర్తించు. మరియు శాలిపిష్టకమును, నెయ్యి తైలము, మాంసరసము వీనితో భక్షించవలయు. ఇది పురుషులకు అగ్నిదీప్తిని గలుగంజేయు. ఇది దండపాణిచే నిర్మింపబడిన సింహనాదగుగ్గులు గాన మిక్కిలి శ్రేష్ఠముగ నుండు.

### హరీతకీగుగ్గులు

హరీతకీ నాగరం చ వృద్ధదారుసమం సమమ్,<br>
ద్విగుణం గుగ్గులం దత్వా తైలమేరండజం తథా. 69<br>
మర్దయేద్దినమేకం తు భక్షయేదామవాతనుత్,

తా. కరకపోలుపు, శొంఠి, పెద్దమానుచెక్క ఇవిసమములు వీనికి రెండింతలు గుగ్గిలము వీనినన్నియు చూర్ణించి ఆముదముతో నొకదినము మర్దించి భుజించిన ఆమవాతము నివర్తించు.

### యోగరాజగుగ్గులు

చిత్రకం పిప్పలీమూలం యవానీ కారవీ తథా. 70<br>
విడంగమజమోదా చ జీరకం సురదారుచ,<br>
చవ్యైలా సైంధవం కుష్ఠం రాస్నా గోక్షురధాన్యకమ్. 71<br>
త్రిఫలాముస్తకం వ్యోషం త్వగుశీరం యవాగ్రజమ్,<br>
తాలీసపత్రం పత్రం చ సూక్ష్మచూర్ణాని కారయేత్. 72<br>
యావంత్యేతాని చూర్ణాని తావన్మాత్రం చ గుగ్గులుమ్,<br>
సమర్ద్య సర్పిషా గాఢం స్నిగ్ధభాండే నిధాపయేత్. 73<br>
తతో మాత్రాం ప్రయుంజీత యథేష్టాహారవానపి,<br>
ప్లీహగుల్మోదరానాహదుర్నామాని వినాశయేత్. 74<br>
అగ్నిం చ కురుతే దీప్తం తేజోబుద్ధిం బలం తథా,<br>
వర్ధయేద్దినమేకం తు భక్షయేదామవాతహామ్. 75

తా. చిత్రిమూలము, పిప్పలిమూలము, ఓమము, పెద్దసోపు, వాయువిడంగములు, అజామోదము, జీలకఱ్ఱ, దేవదారు, చవ్యము, ఏలకులు, సైంధవలవణము, చంగల్వకోష్ఠు, రాస్న, చిరిపల్లేరు, ధనియాలు, త్రిఫలములు, తుంగముస్తలు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, లవంగపట్ట, వట్టివేరు, యవక్షారము, తాళిసపత్రి,

ఆకుపత్రి వీనిని సమభాగములుగ చూర్ణించి, యీచూర్ణమునకు సమము గుగ్గిల చూర్ణమునుచేర్చి, నేతితో నొకదినము బాగుగమర్దించి నేతితోమాగిన కుండయందునిచి పిదప అక్షమాత్రము సేవించి యథేష్టముగ ఆహారమును భుజించిన ప్లీహము, గుల్మము ఉదరము, ఆనాహము, దుర్నామము వీనిని నివర్తింపంజేయుటయేగాక అగ్నిదీప్తి, తేజోవృద్ధి, బలము వీనిని గలుగంజేయు.

బృహత్సైంధవాదితైలము

సైంధవం శ్రేయసీ రాస్నా శతపుష్పా యవానికా,
స్వర్జికా మరిచం కుష్ఠం శుంఠీ సౌవర్చలం బిడమ్. 76
వచా జమోదా జరణః పౌష్కరం మధుకంకణా,
ఏతాన్యర్ధపలాంశాని సూక్ష్మకల్కాని కారయేత్. 77
ప్రస్థమేరండతైలస్య ప్రస్థోంబుశతపుష్పజమ్,
కాంజికం ద్విగుణం దత్వా మస్తుచ ద్విగుణం తథా. 78
ఏతత్సంభృత్య సంభారం శనైర్మృద్వగ్నినా పచేత్,
సిద్ధమేతత్ప్రయోక్తవ్య మామవాతహరం పరమ్. 79
పానే చాభ్యంజనే వస్తౌ కురుతేగ్నిబలం భృశమ్,
వాతార్తే వంక్షణే శూలే కటీజానూరుసంధిజే. 80
తథా హృత్పార్శ్వజే శూలే శస్తం శ్లేష్మనిపీడితే,
అన్యాంశ్చానిలజాన్రోగా న్నాశయత్యాశు దేహినామ్. 81

తా. సైంధవలవణము, కరకవోలుపు, రాస్న, పెద్దసదాప, ఓమము, సర్జక్షారము, మిరియాలు, కోష్ఠు, శొంఠి, సౌవర్చలవణము, బిడాలవణము, వస, అజామోదము, జీలకఱ్ఱ, పుష్కరమూలము, యష్టిమధుకము, పిపళ్లు వీనిని ప్రత్యేకము ౪ పలమువంతునచేర్చి చూర్ణించి, ఆముదము ౧ ప్రస్థము, పెద్దసదాపరసము ౧ ప్రస్థము, కాంజికము ౨ ప్రస్థములు, పెరుగుమీదితేట ౪ ప్రస్థములు వీనినన్నియు నేకముగచేర్చి మందాగ్నిచేవండి సిద్ధమైన పిదప దీనిని పానము అభ్యంజనము వస్తికర్మ వీనిని జేసిన ఆమవాతము, వాతపీడ, గజ్జలయందలిశూల, కటిశూల, మోకాళ్లయందలిపోట్లు, తొడలయందలిపోట్లు, సంధిశూల, హృదయశూల, పార్శ్వశూల, కఫరోగము, ఇతరరోగములు ఇవియన్నియు నివర్తించుటయేగాక అగ్నిదీప్తియు గలుగు.

ఆమవాతమునకు మేథీపాకము

మేథికాయాః పలాన్యష్టౌ శుంఠ్యా అష్టపలాని చ,

తయోశ్చూర్ణం పటే పూతం దుగ్ధే మృద్వగ్నినా పచేత్. 82
దుగ్ధాఢకయుతం గవ్యం ఘృతమష్టపలం క్షిపేత్,
తత్తావత్సు పచేద్యావద్భవేదతిఘనం పయః. 83
పునః పచేచ్ఛనైస్తత్ర దత్వాఢకమితం సితామ్,
తతః పాకే సువిజ్ఞాతే జ్వలనాదవతారయేత్. 84
మరిచం పిప్పలీ శుంఠీ కణా మూలం సచిత్రకమ్,
యవానీ జీరకో ధాన్యం కారవీ శతపుష్పికా. 85
జాతీఫలం శటీత్వక్చ పత్రకం భద్రముస్తకమ్,
గృహ్ణీయాత్పలమేతేషాం సర్వేషాం చ పృథక్పృథక్. 86
షడక్షం నాగరం తత్ర మరిచం చ షడక్షకమ్,
ఏషాం చూర్ణం పరిక్షిప్య సర్వం సమ్మిశ్ర్య రక్షయేత్. 87
ఏతత్తు భేషజం ప్రోక్తం మేథికాపాకసంజ్ఞితమ్,
భక్షయేత్పలమాత్రం తు యథాచాగ్నిబలం తథా. 88
ఆమవాతం నిహంత్యేతత్సర్వాంశ్చ పవనామయాన్,
జ్వరాంశ్చ విషమాన్హంతి పాండురోగం సకామలమ్. 89
హంత్యున్మాదమపస్మారం ప్రమేహాన్వాతశోణితమ్,
ఆమ్లపిత్తం శిరఃపీడాం నాసారోగం దృగామయమ్. 90
ప్రదరం సూతికారోగం హన్యాదేతన్న సంశయః,
వపుషః పుష్టికృద్బల్యం వీర్యవృద్ధికరం పరమ్. 91

తా. మెంతులు ౭ పలములు, శొంఠి ౭ పలములు, వీనిని చూర్ణించి వస్త్రఘాలితమొనర్చి, ఆచూర్ణమును అఢకము పాలయందువైచి, పిదప ౭ పలముల నెయ్యిచేర్చి గట్టిపడువరకు కాచి అందు అఢకము చక్కెరచేర్చి, మరల పక్వముగ మందాగ్నిచే వండి, పాకమును తెలిసికొని దించి అందు మిరియాలు, పిప్పళ్లు, శొంఠి, పిప్పలిమూలము, చిత్రమూలము, ఓమము, జీలకఱ్ఱ, ధనియాలు, నల్లజీలకఱ్ఱ, పెద్దసోపు, జాజికాయ, కచ్చూరములు, లవంగపట్ట, ఆకుపత్రి, తుంగముస్తలు ఇవియన్నియు ప్రత్యేకము ౧ పలమువంతునను, శొంఠి ౧౪ పలము, మిరియాలు ౧౪ పలము వీనిని చూర్ణించివైచి కలియబెట్టిన మేధీపాకమనంబడు. దీనిని అగ్నిబలానుసారముగ పూటకొకపలమువంతున సేవించిన ఆమవాతము, సకల వాతవ్యాధులు, విషమజ్వరములు, పాండురోగము, కామిల ఉన్మాదము, అపస్మారము, ప్రమేహము, వాతరక్తము, ఆమ్లపిత్తము, తలనొప్పి, నాసారోగము, నేత్రరోగము, ప్రదరము, సూతికా

రోగము వీనిని నశింపజేయుటయేగాక శరీరమునకు పుష్టి. బలము, వీర్యవృద్ధి వీనిని గలుగంజేయు.

సౌభాగ్యశుంఠీపాకము

విశ్వౌషధం పలాన్యష్టౌ సర్పిషఃపలవింశతిః,
ప్రస్థద్వయం చ గోక్షీరం శర్కరార్ధతులాం తథా. 92
త్రికటు త్రిసుగంధంచ ప్రత్యేకం చ పలం పలమ్,
సాధయేత్స్నేహవిధినా సమ్యక్శుంఠీరసాయనమ్. 93
నామ్నా సౌభాగ్యశుంఠీయం వపుస్సౌభాగ్యదాయకమ్,
ఆమవాతం హరత్యాశు త్వచి కాంతిం ప్రయచ్ఛతి. 94
ధాతువృద్ధికరం వృద్ధమాయుశ్చ కురుతే చిరమ్,
వలీపలితనాశం చ కుర్యా ద్వంధ్యాత్వనాశనమ్. 95

తా. బెరడుచివ్విన శొంఠిచూర్ణము ౮ పలములు, నెయ్యి ౨౦ పలములు, ఆవుపాలు ౨ ప్రస్థములు, శర్కర ౫౦ పలములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, లవంగపట్ట, ఏలకులు, ఆకుపత్రి వీనిని ప్రత్యేకము ౧ పలమువంతున చూర్ణించి, స్నేహవిధానముగ పాకంబొనర్చిన సౌభాగ్యశుంఠీ యనంబడు. దీనిని సేవించిన ఆమవాతము, వలీపలితము, వంధ్యాత్వము ఇవి నివర్తించుటయేగాక సౌభాగ్యము, శరీరకాంతి, ధాతువృద్ధి, ఆయుర్వృద్ధి వీనిని గలుగంజేయు.

శతపుష్పాదిలేపము

శతపుష్పా వచా విశ్వాశ్వదంష్ట్రావరుణాత్వచః,
పునర్నవాస దేవాహ్వాశఠీముండితకాస్సమాః. 96
ప్రసారిణీ చ తర్కారీ ఫలంచ మదనస్య చ,
సూక్తకాంజికపిష్టాస్తు సుఖోష్ణాలేపనే హితాః. 97

తా. సదాప, వస, శొంఠి, పెద్దపల్లేరు, పులిమిడిపట్ట, తెల్లగలిజేరు, దేవదారు, కచ్చూరములు, బోడతరము, గొంతెమగోరుచెట్టువేరు, తక్కిలి, మంగకాయ వీనిని సూక్తకాంజికములతో నూరి, కొంచెము ఉష్ణముజేసి లేపనముచేసిన ఆమవాతము నివర్తించు.

ఆమవాతమునకు పథ్యములు

రూక్షస్స్వేదో లంఘనం స్నేహపానం వస్తిర్లేపో రేచనంపాయువర్తిః,
అబ్దోత్పన్నాశ్శాలయోయేకులుత్థాజీర్ణంమద్యంజాంగలానాంరసాశ్చ,

వాతశ్లేష్మఘ్నాని సర్వాణి తక్రం వర్షాభూశ్చైరండతైలం రసోనః,
పటోలపత్రారకకారవేల్లవార్తాకశిగ్రూదకీవ తప్తనీరమ్.　　99
మందారగోకంటకవృద్ధదారుభల్లాతకం గోర్జలమూర్ధ్రికం చ,
కటూని తిక్తాని చ దీపనాని స్యుశ్చామవాతేసుతరాం హితాని.

తా. ఊష్ణస్వేదము, లంఘనము, స్నేహపానము, వస్తికర్మ, లేపనము, రేచనము, గుదవర్తి, సంవత్సరముగడిచిన వడ్లబియ్యము, వులవలు, పాతమద్యము జాంగలమాంసరసము, వాతశ్లేష్మహారకములగు పదార్థములు, మజ్జిగ, తెల్లగలిజేరు, ఆముదము, వెల్లుల్లి, చేదుపొట్ల, నీటిపిప్పలి, కాకర, వంకాయ, మునగకాయ, వేడి నీళ్లు, మందారము, పల్లేరు, వృద్ధదారు, జీడిగింజలు, గోమూత్రము, బెల్లము, కారము, వగరు యీరసములు, దీపనకరములగు ద్రవ్యములు ఇవి ఆమవాతమునకు హితములని తెలియవలయు.

## అపథ్యములు

దధిమత్స్యగుడక్షీరోసోదికామాషపిష్టకమ్,
దుష్టనీరం పూరంవాతం విరుద్ధాన్యశనాని చ.　　101
అసాత్మ్యం వేగరోధం చ జాగరం విషమాశనమ్,
వర్జయేతామవాతార్తో గుర్వభిష్యందికాని చ.　　102

తా. పెరుగు, మత్స్యములు, బెల్లము, పాలు, దుంపబచ్చలి, మినపపిండి, దుష్టోదకము, తూర్పుగాలి, విరుద్ధాన్నములు, తనకువొంటని (పడని) పదార్థములు, మలమూత్రవేగనిరోధము, రాత్రిజాగరణ, విషమాన్నము, గురుపదార్థములు, అభిష్యందిపదార్థములు వీనిని ఆమవాతముగలవారలు విడువవలయును.

---

# శీతపిత్తప్రకరణమ్

## శీతపిత్తనిదానము

శీతమారుతసంస్పర్శాత్ప్రదుష్టౌ కఫమారుతౌ,
పిత్తేన సహ సంభూయ బహిరంతర్విసర్పతః.　　1

తా. శరీరమునందు శీతవాయువుయొక్క స్పర్శమువలన కఫవాతములు మిక్కిలి దుష్టములై పిత్తముతోచేరి వెలుపల లోపల వ్యాపించి సంచరించుచునుండును.

## పూర్వరూపము

పిపాసారుచిహృల్లాసదేహసాదాంగగౌరవమ్,

రక్తలోచనతా తేషాం పూర్వరూపస్య లక్షణమ్. 2

తా. దప్పి, అరుచి, హృల్లాసము, శరీరము కృశించుట, శరీరము బరువుగ నుండుట, కన్నులు యెఱ్ఱగనుండుట ఇవి శీతపిత్తమునకు పూర్వరూపములని తెలియవలయు.

ఉదర్దలక్షణము

వరటీదష్టసంస్థానశ్శోథస్సంజాయతే బహిః,
సకండూస్తోద బహుళశ్ఛర్దిజ్వరవిదాహవాన్. 3
ఉదర్దమితి తం విద్యాచ్ఛీతపిత్తమథాపరే,

తా. * జోరీగలుకరిచినటుల శరీరముపై దద్దులుకట్టుట, దురద, సూదులతో పొడిచినటులపోట్లు, మిక్కిలివాంతి, జ్వరము, మిక్కిలి సంతాపము ఇట్టిలక్షణములు గలిగియుండిన ఉదర్దమనియు, దీనినే కొందరు శీతపిత్తమనియును, లోకవ్యవహారముచే పిత్తోద్రేకమనియును జెప్పెదరు. అందు, దురదకలిగియుండిన కఫజమనియు, సూదులతో పొడిచినటులనుండిన వాతజమనియు, మరియు వాంతులు, సంతాపము, మంటలు ఇవికలిగియుండిన పిత్తజమనియును తెలియవలయు.

వాతాధికం శీతపిత్తముదర్దస్తు కఫాధికః. 4

తా. ఉదర్దము, వాతాధికముగ నుండిన ఉదర్దమనియు, కఫాధికముగ నుండిన శీతపిత్తమనియును వచించెదరు.

సోత్సంగైశ్చ సరాగైశ్చ కండూమద్భిశ్చ మండలైః,
శైశిరః కఫజో వ్యాధిరుదర్దః పరికీర్తితః. 5

తా. చలివలనకఫము ప్రకోపించి, శరీరమునందు యెఱ్ఱనిదద్దులుజనించి దురద, గలదై, ఆదద్దులమధ్యమంనులోతుగను, చుట్టుఉబ్బుగనుండిన దానిని శిశిరమువలన గల్గు కఫజ ఉదర్దమని చెప్పెదరు.

కోఠలక్షణము

అసమ్యగ్వమనోదీర్ణపిత్తశ్లేష్మాన్ననిగ్రహైః,
మండలాని సకండూని రాగవంతి బహూని చ. 6
ఉత్కోఠస్సానుబంధశ్చ కోఠ ఇత్యభిధీయతే,

తా. వమనమునకు ఔషధము పుచ్చుకొనిన పిదప, చక్కగ వమనముగా కుండుటవలన పిత్తకఫములు ప్రకోపించుటచేగాని లేక వమనమును నిరోధించుటచేగాని

* కణితిరీగెలు.

శరీరమునందు దురద, యెరుపుగల దద్దులు అనేకములుగ లేచిన, దానిని ఉత్కోఠమని యును, మరియు నిదేరీతిగ మాటిమాటికి జనించిన, దానిని కోఠమనియును జెప్పెదరు.

అన్యచ్చ.—

ఆరనాళైశ్చ సూక్తైర్వా వ్యాసురీలవణేన చ. 7
వర్షాకాలే ప్రకుప్యేత తథా దుష్టైశ్చ కారణైః,
ఉత్కోఠస్సానుబంధశ్చ కోఠఇత్యభిధీయతే. 8

తా. కాంజికము, సూక్తము, పెసలు, ఉప్పు, వర్షఋతువు, దుష్టకారణ ములు, వీనిచే పిత్తకఫములు ప్రకోపించి పైజెప్పినలక్షణము జనింపజేయు గాన దానినే ఉత్కోఠమనియు, కోఠమనియును జెప్పెదరు.

## గంభారీఫలకల్కము

గంభారికాఫలైః కల్కం శుష్కముత్స్వేదితం పునః,
క్షీరేణ శీతపిత్తఘ్నం ఖాదితం పథ్యసేవినా. 9

తా. గుమ్ముడుపండును యెండించి కల్కముచేసి, ఆవుపాలతో పుచ్చుకొని పథ్యముగ భుజించిన శీతపిత్తము నివర్తించు.

## యష్ట్యాది కషాయము

యష్టీమధూకపుష్పైశ్చ రాస్నాచందనయుగ్మకైః,
నిర్గుండ్యాకణాయా క్వాథం శీతపిత్తహరం పిబేత్. 10

తా. యష్టిమధుకము, ఇప్పపూలు, రాస్న, శ్వేతచందనము, రక్తగంధనము, వావిలి, పిప్పలి వీనినికషాయముబెట్టి పుచ్చుకొనిన శీతపిత్తము నివర్తించు.

## అమృతాదికషాయము

అమృతారజనీనింబధన్వయాసైః పృథక్ శృతమ్,
ప్రాణినాం ప్రాణదం హ్యేతచ్ఛీతపిత్తే సమాహరేత్. 11

తా. తిప్పతీగె, పసపు, వేప, దూలగొండి వీనిని ప్రత్యేక ప్రత్యేకముగ కషాయముకాచి పుచ్చుకొనిన శీతపిత్తము నివర్తించు.

## శీతారిరసము

రసేన గంధం ద్విగుణం ప్రగృహ్యపునర్న వావహ్నిగస్తిర్యమర్ద్య,
పక్వార్కపత్రోత్థరసేన తస్మాద్విపాచయేదష్టగుణేన పశ్చాత్. 12
రసార్ధభాగేన విషం చ దద్యాద్విపాచయేద్వహ్నిజలైః క్షణం తత్,
శీతారిసంజ్ఞోహి రసోయమస్య వల్లం తదర్ధం యది వార్ద్రికేన. 13

మరీచచూర్ణేన ఘృతప్లుతేన సేవేత మాసం సఘృతం చ పథ్యమ్,

తా. శుద్ధిజేసిన రసము ౧ భాగము, శుద్ధిజేసిన గంధకము ౨ భాగములు వీనిని ఖల్వమునందునిచి, తెల్లగలిజేరు, చిత్రమూలము వీనిరసములచే మర్దించి యెనిమిదింతలు పండుజిల్లేడాకుల రసముతోవండి, పాదరసములో సగము శుద్ధిజేసిన నాభిని చేర్చి మర్దించి, చిత్రమూలరసముచే మరల క్షణకాలమువండి, వల్ల ప్రమాణముగాని అర్ధవల్లముగాని, అల్లపురసముతోనైనను లేక మిరియాలచూర్ణము, నెయ్యితోనైనను ఒకమాసము పుచ్చుకొనిన శీతపిత్తము నివర్తించు. పథ్యమునందు నెయ్యితో భోజనం బిడదగు.

## రసాదిగుటికలు

అష్టభాగో రసశ్శుద్ధో విషతిందోర్దశైవ తు. 14
గంధకస్య దశ ద్వా త్రికటుత్రిఫలయోస్త్రయః,
వహ్నిచిత్రకముస్తానాం వచాకంబుకయోరపి. 15
రేణుకావిషకుష్ఠానాం పిప్పలీమూలనాగయోః,
ఏకైకస్తు భవేద్భాగ ఇతి గ్రాహ్యాః క్రమేణ తు. 16
గుడశ్చతుర్వింశతి స్యాద్వటికా బదరాకృతిః,
క్రమేణ వానుసేవేత స్పర్శవాతాపనుత్తయే. 17

తా. శుద్ధిజేసినరసము ౮ భాగములు, శుద్ధిజేసినముశిడివిత్తులు ౧౦ భాగములు, శుద్ధిజేసినగంధకము ౧౨ భాగములు, త్రికటుకములు, త్రిఫలములు, వహ్ని (జీడిగింజలు) చిత్రమూలము, తుంగముస్తలు, వస, పెన్నేరుగడ్డ, రేణుకవిత్తులు, నాభి, చంగల్వకోష్ఠు, మోడి, నాగకేసరములు వీనినన్నియు ప్రత్యేకము ఒక్కొక్క భాగము వంతున చేర్చి చూర్ణించి, అందు బెల్లము ౨౪ భాగములువైచి మర్దించి, రేగుపండంత మాత్రలుజేసి, క్రమముగ నొకటి, రెండు, మూడు ఇటుల సేవించిన స్పర్శవాతము నివర్తించు.

## సామాన్యచికిత్సాక్రమము

యవాగూం పాయయేద్వాపి సవ్యోషాం క్షీరసంయుతామ్,
పిప్పలీం వర్ధమానాం వా లశునం వా ప్రయోజయేత్. 18

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు వీనిచూర్ణమును పాలలో కలిపి యవాగునందుచేర్చి పుచ్చుకొనినను లేక వర్ధమానపిప్పలినిగాని లేక వెల్లుల్లినిగాని పుచ్చుకొనిన శీతపిత్తమునివర్తించు.

శీతపిత్తఉదర్దేచ తథా కోఠాభిధే గదే,

కృమిదద్రుహరః కార్యశ్శీతపిత్తేఖిలక్రమః. 19

తా. శీతపిత్తము, ఉదర్దము, కోఠము వీనియందు కృమి, దద్రుహరకము లగునుండు శీతపిత్తక్రియలం జేయవలయు.

అభ్యంగః కటుతైలేన స్వేదశ్చోష్ణేన వారిణా,
తథాశు వమనం కార్యం పటోలారిష్టవాసకైః. 20

తా. శీతపిత్తమునందు కటుతైలము(ఆవనూనె)చే అభ్యంగనము ఉష్ణోదకముచే స్వేదము, చేదుపొట్ల, వేప అడ్డసరము వీనికషాయముచే వమనము వీనిని జేయించవలయు.

## త్రిఫలాది రేచనము

త్రిఫలాపురకృష్ణాభిర్వి రేకశ్చ ప్రశస్యతే,
సర్పిః పీత్వా మహాతిక్తం కార్యం శోణితమోక్షణమ్. 21

తా. శీతపిత్తమునందు త్రిఫలములు, గుగ్గులము, పిప్పలి వీనిచే రేచనమున కొసంగి, పిదప, మహాతిక్తఘృతము పానార్థమొసంగి, రక్తమోక్షణముగం జేయవలయు.

## ఉదర్దమునకు గుడాదియోగము

సగుడం దీప్యకం యస్తు ఖాదేత్పథ్యాన్నభుజ్నరః,
తస్య నశ్యతి సప్తాహాదుదర్దస్సర్వదేహజః. 22

తా. బెల్లము, ఓమము వీనిని దంచి భక్షించి, పథ్యముగభుజించిన, సర్వదేహమునందు జనించిన ఉదర్దము, ఏడుదినములకు నివర్తించు.

## అగ్నిమంథమూలయోగము

అగ్నిమంథభవం మూలం పిష్టం పీతం చ సర్పిషా,
శీతపిత్తోదర్దకోఠాన్ సప్తాహాదేవ నాశయేత్. 23

తా. కూరనెల్లి వేరునునూరి, నెయ్యిలో కలిపి, ఏడుదినములు పుచ్చుకొనిన శీతపిత్తము, ఉదర్దము, కోఠము ఇవి నివర్తించు.

## నింబపత్రయోగము

నింబస్య పత్రాణి సదాఘృతేన ధాత్రీవిమిశ్రాణ్యథ వా ప్రయుఞ్జ్యాత్,
విస్ఫోటకోఠక్షతశీతపిత్తకడ్వస్రపిత్తాని సమాని హన్యాత్. 24

తా. వేపఆకులనునూరి నెయ్యిలోకలిపిగాని లేక ఉసిరికవొలుపుచూర్ణముతో చేర్చిగాని పుచ్చుకొనిన విస్ఫోటము, కోఠము, క్షతము, శీతపిత్తము, దురద, రక్తపిత్తము ఇవియన్నియు నివర్తించు.

## సైంధవాదిలేపము

సస్సైంధవేన కోష్ణేన సర్పిషా లేపమాచరేత్,
సురసా స్వరసైర్వాథ లేపయేత్పరమౌషధమ్. 25

తా. సైంధవలవణమును చూర్ణించి, నేతిలో కలిపి కొంచెము వెచ్చజేసి లేపనను జేసినను లేక తులసిఆకురసముతో సైంధవలవణమును లేపనముజేసినను శీతపిత్తము నివర్తించు.

## ఉద్వర్తనము

సిద్ధార్థరజనీకుష్ఠప్రపున్నాటతిలైస్సహ,
కటుతైలేన సంమిశ్రమేతదుద్వర్తనం హితమ్. 26

తా. తెల్లఆవాలు, పసపు, చంగల్వకోష్ఠు, తగిరిశెవిత్తులు, నువ్వులు వీనిని చూర్ణించి కటుతైలము(ఆవనూనె)నందు కలిపి లేపనముజేసిన హితకరనుగనుండు.

## శీతపిత్తమునకు పథ్యములు

శాలిముద్గకులుత్థాశ్చ కారవేల్లముపోదికా,
వేత్రాగ్రం తప్తనీరం చ పిత్తశ్లేష్మహరాణి చ. 27
శీతపిత్తోదర్దకోఠరోగిణాం పథ్యమీరితమ్,

తా. సంబాబియ్యము, పెసలు, ఉలవలు, కాకరకాయలు, బచ్చలికూర, ప్రబ్బలిమొలకలు, వేడినీళ్లు, పిత్తశ్లేష్మహారకములగు పదార్థములు ఇవి శీతపిత్తము, ఉదర్దము, కోఠము ఇవిగలవారలకు హితకరములుగ నుండు.

## అపథ్యములు

స్నానమాతపమమ్లం చ గుర్వన్నం చ వివర్జయేత్. 28

తా. స్నానము, ఎండ, పులుసు, గురుకరములగు అన్నము వీనిని శీతపిత్త రోగి వర్జించవలయు.

---

# ఆమ్లపిత్తప్రకరణమ్.

## ఆమ్లపిత్తనిదానము

విరుద్ధదుష్టామ్లవిదాహిపిత్తప్రకోపిపానాన్నభుజోవిదగ్ధమ్,
పిత్తం స్వహేతూపచితం పురాయత్తదమ్లపిత్తం ప్రవదన్తి తద్జ్ఞాః. 1

తా. విరుద్ధక్షీరమత్స్యాద్యాహారము, దుష్టాన్నము, పులుసు, విదాహకరము లగు అన్నములు వీనిసేవనవలనను పిత్తప్రకోపకములగు అన్నపానాదులవలనను పిత్తము

ప్రకోపించి వర్షాకాలమునందు స్వకారణముచే వృద్ధిపొందియుండు. దానిని అమ్లపిత్తమని వైద్యులు వచించెదరు.

## ఆమ్లపిత్తలక్షణము

అవిపాకః క్లమోత్క్లేదతిక్తామ్లోద్గారగౌరవైః,
హృత్కంఠదాహారుచిభిశ్చామ్లపిత్తం వదేద్భిషక్. 2

తా. అన్నము జీర్ణముగాకయుండుట, ఆయాసము, నోటనీరూరుట, చేదుగను, పుల్లగను తేనుపులువచ్చుట, శరీరము బరువుగనుండుట, గుండె, కంఠముమండుట, అరుచి ఇట్టిలక్షణములు గలిగియుండిన ఆమ్లపిత్తమని వచించెదరు. (మరియు అమ్లపిత్తమునందు అధోగతము, ఊర్ధ్వగతములని రెండు విధములు)

## అధోగతలక్షణము

తృట్దాహమూర్ఛాభ్రమమోహకారీప్రయాత్యధో వా వివిధప్రకారమ్,
హృల్లాసకోఠానలసాదహర్షస్వేదాంగపీతత్వకరం కదాచిత్. 3

తా. దప్పి, తాపము, మూర్ఛ, భ్రమ, మోహము ఇవిగలిగి; మలము తెలుపు, నలుపు, పసపు, ఎఱ్ఱవర్ణములుగలదై, అధోమార్గముగ బయలువెడలుట, ఓకరింత, శరీరమునందు దద్దు, అగ్నిమాంద్యము, గగుర్పాటు, చెమట, శరీరము పచ్చగనుండుట ఇట్టిలక్షణములు గలిగియుండు.

## * కఫపిత్తజఆమ్లపిత్తలక్షణము

కరచరణదాహమౌష్ణ్యం మహతీమరుచిం జ్వరం చ కఫపిత్తమ్,
జనయతి కండూమండలపిటికాచితగాత్రరోగచయమ్. 4

తా. కఫపిత్తజఆమ్లపిత్తమునందు హస్తములు, పాదములు వీనియందుమంట, ఉష్ణము, అరుచి, జ్వరము, దురద, మండలములు, పిటికలు మొదలగు గాత్రరోగములు జనించు.

## కఫపిత్తలక్షణము

భ్రమమూర్ఛారుచిచ్ఛర్దిరాలస్యం చ శిరోరుజః,
ప్రసేకముఖమాధుర్యం శ్లేష్మపిత్తస్య లక్షణమ్. 5

కఫపిత్తయుక్త ఆమ్లపిత్తమునందు భ్రమ, మూర్ఛ, అరుచి, వాంతి,

---

* శ్లోకమూర్ధ్వగతామ్లపిత్తలక్షణములలోచేర్చి మాధవకరుడు వ్రాసియుండెను. త్తములవలన నూర్ధ్వగతామ్లపిత్తము జనించునని యాగ్రంథకర్తభావము.

అలసత్వము తలనొప్పి, నోటనీరు కారుట, నోరుతియ్యగనుండుట ఇట్టి లక్షణములు కలిగియుండు.

ఊర్ధ్వగతామ్లపిత్తలక్షణము

వాంతం హరిత్పీతకనీలకృష్ణమారక్తరక్తాభమతీవచామ్లమ్,
మాంసోదకాభం త్వతిపిచ్ఛిలాభం శ్లేష్మానుయాతం వివిధం రసేన. 6

తా. ఆమ్లపిత్తము ఊర్ధ్వగతమగునపుడు ఆకుపసరువర్ణముగను, పసపువర్ణముగను, నీలవర్ణముగను, నల్లగను, కొంచెమెఱ్ఱగను లేక మిక్కిలి యెఱ్ఱగను, మిక్కిలి పులుపుగను, మాంసోదకతుల్యముగను, మిక్కిలిజిగటను వమనంబగుట, మరియు శ్లేష్మ యుక్తమై చిక్కగను, కారముగను, వగరుగను, చేదుగను, పుల్లగను వమనంబగునని తెలియవలయు.

ఊర్ధ్వగతామ్లపిత్తమునందు ఆహారావస్థ

భుక్తే విదగ్ధేప్యథవాప్యభుక్తే కరోతి తిక్తామ్లవమిం కదాచిత్,
ఉద్గారమేవంవిధమేవకంఠహృత్కుక్షిదాహం శిరసో రుజం చ. 7

తా. భుజించినపిదపగాని, సగము జీర్ణమయినకాలమునందు గాని, భుజించని కాలమునందుగాని, చేదుగను, పుల్లగను, నొకానొక కాలమున వమనంబగు. మరియు త్రేపులు, హృదయము, కంఠము, కుక్షి వీనియందుమంట, తలనొప్పి ఇవి గలిగియుండు.

ఆమ్లపిత్తసాధ్యాసాధ్యలక్షణము

రోగోయమమ్లపిత్తాఖ్యో యత్నాత్సంసాధ్యతే నవః,
చిరోత్థితో భవేద్యాప్యః కృచ్ఛ్రసాధ్యస్సకస్యచిత్. 8

తా. ఈ ఆమ్లపిత్తరోగము నూతనముగ జనించిన, యత్నసాధ్యంబగు. చిరకాలమునుండియుండునది యాప్యముగాన, కష్టసాధ్యంబని తెలియవలయును. సర్వోత్కృష్టమగు పథ్యమును భుజించి, విశేషయత్నంబొనర్చినను కష్టసాధ్యమని తెలియవలయు.

ఆమ్లపిత్తమున వాతకఫసంసర్గలక్షణము

సానిలం సానిలకఫం సకఫం తచ్చ లక్షయేత్,
దోషలింగేన మతిమాన్భిషక్ మోహాకరం హి తత్. 9

తా. ఆమ్లపిత్తము వాతసంబంధముగలదిగను లేక వాతకఫసంబంధముగలదిగను లేక కేవల కఫసంబంధము గలదిగనునుండు. కాన బుద్ధిమంతుడగు వైద్యుడు వాతాదిదోషములచే దానిని తెలుసుకొనవలయు. మరియు కారణములచే ఆమ్ల

పిత్తము మహామోహమును జనింపంజేయుగాన చక్కగ దెలుసుకొనుట దుర్లభ మని తెలియవలయు.

వాతయుక్త ఆమ్లపిత్తలక్షణము

కంపప్రలాపమూర్ఛాచిమిచిమి గాత్రావసాదశూలాని,
తమసో దర్శనవిభ్రమ విమోహహర్షావనిలకోపాత్. 10

తా. ఆమ్లపిత్తము వాతముతో చేరినపుడు వణుకు, ప్రలాపము, మూర్ఛ, శరీరము చిమచిమలాడుట, శరీరము సడలుట, శూల, కన్నులకు చీకటిక్రమ్మినటుల నుండుట, విభ్రమము, మోహము, రోమాంచము ఇవి గలిగియుండు.

వాతకఫయుక్త ఆమ్లపిత్తలక్షణము

ఉభయమిదమేవ చిహ్నం మారుతకఫసంభవే భవత్యమ్లే,

తా. వాతకఫసంయుక్తామ్లపిత్తమునందు వాతకఫలక్షణంబులు రెండును గలిగియుండునని తెలియవలయు.

కఫయుక్తామ్లపిత్తలక్షణము

కఫనిష్ఠీవనగౌరవజడతాఽరుచి శీతసాదవమిలేపాః. 11
దహనబలసాదకండూర్నిద్రాచిహ్నం కఫానుగతే,

తా. కేవలకఫముతో చేరిన ఆమ్లపిత్తమునందు, కఫము నుమియుట, శరీరము బరువుగనుండుట, జడముగ నుండుట, అరుచి, శరీరము చల్లగనుండుట, శరీరము సడలుట, నోటజిగటగ కఫముపూసికొనుట, అగ్నిమాంద్యము, బలహీనత, దురద, నిద్ర ఇవిగలిగియుండు.

ఆమ్లపిత్తసామాన్యచికిత్స

గుడూచీచిత్రకారిష్టపటోలైః క్వథితం పిబేత్. 12
క్షౌద్రయుక్తం నిహంత్యేతత్ ఛర్దిం పిత్తామ్లసంభవామ్,

తా. తిప్పతీగె, చిత్రమూలము, వేపయీనెలు, చేదుపొట్ల వీనిని కషాయము బెట్టి, అందు తేనె చేర్చి పుచ్చుకొనిన పిత్తామ్లమువలనగలిగిన వాంతి నివర్తించు.

పూర్వం తు వమనం కార్యం పశ్చాన్మృదువిరేచనమ్. 13
కృతవాన్తివిరేకస్య సుస్నిగ్ధస్యానువాసనమ్,

తా. ఆమ్లపిత్తమునందు తొలుత వమనంబునరొసంగి, పిదప మృదువిరేచన

మున కివ్వందగు. ఇటుల, వమనవిరేచనములం జేయించి, పిదప అనువాసన వస్తి కర్మను జేయవలయు.

ఆస్థాపనం చిరోత్థేస్మి౯ దేయం దోషాద్యపేక్షయా. 14
దోషసంసర్గజే కార్యం ఔషధాహారకల్పనం,

తా. చిరకాలమునుండియుండుదానియందు దోషబలాదుల ననుసరించి నిరూహవస్తికర్మను జేయవలయు. ద్విదోషజములందు దోషబలాబలములనెరింగి ఔషధము, ఆహారము మొదలగువానినిం జేయవలయు.

ఊర్ధ్వదేహాస్థితం వాంత్వా హ్యధస్థం రేచనైర్హరేత్. 15
పాచనం తిక్తసహితం పథ్యం చ పరికల్పయేత్,

తా. ఊర్ధ్వదేహమునందుండు అమ్లపిత్తమును వాంతిచేయున్ను, అధశ్శరీమునందుండు అమ్లపిత్తమును రేచనములచేతనున్ను హరింపజేసి, వగరుగనుండు ఔషధములచే పాచనంబునుం జేయవలయు. పథ్యము సగా అటులనే జేయవలయు.

అమ్లపిత్తే ప్రయోక్తవ్యః కఫపిత్తహరో విధిః. 16
గుడకూష్మాండకం చైవ తథా ఖండామలక్యపి,

తా. అమ్లపిత్తమునందు కఫపిత్త నివర్తకమగు విధినే ప్రయోగించందగు. పిదప గుడకూష్మాండమునుగాని, ఖండామలకమునుగాని సేవించవలయు.

కృతవమనవిరేకస్యాపి దోషోపశాంతిర్భవతి న యది కాయే రక్త మోక్షశ్చ యుక్త్యా. 17
కృతశిశిరవిలేపస్యామ్లపిత్తఘ్నభక్ష్యోదనసముదితతృప్తే ర్వాతరక్షా చ కార్యా,

తా॥ అమ్లపిత్తమునందు వమనవిరేచనాదులచే దోషశాంతి కానియెడల, రక్తమోక్షమును జేయవలయు. పిదప చల్లగనుండు ఔషధములచే లేపనముజేసి, అమ్లపిత్తనాశకములగు భక్షణపదార్థములు, అన్నము మొదలగువానిచే తృప్తిని పొందించవలయు. మరియు వాతసంరక్షణ సగా జేయవలయు.

పటోలాదికషాయము

పటోలత్రిఫలానింబక్వాథం క్షౌద్రయుతం పిబేత్. 18
అమ్లపిత్తం జ్వరం ఛర్దిం దాహం శూలం కఫం జయేత్,

తా. చేదుపొట్ల, కరక, తాడి, ఉశిరికెలు, వేపయీనెలు వీనిని కషాయము బెట్టి, అందు తేనె చేర్చి పుచ్చుకొనిన అమ్లపిత్తము, జ్వరము, వాంతి తాపము, శూల, కఫము ఇవి నివర్తించు.

—॥ పాఠాదికషాయము ॥—

పాఠానింబపటోలత్రిఫలాసన యాసయోజితో జయతి. 19
అధికకఫమమ్లపిత్తం గుగ్గులుసహితఃశ్రుతః క్రమశః,

తా. విషబొద్ది, వేపయీనెలు, చేదుపొట్ల, త్రిఫలములు, వేగిసపట్ట, దూలగొండి వేళ్లు వీనిని కషాయము బెట్టి అందు గుగ్గులచూర్ణము వైచి పుచ్చుకొనిన అధికకఫముతో గూడుకొనిన ఆమ్లపిత్తము నివర్తించు.

—॥ హింస్రాకషాయము ॥—

సహింస్రామృతవార్తాకీ క్వాథం కృత్వా సమాక్షికమ్. 20
ఆమ్లపిత్తం హరేద్దుష్టం శ్వాసం కాసం జ్వరం వమిమ్,

తా. జటామాంసి, తిప్పతీగ, పెద్దములక వీనిని కషాయము బెట్టి అందు తేనెకలిపి పుచ్చుకొనిన దుష్టమగు ఆమ్లపిత్తము, శ్వాస, దగ్గు, జర్వము, వాంతి ఇవి నివర్తించు.

—॥ యవాదికషాయము ॥—

నిస్తుష యవపవృషధాత్రీక్వాథం త్రిసుగంధమధుయుతం పీత్వా.21
అపహరతి చామ్లపిత్తం యది భుఙ్క్తే ముద్గయూషేన,

తా. పొట్టుతీసినయవలు, అడ్డసరము, ఉశిరికెపప్పు, లవంగపట్ట, తమాలపత్రి, యాలకులు వీనిని కషాయము బెట్టి, అందు తేనెచేర్చి పుచ్చుకొనిన ఆమ్లపిత్తము నివర్తించు. మరియు ముద్గయూషము అన్నమును పథ్యంబిడవలయు.

—॥ భూనింబాదికషాయము ॥—

భూనింబనింబత్రిఫలాపటోలీవాసామృతాపర్పటమార్కవాణామ్.
క్వాథో హరేత్ క్షౌద్రయుతోఽమ్లపిత్తం చిత్తం యథా వారవధూకటాక్షః,

తా. సీమనేలవేము, వేపయీనెలు, త్రిఫలములు, చేదుపొట్ల, అడ్డసరము, తిప్పతీగె, పర్పాటకము, గుంటగలగర వీనిని కషాయము బెట్టి అందు తేనెచేర్చి పుచ్చుకొనిన వేశ్యాంగనాకటాక్షమెటుల చిత్తమును హరించునో అటులనే ఆమ్లపిత్తమును హరించును.

—॥ కంటకార్యాదికషాయము ॥—

కంటకార్యమృతావాసాకషాయం మధుసంయుతమ్. 23
ఆమ్లపిత్తం జయేత్పీత్వా శ్వాసం కాసం వమిం జ్వరమ్,

తా. వాకుడు, తిప్పతీగె, అడ్డసరము, వీనిని కషాయముబెట్టి, అందుతేనె చేర్చిపుచ్చుకొనిన అమ్లపిత్తము, శ్వాస, కాస, వాంతి, జ్వరము ఇవి నివర్తించు.

చిత్రకాదికషాయము

చిత్రకైరండమూలైశ్చ యవైశ్చ సయవాసకైః. 24
జలేన క్వథితం పీతం కోష్ఠదాహామ్లపిత్తజిత్,

తా. చిత్రమూలము, ఆముదపువేళ్లు, యవలు, దూలగొండి వేళ్లు వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన కోష్ఠదాహముతోగూడిన అమ్లపిత్తము నివర్తించు,

అవిపత్తికరచూర్ణము

త్రికటుత్రిఫలాముస్తం బీజం చైవ విడంగజమ్. 25
ఏలాపత్రం చ సర్వాణి సమభాగాని కారయేత్,
యావన్త్యేతాని సర్వాణి లవంగం తత్సమం భవేత్. 26
సర్వచూర్ణాద్ద్విగుణితం త్రివృచ్చూర్ణం తు కారయేత్,
యావన్త్యేతాని సర్వాణి తావతీ శర్కరా భవేత్. 27
సర్వమేకీకృతం పాత్రే స్నిగ్ధే చైవ నిధాపయేత్,
భోజనాదౌ తతో భక్షేన్మాషాష్టకమిదం శుభమ్. 28
శీతతోయానుపానం చ నారికేళోదకం తథా,
తతో యథేష్టమాహారం కుర్యాత్క్షీరోదనం చ వై. 29
అమ్లపిత్తం హరత్యాశు శూలదుర్నామనాశకమ్,
ప్రమేహాం వింశతిం చైవ మూత్రాఘాతాం స్తథాశ్మరీమ్. 30
అవిపత్తికరం చూర్ణమగస్త్యమునిభాషితమ్,

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉశిరికెలు, తుంగముస్తలు, వాయువిడంగములు, యాలకులు, ఆకుపత్రి వీనినన్నియు సమభాగములుగ వైచి, వీనికన్నిటికిసమము లవంగములుచేర్చి చూర్ణించి, యాచూర్ణమునకు రెండింతలు తెగడ చూర్ణమునుచేర్చి, యేకముగ కలిపి యీచూర్ణమునకంతటికి సమము చక్కెరచేర్చి, స్నిగ్ధభాండమునందుంచుకొని, భోజనాదియందు ౮ మాషములయెత్తు, శీతోదకాను పానముతోగాని, టెంకాయనీరుతోగాని పుచ్చుకొని, ఇచ్ఛాపథ్యముగ పాలు అన్నముభుజించిన అమ్లపిత్తము, శూల, దుర్నామము, వింశతిమేహములు, మూత్రాఘాతము, అశ్మరి ఇవి నివర్తించు. (ఈఅవిపత్తికరచూర్ణము అగస్త్యమునిచే వచింపం బడెను.)

ఏలాదిచూర్ణము

ఏలాతుగాపత్రశివాభయానాం త్వగ్గ్రంథిపాటీరకధాన్యకానామ్. 31
చూర్ణం సితాతుల్యమపాకరోతి ప్రౌఢామ్లపిత్తం దివసేనభుక్తమ్,

తా. ఏలకులు, తవక్షీరి, లవంగపత్రి, ఉశిరికెపోలుపు, కరక్కాయ, దాల్చిని, మోడి, చందనము, ధనియాలు వీనిని సమభాగములుగ చూర్ణించి, సమముగ చక్కెర కలిపి పుచ్చుకొనిన బలమగు ఆమ్లపిత్తము ఒక దినములో నివర్తించు.

అధోగతామ్లపిత్తమునకు త్రికటుచూర్ణము

త్రికటుకసకంటకారీపర్పటకోశీరకుటజబీజానామ్. 32
సౌరాష్ట్రికాపటోలీత్రాయంతీదారుముస్తానామ్,
తిక్తామృణాలమలయజకాళింగైలాకిరాతతిక్తానామ్. 33
సవచాతివిషాకేసరదీప్యకమధుశిగ్రుబీజానామ్,
చూర్ణం పటఘృష్టమిదం పీతం శిశిరేణ వారిణా ప్రాతః. 34
క్షౌద్రేణ వాథ లీఢం చామ్లం పిత్తం హ్యధోగతం హన్తి,

తా. త్రికటుకములు, వాకుడు, పర్పాటకము, వట్టివేరు, కొడిశపాలవిత్తులు, * సౌరాష్ట్రికము, చేదుపొట్ల, కలుకొనుగ, దేవదారు, చాగ, కటుకరోహిణి, తామర కాడలు, చందనము, చేదుపుచ్చ, ఏలకులు, సీమనేలవేము, వస, అతివస, నాగకేసరములు, ఓమము, ఎఱ్ఱ మునగవిత్తులు వీనిని సమముగ చూర్ణించి, వస్త్రఘాలిత మొనర్చి ప్రాతఃకాలమునందు శీతోదకానుపానముతో సేవించినను లేక తేనెతో సేవించినను అధోగతమగు ఆమ్లపిత్తమును ముఖ్యముగ నశింపజేయు.

ఆమ్లపిత్తమునకు సూతశేఖరరసము

శుద్ధసూతం మృతం స్వర్ణం టంకణం వత్సనాభకమ్. 35
వ్యోషమున్మత్తబీజం చ గంధకం తామ్రభస్మకమ్,
చాతుర్జాతం శంఖభస్మ బిల్వమజ్జాకచోరకమ్. 36
సర్వం సమం క్షిపేత్ఖల్వే మర్ద్యం భృంగరసైర్దినమ్,
గుంజామాత్రాం వటీం కృత్వా ద్విగుంజంమధునాఘృతైః. 37
భక్షయేదమ్లపిత్తఘ్నో వాన్తి శూలామయాపహః,
పంచగుల్మాన్ పంచకాసాన్ గ్రహణీం చాపి నాశయేత్. 38
ఉగ్రహిక్కాముదావర్తం హన్తి యాప్యగదాపహః,

* తువరిమన్ను.

మండలాన్నాత్ర సందేహో సర్వరోగహరః పరః. 39
రాజయక్ష్మహరస్సాక్షాద్రసోయం సూతిశేఖరః,

తా. శుద్ధిచేసిన రసము, సువర్ణభస్మము, వెలిగారము, శుద్ధిచేసిన వత్సనాభము, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిచేసిన ఉమ్మెత్తవిత్తులు, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, చాతుర్జాతములు, శంఖభస్మము, మారేడుపండులోనిగిజరు, కచ్చూరములు వీనినన్నియు సమముగచేర్చి ఖల్వమునందునిచి గుంటగలగరాకురసముచే నొకదినము మర్దించి గురిగింజలంతమాత్రలుజేసి రెండుగురిగింజలంత తేనెతోగాని నెయ్యితోగాని ౪౦ దినములు పుచ్చుకొనిన అమ్లపిత్తము, శూల, పంచగుల్మములు, పంచకాసలు, గ్రహణీరోగము, భయంకరమగు ఎక్కిళ్లు, ఉదావర్తము, యాప్యరోగములు, సర్వరోగములు, క్షయ ఇవియన్నియు నివర్తించు.

## రసామృతము

త్రికటు త్రిఫలా ముస్తా విడంగం చిత్రకం తథా. 40
ఏషాం సంచూర్ణితానాం తు ప్రత్యేకం తు పలం భవేత్,
కర్షద్వయం గంధకస్య తదర్ధం పారదస్య చ. 41
బిడాలపదమాత్రం తు లిహ్యాత్తన్మధుసర్పిషా,
శీతోదకం చానుపిబేత్క్షీరమార్ద్రవ్యం పయస్తథా. 42
ఆమ్లపిత్తం చాగ్నిమాంద్యం పరిణామరుజం తథా,
కామిలాపాండురోగం చ హన్యాదేతద్రసామృతమ్. 43

తా. త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిడంగము, చిత్రమూలము వీనిని సమముగ ఒకపలమువంతునచేర్చి చూర్ణించి శుద్ధిచేసినగంధకము ౨ కర్షములు, శుద్ధిచేసినపాదరసము ౧ కర్షము వీనినన్నియు నేకముగకలిపి చూర్ణించి యీచూర్ణమును బిడాలపదమాత్రము తేనెతోగాని నేతితోగాని నాకి శీతోదకముగాని లేక ఆవుపాలనుగాని పుచ్చుకొనిన అమ్లపిత్తము, అగ్నిమాంద్యము, పరిణామశూల, కామిల, పాండురోగము, ఇవియన్నియు నివర్తించు.

## ఆమ్లపిత్తమునకు మహాప్రాణేశ్వర రసము

గంధమభ్రం సమం సూతం వారాహీరసమర్దితమ్,
హంసపాదీరసేనాపి మర్దయేత్త్రిదినం మృదు. 44
కాచకూప్యంతరే క్షిప్త్వా తన్ముఖం చ నిరుధ్య చ,
పాచయేద్వాలుకాయంత్రే తథా యామచతుష్టయం. 45
సాంగశీతలమాదాయ మర్దయేదేభిరౌషధైః,

పంచకోలం త్రికక్షారం జీరకద్వయదీప్యకే. 46
మరీచాః పంచలవణం గుగ్గులుశ్చ విషద్వయమ్,
త్రిజాతకం లవంగం చ వరా రాస్నాశ్వగంధికా. 47
జంబీరార్ద్రికభృంగాణాం రసైస్సంమర్దయేత్పృథక్,
సప్తరాత్రం తతో గుంజాప్రమాణం వటకీకృతమ్. 48
తత్తద్రోగానుపానేన సేవయేత్సర్వరోగజిత్,
సన్నిపాతమభిన్యాసం ధనుర్వాతం చ తాంద్రికమ్. 49
కాసశ్వాసాగ్నిమాంద్యాని పాండుకామిలపీనసాన్,
శోఫం గుల్మం తథార్శాంసి క్షయం చ గ్రహణీగదాన్. 50
జ్వరకుష్ఠప్రమేహాంశ్చ నాశయేన్నాత్ర సంశయః,
సర్వేషాం పిత్తరోగాణాం మహాప్రాణేశ్వరో రసః. 51

తా. శుద్ధిజేసినగంధకము, అభ్రికభస్మము, శుద్ధిజేసినరసము వీనిని సమభాగములుగ ఖల్వములోవైచి, నేలతాడిగడ్డ, హంసపాదియాకు వీనిరసములతో మూడుదినములు మెత్తగమర్దించి, గాజుకుప్పెయందునించి దానిముఖమును బంధించి, వాలుకాయంత్రమునందు నాలుగుయామములువుంచి, స్వాంగశీతలమునదీసి అందు పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, సర్జక్షారము, యవక్షారము, వెలిగారము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, ఓమము, మిరియాలు, పంచలవణములు, శుద్ధిజేసిన మహిషాక్షిగుగ్గిలము, శుద్ధిజేసినవాభి, అతివస, లవంగపట్ట, ఏలకులు, లవంగపత్రి, లవంగములు, త్రిఫలములు, సన్నరాస్న, పెన్నేరుగడ్డ వీనిచూర్ణము ప్రతిదానిని రసమునకు సమముగకలిపి, నిమ్మపండ్లు, అల్లము, గుంటగలగర వీనిరసములచే ప్రతిదానితో ౭ దినములు భావనజేసి, గురిగింజలంత మాత్రలుజేసి, అనుపానవిశేషముగ రెండుమాత్రలు పుచ్చుకొనిన సన్నిపాతము, అభిన్యాసము, ధనుర్వాతము, తాంద్రికము, శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, పాండువు, కామిల, పీనస, వాపు, గుల్మము, మూలవ్యాధి, క్షయ, గ్రహణి, జ్వరము, కుష్ఠము, ప్రమేహము, అమ్లపైత్యము మొదలగు సర్వపిత్తములు నివర్తించును.

### జంబీరాదిరసాయనము

జంబీరాణాం రసం ప్రస్థమైలేయం చ శతావరీమ్,
చించాపత్రం చార్ద్రికం చ కూశ్మాండం చాపి ముద్గజమ్, 52
నారికేళోదకం వాసాధాత్రీరంభామహౌషధీః,
నాగరంగం మాతులుంగం ప్రత్యేకం కుడవద్వయమ్. 53

లవంగం నాగరం కన్యాపథ్యాజాజీద్వయం త్రుటీ,
యష్టీతాళీసపత్రం చ జీరకంకణమూలకమ్. 54
కృష్ణా రాస్నా విడంగం చ ఖర్జూరం నాగకేసరమ్,
ఉశీరముత్పలం ద్రాక్షా చందనం నాగవల్కలమ్. 55
ద్విప్రస్థం శర్కరాచైవ ఘృతప్రస్థం వినిక్షిపేత్,
క్షౌద్రప్రస్థం చ విపచేద్భక్షయేచ్చ రసాయనమ్. 56
పిత్తోన్మాదం రక్తపిత్తం కార్శ్యం చాపి వినాశయేత్,
అపస్మారం పాండురోగం పిత్తావరణకామిలే. 57
జిహ్వాస్తంభం నేత్రరోగం మేహవ్యాధివినాశయేత్,
మేధాబుద్ధికరం స్థౌల్యశుక్లవృద్ధికరం తథా. 58
పూజ్యపాదేన కథితం జంబీరాదిరసాయనమ్,

తా. నిమ్మపండ్లరసము ౧ ప్రస్థము, కూతూరుబుడమరసము, పిల్లితేగలరసము చింతాకురసము, అల్లపురసము, బూడిదెగుమ్మడికాయరసము, నల్లపెసరకట్టు, టెంకాయనీళ్లు, అడ్డసరపాకురసము, ఉశిరికెపండ్లరసము, అరటిపండ్లరసము, శొంఠిరసము, నారింజపండ్లరసము, మాదీఫలరసము వీనిని ప్రత్యేకము ౨ కుడుపములు, చక్కెర ౨ ప్రస్థములు, ఆవునెయ్యి ౧ ప్రస్థము వీనినన్నియుఁ చేర్చి రసాయనపాకముగవండి అందు లవంగములు, శొంఠి, సుగంధపాలవేళ్లు, కరక్కాయ, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, యాలకులు, అతిమధురము, తాళిసపత్రి, మోడి, పిప్పళ్లు, దుంపరాస్న, వాయువిడంగములు, ఖర్జూరపండ్లు, నాగకేసరములు, వట్టివేళ్లు, కలువగడ్డలు, ద్రాక్ష, చందనము, లవంగపుచెక్క వీనినన్నియుఁ ప్రత్యేకము పలము వంతున చూర్ణించివైచి, రసాయనపాకముగవండిదించి ౧ ప్రస్థము తేనెచేర్చి సేవించిన పిత్తోన్మాదము, రక్తపైత్యము, కృశత్వము, అపస్మారము, పాండురోగము, పిత్తావరణము, కామిల, జిహ్వాస్తంభము, నేత్రరోగము, మేహవ్యాధి వీనిని నశింపఁజేయుటయేగాక, మేధ, బుద్ధి, శరీరపుష్టి, శుక్లవృద్ధి వీనిని గలుగంజేయు.

## మహాఖండార్ద్రికము

నిస్త్వచం చార్ద్రికం సూక్ష్మశకలాని చ కారయేత్. 59
తేషాం పలశతం గ్రాహ్యం ద్విప్రస్థే గోఘృతే పచేత్,
యావత్పాటలవర్ణం స్యాత్తావదాదాయ బుద్ధిమాన్. 60
ఖండోవాపి గుడశ్చైవ శర్కరా వా తదర్ధకా,
యష్టీమాగధికామూలం మరిచం వంశరోచనా. 61

వరాళం ధనీకాజాజీలవంగం పత్రకేసరే,
జాతీఫలం తృటీశుంఠీమాంసీ ఖదిరచందనే. 62
చిత్రకోశీరధాత్ర్యశ్చవృద్ధిరేషాం క్రమాత్తతః,
బాణవేదాగ్నినేత్రేందుసంఖ్యయాచపలం క్షిపేత్. 63
వృష్యం బృంహణమామఘ్నం పాండుశూలజ్వరాపహమ్,
శోఫకామిలకాసఘ్నం శ్వాసపీనసగుల్మనుత్. 64
అగ్నిదీపనమన్నేచ్ఛాం కరోత్యఖిలరోగజిత్,
మహాఖండార్ద్రికం నామ ధన్వంతరిముఖోదితమ్. 65

తా॥ పొట్టుతీసినఅల్లము ౧౦౦ పలములు చిన్నఖండములుగాజేసి అందు ఆవునెయ్యి ౪౦ పలములు వైచి వీనిని గౌరవర్ణమగుపర్యంతను వేయించి, పిదప కలకండ లేక పాతబెల్లము లేక చక్కెర ౨౦ పలములువైచి కలిపి, అందు అతిమధురము, పిప్పళ్లు, మోడి, మిరియాలు ఇవి * ప్రత్యేకము ౫ పలములు, వెదురుప్పు, తాళిసపత్రి, ధనియాలు, జీలకఱ్ఱ ఇవిప్రత్యేకము ౪ పలములు, లవంగములు, ఆకుపత్రి, నాగకేసరములు, జాజికాయ ఇవిప్రత్యేకము 3 పలములు, ఏలకులు, శొంఠి, జటామాంసి, చంద్రచావ ఇవిప్రత్యేకము ౨ పలములు, శ్రీగంధము, చిత్రమూలము, వట్టివేళ్లు, ఉశిరికెవొలుపు ఇవి ప్రత్యేకము ౧ పలము వీనినన్నిటిని చూర్ణించివైచి కలియబెట్టిదించిన నిది ఘృతమిశ్రమగు నొక చూర్ణరూపముగ గనుపడును. దీనిని, ప్రాతస్సాయంకాలములయందు తులము చొప్పున సేవించిన, ఆమము, పాండువు, శూల, జ్వరము, వాపు, కామిల, దగ్గు, ఉబ్బసము, పీనస, గుల్మము, సర్వరోగములు, పిత్తము వీనిని నివర్తింపంజేయుటయేగాక, వృష్యము, బృంహణమునై, అగ్నిదీప్తి, అన్నమునందలియిచ్ఛ వీనిని గలుగంజేయు. ఇది ధన్వంతరిచే వచింపబడిన మహాఖండార్ద్రిక రసాయనమనంబడు.

### ఖండపిప్పలికాదిలేహ్యము

పిప్పల్యాః కుడవం చూర్ణం ఘృతస్య కుడవద్వయమ్,
పలషోడశకం ఖండాచ్ఛతావర్యాః పలాష్టకమ్. 66
శివాయాస్స్వరసస్యాపి పలషోడశకం మతమ్,
క్షీరప్రస్థద్వయే పక్త్వా లేహీభూతేత్ర నిక్షిపేత్. 67
త్రిజాతకాభయాజాజీ ధాన్యముస్తాశివాతుగాః,
ఏతేషాం కార్షికం చూర్ణం కర్షార్ధం కృష్ణజీరకమ్. 68

* ఈభాగకల్పన సంప్రదాయసిద్ధమైనదని యెరుగవలెను.

నాగరం నాగకం జాతీఫలం సమరిచం హిమమ్,
దత్వా ఫలత్రయం క్షౌద్రం స్నిగ్ధభాండే వినిక్షిపేత్. 69
ప్రాతర్యథాబలం లిహ్యాదమ్లపిత్తప్రశాన్తయే,
హృల్లాసారోచకచ్ఛర్దిపిపాసాదాహనాశనమ్. 70

తా. పిప్పలిచూర్ణము ౪ పలములు, నెయ్యి ౭ పలములు, కలకండ పొడి ౧౬ పలములు, చల్లపిల్లిగడ్డలచూర్ణము ౭ పలములు, ఉశిరికెపండ్లరసము ౧౬ పలములు, ఆవుపాలు ౨ ప్రస్థములు వీనినన్నియునేకముగచేర్చి లేహ్యపాకముగ వండి, అందు లవంగచెక్క, ఏలకులు, లవంగపత్రి, కరక, జీలకఱ్ఱ, ధనియాలు, తుంగముస్తలు, ఉశిరికెవొలుపు, వెదురుప్పు వీనిని ప్రత్యేకము ౧ కర్షము, నల్లజీలకఱ్ఱ, శొంఠి, నాగకేసరములు, జాజికాయ, మిరియాలు, పచ్చకర్పూరము వీనిని ప్రత్యేకము అర్ధకర్షము వైచి వీనినన్నిటిని కలిపి దించి తేనె ౪ పలములుచేర్చి, స్నిగ్ధ భాండమునందునిచి, ప్రాతఃకాలమున సేవించిన అమ్లపిత్తము, హృల్లాసము, అరుచి, వాంతి, దప్పి, తాపము ఇవి నివర్తించు.

## నారికేళఖండపాకము

కుడవమితమిహ స్యాన్నారికేళం సుపిష్టం పలపరిమితసర్పిః పాచితం తుల్యఖండమ్,
నిజబలఇదమేతత్ప్రస్థమాత్రే విపక్వం గుడవదథ సుశీతే శాణమాత్రం క్షిపేచ్చ. 71
ధాన్యాకపిప్పలిపయోదతుగాద్విజీరైస్సాకం త్రిజాతమిభకేశర కంవిచూర్ణ్య,
హన్త్యమ్లపిత్తమరుచిం క్షయమస్రపిత్తం శూలం వమిం సకల పౌరుషకారి పుంసామ్. 72

తా. నాలుగుపలముల కొబ్బెరనునూరి, పలమాత్రము నెయ్యివైచి వేయించి సమముగ కలకండచేర్చి అందు టెంకాయనీళ్లను ౧ ప్రస్థమువైచి, గుడపాకముగ వండి చల్లార్చి అందు ధనియాలు, పిప్పళ్ళు, తుంగముస్తలు, తవక్షీరి, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, లవంగచెక్క, యాలకులు, లవంగపత్రి, నాగకేసరములు ఇవి ప్రత్యేకము ౧ శాణమువంతున చూర్ణించివైచి కలియబెట్టి, స్నిగ్ధభాండమునందునుచుకొని సేవించిన అమ్లపిత్తము, అరుచి, క్షయ, రక్తపిత్తము, శూల,వాంతి వీనిని నివర్తింపం జేయుటయేక, ధాతువృద్ధిని గలుగంజేయు.

## ద్రాక్షాదిగుటికలు

ద్రాక్షాపథ్యే సమే కృత్వా తయోస్తుల్యాం సితాం క్షిపేత్,
సంకుట్యాక్షద్వయమితాం వటికాం కారయేద్భిషక్. 73
తాం ఖాదేదమ్లపిత్తార్తో హృత్కంఠదహనాపహామ్,
తన్మూర్ఛాభ్రమమందాగ్నినాశినీం చామవాతహామ్. 74

తా. ద్రాక్ష, కరక్కాయ, ఇవి సమభాగములు, వీనికి సమముగ చక్కెర వైచినూరి, రెండుఅక్షములమాత్రము, వటికలుజేసి భక్షించిన, అమ్లపిత్తము, హృదయము, కంఠము, వీనియందలి మంట, దప్పి, గొప్పమూర్ఛ, భ్రమము, మందాగ్ని, ఆమవాతము ఇవి నివర్తించు.

## శతావరీఘృతము

శతావరీమూలకల్కే ఘృతప్రస్థం పయస్సమమ్,
పచేన్మృద్వగ్నినా సమ్యక్ క్షీరం దత్వా చతుర్గుణమ్. 75
నాశయేదమ్లపిత్తం చ వాతపిత్తోద్భవాన్ గదాన్,
రక్తపిత్తం తృషాం మూర్ఛాం శ్వాసం సంతాపమేవ చ. 76

తా. నీరుపుష్టము, పిల్లపీచరదుంపలకల్కము ౧ ప్రస్థము, ఆవునెయ్యి ౧ ప్రస్థము, మంచి ఆవుపాలు నాలుగుప్రస్థములు వీనిని నేకముగజేర్చి ఘృతపక్వముగకాచి, ప్రాతఃకాలమున పుచ్చుకొనిన, అమ్లపిత్తము, వాతపిత్తరోగములు, రక్తపిత్తము, దప్పి, మూర్ఛ, శ్వాస, సన్తాపము ఇవి నివర్తించు.

## ద్రాక్షాదిఘృతము

ద్రాక్షాభయాశక్రపటోలపత్రైస్సోశీరధాత్రీయవచందనైశ్చ,
త్రాయన్తికాపద్మకిరాతధాన్యైః కల్కైః పచేత్సర్పిరుపేతమేభిః 77
భుంజీతమాత్రాం సహభోజనేన సర్వంతు పానే హ్యమృతోపమంచ,

తా. ద్రాక్ష, కరక, కొడిశపాల, చేదుపొట్ల ఆకు, వట్టివేళ్లు, ఉశిరికెవొలుపు, యవలు, చందనము, కలుగ్రాణుగ, తామరకాడలు, సీమనేలవేము, ధనియాలు, వీనిని కల్కముజేసి, అందు నెయ్యిచేర్చి ఘృతపక్వముగవండి, భోజన మధ్యమునందు సేవించిన, అమృతతుల్యముగ నుండుటయేగాక, అమ్లపిత్తము నివర్తించు.

## అమ్లపిత్తపథ్యములు

యవగోధూమముద్గాశ్చ పురాణా రక్తశాలయః. 78
జలాని తప్తశీతాని శర్కరామధుసక్తవః,

కర్కోటకం కారవేల్లం రంభాపుష్పం చ వాస్తుకమ్. 79
వేత్రాగ్రం వృద్ధకూష్మాండం పటోలం దాడిమం తథా,
పానాన్నాని సమస్తాని కఫపిత్తహరాణి చ. 80
అమ్లపిత్తామయే నిత్యం సేవితవ్యాని మానవైః,

తా. యవలు, గోధుమలు, పెసలు, పాతయొఱ్ఱవడ్లబియ్యము, కాచిచల్లార్చిన నీళ్లు, శర్కర, తేనె, పేలపిండి, చేదుదోసకాయ, కాకరకాయ, అరటిపువ్వు, వాస్తువమను శాకభేదము, ప్రబ్బలిమొలకలు, ముదురుగుమ్మడికాయ, పొట్లకాయ, దాడింబపండు, కఫపిత్తనివర్తకములగు అన్నపానాదులు, ఇవి అమ్లపిత్తరోగమునందు పథ్యములు.

## అపథ్యములు

వమివేగం తిలామ్లాసికుళుత్థాధికభక్షణమ్. 81
అవిదుగ్ధం చ ధాన్యామ్లం లవణామ్లకటూని చ,
గుర్వన్నం దధిమద్యం చ వర్జయేదమ్లపిత్తవాన్. 82

తా. వమనవేగము, నువ్వులు, పులుసువస్తువులు, ఉలవలు, ఇవి యెక్కువగా దినుట, గొఱ్ఱెపాలు, ధాన్యామ్లము, ఉప్పు, పులుసు, కారము, గురుకరమగు అన్నము, పెరుగు, మద్యము వీనిని అమ్లపిత్తరోగి విడువవలయును.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక
సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్య
విద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్రకంఠవల్లభా
చార్యవిరచిత, వైద్యచింతామణౌ, వాతరక్త, ఊరుస్తంభ,
ఆమవాత, శీతపిత్త, అమ్లపిత్తరోగప్రకరణంనామ
త్రయోదశో విలాసః.

---

# అజీర్ణప్రకరణమ్.

## అగ్నిమాంద్య కర్మవిపాకము

మందోదరాగ్నిర్భవతి సతి ద్రవ్యేన నిత్యకృత్,
ప్రాజాపత్యత్రయం కృత్వా భోజయేత్సశతం ద్విజాన్. 1

తా. ద్రవ్యముగలిగియుండియు, వైశ్వదేవాది నిత్యకృత్యములం జేయుని మను

జునికి, అగ్నిమాంద్యరోగముజనించు. అది నివర్తించుటకై ప్రాజాపత్యకృచ్ఛ్రత్రయ ములంజేసి నూరుగురు బ్రాహ్మణులకు, అన్నంబిడవలయు.

పారాశర్యాభిప్రాయము

గోమాంసభక్షకో మందజఠరాగ్నిర్భవేన్నరః,
ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్రమతికృచ్ఛ్రం తథైవ చ. 2
అగ్నిమంత్రం జపేన్నిత్యం శ్రీసూక్తంచ విచక్షణః,

తా. గోమాంసమును భక్షించినవానికి, అగ్నిమాంద్యరోగము జనించు. తన్నివారణకై ప్రాజాపత్యకృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, వీనినింజేసి (అగ్నిరస్మీతి) అను మంత్రమును, శ్రీసూక్తమును, జపించవలయు.

కర్మవిపాకసంగ్రహము

అకారణం గరం దత్వా ప్రమారయతి యః పునః. 3
సమందాగ్నిర్భవేదేవ మృతకల్పశ్చ జాయతే,
యాతే రుద్రేణ సూక్తేన చరుం చ జుహుయాద్ఘృతమ్. 4
అష్టోత్తరశతం సమ్యక్ తత్పాపస్యాపనుత్తయే,
తామగ్నివర్ణామితి చ జపేత్సూక్తం సహస్రకమ్. 5
భోజయేద్బ్రాహ్మణాన్ సమ్యక్చత్వారింశత్సుధీ భవేత్,

తా. నిష్కారణముగ నొకనికి విషము బెట్టిజంపినవాడు, అగ్నిమాంద్య రోగముగలవాడై మృతసమానుడుగ జనించుగాన (యాతేరుద్ర, అనుసూక్తముచే) చర్వాజ్యములతో అష్టోత్తరశతహోమమునుంజేసి, పిదప (తామగ్నివర్ణాం) అను ఋక్కును వెయ్యిమార్లుజపించి, నలుబదిబ్రాహ్మణులకు భోజనంబిడిన తద్దోషము నివర్తించు.

జఠరాగ్నిచాతుర్విధ్యము

మందస్తీక్ష్ణోఽథవిషమస్సమశ్చేతి చతుర్విధః. 6
కఫపిత్తానిలాధిక్యాత్తత్సామ్యాజ్జాఠరోఽనలః,

తా. కఫాధిక్యమువలన మాంద్యావస్థగల మందాగ్నియనియు, పిత్తాధిక్యము వలన, తీక్ష్ణావస్థగల తీక్ష్ణాగ్నియనియు, వాతాధిక్యమువలన, విషమావస్థగల విషమాగ్ని యనియు, ఈమూటియొక్క సమత్వమువలన, సమావస్థగలసమాగ్నియనియు, ఇటుల జాఠరాగ్నికినాలుగు అవస్థలవలన నాలుగుపేరులుగలవని యెరుంగవలయు.

అగ్నిమాంద్యస్వరూపము

విషమో వాతజాన్ రోగాన్ తీక్ష్ణః పిత్తనిమిత్తజాన్. 7

కరోత్యగ్ని_స్తథా మందో వికారాన్కఫసంభవాన్,

తా. విషమాగ్ని, వాతమువలన జనించు ౮౦ వాతరోగములను ఇతరములుగ నుండు సామాన్యరోగములనుగాని, జ్వరాతిసారాదికమునుగాని గలుంజేయు తీక్ష్ణాగ్ని పిత్తమువలన జనించు ౪౦ రోగములలో ఓష, చోషాదిరోగములలో దేనినైనను గలుగంజేయు. మరియు మందాగ్ని, కఫమువలన జనించు ౨౦ రోగములలో అల స్యాదికరోగములను గలుగంజేయు.

సమాగ్న్యాదిలక్షణము

సమా సమాగ్నే రశితామాత్రా సమ్యగ్విపచ్యతే. 8
స్వల్పాపినైవ మందాగ్నే ర్విషమాగ్నే స్తు దేహినః,
కదాచిత్పచ్యతే సమ్యక్కదాచిన్న విపచ్యతే. 9
మాత్రాతిమాత్రాప్యశితా సుఖం యస్య విపచ్యతే,
తీక్ష్ణాగ్నిరితి తం విద్యాత్సమాగ్నిశ్శ్రేష్ఠ ఉచ్యతే. 10

తా. సమాగ్నియందు సమానమాత్రగా భక్షించిన అన్నాదులు బాగుగ పచనంబగు, మందాగ్నియందు స్వల్పముగ భక్షించినను పక్వముగాక యుండు, విష మాగ్నియందొకప్పుడు భక్షించిన బాగుగపచనంబై మరియొకపుడు పచనముగాక యుండు. తీక్ష్ణాగ్నియందు మిక్కుటముగ భక్షించినను, వేగముగ పచనంబగు, గావున సర్వాగ్నులలో సమాగ్నియే శ్రేష్ఠంబుగనుండు (భస్మకమునునగ్ని తీక్ష్ణాగ్నికి వ్యతి రిక్తము. మిక్కలి తీక్ష్ణాగ్నియే భస్మమను పేరవిలసిల్లునని చరకమునందు జెప్పంబడియె.) ఆదెటులనిన.

భస్మక లక్షణము

నరే క్షీణకఫే పిత్తం కుపితం మారుతానుగమ్,
స్వోష్మణా పాచకస్థానే బలమగ్నేః ప్రయచ్ఛతి. 11
తదా లబ్ధబలో దేహం రూక్షయేత్సానిలోనలః,
అభిభూయ పచత్యన్నం తైక్ష్ణ్యాదాశు ముహుర్ముహుః. 12
పక్త్వాన్నం సతతో ధాతూన్ శోణితాదీన్పచత్యపి,
తతో దౌర్బల్యమాతంకం మృత్యుం చోపానయేత్పరమ్. 13
భుక్తే న్నే లభతే శాంతిం జీర్ణమాత్రే ప్రతామ్యతి,
తృట్స్వేదదాహమోహాస్స్యుర్వ్యాధయోత్యగ్నిసంభవాః. 14

తా. మనుజునికి కఫముక్షయించుటవలన పిత్తముప్రకోపించి, వాతముతో గలసి, తనవేడిమిచే పాచస్థానముమజేరిన అగ్నికి బలమునుగలుగ జేయుచుండ, ఆ

యగ్ని వాతసహాయముువలన బలిష్టమైనదై, శరీరమునకు వేడిమినిగలుగం జేయును.మరియు, అగ్ని వేగమువలన భక్షించినయాహారమును శీఘ్రముగపక్వమునుంజేసి పిదప, రక్తాది ధాతువులసహితము మాటిమాటికి దహింపుచుండుగాన, సత్వహాని, అనేకరోగములు తుదికిమరణము, ఇవి గలుగు. మరియు, నాహారము పక్వమైనతోడనే మరల భుజించిన, అప్యాయకరముగనుండు. అన్నముజీర్ణించినతోడనే, మూర్ఛనుజెందు, ఈయత్యగ్నివలన, దప్పి, దగ్గు, దాహము, మోహము ఇవి గలుగు (దీనినే, తీక్ష్ణాగ్ని యనియెదరు.)

ఆధ్మానం శిరసో జాడ్యం స్తైమిత్యం ఛర్ద్యరోచకే,
ఆలస్యమాస్యవైవర్ణ్యం సర్వం చైవాగ్నిమాంద్యజమ్. 15

తా. కడుపుబ్బరము, తలనొప్పి,శరీరము మొద్దుబారియుండుట, వాంతి,అరుచి, ఆలస్యము, ముఖవివర్ణత్వము ఈలక్షణములన్నియు అగ్నిమాంద్యమువలన జనించునని యెరుంగవలయు.

### అజీర్ణభేదములు

ఆమం విదగ్ధం విష్టబ్ధం కఫపిత్తానిలైస్త్రిభిః,
అజీర్ణం కేచిదిచ్ఛంతి చతుర్థం రసశేషతః. 16
అజీర్ణం పంచమం కేచిన్నిర్దోషం దినపాకి చ,
వదంతి షష్ఠం చాజీర్ణం ప్రాకృతం ప్రతివాసరమ్. 17

తా. కఫము, పిత్తము, వాతము, వీనివలన, వరుసగా ఆమాజీర్ణము, దగ్ధాజీర్ణము విష్టబ్ధాజీర్ణము అని మూడువిధంబులుగ జనించు. మరియు భుజించిన, ఆహారరసశేషములవలన, నాలవయజీర్ణముజనించునని కొందరు వచించెదరు. ఒక రాత్రింబగళ్లయందు పచనమగునపుడు, కడుపుఉబ్బరము మొదలగునవి లేకయుండిన, అయిదవ అజీర్ణమని, కొందరువచించెదరు. మరియు, ప్రతిదినము, స్వాభావికముగ, అనగా వికృతజన్యముగాకయుండునది, ఆరవ అజీర్ణమని, కొందరువచించెదరు. భుజించిన యన్నముపచనంబగుటకు, సుశ్రుతమునందు జెప్పంబడియుండెడి, కొన్ని ఆచారములను, ప్రతిరోజుదప్పకనాచరించవలయునని దెలిసికొనునిమిత్తము, ఆరవయజీర్ణము జెప్పంబడియె. అవి ఎవ్వియనిన శ్లో॥ భుక్త్వాశతపథంగచ్ఛే ద్వామపార్శ్వేనసంవిశేత్। శబ్దరూపరసస్పర్శగంధాంశ్చమనసఃప్రియాన్ । భుక్త్వానుపసేవేతతేనాన్నంసాధుతిష్ఠతి ॥ అనగా, భోజనముజేసిన పిపద, 100 అడుగులదూరము నడచి, పిదప యెడమపార్శ్వముగ శయనించుట, మనస్సునకుయిష్టమగు, శబ్ద, స్పర్శగంధాదులను సేవించుట, వీనిచే, అన్నము, బాగుగపచనంబగు.

అజీర్ణమునకు కారణము

అత్యంబుపానాద్విషమాశనాచ్చ సంధారణాత్స్వప్నవిపర్యయాచ్చ,
కాలేపి సాత్మ్యం లఘు చాపి భుక్తమన్నం న పాకం భజతే నరస్య. 18
ఈర్ష్యాభయక్రోధపరిక్షితేన లుబ్ధేన శుగ్దైన్యనిపీడితేన,
ప్రద్వేషయుక్తేన చ సేవ్యమానమన్నం న సమ్యక్పరిపాకమేతి. 19

తా. మిగుల ఉదకపానము జేయుట, అకాలమునందుభోజనము జేయుట, మలమూత్రాదివేగములనడ్డగించుట, పవటియందునిద్రించుట, రాత్రిమేల్కొనుట ఇట్టి కారణములవలన, భోజనకాలమునందు, స్నిగ్ధోష్ణాదియుక్తంబై, శరీరప్రకృతికి అనుగుణ్యంబై, చులకనగనుండు అన్నముభుజించినను, బాగుగపచనము జెందకుండు. మఱియు ఈర్ష్య, భయము, క్రోధముపీనియొక్క వ్యాప్తివలన, లోభము, శోకము, దైన్యము, వీనియొక్కపీడవలన, శోధయుక్తుడుగనుండువాడు, భక్షించిన అన్నము, బాగుగపచనము గాకయుండు. (మరియు ఈర్ష్య, భయ, క్రోధాదులు, మానసిక దోషాజీర్ణవిషయమై జెప్పంబడియున్నవని,) కొందరు వచించెదరు.

ఆమాజీర్ణలక్షణము

తత్రామే గురుతోత్క్లేదశోథో గండాక్షికూటగః,
ఉద్గారశ్చ యథాభుక్తమవిదగ్ధః ప్రవర్తతే. 20

తా. శరీరమునందుబరువు, ఉత్క్లేదము, చెక్కిళ్లు నేత్రములు వీనియందు వాపు, భోజనముజేసినవానివలె తేనుపులు, ఇట్టి లక్షణములుగలది, ఆమాజీర్ణమని యెఱుంగవలయు.

విదగ్ధాజీర్ణలక్షణము

విదగ్ధే భ్రమతృణ్మూర్ఛాః పిత్తాచ్చ వివిధా రుజః,
ఉద్గారశ్చ సధూమామ్లః స్వేదో దాహశ్చ జాయతే. 21

తా. భ్రమ, దప్పి, మూర్ఛ, పిత్తమువలన నానావిధఓషాచోషాదికపీడ, ధూమయుక్తముగ పులుసుగ తేనుపులు, శరీరమునందుచెమట, దాహము, ఇట్టి లక్షణములుగలది, విదగ్ధాజీర్ణమని యెఱుంగవలయు.

విష్టబ్ధాజీర్ణలక్షణము

విష్టబ్ధే శూలమాధ్మానం వివిధా వాతవేదనాః,
మలవాతాప్రవృత్తిశ్చ స్తంభో మోహోఽంగపీడనమ్. 22

తా. శూల, కడుపుబ్బరము, పలువిధములగు తోదభేదాది రూపవాతవేదనలు,

మలము వాతము ఇవి బంధించుట, శరీర స్తంభన, మోహము, అంగపీడ, ఇట్టి లక్షణములుగలది, విష్టబ్ధాజీర్ణమని యెఱుంగవలయు.

రసశేషాజీర్ణలక్షణము

రసశేషేన్నవిద్వేషో హృదయాశుద్ధిగౌరవైః,

తా. అన్నద్వేషము, హృదయమునందు, అస్వస్థత, శరీరగురుత్వము, ఇవి గలది, రసశేషాజీర్ణమని యెఱుంగవలయు.

ప్రకారాంతరమున వాతాజీర్ణలక్షణము

విష్టంభో వమనం భ్రాంతిర్హృద్దాహః పూతిగంధితా. 23
ముఖే శోష స్తృషా ర్తిశ్చ వాతాజీర్ణస్య లక్షణమ్,

తా. మలబద్ధము, వాంతి, భ్రమ, రొమ్ముమందుమంట, ముఖమునందు దుర్గంధము, శోష, దప్పి, పీడ ఇవి గలిగిన, వాతాజీర్ణమని యెఱుగవలయు.

పిత్తాజీర్ణలక్షణము

రేచనం జఠరేశూలం వమనం చ ముహుర్ముహుః. 24
హస్తపాదాతిసంకోచః పైత్తాజీర్ణస్య లక్షణమ్,

తా. విరేచనము, కడుపుయందుశూల, పలుమారువాంతి, హస్తపాదముల యందు సంకోచము, ఇవి గలిగిన పిత్తాజీర్ణమని యెఱుంగవలయు.

శ్లేష్మాజీర్ణలక్షణము

వాంతిర్భ్రాంతిర్ముఖే స్వేదో జడతా శీతతా తథా. 25
కాష్ఠవజ్జాయతే దేహః కఫాజీర్ణస్య లక్షణమ్,

తా. వాంతి, భ్రమ, ముఖమునందుచెమట, జడత్వము, శీతలత్వము, శరీరము కట్టెలవలె నుండుట ఇట్టి లక్షణములుగలది, శ్లేష్మాజీర్ణమని యెఱుంగవలయు.

అజీర్ణోపద్రవములు

మూర్ఛాప్రలాపో వమథుః ప్రసేకస్సదనం భ్రమః. 26
ఉపద్రవా భవంత్యేతే మరణం చాప్యజీర్ణతః,

తా. అజీర్ణమునమూర్ఛ, విరుద్ధసంభాషణ, వాంతి, నోటియందునీరూరట, శరీరశైథిల్యము, బడలిక, ఇట్టి యుపద్రవములుగలిగియుండుట. మరియు, అజీర్ణము మిగుల ప్రకోపించుటవలన, మరణము సగా గలుగు.

అజీర్ణమునకు ముఖ్యకారణము

అనాత్మవంతః పశువద్భుంజంతే యేఽప్రమాణతః. 27

రోగానీకస్య తే మూలమజీర్ణం ప్రాప్నువంతి హి,

తా. మిగుల ఆశచే జ్ఞానశూన్యుడై పశువువలె మిగుల భుజించుటవలన, అన్ని రోగములకు మూలమగు అజీర్ణరోగము జనించు.

—విషూచీలక్షణము—

వివిధై ర్వేదనాభేదై ర్వాయుర్వై భృశకోపితః. 28
సూచీభిరివ గాత్రాణి విధ్యతీతి విషూచికా,

తా. వాతము, మిక్కుటముగ ప్రకోపించుటవలన, పలువిధవేదనా భేదములు గలిగి, సూదులతో బొడుచునటుల, శరీరమును భేదించునది, విషూచియని తెలిసికొనవలయు.

—వాతవిషూచీలక్షణము—

తత్ర శూలభ్రమానాహ కంపస్తంభాదయోనిలాత్. 29

తా. కడునొప్పి, భ్రమ, కడుపుబ్బరము, శరీరమునందువణుకు, శరీరస్తంభనము, ఇట్టి లక్షణములుగలది, వాతవిషూచియని తెలిసికొనవలయు.

—పిత్తవిషూచీలక్షణము—

పిత్తాజ్జ్వరోతిసారశ్చ తంద్రాతృట్ప్రలాపాదయః,

తా. జ్వరము, అతిసారము, తంద్ర, దప్పి, పదరుట, ఇట్టి లక్షణములుగలది, పిత్తవిషూచియని తెలిసికొనవలయు.

—శ్లేష్మవిషూచీలక్షణము పార్ష్ణిదాహచికిత్స—

కఫాచ్ఛర్ద్యంగగురుతావాక్సంగష్ఠీవనాదయః. 30
విషూచ్యామతివృద్ధాయాం పార్ష్ణిదాహః ప్రశస్యతే,
సదాహశ్చాపదాచ్చైనం విధివచ్చోపచారయేత్. 31

తా. వమనమగుట, శరీరము బరువుగనుండుట, నోరుబంధింపబడి మాటలాడుటకు శక్తిలేకయుండుట, నోటజొల్లుకారుట, ఇట్టి లక్షణములుగలది శ్లేష్మవిషూచియని తెలిసికొనవలయు. మరియు, విషూచిమిక్కుటముగ వృద్ధిజెందిన, మడిమలు మొదలు పాదములవరకువాతవేసి, యథావిధిగ చికిత్సంజేయవలయు.

—విషూచ్యుపద్రవములు—

నిద్రానాశో రతిః కంపో మూత్రాఘాతో విసంజ్ఞతా,
అమీ ఉపద్రవా ఘోరా విషూచ్యాం పంచ దారుణాః. 32

తా. నిద్రాభంగము, ఏవిషయార్థమునందిచ్ఛలేకయుండుట, వణుకు, మూత్ర

ప్రతిబంధము, మూర్ఛ, అనునీయైదును విషూచియందు దారుణోపద్రవములని తెలిసికొనవలయు.

అసాధ్యవిషూచీలక్షణము

శూలం వి రేకవమనమానాహ స్తృట్చ తాపసమ్,
విషూచ్యాం షట్ప్రకారేణ మృత్యు రేవ న సంశయః. 33

తా. పైజెప్పబడిన, విషూచీరోగములలో, శూల, విరేచనము, వాంతి, కడుపుబ్బరము, దప్పి, తాపము, అనునీయారు ఉపద్రవములుగలిగియుండిన, నిశ్చయముగ మరణమునుజెందు.

రసనదంతనఖాధరకృష్ణతానయనమజ్జనకంపమతిక్షయాః,
శ్రుతి వినాశనకంశిథిలాంగతామరణకారణమేతి విషూచికామ్. 34

తా. నాలుక, దంతములు, గోళ్లు, పెదవులు, ఇవి నలుపుబారియుండుట, నేత్రములుగుంటలుబడియుండుట, శరీరమువణుకుట, చెవుడు, స్మృతిదప్పియుండుట, అవయవములు శిథిలములుగనుండుట, ఇట్టి లక్షణములు విషూచిరోగమున మరణమును గలుగంజేయునవియని తెలియవలయు.

అలసకలక్షణము

కుక్షిరానహ్యతేత్యర్థం ప్రతామ్యేత్పరికూజతి,
నిరుద్ధో మారుతశ్చైవం కుక్షావుపరి ధావతి. 35
వాతవర్చోనిరోధశ్చ యస్యాత్యర్థం భవేదపి,
తస్యాలసకమాచష్టే తృష్ణోద్గారా తు యస్య చ. 36

తా. మిక్కిలికడుపుబ్బరము, మోహము, దీనమగుశబ్దము గలుగుట, అజీర్ణమువలన వాతము అధోముఖనిరోధముగలదై హృదయకంఠాదులయందు సంచరించుట, వాతము, మలము, మిక్కిలి బంధింపబడుట, దప్పి, తేనుపులు, ఇట్టి లక్షణములుగలది, అలసకరోగమని యెరుంగవలయు.

దండాలసకలక్షణము

వాయుః కంపభ్రమానాహ శూలాదీన్ప్రకరోతి చ,
పిత్తం జ్వరాతిసారౌ చ దాహాదీన్వేదనాని చ. 37
శ్లేష్మాంగగురుతా ఛర్ది ర్వాక్సంగ ష్ఠీవనాని చ,
క్షుద్బాన్తే లసకేదోషాశ్ఛర్ద్యతీసార వర్జితాః. 38
కారకా స్తీవ్రశూలా దేసోన్నితసస్సన్నిరోధకాః,

తిర్యగ్వాతా_స్తనుం _స్తబ్ధా దండవ_త్తస్సంభయంతి చ. 39
సదండాలసకస్త్యాజ్యః శీఘ్రం దేహవినాశకృత్,

తా. అలసకరోగమునందు, వాతమువలన, వణుకు, భ్రమ, కడుపుబ్బరము, శూల, మొదలగునవి జనించు, పి_త్తమువలన జ్వరము, అతిసారము, తాపము మొదలగునవి, చెమట, ఇవిజనించు, శ్లేష్మమువలన, శరీరజడత్వము వాంతి, వాగ్బంధనము, నోటజొల్లు ఇవి జనించు. మరియు, అలసకరోగమునందు క్షుబ్ధములగు వాతాది దోషములు, వాంతి, అతిసారము, ఇవిలేకనే, శూలాదులనుగలుగంజేయుచు నాడీ మార్గములను నిరోధించి, తిర్యగ్గమనముగలవై, దేహమును, దండమువలె, స్తంభింపజేయుగాన, దానిని, దండాలసకమనివచించెదరు. ఆ దండాలసకము, శీఘ్రముగ శరీరమును నశింపచేయుగాన, వైద్యులచే విడువందగు.

### విలంబికాలక్షణము

దుష్టం తుభు_క్తం కఫమారుతాభ్యాం ప్రవ_ర్తతే నోర్ధ్వమధశ్చయస్యామ్.
విలంబికాంతాంభృశదుశ్చికిత్స్యామాచక్షతే శాస్త్రవిదఃపురాణాః,

తా. కఫవాతములవలన, భుజించినయన్నము, దుష్టంబై, ఊర్ధ్వముగ గాని లేక అధోమార్గముగగాని వెడలకుండిన, విలంబికయని తెలిసికొనవలయు. దీనిని ఆయుర్వేదవే_త్తలు, అసాధ్యమని వచించెదరు.

### అసాధ్యవిషూచీ అలసక లక్షణము.

యశ్శ్యావదంతోష్ఠనఖోల్పసంజ్ఞోవమ్యర్దితోఽభ్యంతరయాతనేత్రః.
క్షామస్వరస్సర్వవిము_క్తసంధిర్యాయాన్నరోఽసౌపునరాగమాయ,

తా. దంతము, పెదవి, గోళ్లు, ఇవి నల్లనగుట, కొంచెము తెలివిగలిగియుండుట, వాంతి, నేత్రములు లోనికేగుట, హీనస్వరముకలుగుట, సర్వసంధులు శైధిల్యమును జెందుట, ఇట్టి లక్షణములుగల విషూచి, అలసక, రోగములుగల మనుజులు, మృతిని జెందెదరు.

### అగ్నిముఖరసము

సూతం గంధం విషం తుల్యం మర్దయేదార్ద్రిక ద్రవైః 42
అశ్వత్థచించాపామార్గక్షారాఃక్షారౌ చ టంకణమ్,
జాతీఫలం లవంగం చ త్రికటు త్రిఫలాసమమ్. 43
శంఖక్షారం పంచభాగం హింగు జీరం ద్విభాగకమ్,
మర్దయేదమ్లయోగేన గుంజామాత్రా వటీ కృతా. 44

పాచనీ దీపనీ సద్యోఽజీర్ణశూలవిషూచికాః,
హిక్కాం గుల్మం చోదరం చ నాశయేన్నాత్ర సంశయః. 45
రసేంద్ర సంహితాయాం చ నామ్నా వహ్నిముఖో రసః,

తా. శుద్ధిజేసినరసము, గంధకము, నాభి, వీనిని సమముగ ఖల్వమునందునిచి, అల్లపురసముచే మర్దించి, పిదప, రావి, చింత, ఉత్తరేణు, వీనిక్షారములు, యవక్షారము, సర్జక్షారము, వెలిగారము, జాజికాయలు, లవంగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉశిరికెలు, ఇవి సమముగాను శంఖభస్మము, అయిదుభాగములు, ఇంగువ, జీలకఱ్ఱ, ఇవి ౨ భాగములు, వీనినన్నియుచేర్చి, నిమ్మపండ్లు మొదలగు అమ్లవర్గముతో మర్దించి, గుంజామాత్రను వటికలుజేసి పుచ్చుకొనిన దీపనపాచనములను గలుగజేయుటయేగాక, అజీర్ణము, శూల, విషూచిక, ఎక్కిళ్లు, గుల్మము, ఉదరము, వీనిని నశింపజేయు.

## ఆజీర్ణారిరసము

శుద్ధసూతం గంధకం చ పలమానం పృథక్పృథక్. 46
హరీతకీ చ ద్విపలా నాగరస్త్రిపలః స్మృతః,
కృష్ణా చ మరిచం తద్వత్సింధూత్థం త్రిఫలం పృథక్. 47
చతుఃపలా చ విజయా మర్దయేన్నింబుకద్రవైః,
పుటాని సప్త దేయాని ఘర్మమధ్యే పునఃపునః. 48
అజీర్ణారిరయం ప్రోక్తస్సద్యో దీపనపాచనః,
భక్షితేద్విగుణం భక్ష్యం పాచయేద్రేచయేదపి. 49

తా. శుద్ధిచేసినపాదరసము, గంధకము, ఇవి ప్రత్యేకము ౧ పలము, కరక్కాయవొలుపు ౨ పలములు, శొంఠి 3 పలములు, పిప్పళ్లు, మిరియాలు, సైంధవలవణము, ఇవి ప్రత్యేకము 3 పలములు, గంజాయిఆకు ౪ పలములు, వీనినన్నియు నిమ్మపండ్లరసముచే మర్దనజేసి ౭ పుటంబులిడిన, అజీర్ణాది రసమనంబడు. దీనిని సేవించిన, ద్విగుణాహారమునుగూడ దీపనపాచనములను గలుగంజేయు.

## పాశుపతరసము

కర్షం సూతం ద్విధా గంధం త్రిభాగం భస్మతీక్ష్ణకమ్,
త్రిభిస్సమం విషం యోజ్యం చిత్రకద్రవభావితమ్. 50
ద్విధా త్రికటుకం యోజ్యం లవంగైలే తు తత్సమే,
జాతీఫలం జాతిపత్రం చార్ధభాగమితం పృథక్. 51
తథార్ధపంచలవణం స్నుహ్యర్కావాపి తింత్రిణీ,

అపామార్గాశ్వత్థపిషాం లవణం చ పలార్ధకమ్. 52
టంకణం యావకక్షారం సర్జికాం హింగుజీరకమ్,
హారీతకీతు తత్తుల్యా మర్దయేదమ్లయోగతః. 53
ధూర్తబీజస్య భస్మాపి సర్వస్త సప్తమభాగతః,
రసః పాశుపతో నామ ప్రోక్తః ప్రత్యయకారకః. 54
గుంజామాత్రా వటీ కార్యా సర్వాజీర్ణవినాశినీ,
తాలమూలీ తక్రయోగాదుదరామయనాశనీ. 55
మోచారసేనాతిసారం గ్రహణీం తక్రసైంధవైః,
శూలేనాగరకం శస్తం హింగుసౌవర్చలాన్వితమ్. 56
అర్శస్సుతక్రేణ హితా పిప్పలీ రాజయక్ష్మణి,
వాతరోగం నిహన్త్యాశు శుంఠీ సౌవర్చలాన్వితా. 57
గుడూచీశర్కరాయోగాత్పిత్తరోగవినాశినీ,
పిప్పలీ క్షౌద్రయోగేన శ్లేష్మరోగం నికృన్తతి. 58
అతః పరతరా నాస్తి ధన్వన్తరిమతే వటీ,

తా. శుద్ధిచేసినరసము ౧ కర్షము, గంధకము ౨ కర్షములు, లోహభస్మము ౩ కర్షములు, వసనాభి ౩ కర్షములు, వీనినిచేర్చి, చిత్రమూలరసముచే భావనజేసి,పిదప, శొంఠి, పిప్పలి, మిరియాలు ౨ జేసికర్షములు, లవంగములు, ఏలకలు ౨ జేసికర్షములు, జాజికాయ, జాపత్రి ౧ కర్షము, పంచలవణములు ౫ కర్షములు, జెముడు, జిల్లేడు, చింత, ఉత్తరేణు, రావి, వీనిక్షారములు ప్రత్యేకము ౨ కర్షములు, వెలిగారము, యవక్షారము, సర్జక్షారము, ఇంగువ, జీలకఱ్ఱ, కరక్కాయవోలుపు, ఇవిప్రత్యేకము ౧ కర్షము, వీనినిచూర్ణించి, అమ్లద్రవ్యములచే, భావనజేసి, అందు ఏడవభాగము, ఉమ్మెత్తవిత్తులభస్మమును జేర్చి, గుంజామాత్రప్రమాణము, వటుకములుజేసి భక్షించిన, సర్వాజీర్ణములు నశించు. మరియు నేలతాడి, మజ్జిగ, యీ అనుపానమున సేవించిన ఉదరరోగము,మోచరసము(బూరుగుబంక)తో సేవించిన, అతిసారము,మజ్జిగ సైంధవలవణముతో సేవించిన గ్రహణి, శొంఠి ఇంగువ సౌవర్చలవణము వీనితో పుచ్చుకొనిన శూల, మజ్జిగతో సేవించిన అర్శస్సు; పిప్పలిచూర్ణముతో సేవించినరాజయక్ష్మ, శొంఠి సౌవర్చలవణము వీనితో సేవించిన వాతరోగము, తిప్పసత్తుతో చేర్చి పుచ్చుకొనిన పిత్తరోగము, పిప్పలిచూర్ణము తేనె వీనితో పుచ్చుకొనిన శ్లేష్మరోగము, ఇవి యన్నియు నివర్తించు. ఇంతకన్న ఉత్తమమగురసము,ధన్వన్తరిమతంబున లేదని యెరుంగవలయు.

### ఆదిత్యరసము

దరదం చ విషం గంధం త్రికటుత్రిఫలాసమమ్. 59
జాతీఫలం లవంగం చ లవణాని చ పంచ వై,
సర్వమేకీకృతం చూర్ణమమ్లయోగేన సప్తధా. 60
భావయిత్వా వటీం కుర్యాద్గుంజార్ధప్రమితాంబుధైః,
రసో హ్యాదిత్యసంజ్ఞోయమజీర్ణక్షయకారకః. 61
భుక్తమాత్రం పాచయతీ జఠరానలదీపనః,

తా. ఇంగిలీకము, నాభి, గంధకము, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉశిరికెలు, జాజికాయ, లవంగములు, పంచలవణములు వీనినన్నియు సమముగచేర్చి, ఆమ్లవర్గములచే, ౭ భావనలుజేసి, అర్ధగుంజప్రమాణము, మాత్రలుజేసి భక్షించినతోడనే, అజీర్ణమును నశింపంజేసి, జఠరాగ్నిని గలుగంజేయు. ఇది ఆదిత్యరసమనబడును.

### అజీర్ణకంటకరసము

శుద్ధసూతవిషగంధకం సమం తుల్యభాగమరిచం చ చూర్ణితమ్. 62
మర్దయేత్తు బృహతీఫలద్రవై రేకవింశతివిభావితం పునః,
గుంజికాత్రయమిదం సుభక్షితం సద్యఏవ జఠరాగ్నివర్ధనమ్. 63
ఏష కంటకరసో విషూచికాజీర్ణమారుతగదాన్నిహన్తి చ,

తా. శుద్ధిచేసినపాదరసము, నాభి, గంధకము, ఇవి సమభాగములు, ఈ మూటికిసమము, మిరియాలుజేర్చి చూర్ణించి, ములకపండ్లరసముచే ౨౧ భావనజేసి, మూడుగురిగింజలయెత్తు భక్షించిన, సద్యస్కాలమునందే, జఠరాగ్నినిగలుగజేసి, అజీర్ణము, వాయువు, వీనిని నశింపజేయు,

### రామబాణరసము

పారదామృతలవంగగంధకం భాగయుగ్మమరిచేన మిశ్రితమ్. 64
తత్ర జాతిఫలమర్ధభాగికం తింత్రిణీఫలరసేన మర్దితమ్,
వహ్నిమాంద్యదశవక్త్రనాశనో రామబాణ ఇతి విశ్రుతో రసః 65
సంగ్రహణ్యభిధకుంభకర్ణకంసామవాతఖరదూషణం జయేత్,
దీయతే తు చణకార్ధమానతస్సద్యఏవ జఠరాగ్నిదీపనః. 66
రోచనః కఫకులాన్తకారకశ్శ్వాసకాసవమిజన్తునాశనః,

తా. రసము, నాభి, లవంగములు, గంధకము, వీనిని సమభాగములుగ గ్రహించి, మిరియాలు ౨ భాగములు, జాజికాయ, ౪ భాగము, వీనిని చింతపండు

పులుసుచే మర్దించి అర్ధచణకమాత్ర సేవించిన, అగ్నిమాంద్యమను రావణునిసంగ్రహణి యను, కుంభకర్ణుని ఆమవాతము అనుఖరదూషణులను నశింపజేయునిది రామబాణ మనబడును. మఱియు నిది ఉదరదీప్తిని కలిగించి అరుచి, కఫము, శ్వాస, కాస, వాంతి, కృములు, వీనిని నశింపజేయును.

### చింతామణిరసము

రసం గంధం మృతం శుల్బం మృతమభ్రం ఫలత్రికమ్. 67
త్ర్యూషణం జయపాలం చ సమం ఖల్వే విమర్దయేత్,
ద్రోణపుష్పీరసే భావ్యం శుష్కం తద్వస్త్రగాలితమ్. 68
చింతామణిరసో హ్యేష అజీర్ణే శస్యతే సదా,
జ్వరమష్టవిధం హన్తి సర్వశూలహరః పరః. 69
ఏక గుంజో ద్విగుంజో వా హ్యామవాతహరః పరః,

తా. శుద్ధిచేసినపాదరసము, శుద్ధగంధకము, తామ్రభస్మము, అభ్రకభస్మము కరక, తాడి, ఉశిరికెలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, శుద్ధిచేసిన నేపాళములు, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి, తుమ్మిపూలరసముచే భావనచేసి యెండించి, వస్త్రఘూలితమొనర్చి, ఒకగురిగింజయెత్తు, లేక, రెండుగురిగింజలయెత్తు సేవించిన, అజీర్ణము, అష్టవిధజ్వరములు, సర్వశూలలు, ఆమవాతము, వీటిని నశింపంజేయు. ఇది చింతామణిరసమనబడును.

### హుతాశనరసము

ఏకం చ దిగ్ద్వాదశభాగమానం యోజ్యం విషం టంకణమూషణం చ. 70
హుతాశనో నామ హుతాశనస్య కరోతి వృద్ధిం కఫవాతహన్తా,

తా. శుద్ధిజేసిననాభి ౧ భాగము, వెలిగారము ౧౦ భాగములు, మిరియాలు ౧౨ భాగములు. వీనినన్నిటిని చూర్ణించి సేవించిన, హుతాశనరస మనంబడు, దీనిని సేవించిన. అగ్నివృద్ధినిచేయుటయేగాక, కఫవాతములను హరింపజేయు.

### అగ్నికుమారరసము

శుద్ధసూతం విషం గంధం ప్రతినిష్కత్రయం త్రయమ్. 71
మరిచం సర్వతుల్యం స్యాత్కంటకారీఫలద్రవైః,
మర్దయేద్భావయేత్తేన భావనాచైకవింశతిః. 72
కృత్వా గుంజాద్వయం ఖాదేత్సర్వాజీర్ణప్రశాన్తయే,
విషూచికాం నిహన్త్యాశు రసో హ్యగ్నికుమారకః. 73

తా. శుద్ధిజేసినరసము, శుద్ధనాభి, శుద్ధగంధకము, ఇవి ప్రత్యేకము, మూడు

నిష్కములు, మిరియాలు ౯ నిష్కములు, వీనిని ఖల్వమునందునిచి నేలములక పండ్ల రసముతో ౨౧ భావనలుచేసి, రెండు గురిగింజలయెత్తు భక్షించిన, సర్వాజీర్ణములు, విషూచి, వీనిని నివర్తింపంజేయు, ఇది యగ్నికుమారరసము.

**స్వర్ణక్రవ్యాదరసము**

మృతం కాన్తం మృతం స్వర్ణం మృతం శుల్బం చ తీక్ష్ణకమ్,
మృతం రౌప్యం చ శంఖం చ తులామానం పృథక్పృథక్. 74
మాతులుంగరసైర్ద్రవ్యం లోహపాత్రే వినిక్షిపేత్,
గంధకం ద్విపలం శుద్ధం పారదం పలమాత్రకమ్. 75
సర్వం సంమేళయేత్పశ్చాజ్జ్వాలయేన్మృదువహ్నినా,
ఆమ్లవేతససంభావ్యం ఆమ్లవర్గేన సంయుతమ్, 76
పంచకోలకషాయేణ శతార్ధం భావయేత్క్రమాత్,
భృష్టటంకణచూర్ణేన తుల్యేన సహయోజయేత్. 77
తదర్ధం పంచలవణం సర్వసామ్యం మరీచకమ్,
త్రిస్సప్తభావయేత్పశ్చాచ్చణకక్షారవారిణా. 78
తతస్సంశోష్య సంపిష్య కాచకూప్యాం వినిక్షిపేత్,
అత్యర్థ గురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః. 79
భక్షిత్వా కంఠపర్యంతం చతుర్వల్లమిమం రసమ్,
పట్వామ్లతక్రసహితమ్ పిబేత్తదనుపానతః. 80
క్షిప్రం తజ్జీర్యతే భుక్తం జాయతే దీపనం పునః,
రసః క్రవ్యాదనామాయం ప్రోక్తమానందభైరవైః. 81

తా. కాంతభస్మము, సువర్ణభస్మము, తామ్రభస్మము, ఉక్కుభస్మము, రజతభస్మము, శంఖభస్మము, వీనిని తులమువంతునచేర్చి, మాదీఫలరసముచే మర్దించి, లోహపాత్రయందునిచి, గంధకము ౨ పలములు, రసము ౧ పలము వీనిని నూరి కజ్జలిచేసి ఆపాత్రయందునిచి పొయిమీదబెట్టి మందాగ్నిచే పక్వముగవండి, పిదప అమ్లవేతసము, ఆమ్లవర్గములు, వీనిచే భావనజేసి, పిదప పంచకోలకషాయముచే ౫౦ భావనలు జేసి యీఔషధమునకు సమము పేల్చిన వెలిగారము, వెలిగారములో సగము, పంచలవణముల చూర్ణము, యీ రెంటికిసమము మిర్యాలచూర్ణముకలిపి ౨౧ దినములు శెనగపులుసుతో గాఢముగ మర్దించి, గాజుపాత్రయందునిచి, వైవపూజాదులొనర్చి, యీ ఔషధము ౪ వల్లములు పులిమజ్జిగ, సైంధవలవణము, వీటి అనుపానముతో

పుచ్చుకొని, కంఠపర్యంతము, మిక్కుటముగ గురుమాంసములను, అనేక గురుభోజనములను భక్షించిన ఇవియన్నియు శీఘ్రముగ జీర్ణములై అగ్నిదీప్తియు కలుగు.

## లఘుక్రవ్యాదరసము

పారదాద్ద్విగుణం గంధమర్ధాంశం మృతలోహకమ్,
పిప్పలీ పిప్పలీమూలమగ్నిః శుంఠీ లవంగకమ్. 82
లోహసామ్యం పృథక్కుర్యా ద్రససామ్యం సువర్చలమ్,
టంకణం మరిచం చాపి గంధతుల్యం ప్రదాపయేత్. 83
ఏతద్విచూర్ణ్య యత్నేన భావయేత్సప్తధామ్లకైః,
ఏతద్రసాయనం శ్రేష్ఠం మాషమాత్రం ప్రదాపయేత్. 84
తక్రేణ కేవలం వాపి దద్యాద్భోజనపాచనే,
క్షిప్రం తజ్జీర్యతే భుక్తం దీపనం భవతి ధ్రువమ్. 85
సర్వాజీర్ణప్రశమనం లఘుక్రవ్యాదసంజ్ఞితమ్,

తా. పాదరసము ౧ భాగము, గంధకము ౨ భాగములు, లోహభస్మము ౪ భాగము, పిప్పలి, పిప్పలీమూలము, చిత్రమూలము, శొంఠి, లవంగములు ఇవి ప్రత్యేకము ౪ భాగము, సౌవర్చలవణము ౧ భాగము, వెలిగారము, మిరియాలు ౨ భాగములు వీనిని చూర్ణించి ఆమ్లద్రవ్యములచే ౭ భావనలుజేసిన శ్రేష్ఠమగు రసాయనమనంబడు. దీనిని మాషమాత్రము మజ్జికతో సేవించిన, భుజించిన పదార్థములను పచనమునుజేసి దీపనమును గలుగజేయుటయేగాక సర్వాజీర్ణములను నివర్తింపంజేయు.

## లఘుచిత్రకచూర్ణము

దహనాజమోదసైంధవ నాగరమరిచాస్తథామ్లతక్రేణ. 86
సప్తాహాదగ్నికరాః పీతార్శోవ్యాధి వినాశనాః ప్రోక్తాః,

తా. చిత్రమూలము, ఓమము, సైంధవలవణము, శొంఠి, మిరియాలు వీనిని సమముగ చూర్ణించి పుల్లనిమజ్జిగతో ౭ దినములు భక్షించిన అగ్నిదీప్తిని గలుగంజేసి, అర్శస్సును నశింపంజేయు.

## జ్వాలాముఖచూర్ణము

హింగ్వమ్లవేతసకటుత్రికచిత్రకాణాం కర్షాః పృథగ్గుడపలం యవచూర్ణకం చ. 87
జ్వాలాముఖోయమనలస్య కరోతి దీప్తిం చాజీర్ణమాత్రశమనే హి కృశానురేవ,

తా. ఇంగువ, ఆమ్లవేతసము, త్రికటుకములు, చిత్రమూలము, యవక్షారము వీనిని ప్రత్యేకము ౧ కర్షముచేర్చి చూర్ణించి, అందు ౧ పలము బెల్లము అంతే యవచూర్ణముచేర్చి పుచ్చుకొనిన అగ్నిదీప్తిని గలుంగజేసి అజీర్ణమును పోగొట్టును, ఇదియ జ్వాలాముఖ చూర్ణము.

వ్యోషాదిచూర్ణము

వ్యోషైలాహింగుభార్గీ బిడలవణయవక్షార పాఠాయవానీ. 88
చించాత్వగ్భస్మ చవ్యం దహనగజకణాత్వక్పటు గ్రంథ్యజాజీ,
ఏతచ్చూర్ణం ఘృతాఢ్యం త్రిదివసమశితంహ న్త్యజీర్ణాదిరోగమ్. 89
విశ్వం వైశ్వానరోయం దహతి సరభసం కింపునర్భుక్తమన్నమ్,

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, ఏలకులు, ఇంగువ, భారంగి, బిడాలవణము, యవక్షారము, అగరు శొంఠి, ఓమము, చింతబెరడుభస్మము, చవ్యము, చిత్రమూలము, గజపిప్పలి, లవంగపట్ట, ఉప్పు, సోడి, జీలకఱ్ఱ, వీనిని సమములుగ చేర్చి చూర్ణించి, నెయ్యి జేర్చి, మూడుదినములు భక్షించిన సకలరోగములు నశించుటయేగాక అగ్ని దీప్తిని గలుగంజేయు. ఈచూర్ణములోకమునే దహించును, తినినయాహారము మాట చెప్పనేల?

కణాదిచూర్ణము

కణా సింధుశివావహ్ని చూర్ణముష్ణేన వారిణా. 90
పీతం ప్రాతః క్షుధాం కుర్యాత్పావకస్యాపి దీపనమ్,

తా. పిప్పళ్లు, సైంధలవణము, కరక్కాయ, చిత్రమూలము వీనినిచూర్ణించి, యీచూర్ణమును ఉష్ణోదకముతో ప్రాతఃకాలమునందు సేవించిన ఆకలిని గలుగజేసి అగ్నివృద్ధిని సదా గలుగంజేయు.

పంచాగ్నిచూర్ణము

ఆమ్లవేతసధనంజయవజ్రీ మోరటా స్తదనుసూరణచూర్ణమ్. 91
పంచవహ్నిరజఏతదుదశ్విద్యుక్తమేవ జఠరానలవృద్ధ్యై,

తా. ఆమ్లవేతసము, మద్దిపట్ట, సన్నజెముడు, చాగ, కంద ఈ అయిదు పదార్థములను చూర్ణించి, మజ్జిగతో పుచ్చుకొనిన అగ్నివృద్ధియు గలుగు.

బిడాలవణాదిచూర్ణము

బిడం చిత్రకోజాజియుగ్మం యవానీశివాత్ర్యూషణం ధాన్య
సౌవర్చలే చ 92

త్వచా తింత్రిణీజాజమోదామ్లవేతం సమం యోజ్యమేతత్సమం
వైవిడంగమ్,
బిడాదిరోగదారకం గదార్త మర్త్య తారకం హ్యనేన జీర్యతే ధరా
కథం న జానతే నరాః. 93

తా. బిడాలవణము, చిత్రమూలము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, ఓమము, కరక్కాయ, శొంఠి, పిప్పలి, మిరియాలు, ధనియాలు, సౌవర్చలవణము, చింతబెరడు, అజామోదము, అమ్లవేతసము, వాయువిడంగములు వీనిని సమభాగములు గ్రహించి చూర్ణించి పుచ్చుకొనిన, సకలవ్యాధులు నశించుటయేగాక, అజీర్ణము సగా నివర్తించు. ఈబిడాదిచూర్ణము భూమి నేజీర్ణింపజేయును అనుమాటనరులెందుకు తెలిసికొనరు ?

చిత్రకాది చూర్ణము

కృశానుశ్చవ్యం వా మరిచమగధా హింగుచపలాశఠీదీప్యోవిశ్వా
యవజయుగళం పంచలవణమ్,
సమం బీజాపూరద్రవవిలులితం దాడిమరసైర్జయేదామాః రోగా
న్గ్రహణిగదతాం వహ్నిలతనుతామ్. 94

తా. చిత్రమూలము, చవ్యము, మిరియాలు, పిప్పళ్లు, ఇంగువ, గజపిప్పలి, కచోరములు, ఓమము, శొంఠి, యవక్షారము, సర్జక్షారము, పంచలవణములు వీనిని సమముగ చూర్ణించి మాదీఫలరసముచేతను దాడిమపండ్లరసముచేతను భావనజేసి పుచ్చుకొనిన, ఆమరోగము, గ్రహణీ, వ్యాధి, అగ్నిమాంద్యము వీనిని నశింపంజేయు.

విడంగాదిచూర్ణము

విడంగభల్లాతకచిత్రకాభయాస్సనాగరాస్తుల్యగుడేన సర్పిషా,
లిహన్తి యే మందహుతాశనా నరా భవన్తి తే బాడబతుల్య
వహ్నయః. 95

తా. వాయువిడంగములు, జీడీగింజలు, చిత్రమూలము, కరక్కాయలు, శొంఠి, వీనిని సమముగచూర్ణించి, యీచూర్ణమునకుసమము, బెల్లము నెయ్యికలిపి పుచ్చుకొనిన, మందాగ్నిగలనరులు, బడబానలతుల్యమగు జాఠరాగ్నిగలవారగుదురు.

సంజీవనీగుటికలు

విడంగం నాగరం కష్ణా పథ్యావహ్నివిభీతకా,
వచా గుడూచీ భల్లాతం విషం చాపివిశోధితమ్. 96
ఏతాని సమభాగాని గోమూత్రేణైవ పేషయేత్,
గుంజాభాం వటికాం కుర్యాద్దద్యాదార్ద్రకజైరసైః. 97

ఏకామజీర్ణయుక్తేచ ద్వే విషూచ్యాం ప్రదాపయేత్,
త్రిస్రో భుజంగదష్టస్య చతస్రస్సన్నిపాతినః. 98
వటీసంజీవనీనామ్నా సంజీవయతి మానవమ్,

తా. వాయువిడంగములు, శొంఠి, పిప్పళ్లు, కరక్కాయ, చిత్రమూలము, తాడికాయవొలుపు, వస, తిప్పతీగ, జీడిగింజలు, శుద్ధనాభి వీనిని సమభాగములుగ గోమూత్రముచే మర్దించి, గురిగింజలంతమాత్రలుజేసి, ౧ మాత్ర, అల్లపురసముతో నిచ్చిన, అజీర్ణము, ౨ మాత్రలుఇచ్చిన, విషూచి, ౩ మాత్రలుఇచ్చిన, సర్పదష్టవిషము, ౪ మాత్రలుఇచ్చిన, సన్నిపాతము వీనినన్నిటిని నివర్తింపంజేయు.

ధనంజయవటుకములు

జీరకం చిత్రకం చవ్యం ససుగంధం వచాత్వచౌ. 99
ఏలాకర్పూరహాపుషాకారవీనాగకేసరమ్,
పృథక్కర్షమితం క్షిప్త్వా తథా కర్షార్ధసమ్మితాం. 100
యవానీపిప్పలీమూలం స్వర్జికాం చ హరీతకీమ్,
జాతీఫల లవంగం చ పృథక్కర్షయుగం మతమ్. 101
ధాన్యకం పత్రకం చాపి కర్షత్రయమితం పృథక్,
కృష్ణాపలప్రమాణం స్యాత్పలమానం తు రోమకమ్, 102
మరీచాని తథాసప్త త్రివృన్మాలాపలద్వయమ్,
పృథగ్దశాక్షం సాముద్రం సైంధవం నాగరం తథా. 103
శరావసమ్మితం చుక్రం తదర్ధం తింత్రిణీఫలమ్,
ధనంజయవటీ హ్యేషా ధనంజయవివర్ధినీ. 104
భుక్తంచ జరయత్యాశు శూలమున్మూలయేద్ధ్రువమ్,
హారేద్విబంధేన సమమాధ్మానం కర్షయత్యపి. 105
గ్రహణ్యా నిగ్రహం కుర్యాద్రచయేద్రుచిముత్తమామ్,

తా. జీలకఱ్ఱ, చిత్రమూలము, చవ్యము, నల్లజీలకఱ్ఱ, వస, లవంగపట్ట, ఏలకులు, పచ్చకర్పూరము, బోడసరము, అజామోదము, నాగకేసరములు, ఇవి ప్రత్యేకము ౧ కర్షము, ఓమము, పిప్పలిమూలము, సర్జక్షారము, కరక్కాయవొలుపు, ఇవి ప్రత్యేకము ౪ కర్షము, జాజికాయ, లవంగములు, ఇవి ప్రత్యేకము ౨ కర్షములు, ధనియాలు, తమాల (ఆకు) పత్రి, ఇవి మూడేసికర్షములు, పిప్పళ్లు, చవిటిపుష్పం, ఇవి ప్రత్యేకము ౧ పలము, మిరియాలు ౭ పలములు, తెల్లతెగడ ౨ పలములు, సముద్రపుప్పు ౧౦ కర్షములు, సైంధవలవణము, శొంఠి ఇవి ప్రత్యేకము ౧౦ కర్షములు,

చక్కెర ౩౦ కర్షములు, చింతపండు ౧౨ కర్షములు వీనినంతయు మర్దించి మాత్రలుజేసి యిచ్చిన, అగ్నిదీప్తిని గలుగంచేయుటయే గాక, అజీర్ణము, శూల, విబంధము, ఆధ్మానము, సంగ్రహణి వీనిని నివర్తింపంజేసి, రుచిని గలుగంజేయు. ఇది ధనంజయ వటియనబడును.

శంఖవటుకనులు

చించాశ్వత్థస్నుహీక్షారాన పామార్గార్కజాంస్తథా. 106
సంగృహ్య పంచలవణం సర్వమేతత్పలద్వయమ్,
ద్వౌ కర్షౌ శంఖచూర్ణస్య త్రిఫలా హ్యేకకర్షికా. 107
పృథక్పృథక్కల్పయిత్వా ద్వికర్షంచ లవంగకమ్,
ఏతత్సర్వం సమీకృత్య శ్లక్ష్ణచూర్ణీకృతం శుభమ్. 108
భావయేదమ్లయోగేన సప్తధా చ ప్రయత్నతః,
రసః శంఖవటీ నామ సేవితస్సర్వరోగజిత్. 109
గుంజామాత్రమిమ్మం ఖాదేద్భ వేద్దీపన పాచనమ్,
అజీర్ణం వాతసంభూతం పిత్తశ్లేష్మభవం తథా. 110
విషూచీం శూలమానాహం హన్యాదత్ర న సంశయః,

తా. చింత, రావి, జెముడు, ఉత్తరేణి, జిల్లేడు, వీనిక్షారములు, పంచలవణములు, ఇవి ప్రత్యేకము ౨ పలములు, శంఖభస్మము ౨ కర్షములు, త్రిఫలములు ప్రత్యేకము ౧ కర్షము, లవంగములు ౨ కర్షములు వీనిని గ్రహించి, సూక్ష్మచూర్ణమును గావించి, నిమ్మపండ్లపులుసుచే, ౭ భావనలుజేసిన, శంఖవటుకములనంబడు. దీనిని గుంజామాత్రము భక్షించిన, దీపనపాచనములను గలుగజేయుటయే గాక. సర్వరోగములు, అజీర్ణవాతమువలన జనించిన రోగములు, పిత్తశ్లేష్మములవలన జనించిన రోగములు, విషూచి, శూల, ఆనాహము వీనిని నశింపంజేయు.

లవంగామృతవటుకములు

సర్వార్థం దేవపుష్పం మరిచమగధయోస్త్రి త్రికర్షం యవాన్య. 111
శ్చాష్టావష్టాగ్నితోపి త్రిపటురథపలం గ్రంథికం సప్తకర్షమ్,
శుంఠీ పథ్యాదశాక్షామలకకలిఫలాజాజిచవ్యాచ్చ షట్ షట్. 112
సుత్రామప్రీతిపాత్రం నఖమితమఖిలం చూర్ణితం వస్త్రపూతమ్,
త్రిర్భావ్యం చార్ద్రికస్య ద్రవయుతమపి తన్మాషయుగ్మప్రమాణా.
బద్ధా చక్రేణసిద్ధా ప్రభవతిఘుటికాఽసౌ లవంగామృతాఖ్యా,

భుక్తాయుక్తానుపానైః సకలసుఖకరీ దీప్తిమగ్నేర్విధత్తే. 114
వృష్యాపుష్యావపుష్యా మయనిచయహృతిఖ్యాతిపూర్ణా విభాతి,

తా. మిరియాలు, పిప్పళ్లు ఇవి ప్రత్యేకము 3 కర్షములు, ఓమము, చిత్రమూలము ఇవి ప్రత్యేకము ౮ కర్షములు, లవణత్రయము ౪ కర్షములు, పిప్పలిమూలము 2 కర్షములు, శొంఠి, కరక్కాయబోలుపు, ౧౦ కర్షములు, తానికాయబోలుపు, ఉశిరికెపప్పు, జీలకఱ్ఱ, చవ్యము, ఇవి ప్రత్యేకము ౬ కర్షములు, కొడిశపాల ౨౦ కర్షములు, వీనినన్నియు చూర్ణించి, వస్త్రఘాలితమొనర్చి యీ చూర్ణమునకు సగముగ లవంగములచూర్ణముచేర్చి, అల్లపురసముచే 3 భావనలు, చుక్కకూరరసముతో 3 భావనలుజేసి ౨ మాషములయెత్తు మాత్రలుజేసి సేవించిన, అగ్నిదీప్తి, వృష్యము, పుష్టి, శరీర సంపూర్ణసుఖము, వీనిని గలుగంజేయును. ఇది లవంగామృతవటి.

క్షుధాసాగరవటుకములు.

త్రికటు త్రిఫలా చైవ తథా లవణపంచకమ్. 115
క్షారత్రయం రసో గంధో ద్విభాగం పూర్వతో విషమ్,
ఆర్ద్రికస్య రసేనైవ గుంజాభా వటికా కృతా. 116
అజీర్ణే ద్వివటీం ఖాదేల్లవంగైః పంచసప్తభిః,
క్షుధా సాగరనామ్నాయం వటీ సూర్యేణ నిర్మితా. 117

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి, యుశిరికెలు, లవణపంచకము, క్షారత్రయము, రసము, గంధకము ఇవియన్నియు, ప్రత్యేకము ౧ భాగము, నాభి ౨ భాగములు వీనిని అల్లపురసముచేభావనజేసి, గురిగింజలంతమాత్రలుజేసి, అజీర్ణరోగమునందు ౨ మాత్రలు ౫ లవంగములతో గాని 2 లవంగములతో గాని, భక్షించినవది నివర్తించు. ఇవి సూర్యునిచే నిర్మింపబడిన, క్షుధాసాగరవటుకములని యెరుంగవలెను.

అగ్నితుండీవటుకములు.

శుద్ధసూతం విషం గంధమజమోదం ఫలత్రయమ్,
సర్జక్షారం యవక్షారం వహ్నిః సైంధవజీరకే. 118
సౌవర్చలం విడంగాని సాముద్రం త్ర్యూషణం సమమ్,
విషతిందుం సర్వతుల్యం జంబీరాంబ్లేన మర్దయేత్. 119
మరిచాభాం వటీం ఖాదేదగరం మంద్య ప్రశాన్తయే,
పథ్యా శుంఠీ గుడం చాపిడంగం వం భక్షయేత్సదా. 120
అగ్నితుండీ వటీ ఖ్యాతా హ్యాజాజీగకులాన్తకా,

తా. శుద్ధిజేసినరసము, క్షారం చిత్రము, ఓమము, కరక, తాడి, ఉశిరికెలు,

సర్జక్షారము, యవక్షారము, చిత్రమూలను, సైంధవలవణము, జీలకఱ్ఱ, సౌవర్చలవణము, వాయువిడంగములు, సాముద్రలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఇవి సమభాగములు, విషముష్టివిత్తులను, వీనికన్నిటికి, సమముగ జేర్చి, నిమ్మపండ్లపులుసుచే మర్దించి, మిరియములంతమాత్రలుజేసి, కరక్కాయ, శొంఠి బెల్లము, వీనిని చూర్ణించి 4 పలము చూర్ణముతో పుచ్చుకొనిన, అగ్నిమాంద్యము నివర్తించు.

తక్రహరీతకీయోగము.

తక్రేసుసంస్వేద్యశివాశతాని తద్బీజముద్ధృత్య చ కోశలేన. 121
షడూషణం పంచపటూని హింగుక్షారావజాజీమజమోదకం చ,
షడూషణాద్యేస్త్రివృద్ధభాగరాజ్ఞోవిధేయంపటగాలితంచ. 122
విభావ్య చుక్రేణ రజాంస్యమీషాం క్షిపేచ్ఛివాబీజనివాస్యగరే,
సమూహ్యాఘర్మేషువిశోష్యతాసుహరీతకీమన్యతమాంనిషేవయేత్.
అజీర్ణమందామయజాఠరామయాన్నమూలశూలగ్రహణీగుదాంకురాణ్,
విబంధమానాహరుజం జయత్యసౌసహామవాతామమృతా హారీతకీ.

తా. ౧౦౦ కరక్కాయలను మజ్జిగయందుడకబెట్టి ఆకరక్కాయలయందుండు విత్తులను నేర్పుగతీసి పిప్పలి, పిప్పలిమూలము, చవ్యము, చిత్రమూలము, శొంఠి, మిరియాలు, లవణపంచకము, ఇంగువ, యవక్షారము, జీలకఱ్ఱ, అజామోదము, ఇవి ప్రత్యేకము ౧ కర్షము, తెల్లతెగడ 4 కర్షము వీనిని చూర్ణించి వస్త్రగాలితముజేసి పుల్లప్రబ్బలిరసముచే భావనజేసి ఆకరక్కాయలయందునిచి వానిని యెండయందు శోషింపజేసి యందొకకరక్కాయవంతున సేవించిన అజీర్ణము, మందాగ్ని, జఠరరోగములు, మూలరోగము, శూల, గ్రహణి, గుదాంకురములు, విబంధము, ఆనాహము, ఆమవాతము వీనిని నశింపజేయు.

క్షారయోగము

ద్వౌ క్షారౌ టంకణం సూతం లవంగం లవణత్రయమ్,
పిప్పలీ గంధకం శుంఠీ మరిచం పలసమ్మితమ్. 125
కర్షమేకం విషం దత్వా సూక్ష్మచూర్ణాని కారయేత్,
అర్కదుగ్ధస్య దాతవ్యా భావనాస్సప్తవాసరమ్. 126
తతః పక్త్వా గజపుటే స్వాంగశీతం సముద్ధరేత్,
తతో లవంగమరిచ స్ఫాటికానాం పలంపలమ్. 127
సర్వం సమ్మర్ద్య సుదృఢం ధృతభాండే నిధాపయేత్,
సోయం గుంజాద్వయం ఖాదేద్భుక్తం జీర్ణయతి క్షణాత్. 128

పునర్భోజనవాంఛాం చ జనయేత్ప్రిహరోపరి,
ఆమమాంసం ద్రావయతి శ్లేష్మరోగనికృంతనః. 129

తా. సర్జక్షారము, యవక్షారము, వెలిగారము, రసము, లవంగములు, సైంధవలవణము, బిడాలవణము, సౌవర్చలవణము, పిప్పలి, గంధకము, శొంఠి, మిరియాలు, ఇవి ప్రత్యేకము ౧ పలము, నాభి, కొలుపలముచేర్చి, చూర్ణించి జిల్లేడు పాలచే, యేడుమార్లు భావనజేసి, దానిని మూషయందునిచి, గటపుటంబిడి, సాంగ శీతలమునదీసి, పిదప, లవంగములు, మిరియాలు, పటికారము వీనిని, ప్రత్యేకము ౧ పలముచేర్చి, బాగుగమర్దించి, భాండమునందునిచి, రెండుగురిగింజలంత పుచ్చుకొనిన భుక్తపదార్థమును క్షణములోపల జీర్ణింపజేయు. మరలభోజనవాంఛను గలుగంజేసి అపక్వమాంసపదార్థమును ద్రవింపజేయుటయే గాక, శ్లేష్మరోగమును నివర్తింపం జేయు.

### అజీర్ణమునకు పంచమూల్యాదిఘృతము

పంచమూల్యాభయావ్యోషపిప్పలీమూలసైంధవమ్,
రాస్నా క్షారద్వయాజాజీ విడంగానిశఠిర్ఘృతమ్. 130
యుక్తంచమాతులుంగస్య స్వరసేనార్ద్రికస్య చ,
తక్రమస్తుసురామండసౌవీరకతుషోదకైః. 131
కాంజికేన తు యత్పక్వం పీతమగ్నికరం స్మృతమ్,
గుల్మశూలోదరశ్వాసకాసానిలకఫాపహమ్. 132

తా. పంచమూలములు, కరక్కాయనోలుపు, శొంఠి, పిప్పలి, మిరియాలు, పిప్పలిమూలము, సైంధవలవణము, రాస్న, సర్జక్షారము, యవక్షారము, జీలకఱ్ఱ, వాయు విడంగములు, కచూరములు వీనిని సమములుగ కషాయముకాచి, అందు, నెయ్యి, మాదీఫలరసము, అల్లపురసము, మజ్జిగ, మజ్జిగతేట, కల్లుమీదతేట, సౌవీరము, తుషోదకము, కాంజికము వీనినిచేర్చి పక్వముగకాచి, సేవించిన, అగ్నిదీప్తిని గలుగంజేయు. మరియు, గుల్మము, శూల, ఉదరము, శ్వాస, కాస, వాయువు, కఫము వీనిని నశింపంజేయు.

### దశమూలఘృతము

మరిచం పిప్పలీమూలం నాగరం పిప్పలీ తథా,
భల్లాతకం యవానీ చ విడంగం గజపిప్పలీ. 133
హింగుసౌవర్చలం చైవ హ్యాజాజీ బిడధాన్యకే,
సాముద్రం సైంధవం క్షారం చిత్రకం వచయా సహ. 134

ఏభిరర్ధపలైర్భాగైర్ఘృతప్రస్థం విపాచయేత్,
దశమూలరసే సిద్ధం పయసాష్టగుణేన చ. 135
మందాగ్నేశ్చ హితం సిద్ధం గ్రహణీదోషనాశనమ్,
విష్టంభమామం దౌర్బల్యం ప్లీహానమపి కర్షయేత్. 136
కాసం శ్వాసం క్షయం వాపి దుర్నామానం భగందరమ్,
కఫజాన్హంతి రోగాంశ్చ వాతజాన్క్రిమిసంభవాన్. 137
తాన్సర్వాన్నాశయత్యాశు శుష్కం దావానలో యథా,

తా. మిరియాలు, పిప్పలిమూలము, శొంఠి, పిప్పళ్లు, జీడిగింజలు, ఓమము, వాయువిడంగములు, గజపిప్పలి. ఇంగువ, సౌవర్చలవణము, జీలకఱ్ఱ, బిడాలవణము, ధనియాలు, సముద్రలవణము, సైంధవలవణము, యవక్షారము. చిత్రమూలము, వస వీనిని ప్రత్యేకము ౪ పలమువంతునజేర్చి కషాయముకాచి అందు ౧౬౾ పలముల నెయ్యి, దశమూలముల కషాయము, పాలు వీనిని ౭ ప్రస్థములుజేర్చి పక్వముగ కాచిన, దశమూల ఘృతమనంబడు. దీనిని సేవించిన, మందాగ్ని గ్రహణీదోషము, విష్టంభము, ఆమము, దుర్బలత్వము, ప్లీహ, కాస, శ్వాస, క్షయ, దుర్నామము, భగందరము, కఫరోగములు, వాతరోగములు, కృమిరోగము వీటినన్నిటిని నశింప జేయు.

**విషూచీకషాయము**

బాలమూత్రస్య నిఃక్వాథః పిప్పలీచూర్ణసంయుతః. 138
విషూచీనాశనశ్చైవ జఠరానలవర్ధనః,

తా. బాలురయొక్క మూత్రమును బాగుగకాచి అందుపిప్పలిచూర్ణమును జేర్చి పుచ్చుకొనిన విషూచిరోగము నశించుటయేగాక జాఠరాగ్ని వృద్ధిగలుగు.

**బిల్వాదికషాయము**

బిల్వనాగరనిఃక్వాథో హన్యాచ్ఛర్దిం విషూచికామ్. 139
బిల్వనాగరకైడర్యక్వాథస్స్యాదధికో గుణైః,

తా. బిల్వఫలము, శొంఠి వీనినికషాయముబెట్టి సేవించినను, లేక, బిల్వము, శొంఠి, కాయఫలము వీనినికషాయముబెట్టి సేవించినను, ఛర్ది, విషూచి ఇవినివర్తించు.

**విషూచికి లవంగాదిచూర్ణము**

శాణద్వయం స్యాత్తు లవంగమేలాజాతీఫలం కోలసునాగఫేనమ్. 140
మాషప్రమాణం సకలం విచూర్ణ్య శాణం కవోష్ణేన జలేన పీతమ్,
విషూచికాంహంతిసుదారుణాంచశూలాతిసారౌవమథుంప్రసక్తమ్.

తా. లవంగములు ౨ శాణములయెత్తు, ఏలకులు, జాజికాయ, ఇవి ప్రత్యేకము, అర్ధకర్షము, అభిని ౧ మాషప్రమాణము వీనిని చూర్ణించి, యొకశాణ మెత్తు, కొంచెము. ఉష్ణముగనుండు నుదకముతో పుచ్చుకొనిన, దారుణమగు విషూచి,శూల, అతిసారము, వమనము వీనిని నివర్తింపంజేయు.

పథ్యాచూర్ణము

పథ్యా వచా హింగుకలింగభృంగసౌవర్చలై స్సాతివిషైర్విచూర్ణ్య,
సుఖాంబుపీతో వినిహంత్యజీర్ణం శూలం విషూచీం కససం చసద్యః.

తా. కరక్కాయ, వస, ఇంగువ, కొడిశపాలపట్ట, గుంటగలగర, సౌవర్చలవణము, అతివస వీనిని సమములుగ చూర్ణించి, ఉష్ణోదకముతో సేవించిన, అజీర్ణము, శూల, విషూచి, దగ్గు, ఇవి పోను.

కటుత్రయరసము

కటుత్రికం జీరకహింగుసింధురసోసగంధం చ సమం విమర్ద్య,
నింబుప్రవేణాశు నిహంతి పీతంవిషూచికాం దుష్టవిలంబికాం చ.143

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, జీలకఱ్ఱ, ఇంగువ, సైంధవలవణము, ఉల్లిగడ్డలు, గంధకము, వీనినిసమముగ, చూర్ణించి నిమ్మరసముతో సేవించిన, విషూచిక,దుష్టవిలంబిక, ఇవి నివర్తించు.

లవంగత్వగాద్యుద్వర్తనము లేక తైలము

త్వక్పత్రరాస్నాగరుశిగ్రుకుష్ఠైరమ్లప్రపిష్టైస్సవచాశతాహ్వైః,
ఉద్వర్తనం ఖల్లివిషూచికాఘ్నం తైలం విపక్వం చ తదర్థకారి. 144

తా. లవంగపట్ట, ఆకుపత్రి, రాస్న, అగరు, మునగవేరుపట్ట, కోష్ఠము, వస, పిల్లితీగలు వీనిని నిమ్మపండ్లరసముతో నూరి, శరీరమునకు నలుచుకొనినను, లేక వీనితో తైలముసిద్ధపరచి లేపనముచేసికొనినను, వాయురోగము, విషూచిక, ఇవి నివర్తించు.

అర్కాదితైలము

అర్కస్య చ రసప్రస్థం ప్రస్థం ధుత్తూరకస్య చ,
శ్వేతస్నుహీరసప్రస్థం ప్రస్థం సౌంభాజనాద్రసాత్. 145
కుష్ఠసైంధవయోః కల్కం పలే ద్వే ద్వే ప్రమాణతః,
తైలప్రస్థం కాంజికేన పచేన్మృద్వగ్నినా సమమ్. 146
ఖల్లీం విషూచికాం హన్తి పక్షాఘాతం చ గృధ్రసీమ్,

తా. జిల్లేడుఆకురసము, ౧ ప్రస్థము. ఉమ్మెత్తఆకురసము. ౧ ప్రస్థము. తెల్లజెముడురసము, ౧ ప్రస్థము, మునగపట్టరసము. ౧ ప్రస్థము. కుష్ఠము. సైంధవలవణము, పీటికల్కము, ప్రత్యేకము. ౨ పలములు. నూనె, ౧ ప్రస్థము. కాంజికము, ౧ ప్రస్థము, వీనినన్నియు నేకముగచేర్చి. పక్వముగ తైలముగాచి, యుపయోగించుకొనిన, ఖల్లీవాతము, విషూచి, పక్షాఘాతము, గృధ్రసి వీనిని నివర్తింపం జేయు.

## అజీర్ణాదులకు పథ్యములు

శ్లేష్మికే వమనం పూర్వం పైత్తికే మృదురేచనమ్. 147
వాతికే స్వేదనం వాథ యథావస్థం హితం చ తత్,
నానాప్రకారవ్యాయామో దీపనాని లఘూని చ. 148
బహుకాలసముత్పన్నాముద్గలోహితశాలయః,
విలేపీలాజమండశ్చ మండో ముద్గరసస్తథా. 149
ఏణో బర్హీ శశో లావః క్షుద్రమత్స్యాశ్చ సర్వశః,
శాలిం చ శాకం వేత్రాగ్రం వాస్తుకం బాలమూలకమ్. 150
లశునం వృద్ధకూష్మాండం సవీసం కదలీఫలమ్,
సౌభాంజనం పటోలం చ వార్తాకం లలదంబుజమ్. 151
కర్కోటకం కారవేల్లం బార్హతం చ మహార్ద్రకమ్,
ప్రసారణీ చ చాంగేరీ తథైవ సునిష్ణకమ్. 152
ధాత్రీఫలం నాగరం చ దాడిమం యవపర్పటాః,
ఆమ్లవేతసజమ్బీరమాతులుంగాని మాక్షికమ్. 153
నవనీతం ఘృతం తక్రం సౌవీరకతుషోదకే,
ధాన్యామ్లం కటుతైలం చ రామఠం లవణార్ద్రకమ్. 154
యవానీమరిచం మేథీధాన్యకం జీరకం దధి,
తాంబూలం తప్తసలిలం కటుతిక్తో రసోపి వా. 155
మందానలేష్వజీర్ణేచ పథ్యమేతన్నృణాం భవేత్,

తా. మందాగ్ని, అజీర్ణము, విషూచిక, భస్మకము ఇవి శ్లేష్మగుణయుక్తములుగ నుండిన, మొదట వమనము జేయించవలయు. పిత్తయుక్తములుగనుండిన మృదుభేదికివ్వవలయు. వాతయుక్తములుగనుండిన చెమటదీయవలయు. ఇటుల ఆయాకాలములయందు హితకరములగు క్రియలంజేయవలయు. అనేకవిధములగు వ్యాయామము, దీపనము, లఘువు ఇవిగల శాకాదికములు, దీర్ఘకాలము నిలవయున్న పెసలు, ఎఱ్ఱబియ్యము, సత్తుపిండి, పేలాలమండము, పెసరరసము, మరియు

జింక, నెమలి, కుందేలు, లావుకము, చిన్నచేపలు వీనిమాంసము, వెదురు మొలకలు, గోలుగుకూర, చకోతపుకూర, లేతముల్లంగి, వెల్లుల్లి, పొతగుమ్మడికాయ, అరటిపిందెలు, మునగకాయ, పొట్లకాయ, వంకాయ, కమలములు, నక్కదోసకాయ, కాకరకాయ, నేరేడుపండు, అల్లము, అత్తిపత్తిఆకు, ముక్కుకూర, చంచలికూర, ఉసిరికెకాయ, శొంఠి, దాడింబఫలము, యవలు, పర్పాటకము, అమ్లవేతసము, నిమ్మపండ్లు, మాధీఫలము, తేనె, వెన్న, నెయ్యి, మజ్జిగ, రేగుపండు, కాంజికము, తుషోదకము, పుల్లనీళ్లు, కారము, నూనె, ఇంగువ, ఉప్పు, ఓమము, మిరియాలు, మెంతులు, ధనియాలు, జీలకఱ్ఱ, పెరుగు, తాంబూలము, కాచిననీళ్లు, చేదు, వగరు ఇవిగలరసములు ఇవియన్నియు పథ్యములని తెలియవలయు.

## అపథ్యములు

విరేచనాని విణ్మూత్రవాతవేగవిధారణమ్. 156
అతిరిక్తం చాధ్యశనం జాగరం విషమాశనమ్,
రక్తస్రుతిం శింబిధాన్యం మత్స్యమాంసముపోదకమ్. 157
జలపానం చ విష్టంభం జాంబవం సర్వశాలుకమ్,
కూర్చికాంపాచితం క్షీరే కిలాటం చ ప్రియాలకమ్. 158
లామజ్జకం తథా వాలం స్నేహానం దుష్టవారి చ,
విరుద్ధాసాత్మ్యపానాన్నం విష్టంభీని గురూణి చ. 159
అగ్నిమాంద్యేష్వజీర్ణే చ సర్వాణి పరివర్జయేత్,

తా. విరేచనము, మలమూత్ర, అపానవాతవేగవిధారణము, భోజనోత్తరమునందు, మరల అతిగభుజించుట, జాగరణము, విషమాశనము, రక్తస్రావము, ద్విదళధాన్యము, మత్స్యములు, మాంసము, బచ్చలికూర, జలపానము, మలబద్ధకరములగు పదార్థములు, నేరేడుపండు, సమస్తతామరగడ్డలు, బియ్యము నేతితో వేయించిన పదార్థములు, పాలలోవుడికించిన పదార్థములు, ఆవుయీనిన 8 దినములలోనిపాలు, సారపప్పు, వట్టివేరు, కురువేరు, స్నేహపదార్థములు, దుష్టోదకము, విరుద్ధాన్నము, తనకుపడనిఅన్నము, మరియు పానము, మలబద్ధకర ద్రవ్యములు, మరియు గురుపదార్థములు ఇవి అగ్నిమాంద్యము, అజీర్ణము వీనియందపథ్యములని తెలియవలయు.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్యవిద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్రకంఠవల్లభాచార్య విరచిత, వైద్యచింతామణౌ, అగ్నిమాంద్య, అజీర్ణరోగ ప్రకరణంనామ చతుర్దశోవిలాసః.

# అర్శరోగప్రకరణమ్.

## అర్శరోగ కర్మవిపాకము

దత్వాథ వేతనం యోఽధ్యేత్యాదాయాపిచ వేతనమ్,
అధ్యాపయేచ్చ జుహుయాజ్జపేద్వార్శో౽యుతో భవేత్. 1

తా. జీతమిచ్చి అధ్యయనముచేసినను లేక జీతమునుదీసికొని అధ్యయనము జెప్పినను లేక జీతమునుదీసుకొని హోమముచేసినను లేక జీతముపుచ్చుకొని జపమును చేసినను అట్టిమనుజునికి అర్శోరోగము జనించు.

## సువర్ణగోదానము

బోధాయనోక్తమథవా స్వర్ణధేనుం ప్రకల్పయేత్,
సౌవర్ణీం గాం ప్రకుర్వీత పలేనార్ధపలేన వా. 2
విత్తశాఠ్యం న కుర్వీత కుర్వంస్నైవ ఫలం లభేత్,
స్వర్ణశృంగీం రౌప్యఖురాం నానావస్త్రైరలంకృతామ్. 3
గ్రహాణాం ప్రీణనార్థాయ నవ ధాన్యాని నిక్షిపేత్,
హోమస్తు పూర్వవత్కార్యో గోవిందః ప్రీయతామితి. 4
ఇదం విష్ణుః ప్రతద్విష్ణుః విష్ణోర్నుకమితి బ్రువన్,
సమిదాజ్యచరూన్హుత్వా పూర్ణాహుత్యంతమాచరేత్. 5
తతస్స్నాతశ్శుచీ రోగీ బ్రాహ్మణం వేదపారగమ్,
శ్రుతవృత్తోపసంపన్నమనుద్వేగకరం నృణామ్. 6
భక్త్యా యుక్తస్సమానీయ పూజయేత్ప్రీతిపూర్వకమ్,
అంగుళీయకవస్త్రాద్యైరుపానచ్ఛత్రకైరపి. 7
మంత్రేణానేన పాత్రేస్మిన్ దద్యాద్రోగీ జితాత్మవాన్,
గోవిందం మనసా ధ్యాయ న్గవాం మధ్యేస్థితం విభుమ్. 8
బర్హాపీడేన సంయుక్తం వేణునాదనతత్పరమ్,
గోపీజనైః పరివృతం వన్యపుష్పావతంసకమ్. 9
గోవిందగోపీజనవల్లభేశకంసాసురఘ్న త్రిదశేంద్ర వంద్య,
గోదానతృప్తః కురు మే దయాళో హ్యర్శోస్యనాశం క్షపితారివర్గ. 10
దానేనానేన విధివదర్శసో జాయతే క్షయః,

తా. ఒకపలము బంగారుతోగాని లేక అర్ధపలము బంగారుతోగాని ద్రవ్య వంచనచేయక, బంగారుకొమ్ములును వెండిగిట్టలునుగల గోవునుచేయించి, నానావిధ వస్త్రపుష్పాదుల నలంకరించి, షోడశోపచారముల బూజించి, పిదప నవగ్రహముల ప్రీతికొరకు నవధాన్యములనునిచ్చి, నవగ్రహపూజావిధిగ పూజించి "ఇదంవిష్ణుః" "ప్రతద్విష్ణుః" "విష్ణోర్నుకం" అనుమంత్రముచే సమిదాజ్యచరువులచే ౧౦౦౮ మార్లుగాని లేక ౧౦౮ మార్లుగాని రోగతారతమ్యానుగుణముగ విష్ణుప్రీత్యర్థమై హోమమునుచేసి, పూర్ణాహుతినొసంగి హోమమును పరిపూర్తిచేసినపిదప, రోగి స్నానముచేసి, పరిశుద్ధుడై, వేదపారగుడును, శాస్త్రజ్ఞానాచారసంపన్నుడును, శాంతుడునునగు బ్రాహ్మణునికి అంగుళ్యాభరణ వస్త్రోపానచ్ఛత్రములనొసంగి, గంధపుష్పాదులచేబూజించి, విష్ణుభక్తిగలవాడై "గోవిందగోపీజనవల్లభేశ" అనుమంత్రముచే సువర్ణగోవును, నవధాన్యములను దానముచేసిన అర్శోరోగము నివర్తించు.

## సామాన్యార్శోభేదములు.

పృథగ్దోషైస్సమస్తైశ్చ శోణితాత్సహజాని చ. 11
అర్శాంసి షట్ప్రకారాణి విద్యాత్ గుదవలిత్రయే,

తా. వాతజము, పిత్తజము, కఫజము, సన్నిపాతజము, రక్తజము, సహజములని ౬ విధములుగ మూలవ్యాధి గుదస్థానమునందుండు. త్రివళులయందు జనించు.

## అర్శోరోగలక్షణము

అరోచకాగ్నిమాంద్యే చ హ్యాంత్రకూజనమేవ చ. 12
గుల్మః ప్లీహా తథా శోఫో నేత్రే కర్ణధ్వనిర్భ్రమః,
అష్ఠీలకముదావర్తో మలబంధస్తథైవచ. 13
కట్యూరువంక్షణే శూలం జ్వరమన్నే చ శత్రుతా,
శోషో వివర్ణతా దేహే హ్యర్శసాం లక్షణం విదుః. 14

తా. అరోచకము, అగ్నిమాంద్యము, పేగులరచుట, గుల్మము, ప్లీహా, నేత్రములయందువాపు. కర్ణధ్వని, ఒడలు తిరుగుట, అష్ఠీలవాతము, ఉదావర్తము, మలబద్ధము, మొల తొడలు గజ్జలు వీనియందుశూల, జ్వరము, అన్నద్వేషము. శోష, శరీరవైవర్ణ్యము ఇవియన్నియు అర్శోరోగములకు సామాన్య లక్షణములని యెరుంగవలయు.

## అర్శోరోగసంప్రాప్తి

దోషాస్త్వఙ్మాంసమేదాంసి సందూష్య వివిధాకృతీన్,
మాంసాంకురానపానాదౌ కుర్వంత్యర్శాంసి తాన్ జగుః. 15

తా. వాతాదిదోషములు కుపితములై, త్వక్కు, మాంసము, మేదస్సు వీనిని దూషితముచేసి, నానావిధములుగ మాంసాంకురములను గుదమునందు జనింపఁజేయు. వానిని అర్శస్సులని యెఱుంగవలయు.

### అర్శరోగమునకు పూర్వరూపము

విష్టంభోంగస్య దౌర్బల్యం కుక్షేరాటోప ఏవ చ,
కార్శ్య ముద్గారబాహుళ్యం సక్థిసాదోల్పవిట్కతా. 16
గ్రహణీదోషపాండ్వర్తేరాశంకా చోదరస్య చ,
పూర్వరూపాణి నిర్దిష్టాన్యర్శసామభివృద్ధయే. 17

తా. మలబంధము, శరీరమునందు దుర్బలత్వము, కడుపునందు గుడగుడ శబ్దము, కృశత్వము, మిగుల తేనుపులు, తొడలయందుదుర్బలత్వము, మలము కొంచెముగ వెడలుట, మరియు గ్రహణి, పాండు, ఉదరము ఇవి జనించునట్టుల తోచుట, ఇట్టి లక్షణములు అర్శరోగమునకు పూర్వరూపములని యెఱుంగవలయు.

### వాతార్శోనిదానము

కషాయకటుతిక్తాని రూక్షశీతలఘూని చ,
ప్రమితాల్పాశనం తీక్ష్ణం మద్యం మైథునసేవనమ్. 18
లంఘనం దేశకాలౌ చ శీతౌ వ్యాయామకర్మ చ,
శోకో వాతాతపస్పర్శో హేతుర్వాతార్శసాం మతః. 19

తా. వగరు, చేదు, కారము, రూక్షము, శీతము, లఘువు అగునట్టియు, అతి, అల్ప భోజనము, తీక్ష్ణమద్యము, మైథునము, లంఘనము, చలవగలదేశము, చలవగలకాలము, అతివ్యాయామము, శోకము, యెండ గాలి వీనియందు సంచరించుట, ఇవియన్నియు వాతార్శోరోగమునకు హేతువులని యెఱుంగవలయు.

### వాతార్శోలక్షణము

గుదాంకురా బహ్వనిలాశ్శుష్కాశ్చిమిచిమాన్వితాః,
మ్లానాశ్శ్యావారుణాః స్తబ్ధా విశదాః పరుషాః ఖరాః. 20
మిథో విసదృశా వక్రాస్తీక్ష్ణా విస్ఫుటితాననాః,
బింబీకర్కంధుఖర్జూరకార్పాసీఫలసన్నిభాః. 21
కేచిత్కదంబపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః,
శిరఃపార్శ్వాంసకట్యూరువంక్షణాభ్యధికవ్యథాః. 22
క్షవథూద్గారవిష్టంభహృద్గ్రహారోచకప్రదాః,

కాసశ్వాసాగ్నివైషమ్యకర్ణనాదభ్రమావహాః. 23
శైరాస్తోగ్రథితస్తోకం సశబ్దం సప్రవాహికమ్,
రుక్ఫేనపిచ్ఛానుగతం విబద్ధముపవేశ్యతే. 24
కృష్ణత్వఙ్నఖవిణ్మూత్రనేత్రవక్త్రశ్చజాయతే,
గుల్మప్లీహోదరాష్ఠీలాసంభవస్తతఏవ చ. 25

తా. స్రావరహితములుగను, మెరమెరయని వేదనాయుక్తములుగను, వాడినటులను, నల్లగను, ఎఱ్ఱగను, గూటనువలెకదలకను, గరగరలాడుచును, ఒకచేరీతిగనుండకను, వక్రములుగను, సూదులవలెను, అగ్రభాగమునందుపగిలినటులను, దొండ రేగు ఖర్జూర బూరుగ వీటిఫలములవంటి ఆకృతిగలవిగను, కొన్ని కందపుష్పములవలెను, కొన్ని తెల్లఆవాలవలెను, మొలకలుజనించుట, తల, పార్శ్వములు, భుజశిరములు, మొల, తొడలు, గజ్జలు వీనియందుపోట్లు, తుమ్ములు, తేనుపులు, మలబంధము, హృదయముఈడ్చునటుల వేదన, అరుచి, దగ్గు, ఉబ్బసము, ఒకానొకప్పుడు అన్నముపచనముగాకయుండుట, ఒకానొకప్పుడు అన్నముపచనమగుట, చెవులయందుధ్వని, భ్రమ, ఆసనమునందు గుడగుడశబ్దము, పోట్లు, నురుగు, బంక, వీనియుక్తముగ ఉంటలుంటలుగ కొంచెకొంచెముగ మలము వెడలుట, త్వక్కు, గోళ్లు, మలము, మూత్రము, కన్నులు, ముఖము ఇవియన్నియు కొంచెము నలుపుబారియుండుట ఇట్టిలక్షణములుగలది వాతోల్బణార్శోరోగమని తెలిసికొనవలయు. మరియు ఇట్టివాతార్శోరోగమునలన గుల్మము, ప్లీహము, ఉదరము, అష్ఠీల ఇవి సగా జనించు.

## పిత్తార్శోనిదానము

కట్వమ్లలవణోష్ణాని వ్యాయామాగ్న్యాతపశ్రమాః,
దేశకాలావశిశిరౌ క్రోధో మద్యమసూయనమ్. 26
విదాహి తీక్ష్ణముష్ణం చసర్వం పానాన్నభోజనమ్,
పిత్తోల్బణానాం విజ్ఞేయః ప్రకోపే హేతురర్శసామ్. 27

తా. కారము, పులుసు, ఉప్పు, ఉష్ణపదార్థము మొదలగువాని సేవనవలనను, వ్యాయామము, అగ్ని, యెండ వీని సేవనవలనను మరియు ఉష్ణదేశము, ఉష్ణకాలము, క్రోధము, మద్యపానము, అసూయ, విదాహకరపదార్థములు, తీక్ష్ణముగనుండు అన్నపానములు ఇవియన్నియు పిత్తోల్బణార్శోరోగములు ప్రకోపించుటకు హేతువులని యెఱుంగవలయు.

## పిత్తార్శోలక్షణము

పిత్తోత్తరానీలముఖారక్తపీతాఽసితప్రభాః,
తన్వస్రస్రావిణో విస్రాస్తనవో మృదవః శ్లథాః. 28
శుకజిహ్వాయకృత్ఖండజలూకావక్త్రసన్నిభాః,
దాహపాకజ్వరస్వేదతృణ్మూర్ఛారుచిమోహదాః. 29
సోష్మాణో ద్రవనీలోష్ణపీతరక్తామవర్చసః,
యవమధ్యాహరిత్పీతహారిద్రత్వఙ్నఖాదయః. 30

తా. పిత్తాధిక్యముచేజనించెడి మొలకలయందు కొనలు నీలవర్ణముగను, యెఱ్ఱగను, పచ్చగను, నల్లగనునుండుట, వానిలోరక్తము కొంచెముగ స్రవించుట, పాశిన కంపుకలిగియుండుట, సన్నగను, కోమలముగను, శిథిలముగనుండుట, మరియు చిలుక నాలుక కొరిజము జలగలు ముఖమువలెనుండుట, దాహము, గుదపాకము, జ్వరము, చెమట, దప్పి, మూర్ఛ, అరుచి, మోహము ఇవి జనించుట, తాకిన వేడిమిగను, ద్రవ రహితముగను, నీలవర్ణముగను, తాపయుక్తముగను, పచ్చగను, యెఱ్ఱగను, ఆమ యుక్తముగను, మలము వెడలుట, ఆఅంకురములు, యవాకారముగ మధ్యమునందు లావుగనుండుట, మరియు, చర్మము, కన్నులు, గోళ్లు, మొదలగునవి పసుపువర్ణము గను, ఆకుపసరువర్ణముగనుండుట, ఇట్టి లక్షణములు గలిగియుండునని తెలిసికొన వలయు.

## కఫార్శోనిదానము

మధురస్నిగ్ధశీతాని లవణామ్లగురూణి చ,
అవ్యాయామదివాస్వప్నశయ్యాసనసుఖే రతిః. 31
ప్రాగ్వాతసేవాశీతౌ చ దేశకాలావచింతనమ్,
శ్లైష్మికాణాం సముద్దిష్టమేతత్కారణమర్శసామ్. 32

తా. మధురము, స్నిగ్ధము, శీతము, ఉప్పు, పులుసు, జడత్వము మొదలగు వానిని సేవించుట, వ్యాయామముచేయకనే పగలు నిద్రించుట, శయనించియుండుట, సుఖముగ కూర్చుండుట, మరియు తూర్పుగాలియందు సంచరించుట, శీతదేశము, శీత కాలము ఏమియుచింతించక సోమరితనముగనుండుట ఇట్టి కారణములవలన కఫోల్బణార్శోరోగము జనించునని తెలిసికొనవలయు.

## కఫజార్శోరోగలక్షణము

శ్లేష్మోల్బణా మహామూలా ఘనా మందరుజస్సితాః,

ఉత్పన్నోపచితాస్స్నిగ్ధాః స్తబ్ధా వృత్తగురుస్థిరాః. 33
పిచ్ఛిలాస్తిమితాశ్శ్లక్ష్ణాః కండ్వాఢ్యాః స్పర్శనప్రియాః,
వంక్షణానాహినఃపాయువస్తినాభివికర్షిణః. 34
సశ్వాసకాసహృల్లాసప్రసేకారుచిపీనసాః,
మేహకృచ్ఛ్రశిరోజాడ్యశిశిరజ్వరకారిణః. 35
క్లైబ్యాగ్నిమార్దవచ్ఛర్దిరామప్రాయవికారదాః,
వసాభసకఫప్రాజ్యపురీషాస్సప్రవాహికాః. 36
న స్రవంతి న భిద్యంతే పాండుస్నిగ్ధత్వగాదయః,

తా. మొలకలు ధాతుసమీపమునుండి వెడలి, కఠినముగను, కొంచెముపీడతో గూడియును, తెలుపుగను, పొడవుగను, మినమినలాడుచును, గూటమువలెను, గుండ్రముగను, గుదమునకు బరువుగను, స్థిరముగను, బంకగను, స్థిమితముగను, నునుపుగనుండుట, గీరినను, తాకినను సుఖకరములుగనుండి, గజ్జలయందుఉబ్బుట, గుదము, వస్తి, నాభి వీనిని యీడ్చిపట్టినటులనుండుట, ఉబ్బసము, దగ్గు, జొల్లు, హృల్లాసము, అరుచి, పడిశము ఇవిజనించుట, మేహము, మూత్రకృచ్ఛ్రము, శిరోభారము, శీతజ్వరము, నపుంసకత్వము, అగ్నిమాంద్యము, వాంతి, అమాతిసారము ఇవి గలుగుట, కొవ్వు, కఫము వీనితో సమముగ మిగుల మలము వెడలుట, ప్రవాహికను గలుగంజేయుట, మరియు వానిని పిసికిన పగలకయుండుట, రక్తము స్రవించకయుండుట, చర్మము, గోళ్లు, కన్నులు మొదలగునవి తెల్లగ మినమినలాడుట ఇట్టిలక్షణములతో గూడియుండిన దానిని కఫోల్బణార్శోరోగమని తెలిసికొనవలయు.

రక్తార్శోలక్షణము

రక్తోల్బణా గుదే కీలాః పిత్తాకృతిసమన్వితాః. 37
వటప్రరోహసదృశా గుంజావిద్రుమసన్నిభాః,
తేత్యర్థం దుష్టముష్ణం చ గాఢవిట్ కఫపీడితాః. 38
స్రవంతి సహసా రక్తం తస్య చాతిప్రవృత్తితః,
భేకాభః పీడ్యతే దుఃఖైశ్శోణితక్షయసంభవైః. 39
హీనవర్ణబలోత్సాహో హతౌజః కలుషేంద్రియః,
విట్శ్యావం కఠినం రూక్షమధో వాయుర్న గచ్ఛతి. 40

తా. గుదస్థానమునందు ఇనపచీలలవంటి మాంసాంకురములుజనించి పిత్తార్శోలక్షణములుగలిగి మఱ్ఱివూడలకొనలవలె యెఱ్ఱగను, గురిగింజ పగడము వీనివంటి

ఛాయగలవిగనుండి అత్యంత ఉష్ణముగను, రాయివలె కఠినముగను, మిగుల పీడతో గూడి కఫయుక్తముగ మలము వెడలుట, రక్తవృద్ధిచే శీఘ్రముగ రక్తము వెడలుట, మరియు రక్తక్షయజన్యదుఃఖముచే పీడింపబడి శరీరము కప్పవలె పచ్చగనుండుట, వర్ణము, బలము, ఉత్సాహము, తేజస్సు ఇవి హీనముగనుండుట, ఇంద్రియములయందు గ్లాని, నల్లగను కఠినముగను రూక్షముగను మలము వెడలుట, అపానవాయువు వెడలక యుండుట, ఇట్టిలక్షణములతో గూడియుండిన దానిని రక్తార్శోరోగమని తెలిసికొనవలయు.

## వాతాదియుక్త రక్తార్శోలక్షణము

తను చారుణవర్ణం చ ఫేనిలం చాసృగర్శసామ్,
కట్యూర్వాగుదశూలం చ దౌర్బల్యం యది చాధికమ్. 41
తత్రానుబంధో వాతస్య హేతుర్యది చ రూక్షణమ్,
శిథిలం శ్వేతపీతం చ విట్ స్నిగ్ధం గురుశీతలమ్. 42
యద్యర్శసాం ఘనం చాసృక్ తంతుమ త్పాండుపిచ్ఛిలమ్,
గుదం సపిచ్ఛం స్తిమితం గురుస్నిగ్ధం చ కారణమ్. 43
శ్లేష్మానుబంధో విజ్ఞేయ స్తత్ర రక్తార్శసాం బుధైః,

తా. కొంచెముగను యెఱ్ఱగను నురుగుతోగూడియును రూక్షముగను మొలకల నుండి రక్తముస్రవించుట, మొల తొడలు గుదము వీనియందు శూల, మిగులరక్తము స్రవించెనేని దుర్బలత్వము, ఇట్టిలక్షణములుగలది. వాతయుక్తరక్తార్శస్సు అని తెలిసికొనవలయు. మరియు శిథిలముగను, తెల్లగను పచ్చగను నునుపుగను బరువుగను చల్లగను మలము వెడలుట, దట్టముగను దారమువలెను తెల్లగను చిక్కగను మొలకలనుండి రక్తముస్రవించుట, గుదము జిగటగను స్తిమితముగను బరువుగను స్నిగ్ధముగనుండుట ఇట్టిలక్షణములుగలది శ్లేష్మయుక్తరక్తార్శస్సు అని తెలిసికొనవలయు.

## సన్నిపాతికార్శోలక్షణము

సర్వైస్సర్వాత్మకాన్యాహుర్లక్షణైస్సహజాని చ. 44

తా. వాతాదిసమస్తదోషయుక్తలక్షణములుగలిగియుండిన దానిని సన్నిపాతార్శస్సుయని తెలిసికొనవలయు. సహజార్శస్సుగూడ సర్వలింగములతో గూడియుండును.

## అర్శరోగసాధ్యాసాధ్యలక్షణములు

ఏకదోషోత్థితం బాహ్యం సుఖసాధ్యం తథా చిరాత్,

ద్వంద్వజం యాప్యకం చైవ కృచ్ఛ్రసాధ్యం భిషగ్వరైః. 45
అంతర్వళిత్రిదోషోత్థాన్యసాధ్యార్శాంసి తాని చ,
కుర్వన్తి సర్వరోగాంశ్చ తస్మాద్యత్నేన తజ్జయేత్. 46

తా. మూలరోగము ఏకదోషమువలనగాని, వెలుపలి వళియందుగాని జనించి నను లేక జనించి చిరకాలము కౌకయుండినను సుఖసాధ్యము. ద్వంద్వదోషము వలన జనించిన మూలరోగము కష్టసాధ్యముగాన యాప్యము. అంతర్వళియందు జనించిన మూలరోగంబును, త్రిదోషమువలన జనించిన మూలరోగంబును అసాధ్యంబులు. మరియు, మూలము సర్వరోగోత్పత్తికి కారణమగుటవలన దానిని సర్వప్రయత్నముచే నివర్తింపజేయవలయు.

అసాధ్యార్శ ఉపద్రవములు

హస్తపాదే ముఖే నాభౌ శోఫోవృషణయోర్గుదే,
హృత్పార్శ్వశూలం మోహశ్చ ఛర్దిస్తృష్ణాజ్వరారుచీ. 47
రక్తాతిసారో రుక్కార్శ్యమర్శసంమారయన్తి తమ్,

తా. చేతులు, కాళ్లు, ముఖము, నాభి, వృషణములు, గుదము వీనియందు వాపు, రొమ్ము, పార్శ్వములు వీనియందుశూల, మోహము, వాంతి, దప్పి, జ్వరము, అరుచి, రక్తాతిసారము, పీడ, శరీరకృశత్వము ఇవిగలుగుట ఇట్టి యుపద్రవములు గల అర్శరోగులు మరణమును జెందెదరు.

సహజాని త్రిదోషాణి యాని చాభ్యంతరాం వలిమ్. 48
జాయంతేర్శాంసి సంశ్రిత్య తాన్యసాధ్యాని నిర్దిశేత్,

తా. జననకాలముమొదలు స్వాభావికముగ గలిగియుండు అర్శస్సు, త్రిదోషార్శస్సు లోనివళులయందు జనించియుండు అర్శస్సు ఇవి అసాధ్యంబులు.

హృత్పార్శ్వశూలం సంమోహశ్ఛర్దిరంగస్యరుగ్జ్వరః. 49
తృష్ణాగుదస్య పాకశ్చ నిహన్యుర్గుదజాతురమ్,

తా. హృదయపార్శ్వములయందు శూల, ఇంద్రియమనస్సులకు మోహము, వాంతి, శరీరపీడ, జ్వరము, దప్పి, గుదవ్రణము ఇట్టిలక్షణముల తోగూడియుండు మూలరోగి మృతినిజెందు.

తృష్ణారోచకశూలార్తమతిప్రసృతశోణితమ్. 50
శోథాతిసారసంయుక్తమర్శాంసి క్షపయన్తి హి,

తా. దప్పి, అరుచి, శూల, మిక్కిలిరక్తస్రావము, శోఫ, అతిసారము, ఇవిగల మూలరోగి మరణమును జెందు.

అర్శోరోగసుఖసాధ్యలక్షణము

బాహ్యాయాం తు వళౌ జాతాన్యేకదోషోల్బణాని చ. 51
అర్శాంసి సుఖసాధ్యాని న చిరోత్పతితాని చ,

తా. వెలుపలివళియందు జనించినమూలరోగము, ఏకదోషప్రకోపమువలన జనించిన మూలరోగము, ఒకసంవత్సరకాలము గతించకుండెడి మూలరోగములు సుఖసాధ్యంబులని యెఱుంగవలయు.

అర్శోరోగకృఛ్రసాధ్యలక్షణము

ద్వంద్వజాని ద్వితీయాయాం వళౌ యాన్యాశ్రితాని చ. 52
కృచ్ఛ్రసాధ్యాని తాన్యాహుః పరిసంవత్సరాణి చ,

తా. ద్వంద్వదోషమువలన జనించిన అర్శస్సు, రెండవవళియందు జనించిన అర్శస్సు, ఒకసంవత్సరకాలముగతించిన అర్శస్సు ఇవి కష్టసాధ్యంబులని యెఱుంగవలయు. (మరియు వెలుపలి ద్విదోషప్రకోపమువలన జనించిన అర్శస్సు, ఏకదోషప్రకోపమువలన రెండవవళియందు జనించిన అర్శస్సు ఇవియన్నియును కష్టసాధ్యంబులు.)

అర్శఉత్పత్తికిస్థానాంతరము

మేఢ్రాదిష్వపి వక్ష్యంతే యథాస్వం నాభిజాన్యపి. 53
గండూపదాస్యరూపాణి పిచ్ఛిలాని మృదూని చ,

తా మేఢ్రము, నాసిక, కర్ణములు మొదలగు వానియందు దోషభేదమువలన అర్శస్సు (అంకురము) జనించుచున్నదని ముందు చెప్పంబడుచున్నయది. అట్లేరంగున నే నాభియందుసగా అర్శస్సు జనించి అదుఎఱ్ఱముఖముతో సమానముగను జిగటగను మృదువుగ నునుండు.

చికిత్సాప్రక్రియ

అర్శోతిసారగ్రహణీవికారాః ప్రాయేణ చాన్యోన్యనిదానభూతాః.
సన్నేనలే సంతి న సంతి దీప్తే రక్షేదతస్తేషు విశేషతోగ్నిమ్,

తా. అర్శోరోగము, అతిసారము, గ్రహణిరోగము ఇవి ఒకటికినొకటి కారణములుగనుండు. వీనియందు అగ్నిపుష్టిలేకయుండిన నొకటి వలననొకటి జనించు. అగ్నిపుష్టిగలిగియుండిన నొకటి వలన నొకటిజనించదు. కావున పైజెప్పంబడిన రోగములయం దగ్నిపుష్టికరములగు ఉపచారచికిత్సలం జేసికొనవలయు.

చికిత్సాప్రకారము

దుర్నామ్నాం సాధనోపాయాశ్చతుర్ధా పరికీర్తితాః. 55

భైషజ్యక్షారశస్త్రాగ్ని కర్మాణ్యేషాం చ యాపనే,

తా. సాధ్యమైన అర్శోరోగములను సాధించునుపాయములు ఔషధచికిత్స, క్షారచికిత్స, శస్త్రచికిత్స, అగ్నిచికిత్సయని నాలుగుగలవు. వీనిలో దేహప్రకృతి నెఱిగి దేనినైనను జేసికొనందగు. మఱియు యాప్యములను యాపనముజేసికొనవలెను.

అర్శసామౌషధైః క్షారైశ్శస్త్రేణ చ తథాగ్నినా. 56
చికిత్సాస్యాచ్చతుర్ధైవం ముఖ్యం తత్రౌషధం మతమ్,

తా. అర్శోరోగమునకు పైజెప్పంబడిన ఔషధ, క్షార, శస్త్ర, అగ్నిచికిత్సలలో ఔషధచికిత్స ముఖ్యమని తెలిసికొనవలయు.

వాతాద్యర్శశ్చికిత్సా భేదములు

స్నేహస్వేదాదయో వాతే పిత్తే వైరోచనాదయః. 57
కఫే వాంత్యాదయోర్శస్సుమిశ్రే మిశ్రా ప్రతిక్రియా,
పిత్తవద్రక్తజే కార్యః ప్రతీకారోర్శసి ధ్రువమ్. 58

తా. వాతార్శస్సునందు స్నేహక్రియ స్వేదక్రియ మొదలగు క్రియలు చేయందగు. పిత్తార్శస్సునందు విరేచనాదిక్రియలు చేయందగు. కఫార్శస్సునందు వమనాదిక్రియలు చేయందగు. ద్వంద్వజసన్నిపాతార్శస్సులయందు మిశ్రమక్రియలు చేయందగు. రక్తజమునందు పిత్తజమునందువలెనే విరేచనాదిక్రియలు చేయందగు.

వాతార్శస్సునకు మరీచాదిచూర్ణము

మరిచం పిప్పలీ కుష్ఠం సైంధవం జీరనాగరే,
వచా హింగు విడంగాని పథ్యావహ్న్యజమోదకా. 59
ఏతేషాం కారయేచ్చూర్ణం చూర్ణస్య ద్విగుణం గుడమ్,
ఖాదేత్కర్షమితం చాపి పిబేదుష్ణజలం తతః. 60
సర్వాణ్యార్శాంసి నశ్యంతి వాతజాని విశేషతః,

తా. మిరియాలు, పిప్పళ్లు, కుష్ఠము, సైంధవలవణము, జీలకఱ్ఱ, శొంఠి, వస, ఇంగువ, వాయువిడంగములు, కరక, చిత్రమూలము, ఓమము వీనిని చూర్ణించి చూర్ణమునకు రెండింతలు బెల్లముచేర్చి కలిపి పూటకు ఒకతులమువంతున సేవించి పిదప ఉష్ణోదకమును పుచ్చుకొనిన సర్వార్శస్సులు నివర్తింపచేయుటయేగాక, ముఖ్యముగ వాతార్శస్సును నివర్తింపంజేయు.

పిత్తార్శస్సునకు ధుత్తూరాదిచూర్ణము

ధుత్తూరస్య ఫలం పక్వం పిప్పలీనాగరాభయే. 61

వాలకంగుడసంయుక్తం భక్ష్యం గుంజాష్టకం నిశి,
సితామధ్వాజ్యకర్షేణపిబేత్పిత్తార్శసాం జయే. 62

తా. శుద్ధిచేసిన నల్ల ఉమ్మెత్తవిత్తులు, పిప్పళ్లు, శొంఠి, కరక, కురువేరు వీనిని చూర్ణించి ౮ గుంజముల చూర్ణమునందు ౧ తులము నెయ్యి శర్కర తేనెచేర్చి రాత్రి యందుపుచ్చుకొనిన పిత్తార్శోరోగము నశించు.

## రక్తార్శమునకు విషముష్టిచూర్ణము

విషతిందుకబీజాని షడ్వా సప్తాష్టవాపిచ,
చూర్ణితాని సితాయుక్తాన్యస్రార్శోవారణానిచ. 63
మహాప్రమేహత్వగ్దోష కృమి నాశన హేతవః,

తా. శుద్ధిచేసిన విషముష్టివిత్తులను ౬ లేక ౭ లేక ౮ చూర్ణించి బలాబలముల నెరింగి చక్కెరచేర్చిపుచ్చుకొనిన రక్తార్శస్సు, మహామేహములు, త్వగ్దోషము, క్రిమి ఇవియన్నియు నశించు.

## అపామార్గబీజాదిచూర్ణము

అపామార్గస్య బీజాని వహ్నిం శుంఠీం హరీతకీమ్. 64
ముస్తాం కిరాతం తుల్యాంశం సర్వతుల్యం గుడం క్షిపేత్,
కర్షైకం భక్షయేచ్చాను జీర్ణాంతే తక్రభోజనమ్. 65

తా. ఉత్తరేణువిత్తులు, చిత్రమూలము, శొంఠి, కరక, తుంగముస్తలు, సీమ నేలవేము వీనినన్నియు సమభాగములుగచూర్ణించి చూర్ణమునకుసమముగ బెల్లము కలిపి ప్రాతకు ౧ తులమువంతువసేవించి ఔషధము జీర్ణించిన పిదప మజ్జిగఅన్నము భుజించవలయు. దీనివలన అర్శస్సులు నివర్తించును.

## వ్యోషాదిచూర్ణము

వ్యోషార్ద్వారుష్కరవిడంగతిలాభయానాం చూర్ణం గుడేన సహితం సతతం ప్రయోజ్యమ్,
దుర్నామశోఫగరకుష్ఠశకృద్విబంధమగ్నేర్దయత్యబలతాం కృమి పాండుతాంచ. 66

తా. శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, మంచినల్లజీడిగింజలు, వాయువిడంగములు, నువ్వులు, కరక వీనిని సమభాగములుగ చూర్ణించి బెల్లముచేర్చి సేవించిన అర్శస్సు వాపు, విషము, కుష్ఠము, విడ్బంధము, అగ్నిమాంద్యము, కృమి, పాండురోగము ఇవి యన్నియు నశించు.

## విజయాచూర్ణము

త్రికత్రయం వచా హింగుపాఠాక్షారౌ నిశాద్వయమ్,
చవ్యతిక్తాకలింగాని శతాహ్వాలవణాని చ. 67
గ్రంథిబిల్వాజమోదాశ్చగణోష్టావింశతిర్మతః,
ఏతాని సమభాగాని సూక్ష్మచూర్ణాని కారయేత్. 68
చూర్ణం బిడాలపదకం పిబేదుష్ణేన వారిణా,
ఏరండతైలససంయుక్తం లిహ్యాచ్చూర్ణమిదం నరః. 69
హన్యాదర్శాంసి సర్వాణి శ్వాసశోషభగందరాన్,
హృచ్ఛూలం పార్శ్వశూలం చ వాతగుల్మం తథోదరమ్. 70
హిక్కాం శ్వాసం ప్రమేహం చ పాండురోగం సకామలమ్,
ఆమవాతముదావర్తమంత్రవృద్ధిం గుదే కృమీన్. 71
హన్యాచ్చ గ్రహణీరోగాన్ భిషగ్భిర్యే ప్రకీర్తితః,
విజయానామ చూర్ణోయం సర్వవ్యాధిహరః పరః. 72
మహాజ్వరోపసృష్టానాం భూతోపహతచేతసామ్,
అప్రజానాం చ నారీణాం హితమేతద్ధి భేషజమ్. 73

తా॥ కరక, తాడి, ఉశిరికలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, దాల్చిని, ఏలకులు, ఆకుపత్రి, వస, ఇంగువ, అగశుశొంఠి, * ద్విక్షారములు, పసపు, మానిపసపు, చవ్యము, కటుకరోహిణి, కొడిశపాలవిత్తులు, చల్లపిల్లిగడ్డ, † పంచలవణములు, మోడి, బిల్వఫలము, అజామోదము ఈ ౨౮ వస్తువులను సమభాగములుగ చూర్ణించి ౧౦ మాషములయెత్తు చూర్ణము ఉష్ణోదకముతోగాని అనుదముతోగాని పుచ్చుకొనిన అర్శోరోగములన్నియు, శ్వాస, శోష, భగందరము, హృదయశూల, పార్శ్వశూల, వాతగుల్మము, ఉదరము, ఎక్కిళ్లు, ప్రమేహము, పాండురోగము, కామిల, ఆమవాతము, ఉదావర్తము, అంత్రవృద్ధి, కృమి, సంగ్రహణి ఇవియన్నియు నశించుటయే గాక సర్వవ్యాధులును నశించును. మరియు మహాజ్వరము, భూతబాధ వీనిచే పీడింపబడువారు, గొడ్రాలు సేవించిన హితకరముగ నుండు.

## సిద్ధఘృతము

ద్వాత్రింశత్పలకం చాజ్యం ఛాగదుగ్ధం తథైవచ,
ఛాగమాంస రసశ్చైవ దాడిమస్య ఫలద్రవమ్. 74

* సర్జక్షారము, యవక్షారము. † సైంధవము, సౌవర్చలము, బిడము, కాచదు, సాముద్రము.

ప్రత్యేకం ఘృతతుల్యాంశం భాండే క్షిప్త్వాథ నిక్షిపేత్,
ఆమ్రాస్థిత్ర్యూషణం ముస్తం మజ్జాబిల్వకపిత్థయోః. 75
తింత్రిణీధాతుకీపుష్పం రక్తచందనచందనే,
ఉశీరం వాలకం లోధ్రం ప్రియంగుం పద్మకేసరమ్. 76
మంజిష్ఠాబదరీచవ్యం త్వగేలాపద్మకంబలా,
యష్టీమోచరసం చైవ హ్యుత్పలం ప్రతికర్షకమ్. 77
సర్వమేకీకృతం పాచ్యం గ్రాహ్యమాజ్యావశేషకమ్,
యోజయేదర్శసాం హంత్రృ గ్రహణీకృచ్ఛ్రపాండుషు. 78
జ్వరం స్రావమతీసారం కటిశూలం చ నాశయేత్,
ఇదం సిద్ధఘృతం నామ్నా రక్తపిత్తార్శసాం హితమ్. 79

తా. నెయ్యి ౧౨౮ తులములు, మేకపాలు, పెరుగు, మేకమాంసరసము, దాడింబపండ్లరసము ఇవియన్నియు ప్రత్యేకము నేతికి సమము, మామిడిజీడి, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, తుంగముస్తలు, బిల్వఫలము, వెలగపండుగిజరు, చింతపండు, ఆరెపువ్వు, రక్తచందనము, చందనము, వట్టివేరు, కురువేరు, లొద్దుగచెక్క, గుగ్గిలము, తామరకేసరములు, మంజిష్ఠ, రేగు, చవ్యము, లవంగపట్ట, ఏలకులు, పద్మకము, చిట్టాముట్టి, అతిమధురము, బూరుగబంక వీనిని ప్రత్యేకము ౧ తులమువంతునచేర్చి వీనినన్నియూ నెయ్యిమిగులువరకు కాచి ఆ నేతిని పుచ్చుకొనిన మూలవ్యాధి, సంగ్రహణి, మూత్రకృచ్ఛ్రము, పాండురోగము, జ్వరము, రక్తస్రావము, అతిసారము, కటిశూల, పిత్తార్శస్సు, ఇవియన్నియు నశించు.

### అర్శలకు శివరసము

సూతవైక్రాంతశుల్బాభ్ర కాంతాభస్మ సగంధకమ్,
తుల్యాంశం మర్దయేచ్చేదం దాడిమోత్థైరసైస్తథా. 80
భక్షయేన్మాషమేకం తు హంత్యర్శాంసి శివో రసః,

తా. రససిందూరరసము, వైక్రాంతమణి తామ్రము అభ్రకము కాంతము వీని భస్మములు, శుద్ధగంధకము వీనినన్నియు సమభాగములుగ గ్రహించి దాడిమపండ్ల రసముతోనూరి మాషప్రమాణము సేవించిన అర్శోరోగము నశించు. ఇదియ శివరస మనబడును.

### అర్శోరోగమునకు లోహామృతరసము

సంగృహ్యామృతలోహస్య పలాన్యష్టాదశాపిచ. 81

త్రికటుత్రిఫలాదార్వీవహ్ని ముస్తాదురాలభాః,
కిరాతతిక్తకోనింబపటోలకటుకామృతాః. 82
దేవదారువిడంగాని పర్పటం ప్రతికర్షకమ్,
మధ్వాజ్యాభ్యాం లిహేత్కర్షమర్శాంసి గ్రహణీం జయేత్. 83
వాతపిత్తకఫై రక్తైర్నాపి జాతానివా తథా,
ఖ్యాతో లోహామృతో నామ దేహదార్ఢ్యకరః పరః. 84

తా. లోహభస్మము ౨౨ తులములు, పిప్పలి, మిరియాలు, శొంఠి, కరక తాడియుశిరికలు, చిత్రమూలము, తుంగముస్తలు, దురదగొండివేళ్లు, సీమనేలవేము, వేప, చేదుపొట్ల, కటుకరోహిణి, తిప్పతీగె, దేవదారు, వాయువిడంగములు, పర్పాటకము వీనిని ప్రత్యేకము ౧ తులమువంతున చూర్ణించి లోహభస్మమునందుచేర్చి ౧ తులము తేనె నెయ్యి వీనితో సేవించిన సంగ్రహణి, వాతము, పిత్తము, కఫము, రక్తము వీనివలగల్గిన అర్శస్సులు మొదలగు సమస్తరోగములను నశింపజేయుటయేగాక, దేహదార్ఢ్యమును సగాగలుగంజేయు. ఇదిలోహామృతమని ఖ్యాతి జెందెను.

## వైక్రాంతాఖ్యరసము

మృతసూతాభ్రవైక్రాంతకాంతతామ్రం సమం సమమ్,
సర్వతుల్యేన గంధేన మర్ద్యం భల్లాతకం తథా. 85
దినైకం తద్ద్రవైరేవ వటీం కుర్యాద్ద్విగుంజకామ్,
భక్షితం గుదజాన్హంతి ద్వంద్వజాంశ్చ త్రిదోషజాన్. 86
అష్టాష్టముసలీవహ్నిభాగాః కుష్ఠస్య షోడశ,
పిప్పలీపిప్పలీమూలం క్షిపేద్భాగద్వయం పృథక్. 87
చతుర్భాగం విడంగస్తు మరిచం కటుశుంఠికా,
బ్రహ్మదండీ తథైకైకం చూర్ణితం ద్విగుణం గుడమ్. 88
కర్షాంశం భక్షయేచ్చాను హ్యర్శోరోగప్రశాంతయే,
వైక్రాంతాఖ్యో రసో నామ సాధ్యాసాధ్యార్శసాం జయీ. 89

తా. రసభస్మము, అభ్రకభస్మము, వైక్రాంతభస్మము, కాంతభస్మము, తామ్రభస్మము వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి వీనికన్నిటికి సమము గంధకము, శుద్ధిచేసిన జీడిగింజలచూర్ణమునుజేర్చి జీడిగింజలద్రవముతో ౧ దినముమర్దించి ౨ గుంజములప్రమాణము మాత్రలుచేసి, నేలతాడి, చిత్రమూలము ఇవి ప్రత్యేకము ౮భాగములు, కోష్ఠము ౧౬ భాగములు, పిప్పళ్లు ౨ భాగములు, మోడి ౨ భాగములు,

వాయువిడంగములు ౪ భాగములు, మిరియాలు, కటుకరోహిణి, శొంఠి, బ్రహ్మదండి ఇవి ప్రత్యేకము ౧ భాగము వీనిని చూర్ణించి ౧ తులముచూర్ణమునందు పూటకొక మాత్రచొప్పున సేవించిన మూలవ్యాధి నశించు. ఇది యర్శస్సులనన్నిటిని జయించు వైక్రాంతాఖ్యరసమనబడును.

## సూరణమోదకములు

శుష్కాత్సూరణకందతోద్విపలకం వ్యోషం తథా చిత్రకం,
శ్రేష్ఠాజీరకరామఠం పలమితందీప్యాజమోదాన్వితం. 90
సర్వస్యాంఘ్రిమితంచ సింధు జనితం నింబూద్రవైర్మర్దితమ్,
సిద్ధస్సూరణ మోదకోగదహరశ్శ్రేష్ఠో భవేత్ప్రాణినామ్. 91
శూలం సంగ్రహణీం చ రక్తవిస్మృతిం దుష్టాం ప్రవాహీం జయేత్,
దీప్తాగ్నిం కురుతే బలం వితనుతే గుల్మం ప్రణాశంనయే. 92
దర్శాంస్యుద్ధతమారుతామయహరో బాలే చ వృద్ధే హితో,
గర్భిణ్యాం చ న యుజ్యతేతునిపుణై రోగేరక్తపిత్తేపి చ. 93

తా. ఎండిన అడవి కందగడ్డ రెండుపలములు, మిరియాలు, పిప్పళ్లు, శొంఠి, చిత్రమూలము, మిణుగుతామర, జీలకఱ్ఱ, ఇంగువ, ఓమము, అజామోదము ఇవి సమభాగములుగ చూర్ణించి చేర్చి చూర్ణమునకు, నాలవపాలు సైంధవలవణమువైచి పిదప నిమ్మపండ్లరసముతో ఒకదినము మర్దనజేసిన సూరణమోదకము సిద్ధమగు. దీనిని సేవించిన శూల, సంగ్రహణి, రక్తాతిసారము, ప్రవాహికము, గుల్మము అర్శస్సు, వాయుప్రకోపము ఇవి నశించు. మరియు అగ్నిదీప్తి-బలము ఇవికలుగు. ఈ సూరణ మోదకము నిపుణవైద్యులు గర్భిణికి రక్తపిత్తరోగికి ఇవ్వంజనదు.

## పథ్యాదిమోదకములు

పథ్యాంశుంఠీంకణాంవహ్నింప్రత్యేకం చూర్ణయేత్పలమ్,
త్వగేలాపత్రకం చాథ ప్రత్యేకం కర్షమాత్రకమ్. 94
గుడం దశపలం యోజ్యం కర్షం దేయోర్శసాం జయే,

తా. కరక, శొంఠి, పిప్పళ్లు చిత్రమూలము, ఇవిప్రత్యేకము ఒకపలము లవంగపట్ట, లవంగపత్రి, ఏలకులు ఇవి ప్రత్యేకము ౧ తులమువంతునచేర్చి చూర్ణించి ౪౦ తులములు బెల్లముకలిపి కర్షప్రమాణమువంతున సేవించిన అర్శరోగము నివర్తించు.

## అన్యసూరణమోదకములు

చిత్రకస్య పలం త్వేకం ద్విపలం సూరణస్య చ. 95

పలార్థం నాగరస్యాపి మరిచం కోలమాత్రకమ్,
భల్లాతకకణామూలవిడంగ త్రిఫలా కణాః. 96
తాలీసపహితాన్పర్వానక్షమాత్రాన్ప్రియోజయేత్,
ద్వేపలే వృద్ధదారోశ్చ తాలమూలం పలం భవేత్. 97
త్వగేలా మరిచాంశ్చైవ సర్వానేకత్ర చూర్ణయేత్,
గుడేన మర్దయిత్వా తు ద్విగుణేనేహ బుద్ధిమాన్. 98
మోదకస్సూరణో నామ అక్షమాత్ర ప్రమాణతః,
ఉపయుక్తో నిహంత్యాశు గుదకీలాన్న సంశయః. 99
అగ్నివృద్ధికరః పుంసాం సేవ్యమానో మహాగుణః,

తా. చిత్రమూలము ౪ తులములు, కందగడ్డ ౭ తులములు, శొంఠి, ౨ తులములు, మిరియాలు అర్థతులము, జీడి, మోడి, వాయువిడంగములు, కరక, తాడి, ఉశిరికెలు, పిప్పళ్లు, తాళీసపత్రి ఇవి ప్రత్యేకము ౧ తులము, వృద్ధదారుచెక్క ౭ తులములు, నేలతాడిగడ్డలు ౧ తులము, లవంగపట్ట, ఏలకులు ఇవిప్రత్యేకము అర్థతులము ఇవియన్నియుచూర్ణించి చూర్ణమునకు రెండింతలు బెల్లముచేర్చి వుంటలు చేసి ఈసూరణమోదకమును ౧ తులముచొప్పున పుచ్చుకొనిన తత్కాలమునందే మూలవ్యాధి నశించుటయేగాక అగ్నిదీప్తియు గలుగు.

చంద్రప్రభావటుకములు

మృతలోహం పలద్వంద్వం లోహాంశశ్శుద్ధగుగ్గులుః. 100
ద్వయోస్తుల్యాసి తా యోజ్యా త్రిభిస్తుల్యం శిలాజతు,
తుగాక్షీరీ పలైకం తుహ్యాన్యే కర్షాంశకాశ్శ్రణు. 101
విడంగం త్రిఫలా త్ర్యూషం భూనింబో గజపిప్పలీ,
ద్వినిశే పిప్పలీమూలం దేవదారుసువర్చలమ్. 102
సైంధవం ధనికాతాప్యం కచోరోతివిషావృతా,
తాప్యం సర్జయవక్షారా వచాముస్తం చ పత్రకమ్. 103
దంతీ చైలాసూక్ష్మ చూర్ణం మధునా గుటికాం కృతామ్,
కర్షమాత్రాం సదా ఖాదేన్నామ్నా చంద్రప్రభా వటీ. 104
సర్వార్శాంసి నిహంత్యాశు పాండురోగం భగందరమ్,
కృఛ్రాణ్మేహాన్క్షయం కాసం నానారోగహరా పరా. 105

తా. లోహభస్మము ౭ తులములు, శుద్ధగుగ్గులము ౭ తులములు, శర్కర ౧౬ తులములు, శిలాజితు ౩౨ తులములు, తవక్షీరి ౪ తులములు, వాయువిళంగ

ములు, కరక, తాండ్ర, ఉశిరికలు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, సీమ నేలవేము, గజపిప్పలి, పసపు, మానిపసపు, పిప్పలిమూలము, దేవదారు, సౌవర్చలవణము, సైంధవ లవణము, ధనియాలు, స్వర్ణమాక్షికము, కచోరములు, అతివస, తిప్పతీగ, బంగారు శేకు, సజ్జిక్షారము, యవక్షారము, వస, తుంగముస్తలు, లవంగపత్రి, దంతి, ఏలకులు ఇవి ప్రత్యేకము ౧ తులమువంతున చూర్ణించి తేనెచేర్చికలిపి అర్ధరూపాయయెత్తువంతున సేవించిన సకలమూలవ్యాధులు పాండురోగము భగందరము మూత్రకృచ్ఛ్రము ప్రమేహము క్షయ దగ్గు ఇవియన్నియు నశించు. ఇది చంద్రప్రభావటియని చెప్పబడును.

## బృహత్సూరణవటుకలు

సూరణో వృద్ధదారుశ్చ భాగైష్షోడశభిః పృథక్,
ముసలీ చిత్రకౌ జ్ఞేయావష్టభాగమితౌ పృథక్. 106
శివాబిభీతకౌ ధాత్రీ విడంగం నాగరం కణా,
భల్లాతః పిప్పలీమూలం తాలీసం చ పృథక్ పృథక్. 107
చతుర్భాగప్రమాణాని త్వగేలా మరిచం తథా,
ద్విభాగమాత్రాణి పృథక్ తతస్త్వేకత్ర చూర్ణయేత్. 108
ద్విగుణేన గుడేనాథ వటకాన్ కారయేద్బుధః,
ప్రబలాగ్నికరా ఏతే తథార్శోనాశనాః పరాః. 109
గ్రహణీం వాతకఫజాం శ్వాసం కాసం క్షయామయమ్,
ప్లీహానం శ్లీపదం శోఫం హిక్కాం మేహం భగందరమ్. 110
నిహన్యుః పలితం వృష్యా తథా మేధ్యా రసాయనాః,

తా. అడవికంద, పెద్దమ్రానిచెక్క, ఇవి ప్రత్యేకము ౧౬ భాగములు, నేలతాడిగడ్డ, చిత్రమూలము ఇవి ప్రత్యేకము ౮ భాగములు, కరక తాడి ఉశిరికలు వాయువిళంగము శొంఠి పిప్పళ్లు జీడివిత్తులు మోడి తాలిసపత్రి ఇవి ప్రత్యేకము ౪ భాగములు, లవంగపుచెక్క ఏలకులు మిరియాలు ఇవిప్రత్యేకము ౨ భాగములు, వీనినన్నియుచూర్ణించి చూర్ణమునకు రెండుభాగములు బెల్లము చేర్చి కలిపి మాత్రలుజేసి పూటకొకమాత్రచొప్పున సేవించిన మూలవ్యాధి, వాత కఫములవలన జనించిన గ్రహణి, శ్వాస, కాస, క్షయ, ప్లీహ, శ్లీపదము, వాపు, ఎక్కిళ్లు, మేహము, భగందరము, పలితరోగము, ఇవి యన్నియు నశించుటయేగాక అగ్నిదీప్తి వృష్యము మేధ వీనినిగలుగంజేయు,

## కార్పాసమజ్జాఘుటికలు

కార్పాసమజ్జాలశునం సర్జికాక్షారహింగుకే, 111

ఘృతేన కోలమాత్రా హింగుటికార్శోవినాశినీ,

తా. ప్రత్తివిత్తులలోనిపప్పు, ఉల్లిగడ్డలు, సజ్జక్షారము, ఇంగువ, వీనిని చూర్ణించి నేతితోకలిపి మాత్రలుజేసి అర్ధతూపాయయెత్తు సేవించిన అర్శోరోగము నివర్తించు.

త్రిఫలాదిఘుటికలు

త్రిఫలా పంచలవణం కుష్ఠం కటుకరోహిణీ. 112
దేవదారువిడంగాని పిచుమందఫలాని చ,
బలా చాతిబలాచైవ ద్వే హరిద్రే సువర్చలా. 113
ఏతత్సంభృతసంభారం కరంజత్వగ్రసేన తు,
పిష్ట్వా చ గుటికాం కృత్వా బాదరాస్థిసమాం బుధః. 114
ఏకైకాం తాం సముద్ధృత్య రోగే రోగే పృథక్ దదేత్,
అర్శాంసి హంతి తక్రేణ గుల్మానమ్లేన నిర్హరేత్. 115
ఉష్ణేన వారిణా పీతా శాంతమగ్నిం ప్రదీపయేత్,
కృమీన్జంతుఘ్నయోగేన త్వగ్దోషం ఖదిరాంబునా. 116
మూత్రకృఛ్రం తు తోయేన హృద్రోగం తైలసంయుతా,
ఇంద్రీస్వరససంయుక్తా సర్వజ్వరవినాశినీ. 117
మాతులుంగరసేనాథ సద్యశ్శూలహరీ స్మృతా,
కపిత్థతిందుకానాం తు రసేనసహమిశ్రితా. 118
విషాణి హంతి సర్వాణి పానాలేపనయోగతః,
శక్రగోపసమాయుక్తా హన్యాత్కుష్ఠాని సర్వశః. 119
శ్యామాకషాయసహితా జలోదరవినాశినీ,
భుక్తాజీర్ణంహి జయతి భుక్తస్యోపరి యోజితా. 120
అక్షిరోగేషు సర్వేషు మధునాప్యంచితా జయేత్,
లేపమాత్రేణ నారీణాం సద్యః ప్రదరనాశినీ. 121
వ్యవహారే తథా ద్యూతే సంగ్రామే మృగయాదిషు,
సమాలభ్య వటీమేనాం క్షిప్రం విజయమాప్నుయాత్. 122

తా. త్రిఫలములు, పంచలవణములు, చెంగల్వకోష్ఠు, దేవదారు, వాయువిడంగములు, వేపపండ్లు, పెద్దముత్తవపులగ, చిన్నముత్తవపులగ, పసపు, మానిపసపు, సర్జక్షారము, వీనినన్నియు సమముగచేర్చి కానుగపట్టరసముచేనూరి రేగుగింజలంత మాత్రలుజేసి అందొకమాత్ర మజ్జికతోపుచ్చుకొనిన అర్శోరోగము; నిమ్మపండ్లరస

ముతో పుచ్చుకొనిన గుల్మము, ఉష్ణోదకముతో పుచ్చుకొనిన అగ్నిమాంద్యము, వాయు విళంగముల కషాయముతో పుచ్చుకొనిన జంతురోగము, చంద్రకషాయముతో పుచ్చుకొనిన త్వగ్దోషము, ఉదకముతో పుచ్చుకొనిన మూత్రకృచ్ఛ్రము, తిలతైలముతో పుచ్చుకొనిన హృద్రోగము, కొడిశపాలస్వరసముతో పుచ్చుకొనిన సర్వజ్వరములు, మాదీఫలరసముతో పుచ్చుకొనిన సద్యశ్శూల, వెలగ నల్లతుమికి వీని రసముతో పుచ్చుకొనిన సర్వవిషములు, ఇంద్రగోపక్రిములతో పుచ్చుకొనిన సర్వకుష్ఠములు, పిప్పలి కషాయముతో పుచ్చుకొనిన జలోదరము, భోజనాంతమున పుచ్చుకొనిన అజీర్ణము, తేనెతోచాది అంజనంబిడిన సమస్తనేత్రరోగములు, లేపనముచేసిన స్త్రీలయొక్క ప్రదరరోగములు, ఇటుల అనుపానభేదములచే సర్వరోగములు నివర్తించు, మరియు వ్యవహారము జూదము యుద్ధము వీట్లయందు సగా దీనిని ధరించిన జయముగలుగు.

### భల్లాతకహారీతకి

భల్లాతకహారీతక్యౌ పాఠా కటుకరోహిణీ,
యవాన్యజాజీకుష్ఠం చ చిత్రకాతివిషే వచా. 123
కచోరం పౌష్కరం మూలం హింగుచేంద్రయవం తథా,
శుంఠీసౌవర్చలం తుల్యం గవాం మూత్రేణ పేషయేత్. 124
ధాయాశుష్కాం చ వటికాం మాషమాత్రాం చ భక్షయేత్,
పిబేదుష్ణోదకం పశ్చాత్కఫోత్థార్శాంసి సంజయేత్. 125

తా. జీడిగింజలు, కరకపిందెలు, విషబొద్ది, కటుకరోహిణి, ఓమము, జీలకఱ్ఱ చెంగల్వకోష్ఠు, చిత్రమూలము, అతివస, వస, కచోరములు, పుష్కరమూలము, ఇంగువ, కొడిశపాల, శొంఠి, సౌవర్చలవణము వీనిని సమభాగములుగ చూర్ణించి, గోమూత్రముతో మర్దించి మినపగింజలంతమాత్రలుజేసి నీడను యెండించి సేవించి పిదప ఉష్ణోదకము పుచ్చుకొనిన కఫార్శస్సు నివర్తించు.

### రక్తార్శస్సులకు భల్లాతకామృతము

భల్లాతకచతుఃషష్టిపలం దుగ్ధం చ తత్సమమ్,
దుగ్ధాచ్చతుర్గుణంవారి పాచ్యం దుగ్ధావశేషకమ్. 126
దుగ్ధతుల్యం ఘృతం యోజ్యం ఘృతపాదం సితాం క్షిపేత్,
మధుధాత్రీ సితాతుల్యాం సితార్ధమభయారజః. 127
మృతలోహాం గుడూచీ చ ప్రత్యేకమభయార్ధకమ్,
క్షిపేత్స్నిగ్ధఘటే సర్వం ధాన్యరాశౌ నివేశయేత్. 128
సప్తాహాదుద్ధృతం తత్తు ఖాదేన్నిష్కత్రయం త్రయమ్,

భల్లాతకామృతం నామ హంతిరక్తార్శసాం కిల. 129
క్షారం తీక్ష్ణం న భోక్తవ్యం తైలాభ్యంగం చ వర్జయేత్,

తా. జీడిగింజలు ౪౮ పలములు, పాలు ౪౮ పలములు, ఉదకము ౨౫౬ పలములు, వీనినన్నియు నేకముగ చేర్చి పాలు మిగులునటుల కాచి అందు, పాలకుసమము నెయ్యి, నెయ్యిలో నాలవపాలు చక్కెర, చక్కెరకుసమము తేనె తేనెకు సమము, ఉశిరికవలుపు చూర్ణము, ఉశిరిక చూర్ణములో సగము కరక చూర్ణము కరకచూర్ణములో సగము లోహభస్మము లోహభస్మమునకు సమము తిప్పసత్తు వీనినన్నిటిని నేకముగ చేర్చి నేతితో మాగినకుండయందు వైచి ౭ దినములు ధాన్యరాశియందునిచి పిదప 3 - వరహాలయెత్తువంతున సేవించి, క్షారము తీక్ష్ణములగు భోజనపదార్థములు తైలాభ్యంగము వీనిని వర్జించిన రక్తార్శస్సు నివర్తించు.

— అభ్రిహరీతకీ —

మృతాభ్రం వింశతిపలం మృతలోహస్యంచచ. 130
గంధకస్యతథాపంచ త్రిభ్యోద్విగుణమాక్షికమ్,
పథ్యాశతపలం యోజ్యం ధాత్రీపలశతద్వయమ్. 131
సర్వమేకత్ర తచ్చూర్ణం జంబీరైర్భావయేద్దినమ్,
భృంగీపునర్ణవాద్రావైః కుమారీగుడసంయుతైః. 132
భల్లాతవహ్నికోరంటైర్హస్తిపిప్పలిలాంగలీ,
క్షీరిణీజలకుంభీభిః ప్రత్యేకం ప్రత్యహం ద్రవైః. 133
భావయేన్మర్దయేదిత్థం మధ్వాజ్యాభ్యాం విలోపయేత్,
స్నిగ్ధభాండే స్థితం ఖాదేన్నిత్యం నిష్కద్వయం ద్విశః. 134
సిద్ధశాబరయోగోయం త్రిదోషార్శాంసి నాశయేత్,

తా. అభ్రికభస్మము ౨౦ పలములు, లోహభస్మము ౫ ఫలములు, గంధకము ౫ పలములు, సువర్ణమాక్షికము ౬౦ పలములు, కరకవోలుపు ౧౦౦ పలములు, ఉశిరికవోలుపు ౨౦౦ పలములు, వీనినన్నియు చూర్ణించి నిమ్మపండ్లరసముతో ౧ దినము భావనజేసి యెండించి పిదప గుంటగలగర, తెల్లగలిజేరు, కలబంద, జెల్లము, జీడిగింజ బెరడు, చిత్రమూలము, గోరింట, గజపిప్పలి, చెన్నచర్లగడ్డ, తవక్షీరి, చేదాసుగ వీనిరసములతో ప్రత్యేకము నొక్కొక్కదినము మర్దించి తేనె నెయ్యికలిపి నేతితో మాగినకుండయందునిచి ప్రతిదినము ౨ నిష్కములప్రమాణము సేవించిన త్రిదోషార్శస్సు నివర్తించు.

### యోగరాజగుగ్గులు

కణాగజకణావహ్నివిడంగేంద్రయవాసకైః. 135
కటుకాపిప్పలీమూల భార్గీపాఠాజమోదకైః,
మూర్వా శుంఠీ హింగుచవ్యైస్సమైస్సర్వాంశగుగ్గులుం. 136
చూర్ణయేన్మధునా ఖాదేత్కర్షాంశం యోగరాజకమ్,
రక్తవాతార్శసీగుల్మగ్రహణీపాండుజిద్భవేత్. 137

తా. పిప్పలి, గజపిప్పలి, చిత్రమూలము, వాయువిళంగములు, కొడిశపాల, దూలగొండి, కటుకరోహిణి, గంటుభారంగి, విషబొద్దివేరు, ఓమము, చాగవేరు, శొంఠి, ఇంగువ, చవ్యము, ఇవియన్నియు సమభాగములు వీనికిసమము గుగ్గిలముచేర్చి చూర్ణించి ౧ తులము తేనెతో సేవించిన రక్తార్శస్సు వాతార్శస్సు గుల్మము గ్రహణి పాండువు ఇవి యన్నియు నివర్తించు. ఇది యోగరాజగుగ్గులు.

### రజనీచూర్ణము

ప్లావితం రజనీచూర్ణస్నుహీక్షీరైః పునఃపునః,
బంధయేత్సుదృఢం సూత్రం ఛినత్త్యర్శోజమంకురమ్. 138

తా. పసపుచూర్ణమును బొంతజెముడుపాలతో మాటిమాటికి భావనజేసి సూత్రమునకు లేపనముజేసి యెండించి మూలవ్యాధి మొలకలకుగట్టిన మొలకలు నశించును.

### చవ్యాదిఘృతము

చవ్యం త్రికటుకం పాఠా క్షారాః కుస్తుంబరూణి చ,
యవానీ పిప్పలీమూలముభే చ బిడసైంధవే. 139
చిత్రకం బిల్వమభయాం పిష్ట్వా సర్పిర్విపాచయేత్,
సకృద్వాతానులోమాయ దత్త్వా దధి చతుర్గుణమ్. 140
ప్రవాహికాం గుదభ్రంశం మూత్రకృచ్ఛ్రం పరిస్రవమ్,
గుదవంక్షణశూలం చ ఘృతమేతద్వ్యపోహతి. 141

తా. చవ్యము, శొంఠి, పిప్పలి, మిరియాలు, విషబొద్ది, * సర్వక్షారములు, ధనియాలు, ఓమము, పిప్పలిమూలము; బిడాలవణము, సైంధవలవణము, చిత్రమూలము, బిల్వఫలము, కరక్కాయలు, వీనినన్నియు సమభాగములుగ నూరి కల్కముజేసి నెయ్యి నాలుగింతలు పెరుగుచేర్చి ఘృతపక్వముగవండి సేవించిన వాతానులోమనము

* సర్జక్షారము, యవక్షారము, టంకణము.

నంజేయు. మఱియు ప్రవాహిక, గుదభ్రింశము, మూత్రకృఛ్రము, గుదస్రావము, గుదము గజ్జలు వీనియందు శూల ఇవి నివర్తించు.

## హ్రీబేరఘృతము

హ్రీబేరముత్పలం లోధ్రం సమంగాచవ్యచందనే,
యాసా చాతివిషా బిల్వాం ధాతకీదేవదారు చ. 142
దార్వీ త్వఙ్నాగరం మాంసీ ముస్తా క్షారో యవాగ్రజః,
చిత్రకశ్చేతి పేష్యాణి చాంగేరీ సర్వసే ఘృతమ్. 143
ఏకత్ర సాధయేత్సర్వం తత్సర్పిః పరమౌషధమ్,
అర్శోతిసారగ్రహణీ పాండురోగే జ్వరే రుచౌ. 144
మూత్రకృచ్ఛ్రే గుదభ్రంశే వస్త్యానాహే ప్రవాహకే,
పిచ్ఛాస్రావేర్శసాం మూలే యోజ్యమేతత్త్రిదోషహృత్. 145

తా. వట్టివేరు, నల్లకలువగడ్డలు, లొద్దుగ, మంజిష్ఠి, చవ్యము, చందనము, దూలగొండి, అతివస, బిల్వఫలము, ఆరెపువ్వు, దేవదారు, మానిపసపు, లవంగపట్ట, శొంఠి, జటామాంసి, తుంగముస్తలు. యవక్షారము, చిత్రమూలము, వీనిని కల్కము జేసి, * చాంగేరీస్వరసము ఘృతము, వీనితో సిద్ధముజేయబడిన, ఘృతమును సేవించిన, అర్శోరోగము, అతిసారము, గ్రహణి, పాండురోగము, జ్వరము, అరుచి, మూత్రకృఛ్ఛ్రము, గుదభ్రింశము, వస్తియందలి ఆనాహము, ప్రవాహిక, రక్తస్రావము, మూలవ్యాధి, త్రిదోషములు, ఇవి యన్నియు నివర్తించు.

## భల్లాతకాదిలేపము

భల్లాతకగజాస్థీని దంతీ నింబీకపోతవిట్,
గుడసౌరాష్ట్ర్యమృతజైర్లేపశ్శ్లేష్మార్శసాం జయీ. 146

తా. జీడిగింజలు, ఏనుగదంతము, దంతివేరు, వేప, పావురపిట్టమలము, బెల్లము, తువరిమట్టి, నాభి వీనిని నూరి లేపనముజేసిన, కఫార్శోరోగము నివర్తించు.

## గుంజాకూష్మాండలేపము

గుంజా కూష్మాండబీజం చ సూరణేన చ వర్తికామ్,
లేపితాం ఛాయయా శుష్కాం గుదగాహ్యార్శసాం భిదా. 147

తా. గురిగింజలు, గుమ్మడువిత్తులు, కంద వీనిని నేకముగ జేర్చి నూరి, వత్తికి లేపనముజేసి నీడను ఆరనిచ్చి గుదమందిడిన అర్శోరోగము నివర్తించు.

---

* పులిచింత.

### గౌరీపాషాణలేపము

గౌరీపాషాణకర్షం స్నుహీకాండే వినిక్షిపేత్,
పాచయేత్పుటపాకేన తతఉద్ధృత్య యత్నతః. 147
రేవాచినీచకుష్ఠం చ కల్కీ కృత్యత్రయం సమమ్,
లేపయేత్తేన చార్శాంసి నివార్యంతే న సంశయః. 148

తా. గౌరీపాషాణము, ౧ కర్ష మెత్తు, బొంతజెముడు కట్టియందు పల్లముచేసి ఉనిచి ఆపల్లమునుమూసి పుటమువైచి పిదప దానినిదీసి రేవల్చిన్ని, చెంగల్వకోష్ఠు వీనిని ఖల్వమునందునిచి నూరి లేపనముజేసిన అర్శోరోగము నివర్తించు.

### అర్శోరోగపథ్యములు

కతకసూరణజాలిపునర్ణవంమధితమాజ్యనవోద్ధృతరామఠమ్,
మరిచకం సురదారుఫలం తథా పటువచాబృహతీద్వయజీవనీ. 149
సమిసినవ్యముదుంబరవాస్తుకంత్వితిహితం గుదకీలగదేషు చ,

తా. ఇందుపుకాయ, కందగడ్డలు, పొట్లకాయ, గలిజేరు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఆవువెన్న ఇంగువ, మిరియాలు, దేవదారు, దుంగపండు, సైంధవలవణము. వస, ములుక, మనుబాల, సదాప, లేతఅత్తిపిందెలు, చిట్టికూర ఇవియన్నియు అర్శరోగమునందు పథ్యములని యెరుంగవలయు.

### అపథ్యములు

పిండాలమాషపిణ్యాకదధిమత్స్యాతిశీతలమ్. 150
అలాబూవార్తకం చైవ పిష్టం బిల్వముపోదకీ,
హిమాంబుసూపమాంసాని కఠినం కుక్కుటాసనమ్. 151
అశ్వాద్యారోహణం స్నానమపథ్యం ప్రాహురర్శసామ్,

తా. పెండలము, మినుములు, గానుగపిండి, పెరుగు, మత్స్యములు, మిగుల శీతలపదార్థములు, అనుపుకాయ, వంకాయ, పిండివంటలు, బిల్వము, బచ్చలికూర, చల్లనీళ్లు, పప్పుదినుసులు, మాంసము, కఠినముగుపదార్థములు, గొంతుకూర్చుండుట, గుఱ్ఱము మొదలగువాని మీఁదెక్కుట, స్నానము ఇవియన్నియు అర్శరోగముల కపథ్యములని యెరుంగవలయు.

# క్రిమిరోగప్రకరణమ్

## క్రిమిభేదములు

కృమయస్తు ద్విధా ప్రోక్తా బాహ్యాంభ్యంతరభేదతః,
బహిర్మలకఫాసృగ్విట్ జన్మభేదాచ్చతుర్విధాః. 1
నామతో వింశతివిధాః,

తా. బాహ్యక్రిములు అంతరక్రిములని రెండువిధంబులుగనుండు. అవి బహిర్మలము కఫము రక్తము విష్ఠఅనువానివలన గలుగుచు నాలుగు విధములుగ నుండు.

## బాహ్యకృమిస్వరూపము

బాహ్యాస్తత్ర మలోద్భవాః 2
తిలప్రమాణసంస్థానవర్ణాః కేశాంబరాశ్రయాః,
బహుపాదాశ్చ సూక్ష్మాశ్చ యూకాలిక్షాశ్చ నామతః. 3
ద్విధా తే కోఠపిటికాకండూగండాన్ప్రకుర్వతే,

తా. అందు బాహ్యమలోద్భవములగు క్రిములు బాహ్యక్రిములనంబడు. అవి తిలప్రమాణములై నలుపువర్ణము లేక తెలుపువర్ణముగలవై, కేశములు వస్త్రములు వీనినాశ్రయించియుండు. మరియు నవి బహుపాదములుగలిగి సూక్ష్మములై యూకములని, లిక్షములని, (అనగా, పేలు, ఈళ్లు, అని) నామములతో ప్రసిద్ధినిజెంది యుండు. ఇటుల ద్వివిధంబులగు క్రిములు, కోఠముపిటికలు (అనగా) గ్రంధులు, దురద (జిల) కణుతులు, వీట్లను గలుగంజేయు,

## అంతఃక్రిములుజనించుటకు కారణము

అజీర్ణభోజీ మధురామ్లనిత్యో ద్రవప్రియః పిష్టగుడోపభోక్తా. 4
వ్యాయామవర్జీ చ దివాశయానో విరుద్ధభుక్సన్లభతే కృమీంశ్చ,

తా. జీర్ణముగాకయుండునపుడు భుజించుట, మధురద్రవ్యములు ఆమ్లద్రవ్యములు ద్రవద్రవ్యములు చలిమిడిపిండి వీనియొక్క సేవ, వ్యాయామములేకుండుట, పగలు నిద్రించుట, విరుద్ధాన్నసేవ, వీట్లచే క్రిమిరోగము జనించు.

## పురీష కఫ రక్తజ కృమికారణములు

మాషపిష్టాన్నలవణగుడశాకైః పురీషజాః. 5
మాంసమాషగుడక్షీరదధిసూక్తైః కఫోద్భవాః,

విరుద్ధాజీర్ణశాకాద్యైః శోణితోత్థా భవన్తి హి. 6

తా. అంగు, మినుములు, పిష్టాన్నము, అతిలవణము, బెల్లము, ఆకుకూరలు వీనివలన పురీషక్రిములు జనించు, మరియు, మాంసము, మినుములు, బెల్లము, పాలు, పెరుగు, సూక్తము వీనివలన కఫక్రిములు జనించు. మరియు విరుద్ధశాకములు అజీర్ణకర శాకములు వీనివలవన రక్తజక్రిములు జనించు.

కడుపుయందు పురుగులు జనించియుండుటకు లక్షణము

జ్వరో వివర్ణతా శూలం హృద్రోగస్సదనం భ్రమః,
భక్తద్వేషోతిసారశ్చ సంజాతక్రిమిలక్షణమ్. 7

తా. జ్వరము, వివర్ణత, శూల, హృద్రోగము, చిక్కిపోవుట, భ్రమ, అన్న ద్వేషము, అతిసారము, వీట్లచే ఉదరమునందు క్రిములుజనించినవియని యెరుంగ వలయు.

కఫజక్రిమిలక్షణము

కఫాదామాశయే జాతా వృద్ధాస్సర్పంతి సర్వతః,
పృథువర్ధ్మనిభాః కేచిత్కేచిద్గండూపదోపమాః. 8
రూఢధాన్యాం కురాకారా స్తనుదీర్ఘా స్తథాణవః,
శ్వేతాస్తామ్రావభాసాశ్చ నామతః సప్తధా తు తే. 9
అంత్రాదా ఉదరా వేష్టాహృదయాదామహారుజః,
చురవో దర్భకుసుమాస్సుగంధా స్తే చ కుర్వతే. 10
హృల్లాసమాస్యశ్రవణమవిపాకమరోచకమ్,
మూర్ఛాఛర్దితృషానాహకార్శ్యక్షవథుపీనసాన్. 11

తా. కఫమువలన ఆమాశయమునందు క్రిములు జనించి వృద్ధిజెంది అంతట వ్యాపించు. అవి గొప్పవై త్రాళ్లవలెను భూనాగము (ఎఱ్ఱ) వలెను ధాన్యాంకురము వలెను సన్నమై దీర్ఘములుగను అణువులుగను తెల్లగను యెఱ్ఱగను ఇటుల 7 విధంబులుగనుండు. మరియు నివి అంత్రాదములు, ఉదరావేష్టములు, హృదయాదములు, మహారుజములు, చురవములు, దర్భకుసుమములు, సుగంధములని క్రమముగ నామములచే 7 విధంబులై విలసిల్లు. మరియునివి హృల్లాసము, నోటనీరుకారుట, అన్నము జీర్ణముగాకపోవుట, అరుచి, మూర్ఛ, వాంతి, దప్పి, కృశత్వము, వాపు, పీనస వీనిని గలుగంజేయు.

రక్తజక్రిమిలక్షణము

రక్తవాహిసిరాస్థానా రక్తజా జంతవోణవః,
అపాదా వృత్తతామ్రాశ్చ సౌక్ష్మ్యాత్కేచిదదర్శనాః. 12

కేశాదా రోమవిధ్వంసా రోమద్వీపా ఉదుంబరాః,
షట్ తే కుష్ఠైకకర్మాణః సహసౌర సమాతరః. 13

తా. రక్తజక్రిములు రక్తవాహిసిరలయందు సంచరించుచుండు. అవి దారములవలెను సూక్ష్మములుగను పాదరహితములుగను గుండ్రములుగను యెఱ్ఱగను నుండు. అందుమరికొన్ని అతిసూక్ష్మములై యగుపడకనుండు. మరియునివి కేశాదములు, రోమవిధ్వంసములు, రోమద్వీపములు, ఉదుంబరములు, సౌరసములు, మాతలని ౬ విధములగు నామములతో విలసిల్లు. ఈ ౬ విధంబులగు రక్తజక్రిములు ముఖ్యముగ కుష్ఠమునే గలుగంజేయు.

పురీషజక్రిమిలక్షణము

పక్వాశయే పురీషోత్థా జాయన్తేథో విసర్పిణః,
ప్రవృద్ధాస్స్యుర్భవేయుశ్చ తే యదామాశయోన్ముఖాః. 14
తదాస్యోద్గారనిశ్వాసా విడ్గంధానువిధాయినః,
పృథువృత్తతనుస్థూలాః శ్యావపీతసితాసితాః. 15
తే పంచనామ్నా కృమయః కకేరుకమకేరుకాః,
సౌసురాదామలాదాశ్చ లేలిహా జనయన్తి చ. 16
విడ్భేదశూలవిష్టంభకార్శ్యపారుష్యపాండుతాః,
రోమహర్షాగ్నిసదనగుదకంతూర్వీమార్గగాః. 17

తా. పురీషజక్రిములు, పక్వాశయమునందుజనించి గుదస్థానమునందు సంచరించుచుండు. అవి ప్రవృద్ధంబులై ఆమాశయోన్ముఖంబులుగ సంచరించె నేని, తేనుపులు, మలగంధముగల శ్వాసోచ్ఛ్వాసములు, వీనిని గలుగంజేయు. మరియునవి కొన్ని గొప్పలుగను, కొన్ని గుండ్రములుగను. కొన్ని సూక్ష్మములుగను, కొన్ని లావుగను, కొన్ని శ్యామలవర్ణముగలవిగను, కొన్ని పీతవర్ణముగలవిగను, కొన్ని తెల్లగను, కొన్ని నల్లగనునుండు. మరియు నివి,కకేరుకములు, మకేరుకములు, సౌసురాదములు,మలాదములు, లేలిహాములని, అయిదు నామములచే విలసిల్లు. మరియు నివి మలము పుంటలుంటలుగబడుట, శూల, మలబద్ధము, కృశత్వము, శరీరము గరగరలాడుట, తెలుపువర్ణము ఇవి గలిగించుచుండు. మరియు నీక్రిములు, ఇతర ఆశయములయందు సంచరించిన, రోమాంచము, అగ్నిమాంద్యము, గుదమునందు దురద ఇవి జనించు.

దాడిమాదికషాయము

దాడిమత్వక్కృతః క్వాథస్తిలతైలేన సంయుతః,
త్రిదినాత్పాతయేదేవ కోష్ఠతః కృమిజాలకమ్. 18

తా. దాడింబపట్టకషాయమునందు నూనెచేర్చి, 3 దినములు పుచ్చుకొనిన, కోష్ఠగతములగునందు కృములు పడిపోవును.

నియమనాదికషాయము

నియమనస్త్రిఫలా కుటజోవచా త్రికటుకం ఖదిరం త్రివృతాయుతమ్,
మునిదినం హి గవాం సలిలేన చ శృతమిదం కృమినాశకరంపిబేత్. 19

తా. వేపయీనెలు, కరక, తాడి, యుశిరికలు, కొడిశపాలపట్ట, వస, శొంఠి, పిప్పలి, మిరియాలు, చంద్ర, తెల్లతెగడ, వీనిని గోమూత్రమున కషాయముకాచి, 8 దినములు పుచ్చుకొనిన, కృములు నశించు.

విడంగాదికషాయము

విడంగశృతపానీయం విడంగేనావధూలితమ్,
పీతం కృమిహరం దుష్టకృమిజాతాన్నిపాతయేత్. 20

తా. వాయువిడంగములను కషాయముబెట్టి అందు వాయువిడంగముల చూర్ణమునే చేర్చి పుచ్చుకొనిన సకలకృములు నశించు.

ముస్తాదికషాయము

ముస్తాఖుపర్ణీఫలదారుశిగ్రుక్వాథస్సకృష్ణా కృమిశత్రుకల్కః,
మార్గద్వయేనాపి చిరప్రవృత్తాన్కృమీన్నిహన్యాత్కృమిజాంశ్చ రోగాన్. 21

తా. తుంగముస్తలు, ఎలికచెవిఆకు, స్రుంగపండు, దేవదారు మునగవేరుపట్ట వీనిని కషాయముబెట్టి అందు పిప్పళ్లు వాయువిడంగములు వీనిచూర్ణమునుజేర్చి పుచ్చుకొనిన వమనవిరేచనరూపముగా రెండువైపులనుండి కృములనుపడజేసి కృమిరోగములు నశించు.

ఖదిరాదికషాయము

ఖదిరః కుటజః పిచుమందవచా త్రికటు త్రిఫలా త్రివృతాసహితమ్,
పశుమూత్రయుతం పిబ సప్తదినం కృమికోటిశతాన్యపిహన్త్యచిరాత్.

తా. చంద్రపట్ట, కొడిశపాల, వేపయీనెలు, వస, శొంఠి పిప్పలి, మిరియాలు, కరక, తాడి, ఉశిరికెలు, తెగడ వీనిని చూర్ణించి, గోమూత్రముతో 8 దినములు పుచ్చుకొనినను, లేక కషాయము బెట్టి పుచ్చుకొనినను, కృమికోటులు నశించు.

కృమికుఠారరసము

కర్పూరం చాష్టభాగం చ కుటజశ్చైకభాగికః,
తత్సమానం త్రాయమాణమజమోదావిడంగకమ్. 23

హింగులం విషభాగం చ తత్సమానం చ కేసరమ్,
సర్వం దృఢం చ సంమర్ద్య భృంగరాజరసై స్తథా. 24
పలాశబీజసంమిశ్ర ముందరీరసభావితమ్,
బ్రాహ్మీరసై ర్భావితం చసిద్ధ్యేత్క్రిమికుఠారకః. 25
వల్లమాత్రాం వటీం కుర్యాద్దద్యాద్ధేమసమన్వితామ్,
కుర్యాత్క్రిమివినాశం చ సప్తరాత్రేణ వై దృఢమ్. 26

తా. రసకర్పూరము ౨ భాగములు, కొడిశపాల, కలుక్రానుగ, ఓమము, వాయువిడంగములు, ఇంగువ, నాభి, నాగకేసరములు, మోదుగవిత్తులు, వీనిని ప్రత్యేకము ౧ భాగముగ్రహించి, గుంటగలిజేరుఆకురసము, ఎలికచెవిఆకురసము, బ్రాహ్మీరసము, వీనిచే నూరి, భావనలుజేసి వల్లమాత్రము వటుకములుజేసి ఉమ్మెత్తకషాయముతో నేడుదినములు పుచ్చుకొనిన కృములు నశించు.

## కృమిముద్గరసము

క్రమేణ వృద్ధం రసగంధకాజమోదావిడంగం విషముష్టికా చ,
పలాశబీజస్య చ చూర్ణమస్య నిష్కప్రమాణం మధునావలీఢమ్. 27
పిబేత్కషాయం ఘనజం తదూర్ధ్వం రసో ప్రయుక్తః కృమిముద్గరాఖ్యః,

తా. రసము ౧ భాగము, గంధకము ౨ భాగములు, అజామోదము ౩ భాగములు, వాయువిడంగములు ౪ భాగములు, విషముష్టివిత్తులు ౫ భాగములు, మోదుగవిత్తులు ౬ భాగములు, వీనిని చూర్ణించి నిష్కప్రమాణము తేనెతో పుచ్చుకొని, పిపదతుంగముస్తల కషాయమును పుచ్చుకొనిన, కృములు నశించు. ఇది కృమిముద్గరరసము.

## విడంగాదిచూర్ణము

విడంగసింధూద్భవహింగుపథ్యాకంపిల్ల సౌవర్చలపిప్పలీనామ్. 28
చూర్ణంకవోష్ణోదకనంగృహీతంకృమీన్నిహన్త్యాశుదహేద్వమించ,
తా. వాయువిడంగములు, సైంధవలవణము, ఇంగువ, కరక, కంపిల్లము, సౌవర్చలవణము, పిప్పలి, వీనిని చూర్ణించి కొంచెము ఉష్ణముగనుండు నుదకముతో పుచ్చుకొనిన కృములు వాంతి ఇవి నివర్తించు.

## ఆఖుపర్ణ్యాదిపిష్టకములు

ఆఖుపర్ణీదళైః పిష్టైః పిష్టకేన చ పూపకాః. 29
భుక్త్వా సౌవీరకం చాను పిబేత్కృమిహరం పరమ్.

తా॥ ఎలికచెవిఆకుసునూరి ముద్దజేసి దానిని వరిపిండితో గలిపి దానిచే అపూపములుజేసి భుజించి పిదప కాంజికమునుపుచ్చుకొనిన కృములు నివర్తించు.

సువర్చికాదిచూర్ణము

సువర్చికారామఠపత్రికాహ్వావిడంగబాంహ్లీకకణాగ్నివిశ్వాః. 30
యవానికాగ్రంధికభద్రముస్తాస్తక్రేణ పీతాంకృమికోటిహాస్స్యుః,

తా. సౌవర్చలవణము,ఇంగువ, జాపత్రి, వాయువిడంగములు, కుంకుమపువ్వు పిప్పళ్లు, చిత్రమూలము, శొంఠి, ఓమము, పిప్పలిమూలము, తుంగముస్తలు వీనిని చూర్ణించి మజ్జిగతో పుచ్చుకొనిన కృమికోటి నివర్తించు.

నింబాదిచూర్ణము

నింబవత్సకవిడంగసంయుతం రామఠేన సహ జంతునాశనమ్. 31
నింబపత్రమజమోదకాన్వితం చూర్ణమేవ మధునా ప్రశస్యతే,

తా. వేప, కొడిశపాల, వాయువిడంగములు, ఇంగువ,వీనినిచూర్ణించి తేనెతో పుచ్చుకొనినను, లేతవేపఆకులు, ఓమము వీనిని చూర్ణించి తేనెలోపుచ్చుకొనినను, కృమిరోగము నివర్తించు.

హారీతకీచూర్ణము

హారీతకీ చైవ తథా హరిద్రా సౌవర్చలంచైవ సమంస విచూర్ణితమ్.
ఇంద్రవారుణిజలేన భావితం కీటసంఘవినివారణం పరం,

తా. కరకపోలుపు, పసుపు, సౌవర్చలవణము, వీనిని సమములుగ చూర్ణించి పాపరవెళ్లకషాయముచే మర్దనజేసి పుచ్చుకొనిన క్రిములు నివర్తించు.

సావిత్రీవటుకములు

ఫలం కషాపలే ద్వే చ కార్ష్ణాయసపలద్వయమ్. 33
పథ్యామృతాక్షధాత్రీణాం పృథగేకైకశః పలమ్,
పూతీకచవ్యవ్యోషాగ్నికారవీకృమినాశనైః. 34
చూర్ణితైరర్ధపలికైస్తిలతైలం పలద్వయమ్,
త్రిఫలాయా రసప్రస్థే ఖండం ప్రస్థయుగం పచేత్. 35
దర్వీప్రలేపాత్పాకశ్చ చాతుర్జాతకసంయుతమ్,
సావిత్రీ వటకా హ్యేతే యథాగ్నిబలభక్షితాః. 36
కృమికోష్ఠాగ్నిదార్బల్య శోథగుల్మోదరవ్రణాన్,
కామలాపాండురోగార్శోభగందరగదవ్రణాన్. 37

నిహన్త్యస్త్రాశ్చసంసిద్ధావయః స్థైర్యబలప్రదాః,
వాయుమేహప్రశమనాశ్చక్షుషః ప్రీతివర్ధనాః. 38
భవన్త్యతిస్నిగ్ధభుజో వాతాతపనిషేవిణః,

తా. మోదుగవిత్తులు ౨ పలములు, లోహభస్మము ౨ పలములు, కరక, తిప్పతీగె, తానికాయ, ఉశిరికవొలుపు, ఇవి ప్రత్యేకము ౧ ఫలము కొనుగ, చవ్యము, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, ఓమము, వాయువిడంగములు ఇవి ప్రత్యేకము ౪ పలము, నువ్వులనూనె ౨ పలములు, త్రిఫలకషాయము ౧ ప్రస్థము కలకండ ౨ ప్రస్థములు వీనినన్నియు నేకముగచేర్చి గట్టిపడువరకు వండి అందు లవంగపత్రి, లవంగపట్ట, ఏలకులు, నాగకేసరములు వీనిని చూర్ణించి వైచి కలియబెట్టి మాత్రలుజేసి రెండించి అగ్నిబలానుసారముగ భక్షించిన కృమికోష్ఠము, అగ్నిమాంద్యము, వాపు, గుల్మము, ఉదరము, వ్రణము, కామిల, పాండురోగము, అర్శస్సు, భంగదరము, వ్రణములు, ఇవి నివర్తించుటయేగాక వయఃస్థైర్యము, బలము, వాతప్రమేహశమనము, చక్షుః ప్రీతి వీనిని గలుగంజేయు, మరియు స్నిగ్ధ భోజనమువాయువు రెండ వీనిని సేవించవచ్చును.

## త్రిఫలాద్యఘృతము

ఫలత్రయం వచా దన్తీ త్రివృత్కాంపిల్లకైస్సమైః. 39
సిద్ధం సర్పిర్గవాం మూత్రే పీతం చ కృమినాశనమ్,

తా. త్రిఫలములు, వస, దన్తిబీజములు, తెగడ, కంపిల్లకము వీనిని సమముగ గోమూత్రమునందువైచి కల్కంబొనర్చి అందు నెయ్యిచేర్చి ఘృతపక్వముగా కాచి పుచ్చుకొనిన కృములు నివర్తించు.

## విడంగఘృతము

త్రిఫలాయాస్త్రయః ప్రస్థా విడంగం ప్రస్థమేవచ. 40
దీపనం దశమూలం చ లాభతస్సముపాహరేత్,
పాదశేషే జలద్రోణే పూతే సర్పిర్విపాచయేత్. 41
ప్రస్థోన్మితం సింధుయుతం తత్పరం కృమినాశనమ్,
విడంగఘృతమేతత్తు లేహ్యం శర్కరయా సహ. 42
సర్వాన్కృమీన్ప్రణుదతి వజ్రం ముక్తమివాసురాన్,

తా. కరక్కాయలు 3 ప్రస్థములు, వాయువిడంగములు ౧ ప్రస్థము దీపనీయగణము దశమూలములు వీనిని యథాలాభముగ గ్రహించి ద్రోణప్రమాణోదకము

నందువైచి నాలవపాలు మిగులువరకు కషాయముకాచి వస్త్రపూతమొనర్చి అందు ౧ ప్రస్థము నెయ్యి, సైంధవలవణము వీనినిచేర్చి కాచిన విడంగఘృతమనంబడు. దీనిని చక్కెరచేర్చి పుచ్చుకొనిన సకల కృమిరోగములు నివర్తించు.

### పారదాదియోగము

శుద్ధసూతం చేంద్రయవమజమోదామనశ్శిలా. 43
పలాశబీజం తుల్యాంశం దేవదాల్యాద్రవైర్దినమ్,
మర్దయేద్భక్షయేన్నిష్కం మూషపర్ణీకషాయకమ్. 44
సితాయుక్తం పిబేచ్చాను కృమిపాతో భవత్యలమ్,

తా. * శుద్ధిచేసినరసము, కొడిశపాలవిత్తులు, ఓమము, మణిశిల, మోదుగ విత్తులు వీనిని సమభాగములుగ చూర్ణించి దావగడంగిరసముచే నొకదినము మర్దించి, నిష్కమాత్రము సేవించి ఎలికచెవిఆకుకషాయమునందు చక్కెరకలిపి పుచ్చుకొనిన కృములు పడును.

### సారనాళాఖుపర్ణీయోగము

సారనాళాఖుపర్ణీ వా తక్రం పాలాశబీజయుక్. 45
హింగ్వాజమోదా తక్రం వా కృమిరోగం వినాశయేత్,

తా. కాంజికము ఎలికచెవిఆకురసముగాని లేక మజ్జిగ మోదుగవిత్తుల చూర్ణముగాని లేక ఇంగువ ఓమము మజ్జిగగాని పుచ్చుకొనిన కృమిరోగము నివర్తించు.

### విడంగాదియోగము

విడంగం పారిభద్రాగ్రం బ్రహ్మబీజం పృథక్పృథక్. 46
మధునా కృమినాశాయ నింబం వా హింగుసంయుతమ్,

తా. వాయువిడంగములచూర్ణముగాని, వేపచిగుళ్లచూర్ణముగాని, మోదుగ విత్తులచూర్ణముగాని, వేపఆకు ఇంగువగాని, తేనెతో కలిపి పుచ్చుకొనిన కృములు నివర్తించు.

### బాహ్యకృమిలేపము

పారదం మర్దయేన్నిష్కం కృష్ణధత్తూరకద్రవైః. 47
నాగవల్లీద్రవైర్వాథ వస్త్రఖండం ప్రలేపయేత్,
తద్వస్త్రం మస్తకే బద్ధ్వా ధార్యం యామత్రయం తతః. 48

* ఇందు గంధకముచేరదు కాన శుద్ధరసమును దానికి రసకర్పూరమును చేర్చుట యుక్తము.

యూకాః పతంతి నిశ్చేష్టాః పరీక్ష్యం నాత్ర సంశయః,

తా. వరహాయెత్తు పాదరసము నల్లయుమ్మెత్తఆకురసముతోగాని లేక తమలపాకులరసముతోగాని మర్దించి వస్త్రమునకుబూసి అవస్త్రమును శిరస్సునందు మూడు యామములుకట్టిన పేలుచచ్చిదానినంటుకొనిరాలును. ఇది సంశయములేని క్రియ.

విశాలాధూపము

విశాలాయాః ఫలం పక్వం తప్తలోహోపరి క్షిపేత్. 49
తద్ధూమో దన్తలగ్నశ్చేత్కీటానాం పాతనః పరః,

తా. పండినపాపరపండును ఎఱ్ఱగకాచిన లోహశేకునందువైచి ఆపొగను దంతములకు వ్యాపించునటులంజేసిన దంతములయందుండు పురుగులు పడును.

కకుభాదిధూపము

కకుభజకుసుమవిడంగం లాంగలీభల్లాతకం తథోశీరమ్. 50
శ్రీవేష్టకసర్జరసం చందనమథ కుష్ఠమష్టమం దద్యాత్,
ఏష సుగంధో ధూపస్సర్వక్రిమీనాంవినాశకః ప్రోక్తః. 51
తథా సమత్కుణానాం శిరసి చ గాత్రేషు యూకానామ్,

తా. మద్దిపూలు, వాయువిడంగములు, నీటిపిప్పళ్లు, జీడిగింజలు, వట్టివేళ్లు, దేవదారుబంకతోజేరిన ధూపద్రవ్యము, సర్జరసము, చందనము, కోష్ఠము, వీనిని ధూపమిడిన క్రిములు నశించుటయేగాక మత్కుణములు శిరస్సు శరీరము వీనియందుండు పేలు నివర్తించు.

క్రిమిరోగపథ్యములు

ఆస్థాపనం కాయశిరోవిరేకో ధూమః కఫఘ్నాని శరీరశుద్ధిః. 52
చిరంతనా వైణవరక్తశాలిపటోలవేత్రాత్రరసోనశాకాః,
వాతాశమందారదళాని సర్షపా నవీనమోచం బృహతీఫలాన్యపి. 53
కటూని నాలీకఫలాని మాక్షికం విడంగబాజంపిచుమందపల్లవమ్,
తైలం తిలానామథ సర్షపోత్థం సౌవీరసూక్తేచ తుషోదకం చ. 54
మద్యాచ్ఛమారుష్కరమేవమూత్రం తాంబూలమధ్యేమృగనాభకంచ,
ఓష్ట్రాణిమూత్రాజ్యపయాంసిహింగుపూరోజమోదాఖదిరఃకలింగమ్.
జమ్బ్వారనీరం సుమశియవానీసారాస్సురాహ్వాగరుశింశిపోత్థః,
తిక్తః కషాయః కటుకో రసోయం వర్గోవరోయంక్రిమిరోగిపథ్యః.

తా. ఆస్థాపనవస్తికర్మ, శిరోవిరేచనము జేయుట, ధూపము, కఫనాశకపదార్థములు, శరీరశోధనము, పాత వెదురుబియ్యము, ఎఱ్ఱవడ్లబియ్యము, చేదుపొట్ల,

వెదురుచెంలకలు, వెల్లుల్లి, చకోతపుకూర, చిత్రమూలము, మందారఆకులు, ఆవాలు, లేతయరటి, ములకవిత్తులు, తిక్తపదార్థములు, నాళికేఫలములు, ఎలికెచెవికూర, వాయువిడంగములు, వేపఆకులు, నువ్వులనూనె, ఆవనూనె, కాంజికము, సూక్తము, తుషోదకము, తేనె, తెల్లజీడిపండు, గోమూత్రము, తాంబూలము, మద్యము, కస్తూరి, ఒంటెయొక్కమూత్రము నెయ్యి పాలు, ఇంగువ, క్షారము,ఓమము, చంద్ర, కోడిశపాల, నిమ్మపండ్లరసము, నల్లజీలకఱ్ఱ, అజామోదము, దేవదారు, అగరు, అశోకము, చేదు వగరు కారము ఈరసములు ఇవి కృమిరోగముగల మనుజులకు పథ్యములని తెలియవలయు.

## అపథ్యములు

వాన్తిం చ తద్వేగవిధారణం చ విరుద్ధపానాశనమహ్నినిద్రా,
ద్రవం చ పిష్టాన్నమజీర్ణభుక్తిస్సృతాని మాషాదధిపత్రశాకమ్. 57
మాంసం పయోమ్లంమధురోరసశ్చకృమిరోగిభూంసుఃపరివర్జయేత్తు,

తా. వాంతి, వాంతివేగధారణము, విరుద్ధాన్నపానములు, దివానిద్ర, ద్రవపదార్థములు, పిష్టాన్నము, అజీర్ణభోజనము, నెయ్యి, మినుములు, పెరుగు, ఆకుకూరలు, మాంసము, పాలు, పులుసు, మధురరసము వీనిని కృమిరోగముగల మనుజులు విడువవలయు.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్యవిద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్రకంఠవల్లభాచార్య విరచిత, వైద్యచింతామణౌ, అగ్నోరోగక్రిమిరోగ ప్రకరణంనామ పంచదశోవిలాసః.

---

# తృష్ణాప్రకరణమ్.

## తృష్ణాకర్మవిపాకము

పథి చాధ్వపరిశ్రాంతం బ్రాహ్మణం గామథాపివా,
న పాయయేజ్జలం యస్తు స తృష్ణామూర్ఛితో భవేత్. 1

తా. మార్గమునందు దప్పిచే పీడింపబడియుండు బ్రాహ్మణుని గాని గోవునుగాని జూచి ఉదకము నొసంగకుండువానికి తృష్ణవలన మూర్ఛ జనించు.

పానీయం పాయసం భక్ష్యాశ్చ శర్కరాఘృతసంయుతమ్,

ఇదం విప్రాయ దాతవ్యం మూర్ఛాతృష్ణోపశాంతయే. 2

తా. ఉదకము, (పాలు) పంచదార నేయి వీనితో యుక్తముగ జేయంబడిన పాయసము వీనిని బ్రాహ్మణులకు నొసంగిన మూర్ఛ తృష్ణ ఇవి హరించు.

### తృష్ణా నిదానము

భయశ్రమాభ్యాం బసలంక్షయాద్వాప్యూర్ధ్వంచితం పిత్తవివర్ధనైశ్చ,
పిత్తం సవాతం కుపితం ననాణాం తాలుప్రపన్నంజనయేత్పిపాసామ్.3

తా. భయము, శ్రమ, బలక్షయము. వీనిచే ప్రకోపించిన వాతముతో పిత్తకర ద్రవ్యసంబంధముచే మీదుగా వృద్ధినంది ప్రకోపించిన పిత్తముగలసి పిదప ఊర్ధ్వగతిచే వాతముతోగలసిన పిత్తము లోదవడను జెంది దప్పిని గలుగంజేయు.

### తృష్ణార్దితస్వరూపము

సతతం యః పిబేత్తోయం న తృప్తిమధిగచ్ఛతి,
పునః కాంక్షతి తోయం చ తం తృష్ణార్దితమాదిశేత్. 4

తా. మనుజుడుమాటిమాటికి నీళ్లుత్రాగినను తృప్తిపొందక పలుమారు నీటిని యిచ్ఛయించిన వానిని తృష్ణార్దితుడని యెరుగవలయు.

### తృష్ణా సంప్రాప్తిసంఖ్య

సోతస్స్వపాం వాహిషుదూషితేషు దోషైశ్చతృట్ సంభవతీహజంతోః,
తిస్రస్స్మృతాస్తాఃక్షతజాచతుర్థీక్షయాత్తథాహ్యామసముద్భవాచ. 5
భక్తోద్భవా సప్తమికేతి తాసాం నిబోధ లింగాన్యనుపూర్వశశ్చ,

తా. వాతాదిదోషములచే ఉదకవాహిసిరలు దూషితములైయుండిన మనుష్యునికి దప్పిజనించు. అది వాత, పిత్త, శ్లేష్మ, క్షత, క్షయ ఆమ అన్నజములని యేడు విధంబులుగనుండు, వాటిలక్షణములను క్రమముగ నెరిగించెద.

### తృష్ణాసామాన్యపూర్వరూపములు వాతజతృష్ణాలక్షణము

తాల్వోష్ఠకంఠస్య చ తోదదాహసంతాపమోహభ్రమవిప్రలాపాః.6
పూర్వాణి రూపాణి భవంతి తాసాముత్పత్తికాలేషు విశేషతో హి,
క్షామాస్యతామారుతసంభవాయాం తోదస్తథాశంఖశిరస్సుచాపి.7
స్రోతోనిరోధో విరసం చ వక్త్రం శీతాభిరద్భిశ్చ వివృద్ధిమేతి,

తా. వాతజతృష్ణయందు నోరెండుట, కణతలు శిరము వీనియందు సూదు

లతోపొడుచునటుల వ్యథ, రసోదకవాహినీశిరలు అడ్డగింపబడుట, ముఖవైరస్యము, శీతోదకపానముచే వృద్ధిని జెందుట, ఇవి కలుగును. మఱియు దవడలు పెదవులు కంఠము వీనియందు శూల, దాహముగలుగుట, సంతాపము మోహము భ్రమ కలవ రింత ఇవి జనించుట తృష్ణాసామాన్యమునకు పూర్వరూపములని తెలియవలెను.

పిత్తజతృష్ణాలక్షణము

మూర్ఛాన్నవిద్వేషవిలాపదాహారక్తేక్షణత్వం ప్రతతశ్చ శోషః. 8
శీతాభిలాషో ముఖతిక్తతా చ పిత్తాత్మికాయాం పరిదూయనం చ,

తా. పిత్తజతృష్ణయందు మూర్ఛ, అన్నద్వేషము, దుఃఖించుచుమాటలు, తాపము, నేత్రములయం దెఱుపు, మిగుల శోష, శీతపదార్థములయం దిచ్ఛ, నోరు చేదుగనుండుట, సంతాపముగలుగుట ఇట్టి లక్షణములు గలిగియుండు.

కఫజతృష్ణాలక్షణము

భాష్పావరోధాత్కఫసంవృతేగ్నౌ తృష్ణాబలాసేనభవేత్తదాతు. 9
నిద్రాగురుత్వం మధురాస్యతా చతృష్ణార్దితశ్శుష్యతి చాతిమాత్రమ్,

తా. కఫజతృష్ణయందు స్వకారణమువలన ప్రకుపితమైన కఫముజఠరాగ్నిని నాచ్ఛాదించుటచే దాని ఉష్ణము నడ్డగింపబడినదై అధోముఖంబై ఉదకమును వహింపు చుండు స్రోతస్సులశోషింపంజేసి కఫజతృష్ణనుగలుగజేయును. మరియు దానిచే నిద్ర జడత్వము నోరుతీపు ఇవి గలుగు. ఈ తృష్ణవలన పీడింపబడిన మనుజుడు మిగుల శోషనుజెందు.

క్షతజతృష్ణాలక్షణము

క్షతస్య రుక్శోణితనిర్గమాభ్యాం తృష్ణా చతుర్థీ క్షతజా మతా తు.10

తా. శస్త్రాదికమువలన క్షతముగలవానికి పీడ రక్తస్రావము ఇవి గలుగుటచే క్షతజతృష్ణజనించు ఇది నాలవదిగనుండు. (క్షతమనగా గాయము.)

రసక్షయజతృష్ణాలక్షణము

రసక్షయాద్యాక్షయసంభవా సా తయాభిభూతస్తు నిశాదినేషు,
పేపీయతేంభస్సుఖం న యాతి తాంసన్నిపాతాదితి కేచిదాహుః.
రసక్షయోక్తాని చ లక్షణాని తస్యామశేషేణ భిషగ్వ్యవస్యేత్,

తా. రసక్షయమువలన జనించునది క్షయజతృష్ణయనబడును. దానిచేపీడితుడుగ నుండుమనుజుడు రాత్రింబగళ్లయందు పలుమారు ఉదకపానముజేసినను తృప్తిజెందక యుండును. దీనిని కొందరు సన్నిపాతజతృష్ణయని వచించెదరు. మరియు దీనియంద

రసక్షయమువందు జెప్పంబడియుండు లక్షణంబులన్నియు గలిగియుండునని వైద్యులు తెలిసికొనవలయు.

ఆమజతృష్ణాలక్షణము

త్రిదోషలింగామసముద్భవా చ హృచ్ఛూలనిష్ఠీవనసాదకర్త్రీ. 12

తా. త్రిదోషలక్షణంబులు, హృదయమునందుశూల, నోటజొల్లు, బడలిక ఇట్టిలక్షణములుగలది ఆమజతృష్ణయని తెలియవలయు

అన్నజతృష్ణాలక్షణము

స్నిగ్ధం తథామ్లం లవణం చ భుక్తం గుర్వన్నమేవాశు తృషాం కరోతి,

తా. స్నిగ్ధము పులుసు ఉప్పు గురుత్వము ఇవిగలఅన్నమును భుజించుటవలన శీఘ్రముగ అన్నజతృష్ణజనించు.

కష్టసాధ్యలక్షణము

దీనస్వరః ప్రతామ్యద్దీనాననశుష్కహృదయగళతాలు. 13
భవతి ఖలు సోపసర్గాత్తృష్ణా సా శోషిణీ కష్టా,
జ్వరమోహక్షయకాసశ్వాసాద్యుపసృష్టదేహానామ్. 14

తా. తృష్ణయొక్క ఉపద్రవములచే దీనస్వరము, మోహము, మనఃక్లేశము, ముఖమువాడుట, రొమ్ము గొంతు దవడలు ఇవియెండుట, శరీరకృశత్వము, జ్వరము, మోహము, క్షయ, దగ్గు, శ్వాస మొదలగునుపద్రవములతోడగూడియుండు తృష్ణా రోగము కష్టసాధ్యము.

అసాధ్యతృష్ణాలక్షణము

సర్వాస్త్వతిప్రసక్తారోగకృశానాం వమిప్రసక్తానామ్,
ఘోరోపద్రవయుక్తాస్తృష్ణామరణాయ విజ్ఞేయాః. 15

తా. వాతాదిసర్వతృష్ణారోగములు మిగులవృద్ధిజెందినను, లేక రోగమువలన శరీరముకృశించినను లేక వాంతివలన దప్పిగలిగినను ఇట్టి యుపద్రవములతో గూడియుండు తృష్ణారోగి మృతినిజెందు.

కఫజతృష్ణకు బిల్వాదికషాయము

బిల్వాఢకీధాతకిపంచకోలదర్భైశ్చ సిద్ధం కఫజాం నిహంతి
హితం భవేచ్ఛర్దనమేవ చాత్ర తప్తేన నింబప్రసవోదకేన. 16

తా. మారేడుఫలము, కందులు, ధాతకీకుసుమము, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, చవ్యము, చిత్రమూలము, దర్భవేళ్లు చెరకువేళ్లు, వీనిని కషాయము బెట్టి పుచ్చుకొనినను లేక వేపాకుకషాయముచే వమనమునుజేయించినను కఫజతృష్ణ నివర్తించు

ఆమ్రాదికషాయము

ఆమ్రజంబూకషాయం వా పిబేన్మాక్షికసంయుతమ్,
ఛర్దిం సర్వాం ప్రణుదతి తృష్ణాం చైవాపకర్షతి. 17

తా. మామిడి, నేరేడు, వీనిపల్లవములకషాయమునందు తేనెచేర్చిపుచ్చుకొనిన వాంతి తృష్ణా ఇవి నివర్తించు.

కసేర్వాదికషాయము

కసేరుశృంగాటకపద్మబీజబిసేక్షుసిద్ధం ససితం చ వారి,
తృష్ణాంక్షతోత్థామపి పిత్తజాతాం నిహంతి పిత్తం శిశిరీకృతం చ. 18

తా. పరికెగడ్డలు, శింగాడికాయలు, తామరవిత్తులు, తామరతూండ్లు, చెరుకు వీనికషాయమునందు పంచదారనుచేర్చి చల్లార్చి పుచ్చుకొనిన క్షతమువలనగాని పిత్తము వలనగాని జనించిన దప్పి శమించు.

కాశ్మర్యాదికషాయము

కాశ్మర్యశర్కరాయుక్తం చందనోశీరపద్మకైః,
ద్రాక్షామధుకసంయుక్తం పిత్తతృష్ణోజలం పిబేత్. 19

తా. చల్లగుమ్ముడు పండ్లు, పంచదార, చందనము, వట్టివేరు, తామరతూండ్లు, ద్రాక్ష, అతిమధురము వీనిని కషాయముబెట్టిపుచ్చుకొనిన పిత్తమువలన జనించిన దప్పి నివర్తించు.

కుష్ఠాదిచూర్ణము

కుష్ఠం కాశోద్భవం మూలం మధుకం పిష్టమంభసా,
భక్షితం తద్ధరితం హంతి పిపాసాం చిరకాలజామ్. 20

తా. చెంగలి, కోష్ఠము, కౌశదర్భవేరు, అతిమధురము వీనినిచూర్ణించి ఉదకముతో పుచ్చుకొనిన చిరకాలముగనుండు దప్పి శమించు.

రసాదిచూర్ణము

రసగంధకకర్పూరైశ్శైలేయోశీరకోగణైః,
ససితైః క్రమవృద్ధైశ్చచూర్ణం కృత్వా త్వహర్ముఖే. 21

త్రిగుంజాప్రమితం ఖాదేత్పిబేత్పర్యుషితాంబు చ,
భశృం తృష్ణాం నిహంత్యేవమశ్విభ్యాం చ ప్రకాశితమ్. 22

తా. పాదరసము ౧ భాగము, గంధకము ౨ భాగములు, పచ్చకర్పూరము 3 భాగములు, శిలాజితు ౪ భాగములు, వట్టివేరు ౫ భాగములు, మిరియాలు

౬ భాగములు, శర్కర ౭ భాగములు వీనినన్నియు మెత్తగ చూర్ణించి ౩ గుంజముల యెత్తు ప్రాతఃకాలములయందు సేవించి రాత్రివుంచబడిన యుదకమును పుచ్చుకొనిన అత్యంతమగు తృష్ణనశించునని అశ్వినీదేవతలు వచించిరి.

గండూషము

శ్రీఖండం పద్మకం ముస్తా ధాన్యకం నింబవల్కలమ్,
కూశ్మాండం ఖదిరో దూర్వామూలం కితవరాజకమ్. 23
అష్టావశేషితోఽమీషాం క్వాథశ్శీతలతాం గతః,
గండూషకరణాద్ధంతి రోగిణశ్శోషముల్బణమ్. 24

తా. చందనము, తామరతూండ్లు (పద్మకము) తుంగముస్తలు, ధనియాలు వేపపట్ట, బూడిదెగుమ్మడి, చండ్రపట్ట, తెల్లగరికవేరు, నల్లఉమ్మెత్తపూలు వీనిని కషాయముబెట్టి. అష్టమాంశముగ దించుకొని గండూషముజేసిన తృష్ణ నివర్తించు.

వటుకములు

ఉత్పలం మధులాజాశ్చ వటరోహఽగద స్తథా,
ఏతైః కృతా వటీ నిత్యం తృష్ణాం నాశయతి క్షణాత్. 25

తా. నల్లకలువలు, తేనె, వరిపేలాలు, మఱ్ఱివూడలకొనలు, కోష్ఠము వీనిని నూరి వుంటలుజేసి సేవించిన తత్క్షణమున నే తృష్ణ నివర్తించు.

ఖర్జూరాదివటి

ఖర్జూరమృద్వీకమధూంశ్చ ఖండంపృథక్పలం మాగధికాత్రిగంధే,
తథార్ధబిల్వే మధునా ఘుటీయం తృణ్మోహపిత్తాస్రజయేఽతిశస్తా.26

తా. ఖర్జూరము, ద్రాక్ష, అతిమధురము, ఖండశర్కర ఇవి ప్రత్యేకముగ ౪ తులములు, పిప్పళ్లు లవంగపట్ట, లవంగపత్రి, ఏలకులు ఇవి ప్రత్యేకము ౨ తులములు వీనినన్నియునూరి తేనెచేర్చి వుంటలుజేసి పుచ్చుకొనిన తృష్ణ మోహము రక్తపిత్తము వీనిని నశింపంజేయును.

నీలాంబుబూదివటి

నీలాంబుజాబ్దమధులాజవటావరోహైః శ్లక్ష్ణీకృతై ర్విరచితాఘుటికాముఖస్థా,
తృష్ణాం నివారయతి తత్క్షణమేవ తీవ్రాం మృత్యోః స్పృహామివ యతేః పరమార్థచింతా. 27

తా. నల్లకలువలు, తుంగముస్తలు యష్టిమధుకము, వరిపేలాలు, మఱ్ఱివూడల

కొనలు వీనినన్నియుచూర్ణించి తేనెచేర్చి వుంటనుచేసి నోటనుంచుకొనిన, సన్యాసి యొక్క పరమార్థవిషయమగుచింత మృత్యుభయము నెటులతొలగించునో అటుల తృష్ణను హరించు.

## రసాదిఘుటికలు

రసరజతగుటీపటీయసీం యో వదనసరోరుహమధ్యగాం దధాతి,
స జయతి తృషిత స్తృషాంమనుష్యో భృశమఘమివ త్రిమార్గగాంభః.

తా. పాదరసభస్మము, వెండిభస్మము వీనినినూరి వుంటచేసి పుక్కిటనుంచుకొనిన దప్పి నివర్తించు.

## లేపములు

జలం మలయజం రక్తచందనం పద్మకేసరమ్,
ఉశీరేణాంచితైర్లేపో మస్తకే తృణ్ణివారణః. 29

తా. కురువేరు, మంచిగంధము, రక్తచందనము, పద్మకేసరములు, వట్టివేరు వీనిని నూరి శిరస్సున లేపనజేసిన తృష్ణ నివర్తించు.

అరుణచందనచందనవాలకైర్నలదపద్మకతుల్యకృతాంశకైః,
శిరసి లేపనమాచరతాం నృణాం తృడుపయాత్యుపశాంతిమసంశయమ్.

తా. రక్తచందనము, చందనము, వట్టివేరు, కురువేరు, వట్టివేరు, పద్మకము, వీనిని సమభాగములుగనూరి శిరస్సునకు లేపనము జేసిన తృష్ణనివర్తించు.

దాడిమకపిత్థలోధ్రైస్సవిదారీబీజపూరకైశ్శిరసః,
లేపోనలినామలకైర్హరతి తృషం చారకాలసందిష్టైః. 31

తా. దాడింబపండు, వెలగపండు, లొద్దుగ, నేలగుమ్ముడు, మాదీఫలము, తామరకేసరములు, ఉసిరికాయ వీనిని కాంజికముతో కలిపి నూరి శిరస్సునకు లేపనము జేసిన తృష్ణ నివర్తించు.

## ఉపసర్గసామాన్యవిధిః

తృష్ణాతివృద్ధావుదరే చ పూర్ణే సంఛర్దయేన్మాగధికోదకేన,
విలోమసంచారహితం విధేయం స్యాద్దాడిమామ్రాతకమాతులుంగైః.

తా. మిక్కిలిదప్పిచే నుదకపానముజేసిన ఉదరమునిండియుండిన పిప్పళ్ల కషాయముతో వమనము చేయించవలయు. మరియు వాతామలోమ సంచారమునకు దాడిమీఫలము, అంబాళపు ఆకు, మాదీఫలము వీనినౌషధముగ నివ్వవలయు.

—— పానాత్యయజతృష్ణాచికిత్స ——

ఛాగమాంసరసం సాజ్యం శీతం సమధుశర్కరమ్,
పీత్వా జయతి దుర్దాహమూర్ఛాచ్ఛర్దిమదాత్యయాన్. 33

తా. మేకమాంసరసము నెయ్యి, చక్కెర, తేనె వీనినిచేర్చి త్రాగించిన దుస్తరమగు దాహము, మూర్ఛ, వాంతి, మదాత్యయము ఇవి నివర్తించు.

—— తృష్ణారోగమునకు పథ్యములు. ——

శోధనం వమనం నిద్రా స్నానం కవలధారణమ్,
కోద్రవాశ్శాలయః పేయావిలేపీ లాజసక్తవః. 34
అన్నమండో ధన్వరసశ్శర్కరా రాగఖాండవైః,
భ్రష్టముద్గైర్మసూరైర్వా చణకైర్వా కృతో రసః. 35
రంభాపుష్పం తక్రకూర్చం ద్రాక్షాపర్పటవాలకే,
కపిత్థం మాలికాకోలం కూష్మాండకముపోదికా. 36
ఖర్జూరం దాడిమం ధాత్రీ కర్కటీ లలదంబు చ,
జంబీరః కరమర్దశ్చ బీజపూరో గవాం పయః. 37
మధూకపుష్పం హ్రీబేరం తిక్తాని మధురాణి చ,
బాలతాలాంబుశీతాంబుపయః పేయం ప్రపానకమ్. 38
మాక్షికం సరసీతోయం శతాహ్వానాగకేసరమ్,
ఏలాజాతిఫలం పథ్యా కుస్తుంబురుకుచందనే. 39
ఘనసారో గంధసారః కౌముదీశిశిరోనిలః,
చందనార్ద్రప్రియాశ్లేషో ముక్తాభరణధారణమ్. 40
గాహనం లేపనం చాస్యేపథ్యమేతత్తృషాతురే,

తా. శోధనము, (విరేకము) వమనము, నిద్ర, స్నానము, కవళధారణము, కొఱ్ఱలు, వడ్లు, పేయము, పేలపిండి, విలేపి (బియ్యమునకు ౧౪గింతలనీళ్లుబోసివండిన అన్నము) నిర్జలదేశమునందలి మృగపక్షిమాంసరసము, శర్కర, తేనె, తియ్యని పెరుగు వీనినిచేర్చి వడియగట్టిన రాగకౌండవము, వేయించిన పెసలు చిరుశనగలు లేక శనగలు వీనిరసము, అరటిపూలు, మజ్జిగ, జున్ను, ద్రాక్ష, పర్పాటకము, వట్టివేరు, వెలగ, పుష్పమాలిక, రేగుపండు, పెద్దగుమ్మడికాయ, బచ్చలి, ఖర్జూరము, దాడింబపండు, ఉశిరికెపండు, దోసకాయ, పారెడునీళ్ళు, నిమ్మపండు, జీకిపండ్లు, మాదీఫలము, ఆవుపాలు, ఇప్పపూలు, కురువేరు, చేదురసము, మధురరసము, తాటి

నుంగులనీళ్లు, చల్లనీళ్లు, మంచినీరు, పానకము, తేనె, సరస్సునందలినీళ్లు, చల్లపిల్లిగడ్డలు, నాగకేసరములు, ఏలకులు, జాజికాయ, కరక, ధనియాలు,రక్తచందనము, పచ్చకర్పూరము, కిచ్చిలిగడ్డి, వెన్నెల, చల్లనిగాలి, చందనము పూసుకొనినస్త్రీని ఆలింగనముచేసికొనుట, ముత్యాల ఆభరణధారణము, నదీస్నానము, ముఖలేపనము ఇవి తృష్ణారోగికి పథ్యములని తెలియవలయు.

## అపథ్యములు

స్నేహాంజనస్వేదనధూమపాన వ్యాయామనస్యాతపదంతకాష్ఠాః. 41
గుర్వన్నమమ్లం లవణం కషాయం కటుత్రికం దుష్టజలాని తీక్ష్ణమ్,
ఏతాని సర్వాణి హితాభిలాషీతృష్ణాతురో నైవభజేత్కదాచిత్ .42

తా. స్నేహము, అంజనము, చెమటదీయుట, ధూమపానము, వ్యాయామము, నస్యము, యెండ, దంతకాష్టము, గుర్వన్నము, పులుసు, కారము, ఉప్పు, త్రికటుకములు, దుష్టోదకము, కారముగలపదార్థములు వీనిసేవనను తృష్ణారోగి తనహితమును కోరెడువాడైయుండిన విసర్జించవలయు.

---

# దాహరోగప్రకరణమ్.

## దాహరోగ కర్మవిపాకము

యః పునరగ్నౌ ష్ఠీవతి తం కపిలనామా గ్రహో గృహ్ణాతి,
తత్క్షణాజ్జ్వరశూలసర్వాంగదాహపీతనయనశ్చ భవతి. 1
బలిం చ నిశి చతుష్పథే పిష్టలాజాపిణ్యాకరుధిరతిలాశ్వగంధపుష్పైఃమరిశ్రేణ దద్యాత్,
గృహ్ణీష్వ చ బలిం చేమం కపీలాఖ్యమహాగ్రహ. 2
ఆతురస్య సుఖం సిద్ధిం ప్రయచ్ఛ త్వం మహాబల,

తా. అగ్నియందు ఉమ్మివేయువానికి కపిలనామకమను గ్రహముసోకి పీడించుటచే తత్క్షణమునందే జ్వరము, శూల, సర్వాంగదాహము, నేత్రములు పచ్చగనుండుట ఇట్టియుపద్రవములుగలుగు. అది నివర్తించుటకై నాలుగుత్రోవలుగలిసిన ప్రదేశమునందు పిండి, పేలాలు, గానుగపిండి, రక్తము, నువ్వులు, పెన్నేరుగడ్డ పుష్పములు వీనితోగూడ (గృహ్ణీష్వచ బలిం చేమం) అను మంత్రముతో బలినివ్వవలయు.

## జ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

తనౌ భవతి భూపుత్రో రంధ్రే భవతి భాస్కరః. 3

జన్మకాలే యదా యస్య స దాహజ్వరవాన్భవేత్,

తా. జన్మకాలమునందు లగ్నమున అంగారకుడు అష్టమస్థానమున సూర్యుడుండిన దాహము, జ్వరము ఇవిగలుగు.

దాహనిదానము సంప్రాప్తి

త్వచం ప్రాప్తస్తుపానోష్మా పిత్తరక్తాభిమూర్ఛితః. 4
దాహం ప్రకురుతే ఘోరం పిత్తవత్తత్ర భేషజం,

తా. మద్యపానముచేసినందువలన దానియొక్క ఉష్ణము పిత్తరక్తములతో వృద్ధిపొంది చర్మగతమై భయంకరమగు దాహమును గలుగంజేయు. దానికి పిత్తశామక ఔషధముల పుచ్చుకొనవలయు.

రక్తజపిత్తజదాహలక్షణము

కృత్స్నదేహానుగం రక్తముద్రిక్తం దహతి ధ్రువమ్. 5
స ముష్యతే తృష్యతే వా తామ్రాభస్తామ్రలోచనః,
లోహగంధాంగవదనో వహ్నినేవావకీర్యతే. 6
పిత్తజ్వరసమః పిత్తాత్సచాప్యస్య విధిస్స్మృతః,

తా. సకలశరీరమునందుండు రక్తము ప్రకోపించి మిక్కిలి మంటను గలుగంజేయు. దానిని రక్తజదాహమనియెదరు. దానియందు రోగికి అగ్నియొద్ద కూర్చుండునటుల తాపము, దప్పి, శరీరము నేత్రములు ఎఱ్ఱగనుండుట, శరీరము నోరు వీనియందినుముతో సమనుగు వాసనగలుగుట, దేహముపై నగ్నినునిచినటుల వేదనగలుగు. మరియు పిత్తాధిక్యమువలనగూడ దాహముత్పన్నంబగు. అందు పిత్తజ్వరలక్షణంబులు గలిగియుండుగాన పిత్తజ్వరచికిత్సనే జేయవలయు.

తృష్ణానిరోధజదాహలక్షణము

తృష్ణానిరోధాదబ్ధాతౌ క్షీణే తేజస్సముద్ధతమ్. 7
సబాహ్యాభ్యంతరం దేహం ప్రదహేన్మందచేతనః,
సశుష్కగలతాల్వోష్ఠో జిహ్వాం నిష్కృష్య వేపతే. 8

తా. దప్పిని నిరోధించుటవలన ఉదకరూపమగు ధాతువు క్షీణించుటచే పిత్తోష్మము వృద్ధిని పొంది దేహమునకు వెలపల లోపల తాపమునుగలుగజేయు. దానివలన రోగి జ్ఞానశూన్యుడగుటయేగాక గొంతు లోదవడలు పెదవి వీనియందుశోషగలవాడై నాలుకను వెలపలికిదీసి కదలింపుచుండు.

రక్తపూర్ణకోష్ఠజదాహలక్షణము

అసృజా పూర్ణకోష్ఠస్య దాహోన్యస్స్యాత్సుదుస్తరః,

తా. శస్త్రఘాతమువలన రక్తము కోష్ఠమునందునిండి తాపమును గలుగం జేయును. దానిని శస్త్రఘాతజన్యదాహమని యెదరు. ఇది మిక్కిలి అసాధ్యమని తెలియవలయును.

ధాతుక్షయజన్యదాహలక్షణము

ధాతుక్షయోత్థో యో దాహస్తేన మూర్ఛాతృషాన్వితః. 9
క్షామస్వరః క్రియాహీనస్స సీదేద్భృశపీడితః,

తా. రసాదిసప్తధాతువులు క్షీణించుటవలన మూర్ఛ, దప్పి, హీనస్వరము, నిశ్చేష్టత వీనిచే మిక్కిలి పీడింపబడుచుండిన ధాతుక్షయజన్య దాహమని తెలియవలయును.

క్షతజదాహాదిలక్షణములు

క్షతజోనశ్నతశ్చాన్యశ్శోచతో వాప్యనేకధా. 10
తేనాంతర్దహ్యతేత్యర్థం తృష్ణామూర్ఛాప్రలాపవాన్,

తా. అన్నముదినకుండుట లేక బహువిధములుగ దుఃఖించుట వీనివలన వెలుపల మిక్కుటమగు తాపము, దప్పి, మూర్ఛ, తలచునగమాటలాడుట ఇట్టిలక్షణములుగలది క్షతజశోకజదాహములని తెలియవలయు

మర్మాభిఘాతజదాహలక్షణము

మర్మాభిఘాతజోప్యస్తి సోసాధ్యస్సప్తమో మతః. 11

తా. మర్మస్థానమునందు దెబ్బతగులుటవలన దాహముత్పన్నంబగు. ఇది యసాధ్యము. ఈదాహము యేడవసంఖ్యగలదిగనుండు.

అసాధ్యలక్షణము

సర్వఏవ వివర్జ్యాస్స్యుశ్శీతగాత్రస్య దేహినః,

తా. సర్వదాహములయందెవనిశరీరము వెలుపల శీతలముగనుండెడినో, అట్టి మనుజునియొక్క సర్వదాహముల వర్జింపవలయును.

చందనాదికషాయము

చందనం పర్పటోశీరసీరనీరదనీరజైః. 12
మృణాలమిశిధాన్యాకపద్మకామలకైః కృతః,
అర్ధశిష్టస్సితాశీతః పీతః క్షౌద్రసమన్వితః. 13
క్వాథో విపోథయేద్దాహం తత్క్షణం పరమోల్బణమ్,

తా. చందనము, పర్పాటకము, వట్టివేళ్లు, కురువేళ్లు, తుంగముస్తలు, కమలములు, తామరతూండ్లు, పెద్దసోపు, ధనియాలు, పద్మకములు, ఉశిరికవోలుపు

వీనినిచేర్చి నాల్గురెట్లు నీరుపోసి సగము మిగులునటుల కషాయముకాచి అందు చక్కెర చేర్చిచల్లగనుండునపుడు తేనెవైచి పుచ్చుకొనిన దాహము తత్క్షణమున నివర్తించు.

లాజాదికషాయము

లాజాంబుచందనోశీర క్వాథోంతశ్శర్కరాన్వితః. 14
శీతః పీతో నిహంత్యాశు దాహం పిత్తజ్వరం నృణామ్,

తా. పేలాలు, కురువేరు, చందనము, వట్టివేరు వీనిని కషాయముబెట్టి అందు చక్కెరచేర్చి పుచ్చుకొనిన దాహము, పిత్తజ్వరము ఇవి నివర్తించు.

దశసారచూర్ణము

యష్టీధాత్రీఫలద్రాక్షాఏలాచందనవాలకైః. 15
మధూకపుష్పం ఖర్జూరం దాడిమం పేషయేత్సమమ్,
సర్వతుల్యాసితాయోజ్యాపలార్థం భక్షయేత్సదా. 16
దశసారమిదం ఖ్యాతం దాహపిత్తవికారనుత్,

తా. యష్టిమధుకము, ఉశిరికెవోలుపు, ద్రాక్ష, ఏలకులు, చందనము, కురువేరు, ఇప్పపువ్వు, ఖర్జూరపుపండ్లు, దాడింబపండ్లు, వీనిని సమముగచూర్ణించి ఈ చూర్ణమునకు సమము చక్కెరచేర్చి అరపలముచొప్పున పుచ్చుకొనిన సర్వపిత్త వికారములు నివర్తించు.

ఖర్జూరాదిచూర్ణము

ఖర్జూరామలకీసస్యే పిప్పలీ చ శిలాజతు. 17
ఏలాపాషాణభిద్యష్టీచందనోర్వారుబీజకైః,
ధాన్యకం శర్కరాయుక్తం పాతవ్యం యష్టివారిణా. 18
అంగదాహం లింగదాహం గుదజం క్షీణశుక్రజమ్,
శర్కరాశ్మరిశూలఘ్నం వృష్యం బలకరం పరమ్. 19
నాశయేన్మూత్రరోగాంశ్చ తథా శుక్రభవానపి,

తా. ఖర్జూరము, ఉశిరికెవోలుపు, పిప్పళ్లు, శుద్ధిజేసినశిలాజితు, ఏలకులు, అతిమధురము, కొండపిండిచెట్లు, చందనము, దోసవిత్తులు, ధనియాలు, పంచదార వీనిని సమాంశములుగ చూర్ణించి అతిమధురకషాయముతోచేర్చి పుచ్చుకొనిన శరీరము మేఢ్రము, గుదము వీనియందలి తాపము, శుక్రక్షయమువలన జనించు తాపము, శర్కరాశ్మరి, శూల, మూత్రరోగము, శుక్రదోషమువలన జనించిన రోగములు ఇవి నివర్తించుటయేగాక వీర్యవృద్ధి, బలము వీనిని గలుగంజేయు.

### చందనాదిచూర్ణము

చందనోశీరకుష్ఠాబ్దధాత్రీచోరకముత్పలమ్. 20
మధుకం మధుపుష్పం చ ద్రాక్షా ఖర్జూరకం తథా,
చూర్ణం కృత్వా సమసితం ప్రాతశ్శీతాంబునా పిబేత్. 21
రక్తపిత్తం తథా శ్వాసం పైత్తం గుల్మం సముద్ధరేత్,
అంగదాహం శిరోదాహం శిరోవిభ్రమమేవ చ. 22
కామలాం చ ప్రమేహాంశ్చ పైత్తజ్వరవినాశనమ్,
చందనాద్యమిదం చూర్ణం పూజ్యపాదేన భాషితమ్. 23

తా. చందనము, వట్టివేరు, చెంగల్వకోష్ఠు, తుంగముస్తలు, ఉశిరికపొలుపు, కచోరములు, కలువగడ్డలు, అతిమధురము, ఇప్పపువ్వులు, ద్రాక్ష, ఖర్జూరములు, వీనిని సమభాగములుగ చూర్ణించి చూర్ణమునకు సమము చక్కెరచేర్చి ప్రాతఃకాలమున శీతోదకముతో పుచ్చుకొనిన రక్తపిత్తము, శ్వాస, పిత్తగుల్మము, అంగదాహము, శిర్షదాహము, తలదిరుగుట, కామిల, ప్రమేహము, పిత్తజ్వరము, ఇవి యన్నియు నివర్తించు. ఇది పూజ్యపాదులచే చెప్పబడిన చందనాది చూర్ణమనంబడు.

### చంద్రకలారసము

గగనదరదయుక్తం శుద్ధసూతం చ గంధం ప్రహారమధుసుపిష్టం వల్లయుగ్మం నరోఽద్యాత్,
శశికలరసమేనంశ్శృంగబేరోదకేన ప్రథమతితనుదాహం తక్రభక్తం చ భోజ్యమ్. 24

తా. అభ్రికభస్మము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము వీనిని సమాంశములుగ గ్రహించి ఖల్వమునందువైచి తేనెతో నొకయామము మర్దించి రెండువల్లయులయెత్తు అల్లపురసముతో పుచ్చుకొనిన శరీరమున జనించినదాహము, నివర్తించు. దీనికి పత్థ్యము మజ్జిగన్నమును భుజించవలయు. ఇది చంద్రకళారసము.

### రసాదిఘుటికలు

రసబలిఘనసారచందనానాం సనలదసేవ్యపయోదజీవనానామ్,
అపహరతి గుటీముఖస్థితేయంసకలసముత్థితదాహమాశుసేయమ్.25

తా. శుద్ధరసము, శుద్ధగంధకము, పచ్చకర్పూరము, చందనము, వట్టివేరు, సేవ్యము, తుంగముస్తలు కురువేరు వీనినన్నియు సమభాగములుగ చూర్ణించి (నెయ్యివైచి) కలిపి ఘుటికలుజేసి పుక్కిటియందుంచుకొనిన త్రిదోషములవలన జనించిన దాహము నివర్తించు.

### మృతసంజీవనీఘుటికలు

మధుయష్టీలవంగం చ శిలాజతు త్రుటి స్తథా,
సహస్రభావనాః కార్యా నవతండులవారిణా. 26
యామమాత్రం మర్దయిత్వా వటీకోలసమా స్మృతా,
కృష్ణకార్పాసనీరేణ తృష్ణాదాహజ్వరాన్ జయేత్. 27
మూర్ఛాద్యముగ్రరోగం చ వాతపిత్తం చ నాశయేత్,
మృతసంజీవనీనామ్నా పూజ్యపాదై రుదీరితా. 28

తా. అతిమధురము, లవంగములు, శుద్ధశిలాజతు, ఏలకులు వీనిని సమభాగములుగ చూర్ణించి క్రొత్తబియ్యపుకడుగుతో వెయ్యిభావనలుజేసి పిదప వొక యామము బాగుగనూరి రేగుకాయలంత మాత్రలుజేసి పూటకొకటి మతున నల్లప్రత్తియాకు రసముతో సేవించిన దప్పి తాపము జ్వరము మూర్ఛ మొదలగు ఉగ్రరోగములు వాతజరోగము పిత్తజరోగము ఇవియన్నియు నివర్తించు.

### తిలతైలము

తిలతైలం భవేత్ప్రస్థం తక్షోడశగుణాన్వితే,
కాంజికే విపచేత్తత్స్యాద్దాహజ్వరహరం పరమ్. 29

తా. నువ్వులనూనె ౧ ప్రస్థము కాంజికము ౧౬ ప్రస్థములుజేర్చి తైలము సిద్ధపరిచి లేపాదులంజేసిన దాహము జ్వరము ఇవి నివర్తించు.

### పునర్నవాదితైలము

శ్వేతం పునర్నవా మూలం శుభం పలశతం క్షిపేత్,
కృష్ణాజ్యదుగ్ధమధ్యే చ పేషితం చాఢకే భిషక్. 30
తత్సమం తిలతైలం చ పృథగ్ద్రవ్యాణి యోజయేత్,
ధూపం షోడశభాగం చ హ్యాష్టాపణవరాలకే. 31
కచోరం నాలకం శ్వేతకృష్ణాక్షీరే తథైవచ,
మంజిష్ఠారాగచూర్ణం చ శ్రీగంధం రక్తచందనమ్. 32
కృష్ణాగరుం చరుద్రాక్షాన్ పలమేకం ప్రయోజయేత్,
తచ్చూర్ణం తైలమధ్యే చ నిక్షిపేత్పాచయేత్సుధీః. 33
మేహారికాష్ఠ యుక్తేన పాచయేత్కోమలాగ్నినా,
సుపక్వం తైలముద్ధృత్య రాత్రావంగం చ మర్దయేత్. 34
అంగశూలం చాంగదాహం నేత్రరోగాన్సపీనసాన్,

పాండుకామలముష్ణంచ సూతికాసన్నిపాతకమ్. 35
కరదాహాన్పాదదాహం స్తంద్రాంకటిసమీరణాన్,
క్షయంకృచ్ఛ్రాంశ్చ కండూంశ్చ గజకర్ణాదికం తథా. 36
శిరోరోగాన్భ్రమాన్పిత్తం నాశయేద్దృష్టిగాం రుజమ్,
తథైవామృతతుల్యం చ జ్వరజీర్ణవతామపి. 37
అస్థిగజ్వరనాశాయ మేహజ్వరకశాన్తయే,
సర్వాంగే మర్దనం కృత్వా మంగళస్నానమాచరేత్. 38
శివోదితమిదం తైలమశ్విభ్యాం గోచరీకృతమ్,
సర్వరోగహరం చైవ దుర్లభం భిషజాం భువి. 39
సాధయేద్గురుసాన్నిధ్యే సిద్ధిర్భవతి నాన్యథా,

తా. తెల్లగలిజేరువేళ్లు ౧౦౦ పలములు గ్రహించి నల్లఆవుయొక్క నెయ్యి౧ ఆఢకము పాలు ౧ ఆఢకముపోసి నూరి, ౧౦౦ పలములు నూనె, ౧౬ కర్షములు గుగ్గులు ధూపము మిరియాలు లవంగములు ౨ భాగములు, కచోరములు, కురువేరు తెల్లవట్టివేరు, నల్లవట్టివేరు, మంజిష్ఠ, కాచు, చందనము, రక్తచందనము, కృష్ణాగరు, రుద్రాక్షము, వీనిని ప్రత్యేకము ౧ పలముచొప్పున చూర్ణించి అందుచేర్చి, తంగేడుకట్టెలతో మందాగ్ని యిచ్చి తైలము సిద్ధపరచి దానిని రాత్రికాలమునందు శరీరమునకు మర్దించి మంగళస్నానమొనర్చిన అంగశూల, అంగదాహము, నేత్రరోగము, పీనస, పాండురోగము, కామిల, ఉష్ణము, బాలింతరోగము, సన్నిపాతము, కాళ్లుచేతులుమంట, తంద్ర, కటివాతము, క్షయ, మూత్రకృఛ్రము, కండు, గజకర్ణము, శిరోరోగము, భ్రమ, పిత్తము, దృష్టిరోగము, జీర్ణజ్వరము, అస్థిజ్వరము, మేహజ్వరము, ఇవి నివర్తించు. ఈ తైలము శివునిచే జెప్పబడి అశ్వినీదేవతలచే ప్రసిద్ధికెక్కి సకలరోగ నాశకరమై యుండుగాన వైద్యులకు నీయోగము భూమియందు దొరుకుట దుర్లభము. ఈ తైలమును గురుముఖముగ దెలిసికొనిన ఔషధసిద్ధిగలుగు తద్విపరీతంబయ్యెనేని సిద్ధియును విపరీతంబగు.

## దాహరోగపథ్యములు

శాలయః షష్టికా ముద్గా మసూరాశ్చణకా యవాః. 40
ధన్వమాంసరసాలాజా మండం వైసక్తవస్సితా,
శతధౌతం ఘృతం దుగ్ధం నవనీతం పయో భవమ్. 41
కూష్మాండం కర్కటీ మోచా పనసస్వాదుదాడిమమ్,
పటోలపర్పటీ ద్రాక్షా ధాత్రీఫలపరూషకే. 42

బింబీతుంబీప్లయః పేటీఖర్జూరం ధాన్యకం మిశీ,
బాలతాలం ప్రియాలం చ శృంగాటం చ కసేరుకమ్. 43
మధూకపుష్పం హ్రీబేరం పథ్యాతిక్తాని సర్వశః,
సితా ప్రదేహోభూవేశ్మ సేకోభ్యంగావగాహనే. 44
ఫుల్లోత్పలదలక్షౌమశయ్యాశీతలకాననమ్,
కథా విచిత్రాగీతాని వాద్యం మంజులభాషణమ్. 45
ఉశీరచందనైర్లేపః శీతాంశుశ్శిశిరోనిలః,
ధారాగృహం ప్రియాస్పర్శో ప్రతీరం హిమవాలుకమ్. 46
సుధాంశురశ్మయః స్నానం మణయో మధురో రసః,
పూర్వోక్తాని విధేయాని పిత్తహారీణి యాని చ. 47
ఇతి దాహవతాం నృణాం పథ్యవర్గ ఉదాహృతః,

తా. ౧౦ దినములకు ఫలించెడి వడ్లబియ్యము, పెసలు, చిరుశనగలు, శనగలు, యవలు, మిట్టభూమియందలి జంతుమాంసరసము, లాజమండము, పేలపిండి, పంచదార, నూరుమార్లు కడగబడిన ఘృతము, పాలు, పాలయందు తీయబడిన వెన్న, బూడిదె గుమ్ముడుకాయ, దోసకాయ, అరటిపండు, పనసపండు, తియ్యని దానింబపండు, పొట్లకాయ, పర్పాటకము, ద్రాక్షపండు, ఉశిరికవోలుపు, పెద్ద ఈతపండు దొండకాయ, అనపకాయ, అల్లము, ఖర్జూరపుపండు, ధనియాలు, సదాప, లేతతాటి నుంగులు, సారపప్పు, పరికెగడ్డ, నెమ్మటములు, ఇప్పపువ్వు, వట్టివేరు, కరక్కాయ, చేదుగలపదార్థములు, పంచదార, శీతపదార్థముల లేపములు, భూగృహము, శీతోదకము, మొదలగువాని శరీరముపై చిలకరించుట, అభ్యంజనస్నానము. వికసించిన కమలములయొక్క శయ్యపై పరుండుట, చల్లని యుద్యానవనమునందు సంచరించుట, చిత్రకథలను సంగీతమును వాద్యాదులను శ్రవణానందముగ వినుట, మంచిమాటలువినుట, వట్టివేరు విసనకఱ్ఱలయొక్క గాలిని సేవించుట, చందనమును బూసికొనుట, వెన్నెల, చల్లనిగాలి, జలగృహము, స్త్రీలయొక్క ఆలింగనము, నదీతీరమునందు సంచరించుట, పచ్చకర్పూరము, చంద్రకిరణములు, స్నానము, రత్నధారణము, మధురరసము, పూర్వోక్తపిత్తనాశనకరయోగములు ఇవి యన్నియు దాహరోగమునందు పథ్యములని తెలియవలయును.

## అపథ్యములు

విరుద్ధాన్యన్నపానాని క్రోధో వేగవిధారణమ్. 48
శ్రమం వ్యవాయమాధ్మానం క్షారం పిత్తకరాణి చ,

వ్యాయామమాతపం తక్రం తాంబూలం మధురామరమ్. 49
ద్రవ్యం చకటుతిక్తోష్ణం దాహవాఞ్ పరివర్జయేత్,

తా. క్షీరమత్స్యాది విరుద్ధాన్నపానములు, క్రోధము, మలమూత్రాది వేగ నిరోధము, శ్రమ, మైథునము, కడుపుబ్బు పదార్థములు, క్షారములు, పిత్తకరపదార్థములు, వ్యాయామము, ఎండ, మజ్జిగ, తాంబూలము, తేనె, ఇంగువ, కారము, చేదు ఉష్ణము ఇట్టివిగల పదార్థములు, దాహరోగముగలవాడు విడువవలయును.

---

# మూర్ఛప్రకరణమ్

మూర్ఛా, భ్రమ, నిద్రా, సన్యాసనిదానము సంప్రాప్తి

క్షీణస్య బహుదోషస్య విరుద్ధాహారసేవినః,
వేగాఘాతాదభిఘాతాద్దీనసత్వస్య వా పునః. 1
కరణాయతనేషూగ్రా బాహ్యేష్వాభ్యంతరేషు చ,
నివిశంతే యదా దోషా స్తదా మూర్ఛంతి మానవాః. 2
సంజ్ఞావహాసు నాడీషు పిహితాస్వనిలాదిభిః,
తమోభ్యుపైతి సహసా సుఖదుఃఖవ్యపోహకృత్. 3
సుఖదుఃఖవ్యపోహాచ్చ నరః పతతి కాష్ఠవత్,
మోహో మూర్ఛేతి తామాహుష్షడ్విధా సా ప్రకీర్తితా. 4
వాతాదిభిశ్శోణితేన మద్యేన చ విషేణ చ,
షట్స్వప్యేతాసు పిత్తం తు ప్రభుత్వేనావతిష్ఠతే. 5

తా. క్షీణించి బహుదోషములతోడంగూడియుండునరుడు విరుద్ధములగు ఆహారముల భుజించుట మలమూత్రము వీనిని బంధించుట, కఱ్ఱలు మొదలగువాటిచే నభిఘాతమనొందుట వీనివలనను లేక సత్వగుణక్షయముగలనరునియొక్క శ్రోత్రాది బాహ్యేంద్రియములయందు అభ్యంతరమనోపహానాడులయందు లేక కర్మేంద్రియ జ్ఞానేంద్రియములయందు వాతాదిదోషములు ప్రవేశించుటవలనను మనుజుడు మూర్ఛం జెంది సుఖదుఃఖజ్ఞానరహితుడై భూమిపై కొయ్యమువలెబడును. ఇది వాతజమూర్ఛ పిత్తజ మూర్ఛ శ్లేష్మజమూర్ఛ రక్తజమూర్ఛ విషజమూర్ఛ మద్యజమూర్ఛల ఆఱు విధంబులుగ విలసిల్లు నీయాఱుమూర్ఛలలో పిత్తము రాజుగనుండునని యెఱుగవలయును. మూర్ఛ యనగా (సంజ్ఞావహనాడులయందు వాతాదిదోషము లావరించుటవలన సుఖదుఃఖజ్ఞానమును నష్టపరచెడి అజ్ఞానంబకస్మాత్తుగ ప్రాప్తంబగుటయే,

—॥ పూర్వరూపము ॥—

హృత్పీడాజృంభణం గ్లానిస్సంజ్ఞాదౌర్బల్యమేవ చ,
సర్వాసాం పూర్వరూపాణి యథాస్వం చ విభావయేత్. 6

తా. రొమ్ముయందుపీడ ఆవలింతలు బడలిక తెలివితగ్గుట ఇవి సర్వమూర్ఛలకు పూర్వరూపములు. ఈమూర్ఛలక్షణముల వాతాది భేదమువలన దెలిసికొనవలయు.

—॥ వాతజమూర్ఛాలక్షణము ॥—

నీలం వా యదివా కృష్ణమాకాశమథ వారుణమ్,
పశ్యం స్తమః ప్రవిశతి శీఘ్రం చ ప్రతిబుధ్యతే. 7
వేపథుశ్చాంగమర్దశ్చ ప్రపీడాహృదయస్య చ,
కార్శ్యం శ్యావారుణాచ్ఛాయా మూర్ఛాయే వాతసంభవే. 8

తా. ఆకాశమును నీలవర్ణముగనుగాని నల్లగనుగాని లేక యెఱ్ఱగనుగాని చూచుట, మూర్ఛ జెందుట, మరల శీఘ్రముగ తెలివివచ్చుట, శరీరమునందు వణుకు బుట్టుట, ఒడలుమలుచుట, రొమ్ముయందు మిగులపీడ, శరీరకృశత్వము, శరీరమునల్లగ గాని లేక యెరుపువర్ణముగగాని యుండుట ఇట్టి లక్షణములుగలది వాతజమూర్ఛయని యెఱుంగవలయు.

—॥ పిత్తజమూర్ఛాలక్షణము. ॥—

రక్తం హారితవర్ణ వా వియత్పీతమథాపి వా,
పశ్యం స్తమః ప్రవిశతి సస్వేదశ్చ ప్రబుధ్యతే. 9
సపిపాసస్ససంతాపో రక్తపీతాకులేక్షణః,
సంభిన్నవర్చాః పీతాభో మూర్ఛాయే పిత్తసంభవే. 10

తా. ఆకాశమును యెఱ్ఱగను లేక ఆకుపసుపువన్నముగను లేక పసపువర్ణముగనుచూచి తత్క్షణమునందే మూర్ఛ జెందుట, తెలివిని జెందునపుడు చెమట దప్పి తాపము ఇవిగలుగుట, నేత్రములుయెఱ్ఱగగాని లేక పసుపువర్ణముగగాని ఉండుట, మలము పలచగ వెడలుట, శరీరము పసుపువర్ణముగనుండుట ఇట్టిలక్షణములుగలది పిత్తజమూర్ఛయని యెఱుంగవలయు.

—॥ కఫజమూర్ఛాలక్షణము ॥—

మేఘసంకాశమాకాశమావృతం వా తమోఘనైః,
పశ్యం స్తమః ప్రవిశతి చిరాచ్చ ప్రతిబుధ్యతే. 11
గురుభిః ప్రావృతైరంగైర్యథైవార్ద్రేణ చర్మణా,
సప్రసేకస్సహృల్లాసో మూర్ఛాయే కఫసంభవే. 12

తా. మేఘమువలనగాని లేక చీకటివలనగాని గప్పబడియుండునటుల ఆకాశమునుగాంచి తత్క్షణమున మూర్ఛనుజెంది చాలాకాలముమీద తెలివిజెందుట, శరీరముపై దళమగువస్త్రముగాని లేక పచ్చిగనుండు చర్మముగాని గప్పంబడినటులుండుట, నోటియందు చొంగకారుట, వాంతివచ్చునటునుండుట. ఇట్టి లక్షణములుగలది కఫజమూర్ఛయని యెఱుంగవలయు.

సన్నిపాతమూర్ఛలక్షణము

సర్వాకృతిస్సన్నిపాతాదపస్మారఇవాగతః,
సజంతుం పాతయత్యాశు వినా బీభత్సచేష్టితైః. 13

తా. వాత పిత్త శ్లేష్మలక్షణయుక్తంబై నోటియందునురుగు పండ్లుకొరుకుట నేత్రములుతిరుగుట ఇవి మొదలగు అపస్మారబీభత్సలక్షణవిహీనమై రెండవ యపస్మారమువలెనుండునది సన్నిపాతజ మూర్ఛయనంబడు. (ఇది వాతాదిమూర్ఛలలో అంతర్భావమును జెందియుండు.)

రక్తజమూర్ఛాసంప్రాప్తి

పృథివ్యాపస్తమో రూపం రక్తగంధస్తదన్వయః,
తస్మాద్రక్తస్య గంధేన మూర్ఛంతి భువి మానవాః. 14
ద్రవ్యస్వభావ ఇత్యేకే దృష్ట్వా యదభిముహ్యతి,

తా. పృథ్వి ఉదకములు తమోగుణ విశిష్టములు. మరియు రక్తముయొక్క గంధముసగా పృథ్వి ఉదకసంబంధముకలదిగ నుండుటంజేసి తమోగుణవిశిష్టంబు, అందువలన తామస ప్రాధాన్యముగలవారలు రక్తగంధమువలన మూర్ఛజెందెదరు. రక్తగంధము లేక రక్తము జూచిన మాత్రముననే మూర్ఛజెందుట ద్రవ్య స్వభావగుణమని కొందరు వచించెదరు.

విషమద్యజనితమూర్ఛానివరము

గుణాస్తీవ్రతరత్వేన స్థితాస్తు విషమద్యయోః. 15
తఏవ తస్మాదాభ్యాం తు మోహౌ స్యాతాం యథేరితౌ,

తా. విషమద్యములయందు శ్లో. లఘురూక్షమాశువిశదం వ్యవాయితీక్ష్ణం వికాసిసూక్ష్మంచ। ఉష్ణమనిర్దేశ్యరసందశగుణముక్తంవిషంతజ్జ్ఞైః ॥ అనగా లఘురూక్ష ఆశు విశద వ్యవాయి తీక్ష్ణ వికాసి సూక్ష్మ ఉష్ణ అనిర్దేశ్య రసములన నీపది గుణంబులు కడుతీవ్రములుగ నుండుటవలన పైనుదహరింపబడురీతిగ మోహముజనించు. (విషమద్యములలో విషమజీర్ణమును జెందకయుండుటచే విషసంబంధమువలన జనించిన

మోహము స్వయముగ వదలక బాధింపుచుండు. మద్యము జీర్ణమును జెందునదిగ నుండుటచే మద్యమువలన జనించిన మోహము స్వాభావికముగ శాంతిని జెందు.)

—॥ రక్తజాదిమూర్ఛాలక్షణము ॥—

స్తబ్ధాంగదృష్టిస్త్వసృజాగూఢోచ్ఛ్వాసశ్చ మూర్ఛితః. 16
మద్యేన ప్రలపన్శేతే నష్టవిభ్రాంతమానసః,
గాత్రాణి విక్షిపన్భూమౌ జరాం యావన్న యాతి తత్. 17
వేపథుః స్వప్నతృష్ణాస్స్యుస్తమశ్చ విషమూర్ఛితే,
వేదితవ్యం తీవ్రతరైర్యథాస్వం విషలక్షణైః. 18

తా. రక్తసంబంధమూర్ఛయందు మనుష్యునియొక్క శరీరము నేత్రములు ఇవి స్తబ్ధములగుట శ్వాసబాగుగ వెడలకయుండుట ఇట్టివి గలుగును. మద్యజమూర్ఛయందు మిక్కిలిమాటలాడుట శయనించుట నిశ్చేష్టితుడుగనుండుట భ్రాంతుడగుట మద్యము జీర్ణముగాకుండువరకు భూమిపైబడి కాళ్లుచేతులనుగొట్టుట ఇవి కలుగును. మరియు విషజమూర్ఛయందు శరీరమునందు వణుకు నిద్ర దప్పి కన్నులకు మాంద్యము వీనితో గూడి సుశ్రుతకల్పస్థానమున జెప్పంబడినవేర్లు ఆకులు పండ్లు గడ్డలు పాలు ఇవి మొదలగు స్థావరవిషసేవనవలన జనించెడి విషలక్షణములను గలిగియుండును.

—॥ కారణవిశేషముచే మూర్ఛాదిభేదములు ॥—

మూర్ఛా పిత్తతమఃప్రాయా రజఃపిత్తానిలాద్భ్రమః,
తమోవాతకఫాత్తంద్రా నిద్రా శ్లేష్మతమోభవా. 19

తా. పిత్తతమోగుణప్రాబల్యమువలన మూర్ఛజనించుననియు, రజోగుణము పిత్తము వాతము వీనివలన భ్రమగలుగుననియు, తమోగుణము వాతము కఫము వీని వలన, తంద్ర జనించుననియు కఫము తమోగుణము వీనివలన నిదురవచ్చుననియును తెలియవలయు.

—॥ తంద్రాక్లమలక్షణములు ॥—

ఇంద్రియార్థేష్వసంప్రాప్తిర్గౌరవం జృంభణం క్లమః,
నిద్రార్తస్యేవ యస్యైతే తస్య తంద్రాం వినిర్దిశేత్. 20
యోనాయాసశ్శ్రమో దేహే ప్రవృద్ధశ్వాసవర్జితః,
క్లమస్సఇతి విజ్ఞేయ ఇంద్రియార్థప్రబోధకః. 21

తా. ఇంద్రియములకు స్వస్వవిషయగ్రాహకశక్తిలేకుండుట, శరీరముబరువు ఆవలింత బడలిక ఇవినిద్రబోవుపురుషునికి గలుగుచందంబున జాగ్రదవస్థయందుండు వానికి జనించిన నది తంద్రయనంబడు. మరియు శరీరమునందు ఆయాసములేకనే

శ్రమజనించుట మిగులశ్వాసలేకపోవుట సర్వవిషయములయందు ఇంద్రియములు ప్రవర్తించకుండుట ఇట్టిలక్షణములుగలది క్లమయని యెరుంగవలయు.

### నిద్రాలక్షణము

యదాతు మనసి క్లాంతే కర్మాత్మానః క్లమాన్వితాః,
విషయేభ్యో నివర్తంతే తదా స్వపితి మానవః. 22

తా. ఎపుడు మనస్సు ఇంద్రియములు ఇవి బడలికచే విషయగ్రాహకశక్తి విహీనములుగనుండునో కర్మపురుషుడు (ఆత్మ) క్లమమును జెందునో అపుడు నిదురవచ్చునని తెలియవలయు. భ్రమయొక్క లక్షణము ప్రసిద్ధంబగుటచే నిచట విశదపరుపలేదు.

### సన్న్యాసనిదానము

దోషేషు మదమూర్ఛాద్యాగతవేగేషు దేహినామ్,
మస్వయమేవోపశామ్యతే సన్న్యాసౌషధైర్వినా. 23

తా. దోషములయొక్క వేగముపశమించిన మదమూర్ఛాదులౌషధములేకనే తమంతట తామే యుపశమించు, మూర్ఛాదివ్యతిరిక్తమగు సన్న్యాసరోగమునందైతే దోషములయొక్క వేగము ఔషధములేకనే ఉపశమించనేరదు.

### సన్న్యాసలక్షణము

వాగ్దేహమనసాం చేష్టా ఆక్షిప్యాతిబలామలాః,
సన్న్యస్యంత్యబలం జంతుం ప్రాణాయతనమాశ్రితాః. 24
సనాసన్న్యాససన్న్యస్తః కాష్ఠీభూతో మృతోపమః,
ప్రాణైర్విముచ్యతే శీఘ్రం ముక్త్వా సద్యఃఫలాం క్రియామ్. 25

తా. మిక్కిలి బలిష్టమగు వాతాదిదోషములు వాక్కు దేహము మనస్సు వీనివ్యాపారముల నిరోధించి హృదయమునందుజేరి దుర్బలుడగుమనుజుని మోహింపజేయుగాన నది సన్న్యాసమనంబడు. దీనివలన పీడితుడగుమనుజుడు భూమిమీదపడి మృతప్రాయుడుగబడు. దీనియందు సూదులతోబొడుచుట యంత్రములతో ద్రిప్పుట దీపపువర్తినంటించి పొగను నాసికాద్వారమునందు జేర్చుట ఇవి మొదలగు చికిత్సలం జేయవలయు. జేయకుండిన శీఘ్రముగ ప్రాణములచే విడువబడును.

### చికిత్సాక్రమము

సేకావగాహౌ మణయస్సహారాశ్శీతా ప్రదేహావ్యజనానిలాశ్చ,
శీతాని పానాని చ గంధవంతి సర్వాసు మూర్ఛాస్వనివారితాని 26

తా. శరీరమునందు నీళ్లుచల్లుట, స్నానము, రత్నాభరణధారణము, చల్లని లేపము, విసనకఱ్ఱలగాలి, సుగంధయుక్తములగు చల్లనిపానములు. ఈ ఉపచారములను సర్వమూర్ఛలయందును జేయవలయు.

భ్రమకు దురాలభాదికషాయము

దురాలభాకషాయస్య ఘృతయుక్తస్య సేవనాత్,
భ్రమశ్శామ్యతి గోవిందస్మరణాదివ సంసృతిః. 27

తా. దూలగొండివేళ్లకషాయములో నెయ్యి చేర్చి పుచ్చుకొనిన గోవిందస్మరణవలన ఎటుల సంసారమునశించునో అటుల భ్రమ నివర్తించు.

మూర్ఛకు పంచమూలాదికషాయము

పంచమూలకషాయం చ మధునా సితయా పిబేత్,
జ్వరఘ్నాంస్తు కషాయాంశ్చ తాన్యథాస్వం ప్రయోజయేత్. 28

తా. పంచమూలకషాయమునందు తేనె చక్కెరవైచి పుచ్చుకొనినను లేక జ్వరనాశకకషాయముల దోషములనెరింగి పుచ్చుకొనినను మూర్ఛ నివర్తించు.

క్షుద్రాది కషాయము

క్షుద్రా ఽ మృతా గ్రంధిక నాగరాణాం మూర్ఛాం జయేద్వారుణకా
కషాయః,

తా. ములకవేరు, తిప్పతీగె, మోడి, శొంఠి, ఉలిమిడిపట్ట వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన మూర్ఛ నివర్తించు.

ద్రాక్షాదికషాయము

ద్రాక్షాసితాదాడిమలాజవంతి కల్హారనీలోత్పలపద్మవంతి. 29
పిబేత్కషాయాణి చ శీతలాని పిత్తజ్వరం యాని చ యాపయంతి,

తా. ద్రాక్ష చక్కెర దాడిమపండు పేలాలు తెల్లకలువ నల్లకలువ కమలము వీనిని కషాయముబెట్టిగాని లేక పిత్తజ్వరహర కషాయమునుగాని పుచ్చుకొనిన మూర్ఛ తొలగును.

తామ్రసారాదిచూర్ణము

తామ్రసారసమోశీరం కేసరం శీతవారిణా. 30
పీతం మూర్ఛాం ద్రుతం హన్యా ద్వ్రణేషమింద్రాశనిర్యథా,

తా. రక్తచందనము వట్టివేరు నాగకేసరములు వీని చూర్ణమును చల్లనినీళ్లతో త్రాగించిన మూర్ఛ నివర్తించు.

### మూర్ఛారోగములకు పథ్యములు

ధూమోంజనం నావనరక్తమోక్షౌ దాహశ్చ సూచీపరితోదనాని. 31
గోష్ణాం కచానాం పరిలుంభనాని నఖాంతపీడా దశనోపదంశః,
నాసాముఖద్వారమరున్నిరోధో వి రేచనచ్ఛర్దనలంఘనాని. 32
క్రోధో భయం దుఃఖకరీ చ శయ్యా కథావిచిత్రాస్సుమనోహరాశ్చ,
ఛాయానభోంభశ్శతధౌత సర్పిర్మృదూని తిక్తాని చ లాజమండః. 33
జీర్ణాయవాలోహితశాలయశ్చ కౌంభం హవిర్ముద్గసతీనయూషాః,
ధన్వోద్భవామాంసరసాశ్చ రాగాఃసఖాండవాగవ్యపయస్సితాచ. 34
పురాణకూష్మాండపటోలమోచహరీతకీదాడిమనారికేరమ్,
మధూకపుష్పాణి చ తండులీయతుషోదకేన్నానిలఘూని చాపి. 35
నిరంతరం చందనచర్చనం చ కర్పూరనీరం హిమవాలుకాచ,
నాత్యుచ్చశబ్దోద్భుతదర్శనాని గీతాని వాద్యాని నచోత్కటాని. 36
శ్రమస్మృతిశ్చింతనమాత్మబోధో ధైర్యం చ మూర్ఛాస్వితి పథ్య
యోగః,

తా. ధూమపానము, అంజనము, నస్యము, రక్తమోక్షము, వాతవేయుట, సూదులతో పొడుచుట, వెంట్రుకలులాగుట, గోళ్లతో గిల్లుట, పండ్లతో కొరుకుట, ముక్కు నోరు వీనియందలి శ్వాసను నిరోధించుట, రేచనము, వాంతి, లంఘనము, వీనిని జేయుట, క్రోధము, భయము, దుఃఖకరమగుశయ్య, విచిత్రమై మనోహరమగు కథలను జెప్పుట, ఛాయ, వర్షజలము, 100 మార్లుకడిగిన నెయ్యి, మృదువు చేదు ఇవి గలపదార్థములరసము, పేలాలగంజి, పాతయవలు, ఎఱ్ఱబియ్యము, కుండలోనిలవవునిచిన నెయ్యి, పెసలు, బటానీలు, వీనిగంజి, నిర్జలదేశమునందుండు మృగపక్షిమాంసరసము, ఆవుపాలు, రాగఖాండవములు, చక్కెర, పాతగుమ్మడికాయ, పొట్లకాయ, అరటికాయ, కరక్కాయ, దాడింబపండ్లు, టెంకాయ, ఇప్పపువ్వు, చిర్రికూర, తుషోదకము, లఘువుగనుండుఅన్నము, పలుమారుచందనలేపనము, పచ్చకర్పూరమిళితోదకము, చల్లనిగాలి, గట్టిగమాటలాడుట, అద్భుతపదార్థదర్శనము, ఉత్తమమగు గానము, శ్రమ, స్మృతి, ఆత్మబోధ, చింత ధైర్యము మొదలగునవి మూర్ఛారోగికి పథ్యములని తెలియవలయును.

### అపథ్యములు

తాంబూలం పత్రశాకాని దంతఘర్షణమాతపః. 37
విరుద్ధాన్నాన్నపానాని వ్యవాయం స్వేదనం కటు,

విణ్మూత్ర వేగరోధం చ తక్రం మూర్ఛామయీ త్యజేత్. 38

తా. తాంబూలము, ఆకుకూరలు, పండ్లతో ముకొనుట, ఎండ, విరుద్ధాన్న పానములు, మైథునము, చెమటదీయుట, కారముగలపదార్థ సేవన, మలమూత్ర వేగ నిరోధము, మజ్జిగ, ఇవి మూర్ఛారోగి వర్జించవలయు.

---

# మ దా త్య య ప్ర క ర ణ మ్.

పానాత్యయ పరమద పానాజీర్ణ పానవిభ్రమ నిదానము

యే విషస్య గుణాః ప్రోక్తా స్తేపి మద్యే ప్రతిష్ఠితాః,
తేన మిథ్యోపయుక్తేన భ్రమత్యుగ్రో మదాత్యయః. 1

తా. విషమునకు జెప్పంబడిన ౧౦ గుణములు మద్యమునందుండు. అట్టి మద్యమును విధిహీనముగ పానము సేయుటవలన ఉగ్రమగు మదాత్యయరోగము జనించు.

కింతు మద్యం స్వభావేన యథైవాన్నం తథా స్మృతమ్,
అయుక్తియుక్తం రోగాయ యుక్తియుక్తం తథామృతమ్. 2

తా. కానిమద్యము స్వభావమువలన నన్నముతో తుల్యంబైయుండు. ఐనను దీనిని మిక్కుటముగ పానము జేయుటవలన రోగముజనించు. విధిపూర్వకముగపానము జేసిన నన్నమువలె నమృతతుల్యముగనుండు.

ప్రాణాః ప్రాణభృతామన్నం తదయుక్త్యా నిహంత్యసూన్,
విషం ప్రాణహరం తచ్చ యుక్తియుక్తం రసాయనమ్. 3

తా. సర్వప్రాణులయొక్క ప్రాణమన్నాశ్రయంబైయుండుటచే నన్నమే ప్రాణస్వరూపము. ఐనను అన్నము మిక్కుటముగ భుజించిన ప్రాణముల నశింపజేయును. అటులనే విషము ప్రాణమును నశింపజేయునదైనను యథాశాస్త్రముగ సేవించిన యది రసాయనతుల్యంబై శరీరధారణమును సేయుచుండును (దానికి ప్రమాణంబెద్దియనిన,)

విధినా మాత్రయా కాలే హితైరన్నైర్యథాబలమ్,
ప్రహృష్టో యః పిబేన్మద్యం తస్య స్యాదమృతోపమమ్. 4
స్నిగ్ధైస్సదన్నైర్మాంసైశ్చ భక్ష్యైశ్చ సహ సేవితమ్,
భవేదాయుః ప్రకర్షాయ బలాయోపచయాయ చ. 5

తా. యథాశాస్త్రముగను ప్రమాణానుసారముగను ఆయాకాలానుగుణ్యముగ బలాబలముల నెరింగి హితాన్నములతో పుచ్చుకొనిన మద్యమమృతతుల్యంబైయుండు.

అటులనే స్నిగ్ధమై ప్రకృతికనుగుణ్యమగు నన్నము, మాంసము, నశ్యములు వీనితో గలిపి సేవింపబడిన మద్యము ఆయువు బలము అంగవృద్ధి వీనిని గలుగంజేయు.

రమ్యతామనసస్తుష్టి స్తేజోవిక్రమ ఏవ చ,
విధివత్సేవ్యమానే తు మద్యే సన్నిహితా గుణాః. 6

తా. మద్యమును విధిపూర్వకముగ సేవించిన సౌందర్యము, మనస్సంతోషము, ఉత్సాహము పరాక్రమము వీనిని గలుగంజేయు. (ఆహారమునువర్జించి యెల్లపుడు మద్యపానముచేసినచో అనేకవిధములగువికారములుజనించి శరీరమునునశింపంజేయు.)

శుద్ధకాయః పిబేత్ప్రాతర్నరో మద్యం పలద్వయమ్,
మధ్యాహ్నే ద్విగుణం తచ్చ స్నిగ్ధాహారేణ వాపిబేత్. 7
ప్రదోషేష్టపలం తద్వన్మాత్రామద్య రసాయనే,

తా. ప్రాతఃకాలమున దంతధావనాది కృత్యములంజేసి పిదప రెండుపలములు మధ్యాహ్నకాలమునందు స్నిగ్ధములగు పదార్థములతో జేర్చి నాలుగుపలములు సాయం కాలమునం దెనిమిదిపలములు ఇటుల మద్యమును ప్రమాణానుసారముగ సేవించిన రసాయన తుల్యంబుగ నుండు.

## వాతాదిసంబంధ మదాత్యయలక్షణము

హిక్కాశ్వాసశిరఃకంపపార్శ్వశూల ప్రజాగరైః. 8
విద్యాద్బహుప్రలాపస్య వాతప్రాయమదాత్యయమ్,

తా. ఎక్కిళ్లు, శ్వాస, తలవణుకు, పార్శ్వశూల, నిద్రాభంగము, మిక్కిలి కలవరించుట ఇట్టి లక్షణములు గలిగియుండిన నది వాతప్రాయమదాత్యయమనంబడు.

## పిత్తజన్య మదాత్యయలక్షణము

తృష్ణాదాహజ్వరస్వేద మోహాతీసారవిభ్రమైః. 9
విద్యాద్ధరితవర్ణస్య పిత్తప్రాయం మదాత్యయమ్,

తా. దప్పి, తాపము, జ్వరము, చెమట, మోహము, అతిసారము విభ్రమము, శరీరమునందు పసపువర్ణము ఇట్టి లక్షణములు గలిగియుండిన పిత్తప్రాయమదాత్యయమని యెరుంగవలయు.

## కఫజమదాత్యయలక్షణము

ఛర్ద్యరోచకహృల్లాస తంద్రాస్తైమిత్యగౌరవైః. 10
విద్యాచ్ఛీతపరీతస్య కఫప్రాయం మదాత్యయమ్,

తా. వాంతి, అరుచి, ఓకరింత, తంద్ర, స్తబ్ధత్వము, గురుత్వము, శరీరము

చల్లగనుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన కఫప్రాయమదాత్యయమని యెఱుంగ వలయు.

### త్రిదోషజ మదాత్యయలక్షణము

జ్ఞేయస్త్రిదోషజశ్చాపి సర్వైర్లింగైర్మదాత్యయః. 11

తా. వాత పిత్త శ్లేష్మమదాత్యయ లక్షణములన్నియు గలిగిన త్రిదోష మదాత్యయమని తెలియవలయు.

### అసాధ్యమదాత్యయలక్షణము

హీనోత్తరౌష్ఠమతిశీతమమందదాహం తైలప్రభాస్యమతిపాన
హతం త్యజేత్తు,
జిహ్వోష్ఠదంతమసితం త్వథవాపి నీలం పీతే చ యస్య నయనే
రుధిరప్రభే వా. 12

తా. పైపెదవి కొంచెము న్యూనమై లోపలకడచుకొనియుండుట, శరీరము యొక్క వెలపటిభాగము చల్లగను లోభాగము తాపయుక్తముగనుండుట, ముఖముపై నూనె బూసినటుల మినమినలాడుచుండుట, నాలుక పెదవి దంతములు ఇవి నల్లగ గాని లేక నీలవర్ణముగగాని ఉండుట, నేత్రములు పచ్చగగాని లేక రక్తవర్ణముగ గాని ఉండుట, ఇట్టి లక్షణములుగల మద్యపానరోగిని వైద్యుడు వర్జించవలయు.

### సామాన్యదుర్లక్షణములు

హిక్కాజ్వరౌ వమథువేపథుపార్శ్వశూలాః,
కాసభ్రమావపిచ పానహతం హరన్తి. 13

తా. ఎక్కిళ్లు జ్వరము వాంతి వణుకు పార్శ్వశూల దగ్గు భ్రమ మొదలగు నుపద్రవములు మిక్కుటముగ మద్యపానము జేయువానికి జనించిన వానిం జంపు.

### వాతమదాత్యయమునకు సౌవర్చలాదిచికిత్స

మద్యం సౌవర్చలవ్యోషయుక్తం కించిజ్జలాన్వితమ్,
జీర్ణమద్యాయ దాతవ్యం వాతపానాత్యయాపహమ్. 14

తా. మద్యము, సైంధవలవణము, త్రికటుకములు, వీనిని నేకముగజేసి అందు కొంచెముదకముచేర్చి మద్యపాన జీర్ణానంతరము పుచ్చుకొనిన వాతమదాత్యయము నివర్తించు.

### సూక్తశృంగ్యాదిచికిత్స

సూక్తంసౌవర్చలం శృంగీత్ర్యూషణార్ద్రికదీప్యకైః,
మద్యం పీత్వా జయత్యుగ్రం పవనోత్థం మదాత్యయం. 15

తా. సూక్తము, సైంధవలవణము, కర్కాటశృంగి త్రికటుకములు అల్లము ఓమము వీనిచూర్ణమునకు సమముగ మద్యముగలిపి త్రాగిన భయంకరమగు వాతజ మదాత్యయము నివర్తించు.

### పిత్తమదాత్యయచికిత్స

పిత్తపానాత్యయే పేయం వటశృంగం హిమాంబునా,
సశర్కరం పునర్మద్యం పిబేత్కించిజ్జలాన్వితమ్. 16

తా. మఱ్ఱివూడలను చల్లనీళ్లతో నూరి పుచ్చుకొనినను లేక మద్యమునందు పంచదారనీళ్లుచేర్చి పుచ్చుకొనినను పిత్తమదాత్యయము నివర్తించు.

### క్షుద్రామలకాదిపానము

క్షుద్రామలకఖర్జూరపరూషకహిమం పిబేత్,
సితావిమిశ్రితం మద్యపానాత్యయవికారనుత్. 17

తా. నేలయుశిరికె ఖర్జూరము ఫాలసాపండ్లు వీనిహిమము లేక పంచదార మద్యములోగలిపి పుచ్చుకొనిన పిత్తజ పానాత్యయవికారము నివర్తించు.

### కఫజమదాత్యయమునకు అష్టాంగలవణము

సౌవర్చలమజాజీ చ వృక్షామ్లం చామ్లవేతసమ్,
త్వగేలామరిచార్ధాంశం శర్కరాభాగయోజితమ్. 18
ఏతల్లవణమష్టాంగమగ్నిసందీపనం పరమ్,
మదాత్యయే కఫోత్థే తు దద్యాత్స్రోతోవిశోధనమ్. 19

తా. సౌవర్చలవణము, జీలకఱ్ఱ, వృక్షామ్లము, అమ్లవేతసము, లవంగపట్ట, ఏలకులు, మిరియాలు వీనిని చూర్ణించి రెండింతలు చక్కెరచేర్చి పుచ్చుకొనిన అగ్నిదీప్తి స్రోతోవిశోధనము వీనినిచేయుటయేగాక కఫజమదాత్యయరోగము నివర్తించు. ఇది యష్టాంగలవణ మనబడును.

### శోకవలనజనించినమదమునకు

అవఘ్రాణేన ధూమస్య సితాలవణభక్షణాత్,
శర్కరా కేవలా హన్తి దుస్సహాం పూగజాం రుజమ్. 20

తా. పొగను ఆఘ్రాణించుట చక్కెర లేక ఉప్పు వీనిని భక్షించుట లేక కేవలశర్కరనైనను భక్షించుట వీనివలన దుస్సహాముగనుండెడు శోకవలన జనించిన సొక్కు నివర్తించు.

౼౦ కోద్రవ ధుత్తూరజ మదమునకు ౦౼

కూష్మాండరసస్సగుడశ్శమయతి మదమాశు కోద్రవజః,
ధుత్తూరజం చ దుగ్ధం సశర్కరం పానయోగేన.  21

తా. * కోద్రవమదము బూడిదెగుమ్మడికాయరసములో బెల్లముగలిపి పుచ్చుకొనినను, ఉన్మత్తవిత్తులమదము పాలలో చక్కెరగలిపి పుచ్చుకొనినను నివర్తించు.

౼౦ జాజికాయమదమునకుచికిత్స ౦౼

జాతీమదంతునవనీతసితాప్రయుక్తాపత్రీతథామసృణచందనశర్కరావా,
రంభాజలేన మదిరావిషముష్టిబూతంహన్యాన్మదంసఘృతదుగ్ధమపి ప్రయుక్తమ్.  22

తా. జాజికాయమదమునకు వెన్న చక్కెర వీనితో జాపత్రిని సేవించినను లేక వెన్న మంచిగంధము చక్కెర వీనిని పుచ్చుకొనినను, విషముష్టివలని మదమునకు అరటిగడ్డరసము, మద్యముతో జేర్చిగాని, ఆవుపాలు నెయ్యివీనినిగాని పుచ్చుకొనిన నివర్తించు.

జాతీఫలమదం శీఘ్రం హన్తి పథ్యానిషేవితా,
శీతతోయావగాహశ్చ శర్కరా దధియోజితా.  23

తా. కరక్కాయను సేవించినగాని శీతోదకస్నానమునుగాని చక్కెర పెరుగునుసేవించినగాని జాజికాయ మదముశీఘ్రముగా నివర్తించు.

మథితం గోదధిసహితం తైలం కర్పూరమిశ్రితంసమ్యక్,
ఆస్వాద్య పీతమాశు క్షపయతి పానాత్యయం రోగమ్.  24

తా. ఆవుపెరుగు నూనె వీనిని నేకముగజేసి బాగుగ జిలికి అందు కర్పూరము గలిపి చప్పరించి పానముంజేసిన పానాత్యయరోగము తత్క్షణమున నివర్తించు.

మద్యం పీత్వా యది వాతత్క్షణమాలేహయేత్సితాంసఘృతామ్,
మదయతి న జాతు మద్యం మనాగపి ప్రథితవీర్యమపి.  25

తా. మద్యపానానంతరము పంచదార నెయ్యి వీనిని నేకముగజేసి భక్షించిన మిక్కిలి మైకమును గలుగజేయునదిగనుండినను మద్యము వీర్యవిహీనమగును.

౼౦ మదాత్యయపథ్యములు ౦౼

సంశోధనం నియమనం స్వాపనం లంఘనం భ్రమః,

* కొఱ్ఱలవలనిటిక్క.

సంవత్సరసముత్పన్నా శ్శాలయః షష్టికా యవాః. 26
ముద్గాశ్చ మాషగోధూమాలావతిత్తిరకాదయః,
వేసవారోవిచిత్రాన్నం హృద్యం మద్యం పయస్సితా. 27
తండులీయం పటోలం చ మాతులుంగం పరూషకమ్,
ఖర్జూరం దాడిమం ధాత్రీ నారికేళం చ గోస్తనీ. 28
సర్పిః పురాణం కర్పూరం ప్రతీరం శిశిరోఽనిలః,
ధారాగృహం చంద్రపాదా మణయో మిత్రసంగమః. 29
క్షౌమాంబరం ప్రియాశ్లేషో గీతం వాదిత్రముద్ధతమ్,
శీతాంబుచందనం స్నానం సేవ్యమేతన్మదాత్యయే. 30

తా. విరేచనము, అతిబంధము, నిద్ర, లంఘనము, సంచారము, ఒకసంవత్సరపు పాతవడ్లు, ౬౦ దినములకు ఫలించెడి యవధాన్యము, పెసలు, మినుములు, గోధుమలు, లావుకపిట్టమాంసము, తిత్తిరిపక్షి మొదలగువాటి మాంసములు, వేసవారము, కిచ్చిడి, ప్రియకరమగు మద్యము, పాలు, పంచదార, చిర్రికూర, పొట్లకాయ, మాదీఫలము, ఫాలసాపండ్లు, ఖర్జూరము, దానిమ్మపండు, ఉశిరికపండు, టెంకాయ, ద్రాక్షపండు, పాతనెయ్యి, కర్పూరము, నదీతీరము, చల్లనిగాలి, జలమందిరము, చంద్రకిరణములు, మణిహారములు, మిత్రసమాగమము, పట్టువస్త్రములు, స్త్రీయాలింగనము, సంగీతము, వాద్యములు, శీతోదకము, చందనము, స్నానము ఇవియన్నియు మదాత్యయరోగమునకు పథ్యములని తెలియవలయు.

మదాత్యయమునందపథ్యములు

స్వేదోంజనం ధూమపానం నావనం దన్తఘర్షణమ్,
తాంబూలం చాప్యపథ్యం స్యాన్మదాత్యయవికారిణామ్. 31

తా. చెమటదీయుట, అంజనము, ధూమపానము, నస్యము, దన్తధావనము, తాంబూలము ఇవి మదాత్యయరోగికపథ్యములని తెలియవలయు.

---

# ఉన్మాదరోగప్రకరణమ్.

ఉన్మాద కర్మవిపాకము

మోహాయిత్వా పరాన్యస్తు భుంక్తే వస్తు విగర్హితమ్, 1
సోన్మాదవాతయుక్తస్స్యాత్కృచ్ఛ్రం చాంద్రాయణం తథా,
కుర్యాత్సారస్వతం నామ జపేద్బ్రాహ్మణతర్పణమ్,

తా. ఇతరులకు మోహమును గలుగంజేసి నింద్యమగువస్తువును భక్షణచేసిన వానికి ఉన్మాదవాతపీడలుగలుగు. తన్నివృత్తికై చాంద్రాయణకృచ్ఛ్రప్రాయశ్చిత్తము, సరస్వతీనామజపము వీనిని జేయుటయేగాక బ్రాహ్మణసంతర్పణమునుసగా జేయవలయు.

### ఉన్మాదనిర్వచనము

మదయంత్యుద్ధతా దోషా యస్మాదున్మార్గమాశ్రితాః. 2
మానసోయమతో వ్యాధిరున్మాదఇతి కథ్యతే,

తా. వాతాదిదోషములు ఏదో ఒక కారణముచే ప్రకోపించినవై స్వమార్గమును విడిచి అన్యమార్గముల (అనగా మనోవహధమనుల) నాశ్రయించి చిత్తవిభ్రమము గలుగజేసెనేని యది ఉన్మాదమనంబడు. గాన ఇది మానసికవ్యాధి అనంబడు.

### ఉన్మాదభేదంబులు

ఏకైకశస్సర్వశశ్చ దోషైరత్యర్థమూర్ఛితైః. 3
మానసేన చ దుఃఖేన సపంచవిధ ఉచ్యతే,
విషాద్భవతి షష్ఠశ్చ యథాస్వం తత్ర భేషజమ్. 4
సచాప్రవృద్ధస్తరుణో మదసంజ్ఞాం బిభర్తి చ,

తా. వాత పిత్త శ్లేష్మములు ప్రత్యేకముగగాని లేక సన్నిపాతమువలనగానిలేక మానసికదుఃఖమువలనగాని లేక విషసంబంధమువలనగాని ఉన్మాదంబారువిధంబులుగ జనించు. దీనియందు యథాయోగ్యముగ చికిత్సచెప్పంబడు. ఇవి మిగుల[illegible]జెందక తరుణావస్థయందుండిన మదరోగంబని చెప్పంబడు.

### ఉన్మాదకారణ తత్సంప్రాప్తులు

విరుద్ధదుష్టాశుచిభోజనాని ప్రధర్షణం దేవగురుద్విజానామ్. 5
ఉన్మాదహేతుర్భయహర్షపూర్వో మనోభిఘాతోవిషమాశ్చ చేష్టాః,
తైరల్పసత్త్వస్యమలాః ప్రదుష్టాబుద్ధేర్నివాసంహృదయంప్రదూష్య. 6
స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని ప్రమోహయంత్యాశునరస్యచేతః,

తా. విరుద్ధాన్నము (అనగా విషయుక్తాన్నమును) అమంగళకరాన్నమును సేవించుట, దేవ గురుబ్రాహ్మణులదిరస్కరించుట, భయము, సంతోషము వీనివలన మనస్సునందు తొందరగలుగుట, విషమచేష్ట (అనగా వంకరగనడుచుట, మిక్కుటముగ మాటలాడుట, బలవంతునితో యీడ్పులాడుట) ఇవి మొదలగు కారణముల వలన అల్పసత్వగుణముగల పురుషునియొక్క వాతాదిదోషములు ప్రకోపించి వృద్ధిని జెంది బుద్ధికి స్థానముగనుండు హృదయమును జెరచి మనోవహాస్రోతస్సులంజేర్చి అంతఃకరణమును మోహింపంజేయు.

### ఉన్మాదసామాన్యచిహ్నములు

ధీవిభ్రమస్సత్త్వపరిప్లవశ్చ పర్యాకులాదృష్టిరధీరతా చ. 7
అబద్ధవాక్త్వం హృదయం చ శూన్యం సామాన్యమున్మాదగదస్య చిహ్నమ్,

తా. మనోభ్రమ, మనశ్చాంచల్యము, దృష్టి చలించుట, భయముగలుగుట, అసంబంధముగ మాటలాడుట, హృదయము శూన్యంబగుట (అనగా విచారశక్తిలేక యుండుట) ఇవి ఉన్మాదరోగమునకు సామాన్యలక్షణములని తెలియవలయు.

### వాతజోన్మాదనిదాన-సంప్రాప్తి-లక్షణములు

రూక్షాల్పశీతాన్నవిరేకధాతుక్షయోపవాసైరనిలోతివృద్ధః. 8
చింతాదిదుష్టం హృదయం ప్రదూష్య బుద్ధిం స్మృతిం చాపి నిహన్తి శీఘ్రమ్,
అస్థానహాసస్మితనృత్యగీతవాగంగవిక్షేపణరోదనాని. 9
పారుష్యకార్శ్యారుణవర్ణతా చ జీర్ణే బలం చానిలజస్వరూపమ్,

తా. రూక్షము అల్పము శీతలముగల అన్నమును సేవించుట, విరేకముల జేయించుట, ధాతువులు క్షయించుట, ఉపవాసముజేయుట, ఈ కారణమువలన వాతము మిక్కిలి వృద్ధిపొంది చింతాదియుక్తమగు మనస్సును మిక్కిలి దుష్టయుక్తముగజేసి బుద్ధిస్మృతులను శీఘ్రముగ నశింపజేసిన వాతజోన్మాదము జనించు. అందువలన నిష్కారణముగ నవ్వుట, కొంచెముహాసముజేయుట, ప్రసక్తము లేకుండునపుడు నృత్యగీతభాషణములం జేయుట, శరీరముకుదిలించుట, ఏడ్చుట, శరీరముకఠినముగను కృశించునదిగనునుండుట, శరీరకాంతి యెఱ్ఱనగుట, ఆహారము పరిపాకముజెందుచుండ రోగబలమెచ్చుట ఇట్టిలక్షణములు గలుగు.

### పిత్తజోన్మాదనిదాన-సంప్రాప్తి-లక్షణములు

అజీర్ణకట్వమ్లవిదాహ్యశీతైర్భోజ్యైశ్చితం పిత్తముదీర్ణవేగమ్. 10
ఉన్మాదమత్యుగ్రమనాత్మకస్య హృది స్థితం పూర్వవదాశు కుర్యాత్,
అమర్షసంరంభవినగ్నభావాస్సంతర్జనాభిద్రవణోష్ణ్యరోషాః. 11
ప్రచ్ఛాయశీతాన్నజలాభిలాషాః పీతాస్యతా పిత్తకృతస్య లింగమ్,

తా. అపక్వాన్నము, కారము, పులుసు, విదాహద్రవ్యము, ఉష్ణపదార్థము వీనిని భుజించుటవలన పిత్తమువృద్ధినిపొంది తీవ్రవేగముగలదై అజితేంద్రియ పురుషునియొక్క హృదయమును జెంది పూర్వమువలె మిక్కిలి ఉగ్రమగు పిత్తజోన్మాదమును గలుగజేయు. దానివలన నోర్పులేకయుండుట, ఆర్భాటమును జేయుట, దిగం

బరుడుగనుండుట, పరులభయపరచుట, పరుగెత్తుట, శరీరము ఉష్ణముగనుండుట, కోపమును జెందుట, నీడ శీతాన్నము శీతలజలమును సేవించుటయం దిచ్ఛగలుగుట, ముఖము పసపువర్ణముగనుండుట, యిట్టిలక్షణములు జనించు.

## కఫజోన్మాదనిదాన-సంప్రాప్తి లక్షణములు

సంపూరణైర్మందవిచేష్టితస్య సోష్మాకఫో మర్మణి సంప్రవృద్ధః. 12
బుద్ధిం స్మృతిం చాప్యుపహంతి చిత్తం ప్రమోహయేత్సంజనయేద్వికారమ్,
వాక్చేష్టితం మందమరోచకశ్చ నారీ వివిక్తప్రియతాతినిద్రా. 13
ఛర్దిశ్చ లాలా చబలం చ భుంక్తే నఖాదిశౌక్ల్యం చ కఫాధికే స్యాత్,

తా. తృప్తికరపదార్థముల భుజించి నిశ్చేష్టుడుగనుండు పురుషునియొక్క ఊష్మయుక్తకఫము హృదయమునందు మిక్కుటముగ వృద్ధిజెంది బుద్ధి స్మృతి వీనిని జెరచి చిత్తమును మోహింపచేసి కఫజోన్మాదమును గలుగంజేయు. అందువలన వ్యాపారము (అనగా మాటమొదలగునవి) మందమగుట, అన్నద్వేషము, స్త్రీలయందును ఏకాంతవాసమునందును ఇచ్ఛగలుగుట, మిక్కిలి నిద్ర, వాంతి, నోట జొల్లుకారుట, భోజనానంతరము రోగము ప్రకోపించుట, గోళ్లు చర్మము మూత్రము కన్నులు మొదలగునవి తెల్లనగుట ఇట్టిలక్షణములు గలుగు.

## సన్నిపాతోన్మాదనిదానలక్షణములు

యస్సన్నిపాతప్రభవోతిఘోరస్సర్వైస్సమస్తైరపి హేతుభిస్స్యాత్. 14
సర్వాణి రూపాణి బిభర్తి తాదృగ్విరుద్ధభైషజ్యవిధిర్వివర్జ్యః,

తా. వాతాదిదోషములన్నియు తమతమ కారణములచే ప్రకోపించి సర్వదోషలక్షణయుక్తంబై కడుభయంకరమైన సన్నిపాతోన్మాదమును గలుగంజేయు. కావున వాతాదిదోషములకై జెప్పంబడిన ప్రత్యేకచికిత్సలు పరస్పర విరుద్ధంబులగుటచే దానియందు చేయంజనదు. (అయినను అనిర్దేశ్య కారణోత్పత్తిగల యాసన్నిపాతమునందు త్రిదోషహరమైన ఆమలకాదులచే చికిత్సింపవలయు.)

## శోకజోన్మాదనిదాన-సంప్రాప్తి-లక్షణములు

చోరైర్నరేంద్రపురుషైరరిభిస్తథాన్యైర్విత్రాసితస్య ధనబాంధవసంక్షయాద్వా. 15
గాఢం క్షతే మనసి చ ప్రియయా రిరంసోర్జాయేత చోత్కటతరో మనసో వికారః,
చిత్రం బ్రవీతి చ మనోనుగతం విసంజ్ఞో గాయత్యథో హసతి రోదితి చాతిమూఢః. 16

తా. దొంగలు రాజపురుషులు శత్రువులు ఇతరులు వీరివలన భయమును జెందుట వలనగాని, లేక ధనము బంధువులు ఇవి క్షయించుటవలనగాని, లేక తనకిష్టురాలగు స్త్రీతో సంభోగము సేయుటయందిచ్ఛయించుటవలనగాని అంతఃకరణము బలమగు ఖేదమును జెందియుండగా మనస్సునందు భయంకరమగు శోకజోన్మాదము జనించు. దానివలన నానావిధములుగ మాటలాడుట, మనోమర్మంబును దెలియపరచుట, జ్ఞానము విపరీతంబగుట, పాడుట, నవ్వుట, ఏడ్చుట, కడుమాంద్యమును జెందుట ఇవి గలుగు.

విషజోన్మాదలక్షణము

రక్తేక్షణో హతబలేంద్రియభాస్సుదీనశ్శ్యావాననో విషకృతేన భవేద్విసంజ్ఞః,

తా. కన్నులెఱ్ఱనగుట, బలము ఇంద్రియములు శరీరకాంతి ఇవి నశించుట, మిక్కిలి దీనుడౌట, ముఖమునందు నల్లనికాంతిగలుగుట, సంజ్ఞనశించుట ఈలక్షణములుగలది విషజోన్మాదమని తెలియవలయు.

అసాధ్యోన్మాదలక్షణము

అవాఙ్ముఖస్తూన్ముఖో వా క్షీణమాంసబలో నరః. 17
జాగరూకో హ్యసందేహ ఉన్మాదేన వినశ్యతి,

తా. తలవంచుకొనియుండుట, లేక తలపైకెత్తుకొనియుండుట, శరీరమునందలి మాంసము బలము ఇవి క్షయించుట, నిద్రబట్టకుండుట ఇట్టిలక్షణములుగల యున్మాదరోగి సత్యముగ మృతిని జెందు.

భూతజోన్మాదనిదానము

అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టాజ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః. 18
ఉన్మాదకాలో నియతశ్చ యస్య భూతోత్థమున్మాదముదాహరన్తి,

తా. అలౌకికవాక్కు, పరాక్రమము, శక్తివీరవ్యాపారము, తత్వజ్ఞానము, శిల్పాదిజ్ఞానము, స్మృత్యాదికజ్ఞానము ఇవికలుగుట, ఉన్మాదకాలము నియతముగ నుండుట ఈలక్షణములుగలది భూతజోన్మాద మనంబడు. (భూతశబ్దమువలన పైజెప్పబోయెడు దేవతలను సగా దెలియవలయు.)

భూతోన్మాదలక్షణము

అతీవ హాసముల్లాసం వికారాంశ్చ కురుతే బలాత్. 19
క్షణే స్వస్థః క్షణే మత్తో భూతోన్మాదస్య లక్షణమ్,

తా॥ మిక్కిలిగనవ్వుట, సంతోషమునుజెందుట, నానావిధ వికారములం జేయుట, క్షణకాలము స్వస్థముగనుండుట, క్షణకాలము మత్తుడుగ నుండుట, ఇట్టి లక్షణములుగలది భూతోన్మాదమని తెలియవలయు. (దీనియందు పైజెప్పబోయెడు నస్యముల నేడుమార్లు జేయించుటయేగాక రాత్రులయందు మహేశ్వర ధూపమును లోపలికి సూర్యోదయరసమును సేవించవలయు.)

## దేవగ్రహోన్మాదలక్షణము

సంతుష్టశ్శుచిరతిదివ్యమాల్యగంధో నిస్తంద్రస్త్వవితథసంస్కృత ప్రభాషీ, 20
తేజస్వీ స్థిరనయనో వరప్రదాతా బ్రహ్మణ్యో భవతినరస్సదేవజుష్టః,

తా॥ సదాసంతోషముగనుండుట, పవిత్రుడైయుండుట, శరీరమునందు దివ్య పుష్పమాలికల గంధము కలిగియుండుట, నిదురపట్టకుండుట, సత్యముగ సంస్కృతము మాటలాడుట, తేజస్సుగలుగుట, స్థిరదృష్టిగలుగుట, వరములనిచ్చుట, బ్రాహ్మణులయందు ప్రీతిగలుగుట ఇట్టిలక్షణములుగలది దేవగ్రహోన్మాదమని తెలయవలయు. (దేవశబ్దమువలన గణమాతృకాదికములనుగూడ నెరుంగదగు.)

## అసురగ్రహోన్మాదలక్షణము

సంస్వేదీద్విజగురుదేవదోషవక్తా జిహ్మాక్షో విగతభయో విమార్గదృష్టిః.
సంతుష్టో న భవతి చాన్నపానజాతైర్దుష్టాత్మా భవతి స దేవశత్రుజుష్టః,

తా॥ శరీరమునందు చెమటవడియుట, బ్రాహ్మణ గురు దేవతలయందు దోషారోపణజేయుట, వక్రముగ జూచుట, భయములేకయుండుట, వేదవిరుద్ధమార్గమునందు ప్రవర్తించుట, అధికముగ నన్నపానాదుల సేవించినను తృప్తిపొందకుండుట, దుర్బుద్ధిగలుగుట ఇట్టిలక్షణములుగలది అసురగ్రహోన్మాదమని తెలియవలయు.

## గంధర్వగ్రహోన్మాదలక్షణము

హృష్టాత్మా పులినవనాన్తరోపసేవీ స్వాచారః ప్రియపరిగీతగంధమాల్యః.
నృత్యన్వై ప్రహసతిచారుచాల్పశబ్దం గంధర్వగ్రహపరిపీడితో మనుష్యః,

తా॥ మనస్సంతోషముగలుగుట, ఇసుకదిన్నెలు ఉద్యానవనములు వీనియందు సంచరించుట, అనింద్యమగు ఆచారము నాచరించుట, గానము, గంధము పుష్పములు వీనియందిచ్ఛగలుగుట. నృత్యముచేయుట, నవ్వుట, మధురముగను కొంచెముగను మాటలాడుట ఇట్టిలక్షణములుగలది గంధర్వగ్రహోన్మాదమని తెలియవలయు.

## యక్షగ్రహోన్మాదలక్షణము

తామ్రాక్షః ప్రియతమరక్తవస్త్రధారీగంభీరో ద్రుతగతిరల్పవాక్సహిష్ణుః.

తేజస్వీ వదతి చ కిందదామి కస్మైయో యక్షగ్రహపరపీడితో మనుష్యః,

తా. నేత్రములెఱ్ఱగనుండుట, సుందరమై సూక్ష్మమై ఎఱుపురంగుగల వస్త్రమును ధరించుటయందు ఇచ్ఛగలుగుట, గంభీరముగనుండుట, శీఘ్రముగ మనము గలుగుట, మితముగమాటలాడుట, ఓర్పు తేజస్సు ఇవిగలుగుట, యెవని కేది యిత్తునని చెప్పుట ఇట్టిలక్షణములుగలది యక్షగ్రహోన్మాదమని తెలియవలయు.

పితృగ్రహోన్మాదలక్షణము

ప్రేతానాం దిశతి చ సంస్తరేషు పిండాన్భ్రాంతాత్మా జలమపి చాపస
వ్యవస్త్రః. 24
మాంసేప్సుస్తిలగుడపాయసాన్నకామస్తద్భక్తో భవతిపితృగ్రహాభిజుష్టః,

తా. దర్భపై పితృదేవతలకు పిండమునిచ్చుట, భ్రాంతినిజెందుట, పైవస్త్రమును నపసవ్యముగధరించి తర్పణము విడుచుట, మాంసభక్షణము, నువ్వులు బెల్లము పరమాన్నము వీనియందిచ్ఛ పితృభక్తిగలుగుట, ఇట్టిలక్షణములుగలది పితృగ్రహోన్మాదమని తెలియవలయు. (దీనియందుగాని ఇతరభూతోన్మాదములయందుగాని రోగిగోరెడి సర్వపదార్థముల నివ్వవలయు.)

సర్పగ్రహోన్మాదలక్షణము

యస్తూర్వ్యాం ప్రసరతిసర్పవత్కదాచిత్సృక్కిణ్యౌ విలిహతి జిహ్వ
యా తథైవ. 25
క్రోధాఢ్యుర్మధుగుడదుగ్ధపాయసేప్సుర్విజ్ఞేయోభవతిభుజంగమేనజుష్టః

తా. సర్పమువలె (అనగా రొమ్ముతో భూమిపై నొకానొకప్పుడు ప్రాకులాడుట, నోటిచెవిచెలను సర్పమువలె నాలికతో నాకుట, మిక్కిలి కోపమును పొందుట, తేనె బెల్లము పాలు పాయసము వీనిని సేవించుటయం దిచ్ఛజనించుట ఇట్టిలక్షణములు గలిగియుండిన సర్పగ్రహోన్మాదమని తెలియవలయు.

రాక్షసగ్రహోన్మాదలక్షణము

మాంసాసృగ్వివిధసురావికారలిప్సుర్నిర్లజ్జోభృశమతినిష్ఠురోఽతిశూరః.
క్రోధాఢ్యుర్విపులబలోనిశావిహారీశౌచద్విడ్భవతిచరాక్షసైర్గృహీతః,

తా. మాంసము రక్తము నానావిధములగు మద్యము వీనియం దిచ్ఛగలుగుట, సిగ్గులేకయుండుట, మిగుల నిష్ఠురముగ మాటలాడుట, మిక్కిలి శౌర్యము, కోపము, మిక్కిలి బలముగలుగుట, రాత్రులయందు విశేషముగ సంచరించుట, శుచిత్వమునందు మిక్కిలి యసహ్యపడుట ఇట్టి లక్షణములు గలిగియుండిన రాక్షసగ్రహోన్మాదమని తెలియవలయు.

పిశాచజుష్టలక్షణము

ఉద్ధస్తఃకృశపరుషోఽచిరప్రలాపీదుర్గంధోభృశమశుచిస్తథాతిలోలః.
బహ్వాశీ విజనవనాంతరోపసేవీ వ్యాచేష్టన్ భ్రమతి రుదన్ పిశాచజుష్టః,

తా. హస్తమును పైకెత్తుట, లేక దిగువప్రేలవేయుట, తేజస్సులేకయుండుట, బహుకాలమువరకు మిక్కిలిగ వదరుట, శరీరమునందు దుర్గంధమువచ్చుట, మిక్కిలి అమంగళముగ నుండుట, అన్నపానముల నిచ్ఛయించుట, అన్నపానముల మిక్కుటముగ సేవించుట, వనమందేకాంతముగనునికి కిచ్ఛగించుట, విరుద్ధచేష్టలు సేయుట. రోదనము సేయుచు సరిచరించుట, ఇట్టి లక్షణములుగలది పిశాచజుష్ట ఉన్మాదమని యెఱుంగవలయు. (హింస క్రీడ సత్కారము ఈ 3 కారణములవలన గ్రహము సోకినను, హింసించుటకొరకై పట్టెడిగ్రహమైనను నివర్తించుట యసాధ్యము.)

దేవాదిగ్రహగ్రహణకాలము

దేవగ్రహాః పౌర్ణమాస్యామసురాస్సంధ్యయోరపి. 28
గంధర్వాః ప్రాయశోఽష్టమ్యాం యక్షాశ్చ ప్రతిపద్యథ,
పిత్రుగ్రహాస్తథా దర్శే పంచమ్యామపి చోరగాః. 29
రక్షాంసి రాత్రౌ పైశాచాశ్చతుర్దశ్యాం విశంతి హి,

తా. దేవగ్రహము పౌర్ణమియందును, అసురగ్రహము సంధ్యాకాలమునందును, గంధర్వగ్రహము తరుచుగ అష్టమియందును, యక్షగ్రహము పాడ్యమియందును, పితృగ్రహము అమావాస్యయందును, సర్పగ్రహము పంచమియందును, రాక్షసగ్రహము రాత్రియందును, పిశాచగ్రహము చతుర్దశియందును మానవులకు సోకు. (గావున నాయాతిథులవలన నాయాగ్రహములనెరింగి తత్తదుపయుక్తశాంతి బలిదానముల నాయాతిథులయందు సేయుటకై చెప్పంబడియె.)

శరీరాశ్రితగ్రహాదృష్టకారణము

దర్పణాదీన్యథాచ్ఛాయాశీతోష్ణం ప్రాణినో యథా. 30
స్వమణౌ భాస్కరాంశుశ్చ యథాదేహం చ దేహధృత్,
విశంతి నచ దృశ్యంతే గ్రహాస్తద్వచ్ఛరీరిణామ్. 31

తా. అద్దము మొదలగువాటియందు ప్రతిబింబమును, ప్రాణములయందు శీతోష్ణమును, సూర్యకాంతమణులయందు సూర్యకిరణములును, శరీరమునందు జీవుడును చేరు తెరంగున ప్రాణులయొక్క శరీరమునందు గ్రహములుచేరి గనుపడకనుండు.

ఉన్మాదగజకేసరిరసము

సూతం గంధం శిలాతుల్యాం స్వర్ణబీజం విచూర్ణ్య చ,

భావయేదుగ్రగంధాయాః క్వాథే మునిదినం పృథక్. 32
రాస్నా క్వాథేన సప్తైవ భావయిత్వా విచూర్ణయేత్,
రసస్సంజాయతే మాసమున్మాదగజకేసరీ. 33
అస్య మాషస్ససర్పిష్కో లీఢో హన్తి హఠాన్గదమ్,
ఉన్మాదాఖ్యమపస్మారం భూతోన్మాదమపీ జ్వరమ్, 34

తా. శుద్ధిజేసినరసము, గంధకము, మణిశిల వీనికిసమము ఉమ్మెత్తవిత్తులు వీనిని చూర్ణించి వస రాస్న వీని కషాయములచే ప్రత్యేకము ౭ భావనలుజేసి పిదప చూర్ణించిన ఉన్మాదగజకేసరియనంబడు. దీనిని ౧ మాషయెత్తు నేతితో పుచ్చుకొనిన ఉన్మాదము, అపస్మారము, భూతోన్మాదము, జ్వరము ఇవి నివర్తించు.

## భూతభైరవరసము

రసస్తాలస్సశిలస్సలోహస్తామ్రస్తోంజనం సార్కమదం హిగంధమ్,
పిష్ట్వాజమూత్రేణ సమంసమస్తాద్ద్వయో ద్విభాగోథ బలిః పచేచ్చ. 35
లోహేక్షణంహన్తిఘృతేనమాషోఽపస్మారమప్యున్మదమానసత్వమ్,
పిబేదనుత్ర్యూషణహింగుయుక్తంసర్పిర్న్రమూత్రంరుచకేనసార్ధమ్.
భూతోన్మాదేషు సర్వేషు రసోయం భూతభైరవః,
స్వర్ణజైః పంచభిర్బీజైః దేయస్సర్పిర్విమిశ్రితః. 37

తా. శుద్ధిచేసినరసము, శుద్ధిచేసిన తాళకము, శుద్ధిచేసిన మణిశిల, లోహభస్మము, తెల్లసురమాకాయి, తామ్రభస్మము, శుద్ధిచేసిన గంధకము వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి మేకపంచితముతో మర్దించి దీనికి రెండింతలు శుద్ధిచేసిన గంధకమును తిరిగిచేర్చి లోహపాత్రయందునిచి దానిలో వండి ౧ మాషమెత్తు నేతితో పుచ్చుకొనిన అపస్మారము ఉన్మాదము వీనిని నివర్తింపంచేయు. పిదప త్రికటుకములు ఇంగువ వీని చూర్ణమును నెయ్యితోగాని లేక సైంధవలవణము నరమూత్రానుపానముతోగాని లేక ౫ ఉమ్మెత్తవిత్తులచూర్ణమును నేతి యనుపానముతోగాని సేవించవలయు.

## నిశాదిఘృతము

నిశాయుగ్మంవరాశ్యామా వచా సిద్ధార్థహింగుభిః,
శిరీషకటభీశ్వేతా మంజిష్ఠావ్యోషదారుభిః. 38
సమైః కృతం ఘృతం మూత్రే సిద్ధమున్మాదనాశనమ్,

మానిపసపు, పసపు, త్రిఫలములు, నల్లతెగడ, వస, తెల్లఆవాలు, ఇంగువ, దిరిశనపుపట్ట, మాల్గింగిణీవిత్తులు, శ్వేతకాంచనము, మంజిష్ఠ, త్రికటుకములు,

దేవదారు వీనిని సమాంశములుగజేర్చి గోమూత్రమునందువైచి అందు సమము నెయ్యి చేర్చి ఘృతపక్వముగకాచి సేవించిన ఉన్మాదము నివర్తించు.

భూతోన్మాదమునకు బ్రాహ్మీఘృతము

చతుష్షష్టిపలం బ్రాహ్మీనిజద్రావం సమాహరేత్. 39
ద్వాత్రింశత్పలకం చాజ్యం త్రివృద్దన్తీకటుత్రయమ్,
ఆరగ్వధం శంఖపుష్పం ప్రియంగుస్సవిళంగకమ్. 40
ప్రతికర్షం క్షిపేచ్చూర్ణం పచేదాజ్యం దృఢే ఘటే,
పలమాత్రం పిబేన్నిత్యం యావత్పలచతుష్టయమ్. 41
భూతోన్మాదమపస్మారం బ్రాహ్మీఘృతమిదం హరేత్,

తా. వల్లారియాకు రసము ౬౪ పలములు, నెయ్యి ౩౨ పలములు, శుద్ధిజేసిన తెగడ, దంతి, త్రికటుకములు, రేలపట్ట, కట్లవేరుపట్ట, పేరింకణము, వాయువిడంగములు, వీనిని ప్రత్యేకము ౧ కర్షముచొప్పున చూర్ణించి నేతిలోగలిపి వండి పలముమొదలు ౪ పలములవరకు రోగబలానుగుణ్యముగ ప్రతిదినము పానము జేయుచుండిన భూతోన్మాదము అపస్మారము ఇవి నివర్తించు.

హింగ్వాదిఘృతము

హింగుసౌవర్చలం త్ర్యూషం పంచానాం పలపంచకమ్. 42
చతుష్షష్టిపలం చాజ్యం గవాం మూత్రం చతుర్గుణమ్,
ఘృతశేషం పచేత్సర్వం తథా పానే ప్రయోజయేత్. 43
భూతోన్మాదమపస్మారం నాశయేద్బ్రహ్మరాక్షసమ్,

తా. ఇంగువ, సౌవర్చలవణము. త్రికటుకములు వీనిని దినుసుకు ౧ పలముల చొప్పున దంచి చూర్ణించి నెయ్యి ౬౪ పలములు నేతికి నాలుగింతలు గోమూత్రము గలిపి ఘృతము మిగులువరకు కాచి సేవించిన భూతోన్మాదము అపస్మారము బ్రహ్మరక్షస్సు ఇవి నివర్తించు.

సారస్వతఘృతము

త్రిఫలా లక్ష్మణానంతా సమంగా సారిబా వచా. 44
బ్రాహ్మీ పాఠా బృహతికా ద్వే స్థిరే ద్వే పునర్నవే,
సహదేవీ సూర్యవల్లీ వయస్థా గిరికర్ణికా. 45
తోయకుంభే పచేదేతత్పలాంశం పాదశేషితే,
నతం కౌస్తీం వచాం కుష్ఠం కృష్ణాంసైంధవనామకమ్. 46
నీరుక్సవర్ణవత్సాయాస్సంసిద్ధం పయసా చ గోః,

పుష్యయోగే ఘృతప్రస్థం సుస్నేహాకలశే స్థితమ్. 47
పానాభ్యంజనతో మేధా స్మృత్యాయుః పుష్టివర్ధనమ్,
రక్షోఘ్నం చ విషఘ్నం చ సారస్వతమిదం ఘృతమ్. 48

తా. త్రిఫలములు, తెల్లవావిడు, తీటకసింద, (దూలగొండి) మంజిష్ఠ, సుగంధపాల, వస, బ్రాహ్మి, (నల్లారాకు) విషబొట్టి, ములక, కోలపొన్న, ముయ్యాకు పొన్న, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, సహదేవి, సూర్యక్రాంత, ఉశిరికవోలుపు, శ్వేత గిరికర్ణిక వీనిని ప్రత్యేకము ౧ పలము చొప్పున గ్రహించి, ఒక కుంభ ముదకము నందునిచి, నాలవపాలు మిగులునటుల కషాయము కాచి, వస్త్రమునందు వడియగట్టి అందు గ్రంథితగరము, రేణుకవిత్తులు, వస, కోష్ఠము, పిప్పళ్లు, సైంధవలవణము వీనిని చూర్ణించి వైచి రోగరహితమై సమానవర్ణవత్సాయుక్తమగు గోవుయొక్క పాలు ౬౪ పలముల నెయ్యికలిపి, పుష్యమీ నక్షత్రయోగమునందు కాచి, స్నేహపాత్ర యందునిచి, పానాభ్యంగములం జేసిన, మేధ, స్మృతి ఆయుస్సు, పుష్టి ఇవి వృద్ధిపొందుటయేగాక రాక్షసపిడ విషము ఇవి నివర్తించు. ఇది బ్రాహ్మీఘృతమనబడును.

## లశునఘృతము

లశునస్య విశుష్కస్య తులార్ధం నిస్తుషీకృతమ్,
తదర్ధం దశమూలాత్తు చాఢకేపాం విపాచయేత్, 49
పాదశేషే ఘృతే ప్రస్థం లశునస్య రసం తథా,
కోలామలకవృక్షామ్లమాతులుంగార్ద్రకై రసైః, 50
దాడిమాంబుసురామస్తుకాంజికామ్లైస్తదర్ధకైః,
సాధయేత్త్రిఫలాదారులవణవ్యోషదీప్యకైః. 51
యవానీ చవ్యహింగ్వమ్లవేతసైశ్చ పలార్ధకైః,
సిద్ధమేతత్పిబేచ్ఛూలగుల్మార్శోజఠరాపహమ్, 52
వ్రణపాండ్వామయప్లీహయోనిదోషకృమిజ్వరాన్,
వాతశ్లేష్మామయం చాన్యమున్మాదం చాపకర్షతి. 53

తా. పొట్టుతీసియెండించిన వెల్లుల్లి ౫౦ పలములు, దశమూలములు ౨౫ పలములు, వీనిని ఒక ఆఢకము ఉదకమునందు వైచి, నాలవపాలు మిగులునటుల కషాయము కాచి అందు ౧ ప్రస్థము నెయ్యి, ౧ ప్రస్థము వెల్లుల్లిరసము, రేగు, ఉశిరికె, వృక్షామ్లము, మాదీఫలము, అల్లము, దాడింబ వీని రసములు, మద్యము, పెరుగుమీద తేట కాంజికము, వీనినన్నిటిని అర్ధప్రస్థమువంతునచేర్చి, అందు త్రిఫలములు, దేవదారు, సైంధవలవణము, మిరియాలు, ఓమము, కురాసానిఓమము, చవ్యము, ఇంగువ, అమ్ల

వేతసము వీని కల్కమును ప్రత్యేకము ౪ పలములవంతునచేర్చి ఘృతపాకముగా కాచి పుచ్చుకొనిన, శూల, గుల్మము, అర్శస్సు, జఠరము, వ్రణము, పాండువుప్లీహ,యోని దోషము, కృమి, జ్వరము, వాతశ్లేష్మరోగము, ఉన్మాదము ఇవి నివర్తించు.

భూతోన్మాదమునకు విజయఘృతము

ఉగ్రగంధాపంచపలాపటోలం పర్పటం తథా,
పిప్పలీం శృంగబేరం చ పంచపంచపలానిచ. 54
బ్రాహ్మీరసస్య ప్రస్థార్థం ఘృతప్రస్థే విపాచయేత్,
త్రిఫలా త్రికటూశీరలశునం పంచకోలకమ్. 55
ఏషాం నిష్కైః ప్రయుంజీత యథాగ్నిబలమాత్రయా,
భూతోన్మాదమపస్మారం వాతికం పైత్తికం జ్వరమ్. 56
శ్లైష్మికం సాన్నిపాతం చ శీతకం విషమజ్వరమ్,
పానమాత్రేణ నశ్యన్తి ప్రోచ్యతే విజయం ఘృతమ్. 57

తా. పొట్టుతీసిన ఓమము, చేతిపొట్ల, పర్పాటకము, పిప్పళ్లు, అల్లము వీనిని దినుసుకు ౫ పలములచొప్పున చూర్ణముజేసి, అందు వల్లారిరసము ౪ ప్రస్థము, నెయ్యి ౧ ప్రస్థము, త్రిఫలములు, త్రికటుకములు, వట్టివేరు, వెల్లుల్లిపాయలు, పంచకోలములు వీని చూర్ణమును దినుసుకు నొక్కొక నిష్కముచొప్పునకలిపి ఘృతపక్వముగ కాచి అగ్నిబలానుగుణ్యముగ సేవించిన, భూతోన్మాదము, అపస్మారము, వాత పిత్త శ్లేష్మ సన్నిపాత శీత విషమజ్వరములు, ఇవి యన్నియు హరించు.

ఉన్మత్తాదిధారణము

ఉన్మత్తకాసనాస్థీని ఘృష్ట్వా తైలేన వా కుచీమ్,
శ్వేతాపరాజితామూలం కర్ణే ధార్యం సదా బుధైః. 58
నిర్గుడీదండకం ఛిత్త్వా వ్యపస్మారాద్విముచ్యతే,
పర్పటీరసగుంజాష్టౌ ధౌత్తూరం బీజపంచకమ్. 59
గోఘృతేన చ సంయోజ్య ఖాదేదున్మాదనోదనే,
సఘృతం మాషమండం చ పాయయేద్ఘృతదుగ్ధకమ్. 60
నింబతైలం సమాదాయ లింపేదాపాదమస్తకమ్,
గుర్వన్నం పాయసం దద్యాచ్ఛుష్కం శాకం చ వర్జయేత్. 61
యద్వా సంరక్షయేత్తం చ యావచ్ఛాన్తిం స గచ్ఛతి,
మాహేశ్వరాఖ్యధూపం చ ధూపయేత్సతతం నిశి. 62

తా. ఉమ్మెత్తవిత్తులు, వేగిసవిత్తులు, భావంచివిత్తులు, తెల్లగంటెనవేరు,

వావిలి కొండలు, వీనిలో దేనినైననునూరి చెవిలోనునిచికొనిన అపస్మారము నివర్తించు, మరియు, నెనిమిది గురిగింజలయెత్తు పర్పటీరసమును ౫ ఉమ్మెత్తవిత్తులచూర్ణమును, నేతిలోగలిపి సేవింపజేసి, నేతితోగూడియుండు మినపకట్టును నెయ్యి, పాలు, వీనిని సేవించిన ఉన్మాదము నివర్తించు. మరియు, ఉన్మాదరోగికి పాదములు మొదలు శిరస్సువరకు వేపనూనెను లేపనముజేయుటయేగాక, గుర్వన్నము, పాదరసము, వీనిని నొసంగవలయు. ఎండినకూరల నొసంగజనదు. మరియు, ఉన్మాద ముపశమించు వరకు, ఉన్మాదరోగిని మిక్కిలి జాగ్రతతో కాపాడవలయు. రాత్రులయందు మాహేశ్వరధూపము నొసంగవలయు.

## బ్రాహ్మ్యాదినస్యము

బ్రాహ్మీం శుంఠీం వచాం కుష్ఠం నీలోత్పలకసైంధవే,
పిప్పలీమపి సంచూర్ణ్య బ్రాహ్మీద్రావేణ భావయేత్. 63
సప్తధా నవనీతేన సంయోజ్య విపచేద్ఘృతమ్,
నస్యాదున్మాదశాన్తిస్స్యాదపస్మారం చ నాశయేత్. 64

తా. బ్రహ్మదండి, శొంఠి, వస, చెంగల్వకోష్ఠు, నల్లకలువ, సైంధవలవణము, పిప్పళ్లు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి, బ్రాహ్మీరసముతో నేడుమార్లు భావనలు చేసి వెన్నలో గలిపి ఘృతముగకాచి, నస్యముచేయించిన ఉన్మాదము, అపస్మారము, ఇవి హరించు.

వరాహకర్ణరక్తేన కర్కోటీ్యా నస్యమాచరేత్,
అథవా నరమూత్రేణ వ్యుమ్మత్తస్యాపి నస్యతః. 65

తా. పందిచెవిరక్తముతో గొడ్డుకాకరగడ్డనునూరి నస్యముచేసిన అపస్మారము, ఉన్మాదము, ఇవి హరించు. ఉమ్మెత్తవిత్తులను నరమూత్రముతోనూరి నస్యముచేసినను, ఉన్మాదము, అపస్మారము, ఇవి నివర్తించు.

## ఉన్మాదరోగమునకు పథ్యములు

గోధూమముద్గారుణశాలయశ్చ ధారోష్ణదుగ్ధం శతధౌతసర్పిః,
ఘృతం నవీనం చ పురాతనం చ కూర్మామిషం ధన్వరసా రసాలా. 66
పురాణకూష్మాండఫలం పటోలం బ్రాహ్మీదళం వాస్తుకతండులీయమ్,
ద్రాక్షాకపిత్థం పనసం చ వైద్యైర్విధేయమున్మాదగదేషు పథ్యమ్. 67

తా. గోధుమలు, పెసలు, పాతయెఱ్ఱవడ్లబియ్యము, ధారోష్ణములగుపాలు నూరు మార్లుకడిగిన నెయ్యి, సద్యోఘృతము, లేక పాతినెయ్యి, తాబేలుమాంసము, జాంగలమాంసరసములు, రసాలము, ప్రాతగుమ్మడిపండు, చేదుపొట్ల, బ్రాహ్మీఆకు,

చకోతపుకూర, చిట్టికూర, ద్రాక్ష, వెలగపండు, పనసపండు, ఇవి ఉన్మాదరోగము నందు పథ్యములని తెలియవలయు.

## అపథ్యములు

మద్యంవిరుద్ధాశనముష్ణభోజనంనిద్రాక్షుధాతృట్ క్షుత వేగధారణమ్,
తిక్తాని తీక్ష్ణాని భిషక్సమాది శేదున్మాదరోగోపహతౌహి గర్హితమ్. 68

తా. మద్యము, విరుద్ధాన్నము, ఉష్ణపదార్థభక్షణము, నిద్ర, ఆకలి, దప్పి, తుమ్ము, వీని వేగనిరోధము, చేదు పదార్థములు, తీక్ష్ణపదార్థములు వీనిని ఉన్మాదరోగి విడువవలయు.

---

# అపస్మారరోగప్రకరణమ్

## అపస్మారరోగ కర్మవిపాకము

గురౌ స్వామిని వా స్తేయం ప్రతికూలం సమాచరేత్,
సోపస్మారీ భవేత్తత్ర కుర్యాచ్చాంద్రాయణం నరః. 1

తా. గురువు లేక స్వామి వీరలవద్దనుండి దొంగలించునట్టియు, వారికి ప్రతికూలముగనడుచునట్టి వానికి అపస్మారరోగము జనించు. తన్నివృత్తికై చాంద్రాయణప్రాయశ్చిత్తములం జేయవలయు.

బ్రాహ్మణశ్వాసరోధేన హ్యపస్మారీ భవేన్నరః,
వక్ష్యే తస్య ప్రతీకారం దానహోమక్రియావిధిమ్. 2

తా. బ్రాహ్మణునియొక్క శ్వాసమును బంధించినవానికి అపస్మారము జనించు. అది నివర్తించుటకై దానహోమక్రియాదులం జెప్పెదము.

## జ్యోతిశ్శాస్త్రాభిప్రాయము

శనిభూసుతదిననాథా నిధనస్థా యస్య జన్మకాలే స్యుః,
నానావ్యాధివదాద్యైః పీడాచాపస్మారసంభవాతస్య. 3
వా॥అష్టమస్థానస్థితశనిమంగళసూర్యజనితాపస్మారశాన్తయే,
గ్రహప్రీతయే పూర్వోక్తమేవ సకలం జపాదికం కుర్యాత్. 4

తా. జననకాలమున శని అంగారకుడు సూర్యుడు అష్టమస్థానంబునందుండిన నానావిధములగు రోగములుగాని అపస్మారముగాని జనించు. తన్నివృత్తికై గ్రహతృప్త్యర్థముగ పూర్వోక్తజపాది సర్వోపచారములం జేయవలయు.

### అపస్మారసామాన్యలక్షణము

తమఃప్రవేశస్సంరంభో దోషోద్రేకో హతస్మృతిః,
అపస్మార ఇతి జ్ఞేయో గదో ఘోరశ్చతుర్విధః. 5

తా. చీకటిలో ప్రవేశించినటులదోచుట, వికారముగ కన్నులద్రిప్పుచు కాళ్లుచేతులు విదిలించుట, దోషప్రాబల్యమువలన జ్ఞానమునశించుట ఇట్టి లక్షణములు గలది భయంకరమగు అపస్మారమని దెలియవలయు. ఇది వాతపిత్తశ్లేష్మ సన్నిపాతభేదములవలన ౪ విధంబులు.

### అపస్మారపూర్వరూపము

హృత్కంపశ్శూన్యతా స్వేదో ధ్యానం మూర్ఛా ప్రమూఢతా,
నిద్రానాశశ్చ తస్మింస్తు భవిష్యతి భవంత్యథ. 6

తా. హృదయమున కంపముగలుగుట, ఏమియు దోచకుండుట, చెమట బట్టుట, చింత, మూర్ఛ ఇంద్రియమోహము. నిద్రాభంగముగలుగుట ఇవి యన్నియు అపస్మారమునకు పూర్వరూపములని దెలియవలయు.

### వాతాపస్మారలక్షణము

కంపతే ప్రదశేద్దంతాన్ఫేనోద్వామీ శ్వసిత్యపి,
పరుషారుణకృష్ణాని పశ్యేద్రూపాని చానిలాత్. 7

తా. వణుకుట, పండ్లుకొరుకుట, నోటివలన నురుగుకారుట, శ్వాసగలుగుట, ఎదుటి మనుజులు కౌఠిన్యము ఎరుపునలుపు వర్ణములుగల వారుగ గనుపించుట, ఇట్టి లక్షణములుగలది వాతాపస్మారమని తెలియవలయు.

### పిత్తాపస్మారలక్షణము

పీతఫేనాంగవక్త్రాక్షిః పీతాసృగ్రూపదర్శనః,
సతృష్ణోష్ణాగ్నిసంవ్యాప్తలోకదర్శీ చ పైత్తికః. 8

తా. నోటివలన పసుపుగ నురుగుకారుట, శరీరము ముఖము నేత్రములు ఇవి పసపుఛాయగలిగియుండుట, వస్తువులు పసపు రొుపువర్ణములుగలవిగ గనుపించుట తృష్ణోష్ణయుక్తుడైజగత్తు అగ్నివలన వ్యాప్తమైయుండునటుల గాంచుట, ఇట్టి లక్షణముగలది పైత్తాపస్మారమని తెలియవలయు.

### శ్లేష్మజాపస్మారలక్షణము

శుక్లఫేనాంగవక్త్రాక్షిశ్శీతో హృష్టాంగజో గురుః,
పశ్యేచ్ఛుక్లాని రూపాణి ముచ్యతే శ్లేష్మికశ్చిరాత్. 9

తా. నోటియందు నురుగు, శరీరము ముఖము కన్నులు ఇవి తెల్లగనుండుట, శరీరము చల్లగనుండుట, గగుర్పొడుచుట, శరీరము జడముగనుండుట, సర్వపదార్థములు తెల్లగ గనుపించుట, (లేక తెల్లగనుండు పురుషుడు తనవద్దికి బరుగులిడుచు వచ్చునటుల గాంచుట) దీర్ఘకాలముమీద విడుచుట, ఈ లక్షణములుగలది శ్లేష్మజాపస్మారమని తెలియవలయు. శ్లేష్మజాపస్మారము దీర్ఘకాలముమీద విడుచుననుట వలన వాతపిత్తాపస్మారములు శీఘ్రముగ విడుచునని తెలియవలయు.

సన్నిపాతాపస్మారలక్షణము

సర్వైరేతైస్సమస్తైశ్చ లింగైర్జ్ఞేయస్త్రిదోషజః,
అపస్మారస్స చాసాధ్యో క్షీణశ్చానశ్నతశ్చ యః. 10

తా. పూర్వోక్త వాతపిత్తశ్లేష్మ లక్షణములుగలది త్రిదోషాపస్మారమని తెలియవలయు. ఇది యసాధ్యము. మరియు క్షీణపురుషునికి జనించిన యపస్మారమును తిండిలేకుండ జేయు నపస్మారంబును అసాధ్యంబులు.

అసాధ్యాపస్మారలక్షణము

ప్రస్ఫురంతం చ బహుశః క్షీణం ప్రచలితభ్రువమ్,
నేత్రాభ్యాం చ వికుర్వాణమపస్మారో వినాశయేత్. 11

తా. పలుమారువణకుట, శరీరము కృశించుట, కనుబొమల నెగరవేయుట, నేత్రము లవికారముగ ద్రిప్పుట, ఈలక్షణములుగల యపస్మారరోగి యమునింగాంచునని తెలియవలయు.

పక్షాద్వా ద్వాదశాహాద్వా మాసాద్వా కుపితామలాః,
అపస్మారాయ కల్పన్తే వేగం కించిదథోత్తరమ్. 12

తా. దోషములు ప్రకోపించి, ౧౫ దినములకుగాని, లేక ౧౨ దినములకుగాని ౧ మాసమునకుగాని, అపస్మారమును గలుగంజేయు. అందు, వాతాపస్మారము, ౧౨ దినములకు, పిత్తాపస్మారము ౧౫ దినములకు, శ్లేష్మాపస్మారము, ౩౦ దినములకు జనించు. "ద్వాదశాహానంతరం పక్షం" అని జెప్పందగియుండగ, మొదటపక్షమును జెప్పుట వలన, దీర్ఘకాలమునకు దోషము వృద్ధిజెందుచున్నదని యూహింపవలయు. "కించిదథోత్తరం" అనుపదమువలన, దోషము, తనతారతమ్యమువలన జెప్పంబడినకాలము నకుముందే, వేగముగలదియగునని సూచింపబడియె. ఐనను వేగమునుగలుగంజేసి, యపస్మారమున కారంభమై యుండుదోషము సర్వకాలము శరీరము నాశ్రయించి యుండి, వేగమునుసేయక, ౧౨ దినములకాలమునందునుమాత్రము, వేగముసేయు

టకు కారణంబెద్దియని యూహింపదగియున్నయది. ఐనను శ్లో. "దేవే వర్షత్యపియథా భూమౌబీజానికానిచిత్ । శరది ప్రతిరోహన్తి తథా వ్యాధిసముచ్ఛ్రియః" అను వచనప్రకారము విత్తనమువలన నంకురముజనించుటకు తేజస్సు వాయువు పృథివి ఉదకము అనునవి సహాయంబులైయుండ మధ్యకాలమున జనింపక కాలవిశేషమువలన జనించుచందంబున దోషములును కాలానుగుణ్యముగ ప్రకోపమునుబెందు. ఈకారణంబులే చాతుర్థికాదిజ్వరములయందు సంబంధించునని తెలియవలయు.

## అపస్మారమునకు స్మృతిసాగరరసము

రసగంధకతాళానాం సశిలాతామ్రభస్మనామ్,
శుద్ధానాం మూర్ఛితానాం చ చూర్ణం భావ్యం వచామృతైః. 13
ఏకవింశతిధా పశ్చాద్బ్రాహ్మీ వారా తథైవచ,
కటభీబీజతైలేన భావయేదేకవారకమ్. 14
స్మృతిసాగరనామాయం రసోఽపస్మారనాశనః,
సర్పిషా మాషమాత్రోయం భుక్తో హన్యాదపస్మృతిమ్. 15

తా. శుద్ధిచేసినరసము, శుద్ధగంధకము, శుద్ధహరితాళము, శుద్ధమణిశిల తామ్రభస్మము వీనిని సమములుగ చూర్ణించి వస బ్రాహ్మి వీనిరసములచే ప్రత్యేకము ౨౧ భావనలుచేసి పిదప * జ్యోతిష్మతీవిత్తుల తైలముతో నేకదినము భావనచేసిన స్మృతిసాగరరసమనంబడు. దీనిని మాషమాత్రము నేతితో పుచ్చుకొనిన అపస్మారము నివర్తించు.

## అపస్మారగజాంకుశరసము

హింగుసౌవర్చలం వ్యోషం గోమూత్రేణ పృథగ్దినమ్,
భావితం నిమ్బమాత్రేణ సూతరాజేన సంయుతమ్. 16
అజాజ్యేన తు దేయం స్యాత్సర్వోన్మాదవినాశనమ్,
గదితః సప్తరాత్రేణ † హ్యపస్మారగజాంకుశః. 17

తా. ఇంగువ, సౌవర్చలవణము, త్రికటుకములు, వీనిని సమభాగములుగ చూర్ణముచేసి గోమూత్రముతో నొకదినము నానబెట్టి మరుదినము యెండించి చూర్ణముచేసినిమ్మప్రమాణము రసభస్మమునుగలిపి మేకనేతితో ౭ దినములు పుచ్చుకొనిన సర్వోన్మాదములు అపస్మారములు ఇవి హరించు.

---

* మాల్కంగిని. † అపస్మారగజాంకుశమను పేరుచేతనే అపస్మారమును నశింపజేయునను నర్థము వచ్చును.

అపస్మారమునకు భూతభైరవరసము

మృతసూతార్కలోహశ్చ తాళం గంధం మనశ్శిలామ్,
స్రోతోంజనం చ తుల్యాంశం నరమూత్రేణ మర్దయేత్. 18
తద్గోళద్విగుణం గంధం లోహపాత్రే క్షణం పచేత్,
పంచగుంజామితం ఖాదేదపస్మారహరం ఘృతైః. 19
హింగుసౌవర్చలం త్ర్యూషం నరమూత్రేణ సర్పిషా,
కర్షమాత్రం పిబేచ్చానురసోయం భూతభైరవః. 20

తా. రసభస్మము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిచేసినతాళకము, శుద్ధిజేసినగంధకము, శుద్ధిచేసినమణిశిల, స్రోతోంజనము, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి నరమూత్రముతో మర్దించి ముద్దజేసి దానికి రెండింతలు శుద్ధిచేసిన గంధకమునుకలిపి ఇనుపగిన్నెలోనునిచి క్షణకాలమువండి ౫ గురిగింజలయెత్తు ఔషధమును నేతితోగాని లేక ఇంగువ సౌవర్చలవణము, త్రికటుకములు వీనిని నరమూత్రముతో నూరి కర్షమెత్తు నెయ్యిచేర్చిగాని సేవించిన అపస్మారము నివర్తించు.

అపస్మారమునకు ఇంద్రబ్రహ్మవటుకములు

మృతం సూతాభ్రకం తీక్ష్ణమారం కాంస్యం మృతం సమమ్,
పద్మకేసరసంయుక్తం దినైకం మర్దయేద్ద్రవైః. 21
స్నుహ్యగ్నివిజయైరండవచానిష్పావసూరణైః,
నిర్గుండ్యాశ్చ ద్రవైర్భావ్యం తద్గోళం పాచయేత్పునః. 22
కుసుంభాసర్షపోత్థేన తైలేన బలిజేన చ,
యామం పక్త్వా సముద్ధృత్య చణమాత్రా వటీకృతా. 23
ఇంద్రబ్రహ్మవటీ నామ భక్షయేదార్ద్రకద్రవైః,
దశమూలకషాయం చ కణాయుక్తం పిబేదను. 24
అపస్మారం నిహన్త్యాశు యథా సూర్యోదయస్తమః,

తా. రసభస్మము, అభ్రకభస్మము, లోహభస్మము, ఇత్తడిభస్మము, కంచుభస్మము, పద్మకేసరములు, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి బొంతజెముడుపాలు, చిత్రమూలము, కరక్కాయ, ఆముదపువేరు, వస, అనుగాకు, కంద, వావిలి, వీనిరసములతో ప్రతిదానిచే నొక్కొక దినమువంతున మర్దించి ముద్దచేసి దానిని, మరల కుసుమనూనె, ఆవనూనె, గంధకతైలము, వీనితో నొకఝామువండి దించుకొని శనగగింజయెత్తు అల్లపురసముతోగాని లేక మారేడు, గుమ్ముడు, దుందిలము, తక్కాలి, కలిగొట్టు, పిన్నపొన్న, నక్కపొన్న పెద్దములుక నేలములుక, పల్లేరు వీని వేరుపట్టలను

సమభాగములుగ దంచి కషాయము కాచి అందు పిప్పలిచూర్ణము గలిపి, యీ అను పానముతో డగాని సేవించిన, సూర్యోదయమునందెటుల నంధకారము నివర్తించునో అపస్మారమటుల శీఘ్రముగ నివర్తించు.

అపస్మారములకు బ్రాహ్మీఘృతము

బ్రాహ్మీ ముండీ వచా కుష్ఠం సనీలోత్పలకపిప్పలీ. 25
సైంధవం చ సమం భావ్యం బ్రాహ్మీద్రావైస్త్రిసప్తకమ్,
తస్మాచ్చతుర్గుణం చాజ్యం బ్రాహ్మీద్రావం ఘృతాచ్చతుః. 26
ఘృతశేషం పచేత్సర్వమిదం బ్రాహ్మీఘృతం స్మృతమ్,
అపస్మారం హరత్యాశు సర్వరోగకులాన్తకమ్. 27

తా. వల్లారి, బోడతరము, వస, చెంగల్వకోష్ఠు, నల్లకలువగడ్డ, పిప్పలి, సైంధవలవణము, వీనిని సమభాగములుగ చూర్ణముచేసి బ్రహ్మదండి (వల్లారి) రసముతో ౨౧ మార్లుభావనలుచేసి ముద్దలుచేసి దానికి నాలుగింతలు నెయ్యి, నేతికి నాలుగింతలు వల్లారి రసముగలిపి, నెయ్యి మిగులునటుల కాచి సేవించిన అపస్మారము, ఉన్మాదము మొదలగు సర్వరోగముల శీఘ్రముగ నివర్తింపంజేయు.

పిత్తాపస్మారమునకు మధుకఘృతము

మధుకద్విపలే కల్కే ద్రోణే చామలకీరసే,
తస్మిన్ సిద్ధం ఘృతప్రస్థం పిత్తాపస్మారభేషజమ్. 28

తా. యష్టిమధుకచూర్ణము ౨ పలములు, ౧ ద్రోణము ఉశిరికెపండ్ల రసమునందువైచి, నెయ్యి ౧ ప్రస్థముచేర్చి ఘృతముశేషించువరకు కాచి సేవించిన పిత్తాపస్మారము నివర్తించు.

వాతపిత్తాపస్మారములకు కాశఘృతము

కాశేక్షు రేక్షురసయోః కాశ్మర్యష్టగుణే రసే,
క్షీరి కైర్జీవనీయైశ్చ సర్పిః ప్రస్థం విపాచయేత్. 29
వాతపిత్తోద్భవం క్షిప్రమపస్మారం నియచ్ఛతి,

తా. కాశదర్భ, వేరురసము, పాలు, చెరుకురసము, యెనిమిదింతలు చల్లగుమ్ముడురసముచేర్చి అందు ౧ ప్రస్థము నెయ్యి, జీవనీయ గణమునందలి ఔషధముల ప్రత్యేకము ౧ కర్షకమువంతున చూర్ణించివైచి ఘృతపక్వముగ కాచి సేవించిన వాతపిత్తజాపస్మారము నివర్తించు.

కఫాపస్మారమునకు వచాదిఘృతము

వచాశమ్యాకకైడర్యవయస్థాహింగుచోరకైః. 30

సిద్ధం పలం కషాయుక్తం వాతశ్లేష్మాంతకం ఘృతమ్,

తా. వస, శేల, కరివేపాకు, ఉశిరిక, ఇంగువ, కచోరకము, చిన్నపల్లేరు, వీనికల్కమునకుసమము నెయ్యిచేర్చి ఘృతము సిద్ధపరచి సేవించిన వాతశ్లేష్మాపస్మారము నివర్తించు.

కళ్యాణచూర్ణము

పంచకోలం సమరిచం త్రిఫలా బిడసైంధవమ్. 31
కృష్ణావిడంగపూతీకయవానీధాన్యజీరకమ్,
పీతముష్ణాంబునా చూర్ణం వాతశ్లేష్మామయాపహమ్. 32
అపస్మారే తథోన్మాదే దుర్నామగ్రహణీగదే,
ఏతత్కళ్యాణకం చూర్ణం నష్టస్యాగ్నేశ్చ దీపనమ్. 33

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, చవ్యము, చిత్రమూలము, మిరియాలు, త్రిఫలములు, బిడాలవణము, సైంధవలవణము, పిప్పళ్లు వాయువిడంగములు, కంపుకానుగ, ఓమము, ధనియాలు, జీలకఱ్ఱ, వీనిని సమములుగ జేర్చి చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన వాతశ్లేష్మరోగము, అపస్మారము, ఉన్మాదము, దుర్నామగ్రహణీరోగము ఇవి నివర్తించుటయేగాక అగ్నిదీప్తియుగలుగు.

అపస్మారమునకు నస్యములు

త్రికటుం చిత్రకం చైవ లాంగలీం చేంద్రవారుణీమ్,
వచా మధూకబీజాని తథా పాఠా నదీఫలమ్. 34
తాళకం వత్సనాభం చాప్యంకోలం క్షారయుగ్మకమ్.
ఏవం పంచదశప్రోక్తాన్సమభాగాంశ్చ కారయేత్. 35
సూక్ష్మచూర్ణీకృతం చైవ నిర్గుండీతింత్రిణీరసైః,
ఆర్ద్రికస్వరసైర్యుక్తం త్రివిధైశ్చ విచక్షణః. 36
ఏవం నస్యం ప్రదాతవ్యమర్కమూలరసేన చ,
అపస్మారం చ హృద్రోగం వాతసంకులమేవచ. 37
ధనుర్వాతం గ్రహం చైవాప్యున్మాదం సన్నిపాతకమ్,
పూజ్యపాదకృతో యోగః హన్యాదేవ న సంశయః. 38

తా. త్రికటుకములు, చిత్రమూలము, చన్నచర్లగడ్డ, పాపరవేరు, వస, ఇప్పగింజలు, వినబొద్దివేరు, సముద్రపొడవిత్తులు, శుద్ధిజేసిన తాళకము, శుద్ధిజేసిన నాభి, ఊడుగకొనలు, సర్జక్షారము, యవక్షారము, ఈపదిహేను దినుసులను సమభాగములుగ చూర్ణముజేసి ఖల్వమునందునిచి, వావిలియాకురసము, చింతాకురసము,

అల్లపురసము, వీనితోగాని జిల్లేడువేళ్లరసముతోగాని మర్దించి, తలవేర్లునటుల వెల్ల కలమంచముపై పరుండబెట్టి, ౪ దినములు నస్యముజేయించిన, అపస్మారము,హృద్రోగము, వాతరోగము, ధనుర్వాతము, గ్రహణీదోషము, ఉన్మాదము, సన్నిపాతములు (కొకిసోమాలు, కుండేటితెగులు) మొదలగురోగములు నివర్తించు. ఇది మానవహితార్థమై, పూజ్యపాదమహాముని చే వచింపబడియె. (మరియు నీనస్యముల చేయుచు లోపలికౌషధముల సేవించుచుండిన, అపస్మారములు, ఉన్మాదము, ఇవి హరించు.)

ఇంద్రవారుణికామూలమారనాళేన పేషితమ్,
అపస్మారహరం నస్యం భూతప్రేతస్య కిం పునః. 39

తా. పాపరవేరును కలితో నూరి నస్యముచేయించిన, అపస్మారము, ఉన్మాదము, భూతప్రేతములు ఇవి నివర్తించు. (మరియు నీనస్యములనారుమార్లు చేయించవలయు. అపస్మారోన్మాదరోగ సాధ్యాసాధ్యంబులనెరింగి సాధ్యంబులగువాటికే చికిత్సం జేయవలయు. పూర్వోక్తౌషధములు కష్టసాధ్యములగు, యపస్మారోన్మాదములనగా హరింపంజేయు. మరియు నపస్మారోన్మాదరోగనివారణార్థంబై పంచగవ్యఘృతమును కళ్యాణఘృతమును సేవింపందగు.)

## అపస్మారచికిత్సాక్రమము

పూర్వం యుంజ్యాదపస్మారే బుద్ధిమాన్ఛర్దనాదికమ్,
వాతికం వస్తిభిః ప్రాయః పైత్తికీం చ విరేచనైః. 40
కఫజం వమనప్రాయైరపస్మారముపాచరేత్,

అస్మారరోగమునందు బుద్ధిమంతుడగువైద్యుడు, వాంతిమొదలగువానిని జేయింపవలెను. అందు వాతికాపస్మారమునందు వస్తికర్మమొదలగువానిని, పైత్తికాపస్మారమునందు విరేచనములను, కఫజాపస్మారమునందు వమనము మొదలగువానినిం జేయించవలయు.

## అపస్మారపథ్యములు

లోహితాశ్శాలయో ముద్గా గోధూమాః ప్రతతం హవిః. 41
కూర్మామిషం ధన్వరసో దుగ్ధం బ్రాహ్మీ జలం వచా,
పటోలం వృద్ధకూష్మాండం వాస్తుకం స్వాదుదాడిమమ్. 42
శోభాంజనం పయః పేటీ ద్రాక్షా ధాత్రీ పరూషకమ్,
అపస్మారే గదే నృణాం పథ్యమేతదుదీరితమ్. 43

తా. పాతయెఱ్ఱవడ్లబియ్యము, పెసలు, గోధుమలు, పాతనెయ్యి, కూర్మ

మాంసము, తీటకసివిందరసము, పాలు, బ్రాహ్మీరసము, కురువేరు, వస, చేదుపొట్ల, పాతగుమ్మడికాయ, చకోతపుకూర, తియ్యదాడింబ, మునగకాయ, పయఃపేటి, ద్రాక్ష, ఉశిరిక, ఫాలసాపండు, ఇవి అపస్మారమునకు పథ్యములని యెరుంగవలయు.

—అపస్మారమునక పథ్యములు—

చింతాశోకభయక్రోధమద్భుతం దర్శనాదికమ్,
మద్యం మత్స్యం విరుద్ధాన్నం తీక్ష్ణోష్ణగురుభోజనమ్. 44
అతివ్యవాయమాయాసం పూజ్యపూజావ్యతిక్రమమ్,
పత్రశాకాని సర్వాణి బింబీమాషాఢకం ఫలమ్. 45
తృషానిద్రాక్షుధావేగానపస్మారీ నరస్త్యజేత్,

తా. చింత, శోకము, భయము, క్రోధము, అద్భుతపదార్థదర్శనము, మద్యము, మత్స్యములు, విరుద్ధాన్నము, తీక్ష్ణము, ఉష్ణము, గురువుఅగునట్టిపదార్థముల భుజించుట, అతిమైథునము, ఆయాసము, పూజ్యపూజావ్యతిక్రమము, సమస్తమైనఆకుకూరలు, దొండపండు, మినుములు, కందులు, దప్పి, నిద్ర, ఆకలి వీనివేగమునడ్డగించుట, వీనిని అపస్మారరోగి విడువవలయు.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్యవిద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్రకంఠవల్లభాచార్య విరచిత, వైద్యచింతామణౌ, తృష్ణ, దాహ, మూర్ఛ మదాత్యయ, ఉన్మాద, అపస్మారరోగ, ప్రకరణంనామ షోడశో విలాసః.

---

# కుష్ఠరోగప్రకరణమ్.

—కుష్ఠరోగ కర్మవిపాకము—

పరుషం భాషతే వ్యర్థం సత్వగ్దోషయుతో భవేత్,
చాంద్రాయణత్రయం కుర్యాత్ప్రదద్యాదౌషధాని చ. 1
వైద్యకోక్తాని విప్రాయ శక్త్యా బ్రాహ్మణభోజనమ్,

తా. అన్యపురుషునితో, కఠినముగను, వ్యర్థముగను మాటలాడువానికి, కుష్ఠరోగము జనించు. అది నివర్తించుటకై, 3 చాంద్రాయణకృచ్ఛ్రములంజేసి, వైద్య

శాస్త్రమునందు జెప్పంబడియుండు ఔషధములను, శక్త్యనుసారముగ బ్రాహ్మణుని కొసంగి, శక్త్యనుసారముగ బ్రాహ్మణభోజనం బిడవలయు.

—॥ దుశ్చర్మత్వహరము ॥—

గురుతల్పగదోషాచ్చ గవి మైథునదోషతః. 2
దుశ్చర్మా స్యాదసౌ కుర్యాద్గురుతల్పాతిదోషతః,
చాంద్రాయణత్రయం కుర్యాత్తతో దోషాత్ప్రముచ్యతే. 3

తా. గురుభార్యతోగాని, గోవుయందుగాని, సంగమము జేయువాడు, కుష్ఠురోగముగలవాడుగ జనించు. అది నివర్తించుటకై, 3 చాంద్రాయణములం జేయవలయు.

—॥ కుష్ఠనిదానము సంప్రాప్తి ॥—

విరోధీన్యన్నపానాని ద్రవస్నిగ్ధగురూణి చ,
భజతామాగతాం ఛర్దిం వేగాంశ్చాన్యాన్ ప్రతిఘ్నతామ్. 4
వ్యాయామమతిసంతాపమతిభుక్త్వా నిషేవిణామ్,
శీతోష్ణలంఘనాహారాన్ క్రమం ముక్త్వా నిషేవిణామ్. 5
ఘర్మశ్రమభయార్తానాం ద్రుతం శీతాంబుసేవినామ్,
అజీర్ణాధ్యశనానాం చ పంచకర్మాపచారిణామ్. 6
నవాన్నదధిమత్స్యాదిలవణామ్లనిషేవిణామ్,
మాషమూలకపిష్టాన్నతిలక్షీరగుడాశినామ్. 7
వ్యవాయం చాప్యజీర్ణేన్నే నిద్రాం చ భజతాం దివా,
విప్రాన్ గురూన్ ధర్షయతాం పాపం కర్మ చ కుర్వతామ్, 8
వాతాదయస్త్రయో దుష్టాస్త్వగ్రక్తం మాంసమంబు చ,
దూషయన్తి సకుష్ఠానాం సప్తకో ద్రవ్యసంగ్రహః. 9
అతః కుష్ఠాని జాయన్తే సప్తచైకాదశైవ చ,

తా. క్షీరమత్స్యాది విరుద్ధాన్నపానములు, ద్రవము స్నేహము గురుత్వము ఇవిగల యన్నపానముల సేవించుట, వాంతి మూత్రము పురీషము వీని వేగముల నిరోధించుట, భోజనము చేసినతోడనే అతివ్యాయామము జేయుట, ఎండలో సంచరించుట, శీతలము ఉష్ణముగలపదార్థములను లంఘనమును వీనిని జెప్పంబడియుండు క్రమమునకు విరుద్ధముగ సేవించుట, వేడి శ్రమ భయము వీనివలన బాధితుడై తత్క్షణమున చల్లనీళ్లనుత్రాగుట, పక్వముకానియన్నమును భక్షించుట, భక్షించిన పిదప మరలభక్షించుట, వమనము, విరేచనము, వస్తి, స్వేదము, నస్యము మొదలగు పంచకర్మముల చేయునపుడు, అపచారమును జేయుట, క్రొత్తబియ్యపన్నము, పెరుగు, మత్స్యములు,

ఉప్పు, పులుసు, మినుములు, ముల్లంగి, పిష్టాన్నము, నువ్వులు, పాలు, బెల్లము వీనిసేవించుట, భుజించినయన్నము జీర్ణమవుటకుముందు మైథునముజేయుట, పగటియందు నిద్రించుట, గురుబ్రాహ్మణులదిరస్కరించుట పాపకర్మములసేయుట, యీ కారణములవలన వాతాదిదోషములు ప్రకోపించి, దుష్టములై, చర్మము, రక్తము, మాంసము, రసము వీనినిజెరచి, కుష్ఠరోగమును జనింపంజేయు, మరియు, కుష్ఠరోగముబుట్టుటకు, వాత పిత్త శ్లేష్మములు, త్వగ్రక్తమాంసోదకములు, యీ, యేడు ద్రవ్యములును ముఖ్యకారణములు దీనివలన ౧౮ కుష్ఠువులు, జనించుచున్నయవి. (అందు, మహాకుష్ఠువులు ౭ క్షుద్రకుష్ఠువులు, ౧౧ అని తెలియవలయు.)

## కుష్ఠరోగమునకు పూర్వరూపము

అతిశ్లక్ష్ణఖరస్పర్శస్వేదాస్వేదవివర్ణతాః. 10
దాహః కండూస్త్వచి స్వాపస్తోదః కోఠోన్నతిక్లమః,
వ్రణానామధికం శూలం శీఘ్రోత్పత్తిశ్చిరస్థితిః. 11
రూఢానామపి రూక్షత్వం నిమిత్తేల్పేపి కోపనమ్,
రోమహర్షోసృజః కార్ష్ణ్యం కుష్ఠలక్షణమగ్రజమ్. 12

తా. కుష్ఠరోగము జనించబోయ్యెడి స్థలమును స్పృశించిన మిక్కిలినున్నగగాని లేక గరగరయనిగాని యుండుట, ఆస్థానమునందు చెమటబోయుట, లేక చెమటలేకయుండుట, ఆస్థానమునందువివర్ణత తాపము దురద ఇవి గలుగుట, చర్మమునందు స్పర్శజ్ఞానములేకుండుట, పొడిచినటుల పీడగలుగుట, కందిరీగలుగరిచి నటుల దద్దులుగట్టుట, ఆయాసములేకనే శ్రమగలుగుట, వ్రణమునందు మిక్కిలి పోట్లు గలుగుట, వ్రణము శీఘ్రముగజనించి బహుకాలముండుట, జనించినవ్రణము రూక్షముగనుండుట, స్వల్పకారణమువలన ప్రకోపించుట, రోమాంచము గలుగుట, రక్తమునల్లనగుట, ఇవి కుష్ఠరోగములకు పూర్వరూపంబులని తెలియవలయు.

## కపాలకుష్ఠలక్షణము

కృష్ణారుణకపాలాభం యద్రూక్షం పరుషం తను,
కపాలం తోదబహుళం తత్కుష్ఠం విషమం స్మృతమ్. 13

తా. నల్లని రొట్టినిపెంకువంటి మచ్చలుగలుగుట, రూక్షముగను కఠినముగను సూక్ష్మముగను నుండుట, సూదులతో బొడిచినటుల మిక్కిలి బాధగలుగుట ఈ లక్షణములు గలది కపాలకుష్ఠమని తెలియవలయు. ఇది యసాధ్యము, ఇది క్షతాధిక్యమువలన జనించు.

## ఔదుంబరకుష్ఠలక్షణము

రుగ్దాహరాగకండూభిః పిత్తోత్థం లోమపింజరమ్,
ఉదుంబరఫలాభాసం కుష్ఠమౌదుంబరం వదేత్. 14

తా. శూల తాపము ఎరుపువర్ణము దురద వీనితో వ్యాపింపబడియుండుట, వెంట్రుకలు పీతరక్తాధిక్యముగనుండుట, మేడిపండుతో తుల్యమగు కాంతిగల కాయలుగలుగుట ఇట్టి లక్షణములుగలిగియుండిన నది ఔదుంబరకుష్ఠమని తెలియవలయు. ఇది పిత్తాధిక్యమువలన జనించు.

## మండలకుష్ఠలక్షణము

శ్వేతం రక్తం స్థిరం స్త్యానం స్నిగ్ధముత్సన్నమండలమ్,
కృఛ్ఛ్రిమన్యోన్యసంయుక్తం కుష్ఠం మండలముచ్యతే. 15

తా. తెల్లగను యెఱ్ఱగను కఠినముగను దట్టముగను స్నిగ్ధముగను మండలాకారముగనుండు మండలము లొకదానితోనొకటి గూడియుండిన మండలకుష్ఠమని తెలియవలయు. ఇది కష్టసాధ్యము. ఈమండలకుష్ఠము కఫాధిక్యమువలన జనించు.

## ఋశ్యజిహ్వాకుష్ఠలక్షణము

కర్కశం రక్తపర్యంతమంతశ్శ్యామం సవేదనమ్,
యదృశ్యజిహ్వాసంస్థానమృశ్యజిహ్వం తదుచ్యతే. 16

తా. కఠినముగనుండుట, చుట్టు నెఱ్ఱగనుండుట, మధ్యమునందు నల్లగనుండుట, వేదనతోగూడియుండుట, దుప్పి నాలుకతో తుల్యమగు ఆకారముగలిగియుండుట, ఇట్టి లక్షణములుగలది ఋశ్యజిహ్వాక కుష్ఠమని తెలియవలయు. ఇదియు మహాకుష్ఠము,

## పుండరీకకుష్ఠలక్షణము

సశ్వేతం రక్తపర్యంతం పుండరీకదళోపమమ్,
సోత్సేధం చ సరాగం చ పుండరీకం ప్రచక్షతే. 17

తా. తెలుపుగను చుట్టూ యెఱ్ఱగను తామర రేకులవలెనుండుట, ఉన్నతముగనుండుట, యెరుపుగ నుండుట ఇట్టిలక్షణములుగలది పుండరీకకుష్ఠమని తెలియవలయు.

## సిధ్మకుష్ఠలక్షణము

శ్వేతం తామ్రం చ తనుయద్రజోఘృష్టం విముంచతి,
వాతశ్లేష్మోద్భవం సిధ్మమలాబుకుసుమోపమమ్. 18

తా. తెలుపుఎరుపుగలసిన సూక్ష్మపు మచ్చలుగలుగుట, రాచినపిండివలె రాలుట, ఆనగపువ్వులతో సమానముగనుండుట, ఇది తరుచుగ రొమ్మునందే జనించు

ట ఇట్టి లక్షణములుగలది సిధ్మకుష్ఠమని తెలియవలయు. ఇది వాతశ్లేష్మాధిక్యమువలన జనించు. (ఇదియే సిబ్బెమనబడును.)

కాకణకుష్ఠలక్షణము

యత్కాకచుంచుకావర్ణం సపాకం తీవ్రవేదనమ్,
త్రిదోషలింగం తత్కుష్ఠం కాకణం నైవ సిధ్యతి. 19

తా. కాకిముక్కుతో సమమైన వర్ణముగలుగుట, కొంచెముపాకము తీవ్రవేదన ఇవి గలుగుట, త్రిదోషలక్షణములు గలిగియుండుట ఇట్టి లక్షణములుగలది కాకణ కుష్ఠమని యెరుంగవలయు. ఇది అసాధ్యము (ఇది మహాకుష్ఠము.)

చర్మకుష్ఠలక్షణము - ఇదె గజచర్మకుష్ఠము

అస్వేదం ఘనకండూశ్చ యన్మత్స్యశకలోపమమ్,
తదేవ కుష్ఠం చర్మాఖ్యం బహులం హస్తిచర్మవత్. 20

తా. చెమటబట్టకుండుట, మిక్కిలిదురద, మత్స్యపుతునకలతో తుల్యముగ నుండుట, దళముగ ఏనుగుచర్మమువలె నుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన (గజ) చర్మకుష్ఠమని తెలియవలయు.

కిటిభకుష్ఠలక్షణము

శ్యావం కిణం ఖరస్పర్శం సకండూపరుషం ఘనమ్,
వాతశ్లేష్మోద్భవం ఖ్యాతం కిటిభం కుష్ఠమీదృశమ్. 21

తా. మచ్చలు నీలవర్ణముగను కాయలవలెను నుండుట, దురద రూక్షత గలిగి దట్టముగనుండుట, ఇట్టి లక్షణములుగలిగియుండిన కిటిభకుష్ఠమని తెలియవలయు. ఇది వాతశ్లేష్మాధిక్యమువలన జనించు.

వైపాదికకుష్ఠలక్షణము

వైపాదికం పాణిపాదస్ఫోటనం తీవ్రవేదనమ్,

తా. చేతులు కాళ్లు ఇవి వ్రయ్యలుగ పగిలి మిక్కిలి వేదనగలిగియుండిన వైపాదికకుష్ఠమని తెలియవలయు. ఇదియును వాతశ్లేష్మాధిక్యమువలననే జనించు.

విపాదికా విచర్చికానిర్ణయము

దోషః ప్రదూష్య త్వఙ్మాంసం పాణిపాదం సమాశ్రితః. 22
పిడికాం జనయత్యాశు దాహకండూసమన్వితామ్,
దహ్యేతే త్వక్శిరారూక్షౌ పాణ్యోర్జ్ఞేయా విచర్చికా. 23

పాదే విపాదికా జ్ఞేయా స్థానాన్యత్వాద్విచర్చికా,

తా. దోషము ప్రకోపించి హస్తములు పాదములు వీని నాశ్రయించినవై

చర్మము మాంసము వీనినిజెరచి దాహము దురద వీనితోగూడిన పిడికనుగలుగజేసి. చర్మమును దహించుట శిరలు దూత్షునుగనుండుట ఇట్టి లక్షణములుగలిగియుండు కుష్ఠము హస్తములయందైన విచర్చికయనియు పాదములయందైన విపాదికయనియు స్థానభేదముచే తెలియవలయు.

అలసకకుష్ఠలక్షణము

కండూమద్భిస్సరాగైశ్చ గండైరలసకంచితమ్. 24

తా. దురదగలిగి యెఱ్ఱగనుండు దద్దులతోగూడియుండిన దానిని అలసకకుష్ఠమని తెలియవలయు.

దద్రుమండలకుష్ఠలక్షణము

సకండూరాగపిటికం దద్రుమండలముద్గతమ్,

తా. దురద యెరుపువన్నము వీనితోగూడినదిగనుండు పిటికలతోగూడిన దద్రులు మండలములు జనించిన దద్రుమండలకుష్టమని యెఱుంగవలయు.

చర్మదళకుష్ఠలక్షణము

రక్తం సశూలం కండూమత్స్ఫోటం యద్దళయత్యపి. 25
స్పర్శాసహం ఘనం స్నిగ్ధం కుష్ఠం చర్మదళం స్మృతమ్,

తా. ఎఱ్ఱని మచ్చలుగలుగుట, శూలతోగూడి బిరుసుగనుండుట, దురద, నీరుగారుట, బొబ్బలులేచుట, పగులుట, స్పృశించిన నొప్పికలిగియుండుట, దట్టముగనుండుట ఇట్టిలక్షణములుగలది చర్మదళకుష్టమని తెలియవలయు. ఇదిమహాకుష్ఠము.

పామాకుష్ఠలక్షణము

సూక్ష్మా బహ్వ్యః పీటికాః స్రావవత్యః పామేత్యుక్తా కండుమత్యస్సదాహాః. 26

తా. సూక్ష్మమగు పిటికలు మిక్కిలి గలిగియుండుట, పిటికలవల్లనుంచి తెల్లని పులినీరుగారుట, దురద తాపము ఇవిగలుగుట ఇట్టిలక్షణములుగలిగియుండిన పామాకుష్ఠమని తెలియవలయు. ఇది కఫమువలన జనించు మహాకుష్ఠము.

విస్ఫోటకకుష్ఠలక్షణము

స్ఫోటాశ్శ్యావారుణాభాసా విస్ఫోటాస్స్యుస్తనుత్వచః,

తా. నల్లగను యెఱ్ఱగను నొక్కులుజనించి చర్మము సూక్ష్మముగనుండిన విస్ఫోటకకుష్ఠమని తెలియవలయు. ఇది మహాకుష్ఠము,

—◎ కచ్ఛుకుష్ఠలక్షణము ◎—

రక్తం స్నిగ్ధం ఘనం శ్యామ మతికండూకఫోద్భవమ్. 27
ఊరుకక్షకటీష్వేవం కచ్ఛుత్వక్కుష్ఠకాహ్వాయమ్,

తా. ఎఱ్ఱనై స్నిగ్ధమై ఘనమై నల్లగనుండి మిక్కిలి దురదగలుగుట, తొడలు చంకలు మొల వీనియందు జనించుట ఇట్టిలక్షణములుగలది కచ్ఛుత్వక్కుష్ఠమని తెలియవలయు. ఇది కఫమువలన జనించు.

—◎ శతారుకుష్ఠలక్షణము ◎—

రక్తం శ్యావం సదాహార్తిశతారుస్స్యాద్బహువ్రణమ్. 28

తా. ఎఱ్ఱగను, శ్యామవర్ణముగనునుండి మంట, నొప్పి ఇవిగల అనేక వ్రణములుగలుగునది శతారుకుష్ఠమని తెలియవలయు. ఇది పిత్తశ్లేష్మాధిక్యమువలన జనించు.

—◎ విచర్చికాకుష్ఠలక్షణము ◎—

సకండూ పిటికా శ్యావా బహుస్రావా విచర్చికా,

తా. దురదగలిగి నల్లగనుండు పిటికలు జనించి, ఆపిటికలవల్లనుంచి మిక్కిలి స్రావము గలిగియుండిన విచర్చికాకుష్ఠమని తెలియవలయు. ఇది వాతపిత్తాధిక్యమున జనించు.

—◎ గళత్కుష్ఠలక్షణము ◎—

జిహ్వికా కృష్ణవర్ణా యా హన్తి సత్వం త్రిమాసికే. 29
పాదయోశ్చ తథా తాపో వళీత్ర్యంగుళికాపి వా,
నాసాస్రం స్వరభంగశ్చగళత్కుష్ఠం త్రిదోషజమ్. 30

తా. నాలుక నల్లగనుండుట కాళ్లయందు తాపము మూడంగుళముల ప్రమాణము వళులుగలిగియుండుట ముక్కున నెత్తురుకారుట హీనస్వరము ఇట్టిలక్షణములు గలది గళత్కుష్ఠమని తెలియవలయు. ఇది త్రిదోష జనితంబగుటచే మూడుమాసములలో నిశ్చయముగ మృతినిజెందించు. ఇది మహాకుష్ఠము.

—◎ అసాధ్య శ్విత్రికుష్ఠలక్షణము ◎—

శంఖవర్ణం భవేచ్ఛ్విత్రం సాధ్యం సర్వాంగగం నవా,
శుష్కం వైకృచ్ఛ్రసాధ్యం చ గుహ్యాపాణితలానుగమ్. 31
అగ్నిదగ్ధమసాధ్యం స్యాత్తథా వర్జ్యం చిరంతనమ్,

తా. శ్విత్రికుష్ఠము శంఖవర్ణముగలదై సర్వావయవముల వ్యాపించియుండిన అసాధ్యమనియు, శరీరమంతటవ్యాపించి శరీరము కృశించియుండిన కష్టసాధ్యమనియు, గుహ్యము అరచెయ్యి వీనియందుజనించినను, అగ్నిదగ్ధమువలన జనించినను

అసాధ్యంబనియును తెలియవలయు. మరియు చిరకాలమునుండియుండు శ్విత్ర కుష్ఠము సగా అసాధ్యమని తెలియవలయు. ఇది వాతపిత్తాధిక్యమువలననే జనించు.

## ప్రసూతికుష్ఠలక్షణము

అంగతోదో మండలాశ్చ దేహస్పర్శం న విందతి. 32
తథా మారుతపిత్తోత్థం కుష్ఠం ప్రాసూతికం క్వచిత్,

తా. అవయవములలో సూదులతో బొడిచినటుల నొప్పి, మండలములు గలుగుట, శరీరమునకు స్పర్శజ్ఞానము లేకయుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన ప్రసూతికుష్ఠమని వచించెదరు. ఇది వాతపిత్తప్రకోపమువలన నొక్కొక్కచోట జనించు.

## రసధాతుగతకుష్ఠలక్షణము

త్వక్స్థే స్వైవర్ణ్యమంగేషు కుష్ఠే రౌక్ష్యం చ జాయతే. 33
త్వక్స్వాపో రోమహర్షశ్చ స్వేదస్యాతిప్రవర్తనమ్,

తా. రసధాతుగతకుష్ఠమునందు అవయవములకు వైవర్ణ్యము రూక్షతగలిగి యుండుట స్పర్శజ్ఞానములేకయుండుట రోమాంచము మిక్కిలి చెమటపడియుట ఇట్టి లక్షణములు గలిగియుండు.

## రక్తగతకుష్ఠలక్షణము

కండూవిపూయకశ్చైవ కుష్ఠే శోణితసంశ్రితే. 34

తా. రక్తగతకుష్ఠమునందు దురద మిక్కుటముగ చీముకారుట ఇవి గలిగి యుండు.

## మాంసగతకుష్ఠలక్షణము

బాహుళ్యం వక్త్రశోషశ్చ కార్కశ్యం పిటకోద్గమః,
తోదస్స్ఫోటః స్థిరత్వం చ కుష్ఠే మాంససమాశ్రితే. 35

తా. మాంసగతకుష్ఠమునందు దళముగానుండుట, మిగులనోరెండుట, శరీరము గరగరలాడుట, దద్దులుగట్టుట, సూదులతో పొడిచినటుల పోట్లు, పగుళ్లు, చిరకాలమునుండుట ఇట్టి లక్షణములు గలిగియుండు.

## మేదోగతకుష్ఠలక్షణము

కౌణ్యం గతిక్షయోంగానాం సంభేదః క్షతసర్పణమ్,
మేదస్థానగతే లింగం ప్రాగుక్తాని తథైవచ. 36

తా. మేదోగతకుష్ఠమునందు చేతులు కాళ్లు వీనియొక్క చేవ్రేలుడుగుట, శరీరము పగిలి వ్రణములగుట, పూర్వోక్తములగు రసరక్తగత సర్వలక్షణములును గలిగియుండు.

అస్థిమజ్జాగతకుష్ఠలక్షణములు

నాసాభంగోఽక్షిరాగశ్చ క్షతేషు క్రిమిసంభవః,
స్వరోపఘాతశ్చ భవేదస్థిమజ్జాసమాశ్రితే. 37

తా. అస్థి మజ్జాగతకుష్ఠమునందు ముక్కు వీడిపోవుట, కన్నులు ఎఱ్ఱగనుండుట, కురుపునందు పురుగులుపడుట, స్వరము హీనమగుట ఇవిగలుగు.

శుక్రార్తవగతకుష్ఠలక్షణము

దంపత్యోః కుష్ఠబాహుళ్యాత్దుష్టశోణితశుక్రయోః,
యదపత్యం తయోర్జాతం జ్ఞేయం తదపి కుష్ఠితమ్. 38

తా. మిగుల కుష్ఠరోగముచే పీడితులగు స్త్రీపురుషులయొక్క దుష్టములగు శుక్లశోణితమువలన జనించెడి సంతానమునకు సగా కుష్ఠము జనించునని తెలియవలయు. (మరియు నీకుష్ఠబాహుళ్యముచే బీజనష్టముగలుగు. అటులగాకయుండిన కలిగెడు సంతానమునకు కుష్ఠరోగముగలదనుట.)

సాధ్యాసాధ్యములు

ఉదుంబరం తత్సదృశం శ్విత్రం స్యాచ్ఛంఖసన్నిభమ్,
కాకణం పక్వగుంజాభం చర్మాఖ్యం గజచర్మవత్, 39
పుండరీకం స్వసంజ్ఞాభం ఋశ్యజిహ్వం తథైవచ,
బహువ్రణం శతారుస్స్యాదేకాఖ్యం మత్స్యశుక్తివత్. 40
పాణిభేదశ్చర్మదళం పాదభేదో విపాదికా,
దశైతాని న సాధ్యాన్తే శేషాన్యష్టౌ చ సాధ్యవత్. 41
కపాలమసితం రూక్షం విస్ఫోటాఖ్యం విసర్పవత్,
కిటిభం కిణవచ్ఛ్యామం దద్రుస్స్యాత్త్వచి పాకవత్. 42
తుంబీపుష్పనిభం సిధ్మస్నిగ్ధం స్యాన్మండలం స్థిరమ్,
విస్ఫోటదారుణా పామా సానుస్రావా విచర్చికా. 43

తా. ఉదుంబరకుష్ఠువు మేడిపండువర్ణముగను, శ్విత్రకుష్ఠువు శంఖవర్ణముగను, కాకణకుష్ఠువు పండిన గురివిందవర్ణముగను, చర్మకుష్ఠువు గజచర్మతుల్యముగను, పుండరీకకుష్ఠువు తెల్లదామరరేకులతో సమానముగను, ఋష్యజిహ్వాకుష్ఠువు దుప్పినాలుకతో తుల్యంబుగను, శతారుకుష్ఠువు బహువ్రణములతో గూడినదిగను, ఏకాఖ్య

కుష్ఠువు చేపచిప్పతో సమముగను, చర్మదళకుష్ఠువు నరచేతులు దట్టమైపగిలినటులను. వైపాదికకుష్ఠువు కాళ్లుపగిలినటులను ఇటులనుండు నీపదియు నసాధ్యంబులు. మరియు కపాలకుష్ఠువు నల్లనై రూక్షముగను, విస్ఫోటకుష్ఠువు విసర్పితో తుల్యముగను, కిటిభకుష్ఠువు మచ్చలతోగూడి నల్లగను, దద్రుకుష్ఠువు పొక్కులతో గూడినదిగను, సిధ్మకుష్ఠువు సొరపువ్వుతో సమముగను, మండలకుష్ఠువు ఎరుపు కాఠిన్యము ఇవి గలదిగను, పామాకుష్ఠువు దారుణమగు పొక్కులతో గూడినదిగను, విచర్చికాకుష్ఠువు పులిసీరు కార్చునదిగనునుండు. ఈ రా కుష్ఠువులు సాధ్యంబులు.

ప్రకారాంతరముగ కుష్ఠరోగ సాధ్యాసాధ్యములు

సాధ్యం త్వగ్రక్తమాంసస్థం వాతశ్లేష్మాధికం చ యత్,
మేదస్యద్వంద్వజం యాప్యం వర్జ్యం మజ్జాస్థిసంశ్రితమ్. 44
కృమిహృల్లాసమందాగ్నిసంయుక్తం యత్త్రిదోషజమ్,
ప్రభిన్నం ప్రస్తుతాంగం చ రక్తనేత్రం హతస్వరమ్. 45
పంచకర్మగుణాతీతం కుష్ఠం హన్తీహ కుష్ఠినమ్,

తా. త్వగ్రక్తమాంసధాతువులవరకు వ్యాపించియుండుకుష్ఠువు, వాతకఫములు ప్రధానంబుగనుండు కుష్ఠువు ఇవి సాధ్యంబులు. మరియు మేదోధాతుగతకుష్ఠువు ద్వంద్వజకుష్ఠువు యాప్యంబులు. మరియు మజ్జా, అస్థిధాతువులవరకు వ్యాపించియుండు కుష్ఠువు కృమి హృల్లాసము మందాగ్ని వీనితో గూడియుండు కుష్ఠువు త్రిదోషజకుష్ఠువు ఇవి అసాధ్యంబులు. కుష్ఠువుపగిలి నీరు కారుచుండునట్టి ఎఱ్ఱని నేత్రములుగలట్టి కుష్ఠురోగియు, హీనస్వరముగల కుష్ఠురోగియు వమన విరేచనాది పంచకర్మలకనర్హుడగు కుష్ఠురోగియు వీరలు మృతులగుదురు.

అసాధ్యశ్విత్రకుష్ఠలక్షణము

గుహ్యపాణితలోష్ఠేషు జాతమప్యచిరంతనమ్. 46
వర్జనీయం విశేషేణ కిలాసం సిద్ధిమిచ్ఛతా,

తా. గుహ్యము అరచెయ్యి పెదవి వీనియందుబుట్టిన శ్విత్రకుష్ఠువు తత్కాలమున జనించినదైనను విశేషముగ కీర్తిని యిచ్ఛయించు వైద్యుడు విడువవలయు.

ద్విలింగం చ భవేత్కుష్ఠం విశేషేణ త్యజేద్బుధః. 47
బహూపద్రవసంయుక్తమసాధ్యముదితం బుధైః,

తా. ద్వంద్వలక్షణములతో గూడియుండు కుష్ఠువును వైద్యుడు విడువవలయు. మరియు బహూపద్రవములతో గూడియుండు కుష్ఠురోగం బసాధ్యంబని తెలియవలయు.

వాతాదిజన్యకుష్ఠువులవివరణము

వాతేన కుష్ఠం కాపాలం పిత్తేనౌదుంబరం కఫాత్. 48
మండలాఖ్యం విచర్చీం చ రుష్యాఖ్యం వాతపిత్తజమ్,
చర్మైకకుష్ఠం కిటిభం సిధ్మాలసవిపాదికాః. 49
వాతశ్లేష్మోద్భవాః శ్లేష్మపిత్తాద్దద్రుశతారుషీ
పుండరీకం సవిస్ఫోటం పామాచర్మదళం తథా,
సర్వైస్స్యాత్కాకణం పూర్వం త్రికం దద్రుసకాకణమ్. 50
పుండరీకర్ష్యజిహ్వే చ మహాకుష్ఠాని సప్త తు,

తా. వాతదోషమువలన కపాలకుష్ఠువును, పిత్తదోషమువలన ఔదుంబరకుష్ఠువును, కఫదోషమువలన మండలకుష్ఠువును, వాతపిత్తదోషమువలన విచర్చి ఋశ్యాఖ్యకుష్ఠువులును, వాతకఫదోషమువలన చర్మకుష్ఠువు, కిటిభకుష్ఠువు, సిధ్మకుష్ఠువు అలసకుష్ఠువు, విపాదికకుష్ఠువును, శ్లేష్మపిత్తదోషమువలన దద్రుకుష్ఠువు శతారుకుష్ఠువు, పుండరీకకుష్ఠువు. విస్ఫోటకుష్ఠు, పామాకుష్ఠువు, చర్మదళకుష్ఠువును, త్రిదోషమువలన కాకణకుష్ఠువు ఇటుల జనించు. మరియు మొదటిదగు కపాల, ఔదుంబర, మండలకుష్ఠములు, దద్రు, కాకణ, పుండరీక, ఋశ్యజిహ్వ ములను నీ ౭ - ను మహాకుష్ఠువులని తెలియవలయు.

గిలాసకుష్ఠనిదానము

కుష్ఠైకసంభవం శ్విత్రం కిలాసం చారుణం భవేత్. 51
నిర్దిష్టమపరిస్రావి త్రిధా తూద్భవసంశ్రయమ్,

తా. విరుద్ధాశనము, పాపకర్మాదికారణములు వీనివలన (శ్విత్రము అనగా) తెల్లకుష్ఠము, (కిలాసమనగా) యెఱ్ఱకుష్ఠువు ఇవి జనించు. ఇవి స్రావరహితములుగ నుండు. మరియు త్రిదోషములచే రక్తమాంస మేదస్సుల నాశ్రయించియుండు.

వాతాదిభేదలక్షణములు

వాతాద్రూక్షారుణం పిత్తాత్తామ్రం కమలపత్రవత్. 52
సదాహం రోమవిధ్వంసి కఫాచ్ఛ్వేతం ఘనం గురు,
సకండురం క్రమాద్రక్తమాంసమేదస్సు చాదిశేత్. 53
వర్ణేనైవేదృగుభయం కృచ్ఛ్రం తచ్ఛ్విత్రరోత్తరమ్,

తా. ఈ శ్వేతకుష్ఠము వాతమువలన రూక్షముగను, యెఱ్ఱగను, పిత్తమువలన యెఱ్ఱతామరరేకులవలెను, దాహము, రోమములు వీడిపోవుట, కఫమువలన తెల్లగను, బరువుగను, దట్టముగను, దురదగలదిగను నుండు. మరియు నీకృమముగ

వాతాదిదోషములు రక్తాశ్రితములైయుండిన యెఱ్ఱగను, మాంసాశ్రితములైయుండిన గౌరవర్ణముగను, మేదాశ్రితములైయుండిన తెల్లగను నుండునని తెలియవలయు.

శ్విత్రసాధ్యాసాధ్యలక్షణము

అశుక్లరోమాబహుళమసంశ్లిష్టమథోనవమ్. 54
అనగ్నిదగ్ధజం సాధ్యం శ్విత్రకుష్ఠమతోన్యథా,

తా. శ్విత్రకుష్ఠములుగ వెంట్రుకలు తెలుపుబారకను, సన్నమై యొకటితో నొకటి కలియికను, నవీనముగను, కాలుటచే తెల్లబడకను నుండినచో అట్టికుష్ఠము సాధ్యము. వీనికి విపరీతములుగ నుండిన అసాధ్యమని తెలియవలయు.

కుష్ఠమున సంసర్గజత్వము

ప్రసంగాద్గాత్రసంస్పర్శాన్నిశ్వాసాత్సహభోజనాత్. 55
సహశయ్యాసనాచ్చాపి వస్త్రమాల్యానులేపనాత్,
కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యందఏవచ. 56
ఔపసర్గికరోగాశ్చ సంక్రామన్తి నరాన్నరమ్,

తా. కుష్ఠువు, జ్వరము, క్షయ, నేత్రరోగము, ఇవి అట్టివి గలవార్లతో సాంగత్యము సేయుట, శరీరమును స్పృశించుట, వారి నిశ్వాసములు సోకుట, ఏక పాత్రములో భుజించుట, ఒకటిగ పరుండుట, పక్కఆసనమున నేకముగ కూర్చుండుట, వారుగట్టుకొనిన వస్త్రమునుగట్టుగొనుట, వారుధరించిన పుష్పములధరించుట, వారు తాకిన గంధమలదికొనుట, ఇట్టి కారణములవలన, నొకనివలన మరియొకనికి జనించునని తెలియవలయు.

శ్వేతకుష్ఠ చికిత్సత్వము.

శ్వేతశ్విత్రాదికుష్ఠాని హ్యసాధ్యాని ప్రయత్నతః. 57
తస్మాత్తేషాముపాయశ్చ నాత్రైవ లిఖితో మయా,

తా. శ్వేతశ్విత్రాదికుష్టువులు, అసాధ్యములుగాన, వానికి, నివర్తకోపాయము, ఇక్కడ చెప్పలేదని తెలియవలయు.

మంజిష్ఠాదికషాయము.

మంజిష్ఠాపిచుమందచందనఘనచ్ఛిన్నాగవాక్షీవృషా. 58
త్రాయన్తీ త్రివృతానటద్విరజనీభూనింబపాఠావిషాః,
గాయత్రీ త్రిఫలాపటోలకటుకాకీటద్విషత్పర్పటా. 59
ఉగ్రావల్గుజబీజవత్సకయుతాః క్వాథం విదధ్యాద్భిషక్,

కండూమండలపుండరీకకిటిభైః పామావిచర్చీవ్రణై స్సిధ్మ. 60
శ్విత్రకిలాసదద్రుభిరపి వ్యాప్తాఖిలాంగస్స్వయమ్,
కించాన్యత్క్రిమిభిర్విశీర్ణగలితఘ్రాణాంఘ్రిపాణిర్భవే. 61
దేనం ప్రాప్య మహాకషాయమచిరాత్ పంచేషుతుల్యో నరః,

తా. మంజిష్ఠ, వేపయీనెలు, రక్తచందనము, తుంగముస్తలు, తిప్పతీగ, తెల్లదింటెన, అడ్డసరము, కలుగ్రానుగు, తెగడ, దుండిగము, పసపు, మానిపసపు, నేలవేము, విషబొద్ది, అతివస, చండ్ర, త్రిఫలములు, చేదుపొట్ల, కటుకరోహిణి, వాయువిడంగములు, పర్పాటకము, వస, భావంచివిత్తులు, కొడిశపాలపట్ట, వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన, దురద, మండలకుష్ఠము, పుండరీకము, కిటిభకుష్ఠము, పామాకుష్ఠువు, విచర్చికాకుష్ఠము, వ్రణము, సిధ్మకుష్ఠము, శ్విత్రికుష్ఠము, కిలాసము, దద్రువు, వీనిచే, వ్యాప్తములగు శరీరముగలట్టియు, కృములచే వ్యాప్తములయి నాసికము, పాదములు, హస్తములు, ఇవి తెగిపోయినట్టియు నరుడు. ఈ కషాయమును బుచ్చుకొనిన, సకలరోగములు నశించి, మన్మథతుల్యుడుగనుండు.

### లఘుమంజిష్ఠాదికషాయము

మంజిష్ఠా కుటజా మృతా ఘనవచా శుంఠీ హరిద్రాద్వయమ్. 62
క్షుద్రారిష్టపటోలకుష్ఠకటుకాభార్గీవిడంగాన్వితాః,
మూర్వాదారుకలింగభృంగ మగధా త్రాయన్తి పాఠావరీ. 63
గాయత్రీ త్రిఫలాకిరాతకమహానింబాసనారగ్వధాః,
శ్యామావల్గుజచందనై ర్వరుణకం పూతీకశాఖోటకే. 64
వాసాపర్పటసారిబా ప్రతివిషానంతావిశాలాజలమ్,
మంజిష్ఠాదిమిమంకషాయవిధినా నిత్యం పుమాన్యః పిబేత్. 65
త్వగ్దోషానచిరేణ యాన్తి విలయం కుష్ఠాని చాష్టాదశ,

తా. మంజిష్ట, కొడిశపట్ట, తిప్పతీగె, తుంగముస్తలు, వస, శొంఠి, పసపు, మానిపసపు, వాకుడు, వేప, చేదుపొట్ల, చంగలికోష్టు, కటుకరోహిణి, భారంగి, వాయువిడంగములు, చాగ, దేవదారు, చేదుపుచ్చ, గుంటగలగర, పిప్పళ్లు, కలుక్రానుగ విషబొద్ది, చల్లపిల్లిగడ్డలు, చండ్ర, త్రిఫలములు, నేలవేము, మహానింబ, (తురకవేప) వేగిస, రేల, నల్లతెగడ, భావంచివిత్తులు, రక్తచందనము, వులిమిడి, కంపుకానుగ, శాఖోటకము, (బేకు) అడ్డసరము, పర్పాటకము, సుగంధిపాల, అతివస, దూలగొండి, పాపర, కురువేరు వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన త్వగ్దోషము; అష్టాదశ కుష్ఠువులు ఇవి నివర్తించు.

శుంఠ్యాదికషాయము

శుంఠీనింబకిరాతతిక్తకకణాపాఠా హరిద్రాద్వయమ్. 66
త్రాయంతీ త్రిఫలామృతాబ్దకటుకా వాసావచా వాకుచీ,
మంజిష్ఠాతివిషాదురాలభమహానింబాగ్నిషడ్గ్రంథికా. 67
వ్యాధిఘ్నాగజచిర్భటాసకుటజాభార్గీసముస్తాయవాః,
మూర్వాచైవ పటోలపత్రసహితా రక్తం తథా చందనమ్. 68
శ్యామాపర్పటసారిబాకృమిహరా గాయత్రికాసంయుతా,
గోమూత్రేణ మహాకషాయమరుణోద్భూతే పిబేద్యః పుమాన్. 69
తస్యాష్టాదశ యాన్తి నాశమచిరాత్కుష్ఠాని దుష్టాన్యపి,

తా. శొంఠి, వేప, నేలవేము, పిప్పళ్లు, విషబొద్ది, పసపు, మానిపసపు, కలుగ్రానుగ, త్రిఫలములు, తిప్పతీగె, తుంగముస్తలు, కటుకరోహిణి, అడ్డసరము, వస, బావంచి విత్తులు, మంజిష్ఠ, అతివస, దూలగొండి, పెద్దవేము, చిత్రమూలము, నల్ల అతివస, శేల, గజచిర్భట (పాపరబుడమ) కొడిశపాల, భారంగి, భద్రముస్తలు, యవలు, చాగ, చేదుపొట్లఆకు, రక్తచందనము, నల్లతెగడ, పర్పాటకము, సుగంధపాల, వాయువిడంగములు, చంద్ర, వీనిని సమాంశములుగ, గోమూత్రమునందు వైచి, కషాయము కాచి, ప్రాతఃకాలమునందు పుచ్చుకొనిన, దుష్టములగు, అష్టాదశ కుష్టువులు నివర్తించు.

కఫపిత్తకుష్టువులకు త్రిఫలాదికషాయము

త్రిఫలా నింబపటోలం మంజిష్ఠా రోహిణీ వచా రజనీ, 70
ఏమకషాయోభ్యస్తో నిహన్తి కఫపిత్తజం కుష్టమ్,

తా. త్రిఫలములు, వేప, చేదుపొట్ల, మంజిష్ఠ, కటుకరోహిణి, వస, పసపు, వీనిని కషాయము బెట్టి పుచ్చుకొనిన కఫపిత్తజ కుష్ఠువు నివర్తించు.

ఖాదిరాష్టకకషాయము

ఖాదిరత్రిఫలానింబపటోలారిష్టవాసకైః. 71
అష్టకోయం జయేత్కుష్ఠాన్ కండూవిస్ఫోటకాదికాన్,

తా. చంద్ర, కరక, తాడి, ఉశిరికెలు, వేప, చేదుపొట్ల, తిప్పతీగె, అడ్డసరము, వీనిని ఎనిమిదిటిని కషాయము బెట్టి పుచ్చుకొనిన కుష్ఠువులు, కండు, విస్ఫోటకము మొదలగునవి నివర్తించు.

గుడూచ్యాదికషాయము

గుడూచీ త్రిఫలా దార్వీకాథశ్శ్లేష్మ సమాంశతః. 72

త్వగ్దోషవ్రణశోఫఘ్నః పీతో మాసం సగుగ్గులుః,

తా. తిప్పతీగె, త్రిఫలములు, మానిపసపు, వీనిని సమాంశముగ కషాయము బెట్టి, అందు గుగ్గులచూర్ణమును కలిపి, యొకమాసము పుచ్చుకొనిన, త్వగ్దోషము, వ్రణశోఫ, ఇవి నివర్తించు.

కపాలకుష్ఠమునకు సోమేశ్వరరసము

శుద్ధసూతం మృతం చాభ్రం గంధకం మర్దయేత్సమమ్. 73
దినం నిర్గుండికాద్రావైర్మూషాస్థం భూధరే పచేత్,
ఉద్ధృత్య వాకుచీతైలే వాకుచ్యావాకషాయకే. 74
భావితం శోషయేద్ఘర్మే నిష్కమాత్రం తు భక్షయేత్,
వాకుచీం కాకమాచిం చ త్రిఫలాం చూర్ణయేత్సమమ్. 75
మధ్వాజ్యే కర్షమాత్రే చ లేహయేదనుపానతః,
కపాలం విషమం కుష్ఠం హన్తి సోమేశ్వరో రసః. 76

తా. శుద్ధిచేసినరసము, అభ్రకభస్మము, శుద్ధగంధకము, వీటిని సమాంశములుగ ఖల్వమునందునిచి, వావిలియాకురసముతో నొకదినము మర్దించి, మూసయందునిచి, దానిముఖమును మూసి, భూధరపుటమిడి, సాంగశీతలమునదీసి, భావంచి విత్తులతైలమునగాని వానికషాయమునగాని ఒకదినము భావనజేసి యెండలో నునిచి, నిష్కప్రమాణమాషధమును భావంచివిత్తులు, కాచియాకు, త్రిఫలములు, వీనిని సమముగచూర్ణించి, కర్షప్రమాణచూర్ణములో, తేనె, నెయ్యికలిపి, యీ అనుపానముతో పుచ్చుకొనిన, కపాలకుష్ఠువు, విషమకుష్ఠువు ఇవి నివర్తించు. ఇది సోమేశ్వరరసమన బడును.

ఔదుంబరకుష్ఠువునకు కనకసంకోచరసము

మృతతామ్రాభ్రకే తుల్యం ద్వాయోస్సూతం చతుర్గుణమ్,
యామైకం మర్దయేత్ఖల్వేచామ్లపిష్టం చ గోళకం. 77
త్రిభిస్తుల్యం శుద్ధగంధం లోహపాత్రాంతరే క్షిపేత్,
తన్మధ్యే గోళకం క్షిప్త్వా యావజ్జీర్ణం తు గంధకమ్. 78
తావన్మృద్వగ్నినా పక్త్వా సముద్ధృత్య విచూర్ణయేత్,
గుగ్గులుం నింబపంచాగం త్రిఫలాం చామృతం విషామ్. 79
పటోలం ఖాదిరం సారం వ్యాధిఘాతం క్షిపన్ సమమ్,
తచ్చూర్ణం మధునా లేహ్యం నిష్కమౌదుంబరాపహామ్. 80

తా. తామ్రభస్మము ౧ భాగము అభ్రకభస్మము ౧ భాగము రసభస్మము ౪

భాగములు వీనిని ఖల్వమునందువైచి విష్ణుక్రాంత డావరడంగి సర్పాక్షి చిత్రి అవిసె నీలి మండూకబ్రహ్మి మోదుగ వీనిరసముతో ప్రత్యేక మొక్కొక కర్షామ మర్దించి ముద్దజేసి ౧౦ భాగములు శుద్ధగంధకమును ఇనుపగిన్నెలోవైచి దానిపైన ముద్దనునిచి మరల దానిపై గంధకమునువైచి గంధకము జీర్ణమగుపర్యంతము మృద్వగ్నితో వండి స్వాంగశీతలమున దీసి ఖల్వమునచూర్ణించి శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గిలము * వేపపంచాగములు త్రిఫలములు శుద్ధిచేసిననాభి అతివస చేదుపొట్ల చంద్రతీగరేల వీనిని సమాంశములుగ చూర్ణించి అందుకలిపి నిష్కమాత్రము తేనెతో ప్రాతస్సాయంకాలములయందు ౧౨ మాసములు పుచ్చుకొనిన ఔదుంబర కుష్ఠము మానును.

### మండలకుష్ఠమునకు కామధేనురసము

శుద్ధసూతాద్ద్విధా గంధం లోహపాత్రే క్షణం పచేత్,
శీతలం చూర్ణయేత్ఖల్వే బద్ధ్వా వస్త్రే చతుర్గుణే. 81
శోషయేత్పాచయేత్పశ్చాద్దశాంశం వత్సనాభకమ్,
క్షిప్త్వా సర్వం త్ర్యహం భావ్యం తైలైర్వాకుచిజైర్భవేత్. 82
కామధేనురసో నామ్నా మాసేవై. మండలాపహమ్,
గుగ్గులు త్రిఫలాగంధం సమమేరండతైలకమ్. 83
ద్వినిష్కమనుపానం స్యాన్నిష్కం మండలకుష్ఠనుత్,

తా. శుద్ధిచేసినరసము ౧ భాగము శుద్ధగంధకము ౨ భాగములు ఈరెంటిని ఖల్వములో మర్దించి ఇనుపగిన్నెలో నునిచి క్షణకాలము పచనచేసి చల్లార్చి ఖల్వమునందునిచి చూర్ణించి నాలుగు మడతల గుడ్డయందునిచి మూట గట్టి చీలమన్ను ఇచ్చి ఒండించి పావికలో పాకముజేసి పిదప పైజెప్పిన ఔషధమునకు పది యవభాగము శుద్ధిచేసిన నాభికలిపి భావంచివిత్తులతైలముతో మూడుదినములు భావనచేసి ఒకనిష్కమెత్తును, శుద్ధిచేసిన మహిసాక్షి గుగ్గిలము, త్రిఫలములు, గంధకము ఆముదము వీనిని సమముగచేర్చి అది రెండు నిష్కముల అనుపానముతో పుచ్చుకొనిన ఒక నెలలో మండలకుష్ఠము మానును, ఇది కామధేను రసమనబడును.

### ఋష్యజిహ్వాకుష్ఠమునకు శైలేంద్రరసము

శుద్ధసూతం సమం గంధం కాన్తభస్మ విషం తథా. 84
వాకుచీత్రిఫలా చూర్ణం నింబవహ్నిగుడూచిజైః,
దినభృంగీద్రవైర్మర్ద్యం వాకుచ్యాశ్చ కషాయకైః. 85
భక్షయేల్లోహపాత్రస్థం కర్షార్ధం జిహ్వకాప్రణుత్,

* వేరు, పట్ట, ఆకు, పూవు, దండు.

గుంజాభల్లాతతైలాభ్యాం నిష్కం వాకుచి చూర్ణకం. 86
లేపయేదను సర్వాంగం సర్వకుష్ఠవినాశనః,
శైలేంద్రరసనామాయం శైలేన్ద్రతనయోదితః. 87

తా. శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినగంధకము, కాంతభస్మము, శుద్ధిజేసిననాభి, భావంచివిత్తులచూర్ణము, త్రిఫలచూర్ణము, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి, చిత్రమూలము, వేప, తిప్పతీగె, గుంటగలగర, వీనిరసము, భావంచి విత్తులకషాయము, వీనితో ప్రత్యేకము. నొక్కొకదినము మర్దించి, ఇనుపపాత్రయందునిచి, అర్ధకర్షమును సేవించి మరియు, గురిగింజవిత్తులు, జీడివిత్తులు, వీనితైలములో నిష్కమాత్రము, భావంచివిత్తుల చూర్ణమునుగలిపి శరీరమునకు లేపనముజేసిన బుష్యజిహ్వాకకుష్ఠము, సర్వకుష్ఠములు నివర్తించు. ఇది పార్వతీదేవి వచించిన శైలేంద్రరసము.

పుండరీకకుష్ఠువునకు సర్వాంగసుందరరసము

విష్ణుక్రాన్తా దేవదాళీ సర్పాక్షీ మునితండులీ,
నీలి బ్రాహ్మీ పలాశానాంయథాలాభం ద్రవం హరేత్. 88
ద్విత్రాణామేవ నిర్యాసైస్సూతకం మర్దయేద్దినమ్,
సూతకాద్ద్విగుణం గంధమేకీకృత్య క్షణం పచేత్. 89
లోహపాత్రే ధృతం యావత్తథా శుల్బాభ్రకామృతం,
కర్పూరంచైవ పాదాంశం పృథక్సూతస్యనిక్షిపేత్. 90
పుండరీకాహరేన్నిష్కమనుపానవిశేషతః,
సర్వాంగసుందరో నామరసశ్శంభువినిర్మితః. 91

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధగంధకము ౨ భాగములు, వీనిని ఖల్వమునందునిచి, విష్ణుక్రాంత, దావరడంగి, సర్పాక్షి, చిట్రి, అవిసె, నీలి, మండూకబ్రహ్మిమోదుగ, వీనిలో సంభవించినవన్నియుగాని రెండుమూడుగాని గ్రహించి,రసముదీసి, ఆరసములచేగాని దానికషాయముచేగాని ప్రత్యేకము, నొక్కొక దినము మర్దించి, ముద్దజేసి, ఇనుపపాత్రలోనునిచి క్షణకాలము పక్వంబొనర్చి, ఖల్వమునందునిచి అందు తామ్రభస్మము, అభ్రకభస్మము, శుద్ధిచేసిననాభి పాంతికకర్పూరము, వీనిని ప్రత్యేకము, రసమునకు నాలవభాగముగలిపి, నూరి నిష్కమాత్రము మాత్రలుజేసి (బాడిశుపాకురసముతో, ఒకటిన్నర సంవత్సరము) పుచ్చుకొనిన పుండరీకకుష్ఠము మానును. ఇది శంభునిర్మితమైన సర్వాంగసుందరరసము.

సిధ్మకుష్ఠమునకు భేతాళలేహ్యము (లేక) రసము

అభ్రకం మృతలోహం చ శుద్ధసూతం శిలాజతు,

తాప్యం చాంకోలబీజాని త్రిఫలా ముసలీసమమ్. 92
సవ్యోషం చూర్ణితం లేహ్యాం మధునా నిష్కమాత్రకం,
మాసైకం నాశయేత్సిధ్మ భేతాళోయం మహారసః. 93

తా. అభ్రికభస్మము, లోహభస్మము, శుద్ధరసము, శుద్ధిజేసిన శిలాజిత్తు, స్వర్ణమాక్షికభస్మము, ఊడుగవిత్తులు, త్రిఫలములు, నేలతాడిగడ్డ, వీనిని సమభాగములుగ చూర్ణించి, అందు త్రికటుకచూర్ణమునుగలిపి, నిష్కప్రమాణము, తేనె యనుపానముతో నొకమాసము సేవించిన సిధ్మకుష్ఠము నివర్తించు. ఇది భేతాళరసమని కూడ జెప్పబడు.

కాకణకుష్ఠమునకు సూర్యక్రాంతరసము

పలత్రయం మృతాత్తామ్రాత్సూతస్యైకం బలేర్ద్వయమ్,
త్రికటుత్రిఫలాచూర్ణం ప్రత్యేకం స్యాత్పలం పలమ్. 94
నిర్గుండ్యా చార్ద్రికద్రావైర్వహ్నిద్రావైర్విమర్దయేత్,
దినైకం తం నిరుధ్యాథ తుషాగ్నౌ చ పచేద్దినమ్. 95
సముద్ధృత్య విచూర్ణ్యాథ వాకుచీతైలయోగతః,
త్రిదినం భావయేత్తత్తు నిష్కమాత్రం చ భక్షయేత్. 96
కుష్ఠం చ కాకణం హన్తి సర్వకుష్ఠం నిహన్త్యలమ్,
సూర్యక్రాన్తరసో నామ్నా సూర్యదేవేన నిర్మితః. 97

తా. తామ్రభస్మము 3 పలములు, శుద్ధిచేసినరసము ౧ పలము, శుద్ధగంధకము ౨ పలములు, త్రికటుకచూర్ణము ౧ పలము, త్రిఫలముచూర్ణము ౧ పలము, వీనిని ఖల్వమున వైచి. వావిలి, అల్లము, చిత్రమూలము, వీనిరసములతో ప్రత్యేకమొక్కొకదినము మర్దించి, ఇసపపాత్రలో నునిచి, పైనమూసి, తుషాగ్నిచే నొకదినము పక్వముజేసి, సాంగశీతలమునదీసి, మరల, ఖల్వమునందునిచి, భావంచివిత్తుల తైలముతో, 3 దినముల భావనజేసి, నిష్కప్రమాణము చొప్పున, ౧ా మాసములు) పుచ్చుకొనిన, కాకణకుష్ఠము, సర్వకుష్ఠములు నివర్తించు. ఇది సూర్యదేవునిచే నిర్మింపబడిన సూర్యక్రాంతరసమనబడును.

గజచర్మకుష్ఠమునకు లంకేశ్వరరసము

పలైకం శుద్ధసూతం చ కర్షైకం శుద్ధగంధకమ్,
గంధతుల్యం మృతం తామ్రం సూతాంశం మర్దయేద్విషం. 98
సర్వతుల్యం పునర్గంధం దత్వా కించిద్విమర్దయేత,
ఘృతాభ్యక్తే లోహపాత్రే పచేద్యావద్ద్రుతం భవేత్. 99

రంభాపత్ర పుటీచాథ పాతయేత్పర్పటీం యథా,
మాషైకం చూర్ణితం ఖాదేద్గజచర్మ నియచ్ఛతి. 100
నిష్కైకం వాకుచీక్షౌద్రై ర్లిహేత్స్యాలంకేశ్వరో రసః,

తా. శుద్ధరసము ౧ పలము, శుద్ధగంధకము ౧ కర్షము, తామ్రభస్మము ౧ కర్షము, శుద్ధిజేసిననాభి ౧ పలము, వీనిని ఖల్వములోవైచి మర్దించి, దీనికిసమము, తిరిగి గంధకమునుజేర్చి మర్దించి, నెయ్యిబూసిన ఇనపపాత్రమునందునుంచి, కరిగించి దించి, అరటియాకులో పోసి బిళ్లలుజేసిపునిచి దానిని చూర్ణముచేసి, నిష్కమాత్రను సేవించి, తోడనే, భావంచి విత్తులచూర్ణము, తేనెతో కలిపి పుచ్చుకొనిన, నొకనెలలో గజచర్మకుష్ఠము నివర్తించు. ఇది లంకేశ్వరరసము.

## కిటిభకుష్ఠమునకు - వజ్రపాణిరసము

శుద్ధసూతం మృతం చాభ్రం మృతం తామ్రం విషం సమమ్. 101
మర్దయేద్వాకుచీతైలే యామైకం కృతగోళకమ్,
ద్విగుణే పాచయేద్గంధే సతైలే లోహపాత్రకే. 102
గంధతైలే విజీర్ణే తు తద్గోళాంశం మృతాయసమ్,
పంచాంగనింబసంయుక్తం మధునా గోళకీకృతమ్. 103
నిష్కైకం కిటిభం హన్తి వజ్రపాణిర్మహారసః,
నిశాంకణాంనాగరం చ వేల్లంచిత్రకతాప్యకే. 104
క్రమోత్తరగుణం పిష్ట్వా గోమూత్రేణ పిబేదను,

తా. రసభస్మము, అభ్రికభస్మము, తామ్రభస్మము. శుద్ధిజేసిననాభి, వీనిని సమాంశములుగ ఖల్వమునందునిచి భావంచివిత్తులతైలముతో నొకయామము నూరి గుళికజేసి ఇనపపాత్రములోనునిచి దానికి రెండింతలు శుద్ధగంధకము, నూనె వీనిని గలిపి గంధకము నూనె జీర్ణమగువరకువండి ముద్దజేసి దానికి సమము అయోభస్మము వేపపంచాంగముల చూర్ణముగలిపి తేనెతో నూరి నిష్కప్రమాణను వటుకములు జేసి అందొకమాత్రనుపుచ్చుకొని వెనుక పసపు ౧ భాగము, పిప్పళ్లు ౨ భాగములు, శొంఠి 3 భాగములు, వాయువిడంగములు ౪ భాగములు. చిత్రమూలము ౫ భాగములు, శుద్ధిచేసిన హేమమాక్షికము ౬ భాగములు, వీనిని గోమూత్రముతో నూరి తాగిన కిటిభ కుష్ఠము నివర్తించు.

## వైపాదికకుష్ఠమునకు మహాకౌళరసము.

శుద్ధసూతం మృతం తామ్రం కుష్ఠం గంధకటంకణే. 105
పిప్పలీ చ సమం మర్ద్యం మాతులుంగద్రవైర్దినమ్,

త్రిఫలాం సర్వతుల్యాంశామేకీకృత్య చ నిక్షిపేత్. 106
మృద్భాండేనిష్కమేకంచ లిహేద్వాకుచికారసైః,
కుష్ఠం వైపాదికం హన్తి మహాకాళరసోహ్వయమ్. 107
ద్విగుంజం భక్షయేన్నిత్యం తథా విజయపర్పటీమ్,
మాలార్జునం పటుం వహ్నిశాల్మలీభృంగముండికాః. 108
కురంటంనింబపంచాగం నిర్గుండీంవాకుచీం సమం,
మధ్వాజ్యైర్లేహయేత్కర్షమనుస్యాత్సర్వకుష్ఠనుత్. 109

తా. శుద్ధరసము, తామ్రభస్మము, చంగల్వకోష్టు, శుద్ధగంధకము, వెలిగారము, పిప్పళ్లు, వీనిని సమభాగములు జేర్చి ఖల్వమునందునిచి మాదీఫలరసముచే నొకదినమునూరి దీనికిసమము త్రిఫలచూర్ణమును గలిపినూరి మట్టికుండలో నునిచినిష్కమాత్రము భావంచివిత్తులరసముతో సేవించిన వైపాదికకుష్ఠము నివర్తించు. మరియు మాలార్జునము (కాచు) సైంధవలవణము, చిత్రమూలము, బూరుగ, గుంటగలగర, బోడతరము, గోరింట, వేపపంచాంగములు, వావిలి బావంచివిత్తులు వీనిని సమముగ కర్షమాత్రముగ గ్రహించి, తేనె నెయ్యి వీనితోనూరి రెండు గురిగింజలయెత్తు విజయపర్పటీరసమును గలిపి ౧౨ నెలలు పుచ్చుకొనిన సర్వకుష్ఠవులు మానును.

విచర్చికాకుష్ఠమునకు - కుష్ఠనికృంతనరసము

శుద్ధసూతం విషం గంధం తుల్యం తాప్యం శిలాజతు,
శుల్బం తీక్ష్ణం మృతం లోహం సర్వం మర్ద్యం దినత్రయమ్. 110
కాకమాచీదేవదాళ్యోఃకటిల్లస్యద్రవైర్దృఢమ్,
మూషాయాం భూధరే పాచ్యం త్రిదినం తు తుషాగ్నినా. 111
నిష్కార్ధం లేహయేత్క్షౌద్రైరసం కుష్ఠనికృంతనమ్,
భల్లాతవాకుచీపథ్యావిడంగంలాంగలీతిలాః, 112
జీరకం బదరీమూలం తుల్యం తుల్యం గుడం సమమ్,
భక్షయేదనుపానేన హన్తి కుష్ఠం విచర్చికామ్. 113

తా. శుద్ధిచేసినరసము, శుద్దిచేసిననాభి, శుద్ధగంధకము, శుద్ధిచేసిన స్వర్ణమాక్షికము, శుద్ధిచేసినశిలాజిత్తు. తామ్రభస్మము, ఉక్కుభస్మము, లోహభస్మము వీనిని సమాంశములుగ ఖల్వమునందునిచి, కొంచివేళ్లు, డావరడంగి, కాకరాకు వీనిరసము లచే ప్రత్యేకము 3 దినములు మర్దించి ముద్దలుచేసి మూసయందునిచి ముఖమును బంధించి ౧ దినము భూధరపుటమున 3 దినములు తుషాగ్నిలో పక్వముచేసి 4 నిష్కమా

ఇదం కాలానలం తైలం వాతం కుష్ఠం నియచ్ఛతి,

తా. రసము, గంధకము, నాభి, తాళకము, వీనిని కలితోనూరి తెల్లని వస్త్రమునకు బట్టించి వత్తిగాజుట్టి ఆవత్తినినూనెలోతడిపి నానవిచ్చి గరిటెలోబెట్టి ముట్టించి తలక్రిందుగా నొకకుండలో బట్టి అందు స్రవించుతైలమును శరీరమునకు లేపనము చేసిన వాతముకుష్ఠము నివర్తించు. (ఈతైలమును తమలపాకులోరాచి పుచ్చుకొనిన ఆశీతివాతములు నివర్తించు)

కపాలకుష్ఠమునకు వేల్లాదిలేపము

వేల్లవ్యోషవరాబ్దాగ్నివిషోగ్రాగుడతుల్యకాః. 259
లేపాత్కుష్ఠాదికాన్ ఘ్నన్తి త్రివారం సకపాలికాన్,

తా. వాయువిడంగములు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాడి ఉశిరికెలు, తుంగముస్తలు, చిత్రమూలము, నాభి, వస, వీనిని సమభాగములుగనూరి దీనికి సమము బెల్లముచేర్చి మూడుమార్లు లేపనముచేసిన కపాలకుష్ఠము నివర్తించు.

మండలకుష్ఠమునకు చిత్రకాదిలేపము

మండలాని చ ఘృష్ట్వాథ చిత్రకేన ప్రలేపయేత్. 260
అథవావాతారిబీజైర్వా లేపో మండలకుష్ఠనుత్,

తా. మండలమును బాగుగ పొట్టురాలునటుల గీచి చిత్రమూలమును నూరి లేపనము జేసినను లేక ఆముదపువిత్తులను నూరి లేపనముచేసినను మండలకుష్ఠము నివర్తించు.

పుండరీకకుష్ఠమునకు భృంగరాజాదిలేపము

భృంగరాజహరీతక్యో ర్మూలమంతఃపుటే దహేత్. 261
ఆరనాళేన తల్లేపాచ్ఛ్వేతకుష్ఠవినాశనమ్,

తా. గుంటగలగరవేరు కరకవేరు వీనిని మూకుడుయందునిచి పొగపోకుండ కాల్చి కాంజికముతో లేపనముజేసిన శ్వేతకుష్ఠము నివర్తించు.

సిధ్మకుష్ఠమునకు - లాక్షాదిలేపములు

లాక్షా శ్రీవేష్టకం కుష్ఠం హరిద్రాసారసర్షపాః. 262
వ్యోషం మూలకబీజాని ప్రపున్నాటఫలాని చ,
ఏతాన్యత్ర ప్రపిష్టాని కుష్ఠేషూద్వర్తనం పరమ్. 263
సిధ్మానాం కిటిభానాం చ దద్రూణాం చ విశేషతః,

తా. లక్క, దేవదారు, బంకతోజేసిన ధూపద్రవ్యము, చెంగల్వకోష్ఠు, పసపు,

తెల్లఆవాలు, శొంఠి, పిప్పలి, మిరియాలు, ముల్లంగివిత్తులు, తగిరిశెవిత్తులు వీనిని సమ భాగములుగ చూర్ణించి లేపనముచేసిన సిధ్మకిటిభము, దద్రు ఇవి నివర్తించు.

పారదం టంకణం గంధం మూలకార్ద్రికయోర్ద్రవైః. 264
దినం మర్ద్యం చ తల్లేపాత్సిధ్మ హన్తి మహాద్భుతమ్,

తా. రసము వెలిగారము గంధకము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి ముల్లంగి అల్లము వీనిరసములతో ౧ దినమునూరి లేపనముజేసిన మహాద్భుతముగ సిధ్మకుష్ఠము నివర్తించు.

తాళకాద్ద్విగుణం గంధం వాకుచీగోజలార్ద్రితమ్. 265
సిధ్మ ప్రలేపనాదాశు హన్తి మాసప్రయోగతః,

తా. తాళకము ౧ భాగము, గంధకము ౨ భాగములు, చేర్చి నూరి బావంచి విత్తులు కషాయము గోమూత్రము వీనితోనూరి ౧ మాసము లేపనముచేసిన సిధ్మకుష్ఠము నివర్తించు.

గజచర్మకుష్ఠమునకు లేపము

గుంజాచిత్రకశంఖభస్మరజనీదూర్వాభయాలాంగలీ. 266
స్నుక్సింధూత్థకుమారికాజలధరార్కక్షీరధూమైశ్శైః,
వాకుచ్యేడగజావిడంగమరిచక్షౌద్రైస్సమానైర్యుతైః. 267
కార్యం వై గజచర్మనామ్ని తరసా కండూఘ్నముద్వర్తనమ్,

తా. గురుగింజలు, చిత్రమూలము, శంఖభస్మము, పసపు, గరిగె, కరక్కాయ, నీటిపిప్పలి, జెముడు, సైంధవలవణము, కలుబంద, తుంగముస్తలు, జిల్లేడుపాలు, కరుధూపము, పాదరసము, బావంచివిత్తులు, తగిరిశవిత్తులు, వాయువిడంగములు, మిరియాలు, వీనిని సమభాగములుగ తేనెతోనూరి లేపనముజేసిన గజచర్మకుష్ఠ (దద్రు కండు) ఇవి నివర్తించు.

కిటిభకుష్ఠమునకు పిప్పల్యాదిలేపము

పిప్పలీపూతికాయస్థాకుష్ఠగోపిత్తచిత్రకైః. 268
లేపం సమ్యక్ప్రశంసంతి కిటిభఘ్నం చికిత్సకాః,

తా. పిప్పళ్లు, కానుగ, తులసి, కోష్ఠు, గోపిత్తము, చిత్రమూలము వీనిని సమముగనూరి లేపనముజేసిన కిటిభకుష్ఠము మానును.

అన్యచ్చ—

గోమూత్రవారిసంపిష్టైశ్శిలాకాసీసతుత్థకైః. 269
లేపః కిటిభవీసర్పకుష్ఠనాశాయ పూజితః,

తా. మణిశిల, కాసీసము, మైలతుత్థము, వీనిని గోమూత్రములోనూరి లేపనము చేసిన కిటిభకుష్ఠము, విసర్పకుష్ఠము, ఇవి నివర్తించు.

దద్రుమండలకుష్ఠమునకు మూలకబీజాదిలేపము.

బీజాని వా మూలకసర్షపానాం లాక్షారజన్యో ప్రపునాటబీజమ్ 270
శ్రీవేష్టకవ్యోషవిడంగతుల్యం పిష్ట్వాజమూత్రేణ విలేపనం స్యాత్,
దద్రూణి సిధ్మాని కిటిభాని పామాం కపాలకుష్ఠం విషమంచ హన్యాత్.

తా. ముల్లంగివిత్తులు, తెల్లఆవాలు, లక్క, పసపు, మానిపసపు, తగిరిశె విత్తులు, సరళదేవదారు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు వీనినన్నియు సమముగ మేకపంచితముతోనూరి లేపనముజేసిన దద్రు, సిధ్మ, కిటిభకుష్ఠము, పామ, విషమమగు కపాలకుష్ఠము నివర్తించు.

చర్మదళకుష్ఠమునకు రాజికాదిలేపము

రాజికాగుడయుక్తేన సైంధవేన ప్రలేపితమ్,
విజలం చర్మణా బద్ధం నాశం చర్మదళం వ్రజేత్. 272

తా. ఆవాలు, బెల్లము, సైంధవలవణము, వీనిని చూర్ణముచేసి తడిలేకుండ లేపనుజేసిన చర్మదళకుష్ఠము నివర్తించు.

దద్రుకుష్ఠమునకు దరదాదిలేపము

దరదగంధకపారదపిప్పలీ విషవిడంగనిశాగ్నిమరీచకమ్,
అభయశుంఠిఘనాబ్దకవాకుచీ కటునృపద్రుమమేడగజాన్వితమ్. 273
సమమిదం ఖలు నింబరసైర్యుతం హరతి దద్రుజకండువిసర్పకాన్,
హరతి లూతభగందరమండలం తనువిలిప్తమహో క్షణతో నృణామ్.

తా. ఇంగిలీకము, గంధకము, రసము, పిప్పలి, నాభి, వాయువిడంగములు, పసపు, చిత్రమూలము, మిరియాలు, కరక, శొంఠి, తుంగముస్తలు, భావంచివిత్తులు, కటుకరోహిణీ, రేల, తగిరిశెవిత్తులు, వీనినన్నియు సమములుగ వేపరసముతో మర్దించి లేపనముచేసిన దద్రు, కండు, విసర్పము, లూతవ్రణము, భగందరము, మండలము, ఇవి నివర్తించు.

పామాకుష్ఠమునకు లేపము

వాకుచీతైలలేపో వా తైలైర్వా రాజవృక్షజైః,
పుత్రజీవోత్థతైలైర్వా లేపః పామాం వినాశయేత్. 275

తా. బావంచివిత్తులతైలమునుగాని, రేలతైలమునుగాని, పుత్రజీవితైలమును గాని, లేపనముచేసిన పామాకుష్ఠము నివర్తించు.

కచ్ఛూకుష్ఠమునకు సిందూరాదిలేపము

సిందూరజీరద్వయరాత్రియుగ్మమనశ్శిలావల్లిజగంధకానామ్,
రసాన్వితానాం ఘృతయోజితానాం పామా వ్రజేద్దూరతరంత్రిలేపాత్.

తా. సింధూరము, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, పసపు, మానిపసపు, మణిశిల, మిరియాలు, గంధకము, రసము వీనిని సమములుగ నెయ్యితో నూరి లేపనముచేసిన కచ్ఛూకుష్ఠము నివర్తించును.

శతారుకుష్ఠమునకు సింహాస్యదళలేపము

కోమళసింహాస్యదళం సనిశం సురభీజలేన సంపిష్టమ్,
దివసత్రయేణ నియతం శమయతి కచ్ఛూం విలేపనతః. 277

తా. అడ్డరసపుచిగురు, పసపు వీనిని గోమూత్రముతో నూరి లేపనముచేసిన శతారుకుష్ఠము 3 దినములకు నివర్తించు.

విచ్చరికాకుష్ఠమునకు అవల్గుజాదిలేపము

అవల్గుజం కాసమర్దం చ క్రమర్దం నిశాయుతమ్,
మాణిబంధంచ తుల్యాంశం ముస్తకాంజికపేషితమ్. 278
కండూం కచ్ఛూం జయత్యుగ్రాం సిద్ధ ఏష ప్రయోగరాట్,

తా. భావంచివిత్తులు, కసింద, తగిరిశెవిత్తులు, పసపు, సైంధవలవణము, వీనిని సమభాగములుగ కాంజికముతో నూరి లేపనముజేసిన కండూ, కచ్ఛూ, ఇవి శీఘ్రముగ నివర్తించు. (ఇవి సిద్ధయోగము.)

శ్విత్రకుష్ఠమునకు త్రిఫలాదిలేపనము

త్రిఫలా నీలినీ పత్రం లోహచూర్ణం రసాంజనమ్. 279
శ్వేతగుంజా దన్తిదన్తభస్మ తుత్థం చ మార్కవమ్,
మేషీదుగ్ధేన సంపిష్య స్థాపయేల్లోహభాజనే. 280
దినమేకం తతో లింపేన్మహుశ్శ్విత్రేష్వనుక్రమాత్,
శ్విత్రాణ్యనేన లేపేన నిజవర్ణం త్యజన్తి వై. 281

తా. త్రిఫలములు, నీలిఆకు, లోహచూర్ణము, రసాంజనము, తెల్లగురిగింజలు, ఏనుగదంతభస్మము, మైలతుత్తము, గుంటగలగర వీనిని మేకపాలుతో నూరి లోహపాత్రయందుంచుకొని శరీరమునకు లేపనముచేసిన శ్విత్రకుష్ఠము నివర్తించు.

తాళకాదిలేపము

తాళకః శణమాత్రస్స్యాచ్చతుశ్శాణా చ వాకుచీ,

గోమూత్రయుక్తం తచ్చూర్ణం లేపనాచ్ఛ్విత్రనాశనమ్. 282

తా. తాళకము ౧ శాణము, భావంచివిత్తులు ౪ శాణములు, వీనిని గోమూత్రముతోనూరి లేపనముజేసిన శ్విత్రకుష్ఠము నివర్తించు.

అయోరజాది లేపము

సాయోరజఃకృష్ణతిలాంజనాని సావల్గుజాన్యామలకాని దగ్ధ్వా,
పిష్టాని భృంగస్య సకృద్రసేన హన్యాత్కిలాసం పరిఘృష్య లేపాత్.

తా. అయోభస్మము, నల్లనువ్వులు, రసాంజనము, భావంచివిత్తులు, ఉశిరికెవొలుపు, వీనిని గుంటగలగరాకురసముచేనూరి దినమొకమారు మొదటగీచి లేపనముజేసిన కిలాసకుష్ఠము నివర్తించు.

కుష్ఠరోగపథ్యములు

పక్షాత్పక్షాచ్ఛర్దనాని మాసాన్మాసాద్విరేచనమ్,
నస్యం త్ర్యహాత్త్ర్యహాన్మాసిషణ్మాసే ప్రమోక్షణమ్. 284
సర్పిర్లేపో చిరోత్పన్నాయవగోధూమశాలయః,
ముద్గాఢకీమసూరాశ్చ మాక్షికంజాంగలామిషమ్. 285
ఆషాఢ ఫలవేత్రాగ్రే పటోలం బృహతీఫలమ్,
కాకమాచీనింబపత్రం లశునం హిలమోచికా. 286
పునర్నవామేషశృంగీ చక్రమర్దదళాని చ,
భల్లాతకఫలం తాళం ఖాదిరశ్చిత్రకోవరా. 287
జాతీఫలం నాగపుష్పం కుంకుమం ప్రతనం హవిః,
కోశాతకీకరంజం చ శాలసర్షపనింబజమ్. 288
తైలం తథేంగుదోత్పన్నం లఘూన్యన్నాని యాని చ,
స్నేహాస్సరళదేవాహ్వాశింశపాగరుసంభవాః. 289
మూత్రాణి గోఖరోష్ట్రాశ్వమహిషీజనితాని చ,
కస్తూరీగంధసారశ్చ తిక్తాని క్షౌరకర్మ చ. 290
యథాదోషం సమస్తాని పథ్యాన్యేతాని కుష్ఠినామ్,

తా. పదిహేనుదినములకు వమనమును జేయించుట, మాసమునకొకతూరి విరేచనమును జేయించుట, మూడుదినములకొకతూరి నస్యము జేయించుట, ఆరుమాసములకొకపరియాయము రక్తమోక్షణమును చేయుట, మరియు ఘృతలేపము, పాతయవలు, గోధుమలు, పెసలు, సంబాబియ్యము, కందులు, చిరుశనగలు, తేనె, జాంగలమాంసము, మోదుగ, వెదురుమొలకలు, చేదుపొట్ల, ములకపండ్లు, కాచి, వేపఆకు,

వెల్లుల్లి, చకోతపుకూర, తెల్లగలిజేరు, మేషశృంగి, తగరిశఆకులు, జీడిపండు, తాటిపండు, చంద్ర, చిత్రమూలము, త్రిఫలములు, జాజికాయలు, నాగకేసరములు, కుంకుమపువ్వు, పాతనెయ్యి, బీరకాయ, కానుక, శాలిధాన్యము, తెల్లఆవాలు, వేప, గారకాయతైలము, లఘుకరాన్నము, సరళదేవదారు అశోకము అగరు వీని తైలము, ఆవు, గాడిదె ఒంటె గుఱ్ఱము బఱ్ఱె వీనిమూత్రము, కస్తూరి, శ్రీగంధము, చేదుపదార్థము, క్షౌరకర్మలు. వీనిన్నిటిని దోషబలముల నెరింగి, కుష్ఠురోగులకు పథ్యం బిడవలయు.

## అపథ్యములు

అన్నపానం హితం కుష్ఠే నత్వామ్లలవణోషణమ్. 291
దధిదుగ్ధగుడాంశ్చాపి తిలమాషాం స్త్యజేన్నరః,
స్వేదం వ్యవాయం వమివేగమిక్షుంవ్యాయామమమ్లాని తిలాంశ్చ
మాషాన్. 292
అనూపమాంసం దధి దుగ్ధమద్యం గుడం చ కుష్ఠామయి న స్త్యజేయుః,

తా. పులుసు, ఉప్పు, కారముగల అన్నపానములు, పెరుగు, పాలు, బెల్లము, నువ్వులు, మినుములు, చెమటదీయుట, స్త్రీసంగమము, వాంతివేగము నడ్డగించుట, చెరుకురసము, వ్యాయామము, * పులుసు, నువ్వులు, మినుములు, జలప్రాంతమా నందుండు జంతుమాంసము, దధి, పాలు, మద్యము, బెల్లము, వీనిని కుష్ఠురోగి విడువవలయు.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్సగోత్రతిలక
సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వరభట్టారకప్రియతనూజ, భైషజ్య
విద్యాపారీణ, సకలపాండిత్యప్రవీణ, శ్రీమదింద్ర కంఠవల్లభాచార్య
విరచిత వైద్యచింతామణౌ, కుష్ఠురోగప్రకరణం నామ
షోడశో విలాసః.

---

* అనుష్టుప్శ్లోక మొకచోటుది, ఉపజాతిశ్లోక మింకొకచోటుది సంగ్రహింపబడెను. అందువలన పునరుక్తిగా భావింపజనదు.

# విసర్పిరోగప్రకరణమ్.

## విసర్పరోగనిదానము

లవణామ్లకటూష్ణాదిసంసేవాద్దోషకోపతః,
విసర్పస్సప్తధా జ్ఞేయస్సర్వతః పరిసర్పణాత్. 1

తా. ఉప్పు, పులుసు, కారము, ఉష్ణము మొదలగునవి గల పదార్థముల యొక్క సేవనవలన వాతాదిదోషములు ప్రకోపించి, 7 విధములగు విసర్పరోగముల జనింపజేయు. ఇది సర్వశరీరమును ప్రాకుచుండును గాన విసర్పమనబడును.

## విసర్ప భేదములు

పృథగ్దోషైస్త్రిభిశ్చైకో విసర్పో ద్వంద్వజాస్త్రయః,
వాతికః పైత్తికశ్చైవ కఫజస్సన్నిపాతికః. 2
చత్వార ఏతే వీసర్పా వక్ష్యన్తే ద్వంద్వజాస్త్రయః,

తా. విసర్పము వాతజము, పిత్తజము, కఫజము, సన్నిపాతజము, వాతపిత్తజము, కఫవాతజము పిత్తకఫజము, ఇటుల 7 విధములని తెలియవలయు. ద్వంద్వజములకు నామాంతరములు పైని చెప్పబడును.

ఆగ్నేయో వాతపిత్తాభ్యాం గ్రంధ్యాఖ్యః కఫమారుతాత్. 3
యస్తు కర్దమకో ఘోరస్సపిత్తకఫసంభవః,

తా. వాతపిత్తములచే జనించునది అగ్నివిసర్పమనియు, కఫవాతములచే జనించునది గ్రంథివిసర్పమనియు, పిత్తకఫములచే జనించునది కర్దమవిసర్పమనియును తెలియవలయు.

## విసర్పకారణసామగ్రి

రక్తం లసీకాత్వఙ్మాంసం దూష్యందోషాస్త్రయోమలాః. 4
విసర్పాణాం సముత్పత్తౌ విజ్ఞేయాస్సప్తహేతవః,

తా. రక్తము, లసీక, త్వఙ్మాంసములు, అనునాలుగు దూష్యములు వాతపిత్తశ్లేష్మములు, అనుమూడు దోషములు, ఈయేడును విసర్పరోగములు జనించుటకు హేతువులగుచున్నవి.

## వాతజవిసర్పలక్షణము

తత్ర వాతాత్పరీసర్పో వాతజ్వరసమవ్యథః. 5

శోఫస్ఫురణనిస్తోదభేదాయామా_ర్తిహర్ష వాన్,

తా. వాతజ్వరసమవికారములు (అనగా వణుకు విషమవేగము ఇవి పొందదగునవి) వాపు, శరీరము అదురుట, నొప్పి అధికముగానుండుట, శరీరము విరగగొట్టినటులనుండుట, శరీరమంతయు పీడ, రోమహర్షము ఇవి గలిగియుండిన వాత విసర్పమని తెలియవలయు.

పిత్తజవిసర్పలక్షణము

పిత్తాద్ద్రుతగతిః పిత్తజ్వరలింగోఽతిలోహితః. 6

తా. పిత్తజ్వరలక్షణంబులన్నియుంగలిగి పిత్తధాతువు శీఘ్రముగనడుచుచు నెఱ్ఱగానుండిన పిత్తవిసర్పమని యెఱుంగవలయు.

కఫజవిసర్పలక్షణము

కఫాత్కండూయుతః స్నిగ్ధః కఫజ్వరసమానరుక్,

తా. దురద, శరీరము మినమినలాడుట, శ్లేష్మజ్వరలక్షణములు ఇవి గలిగియుండిన శ్లేష్మవిసర్పమని యెఱుంగవలయు.

సన్నిపాతజవిసర్పలక్షణము

సన్నిపాతసముత్థశ్చ సర్వరూపసమన్వితః. 7

తా. వాత, పిత్త, కఫ, విసర్పలక్షణంబులన్నియుం గలిగియుండిన సన్నిపాత విసర్పియని తెలియవలయు.

అగ్నివిసర్పిలక్షణము

వాతపిత్తజ్వరచ్ఛర్దిమూర్ఛాతీసారతృడ్భ్రమైః,
అస్థిభేదోఽగ్నిసాదశ్చతమకారోచకైర్యుతః. 8
కరోతి సర్వమంగం చ దీప్తాంగారావకీర్ణవత్,
యం యం దేశం విసర్పశ్చ విసర్పతి భవేచ్చ సః. 9
శాంతాంగారాసితో నీలో రక్తో వాశ్వాపచీయతే,
అగ్నిదగ్ధనిభైస్ఫోటైశ్శీఘ్రం గత్వా ద్రుతం చ సః. 10
మర్మానుసారీ వీసర్పస్స్యాద్వాతోఽతిబలస్తతః,
వ్యథేతాంగం హరేత్సంజ్ఞాం నిద్రాం చ శ్వాసమీరయేత్. 11
హిధ్మాం చ సతతోఽవస్థామీదృశీం లభతే నరః,
క్వచిచ్ఛర్మారతిగ్రస్తో భూమిశయ్యాసనాదిషు. 12
చేష్టమానస్తతః క్లిష్టో మనోదేహసముద్భవామ్,
దుఃప్రబోధోఽశ్నుతే నిద్రాం సోఽగ్నివీసర్పఉచ్యతే. 13

తా, వాతపిత్తమువలన జనించిన విసర్పమునందు జ్వరము, వాంతి, మూర్ఛ, అతిసారము, దప్పి, శరీరముదిరుగుట, యెముకలు విరిగినటులనొచ్చుట, అగ్నిమాంద్యము, కన్నులుబ్బుట, అరుచి, ఇవి జనించు. అందువలన సర్వశరీరమునందు నిప్పులు జల్లినటులనుండుట విసర్పివ్యాపించు స్థలమున బొగ్గువలె నల్లగను, లేక నీలముగను, యెఱ్ఱనుండినదై శీఘ్రముగవాపుజనించుట అగ్నిచే కాలినదానివలె పైనబొబ్బలులేచి శీఘ్రగతిగలదై మిక్కిలివేగముగ హృదయమును ప్రవేశించుట లేకవాతము మిక్కిలి బలముగుటవలన శరీరమునందు నొప్పిగలుగుట సంజ్ఞ నిద్ర ఇవి లేకయుండుట మిక్కుటముగ శ్వాసమునువృద్ధిపరచుట ఎక్కిళ్లుగలుగుట భూమిమీదగాని లేకపక్కమీదగాని గూర్చుండినను సుఖముగలుగకుండుట, సంచారమువలన క్లేశముగలుగుట మనోదేహములకు క్లేశము వలన జనించెడి దుర్బోధనిద్ర (అనగా మరణరూపకమగు నిద్రజనించుట) ఈలక్షణములు గలుగునది అగ్నివిసర్పమని తెలియవలయు.

### గ్రంథివిసర్పలక్షణము

కఫేన రుద్ధః పవనో భిత్త్వా తం బహుధాకఫమ్,
రక్తం వా వృద్ధరక్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్. 14
దూషయిత్వా చ దీర్ఘాణువృత్తస్థూలఖరాత్మనామ్,
గ్రంథీనాం కురుతే మాలాం రక్తానాం తీవ్రరుగ్వతామ్. 15
శ్వాసకాసాతిసారాస్యశోషహిక్కావమిభ్రమైః,
మోహవైవర్ణ్యమూర్ఛాంగభంగాగ్నిసదనైర్యుతామ్. 16
ఇత్యయం గ్రంథివీసర్పః కఫమారుతకోపజః,

తా. స్వకారణములచే ప్రకోపించినకఫముచే నడ్డగింపబడినవాతము కఫమునుగాని లేక వృద్ధిబొందిన రక్తమునుగాని భేదించి చర్మము సిరలు స్నాయువులు మాంసము వీనిని పొందించి దోషయుక్తముగజేసి పొడవుగను చిన్నవిగను గుండ్రముగను లావుగను గరగరగను యెఱ్ఱగనుండు గ్రంథులవరుసను గలుగంజేయుట వానియందు బలముగుశూల మిక్కుటముగుజ్వరము శ్వాస దగ్గు అతిసారము నోరెండుట ఎక్కిళ్లు వాంతి భ్రమ మతిభ్రాంతి వైవర్ణ్యము మూర్ఛ ఒడలువిరువు అగ్నిమాంద్యము ఇట్టి లక్షణములుగలది గ్రంథివిసర్పియని యెఱుంగవలయు. ఇది కఫవాతకోపము వలన నుత్పన్నమగు.

### కర్దమవిసర్పలక్షణము

కఫపిత్తాజ్జ్వరస్తమ్భో నిద్రా తంద్రా శిరోరుజః. 17
అంగావసాదవిక్షేపప్రలాపారోచకభ్రమాః,

మూర్ఛాగ్నిహానిర్భేదోస్థ్నాం పిపాసేంద్రియగౌరవమ్, 18
ఆమోపవేశనం లేపస్స్రోతసాం సవిసర్పతి,
ప్రాయేణామాశయం గృహ్ణన్నేకదేశం న చాతిరుక్. 19
పిడకైరివ కీర్ణోతిపీతలోహితపాండురైః,
స్నిగ్ధోఽసితో మేచకాభో మలినశ్శోఫవాన్ గురుః. 20
గంభీరపాకః ప్రాజ్యోష్మాస్పృష్టక్లిన్నోవదీర్యతే,
పంకవచ్ఛీర్ణమాంసోయఃస్పష్టస్నాయుసిరాగణః. 21
శవగంధిశ్చ వీసర్పః కర్దమాఖ్యముశంతి తమ్,

తా. కఫపిత్తములవలన జ్వరము శరీరస్తమ్భము నిద్ర తంద్ర తలనొప్పి శరీరమునందు బడలికగలుగుట కాళ్లుచేతులీల్చుట తరుచుమాటలాడుట అరుచి భ్రమ మూర్ఛ అగ్నిమాంద్యము ఎముకలు విరిగినటులనొచ్చుట దప్పి ఇంద్రియములయందు జడత్వము మలముతో ఆమముబడుట ముఖాదిస్రోతస్సులయందు కఫమునిండి బూయబడినటులనుండుట ఆమాశయము పైపుట్టి మిక్కిలి వేదనాహీనంబై పసపు యెరుపు తెలుపువర్ణములుగల పొక్కులతోగూడినదై సర్వశరీమునందు వ్యాపించియుండుట ప్రకాశించుచున్నదై నెమలికన్నులయొక్క వర్ణముగలదై మలయుక్తమగు వాపు జడత్వము వీనితోగూడియుండుట లోనబండుట మిక్కిలి యూష్మముగలిగియుండుట అదిమినతోడనే పగిలినీరుకారుట చిట్లినట్లుండుట బురదవలె మాంసముసిధిలమై సిరాస్నాయువులు జెరచికొనియుండుట పీనుగవాసనగలుగుట ఇట్టి లక్షణములుగలది కర్దమవిసర్పియని యెరుంగందగు.

క్షతజవిసర్పలక్షణము

బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధస్సరక్తం పిత్తమీరయన్. 22
విసర్పం మారుతః కుర్యాత్కుళుత్థసదృశైశ్చితమ్,
స్ఫోటైశ్శోథజ్వరరుజాదాహాఢ్యం శ్యావశోణితమ్. 23

తా. బాహ్యకారణమువలన గాయముగలిగి దానివలన వాతము ప్రకోపించ రక్తసహితమగు పిత్తమును వ్రణమునందుజేర్చి విసర్పమును జనింపజేయును. దానివలన మీదనులవలతో తుల్యమగు శ్యామవర్ణకురుపులు వాపు జ్వరము శూల దాహము నలుపు యెరుపువర్ణములు గలిగియుండుట ఇట్టి లక్షణములుగలది క్షతజవిసర్పమని తెలియవలయు.

విసర్పోపద్రవములు

జ్వరాతిసారవమథుత్వఙ్మాంసదరణక్లమాః,

అరోచకావిపాకౌ చ విసర్పాణాముపద్రవాః. 24

తా॥ జ్వరము, అతిసారము, వాంతి, దప్పి, ఇవి గలుగుట మాంసముపగలుట శ్రీమ, అరుచి, అన్నము జీర్ణముకాకయుండుట, ఇట్టిలక్షణములు విసర్పరోగోపద్రవములని తెలియవలయు.

విసర్పసాధ్యాసాధ్యలక్షణములు

సిధ్యన్తివాతకఫపిత్తకృతావిసర్పాస్సర్వాత్మకః క్షతకృతశ్చ నసిద్ధిమేతి,
పిత్తాత్మకోంజనవపుశ్చ భవేదసాధ్యః కృచ్ఛ్రాశ్చ మర్మసు భవంతి హి సర్వఏవ. 25

తా. వాత పిత్త కఫములవలన గలిగిన విసర్పములు సాధ్యములు. సన్నిపాత క్షతములవలన గలిగిన విసర్పము అసాధ్యము. పిత్తమువలన జనించిన విసర్పములో శరీరము నల్లనగుటచే నసాధ్యము. మర్మస్థానములయందు గలుగు సర్వవిసర్పములు కష్టసాధ్యములని తెలియవలయు.

అంతర్బహిశ్చ విస్ఫోటైర్విసర్పస్స్యాద్విసర్పణాత్,
సామాన్యం తస్య సంస్థానం సజ్వరశ్శోభదాహరుక్. 26
అంతఃకృఛ్రోబహిస్సాధ్యో దుఃశ్చికిత్స్యోద్వ్యాశ్రయః,

తా. లోపల వెలుపల కురుపులు వ్యాపించుటవలన విసర్పియనంబడు. దీనియందు జ్వరము, వాపు, దాహము, వేదన, ఇవి గలిగియుండుట సామాన్యలక్షణము. లోనబుట్టినవిసర్పి కష్టసాధ్యము. వెలుపటజనించిన విసర్పి సాధ్యము. లోన వెలుపల గూడ జనించినది యసాధ్యము.

విసర్పికి పటోలాదికషాయము

కులకవృషకిరాతారిష్టతిక్తాక్షపత్థ్యామలకమలయజానాం కౌశికాద్యైః కషాయః. 27
సకలగదసముత్థం హన్తి వీసర్పముగ్రం సహవమథుమివిదాహభ్రాన్తితృష్ణారుజాభిః,

తా. చేదుపొట్లు, అడ్డరసపుఆకులు, సీమనేలవేము, వేప, కటుకరోహిణి, తాడికాయ, కరక్కాయ, ఉశిరికెవలుపు, చందనము, వీనిని సమముగ కషాయము బెట్టి, అందు గుగ్గులచూర్ణమును చేర్చి పుచ్చుకొనిన, సర్వదోషమువలన జనించిన అగ్ని విసర్పి, వాంతి, విదాహము, భ్రాంతి, దప్పి ఇవి నివర్తించు.

గుడూచ్యాదికషాయము

అమృతవృషపటోలం నింబవల్కైరుపేతం త్రిఫలఖదిరసారం వ్యాధిఘాతం చ తుల్యమ్. 28
క్వథితమిదమశేషం గుగ్గులోః పాదయుక్తం హరతి విషవిసర్పాన్కుష్ఠసంఘాతమాశు,

తా. తిప్పతీగ, అడ్డసరము, చేదుపొట్ల, వేపపట్ట, త్రిఫలములు, చంద్రచావ, రేల, వీనిని సమముగ కషాయముబెట్టి, అందు, నాలవపాలు గుగ్గులచూర్ణమును చేర్చి సేవించిన విషదోషము, విసర్పి, ఇవి శాంతించును.

పటోలాదికషాయము

పటోలం పిచుమందం చ దార్వీం కటుకరోహిణీమ్. 29
యష్ట్యాహ్వాం త్రాయమాణాం చ దద్యాద్వీసర్పశాంతయే,

తా. చేదుపొట్ల, వేప, మానిపసపు, కటుకరోహిణి, యష్టిమధుకము, కలుగ్రానుగ, వీనిని సమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన విసర్పము నివర్తించు.

దురాలభాదికషాయము

దురాలభాం పర్పటం చ గుడూచీం విశ్వభేషజమ్. 30
నిశాపర్యుషితం దద్యాత్తృష్ణావీసర్పశాంతయే,

తా దూలగొండి, పర్పాటకము, తిప్పతీగ, శొంఠి, వీనిని సమములుగచేర్చి నలియగొట్టి రాత్రినీళ్లయందునిచి, యుదయమున పుచ్చుకొనిన, దప్పి, విసర్పము ఇవి నివర్తించు

ముస్తాదికషాయము

ముస్తారిష్టపటోలానాం క్వాథస్సర్వవిసర్పనుత్. 31
ధాత్రీపటోలముద్గానామథవా ఘృతసంయుతః,

తా. తుంగముస్తలు, చేదుపొట్ల, వేప, వీనికషాయముగాని, లేక ఉసిరికెవొలుపు, చేదుపొట్ల పెసలు వీనిని కషాయముబెట్టి, అందు నెయ్యిచేర్చిగాని పుచ్చుకొనిన విసర్పి నివర్తించు.

భూనింబాదికషాయము

భూనింబవాసాకటుకీపటోలఫలత్రయాచందననింబసిద్ధః. 32
విసర్పదాహజ్వరశోషకండూవిస్ఫోటతృష్ణావమినుత్కషాయః,

తా. నీరుచేలవేము, అడ్డసరము, కటుకరోహిణి, చేదుపొట్ల, త్రిఫలములు,

చందనము, వేప, వీనిని సమముగ కషాయముబెట్టి పుచ్చుకొనిన విసర్పి, దాహము జ్వరము, వాపు, దురద, విస్ఫోటకము, దప్పి, వాంతి ఇవి నివర్తించు.

విసర్పులకు కాలాగ్నిరుద్రరసము

సూతకాన్తాభ్రతీక్ష్ణానాం భస్మమాక్షికగంధికే. 33
వంధ్యాకర్కోటకీద్రావైస్తుల్యం మర్ద్యం దినావధి,
వంధ్యాకర్కోటకీకందే క్షిప్త్వా లేప్యం మృదా బహిః. 34
భూధరాఖ్యే పుటే పాచ్యం దినైకం తద్విచూర్ణయేత్,
దశమాంశం విషం యోజ్యం మాషమాత్రం తు భక్షయేత్. 35
రసః కాలాగ్నిరుద్రోయం దశాహేన విసర్పనుత్,
పిప్పలీమధుసంయుక్తమనుపానం ప్రకల్పయేత్. 36

తా. రసభస్మము, కాంతభస్మము, అభ్రకభస్మము, ఉక్కుభస్మము, హేమమాక్షికభస్మము, శుద్ధగంధకము, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి గొడ్డుకాకరాకురసముతో నొకదినమునూరి ముద్దజేసి గొడ్డుకాకరదుంపకు మధ్యమున రంధ్రముజేసి అందు యీముద్దనుంచి దానిపై చీలమన్ను యిచ్చి యొకదినము భూధరపుటమునందునిచి సాంగశీతలమునదీసి మరల ఖల్వమునందునిచి దానికి పదియవ భాగము శుద్ధిజేసిన నాభిచేర్చి మర్దనచేసి మాషప్రమాణముపిప్పలి తేనె ఈ అనుపానముతో ౧౦ రోజులు పుచ్చుకొనిన విసర్పి నివర్తించును. ఇది కాలాగ్నిరుద్రరసమనబడును.

శ్లేష్మపిత్తవిసర్పి కివారిసాగరరసము

శుద్ధసూతం విషం గంధం మృతాభ్రం టంకణం శిలామ్,
ముసలీహయమారాభ్యాం ప్రత్యేకం చ విమర్దయేత్. 37
ద్విగుంజం భక్షయేన్నిత్యం శ్లేష్మపిత్తవిసర్పనుత్,
దురాలభాంపర్పటికంపటోలం కటుక్కీం తథా. 38
త్రిఫలాం గుగ్గులూం తుల్యాంక్వాథయిత్వానుపాయయేత్,
వారిసాగరనామాయం రసస్సర్వవిసర్పనుత్. 39

తా. శుద్ధిజేసినరసము, శుద్ధనాభి, శుద్ధగంధకము, అభ్రకభస్మము, వెలిగారము, శుద్ధిజేసినమణిశిల, వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి నేలతాడిగడ్డలరసము గన్నేరురసము వీనితో ప్రత్యేకము నొకదినము మర్దించి ౨ గురిగింజలయెత్తు దూలగొండి పర్పాటకము చేదుపొట్ల కాకర త్రిఫలములు శుద్ధిజేసినగుగ్గిలము వీనిని సమముగ కషాయము బెట్టి ఈ అనుపానముతో పుచ్చుకొనిన శ్లేష్మపిత్తవిసర్పి నివర్తించు.

## విసర్పులకు గౌరాదిఘృతము

ద్వే హరిద్రే స్థిరా మూర్వా సారిబా చందనద్వయమ్,
మధుకం మధుపర్ణీ చ పద్మకం పద్మకేసరమ్. 40
ఉశీరముత్పలం మేదా త్రిఫలా పంచవల్కలమ్,
కల్కైరక్షసమైరేభిర్ఘృతప్రస్థం విపాచయేత్. 41
విషవీసర్పవిస్ఫోటకీటలూతావ్రణాపహమ్,
గౌరాద్యమితి విఖ్యాతం సర్పిశ్శ్లేష్మగదప్రణుత్. 42

తా. పసపు, మానిపసపు, ముయ్యాకుపొన్న, చాగ, సుగంధపాల, చందనము, రక్తచందనము, యష్టిమధుకము, నీలి తామర కొడలు పద్మకేసరములు, వట్టివేరు, కలువదుంప, మేద, త్రిఫలములు, పంచవల్కములు, వీనిని సమభాగములుగ, (అక్షమాత్రములుగ జేర్చి) కల్కంబొనర్చి అందు నెయ్యి ౧ ప్రస్థముజేర్చి ఘృతపక్వముగ కాచి సేవించిన విసర్పి విస్ఫోటము కీటలూతవ్రణములు శ్లేష్మరోగములు ఇవి యన్నియు నివర్తించు.

## వృషాదిఘృతము

వృషఖదిరపటోలనింబపత్రత్వగమృతతామలకీకషాయకల్కైః,
ఘృతమభినవమేతదాశు పక్వం జయతి తదాస్రవిసర్పకుష్ఠగుల్మాన్.43

తా. అడ్డరసము, చండ్ర, చేదుపొట్ల, వేప, వీనిఆకులు మరియు పట్టతిప్పతీగె, ఉశిరికె నేల వీనికషాయముగాను కల్కముగాను జేసి అందు నెయ్యిచేర్చి ఘృతపక్వముగ కాచి పుచ్చుకొనిన రక్తవిసర్పి కుష్ఠువు గుల్మము ఇవి నివర్తియగు.

## దూర్వాదిఘృతము

దూర్వావటోదుంబరజంబుసాలసప్తచ్ఛదాశ్వత్థకషాయకల్కైః,
సిద్ధం విసర్పజ్వరదాహపాకవిస్ఫోటశోఫాన్వినిహన్తి సర్పిః. 44

తా. గరికె, మఱ్ఱి, అత్తి, నేరేడు, మద్ది, ఏడాకులపొన్న, రావి వీనిపట్ట, వీనిని కషాయముగాను కల్కముగాను జేసి అందు నెయ్యిజేర్చి ఘృతపక్వముగ కాచి సేవించిన విసర్పి, జ్వరము, దాహము, పాకము, విస్ఫోటము, వాపు ఇవి నివర్తించు.

## కరంజాదితైలము

కరంజసప్తచ్ఛదలాంగలీభిస్స్నుహ్యర్కదుగ్ధానలభృంగరాజైః,
తైలం నిశామూత్రవిపాచితం వా పక్వం విసర్పవిస్ఫోటవిచర్చికాఘ్నమ్.45

తా. కానుగపట్ట, ఏడాకులపొన్నపట్ట, నీటిపిప్పలి, జెముడుపాలు, జిల్లేడుపాలు, చిత్రమూలము, గుంటగలగర, పసపు, వీనిని కల్కముజేసి, గోమూత్రము,

నాభి, వీనినిచేర్చి, తైలముసిద్ధముజేసి, లేపనముచేసిన, విసర్పి, విస్ఫోటము, విచర్చికా ఇవి నివర్తించు.

వాతవిసర్పికిరాస్నాదిలేపము

రాస్నానీలోత్పలం దారుచందనం మధుకంబలా,
పిష్ట్వాజ్యక్షీరవాల్లేపో వాతవీసర్పనాశనః. 46

తా. రాస్న, నల్లకలువగడ్డ, దేవదారు, చందనము, అతిమధురము, చిట్టాముట్టి, వీనిని పాలతోనూరి నెయ్యిలోకలిపి లేపనముజేసిన వాతవిసర్పి నివర్తించు.

పిత్తవిసర్పికి ప్రపౌండరీకాదిలేపము

ప్రపౌండరీకం మంజిష్ఠాపద్మకేసరచందనైః,
సయష్టీందీవరోపేతైః క్షీరపిష్టైః ప్రలేపనమ్. 47

పిత్తవీసర్పపిత్తాస్రదాహశాన్తికరంపరమ్,

తా. ప్రపౌండరీకము, మంజిష్ఠ, పద్మకేసరము, చందనము, యష్టిమధుకము కలువదుంప, వీనిని పాలతోనూరి లేపనముజేసిన, పిత్తవిసర్పి రక్తపిత్తము, శరీరతాపము ఇది నివర్తించు.

కఫవిసర్పికి గాయత్ర్యాదిలేపము

గాయత్రీసప్తపర్ణాబ్దవాసారగ్వధదారుభిః. 48
కుటంనజైర్భవేల్లేపో విసర్పే శ్లేష్మసంభవే,

తా. చంద్రపట్టు, కోలపొన్నపట్ట, తుంగముస్తలు, అడ్డసరము, రేలగిజరు, దేవదారు, దుందిలపుపట్టు, వీనినినూరి లేపనముజేసిన, శ్లేష్మ విసర్పి నివర్తించు.

సన్నిపాతవిసర్పమునకు దశాంగలేపము

శిరీషయష్టీనతచందనైలామాంసీహరిద్రాద్వయకుష్ఠవాలైః. 49
లేపో దశాంగస్సఘృతః ప్రయోజ్యో విసర్పకుష్ఠవ్రణశోథహారీ,

తా. దిరిశనము, యష్టిమధుకము, గ్రంథితగరము, చందనము, ఏలకులు, జటామాంసి, పసపు, మానిపసవు, కోష్ఠు, వట్టివేరు ౧౦ దినుసులను సమభాగములుగ గ్రహించి, కల్కచేసి, నేతితోగలిపి, లేపనముచేసిన, సన్నిపాత విసర్పము, కుష్ఠము, వ్రణము, వాపు, ఇవి నివర్తించు.

అగ్నిసర్పికి మాంస్యాదిలేపము

మాంసీసర్జరసో లోధ్రం మధుకం సహరేణుకమ్. 50
మూర్వా నీలోత్పలం పద్మం శిరీషకుసుమాని చ,

ఏతైః ప్రదేహాః కథితో వహ్నివీసర్పనాశనః. 51

తా. జటామాంసి, సర్జరసము, లొద్దుగ, యష్టిమధుకము, రేణుకవిత్తులు, చాగ, నల్లకలువదుంప, తామరకాడలు, దిరిసనపుపూవులు, వీనినినూరి లేపనముజేసిన, అగ్ని విసర్పము నివర్తించు.

గ్రంథివిసర్పమునకు న్యగ్రోధాదిలేపనము

న్యగ్రోధపాదో గుంజా చ కదళీగర్భపవచ,
ఏతైర్గ్రంథివిసర్పఘ్నో లేపో ధౌతాజ్యసంయుతః. 52

తా. మఱ్ఱివూడలు, గురిగింజలు, అరటిదూట, వీనినినూరి, శతధౌతఘృతముతోచేర్చి లేపనముజేసిన, గ్రంథివిసర్పి నివర్తించు.

కర్దమవిసర్పికి లేపనము

శతధౌతఘృతోన్మిశ్రశ్శిరీషత్వగ్రజః కృతః,
లేపశ్శమయతి క్షిప్రం విసర్పం కర్దమాభిధమ్. 53

తా. దిరిశనపుపట్టనుచూర్ణించి, శతధౌతఘృతమునందుజేర్చి కలిపి లేపనము జేసిన కర్దమవిసర్పి నివర్తించు.

సర్వవిసర్పులకు హరీతకీయోగము

మంజిష్ఠా కుటజో ముస్తా గుడూచీ రజనీద్వయమ్,
కంటకారీ వచా శుంఠీ కుష్ఠారిష్టపటోలకమ్. 54
జాతీవిడం కాకమాచీ మోరటా ప్లక్షదారుకమ్,
కలింగభృంగత్రాయన్తీ పాఠా కాశ్మరికా బలిః. 55
గాయత్రీ త్రిఫలా తిక్తా సారిబా నక్తమాలకః,
వాసోశీరమహావృక్షసోమరాజీప్రియంగుకాః. 56
చందనం పర్పటానంతా విశాలా త్రివృతాజలమ్,
కటుత్రికం ఖురాసానంపలమేకం పృథక్పృథక్. 57
ద్వావింశతిపలాం పథ్యాం జలద్రోణే విపాచయేత్,
అష్టావశేషః కర్తవ్యః క్వాథస్సద్భిమజాతతః. 58
వస్త్రపూతా శివా కార్యా తీక్ష్ణలోహేన వేధయేత్,
మధు మధ్యే వినిక్షిప్య దినం త్రిస్సప్తసంఖ్యయా. 59
పురాణం మధుసంత్యజ్య మధుశ్రేష్ఠం పునః క్షిపేత్,
తతస్సుస్వాదసంపన్నాం ప్రభాతే భక్షయేచ్ఛివామ్. 60
విసర్పాన్నాశయేత్సర్వాన్కుష్ఠాన్యష్టాదశాపిచ,

ఖుడం పామాం చ కండూం చ దద్రువిస్ఫోటవిద్రధీః. 61
అన్యాంస్త్వగ్దోషజాః రోగాంస్తథా రక్తసముద్భవాః,

తా. మంజిష్ఠ, కొడిశపాలపట్ట, తుంగముస్తలు, తిప్పతీగె, పసపు, మానిపసపు, వాకుడు, వస, శొంఠి, చంగల్వకోష్ఠు, వేప, చేదుపొట్ల, జాజి, విడలవణము, కాచి, చాగ, జువ్వి, దేవదారు, కొడిశపాల, గుంటగలగర, కలుక్రానుగ, విషబొద్ది, నల్లగుమ్ముడు, గంధకము, చండ్ర, త్రిఫలములు, కటుకరోహిణి, సుగంధపాల, కానుగ, అడ్డసరము, వట్టివేరు, * మహావృక్షము, బావంచి, ప్రేంకణము, చందనము, పర్పాటకము, దూలగొండి, పాపర, తెగడ, కురువేరు, † శొంఠి, పిప్పలి, మిరియాలు, ఖురాసాని ఓమము, ఇవిప్రత్యేకము ౧ పలము ౨౨ పలముల కరక్కాయలు ఇవి యన్నియు ద్రోణప్రమాణోదకమునందువైచి యెనిమిదవభాగము మిగులునటులకాచి వడియగట్టి మంచి లోహశలాకతో ప్రతికరక్కాయకును రంధ్రములుపొడిచి తేనెలోవైచి ౨౧ దినము పర్యంతమునిచి అందు తేనె చెడినంత నేతీసి మరల మంచితేనెయందునిచి పిదప సుస్వాదుగనుండు కరక్కాయలను ప్రతిదినము ప్రాతఃకాలమునం దొక్కొకటి వంతున భక్షించిన విసర్పములు, అష్టాదశకుష్ఠువులు, ఖుడవాతము, పామా, కండు, దద్రు విస్ఫోటము, విద్రధి, మొదలగు సకలత్వగ్దోషములు రక్తరోగములు ఇవి నివర్తించు.

వమనము

పటోలపిచుమందాభ్యాం పిప్పల్యా మదనేన వా. 62
విసర్పే వమనం శస్తం తథా చేంద్రయవైస్సహ,

తా. చేదుపొట్ల, వేప, పిప్పళ్లు, మ్రంగపండ్లు, కొడిశపాల వీనిలోనెద్దానినైన కషాయముబెట్టి పుచ్చుకొనిన విసర్పిరోగము గలవానికి వమనంబయిసుఖము కలుగును.

విరేచనము

త్రిఫలారససంయుక్తం సర్పిస్త్రివృతయా సహ. 63
ప్రయోక్తవ్యం విరేకార్థం విసర్పజ్వరశాంతయే,

తా. విసర్పజ్వరశాంతికొరకు త్రిఫలకషాయమునందు తెగడచూర్ణము నెయ్యి చేర్చి విరేచనమున కివ్వవలయు.

విసర్పోపచారములు

తత్ర వైశోధనం శస్తం తథా శోణితమోక్షణమ్. 64
ప్రశస్తం సర్వవీసర్పే షణ్ణాం వా చతుష్టయమ్,

* మహావృక్షమనగా వృద్ధదారు. † శొంఠి రెండుభాగములు.

బలాత్రయం వాసఘృతం పానేలేపేచసేచనే. 65

తా. పైత్యపంబడిన సర్వవిసర్పులయందు వమనము విరేచనము రక్తమోక్షణము వీనిని జేయుటముఖ్యము, మరియు కోలపొన్న ముయ్యాకుపొన్న కౌరుపెసలు కౌరుమినుము వీనిని సమభాగములుగచేర్చి కషాయము కాచి అందావునెయ్యి కలిపి గాని లేక బలాత్రయమును కషాయము కాచి అందావునెయ్యిని కలిపిగాని సేచన వమనపానములంజేసిన సర్వవిసర్పులు నివర్తించు.

పక్వేతుప్రణనిర్దిష్టాంచికిత్సాంకారయేద్భిషక్,

తా. విసర్పులు పక్వములయినయడల వైద్యుడు వ్రణచికిత్సను జేయవలయునని తెలియవలయు.

విసర్పరోగములయందు పథ్యములు

పురాణయవగోధూమకంగుషష్టికశాలయః. 66
ముద్గామసూరాశ్చణకాస్తువర్యోజాంగలో రసః,
నవనీతం ఘృతం ద్రాక్షా దాడిమం కారవేల్లకమ్. 67
వేత్రాగ్రం కులకం ధాత్రీ ఖదిరో నాగకేసరః,
ద్రాక్షాశిరీషం కర్పూరం చందనం తిలలేపనమ్. 68
యథా దోషం పథ్యమిదం సేవితవ్యం విసర్పిభిః,

తా. పాతయవలు, గోధుమలు, కొఱ్ఱలు, ౬౦ దినములకు పండెడివడ్లు పెసలు చిరుశనగలు, శెనగలు, కందులు, జాంగలమాంసరసము, వెన్న, నెయ్యి, ద్రాక్షపండు, దాడిమపండు, కాకరకాయ, వెదురుమొలకలు, చిట్టితుమికికూర, ఉశిరికపండు, చంద్ర, నాగకేసరములు, నల్లద్రాక్ష, దిరిసెనము, పచ్చకర్పూరము, చందనము, నువ్వులుతో లేపనము, దోషానుగుణ్యముగ విసర్పరోగమునందు పథ్యములని తెలియవలయు.

విసర్పమునందపథ్యములు

వ్యాయామమహ్నిశయనం సురతం ప్రవాతం క్రోధం శుచం వమనవేగవిధారణం చ. 69
గుర్వన్నపానమఖిలం లశునం కుళుత్థాన్ మాషాంస్తిలాన్ సకలమాంసమజాంగలం చ,
స్వేదం విదాహిలవణామ్లకటూని మద్యమర్కప్రభామపి విసర్పగదీ త్యజేత్తత్. 70

తా. శరీరవ్యాయామము, పగటినిద్ర, మైధునము, పెనుగాలి, క్రోధము,

దుఃఖము, వమనవేగ ధారణము, గుర్వన్నము, గురుకరమగుపానము, వెల్లుల్లి, ఉలవలు మినుములు, నువ్వులు, అరణ్యమునందలి సర్వజంతుమాంసములు కానివి, చెమటదీయుట, విదాహకరద్రవ్యములు, ఉప్పు, పులుసు, కారము, మద్యము, ఎండ, వీనిని విసర్పరోగముగల వారలు విడువవలయును.

---

# విస్ఫోటకప్రకరణమ్.

## విస్ఫోటకనిదానము సంప్రాప్తి

కట్వమ్లతీక్ష్ణోష్ణవిదాహిరూక్షక్షారై రజీర్ణాధ్యశనాతపైశ్చ,
తథర్తుదోషేణ విపర్యయేణ కుప్యంతి దోషాః పవనాదయస్తు. 1
త్వచమాశ్రిత్య తే రక్తమాంసాస్థీని ప్రదూష్య చ,
ఘోరాన్ కుర్వన్తి విస్ఫోటాన్ సర్వాన్ జ్వరపురస్సరాన్. 2

తా. కారము పులుసు తీక్ష్ణము ఉష్ణము విదాహము రూక్షత క్షారము ఇవిగల పదార్థముల మిక్కుటముగ సేవించుట, అజీర్ణము, మిక్కుటముగభుజించుట, ఎండ, ఋతువిపర్యయదోషము వీనిలో నేదేనొకదానిచే వాతాదిదోషములు దుష్టములై చర్మమునాశ్రయించి రక్తము మాంసము అస్థి వీనినిజెరచి మిక్కిలి భయంకరమగు కురుపులను గలుగఁజేయును. దానిని విస్ఫోటకమనియెదరు. దానియందు జ్వరము కలిగియుండును. (సర్వవిస్ఫోటకములందు రక్తపిత్తములే ముఖ్యకారణములనియెదరు.)

## విస్ఫోటకస్వరూపము

అగ్నిదగ్ధనిభాస్స్ఫోటాస్సజ్వరా రక్తపిత్తజాః,
క్వచిత్సర్వత్ర వా దేహేవిస్ఫోటా ఇతి తే స్మృతాః. 3

తా. రక్తపిత్తములవలనగలిగిన సర్వవిస్ఫోటకములయందును పూర్వము జ్వరముగలిగి అగ్నివలనకాల్చబడినట్టి కాంతిగలవిస్ఫోటకములు, (పొక్కులు) శరీరమున నొకప్రదేశమునందుగాని లేకసర్వశరీరమునందుగాని జనించు. దీనినే విస్ఫోటకమనియెదరు

## వాతవిస్ఫోటకలక్షణము

శిరోరుక్శూలభూయిష్ఠం జ్వరతృట్పర్వభేదనమ్,
సకృష్ణవర్ణతాచేతివాతవిస్ఫోటలక్షణమ్. 4

తా. తలనొప్పి, కురుపులయందు మిక్కుటమగుపోట్లు; జ్వరము, దప్పి, సం

ధులు పగిలినటులనొచ్చుట, కురుపులునల్లగనుండుట, ఇట్టి లక్షణములుగలది వాతవిస్ఫోటకమని తెలియవలయు.

పిత్తవిస్ఫోటకలక్షణము

జ్వరదాహరుజాస్రావపాకతృష్ణాభిరన్వితమ్,
పీతలోహితవర్ణంచపిత్తవిస్ఫోటలక్షణమ్. 5

తా. జ్వరము, తాపము, పోట్లు, స్రావము, పాకము, దప్పి ఇవికలిగి కురుపులు పచ్చగగాని యెఱ్ఱగగాని యుండిన పిత్తవిస్ఫోటకమని యెఱుంగవలయు.

కఫవిస్ఫోటకలక్షణము

ఛర్ద్యరోచకజాడ్యాని కండూకాఠిన్యపాండుతాః,
అవేదనశ్చిరాత్పాకీ సవిస్ఫోటః కఫాత్మకః, 6

తా. వాంతి, అరుచి, జడత్వము, దురద, కాఠిన్యముగలుగుట, తెల్లగనుండుట, కొంచమునొప్పి, చిరకాలమునకు పక్వమగుట, ఇట్టి లక్షణములుగలది కఫస్ఫోటకమనియెదరు.

కఫపిత్తవిస్ఫోటకలక్షణము

కండూర్దాహో జ్వరశ్ఛర్ది రేతైస్తు కఫపైత్తికః,

తా. దురద, తాపము, జ్వరము, వాంతి, ఇట్టి లక్షణములుగలది, కఫపిత్తవిస్ఫోకమనియెదరు.

వాతపిత్తవిస్ఫోటకలక్షణము

వాతపిత్తకృతో యస్తు కురుతే తీవ్రవేదనామ్. 7

తా. మిక్కుటముగ పోట్లుగలిగియుండిన, వాతపిత్తవిస్ఫోటకమని తెలియవలయు.

కఫవాతవిస్ఫోటకలక్షణము

కండూస్తైమిత్యగురుభిర్జానీయాత్కఫవాతికమ్,

తా. దురద, స్తబ్ధత్వము, గురుత్వము, ఇవిగలది కఫవాత విస్ఫోటకమని తెలియవలయు.

సన్నిపాతవిస్ఫోటకలక్షణము

మధ్యే నిమ్నోన్నతఃఽంతఉత్సన్నకనోల్పప్రపాకవాఙ్. 8
దాహరాగాతృషామోహాచ్ఛర్దిమూర్ఛారుజో జ్వరః,
ప్రలాపో వేపథుస్తంద్రా సోఽసాధ్యశ్చ త్రిదోషజః. 9

తా. నడుమపల్లముగను, చుట్టూమిట్టగను, కఠినముగగాని, లేక కొంచము పక్వమైనటులగాని యుండిన త్రిదోష విస్ఫోటకమని తెలియనగును, అందుదాహము, జొల్లుకారుట, దప్పి, మోహము, వాంతి, మూర్ఛ, పోట్లు, జ్వరము, తరుచుమాట లాడుట, వణుకు, మబ్బు, ఇవి గలిగియుండు. ఇది అసాధ్యంబని తెలియవలయు.

### రక్తజవిస్ఫోటకలక్షణము

రక్తారక్తసముత్థానా గుంజాఫలనిభా స్తథా,
వేదితవ్యాస్తు రక్తేన పైత్తికేన చ హేతునా. 10
న తే సిద్ధిం సమాయాన్తి సిద్ధైర్యోగశతైరపి,

తా. గురిగింజలవలె నెఱ్ఱనై, పిత్తదోషయుక్తంబై, రక్తదూష్యయుతంబై యుండునది, రక్తజవిస్ఫోటకమని తెలియవలయును. దీనికి, అనేకోపాయంబులం జేసినను, సాధ్యముగాదని తెలియవలయు.

### విస్ఫోటకసాధ్యాఽసాధ్యలక్షణము

ఏకదోషోత్థితస్సాధ్యః కృచ్ఛ్రసాధ్యో ద్విదోషజః. 11
సర్వరూపాన్వితో ఘోర స్త్వసాధ్యో భూర్యుపద్రవః,

తా. ఏకదోషజ విస్ఫోటకము సాధ్యమనియు, ద్విదోషజ విస్ఫోటకము కష్టసాధ్యమనియు, త్రిదోషజయుక్తమై అనేకోపద్రవములతో గూడి భయంకరమగు విస్ఫోటక మసాధ్యమనియును తెలియవలయు.

### విస్ఫోటకోపద్రవములు

హిక్కా శ్వాసో రుచి స్తృష్ణాచాంగసాదో హృది వ్యథా. 12
విసర్పజ్వరహృల్లాసా విస్ఫోటానాముపద్రవాః,

తా. ఎక్కిళ్లు, శ్వాస, అరుచి, దప్పి, శరీరము కృశించుట, రొమ్ముశూల, విసర్పము, జ్వరము, ఓకరింత ఇవి విస్ఫోటకోపద్రవములని తెలియవలయును.

### సామాన్యోపచారము

తత్రాదౌ లంఘనం కార్యం వమనం పథ్యభోజనమ్. 13
యథాదోషం బలం వీక్ష్య ప్రోక్తం యుక్తం చ రేచనమ్,

తా. విస్ఫోటకమునందు తొలుత లంఘనము జేయించి, పిదప వమనమునొసంగి, పథ్యముగ భోజనంబిడవలయు, మరియు విస్ఫోటక దోషబలాబలముల దెలిసి యథాయోగ్యముగ విరేచనమునొసంగవలయు.

## వాతవిస్ఫోటకమునకు ద్విపంచమూలాదికషాయము

ద్విపంచమూలం రాస్నాంచదార్వ్యాశీరేదురాలభామ్. 14
సామృతం ధాన్యకం ముస్తాం క్వాథయిత్వా శృతం పిబేత్,
విస్ఫోటం వాతసంభూతం హంత్యేతన్నాత్ర సంశయః. 15

తా. దశమూలములు, సన్నరాస్న, మానిపసపు, వట్టివేరు, దురదగొండి, తిప్పతీగె, ధనియాలు, తుంగముస్తలు వీనిని సమములుగ కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతమువలనజనించిన విస్ఫోటకము నివర్తించు.

## పిత్తవిస్ఫోటకమునకు ద్రాక్షాదికషాయము

ద్రాక్షాకాశ్మర్యఖర్జూరపటోలారిష్టవాసకైః,
లాజాకులకదుస్స్పర్శైః క్వాథశ్శర్కరయాయుతః. 16
విస్ఫోటం పిత్తజం హన్తి సోపద్రవమసంశయమ్,

తా. ద్రాక్ష, గుమ్ముడువేరు, ఖర్జూరము, చేదుపొట్ల, వేప, అడ్డసరము, పేలాలు, చిట్టితుమికివేళ్లు, దురదగొండివేళ్లు, వీనిని సమముగ కషాయముబెట్టి అందు చక్కెరచేర్చి పుచ్చుకొనిన నుపద్రవముతోగూడియుండు పిత్తవిస్ఫోటకము నివర్తించు.

## కఫవిస్ఫోటకమునకు భూనింబాదికషాయము

భూనింబధన్వయాసాశ్చ త్రిఫలేంద్రసవాసకాః. 17
పిచుమందః పటోలీ చ క్వాథమేషాం సశర్కరమ్,
పీత్వా విముచ్యతే నూనం కఫవిస్ఫోటకాన్నరః. 18

తా. సీమనేలవేము, దూలగొండి, త్రిఫలములు, కొడిశపాలవిత్తులు, అడ్డసరము, వేప, చేదుపొట్ల వీనిని కషాయముబెట్టి అందు శర్కరచేర్చి పుచ్చుకొనిన కఫజ విస్ఫోటకము నివర్తించు.

## కఫపిత్తవిస్ఫోటకమునకు ద్వాదశాంగకషాయము

కిరాతతిక్తకారిష్టయష్ట్యాహ్వాంబుదపర్పటైః,
పటోలవాసకోశీరత్రిఫలాకౌటజైశ్శృతమ్. 19
ద్వాదశాంగం నరః పీత్వా విస్ఫోటేభ్యో విముచ్యతే,
ద్వంద్వజేభ్యస్త్రిదోషోత్థరక్తజేభ్యో హితాశనః. 20

తా. నేలవేము, వేము, అతిమధురము, తుంగముస్తలు, పర్పాటకము, చేదుపొట్ల, అడ్డసరము, వట్టివేరు, త్రిఫలములు, కొడిశపాలవిత్తులు వీనిని కషాయము బెట్టి

పుచ్చుకొనిన ద్వంద్వజ త్రిదోషజ రక్తదోషజములగు విస్ఫోటకములు నివర్తించు. మరియు దీనియందు పథ్యము లఘుకరపదార్థముల సేవించవలయును.

### వాతపిత్తవిస్ఫోటకమునకు అమృతాదికషాయము

అమృతవృషపటోలం ముస్తకం సప్తపర్ణం ఖదిరసనవవేత్రం నింబపత్రం హరిద్రే,
శృతమితి సవిసర్పాన్ కుష్ఠవిస్ఫోటకండూరపనయతి మసూరీం శీతపిత్తజ్వరం చ. 21

తా. తిప్పతీగ, అడ్డసరము, చేదుపొట్ల, తుంగముస్తలు, ఏడాకుల అరటి చంద్ర, వెదురుమోసు, వేపఆకులు, పసపు, మానిపసపు వీనిని కషాయముబెట్టి (చక్కెరకలిపి) పుచ్చుకొనిన సర్వవిసర్పులు, కుష్ఠము, విస్ఫోటకము, కండు, మసూరి, శీతపిత్తజ్వరము ఇవి నివర్తించు.

### విస్ఫోటకజ్వరమునకు పటోలాదికషాయము

పటోలామృతభూనింబవాసారిష్టకపర్పటైః,
ఖదిరత్రిఫలైః క్వాథో విస్ఫోటజ్వరశాన్తయే. 22

తా. చేదుపొట్ల, తిప్పతీగె, నేలవేము, అడ్డసరము, వేప, పర్పాటకము, చంద్ర, త్రిఫలములు వీనిని కషాయముకాచి పుచ్చుకొనిన విస్ఫోటకజ్వరము నివర్తించు.

### నింబాదికషాయము

నింబత్వక్ఖాదిరస్సారో గుడూచీశక్రజోయవః,
క్వాథఏషాంమధుయుతో విస్ఫోటాదిజ్వరాపహః. 23

తా. వేపపట్ట, ఖదిరసారము, తిప్పతీగె, కొడిశపాల వీనికషాయమునందు తేనెచేర్చి పుచ్చుకొనిన విస్ఫోటకజ్వరము నివర్తించు.

### పద్మకాదిఘృతము

పద్మకం మధుకం లోధ్రం నాగపుష్పస్య కేసరమ్,
హరిద్రే ద్వే విడంగాని సూక్ష్మైలాతగరం తథా. 24
కుష్ఠం లాక్షాపత్రకం చ సిక్థకం తుత్థమేవ చ,
బహువారశ్శిరీషం చ దధిత్థఫలమేవచ. 25
తోయేనాలోడ్య తత్సర్వం ఘృతప్రస్థం విపాచయేత్,
యాంశ్చ రోగాన్నిహన్త్యాత్తాన్నిబోధ మహామునే. 26

సర్వకీటాఖుదోషేషు నాడీదుష్టవిసర్పిషు,
వివిధేపిచ విస్ఫోటే లూతామూత్రక్షతేషు చ. 27
నాడీషు గండమాలాసు ప్రభిన్నాసు విశేషతః,
ఆస్తికోక్తంహితం ధన్యం పద్మకాదిమహాఘృతమ్. 28

తా. పద్మకములు, అతిమధురము, లొద్దుగ, నాగకేసరములు, పసపు, మానిపసపు, వాయువిడంగములు, సన్నయాలకులు, గ్రంధితగరము, చంగల్వకోష్ఠు, లక్క, తమాలపత్రి, మైనము, మైలతుత్థము, విరిగిచెట్టుపట్ట, దిరిశనపుపట్ట, వెలగపండు వీనిని సమములుగ గ్రహించి, చూర్ణించి ఉదకమునందునిచి అందు నెయ్యి ౧ ప్రస్థముచేర్చి నెయ్యిమిగులువరకు కాచి సేవించిన సర్వకీటకదోషములు, ఎలుకదోషము, నాడీవ్రణము, దుష్టవిసర్పి, సర్వవిస్ఫోటకములు, లూతవ్రణము, మూత్రక్షతము, నాడీవ్రణములు, పగిలినగండమాలలు ఇవియన్నియు నివర్తించు. ఇది ఆస్తికమునిచే జెప్పబడిన పద్మకాదిఘృతము.

## విస్ఫోటక పథ్యములు

విశోఫ్టకహితార్థాయ సేవయేచ్ఛ యవాదిభిః,
ముద్గాఢకీమసూరాణాం రసైర్వా విశ్వసంయుతైః. 29
సునిషణ్ణక వేత్రాగ్ర తండులీయకటిల్లకైః,
కులకాభీరుకై రేభిస్సపర్పటసతీనకైః. 30
తిక్తయూషసమాయుక్తైర్భోజనం సంప్రయోజయేత్,

తా. యవలు, పెసలు, కందులు, చిరుశెనగలు వీనికట్టులో శొంఠిచూర్ణమును గలిపిగాని, చంచలికూర, వెదురుమొలక, చిఱ్ఱికూర, కాకరకాయ, చిట్టితుమ్మిఆకు, పిల్లపీచర, పర్పాటకము, లంకలనెదువద్దు, చేదుగలయూషము వీనిని విస్ఫోటకమునందు పథ్యంబిడవలయు.

## అపథ్యములు

తిలాన్మాషాకుళుత్థాంశ్చ లవణామ్లకటూని చ. 31
విదాహిరూక్షముష్ణం చ విస్ఫోటీ పరివర్జయేత్,

తా. నువ్వులు మినుములు, ఉలవలు, ఉప్పు, పులుసు, కారము, విదాహకరపదార్థములు, రూక్షత, ఉష్ణముగలది, వీనిని విస్ఫోటకరోగముగలవాడు విడువవలయు.

విస్ఫోటకరోగము - సమాప్తము

శ్రీ ర స్తు.

# మసూరికారోగప్రకరణమ్.

### మసూరికా నిదానము

కట్వమ్లలవణక్షారవిరుద్ధాధ్యశనాదిభిః,
దుష్టనిష్పావశాకాదిప్రదుష్టపవనోదకైః. 1
క్రుద్ధగ్రహేక్షణాద్వాపి దేహే దోషాస్సముద్ధతాః,
జనయన్తి శరీరేస్మిన్ దుష్టరక్తేన సంగతాః. 2
మసూరాకృతిసంస్థానాః పిటుకాస్స్యుర్మసూరికాః,

తా. కారము, పులుసు, లవణము, క్షారములు, మత్స్యదుగ్ధాది విరుద్ధాన్నము, అధికభోజనము లేక విషాదికమువలన దుష్టమగుఅన్నము, కూరలు, గానిగెపిండి పుచ్చిపోయినపతాని, మినుములు మొదలయినశాకములు, దుష్టమగుగాలి నీళ్లు, శనైశ్చరాది క్రూరగ్రహవీక్షణము యీకారణములచే దేహమందు వాతాదిదోషములు కుపితములై దుష్టరక్తముతో చేరి శరీరమునందు చిరుశనగలవంటి కురుపులను గలుగఁజేయు. దానిని మసూరికారోగమనియెదరు. (మసూరియన పోలేరమ్మ.)

### మసూరికాపూర్వరూపము

తాసాం పూర్వం జ్వరః కండూర్గాత్రభంగో రుచిర్భ్రమః. 3
త్వచి శోఫశ్చ వైవర్ణ్యం నేత్రరోగస్తథైవ చ,

తా. జ్వరము, దురద, శరీరము విరగగొట్టినటులనుండుట, అరుచి, భ్రమ, చర్మవాపు, శరీరవైవర్ణ్యము, నేత్రరోగము ఇవి మసూరికారోగమునకు పూర్వరూపములని తెలియవలయు.

### మసూరికా సంప్రాప్తి

పిత్తం శోణితగం భూత్వా యదా దూషయతి త్వచం. 4
తదా కరోతి పిటికాస్సర్వగాత్రేషు దేహినామ్,

తా. పిత్తమురక్తముతో చేరి చర్మమునాశ్రయించి దూషితముగ జేసిన సర్వావయవములయందు పిటికలు జనించు.

### మసూరికాస్వరూపము

మసూరమాషముద్గాదితుల్యాకాలోపమా అపి. 5
మసూరికాస్తు తా జ్ఞేయా రక్తాపిత్తాధికా బుధైః,

తా॥ చిరుశనగలు మినుములు పెసలు వీనితో తుల్యముగనుండి నల్లనివర్ణముగలిగి యుండిన దానిని మసూరికారోగమని వచించెదరు. ఇది రక్తపిత్తాధిక్యమువలన జనించును.

వాతమసూరికాలక్షణము

స్ఫోటాః కృష్ణారుణా రూక్షా స్తీవ్ర వేదనయాన్వితాః. 6
కఠినాశ్చిరపాకాశ్చ భవంత్యనిలసంభవాః,
సంధ్యస్థిపర్వణాం భేదః కాసః కంపో రతిః క్లమః. 7
శోషస్తాల్వోష్ఠజిహ్వానాం తృష్ణాచారుచిసంయుతా,

తా॥ పొక్కులు నల్లపుఱుపువర్ణముగలవిగను రూక్షముగలవిగను తీవ్రమగు వేదనగలవిగను కఠినములుగను చిరకాలమునకు పక్వములగునవిగనుండిన వాతమువలనజనించినవని తెలియవలయు. అందు అస్థిసంధులువదలినటులుండుట దగ్గుఱణుకు దేనియందిష్టములేకయుండుట శ్రమ దవడలు, పెదవి, నాలుక ఇవి యెండుట దప్పి అరుచి ఇవి జనించును.

పిత్తమసూరికాలక్షణము

రక్తాః పీతాసితాస్స్ఫోటాస్సదాహా స్తీవ్ర వేదనాః. 8
భవంత్యచిరపాకాశ్చ పిత్తకోపసముద్భవాః,
విడ్భేదశ్చాంగమర్దశ్చ జ్వర స్తీవ్రస్సుదారుణః. 9
ముఖపాకోక్షిపాకశ్చ దాహ స్తృష్ణా రుచి స్తథా,

తా॥ పొక్కులు ఎఱ్ఱగను, పచ్చగను, నల్లగనుండి తాపము, మిక్కుటమగు వేదన ఇవిగలిగి శీఘ్రకాలములో పక్వమైనవి పిత్తప్రకోపమువలన జనించిన మసూరికలని తెలియవలయు. అందు మలబంధము, శరీరమునొప్పి భయంకరమై మిక్కుటమగుజ్వరము, ముఖపాకము, నేత్రపాకము, తాపము, దప్పి అరుచి ఇవి జనించునని తెలియవలయును.

రక్తమసూరికాలక్షణము

రక్తజాయాం భవంత్యేతే వికారాః పిత్తలక్షణాః. 10

తా॥ రక్తజమసూరికారోగమునందును పిత్తజమసూరికాలక్షణములే గలిగి యుండును.

కఫజమసూరికాలక్షణము

కఫప్రసేకస్తైమిత్యం శిరోరుగ్గాత్రగౌరవమ్,
హృల్లాసశ్చారుచి స్తంద్రా నిద్రాలస్యసమన్వితాః. 11

శ్వేతాస్స్నిగ్ధా భృశం స్థూలాః కండూరా మందవేదనాః,
మసూరికాః కఫోత్థాశ్చ చిరపాకాః ప్రకీర్తితాః. 12

తా. నోటినుండి కఫము స్రవించుట, శరీరము మొద్దుగనుండుట, కపాలశూల, శరీరము బరువుగనుండుట, హృల్లాసము, అరుచి, తంద్ర, నిద్ర, ఆలస్యము ఇట్టి లక్షణములుగలిగి తెల్లగను, నిగనిగకాంతిగను మిక్కిలి పెద్దవిగను దురదగలవిగను అల్పవేదనగలిగి చిరకాలమునకు పక్వములగువానిని కఫజమసూరికలని తెలియవలయును.

సన్నిపాతమసూరికాలక్షణము

నీలాశ్చిపిటవిస్తీర్ణా మధ్యే నిమ్నా మహారుజాః,
చిరపాకాః పూతిసంస్రావాః ప్రభూతాస్సర్వదోషజాః. 13

తా. నీలవర్ణముగలవిగను, అటుకులవలె వెడల్పుగలవిగను, నడుమ పల్లము గలవిగనుండి చిరకాలమునకు పక్వములై చీమును స్రవించుచు గొప్పవిగనుండునవి సన్నిపాతమసూరికలని తెలియవలయును.

చర్మపిటికాలక్షణము

కంఠరోధోఽరుచి స్తంద్రా ప్రలాపారతిసంయుతాః,
దుశ్చికిత్స్యాస్సముద్దిష్టాః పిటికా చర్మసంజ్ఞితాః. 14

తా. కంఠము నిరోధించుట, అరుచి, తంద్ర, కలవరించుట, దేనియందిష్టము లేకయుండుట ఇట్టిలక్షణములుగలిగి చికిత్సచేయుటకు సాధ్యములుగాకయుండునవి చర్మపిటికలని తెలియవలయును.

రోమాంతికమసూరికాలక్షణము

రోమకూపోన్నతిసమా రాగిణ్యః కఫపిత్తజాః,
కాసారోచకసంయుక్తా రోమాంత్యో జ్వరపూర్వకాః. 15

తా. రోమకూపోన్నతితో సమములుగనుండి, ఎఱ్ఱగనుండునవి కఫపిత్తము వలనజనించిన రోమాంతికమసూరికలని తెలియవలయు. అందు దగ్గు, అరుచి, తొలుత జ్వరము ఇవి గలిగియుండును.

రసగతమసూరికాలక్షణము

తోయబుద్బుదసంకాశా స్త్వగ్గతాశ్చ మసూరికాః,
స్వల్పదోషాః ప్రజాయన్తే భిన్నాస్తోయం స్రవంతి హి. 16

తా. చిరుశనగలు మినుములు పెసలు వీనితో తుల్యముగనుండి నల్లనివర్ణముగలిగి యుండిన దానిని మసూరికారోగమని వచించెదరు. ఇది రక్తపిత్తాధిక్యమువలన జనించును.

—వాతమసూరికాలక్షణము—

స్ఫోటాః కృష్ణారుణా రూక్షా స్తీవ్ర వేదనయాన్వితాః.
కఠినాశ్చిరపాకాశ్చ భవంత్యనిలసంభవాః,
సంధ్యస్థిపర్వణాం భేదః కాసః కంపో రతిః క్లమః.
శోషస్తాల్వోష్ఠజిహ్వానాం తృష్ణాచారుచిసంయుతాః,

తా. పొక్కులు నలుపుయెరుపువర్ణముగలవిగను రూక్షముగలవిగను తీవ్రమగు వేదనగలవిగను కఠినములుగను చిరకాలమునకు పక్వములగునవిగనుండిన వాతము వలనజనించినవని తెలియవలయు. అందు అస్థిసంధులువదలినటులుండుట దగ్గు ఏమియు దేని యందిష్టములేకయుండుట శ్రమ దవడలు, పెదవి, నాలుక ఇవి యెండుట దప్పి అరుచి ఇవి జనించును.

—పిత్తమసూరికాలక్షణము—

రక్తాః పీతాసితాస్స్ఫోటాస్సదాహా స్తీవ్ర వేదనాః. 8
భవంత్యచిరపాకాశ్చ పిత్తకోపసముద్భవాః,
విడ్భేదశ్చాంగమర్దశ్చ జ్వర స్తీవ్ర స్సుదారుణః. 9
ముఖపాకోఽక్షిపాకశ్చ దాహ స్తృష్ణా రుచి స్తథా,

తా. పొక్కులు ఎఱ్ఱగను, పచ్చగను, నల్లగనుండి తాపము, మిక్కుటమగు వేదన ఇవిగలిగి శీఘ్రకాలములో పక్వమైనవి పిత్తప్రకోపమువలన జనించిన మసూరికలని తెలియవలయు. అందు మలబంధము, శరీరమునొప్పి భయంకరమై మిక్కుటమగుజ్వరము, ముఖపాకము, నేత్రపాకము, తాపము, దప్పి అరుచి ఇవి జనించునని తెలియవలయును.

—రక్తమసూరికాలక్షణము—

రక్తజాయాం భవంత్యేతే వికారాః పిత్తలక్షణాః. 10

తా. రక్తజమసూరికారోగమునందును పిత్తజమసూరికాలక్షణములే గలిగి యుండును.

—కఫజమసూరికాలక్షణము—

కఫప్రసేకస్తైమిత్యం శిరోరుగ్గాత్రగౌరవమ్,
హృల్లాసశ్చారుచి స్తంద్రా నిద్రాలస్యసమన్వితాః, 11

శ్వేతాస్స్నిగ్ధా భృశం స్థూలాః కండూరా మందవేదనాః,
మసూరికాః కఫోత్థాశ్చ చిరపాకాః ప్రకీర్తితాః. 12

తా. నోటినుండి కఫము స్రవించుట, శరీరము మొద్దుగనుండుట, కపాలశూల, శరీరము బరువుగనుండుట, హృల్లాసము, అరుచి, తంద్ర, నిద్ర, ఆలస్యము ఇట్టి లక్షణములుగలిగి తెల్లగను, నిగనిగకాంతిగను మిక్కిలి పెద్దవిగను దురదగలవిగను అల్పవేదనగలిగి చిరకాలమునకు పక్వములగువానిని కఫజమసూరికలని తెలియవలయును.

సన్నిపాతమసూరికాలక్షణము

నీలాశ్చిపిటవిస్తీర్ణా మధ్యే నిమ్నా మహారుజాః,
చిరపాకాః పూతిసంస్రావాః ప్రభూతాస్సర్వదోషజాః. 13

తా. నీలవర్ణముగలవిగను, అటుకులవలె వెడల్పుగలవిగను, నడుమ పల్లము గలవిగనునుండి చిరకాలమునకు పక్వములై చీమును స్రవించుచు గొప్పవిగనుండునవి సన్నిపాతమసూరికలని తెలియవలయును.

చర్మపిటికాలక్షణము

కంఠరోధోఽరుచిస్తంద్రా ప్రలాపారతిసంయుతాః,
దుశ్చికిత్స్యాస్సముద్దిష్టాః పిటికా చర్మసంజ్ఞితాః. 14

తా. కంఠము నిరోధించుట, అరుచి, తంద్ర, కలవరించుట, దేనియందిష్టము లేకయుండుట ఇట్టిలక్షణములుగలిగి చికిత్సజేయుటకు సాధ్యములుగాకయుండునవి చర్మపిటికలని తెలియవలయును.

రోమాంతికమసూరికాలక్షణము

రోమకూపోన్నతిసమా రాగిణ్యః కఫపిత్తజాః,
కాసారోచకసంయుక్తా రోమాంత్యో జ్వరపూర్వకాః. 15

తా. రోమకూపోన్నతితో సమములుగనుండి, యెఱ్ఱగనుండునవి కఫపిత్తము వలనజనించిన రోమాంతికమసూరికలని తెలియవలయు. అందు దగ్గు, అరుచి, తొలుత జ్వరము ఇవి గలిగియుండును.

రసగతమసూరికాలక్షణము

తోయబుద్బుదసంకాశా స్త్వగ్గతాశ్చ మసూరికాః,
స్వల్పదోషాః ప్రజాయన్తే భిన్నాస్తోయం స్రవంతి హి. 16

తా. ఉదకమునందలి బుద్బుదములవలె స్వల్పదోషము వలన జనించి పగిలి నీరుస్రవించునవి త్వగ్గతమసూరికలని తెలియవలయును.

రక్తగతమసూరికాలక్షణము

రక్తస్థా లోహితాకారాశ్శీఘ్రపాకా స్తనుత్వచః,
సాధ్యానాత్యర్థదుష్టాశ్చ భిన్నా రక్తం స్రవంతి చ. 17

తా. మిక్కిలి ఎఱ్ఱని ఆకారముగలవిగను, శీఘ్రముగ పక్వమగునవిగను, సూక్ష్మమగు చర్మముగలవిగనుండి పగిలి రక్తమును స్రవించునవి రక్తగతమసూరిక లని తెలియవలయు. ఇవి మిక్కిలి దుష్టములుకావుగాన సాధ్యములని యెఱుంగ వలయును.

మాంసగతమసూరికాలక్షణము

మాంసస్థాః కఠినాస్స్నిగ్ధాశ్చిరపాకా ఘనత్వచః,
గాత్రశూలారతీకండూతృష్ణాజ్వరసమన్వితాః. 18

తా. కఠినముగను మినమినకాంతిగలవిగను చిరకాలమునకు పక్వములగు నవిగను లావుచర్మముగలవిగనుండి శరీరము పోట్లు, అరతి, దురద, దప్పి, ఇవి గలవిగనుండిన మాంసగత మసూరికలని తెలియవలయును.

మేదోగతమసూరికాలక్షణము

మేదోజా మండలాకారా మృదవః కించిదున్నతాః,
ఘోరజ్వరపరీతాశ్చ స్థూలాః కృష్ణాస్సవేదనాః. 19
సంమోహారతిసంతాపాః కశ్చిదాభ్యో వినిస్తరేత్,

తా. పొక్కులు మండలాకారముగను మెత్తగను కొంచముబ్బుగను భయం కరమగు జ్వరముతోగూడినవిగను గొప్పవిగను నల్లనివర్ణముగలవిగను వేదనతోగూడి యుండునవిగను మోహము అరతి సంతాపము ఇవి గలవిగనుండిన మేదోగతమసూరి కలని తెలియవలయును, ఇది యొకానొక సమయమునందు మిక్కిలి తొందరచేయును గాన ఆసాధ్యమని తెలియవలయును.

అస్థిగత మజ్జాగతమసూరికాలక్షణము

క్షుద్రా గాత్రసమారూఢాశ్చిపిటాః కించిదున్నతాః. 20
మజ్జాస్థాభృశసంమోహా వేదనా రతిసంయుతాః,
ఛిందంతి మర్మధామాని ప్రాణానాశు హరంతి చ. 21
భ్రమరేణైవ విద్ధాని భవంత్యస్థీని సర్వతః,

తా. పొక్కులుచిన్నవిగను శరీరసమకాంతిగలవిగను అటుకులవలె కొంచ మున్నతముగలవిగను మిక్కుటమగుమోహము, వేదన, అరతి, ఇవి గలవిగనుండి మర్మస్థానములను భేదించుచు ప్రాణముల హరించునవిగనుండి యెముకలయందు తుమ్మె దలు తొలుచుచున్నటులనుండిన అస్థిమజ్జాగతమసూరికలని తెలియవలయును.

శుక్రగతమసూరికాలక్షణము

పక్వాభాః పిటికాః స్నిగ్ధాః శ్లక్ష్ణాశ్చాత్యర్థవేదనాః. 22
స్తైమిత్యారతిసంమోహదాహోన్మాదసమన్వితాః,
శుక్రజాయాం మసూర్యాం తు లక్షణాని భవన్తిచేత్. 23
నిర్దిష్టంకేవలంచిహ్నం దృశ్యతే నతు జీవతి,

తా. పిటికలు పక్వమైనవాటివలెనుండుట, నిగనిగలాడుట, మృదువుగనుం డుట, మిక్కుటమగు వేదనగలవిగనుండుండుట, మందముగనుండుట, అరతి, మోహము, తాపము, ఉన్మాదము, వీనితోగూడియుండిన, శుక్రగతమసూరికారోగమని యెరుం గవలయును. మరియు నీరోగి జీవించుట దుర్లభమని యెరుంగవలయును

ధాతుగతమసూరికామధ్యదోషసంబంధలక్షణము

దోషమిశ్రాస్తు సప్తైతా ద్రష్టవ్యా దోషలక్షణైః. 24

తా. ౭ విధములగు ధాతుగతమసూరికారోగములు వాతాదిదోష సంబంధ మువలన జనించునుగాన వాతాదిదోషములుగలవని యెరుంగవలయును.

ధాతుగతదోషమసూరికాసాధ్యాఽసాధ్యలక్షణము

త్వగ్గతా రక్తజాశ్చైవ పిత్తజాఃశ్లేష్మలాస్తథా,
పిత్తశ్లేష్మకృతాశ్చైవ సుఖసాధ్యా మసూరికాః. 25
ఏతా వినాపి క్రియయా ప్రశామ్యన్తి శరీరిణామ్,

తా. త్వగ్గత, రక్తగత, పిత్తజన్య, కఫజన్య, పిత్తకఫజన్యమసూరికలు, సుఖ సాధ్యంబులగుటచే, ఔషధములేకనే శాంతినిబెందును.

కష్టసాధ్యము

వాతజా వాతపిత్తోత్థా వాతశ్లేష్మకృతాశ్చ యాః. 26
కృచ్ఛ్రసాధ్యామతాస్తాస్తు యత్నాదేతా ఉపాచరేత్,

తా. వాతజమసూరిక; వాతపిత్తజమసూరిక, వాతశ్లేష్మజమసూరిక, ఇవి కష్ట సాధ్యములు, ప్రయత్నముచే చికిత్సంజేయవలయును.

అసాధ్యమసూరికాలక్షణము

అసాధ్యాస్సన్నిపాతోత్థాస్తాసాం వక్ష్యామి లక్షణమ్. 27

ప్రవాళసదృశాః కాశ్చిత్ కాశ్చిజ్జంబూఫలోపమాః,
లోహజాలసమాః కాశ్చిత్ అతసీఫలసన్నిభాః. 28
ఆసాం బహువిధా వర్ణా జాయంతే దోషభేదతః,

తా. సన్నిపాతజ మసూరికారోగములసాధ్యములు. వానిలక్షణముల వచించెదను. కొన్ని పగడములవలె కొన్ని నేరేడుపండురీతిగ కొన్ని లోహపుగుండ్లతెరంగున కొన్ని అతసీఫలములచందంబున ఇటుల దోషభేదములవలన బహువిధవర్ణములు గలవిగనుండును.

విశేషప్రకారము

కాసో హిక్కా ప్రమేహశ్చ జ్వరస్తీవ్రస్సుదారుణః. 29
ప్రలాపశ్చారతిర్మూర్ఛా తృష్ణా దాహోపఘూర్ణతా,
ముఖేన ప్రస్రవేద్రక్తం తథా ఘ్రాణేన చక్షుషా. 30
కంఠే ఘుర్ఘురకం కృత్వా శ్వసిత్యతిసుదారుణమ్,
మసూరికాభిభూతో యో భృశం ఘ్రాణేన నిఃశ్వసేత్ 31
సభృశం త్యజతి ప్రాణాన్ తృష్ణార్తో వాతదూషితః,

తా. దగ్గు ఎక్కిళ్లు ప్రమేహము దారుణజ్వరము కలవరించుట అరతి మూర్ఛ దప్పి తాపము కండ్లుతిరుగుట ముఖము కన్నులు ముక్కు వీనివలన రక్తముస్రవించుట కంఠమునందు గురగురలాడుచుండుట దారుణమగు నిట్టూర్పు వెడలుట ఇట్టి లక్షణములుగల మసూరికారోగి ముక్కులో మిక్కిలి నిట్టూర్పును వెడల్చుచు వాతప్రాబల్యముచే మిక్కిలి దప్పిగలవాడై మరణమును జెందు.

మసూరికోపద్రవములు

మసూరికాంతే శోథస్స్యాత్కూర్పరే మణిబంధకే. 32
తథాంసఫలకే వాపి దుశ్చికిత్స్యస్సుదారుణః,

తా. మసూరికారోగాంతమునందు మోచెయ్యి మణికట్టు భుజశిరస్సులు వీనియందు వాపుజనించెనేని అది చికిత్సజేయుటకును అసాధ్యమని తెలియవలయును.

శీతలాష్టకము

దేవ్యా శీతలయా క్రాన్తా మసూర్యేవ హి శీతలా. 33
జ్వరఏవ యథాభూతాధిష్ఠితో విషమజ్వరః,
సా చ సప్తవిధాఖ్యాతా తాసాం భేదాన్ ప్రచక్ష్మహే. 34

తా. శీతలాదేవిచే ఆక్రమింపబడిన మసూరికయే శీతలయనంబడు. భూతాభి

షంగ లక్షణములుగల విషమజ్వరము ఎట్లు భూతజ్వరమగునో అటులనే యని తెలియవలెను. ఇవి సప్తవిధములుగలదిగనుండును. లక్షణముల వచించెదను.

### బృహతీశీతలాలక్షణము

జ్వరపూర్వో బృహత్తోస్ఫస్సైశ్శీతలా బృహతీ భవేత్,
సప్తాహాన్నిస్సరత్యేషా సప్తాహాత్పూర్ణతాం వ్రజేత్. 35
తతస్తృతీయే సప్తాహే శుష్యతి స్ఖలతి త్వచం,
తాసాం మధ్యే చ యాఃకాశ్చిత్పాకం గత్వా స్రవంతి చ. 36

తా. తొలుతజ్వరముగలిగిన గొప్పకురుపులుగలుగునది బృహచ్ఛీతలయనంబడును. తొలుత 2 దినములకు బయలుపడును. రెండవ 2 దినములకు సంపూర్ణమగును. పిదప 3 వసప్తాహామునకు శుష్కించినదై చర్మము అరి నివర్తించును. అందు కొన్ని పాకమును పొందిస్రవించును.

### కోద్రవనామక మసూరికాలక్షణము

కఫమారుతసంభూతః కోద్రవోనామతో గదః,
అపాకః కోద్రవాకారశ్చుచిర్నిస్తోదకారకః. 37

తా. కఫవాతములవలన కోద్రవనామకరోగము జనించును. అది పక్వముకానిదై కోద్రవము (కొఱ్ఱ)లతో తుల్యమగు ఆకారముగలదై పరిశుద్ధమై శ్రమను చేయునదిగనుండును.

జలయుక్కోద్రవోంగేషు విధ్యతీవ విశేషతః,
సప్తాహోద్ద్వాదశాహోద్వా శాన్తిం యాతి వినౌషధైః. 38

తా. ఉదకముచేనిండియుండు కోద్రవనామకమసూరిక మిక్కిలి వేదనను జేయుచు 2 రోజులకుగాని లేక ౧౨ రోజులకుగాని ఔషధములేకనే శాంతిని జెందును.

### సాధ్యాసాధ్యవిచారము

కాశ్చిద్వినాపి యత్నేన సుఖం సిధ్యంతి శీతలాః,
దుష్టాః కష్టతరాః కాశ్చిత్కాశ్చిత్సిధ్యంతి వా నవా. 39
కాశ్చినైవ తు సిధ్యంతి యత్నతోపి చికిత్సితాః,

తా. మసూరికారోగములయందు కొన్ని ఔషధాదిప్రయత్నములేకనే సుఖముగ శాంతినిజెందును. దుష్టములగు కొన్ని కష్టతరములుగనుండును. కొన్ని నివర్తించుటగాని లేకుండుటగాని కలుగును. మరికొన్ని నివర్తించనే నివర్తించవు. ఇటుల నెరుంగవలయును.

వాతజమసూరికారోగమునకు బృహత్పటోలాదికషాయము

పటోలసారిబా ముస్తా పాఠా కటుకరోహిణీ. 40
ఖదిరః పిచుమందశ్చ బలా ధాత్రీ వికంకతః,
ఏషాం కషాయపానం తు హన్తి వాతమసూరికామ్. 41

తా. చేదుపొట్ల, సుంగధపాల, తుంగముస్తలు, విషబొద్ది, కటుకరోహిణి, చండ్ర, వేప, చిట్టాముట్టి, ఉశిరికెవోలుపు, పుల్లవెలగ, వీనిని సమభాగములుగ కషాయముకాచి పుచ్చుకొనిన వాతజమసూరికారోగము నివర్తించును.

ద్వే పంచమూల్యో రాస్నా చ ధాత్ర్యుశీరం దురాలభా,
సామృతం ధాన్యకం ముస్తం జయేద్వాతమసూరికామ్. 42

తా. దశమూలము, సన్నరాస్న, ఉశిరికె, వట్టివేరు, దూలగొండి, తిప్పతీగె, ధనియాలు, తుంగముస్తలు, వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతజమసూరిక నివర్తించును.

పిత్తజమసూరికారోగమునకు నింబాదికషాయము

నింబః పర్పటకం పాఠా పటోలం చందనద్వయమ్,
వాసా దురాలభా ధాత్రీ సేవ్యం కటుకరోహిణీ. 43
ఏషాం తు క్వథితం శీతం సితయా మధురీకృతమ్,
మసూరికాం పిత్తకృతాం హన్తి రక్తోత్తరామపి. 44

తా. వేప, పర్పాటకము, విషబొద్ది, చేదుపొట్ల, చందనము, రక్తచందనము, అడ్డసరము, దూలగొండి, నేలఉశిరికె, వట్టివేరు, కటుకరోహిణి, వీనిని సమములుగ కషాయముబెట్టి అందు చక్కెరచేర్చి పుచ్చుకొనిన పిత్తమసూరిక, రక్తాధికమసూరికారోగము నివర్తించునని తెలియవలయును.

ద్రాక్షాది కషాయము

ద్రాక్షాకాశ్మర్యఖర్జూరపటోలారిష్టవాసకైః,
లాజామలకదుస్స్పర్శా క్వథితం శర్కరాంచితమ్. 45
మసూరికాం పిత్తకృతాం రక్తజాం చ వినాశయేత్,

తా. ద్రాక్ష, గుమ్ముడు, ఖర్జూరము, చేదుపొట్ల, వేప, అడ్డసరము, పేలాలు, ఉశిరికెవోలుపు, దూలగొండి, వీనిని కషాయముబెట్టి అందు చక్కెరచేర్చి పుచ్చుకొనిన పిత్తజమసూరిక రక్తజమసూరిక ఇవి నివర్తించును.

కఫజమసూరికారోగమునకు పంచమూలాది కషాయము

బృహతః పంచమూలస్య వృషపత్రయుతస్య చ. 46

కషాయశ్శమయేత్పీతః కఫోత్థాంతు మసూరికామ్,

తా. బృహత్పంచమూలములు, అడ్డసరపాకులు వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన కఫజమసూరికారోగము నివర్తించును.

పిత్తకఫజమసూరికకు దురాలభాదికషాయము

దురాలభా పర్పటకం పటోలం కటురోహిణీ. 47
పిబేన్మసూర్యామేతేషాం క్వాథం పిత్తకఫాత్మకే,

తా. దూలగొండి, పర్పాటకము, చేదుపొట్ల, కటుకరోహిణి, వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన పిత్తకఫజమసూరికారోగము నివర్తించును.

వాతపిత్తజమసూరికారోగమునకు గుడూచ్యాదికషాయము

గుడూచీపర్పటానంతా కటుకీక్వథితం పిబేత్. 48
వాతపిత్తమసూర్యాం తు ఘోరోపద్రవభాజి చ,

తా. తిప్పతీగె, పర్పాటకము, దూలగొండి, కటుకరోహిణి, వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతపిత్తజమసూరికారోగము నివర్తించును.

వాతశ్లేష్మజమసూరికకు నాగరాదికషాయము

నాగరముస్తగుడూచీధాన్యక భార్గీవృషైః కృతః క్వాథః 49
వాతశ్లేష్మమసూరీం దూరీంకురుతే తు పానేన,

తా. శొంఠి, తుంగముస్తలు, తిప్పతీగె, ధనియాలు, భారంగి, అడ్డసరము, వీనిని కషాయముబెట్టి పుచ్చుకొనిన వాతశ్లేష్మమసూరికారోగము నివర్తించును.

సర్వమసూరికారోగములకు నిశాదికషాయము

నిశాద్వయోశీరశిరీషముస్తకైస్సలోధ్రభద్రశ్రియనాగకేసరైః 50
పటోలమూలారుణతండులీయకైః శృతంహరిద్రామలకల్కసంయుతమ్,
మసూరివిస్ఫోటవిసర్పశాంతయే పిబేత్సరోమాంత్యవమిజ్వరాపహామ్.

తా. పసపు, మానిపసపు, వట్టివేరు, దిరిశనము, తుంగముస్తలు, లొద్దుగ, చందనము, నాగకేసరములు, చేదుపొట్ల, పుష్కరమూలము, చిట్టిచేరు వీనిని కషాయముబెట్టి అందు పసపు, ఉశిరికవొలుపు వీనిని చూర్ణించి కలిపి పుచ్చుకొనిన మసూరి విస్ఫోటకము, విసర్పము, రోమాంత్యము, వమి, జ్వరము వీనిని నివర్తింపంజేయును.

నింబాదికషాయము

నింబఃపర్పటకం పాఠా పటోలం కటురోహిణీ,
వాసా దురాలభా ధాత్రీ ససేవ్యం చందనద్వయమ్, 52

ఏష నింబాదికః క్వాథః పీతశ్శర్కరయాన్వితః,
మసూరీం సర్వజాం హన్తి జ్వరవీసర్పసంయుతామ్. 53

తా. వేప, పర్పాటకము విషబొద్ది, చేదుపొట్ల, కటుకరోహిణి, అడ్డసరము, దూలగొండి, ఉశీరికె, నేవ్యము, చందనము, రక్తచందనము వీనిని కషాయము బెట్టి అందు చక్కెరచేర్చి పుచ్చుకొనిన సర్వజమసూరికారోగములు జ్వరము విసర్పము ఇవి నివర్తించును.

పటోలాదికషాయము

పటోలం కుండలీ ముస్తా వృషధన్వయవాసకైః,
భూనింబనింబకటుకాపర్పటైశ్చ శృతం జలమ్. 54
మసూరీం శమయేదామాం పక్వాం చైవ విశోధయేత్,
నాతఃపరతరం కించిచ్ఛీతలాజ్వరశాన్తయే. 55
దాహే జ్వరే విసర్పే చ వ్రణే పిత్తాధికేపిచ.

తా. చేదుపొట్ల, తిప్పతీగె, తుంగముస్తలు, అడ్డసరము, దూలగొండి, నీమ నేలవేము, వేప, కటుకరోహిణి, పర్పాటకము. వీనిని కషాయము బెట్టి పుచ్చుకొనిన ఆమమసూరిరోగమును నివర్తింపఁజేయుటయేగాక, పక్వమున శోధనమును గలుగం జేయును. మరియు నిది దాహము, జ్వరము, విసర్పము, వ్రణము, పిత్తాధిక్యము, వీనియందు సహా హితముగనుండును.

మసూరికాచికిత్స

మసూరికాయాం కుష్ఠోక్తా లేపనాదిక్రియా హితా. 56
పిత్తశ్లేష్మవిసర్పోక్తా క్రియా వా తత్ర శస్యతే,

తా. మసూరికారోగమునందు కుష్ఠురోగమునకు జెప్పిన లేపనాదిక్రియలం జేసిన, హితముగనుండును. మరియు పిత్తశ్లేష్మ విసర్పరోగమునందు జెప్పిన క్రియలు సహా హితకరములని తెలియవలయును.

సామాన్యోపచారములు

సర్వాసాం వమనం పూర్వం పటోలారిష్టవాసకైః. 57
కషాయశ్చ విధాతవ్యో యష్ట్యాహ్వాఫలకల్కితః,
సక్షౌద్రం పాయయేద్బ్రాహ్మీరసం వాహిలమోచకమ్. 58

తా. సర్వమసూరికారోగములయందును తొలుతవమనమునకై చేదుపొట్ల, వేప, అడ్డసరము, వీనిని కషాయము బెట్టి అందు యష్టిమధుకము, మ్రంగపండు వీనిని కల్కము

చేసి, అందు, తేనెచేర్చిగాని లేక బ్రాహ్మీరసము చకోతపుహారరసము వీనిలో తేనె చేర్చిగాని పుచ్చుకొనిన వమనంబగును.

బృహతీమసూరికోపచారములు

తత్రావధూళనం కుర్యాద్వనగోమయభస్మనా,
నింబసత్పత్రశాఖాభిర్మక్షికాఅపసారయేత్. 59
జలం చ శీతలం దద్యాజ్జ్వరే పానే తు తత్పిబేత్,

తా. మసూరికారోగమునందు అడవియందుండు ఏరుపిడకల భస్మముచే, * అవధూళనము జేయవలయు. మంచివేపమండలచే మక్షికములనుతోలవలయు. చల్లని ఉదకమును పానమున కొసంగవలయు.

రక్షణప్రకారము

స్థాపయేత్తం స్థలే పూతే రమ్యే రహసి శీతలే. 60
నాశుచిస్సంస్పృశేత్తం తు న చా స్యాంతికమావ్రజేత్,

తా. మసూరికారోగిని పవిత్రమగునట్టి చల్లని రమ్యస్థలమునందుంచవలయు. అపరిశుద్ధులు స్పృశించరాదు. సమీపమునకు సహా జనగూడదు.

సామాన్యచికిత్స

జపహోమోపహారైశ్చ దానస్వస్త్యయనార్చనైః. 61
విప్రగోశంభుగౌరీణాం పూజనైస్తాం శమం నయేత,

తా. (సన్నిపాతాత్మక) శీతలాదేవిని గూర్చి జపము, హోమము, నైవేద్యము, దానము, పుణ్యాహవాచనము, పూజనము, బ్రాహ్మణులు, గోవులు, ఈశ్వరుడు, పార్వతి వీరిని పూజించుట వీనిచే, శాంతిని జెందించవలయును.

స్తోత్రపాఠము

స్తోత్రం చ శీతలాదేవ్యాః పఠేచ్ఛీతలినోంతికే. 62
బ్రాహ్మణశ్శ్రద్ధయా యుక్తస్తేన శామ్యన్తి శీతలాః,

తా. శీతలాదేవియొక్క స్తోత్రమును మసూరికారోగియొక్క సమీపమునందు బ్రాహ్మణుడు శ్రద్ధాయుక్తుడై పఠించిన శీతలాదేవి శాంతిని జెందును.

గుడూచ్యాదిచూర్ణము

గుడూచీ మధుకం ద్రాక్షా మోరటం దాడిమైస్సహ. 63
పాకకాలే ప్రదాతవ్యం భేషజం గుడసంయుతమ్,
తేన కుప్యతి నో వాయుః పాకం యాన్తి మసూరికాః. 64

* అవధూళగమనగా వ్రణములయందు చల్లుట.

తా. తిప్పతీగె, అతిమధురము, ద్రాక్ష, చాగ, దాడింబపండు, వీనిని సమములుగ చూర్ణించి, బెల్లముచేర్చి 2 రోజులు అతిక్రమించినపిదప పాళకాలము నెరింగి పుచ్చుకొనిన వాయువు ప్రకోపించక మసూరికారోగము పక్వమును జెందును.

### చించాబీజచూర్ణము

యే శీతలేన సలిలేన విశిష్య సమ్యక్ చించోత్థబీజసహితాం రజనీం పిబంతి,
తేషాం భవన్తి నకదాచిదపీహ దేహే పీడాకరా జగతిశీతలికా వికారాః. 65

తా. చింతవిత్తులు, పసపు, వీనిని చూర్ణించి, చల్లనీళ్లలోకలిపి పుచ్చుకొనిన వారికి శీతలాసంబంధమగు వికారములు ఎన్నడును సోకవు.

### న్యగ్రోధాదిలేపము

న్యగ్రోధప్లక్షమంజిష్ఠాశిరీషోదుంబరత్వచామ్,
ససర్పిష్కం మసూర్యాం తు వాతజాయాం ప్రలేపనమ్. 66

తా. మఱ్ఱి, జువ్వి, మంజిష్ఠ, దిరిశనము, అత్తి, వీనిపట్టనునూరి, నేతిలో కలిపి లేపనముజేసిన, వాతజమసూరికారోగము నివర్తించును.

### ఖాదిరాదిలేపము

ఖాదిరారిష్టపత్రైశ్చ శిరీషోదుంబరత్వచామ్,
కుర్యాల్లేపః కఫోత్థాయాం మసూర్యాం భిషగుత్తమః. 67

తా. చండ్ర, వేపఆకులు, దిరిశనపట్ట, అత్తిపట్ట, వీనినినూరి లేపనముజేసిన, కఫజమసూరికారోగము నివర్తించును.

### మధుకాదిలేపము

మధుకం త్రిఫలా మూర్వా దార్వీత్వక్ నీలముత్పలమ్,
ఉశీరలోధ్రమంజిష్ఠా ప్రలేపాశ్చోతనే హితాః. 68
నశ్యంత్యనేన చ గదామసూర్యో న భవంతి చ,

తా. అతిమధురము, త్రిఫలములు, చాగ, మానిపసపు, అవంగపట్ట, నల్లకలువ, కట్టివేరు, లొద్దుగ, మంజిష్ట, వీనినినూరి లేపనముజేసినను లేక వీనిని కషాయముబెట్టి కడిగినను మసూరికయందు హితకరముగనుండును.

### వాసాస్వరసము

వృషపత్రరసం దద్యాత్ పానార్థం మధుసంయుతమ్. 69

కఫజాయాం మసూర్యాం తు కఠినాయాం విశేషతః,

తా. అడ్డసరపుఆకుల స్వరసమునందు, తేనెవైచి పానముజేసిన, కఫమువలన జనించి, కఠినముగనుండు మసూరిక నివర్తించును.

మోచారసాదిపానము

మోచారసేన సహితం సితచందనం యే వాసారసేన మధువామధుకేనవాథ. 70

ఆదా పిబంతి సుమనాస్వరసేన మిశ్రం తేనాప్నువంతి భువి శీతలికావికారమ్,

తా. బూరగరసము, చందనము, వీనిని గాని, అడ్డసరపుఆకురసము తేనెగాని, అతిమధురము తేనెగాని, లేక జాజిపూలరసము తేనెగాని, పుచ్చుకొనిన శీతలావికారము జనింపకుండును.

వేణుత్వగాదిధూపము

వేణుత్వక్సురసాలాక్షాకార్పాసాస్థిమసూరికాః. 71

యవపిష్టం విషం సర్పిర్వచా బ్రాహ్మీ సువర్చలా,

ధూపనార్థే యథాలాభం ధూపమేనం ప్రయోజయేత్. 72

ఆదావంతే ప్రయోక్తవ్యోనశ్యంత్యస్మాన్మసూరికాః,

న గృహ్ణన్తి విషం కేచిద్యథాలాభశ్రుతావిహ. 73

తా. వెదురుతొక్క, తులసి, లక్క, ప్రత్తివిత్తులు, చిఱుశనగలు, యవపిష్టము నాభి, నెయ్యి, వస, బ్రాహ్మి, సువర్చలా, వీనిని యథాలాభముగ ధూపమిడిన, మసూరికారోగము నివర్తించు. కొంతమంది నాభి నిందు గ్రహించరు.

మసూరికాపథ్యములు

జీర్ణాష్షష్టికశాలయోపి చణకా ముద్గా మసూరా యవాః,

సర్వేపి ప్రతుదాఃకపోతచటకాయష్ట్యాహ్వాదాత్యూహకాః 74

కర్కోటం కదళం చ శిగ్రుకులకం ద్రాక్షాఫలం దాడిమమ్,

మేధ్యం బృంహణమన్నపానమఖిలం కోలాని మాంసో రసః. 75

పక్వో ముద్గరసోపి జాంగలరసశ్శాలిం చ శాకం ఘృతమ్,

ధూమో గోమయభస్మగుంఠనమథో శేషే వ్రణోక్తాః క్రియాః. 76

ఇత్థం సర్వదశావిభాగవిహితం పథ్యం హితం దోషతః,

సంయుక్తం ముదమాతనోతి నితరాం నృణాం మసూరీగదే, 77

తా. ౬౦ దినములకుపండు పాతరొట్టెవడ్లు, సంబాబియ్యము, శనగలు, పెసలు, చిరుశనగలు, యవలు, (సర్వప్రతుదజంతువులు) పావురము, పిచుక, వాన కోయిల, వీనిమాంసము, అతిమధురము, దోసకాయ, అరటికాయ, మునగకాయ, చేదుపొట్ల, ద్రాక్ష, దాడింబపండు, మేధాజనకమై పుష్టికరమగు అన్నపానములు, రేగు, మాంసరసము, పెసరకట్టు, జాంగలదేశజంతుమాంసము, శాల్యన్నము, ఆకు కూరలు, నెయ్యి, ధూమము, గోమయభస్మలేపనము, వ్రణనాశకక్రియలు, ఇటుల, మసూరీదేవిసంపూర్ణముగ నుండుకాలమున, దోషములతో గూడియుండినను, వీని నన్నియు పథ్యంబిడవలయు.

## అపథ్యములు

వాతం స్వేదం శ్రమం తైలం గుర్వన్నం క్రోధమాతపమ్,
కట్వామ్లం వేగరోధం చ మసూరీగదవాంస్త్యజేత్. 78

తా. గాలి, చమట, శ్రమ, తైలము, గురుకరమగుఅన్నము, క్రోధము, ఎండ, కారము, పులుసు, మలమూత్రవేగనిరోధము, వీనిని మసూరీరోగముగలవాడు వర్జించవలయును.

మసూరికారోగము సమాప్తము.

---

# గళగండప్రకరణమ్.

## గళగండకర్మవిపాకము

గళగండీగణద్రవ్య హర్తా భవతి మానవః,
దానేన తత్ప్రతీకారం వక్ష్యామి శృణు భాస్కర. 1
మాణిక్యం పద్మరాగం చ వజ్రం మౌక్తికమేవ చ,
వైడూర్యం పుష్పరాగం చ నీలం మరకతం తథా. 2
ఏభిర్మాలాం ప్రకుర్వీత సూత్రమప్యత్ర రాజతమ్,
అలాభే మౌక్తికాద్యన్యతమైర్మాలాం ప్రకల్పయేత్. 3
సర్వత్ర రాజతం సూత్రమితి వేదే ప్రకల్పితమ్,
తామ్రపాత్రే వినిక్షిప్య తిలానాముపరిన్యసేత్. 4
తిలానాం చ పరీమాణం ద్రోణపంచకమిష్యతే,
వాతదూర్ధ్వం నవగ్రహాదిమహాశాన్తిం కుర్యాత్. 5

రత్నమాలాం పూజయిత్వా వేదశాస్త్రవిదేబ్రాహ్మణాయ దద్యాత్,

తా. సముదాయద్రవ్యమును అపహరించినవానికి, గళగండరోగము జనించు. తన్నివృత్తికై, మాణిక్యము, పద్మరాగము, వజ్రము, ముత్యము, వైడూర్యము పుష్పరాగము, నీలము, మరకతము, వీనినిగాని, వీనిలో దొరికిన వానినిగాని, వెండికమ్మితోగూర్చి మాలికజేసి, తామ్రపాత్రయందైదు ద్రోణములనువ్వులుబోసి, వానిపై ఆమాలికనునిచి, నవగ్రహాదిమహాశాంతిజేసి పూజించి, వేదశాస్త్రసంపన్నుడగు బ్రాహ్మణునికి దానము జేయవలయును.

గళగండస్వరూపము

నిబద్ధశ్శ్వయథుర్యస్య ముష్కవల్లంబతే గళే. 6
మహాన్వా యది వా హ్రస్వో గళగండం తమాదిశేత్,

తా. కంఠమునందు పెద్దదిగాని, లేక చిన్నదిగాని వాపుగలిగి, వృషణము వలె వ్రేలుచుండిన, దానిని గళగండమనియెదరు.

గళగండసంప్రాప్తి

వాతః కఫశ్చాపి గళే ప్రదుష్టో మన్యే సమాశ్రిత్య తథైవ మేదః. 7
కుర్వంతి గండం క్రమశస్స్వలింగైస్సమన్వితం తం గళగండమాహుః,

తా. వాతము, కఫము, ఇవిదుష్టములై, కంఠమునందలి మన్యలను సిరలను మేదస్సును జేరి, క్రమముగవృద్ధిపొంది, తమతమలక్షణములతోగూడి, నొకగ్రంధిని గలుగంజేసిన, దానిని గళగండమనియెదరు (ఇది, వాతజ, కఫజ, మేదోజములన, త్రివిధములుగనుండును.)

వాతికగళగండలక్షణము

తోదాన్వితః కృష్ణసిరావనద్ధశ్శ్యావారుణో వా పవనాత్మకస్తు.
పారుష్యయుక్తశ్చిర వృద్ధ్యపాకో యదృచ్ఛయా పాకమియాత్కదాచిత్,
వైరస్యమాస్యస్య చ తస్య జంతోర్భవేత్తథా తాలుగళప్రశోషః. 9

తా. సూదులతో బొడిచినటుల పీడగలుగుట, నల్లనిసిరలతో వ్యాప్తంబై యుండుట, నల్లగను, లేక, యెఱ్ఱగను, కఠినముగనుండుట, చిరకాలమునకు వృద్ధిపొంది పక్వముగాకయుండుట, ఒకానొకప్పుడు, స్వేచ్ఛగపాకమును బొందుట, నోరు విరసముగనుండుట, దవడలు, గొంతు, ఇవి యెండుట, ఇట్టి లక్షణములు గలిగియుండిన వాతికగళగండమని తెలియవలయును.

## కఫజగళగండలక్షణము

స్థిరస్సవర్ణో గురురుగ్రకండూశ్శీతో మహాంశ్చాపి కఫాత్మకస్తు,
చిరాభివృద్ధిం భజతే చిరాద్వా ప్రపచ్యతే మందరుజః కదాచిత్. 10
మాధుర్యమాస్యస్య తస్య జంతోర్భవేత్తథా తాలుగళప్రలేపః,

తా. స్థిరముగ చర్మముతో సమానవర్ణముగలదై, బరువుగను, మిక్కిలి దురద గలదిగను, శీతలముగను పెద్దదిగను, దీర్ఘకాలముమీద వృద్ధిపొందునదిగను, దీర్ఘకాలమునకు నొకానొక సమయమున పక్వమైనదిగను, పక్వమయినపుడు కొంచము పోట్లుగలదిగను, నోరుతీపిగను, దవడ గొంతు ఇవి కఫముతో నలకబడినవిగను ఇటులనుండిన, కఫజగళగండమనియెదరు.

## మేదోజగళగండలక్షణము

స్నిగ్ధోగురుఃపాండురనిష్టగంధోమేదోభవస్స్వల్పరుజోఽతికండూః.
ప్రలంబతేఽలాబువదల్పమూలో దేహానురూపక్షయవృద్ధియుక్తః,
స్నిగ్ధాస్యతాతస్య భవేచ్చ జంతోర్గళేనుశబ్దం కురుతే చ నిత్యమ్. 12

తా. మినమినలాడుట, జడము, పాండువర్ణము, దుర్గంధము, కొంచమునొప్పి, మిక్కిలిదురద, మొదలుస్వల్పముగనుండి, పిదప, సొరకాయవలె వ్రేలుట, దేహముక్షయించిన, క్షయించుట, దేహమువృద్ధిజెందిన, వదియును వృద్ధిజెందుట, ముఖము మినమినలాడుట, సంభాషించునపుడు, కంఠమున * అనుశబ్దము వెడలుట, ఇట్టి లక్షణములుగలది, మేదోజగళగండమని తెలియవలయును.

## అసాధ్యలక్షణము

కృచ్ఛ్రాచ్ఛ్వసంతం మృదుసర్వగాత్రం సవత్సరాతీతమరోచకార్తమ్,
క్షీణం చ వైద్యో గళగండజుష్టం భిన్నస్వరం చాపి వివర్జయేత్తు. 13

తా. అతికష్టముగశ్వాసవిడుచుట, సర్వశరీరముమృదువుగనుండుట, గళగండము జనించి సంవత్సరముగడుచుట, అరుచి, శరీరక్షయము, స్వరభేదము, ఇట్టి లక్షణములుగల గళగండరోగిని త్యజించవలయును.

## చికిత్సాక్రమము

స్వేదోఽనిలోత్థే గళగండకాదౌ నాడ్యానిలఘ్నౌషధపత్రపిండైః,

తా. వాతగళగండమునకు, నాడీస్వేదము, వాతహరములగు పదార్థములు, ఆకులు వీనితోస్వేదనమొనర్చుట, అట్టి వానినినూరి ముద్దజేసి వేడిగాఁ గట్టుకట్టుట వీనిని జేయవలెను.

---

* అను శబ్దమనగాఁ బ్రతిధ్వనివలె జంటగా శబ్దమగుట

### వాతగళగండచికిత్సా

నిచులం శిగ్రుమూలంవాదశేమూలమథాపిచ. 14
ఆలేపనేవాతగండే సుఖోష్ణం సంప్రశస్యతే,

తా. కదంబవేరు, మునగవేరు, మరియు దశమూలములు,వీనిలో దేనినైననునూరి, కొంచము వెచ్చజేసిలేపనముజేసిన వాతజగళగండము నివర్తించును.

### కఫజగళగండచికిత్సాక్రమము

స్వేదోపనాహకా కఫసంభవేపి కృత్వా క్రమంశ్లేష్మహరం విదధ్యాత్.

తా. కఫజగళగండమునందు, స్వేదక్రియ, ఉపనాహక్రియ, శ్లేష్మహర పదార్థ సేవనము, వీనిని జేయవలయును.

### మేదోజగళగండచికిత్సా

మేదస్సముత్థేత్ర యథోపదిష్టా వింధ్యేత్సిరాం స్నిగ్ధతనోర్నరస్య,
శ్యామాసుధాలోహపురీషదన్తీరసాంజనైశ్చాపి హితః ప్రలేపః.15

తా. శాస్త్రోక్తప్రకారము స్నేహనమునుజేసి, సిరావేధంజేయుట, నల్ల తెగడ, సున్నము, లోహకిట్టము, నేపాళములు, రసాంజనము, వీనినినూరి, లేపనము జేయుట ఇట్లు జేసిన మేదోజగళగండమునకు హితముగనుండును.

### సర్షపాదిలేపము

సర్షపాశ్శిగ్రుబీజాని శణబీజాతసీయవాః,
మూలకస్య చ బీజాని తక్రేణామ్లేన పేషయేత్. 17
గండాని గ్రంథయశ్చైవ గండమాలాస్తథైవచ,
ఆలేపాత్తేన శామ్యన్తి విలయం యాన్తి వాఽచిరాత్. 18

తా. తెల్లావాలు, మునగవిత్తులు, జనపవిత్తులు, అగసివిత్తులు, యవలు, ముల్లంగివిత్తులు, వీనిని పులిమజ్జిగతోనూరి లేపనముచేసిన గళగండము, గ్రంథులు, గండమాల, ఇవి శీఘ్రముగ నివర్తించును.

### పలాశమూలలేపము

తండులోదకపిష్టేన మూలేన పరిలేపతః,
హితం కర్ణే పలాశస్య గళగండః ప్రశామ్యతి. 19

తా. మోదుగవేరును తండులోదకముతోనూరి, చెవులయందు లేపనము జేసిన, గళగండము మానును.

### సూర్యావర్తలేపము

సూర్యావర్తరసో నాభ్యాం గళగండోపనాహనమ్,

స్ఫోటాస్రావైస్సం ప్రయాతి గళగండో న సంశయః. 20

తా. * సూర్యావర్తము, వెల్లుల్లి, వీనినినూరి ముద్దజేసి, కట్టుగట్టిన, బొబ్బలు స్రావము, వీనితోగూడికొనిన గళగండము నివర్తించును.

### దేవదార్వాదిలేపము

దేవదారుర్విశాలా చ కఫగండే ప్రలేపనమ్,
ఛర్దనం శీర్ష రేకశ్చ సర్వే గండగదే హితాః. 21

తా. దేవదారు, పాపర, వీనినినూరి లేపనము, వమనము, శిరోవిరేచనమును జేసిన, సర్వగళగడంములయందు హితకరములుగనుండును.

### అమృతాదితైలము

తైలం పిబేచ్ఛామృతవల్లినింబహింగ్వాభయావృక్షకపిప్పలీభిః,
సిద్ధం బలాభ్యాం చ సదేవదారుహితాయ నిత్యం గళగండరోగే. 22

తా. తిప్పతీగ, వేప, ఇంగువ, కరకపిందెలు, వృక్షకము, (కర్కాటకశృంగి) పిప్పళ్లు, పెద్దముత్తవపులగ, చిన్నముత్తవపులగ, దేవదారు, వీనికల్కముచేర్చి సిద్ధము జేయబడుతైలమును లేపనముచేసిన, గళగండము నివర్తించును.

### విడంగాదితైలము

విడంగక్షారసింధూగ్రారాస్నాగ్నివ్యోషదారుభిః,
కటుతుంబీఫలరసే కటుతైలం విపాచితమ్. 23
చిరోత్థమపి నస్యేన గళగండం వినశ్యతి,

తా. వాయువిడంగములు, యవక్షారము, సైంధవలవణము, వస, సన్నరాస్నము, చిత్రమూలము, త్రికటుకములు, దేవదారు, వీనికషాయము, చేదుసారకాయలరసము, తెల్లావాలనూనె. వీనినిగలిపి, తైలపక్వముగకాచి నస్యముచేసిన, చిరకాలమునుండియుండు గళగండము నివర్తించును.

### తుంబ్యాదితైలము

తుంబీరసేన కటుకేనచతుర్గుణేనకల్కీకృతైర్గదజాదిగణౌషధైశ్చ,
తైలం శృతం హరతి దేహిషు గండమాలామత్యుల్బణామపి గళే
గళగండరోగాన్,

తా. చేదుసారకాయరసము ౪ భాగములు, పిప్పల్యాదిగణౌషధకల్కము ౧ భా

* ప్రొద్దుతిరుగుడు చెట్టువేరు.

గము, వీనికిసమము, తిలతైలముచేర్చి తైలపక్వముగ కాచి లేపనముజేసిన, మిక్కిలి ఉద్ధృతముగనుండు గండమాల, గలగండములు ఇవి నివర్తించును.

అపచికి వ్యోషాదితైలము

వ్యోషం విడంగం మధుకం సైంధవం దేవదారు చ 25
తైలమేభిశ్శృతం న స్యాత్కృఛ్రామప్యపచీం జయేత్,

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, యష్టిమధుకము, సైంధవలవణము, దేవదారు, వీనికల్కముతో సిద్ధముజేయబడిన తైలము అసాధ్యముగ నుండు, అపచిరోగమును నివర్తింపంజేయును.

చందనాదితైలము

చందనం సాభయా లాక్షా వచా కటుకరోహిణీ, 26
ఏతత్తైలం శృతం పీతం సమూలామపచీం జయేత్,

తా. చందనము, కరకపిందెలు, లక్క, వస, కటుకరోహిణి, వీనిచే సిద్ధముచేసిన తైలమును పానముజేసిన, అపచిరోగము నివర్తించును.

మండూరలోహము

మహిషీమూత్రవిమిశ్రం లోహమలం సంస్థితం ఘటే మాసమ్. 27
అంతర్ధూమవిదగ్ధం మధునా గళగండనాశనం లీఢమ్,

తా. లోహకిట్టమును ఘటమునందునిచి, బఱ్ఱెమూత్రముపైచి ౧ మాసము వరకు నాననిచ్చి పిదప దానికి మూతవేసి సీలుచేసి గజపుటమిడి, సాంగశీతలమున దీసి చూర్ణించి, తేనెతో సేవించిన గళగండము నివర్తించును.

అలాబుజలపానము

తిక్తాలాబుఫలే పక్వే సప్తాహముషితం జలమ్. 28
గళగండం నిహంత్యాశు పానాత్పథ్యానుశీలినః,

తా. పండిన చేదుసొరకాయయందు నీళ్లుబోసి ౭ దినములునిచి, పిదప నాయుదకమును పానముచేసి పథ్యముగ భుజించిన గళగండము నివర్తించును.

జీర్ణకర్కారుకయోగము

జీర్ణకర్కారుకరసో బిడసైంధవసంయుతః. 29
నస్యేన తరుణం హన్తి గళగండం న సంశయః,

తా పండుగుమ్మడికాయరసమునందు, బిడాలవణము సైంధవలవణము వీనిని చేర్చి నస్యముజేసిన, తరుణముగనుండు గళగండము మానును.

గళగండప్రకరణముసమాప్తము.

---

శ్రీ ర స్తు.

# గండమాలాప్రకరణమ్.

## గండమాలా కర్మవిపాకము

అధ్యాపయతి శిష్యాంస్తు యః ప్రతార్య గురుస్తథా,
శిష్యో గురుం వంచయిత్వా యోధీతే శృణు తస్య చ. 1
జాయతే గండమాలాఖ్యో రోగస్తదుపశాంతయే,
అభక్ష్యపానపాయీ వా గండమాలీ భవేన్నరః. 2
కృఛ్రత్రయం ప్రకుర్వీత చాంద్రాయణమథాపరమ్,
అష్టోత్తరసహస్రం తు జపేత్పురుషసూక్తకమ్. 3
సౌరమంత్రజపస్తద్వచ్ఛక్త్యాబ్రాహ్మణభోజనమ్,
ఇతి కృత్వా నరస్సమ్యగ్గలగండాద్విముచ్యతే. 4

తా. గురువు శిష్యునివంచించి అధ్యయనము చెప్పుటవలనగాని, లేక శిష్యుడు గురువును వంచించి అధ్యయనము చదువుటవలనగాని లేక అభక్ష్యభక్షణము, పానార్హములుగాని మద్యపానము మొదలగువానినిచేయుట వలనగాని, గండమాలజనించు. తన్నివృత్యర్థమై 3 కృఛ్రములు, చాంద్రాయణము, అష్టోత్తర సహస్రపురుషసూక్త జపము లేక అష్టోత్తరసహస్రసౌరమంత్రజపము, వీనినిజేసి శక్త్యనుసారముగ బ్రాహ్మణులకన్నమిడిన, గండమాలవలన విముక్తుడగును.

## గండమాలాస్వరూపము

కర్కంధుకోలామలకప్రమాణైః కక్షాంసమన్యాగళవంక్షణేషు,
మేదఃకఫాభ్యాంచిరమందపాకైః స్యాద్గండమాలాబహుభిస్తుగండైః.

తా. మేదస్సు, కఫము వీనివలన చంకలు, భుజశిరస్సులు, పెడకల పెద్దనరములు, కంఠము, గజ్జలు, వీనియందు రేగుపండు మిరియాలు ఉశిరికకాయ వీని ప్రమాణముగల అనేకవిధములైన గ్రంథులుజనించి సావకాశముమీద కొంచము పాకమును జెందిన గండమాలయనంబడు.

## గండమాలభేదములు

చత్వారః క్రిమిభీరోగా జాయన్తే గ్రంధిపూర్వకాః,
హృద్పయే గండమాలాభం కంఠే జాతం తథైవచ. 6

కపోలగండమాలాచా ప్యుత్తమాంగే చ జాయతే,
దంతవ్రణం కటౌ జాతం శ్రవణేవాంసగండకే. 7
ఏతే దుర్గంధసంయుక్తాశ్శ్వేతరక్తసమన్వితాః,
ఏతేషాం భేషజం చైవ కథ్యతే పూర్వవేదిభిః. 8

తా. క్రిములవలన గ్రంధిపూర్వకములగు ౪ విధంబులుగ గండమాలా రోగములుత్పన్నంబులగు అవి యెవ్వియనిన హృదయమునందుజనించిన హృదయగండమాలయనియు, కంఠమునందు జనించిన కంఠగండమాలయనియు, శిరస్సునందు జనించిన కపాలగండమాల యనియు, కపోలములయందు జనించిన కపోలగండమాలయనియును జెప్పంబడు మరియు దంతములయందు జనించినదంతవ్రణమనియు, కటిప్రదేశమునందుజనించినకటివ్రణమనియు,కర్ణమునందు జనించిన కర్ణవ్రణమనియు, నాసికయందు జనించిన నాసికావ్రణమనియును వచింపంబడు. ఇవి యన్నియు దుర్గంధయుక్తములై చీముకారుచు, తెల్లగ, లేక, యెఱ్ఱగనుండు. వీనికి ఔషధములు పూర్వజ్ఞులచే చెప్పంబడియెను.

## కపాలగండమాలాలక్షణము

కపాలగండమాలాతుహ్యుత్తమాంగేచజాయతే,
ఏషాదుర్గంధసంయుక్తాశ్వేతరక్తసమన్వితా. 9

తా. శిరస్సునందు గండమాలజనించి దుర్గంధముతోగూడి చీముకారుచు తెల్లగ, యెఱ్ఱగనుండిన దానిని కపాలగండమాలయనియెదరు.

## గండమాలాకషాయము

కులుత్థం మరిచం హింగు సజలం గండపాచనమ్,

తా. ఉలవలు, మిరియాలు, ఇంగువ, వీనినికషాయముబెట్టి పుచ్చుకొనిన, గండమాలపక్వము జెందును.

## కాంచనారాదికషాయము

కాంచనారత్వచః క్వాథశ్శుంఠీచూర్ణేన నాశయేత్. 10
గండమాలాం తథా క్వాథః క్షౌద్రేణ వరుణత్వచః,

తా. దేవకాంచనపుపట్టను కషాయముబెట్టి, అందు, శొంఠిచూర్ణమును జేర్చి పుచ్చుకొనిన లేక ఉలిమిడిపట్టకషాయమున, తేనెచేర్చి పుచ్చుకొనినను, గండమాల నివర్తించును.

## గండమాలాఖండనరసము

కర్షం సూతం శుద్ధమస్య గంధకం త్వర్ధముత్తమమ్. 11

సార్ధకర్షం తామ్రభస్మమృతం కిట్టం త్రికర్షకమ్,
వ్యోషం షట్కర్షతులితమక్షార్థం సైంధవం స్మృతమ్. 12
కాంచనారత్వచశ్చూర్ణం పలత్రయమితం క్షిపేత్,
పలత్రయం గుగ్గులోశ్చ శుద్ధస్య సమపాహరేత్. 13
ఏతద్వ్యక్త్వా తు సంమేళ్య సురభీసర్పిషా దృఢమ్,
గండమాలాఖండనోయం రసో మాషత్రయాత్మకః. 14
భుక్తో నిహన్తి గండాని గండమాలాం చ దారుణామ్,

తా. శుద్ధిచేసినరసము ౧ కర్షము, శుద్ధిచేసినగంధకము ౪ కర్షము, తామ్ర భస్మము ౧౪ కర్షము, మండూరము ౩ కర్షములు, శొంఠి ౨ కర్షములు, పిప్పలి ౨ కర్షములు, మిరియాలు ౨ కర్షములు, సైంధవలవణము ౪ అతులము, దేవకాంచనపుచక్కచూర్ణము ౩ పలములు శుద్ధిచేసినమహిసాక్షి, గుగ్గిలము ౩ పలములు వీనిని నేకముగచేర్చి, ఖల్వమునందునిచి, ఆవునేతితో మర్దించి, ౩ మాషములయెత్తుమాత్రలు చేసిసేవించిన భయంకరములైన గళగండము, గండమాల ఇవి నివర్తించును.

## గంధకాదిలేపము

గంధకం టంకణం సింధుం కాంచనీనవసాగరమ్. 15
సౌవర్చలం యవక్షారం కాచం రక్తం సువర్చికామ్,
శ్వేతం రక్తం చ పాషాణం మూషకోత్థం నియోజయేత్. 16
జేపాలబీజమజ్జాం చ సమం జంబీరపేషితమ్,
శస్త్రైశ్ఛిత్వా ప్రదాతవ్యం వేష్టయేమేరండపత్రకైః. 17
ఏవం త్ర్యహాత్స్ఫుటంత్యేవ దధ్యన్నం దాపయేత్తతః,
గండమాలాపచీగ్రంథిర్బహిర్నిర్యాతి నాన్యథా. 18

తా. గంధకము, వెలిగారము, సైంధవలవణము, దేవకాంచనపుపట్ట, నవాసారము శౌవర్చలవణము, యవక్షారము, కాచలవణము, సింధూరము, శౌవర్చలవణము శంఖపాషాణము, తొట్టిపాషాణము, ఉల్లిపాషాణము, నేపాళములు, వీనిని, సమముగ నిమ్మపండ్లరసముచే మర్దించి, శస్త్రములచేచివ్వి యీ ఔషధమునునిచి, పైని ఆముదపాకులువైచి మూడుదినములు కట్టుగట్టిన, గండమాల, అపచి, గ్రంథి ఇవి పగిలి వీని యందలి దోషములయలువెడలును. దీనికి పెరుగన్నము పథ్యమిడవలయును.

## ముండీమూలలేపము

నిజద్రవేణ సంపిష్టం ముండీమూలం ప్రలేపయేత్,
గండమాలా క్షయం యాతి తద్ద్రవం చ పిబేత్పలమ్. 19

తా. బోడతరమువేరును, దానిరసముచేత నేనూరి లేపనముజేసిన, గండమాల నివర్తించును. మరియు ఆబోడతరపురసమును నొకపలము పుచ్చుకొనినను గండమాల నివర్తించును.

గండమాలపగులుటకు లేపము

జలేన పేషయేత్తుల్యం కాంచనీం చిత్రకం వృషమ్,
సప్తాహం లేపయేత్తేన సర్వజా గండమాలికాః. 20
స్ఫుటంతి నాత్ర సందేహాస్స్ఫుటే లేపమిమం కురు,

తా. దేవకాంచనపువేరు, చిత్రమూలము, అడ్డసరము, వీనిని సమముగ నుదకముతోనూరి ౭ దినములు లేపనముజేసిన, సర్వగండమాలలుపగులును. పిదప, దానిపై దీనినే లేపనముజేయవలయును.

భల్లాతకాదిలేపము

భల్లాతకాసీసహుతాశదన్తిమూలైర్గుడస్నుక్రవిదుగ్ధదిగ్ధైః. 21
లేపే కృతే గచ్ఛతి గండమాలా సమీరవేగాదివ మేఘమాలా,

తా. జీడిగింజలు, కాసీసము, చిత్రమూలము, దంతిమూలము, బెల్లము, వీనిని బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు వీనిచేనూరి, లేపనముజేసిన, గండమాలలు గాలిచే మేఘమాలవలె నివర్తించును.

గంధకాదిలేపము

గంధకం సూతకం తుల్యమర్కక్షీరం ససైంధవమ్. 22
పిష్ట్వా చ కాంచనీమూలం లేపోయం గండమాలకే,

తా. శుద్ధిజేసినగంధకము, శుద్ధిరసము, సైంధవలవణము, వీనిని సమములుగ, జిల్లేడుపాలతోనూరి లేపనముజేసినను, లేక దేవకాంచనపువేరునూరి లేపనముజేసినను గండమాల నివర్తించు.

నేపాలపత్రలేపము

పిష్ట్వా జేపాలపత్రాణి స్వరసేన కృతా వటీ. 23
ఛాయా శుష్కాతయా లేపాద్గండమాలా వినశ్యతి,

తా. నేపాళపత్రమును, దాని, స్వరసముతోనూరి మాత్రలుజేసి, నీడను యెండించి, చాదిగండమాలకు లేపనముజేసిన నివర్తించును.

గండమాలలకు వ్యోషాదిగుగ్గులు

వట్ఫలం వ్యోషచూర్ణం చ త్రిఫలా చ పలత్రయమ్. 24

కాంచనారత్వచశ్చూర్ణం యోజయేద్ద్వాదశం పలమ్,
గుగ్గులుస్సర్వతుల్యస్స్యాత్సర్వమేకత్ర కుట్టయేత్. 25
క్షౌద్రం పలశతం దేయం గుటికాం కర్ష సమ్మితామ్,
భక్షయేద్గండమాలార్తో గళగ్రంథీంశ్చ నాశయేత్. 26

తా. త్రికటుకచూర్ణము ౬ పలములు, త్రిఫలచూర్ణము 3 పలములు, దేవకాంచనపుపట్టచూర్ణము ౧౨ పలములు, వీనికన్నిటికిసమము, శుద్ధిచేసిన గుగ్గిలచూర్ణమునుజేర్చి మర్దించి, ౧౦౦ పలముల తేనెయందువైచి, కలియబెట్టి, ౧ కర్షప్రమాణము భక్షించిన, గండమాల, గళ గ్రంధులు నివర్తించును.

## కాంచనారగుగ్గులు

కాంచనారత్వచో గ్రాహ్యం పలానాం దశకం బుధైః,
త్రిఫలా షట్పలా కార్యా త్రికటు స్యాత్పలత్రయమ్. 27
పలైకం వరుణం కుర్యాదేలాత్వక్పత్రకం తథా,
ఏకైకం కర్షమాత్రం స్యాత్సర్వాణ్యేకత్ర చూర్ణయేత్. 28
యావచ్చూర్ణమిదం సర్వం తావన్మాత్రస్తు గుగ్గులుః,
సంకుట్య సర్వమేకత్ర పిండం కృత్వా చ ధారయేత్. 29
గుటికాశ్శాణికాః కార్యాః ప్రాతర్గ్రాహ్యా యథోచితాః,
గండమాలాం జయత్యుగ్రామపచీమర్బుదాని చ. 30
గ్రంథీన్ వ్రణాంశ్చ గుల్మాంశ్చ కుష్ఠాని చ భగందరమ్,
ప్రదేయశ్చానుపానార్థం క్వాథో ముండినికాభవః. 31
క్వాథః ఖదిరసారస్య పథ్యాక్వాథోష్ణకం జలమ్,

తా. దేవకాంచనపుపట్టచూర్ణము ౧౦ పలములు, త్రిఫలచూర్ణము ౬ పలములు, త్రికటుచూర్ణము 3 పలములు, ఉలిమిడిపట్టచూర్ణము ౧ పలము, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి వీనిచూర్ణము, ప్రత్యేకము ౧ కర్షము, యీచూర్ణమునకంతటికిసమము గుగ్గిలచూర్ణమునుజేర్చి ముద్దగనూరి, శాణప్రమాణము మాత్రలుజేసి, బోడతకషాయము, చంద్రచావకషాయము, కరకకషాయము, ఉష్ణోదకము, యీ అనుపానములతో పుచ్చుకొనిన, గండమాల, అవచి, అర్బుదము గ్రంధులు, వ్రణములు, గుల్మము, కుష్ఠములు, భగందరము, ఇవి యన్నియు నివర్తించును.

## అజమోదాదితైలము

అజామోదా చ సిందూరం హరితాళం నిశాద్వయమ్. 32
క్షారద్వయం ఫేనయుతం సాధకం సరళోద్భవమ్,

ఇంద్రవారుణ్యాపామార్గకదళీకందకైస్సమైః. 33
ఏభిస్సార్షపకం తైలమజామూత్రవిమిశ్రితమ్,
మృద్వగ్నౌ పాచయేదేతత్ స్నుహ్యర్కక్షీరమిశ్రితమ్. 34
అజమోదాదికం తైలం గండమాలాం వ్యపోహతి,
ఆమాం విదగ్ధాంతు పచేత్పక్వాంచైవ విశోధయేత్. 35
రోపణం మృదుభావం చ తైలమేతత్తు కారయేత్,

తా. ఓమము, సిందూరము, హరితాళము, పసపు, మానిపసపు, యవక్షారము, సర్జక్షారము, సముద్రఫేనము, దవనము, సరళధూపద్రవ్యము, పాపర, ఉత్తరేణు, అరటిగడ్డ, వీనిని సమములుగ, ఆవాలనూనెలో వైచి, అందుమేకపంచితము, జెముడుపాలు, జిల్లేడుపాలు, వీనినిజేర్చి, మందాగ్నిచేకాచిన, దీనిని, అజమోదాదితైలమనియెదరు. ఇది గండమాలను నివర్తింపజేయును. మరియు, అపక్వమైయుండిన, పక్వమగును. పిదప శోధనమునుజేయును. మరియు నీతైలమును లేపనముజేసిన రోపణము, మృదుత్వము, ఇవి గలుగును,

## నిర్గుండీతైలము

నిర్గుండీస్వరసేపక్వం లాంగలీమూలకల్కితమ్. 36
తైలం నస్యేన హంత్యాశు గండమాలాం సుదుస్తరామ్,

తా. వావిలి యాకురసమును, పొత్తిదుంపకల్కమునుచేర్చి తైలముసిద్ధపరచి, ఆతైలమును నస్యమునుజేసిన, దుస్తరమగు గండమాల నివర్తించు.

## గుంజాదితైలము

గుంజామూలఫలైస్తైలం తోయద్విగుణితం పచేత్. 37
తస్యాభ్యంగేన శమయేద్గండమాలాం సుదుస్తరామ్,

తా. గురిగింజవేరు, గురిగింజలు వీనిని రెండింతలనీళ్లలో కల్కముజేసి, అందొక భాగము తిలతైలముజేర్చి కాచి అభ్యంగనముజేసిన, దుస్తరమగు గండమాల నివర్తించు.

గండమాలాప్రకరణము సమాప్తము.

---

శ్రీ ర స్తు.

# గ్రంధిరోగప్రకరణమ్.

## గ్రంధిరోగసంప్రాప్తిః

వాతాదయో మాంసమసృక్ప్రదుష్టాస్సందూష్యమేదశ్చ తథాశిరాశ్చ,
వృత్తోన్నతం విగ్రథితం తు శోథం కుర్వంత్యతో గ్రంధిరితిప్రదిష్టః.

తా. వాతాదులుదుష్టములై మాంసము, రక్తము, మేదస్సు, శిరలు, వీనిని దుష్టములుగఁజేసి, గుండ్రముగను, ఉన్నతముగను, కఠినముగనుండు వాపునుగలుగఁజేయును. దానినే గ్రంధియనెదరు.

## వాతజగ్రంధిలక్షణము

ఆయమ్యతే వృశ్చ్యతి తుద్యతే చ ప్రత్యస్యతేవిధ్యతి భిద్యతే చ,
కృష్ణో గురుర్వస్తిరివాతతశ్చ భిన్నస్స్రవేచ్చానిలజోస్రమచ్ఛమ్. 2

తా. వాతగ్రంధి, ఈడ్వబడినటులను, ఒలిచివేసినటులను, పొడిచినటులను, చీల్చినటులను, నలిచినటులను, పగలగొట్టినటులనుండి, పోట్లతోగూడినదై, నల్లని కాంతిగలదిగను, బరువుగను, వస్తివలె విస్తృతముగను నుండును. అదిపగిలిన రక్తమును స్రవించును.

## పిత్తజగ్రంధిలక్షణము

దందహ్యతే ధూమ్యతిచూష్యతే చ పాపచ్యతే ప్రజ్వలతీవ చాపి,
రక్తస్సపీతోప్యథవాపి పిత్తాద్భిన్నస్స్రవేద్దుష్టమతీవ చాస్రమ్. 3

తా. పిత్తగ్రంధి, అగ్నిచేకాల్చబడినటుల మిక్కిలి తాపముతోగూడినదై, లోపలినుంచి, పొగవెడలినటులతోచుట, క్షారాదులచే పక్వముజేయబడినటులుండుట మరియు కాలి భస్మము అయినటులుండుట, ఎఱ్ఱగనగుట, లేక కొంచము పసపు వర్ణముగలుగుట, పలిగిన, అందువలన దుష్టమగురక్తము మిగులస్రవించుట ఇట్టి లక్షణములు గలదిగనుండును.

## కఫజగ్రంధిలక్షణము

శీతో వివర్ణోల్పరుజోతికండుః పాషాణవత్సన్నహనోపపన్నః,
చిరాభివృద్ధిశ్చ కఫప్రకోపాద్భిన్నం స్రవేచ్ఛుక్లఘనం చ పూయమ్.

తా, శీతలముగను, ప్రకృతికిసమమగు వర్ణముగలదిగను, లేక కొంచము వివర్ణముగను, కొంచమునొప్పి, మిక్కిలి దురద రాయివలె కాఠిన్యము, లావు చిరకాలము

వను వృద్ధి ఇవి గలదిగ నుండి అది పగిలినయెడల తెల్లగను, గట్టిగనునుండు చీము స్రవించుచుండిన దానిని కఫజగ్రంథి యనియెదరు.

మేదోజగ్రంథిలక్షణము

శరీరవృద్ధిక్షయవృద్ధిహానిః స్నిగ్ధో మహాన్కండుయుతోఽరుజశ్చ,
మేదఃకృతో గచ్ఛతి చాత్ర భిన్నే పిణ్యాకసర్పిఃప్రతిమం తు మేదః. 5

తా. శరీరము వృద్ధియగుచుండిన నదియును వృద్ధియగుట, శరీరము క్షీణించిన నదియును క్షీణించుట, మినమినలాడుచు పెద్దదిగనుండుట, దురదతోఁగూడినదై పీడ లేనిదై యుండుట, ఇట్టి లక్షణములుగలిగి అది పగిలినందువలన గానుగపిండికడిగిననీళ్లవలె లేక నెయ్యివలె మేదస్సు స్రవించుచుండును.

శిరాజగ్రంథిలక్షణము

వ్యాయామజాతైరబలస్య తైస్తైరాక్షిప్య వాయుస్తు సిరాప్రతానమ్,
సంకోచ్య సంపీడ్య విశోష్య చాపి గ్రంథింకరోత్యున్నతమాశు వృత్తమ్.

తా, దుర్బలపురుషుడు నానావిధములగు శరీరాయాసముకలిగెడి పనులఁ జేయుటవలన వాయువు ప్రకోపించి, సిరలనుయీడ్చి సంకోచపరచి, ఒకచోట నిలిపి శోషింపఁజేసి శీఘ్రముగ గుండ్రమై ఉబ్బుగల గ్రంథిని గలుగఁజేయును.

గ్రంథులయొక్క సాధ్యాసాధ్యలక్షణము

గ్రంథిస్సిరాజస్సచకృచ్ఛ్రసాధ్యో భవేద్యది స్యాత్సరుజశ్చలశ్చ,
అరుక్సఏవాప్యచలో మహాంశ్చ మర్మోత్థితశ్చాపి వివర్జనీయః. 7

తా. సిరాజగ్రంథి కృచ్ఛ్రసాధ్యమైయుండును. ఐనను నది పీడాయుక్తముగను, చలనముగలదిగనునుండిన సాధ్యమగును. మఱియు నదే పీడారహితముగ చలించక, గొప్పదిగ, మర్మస్థానమునందు బుట్టిన, దానిని వైద్యుడు విడువవలయును.

వాతగ్రంథికి జటామాంస్యాదిలేపము

హింస్రా సరోహిణ్యమృతాథ భార్గీ స్యోనాకబిల్వాగరుకృష్ణగంధా,
గోమూత్రపిష్టా సహ తాళపత్ర్యా గ్రంథౌవిధేయోఽనిలజే ప్రలేపః. 8

తా. జటామాంసి, కటుకరోహిణి, తిప్పతీగ, భారంగి, దుండిలపుపట్ట, బిల్వఫలము, అగరు, మునగ, నేలతాడి వీనిని గోమూత్రములోనూరి లేపనముజేసిన వాతజగ్రంథి నివర్తించును.

పిత్తజగ్రంథికిచికిత్స

జలాయుకాః పిత్తకృతే హితాస్తు క్షీరోదకాభ్యాం పరిషేచనం చ,
ద్రాక్షారసేనేక్షురసేన చాపి చూర్ణం పిబేద్వాపి హరీతకీనామ్. 9

తా. పిత్తజగ్రంధికి మొదట జలగలనంటించి, పాలు, నీళ్లు వీనితో తడప వలయును. పిదప కరకచూర్ణము ద్రాక్షారసముతోగాని లేక చెరకురసముతోగాని పుచ్చుకొనవలయును.

## కఫజగ్రంధికిచికిత్స

మధూకజంబ్వర్జునవేతసానాం త్వగ్భిః ప్రదేహానవచారయేచ్చ,
హృతేషు దోషేషు యథానుపూర్వం గ్రంథేర్భిషక్ శ్లేష్మసముత్థితాయాః. 10

తా. ఇప్ప, నేరేడు, మద్ది, వేతసము వీటిపట్టలనునూరి, యథానుపూర్వముగ మనాదులచేయించి లేపనముజేసిన, సకలదోషములు నశించి శ్లేష్మగ్రంధి మానును.

## మేదోజగ్రంధికిచికిత్స

సించేచ్చ తైలం త్వపచారణీయం విడంగపాఠా రజనీవిపక్వమ్,
మేదస్సముత్థే తిలకల్కదుగ్ధైః కృత్వోపరిష్టాద్విగుణంపటాన్తమ్. 11

తా. మేదోజగ్రంధికి, వాయువిడంగములు, అగళుశొంఠి, పసపు వీనిచే కాచబడిన తైలముతో సేచనజేయవలయును. లేక పాలతో నువ్వులనునూరి కల్కము చేసి లేపనంబొనర్చి దానిపై మడతగుడ్డను కట్టవలయును.

## సామాన్యోపచారములు

శస్త్రేణచోత్పాట్యసుపక్వమాశు ప్రక్షాళయేత్పథ్యతమైఃకషాయైః,
సంశోధనైస్తంచవిశోధయేత్తుక్షారోత్తరైః క్షౌద్రఘృతప్రగాఢైః.

తా. పక్వమగుగ్రంధిని శస్త్రముతోచీల్చి వ్రణమునకు హితముగనుండు కషాయములతో కడగవలయును. మఱియు శోధనఔషధములయందు క్షారము, తేనె, నెయ్యిచేర్చి కడగవలయును.

## రక్తస్రావము

సర్వేషాంగ్రంథిరోగాణాం రక్తస్రావః ప్రశస్యతే,

తా. సర్వగ్రంధులకు రక్తస్రావము ముఖ్యమని తెలియవలయును.

## పుత్రజీవకలేపము

పుత్రజీవస్య మజ్జాం తు జలే పిష్ట్వా ప్రలేపయేత్. 13
కాలస్ఫోటం విషస్ఫోటం సద్యో హన్యాత్సవేదనమ్,
కక్షాగ్రంథిం గళగ్రంథిం కర్ణగ్రంథిం చ నాశయేత్. 14

తా. పుత్రజీవివృక్షముయొక్క పట్టను ఉదకముతో నూరి లేపనముచేసిన కాలస్ఫోటము, వేదనతోగూడిన విషస్ఫోటము, కక్షాగ్రంథి, గళగ్రంథి, కర్ణగ్రంథి ఇవి నివర్తించును.

కాలస్ఫోటమునకు విష్ణుక్రాంతాదిలేపము

విష్ణుక్రాంతా చపేటారీ కాంజికేన సుపేషితా,
కాలస్ఫోటం హరేల్లేపాదన్యగ్రంథిషు కా కథా. 15

తా. విష్ణుక్రాంత, పేటారి, (అనగా చిట్టాముట్టిలో భేదము) వీనిని గంజితో నూరి లేపనముజేసిన కాలస్ఫోటము నివర్తించుటయేగాక ఇతర గ్రంథుల నశింపఁజేయుటయందు సందేహములేదు.

రాజికాదిలేపము

రాజికాం లశునంపిష్ట్వా లేపాద్ధన్తి గళామయమ్,

తా. ఆవాలు, వెల్లుల్లిపాయలు వీనినినూరి లేపనముచేసిన గళగ్రంథి నివర్తించును.

---

# అర్బుదరోగప్రకరణమ్.

అర్బుదరోగస్వరూపము

గాత్రప్రదేశే క్వచిదేవ దోషాస్సంమూర్ఛితా మాంసమసృక్ప్ర దూష్య.
వృత్తం స్థిరం మందరుజం మహాంతమనల్పమూలం చిరవృద్ధిపాకమ్. 1
కుర్వన్తి మాంసోచ్ఛ్రయమత్యగాధం తదర్బుదం శాస్త్రవిదో వదన్తి,

తా. ప్రకోపించినదోషములు శరీరమునందు ఏదైన నొకభాగమునందు మాంసము, రక్తము వీనిని జెరచి, గుండ్రమై స్థిరమై, కొంచమునొప్పిగలిగి, గొప్పదై, లోతుగవ్యాపించిన మూలముగలిగి, చిరకాలమునకు వృద్ధిపొంది మిక్కిలి లోతు లేనిదై యుండు మాంసపుముద్దను, అర్బుదమని, శాస్త్రవేత్తలు వచించెదరు.

అర్బుదరోగలక్షణము

మృదుస్స్థూలస్తథా శోఫః క్వచిద్గాత్రే ప్రకాశితః. 2
సంజాతమర్బుదం జ్ఞేయం చిరాద్వృద్ధశ్చ పాకకృత్,
భవేత్తం పాచయేచ్ఛోఫం లేపనైః పాకకారకైః. 3

తా. శరీరమునందేదో యొకభాగమునందు మృదువుగను, గొప్పగనునుండు వాపుజనించి, ప్రకాశించుచు, చిరకాలమునకు బాగుగ వృద్ధిపొంది, పక్వమైనదానిని అర్బుదమని తెలియవలయును. దీనిని పాకకారకలేపనములచే పక్వమును పొందింపవలయును.

## అర్బుదభేదములు

వాతేన పిత్తేన కఫేన చాపి రక్తేన మాంసేన చ మేదసా చ,
తజ్జాయతే తస్య చ లక్షణాని గ్రంథేస్సమానాని సదా భవంతి. 4

తా. వాతము, పిత్తము, కఫము, రక్తము, మాంసము, మేదస్సు వీనివలన అర్బుదములు ౬ విధములుగనుండును. వానియందెల్లపుడు గ్రంధిలక్షణములే గలిగియుండును.

## రక్తార్బుదసంప్రాప్తిలక్షణములు

దోషః ప్రదుష్టో రుధిరం శిరాసు సంకుచ్య సంపీడ్య తతో౽స్య పాకమ్,
సాస్రావమున్నహ్యతిమాంసపిండం మాంసాంకురైరాచితమాశు వృద్ధమ్. 5

శరోత్యజస్రం రుధిరప్రవృద్ధిమసాధ్య మేతద్రుధిరాత్మకం తు,
రక్తక్షయోపద్రవపీడితత్వాత్పాండుర్భవేతో౽ర్బుదపీడితస్తు. 6

తా. దోషముప్రకోపించి సిరలయందలి రక్తమును సంకోచపరచి పీడించుటచే మాంసపుగ్రంథిని ఉన్నతముగజేసి కొంచముపక్వమై కొంచము స్రవింపుచు మాంసపు అంకురములతో వ్యాప్తమై శీఘ్రముగ వృద్ధిజెందునదియై యుండుటవలన యెల్లపుడు రక్తమును స్రవించుటచే రక్తము క్షీణించుటవలన అర్బుదపీడవలన శరీరము తెల్లనగుట ఇట్టి లక్షణములుగలది రక్తార్బుదమని తెలియవలయును.

## మాంసార్బుదసంప్రాప్తిలక్షణములు

ముష్టిప్రహారాదిభిరర్దితేంగే మాంసం ప్రదుష్టం జనయేద్ధి శోథమ్,
అవేదనం స్నిగ్ధమనన్యవర్ణమపాకమశ్మోపమమప్రచాల్యమ్. 7

ప్రదుష్టమాంసస్య నరస్య గాఢమేతద్భవేన్మాంసపరాయణస్య,
మాంసార్బుదం త్వేతదసాధ్యముక్తంసాధ్యేష్వపీమానితువర్జయేచ్ఛ.

తా. ముష్టిప్రహారాదులచే శరీరము పీడింపబడియుండ మాంసముదుష్టమై వేదనారహితంబుగ మినమినలాడుచు చర్మసమానవర్ణమునలిగి పాకరహితమై రాయివలె గట్టిగ చలించకయుండు వాపునుగలుగంజేయును. దానినే మాంసార్బుదమని

యెదరు. ఇది అసాధ్యము. ఈమాంసార్బుదము మాంసము జెడినవానికిని ప్రతిదినము మాంసమును దినెడువానికిని తరుచుగ జనించును. ఈ క్రిందజెప్పబడిన అర్బుదములు సాధ్యములుగ నున్నను వర్జించవలయును.

### ఆసాధ్యార్బుదము

సంప్రస్రుతం మర్మణి యచ్చ జాతంస్రోతస్సువాయచ్చభవేదచాల్యమ్,

తా. మర్మస్థలముపై జనించి స్రావముతోఁగూడియుండు అర్బుదము నాసాది మార్గంబులపై జనించియుండు అర్బుదము, మరియు స్థిరముగనుండు అర్బుదము ఇవి అసాధ్యములు.

### అధ్యర్బుదలక్షణము

యజ్జాయతేన్యత్ఖలు పూర్వజాతే జ్ఞేయం తదధ్యర్బుదమర్బుదజ్ఞైః. 9

తా. పూర్వము జనించిన అర్బుదముమీద మరియొక అర్బుదము జనించిన దానిని అధ్యర్బుదమని యెదరు.

### ద్విరర్బుదలక్షణము

యద్ద్వంద్వజాతం యుగపత్క్రమాద్వా ద్విరర్బుదం తచ్చ భవేద సాధ్యమ్,

తా. ఏకకాలమునందుగాని లేక ఒకటి జనించినపిదప దానిసమీపమున మఱియొకటిజనించిన దానిని ద్విరర్బుదమనియెదరు. ఇది యసాధ్యము.

### అర్బుదపాకానుత్పత్తికారణము

న పాకమాయాంతి కఫాధికత్వాన్మేదోబహుత్వాచ్చ విశేషతస్తు.
దోషస్థిరత్వాద్గ్రథనాచ్చ తేషాం సర్వార్బుదాన్యేవ నిసర్గతస్తు,

తా. కఫము లేక మేదస్సు ఇవి యధికములుగ నుండుటవలన దోషములు స్థిరముగనుండుటచే దోషములు ఒకదానితో మఱియొకటి చేరుటవలన సర్వార్బుదములు స్వభావముగ పాకము జెందకయుండు.

### అర్బుదమునకు రౌద్రరసము

శుద్ధసూతం సమం గంధం మర్ద్యం యామచతుష్టయమ్. 11
నాగవల్లీబలాద్రావైః మేఘనాదపునర్నవైః,
గోమూత్రైః పిప్పలీక్వాథైః పిష్ట్వారుద్ధ్వాపుటేల్లఘు. 12
లిహేత్క్షౌద్రైరసంరౌద్రంగుంజామాత్రమితంతథా,
పారిజాతాంబుదాచ్చైవ కాసమర్దం చలేపయేత్, 13

నింబపత్రోద్భవైశ్చైతత్కల్కైశ్శుధ్యతిచ వ్రణః,

తా. శుద్ధిజేసినరసము, శుద్ధగంధకము వీనిని సమాంశములుగ ఖల్వమున వైచి, నాలుగుయామములు మెత్తగమర్దించి, పిప్పలిచూర్ణమునుజేర్చి, తమలపాకు తొడిమెలరసము, ముత్తవపులగరసము, చిత్రమూలరసము, తెల్లగలిజేరురసము, గోమూత్రము, పిప్పలి కషాయము వీనితో నాలుగుయామములు మర్దించి, లఘుపుటంబులిడి, గురిగింజ ప్రమాణము రౌద్రరసమను నీ ఔషధమును తేనెతో ప్రాతస్సాయంకాలములయందు, పుచ్చుకొనుటయేగాక పారిజాతపాకు, తుంగముస్తలు, కసివిందాకు, వేపాకు వీనినినూరి లేపనముజేసిన అర్బుదము నివర్తించు.

అధ్యర్బుదమునకు యవక్షారాదిలేపము

లిప్త్వా యవక్షారవిడంగబీజగంధోపలైస్స్వ్యస్మృణీకృతైర్యత్.
రక్తేన మిశ్రైస్సరటస్య సద్యస్త్వధ్యర్బుదం శ్యామతినాన్యథైతత్,

తా. యవక్షారము, వాయువిడంగములు, గంధకము వీనిని ఖల్వమునందువైచి నూరి, తొండరక్తములోగలిపి లేపనముజేసిన అధ్యర్బుదము శీఘ్రముగ నివర్తించును. మరియొక ఉపాయముచే నివర్తించదు.

గంధాదిలేపము

గంధశిలావిశ్వౌషధవిడంగనాగైః కృతంసమైశ్చూర్ణమ్. 15
కృకలాసరక్తయుక్తం లేపాత్సద్యోర్బుదధ్వంసి,

తా. గంధకము, మణిశిల, శొంఠి, వాయువిడంగములు, నాగభస్మము వీనిని సమభాగములుగ చూర్ణించి తొండరక్తముతో గలిపి లేపనముజేసిన తత్క్షణమునందే అర్బుదము నివర్తించును.

హారిద్రాదిలేపము

హారిద్రాలోధ్రపత్తంగగుడధూమమనశ్శిలాః. 16
మధుప్రగాఢో లేపోయం మేదోర్బుదహారః పరః,
ఏతామేవక్రియాంకుర్యాదశేషాంశర్కరార్బుదే. 17

తా. పసపు, లొద్దుగ, రసకర్పూరము, బెల్లము, కరుధూపము, మణిశిల, వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందునిచి చూర్ణించి, తేనెలో కలిపి లేపనముజేసిన మేదోర్బుదము నివర్తించును. యీక్రియనే, శర్కరార్బుదమునందును జేయుదగును.

గళగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుదములకు పథ్యములు

పురాణఘృతపానం చ జీర్ణలోహితశాలయః,
యవా ముద్గాః పటోలం చ రక్తశిగ్రుకటిల్లకమ్. 18
శాలిం చ శాకం వేత్రాగ్రం రూక్షాణి చ కటూని చ,
దీపనాని చ సర్వాణి గుగ్గులుశ్చ శిలాజతు. 19
గళగండే గండమాలాపచీగ్రంథ్యర్బుదాన్తరే,
యథాదోషం యథావస్థం పథ్యమేతత్ప్రకీర్తితమ్. 20

తా. ప్రాతనెయ్యినిద్రాగుట, ప్రాతయెఱ్ఱవడ్లబియ్యము, యవలు, పెసలు, పొట్లకాయ, యెఱ్ఱమునగ, కాకరకాయ, పొన్నగంటికూర, ఆకుకూరలు, వెదురుమొలకలు, రూక్షపదార్థములు, కటుపదార్థములు, దీపనపదార్థములు, గుగ్గిలము, శిలాజితు, ఇవి గళగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుదము వీనియందుండుదోషావస్థలనెరింగి పథ్యంబిడవలయును.

అపథ్యములు

దుగ్ధేక్షువికృతిస్సర్వామాంసంచానూపసంభవమ్,
పిష్టాన్నమమ్లం మధురం గుర్వభిష్యందకారి చ. 21
గళగండం గండమాలాపచీగ్రంథ్యర్బుదామయాన్,
చికిత్సన్నగదంకారో యత్నోర్థీ పరివర్జయేత్. 22

తా. పాలు, చెరుకురసవికారములగు శర్కరాదులు, అనూపదేశస్థితజంతుమాంసము, పిష్టాన్నము, పులుసు, తీపు, గురుపదార్థములు, అభిష్యందికారి పదార్థములు ఇవి గళగండ, గండమాల, అపచి, గ్రంధి, అర్బుదములకు అపథ్యములని తెలియవలయును.

---

# శ్లీపదరోగప్రకరణమ్.

శ్లీపదరోగ కర్మవిపాకము

సగోత్రాయామభిగమాత్ శ్లీపదీ జాయతే నరః,
యోన్యామసృక్స్రవతి తత్ర చాంద్రాయణం చరేత్. 1
మాసం పయోవ్రతం చైవ తస్మాద్రోగాత్ప్రముచ్యతే,

తా. స్వగోత్రస్త్రీతో సంగమము చేయువానికి శ్లీపదరోగము జనించు,

మరియు స్త్రీస్వగోత్రపురుషునితో సంగమనుజేసిన యోనివలన రక్తస్రావముగలుగును. అదినివర్తించుటకై చాంద్రాయణ ప్రాయశ్చిత్తములను ౧ మాసమువరకు పయోవ్రత మును జేయవలయును.

## శ్లీపదరోగప్రతిమాదానము

శ్లీపదస్త్రీపదః కుంఠః పతక్ ఖురధనుర్ధరః. 2

తా. 3 పాదములు కుంఠత్వము, కత్తిధనుస్సు ఇవిగలదై, దిగువబడునటుల నుండు ప్రతిమనుజేయించి దానం బొసంగవలయును.

## శ్లీపదరోగస్వరూపము

మేదోమాంసాశ్రయం శోఫం పాదయోః శ్లీపదం వదేత్,
స్వలింగదేశదోషైశ్చ త్రేధా స్యాచ్చ కఫోత్తరమ్. 3

తా. మేదస్సు, మాంసము, వీనిని ఆశ్రయించి, కాళ్లపై వాపు జనించును. దానిని శ్లీపదమనిరెదరు. అది కఫాదికదోషమువలన 3 విధములుగనుండును.

## శ్లీపదలక్షణము

యస్సజ్వరో వంక్షణజో భృశార్తిశ్శోథోన్నృణాంపాదగతఃక్రమేణ,
తత్ శ్లీపదం స్యాత్కరకర్ణనేత్ర శిశ్నోష్ఠనాసాస్వపి కేచిదాహుః. 4

తా. ఏవాపు మొదట గజ్జలయందుజనించి మిక్కిలి పీడనుగలుగజేయుచు జ్వరముతోకూడి, మెల్లమెల్లగ పాదములంజేరునో దానిని శ్లీపదమనిరెదరు. యీ శ్లీపదము చేతులు, చెవులు, కన్నులు శిశ్నము, పెదవులు, ముక్కు వీనిపై సహా జనించునని తెలియవలయును.

## వాతజశ్లీపదలక్షణము

వాతజం కృష్ణరూక్షం చ స్ఫుటితం తీవ్రవేదనమ్,
అనిమిత్తరుజం తస్య బహుశో జ్వరఏవ చ. 5

తా. వాతజశ్లీపదము నల్లగను, రూక్షముగను పగిలి తీవ్రవేదన గలదిగను, నిమిత్తములేక పోట్లు, తరుచు జ్వరము ఇవి గలదిగనుండును.

## పిత్తజశ్లీపదలక్షణము

పిత్తజం పీతసంకాశం దాహజ్వరయుతం మృదు,

తా. పిత్తశ్లీపదము పీతవర్ణము, దాహము, (మంట) జ్వరము ఇవి గలదై మృదువుగనుండును.

## శ్లైష్మికశ్లీపదలక్షణము

శ్లైష్మికం స్నిగ్ధవర్ణం చ శ్వేతం పాండు గురుస్థిరమ్. 6

తా. కఫజశ్లీపదము మినమినలాడుచు, తెల్లగను, బరువుగను కఠినముగను నుండును.

## అసాధ్యశ్లీపదలక్షణము

వల్మీకమివ సంజాతం కంటకైరుపసంచితమ్,
అబ్దాత్మకం మహత్తచ్చ వర్జనీయం విశేషతః, 7

తా. పుట్టవలె పెరిగి, ముండ్లవలెవ్యాపించి ౧ సంవత్సరముగడచి గొప్పదిగ నుండు శ్లీపదమును వైద్యుడు విడువవలయును.

## శ్లీపదమున కఫప్రధానము

త్రీణ్యాపేతా విజానీయాచ్ఛ్లీపదాని కఫోచ్ఛ్రియాత్.
గురుత్వం చ మహత్వం చ యస్మాన్నాస్తి వినా కఫాత్. 8

తా. పైజెప్పబడియుండు మూడువిధములగు శ్లీపదములు, కఫప్రధానములగ నుండును. ఎందువలననగా గురుత్వము మహత్త్వము ఇవి కఫమువినాజనించవుకదా.

## దేశభేదేనశ్లీపదోత్పత్తి

పురాణోదకభూయిష్ఠాస్సర్వర్తుషు చ శీతలాః,
యే దేశాస్తేషు జాయన్తే శ్లీపదాని విశేషతః. 9

తా. ఏదేశములయందు మిగుల ప్రాతబడిన నీళ్లనువాడుట, సర్వఋతువుల యందు శీతలము, ఇవి గలిగియుండునో ఆదేశములయందు విశేషముగ శ్లీపదములు జనించును.

## అసాధ్యలక్షణము

యచ్ఛ్లేష్మలాహారజాతం పుంసః ప్రకృత్యా చ కఫాత్మకస్య,
సాస్రావమత్యున్నతసర్వలింగం సకండురం శ్లేష్మయుతంవివర్జ్యమ్. 10

తా. కఫకారకములగు ఆహారవిహారములవలన గలిగిన శ్లీపదము, స్వభావముచే కఫప్రకృతిగల పురుషునికిగలిగిన శ్లీపదము, సర్వలక్షణములతోగూడి మిగుల ఉన్నతమై దురదగలిగి, స్రవించుచున్న కఫాత్మకశ్లీపదము వీనిని వైద్యుడు విడువవలయును.

## చిత్రకాదికల్కము

హితశ్చ లేపనే నిత్యం చిత్రకో దేవదారు చ,
సిద్ధార్థశిగ్రుకల్కో వా సుఖోష్ణో మూత్రపేషితః. 11

తా. చిత్రమూలము, దేవదారుగాని, తెల్లఆవాలు, మునగపట్ట వీనినిగాని కల్కముచేసి, గోమూత్రముతో చేర్చి కొంచముష్ణముగచేసి లేపనముచేసిన శ్లీపదము నివర్తించును.

## హారీతకీకల్కము

ప్రపిబేద్వా భయాకల్కం మూత్రేణాన్యతమేన చ,

తా. కరక్కాయవోలుపును కల్కముచేసి గోమూత్రములో కలిపిగాని లేక ఉష్ణోదకముతోగాని పుచ్చుకొనిన శ్లీపదము నివర్తించును.

## వృద్ధదారుచూర్ణము

వృద్ధదారుకచూర్ణం వా మూత్రసౌవీరకాదిభిః. 12
శీలితం శ్లీపదం హన్తి కృచ్ఛ్రం సంవత్సరోషితమ్,

తా. వృద్ధదారుచూర్ణమును గోమూత్రములోగాని, కాంజికములోగాని కలిపి పుచ్చుకొనిన సంవత్సరమునుంచియుండు శ్లీపదము నివర్తించును.

## పిప్పల్యాదిచూర్ణము

పిప్పలీ త్రిఫలా దార్వీ నాగరం సపునర్నవమ్. 13
భాగైర్ద్విపలికైస్తేషాం తత్సమం వృద్ధదారుకమ్,
కాంజికేనతు తచ్చూర్ణం పిబేత్కర్షప్రమాణతః. 14
జీర్ణే వా పరిహార్యం స్యాద్భోజనం సర్వకామికమ్,
శ్లీపదం వాతరోగాంశ్చ ప్లీహం గుల్మమరోచకమ్. 15
అగ్నిం చ కురుతే ఘోరం భస్మకం చ నియచ్ఛతి,

తా. పిప్పళ్లు, కరక, తాడి, ఉశిరికెలు, మానిపసపు, శొంఠి, తెల్లగలిజేరు ఇవి ప్రత్యేకము ౨ పలములు, వీనికన్నిటికిసమము, వృద్ధదారు వీనిని చూర్ణముజేసి ౧ కర్షప్రమాణము కాంజికముతో పుచ్చుకొని, అదిజీర్ణించిన పిదప యథేష్టభోజనము చేసినను శ్లీపదము, వాతరోగములు, ప్లీహ, గుల్మము, అరుచి, భస్మకరోగము ఇవి నివర్తించుటయేగాక అగ్నిదీప్తిని గలుగఁజేయును.

## గుడూచ్యాదిలేపము

గుడూచీ కటుకీ శుంఠీ దేవదారువిడంగకమ్. 16

పిష్ట్వా గోమూత్రసంయుక్తం లిమ్పేచ్ఛ్లీపదనాశనమ్,

తా. తిప్పతీగ, కటుకరోహిణి, శొంఠి, దేవదారు, వాయువిడంగములు, వీనిని గోమూత్రముతో నూరి లేపనము జేసిన శ్లీపదము నివర్తించును.

అభయాదిలేపము

అభయాసర్షపనాగరహింగువచాశిగ్రురవిమూలైః. 17
దినకరపయసా పిష్టైశ్లీపదనాశాయ లేపనం కుర్యాత్,

తా. కరక్కాయలు, తెల్లఆవాలు, శొంఠి, ఇంగువ, వస, మునగవేరు, జిల్లేడువేరు వీనిని సమాంశములుగ చేర్చి జిల్లేడుపాలతో నూరి లేపనము జేసిన శ్లీపద రోగము నివర్తించును,

పిత్తశ్లీపదలేపము

మంజిష్ఠాం మధుకం రాస్నాం సహింస్రాం సపునర్నవామ్. 18
పిష్ట్వారనాళైర్లిమ్పేత్తు పిత్తశ్లీపదశాన్తయే,

తా. మంజిష్ట, అతిమధురము, రాస్న, జటామాంసి, తెల్లగలిజేరువేరు వీనిని సమాంశములుగ కాంజికముతో నూరి లేపనముచేసిన పిత్తశ్లీపదము నివర్తించును.

ధత్తూరాదిలేపము

ధత్తూరైరండనిర్గుండీవర్షాభూశిగ్రుసర్షపైః. 19
ప్రలేపశ్లీపదం హన్తి చిరోత్థమపి దారుణమ్,

తా. ఉమ్మెత్తఆకు, ఆముదపువేరు, వావిలిఆకు, తెల్లగలిజేరువేరు, మునగ వేరు, తెల్లఆవాలు వీనిని సమముగ నూరి లేపనముచేసిన చిరకాలముగనుండు శ్లీపదము నివర్తించును.

సిద్ధార్థాదిలేపము

సిద్ధార్థసౌభాంజనదేవదారువిశ్వౌషధైర్మూత్రయుతైః ప్రలింపేత్. 20
పునర్నవానాగరసర్షపానాం కల్కేన వా కాంజికమిశ్రితేన,

తా. తెల్లఆవాలు, మునగవేరుపట్ట, దేవదారు, శొంఠి వీనిని గోమూత్రముతో నూరి లేపనముచేసినను లేక తెల్లగలిజేరు, తెల్లఆవాలు వీనిని కల్కముచేసి, కాంజిక ముతో కలిపి లేపనముచేసినను శ్లీపదము నివర్తించును.

సౌరేశ్వరఘృతము

సురసాదేవకాష్ఠం చ త్రిఫలా త్రికటుఃకణా. 21
లవణాని చ సర్వాణి విడఙ్గాన్యథ చిత్రకమ్,

చవికా పిప్పలీమూలం గుగ్గులుర్హపుషా వచా. 22
యవాగ్రజం సపాఠం చ శత్యేలా వృద్ధదారుకమ్,
కల్కైశ్చ కార్షికై రేభిర్ఘృతప్రస్థం విపాచయేత్. 23
దశమూలకషాయేణ ధాన్యయూషద్రవేణ చ,
దధిమండేన సంయుక్తం ప్రస్థం ప్రస్థం పృథక్పృథక్. 24
పక్వం స్వాదుఘృతం శిష్టం పిబేత్కర్షత్రయం హవిః,
శ్లీపదం కఫవాతోత్థం మాంసరక్తాశ్రితం జయేత్. 25
మేదోశ్రితాభిఘాతోత్థం హన్యాదేవ న సంశయః,
అపచీగలగండాని చాంత్రవృద్ధిం తథార్బుదమ్. 26
నాశయేద్గ్రహణీదోషం శ్వయథుం గుదజానపి,
పరమగ్నికరం హృద్యం కోష్ఠక్రిమివినాశనమ్. 27
ఘృతం సౌరేశ్వరం నామ శ్లీపదం హన్తి సేవితమ్,
జీవకేన కృతం హ్యేతద్రోగానీకవినాశనమ్. 28

తా. తులసి, దేవదారు, త్రిఫలములు, త్రికటుకములు, గజపిప్పలి, పంచలవణములు, వాయువిడంగములు, చిత్రమూలము, చవ్యము, మోడి, గుగ్గిలము, బోడతరము, వస, యవక్షారము, విషబొద్ది, కచూరములు, ఏలకులు, వృద్ధదారు వీనిని ప్రత్యేకము ౧ తులముచొప్పున కల్కముజేసి అందు నెయ్యి, దశమూలకషాయము, ధాన్యయూషము లేక కషాయము, పెరుగుమీదితేట ఇవియన్నియు, ప్రత్యేకము నొక్కొక్క ప్రస్థముచేర్చి ఘృతపక్వముగవండి 3 కర్షములచొప్పున సేవించిన కఫవాతజన్యమగుశ్లీపదము, మాంసరక్తాశ్రితమగుశ్లీపదము, మేదోభిఘాతజమగుశ్లీపదము, అపచి, గళగండము, అంత్రవృద్ధి, అర్బుదరోగము, గ్రహిణీదోషము, వాపు, మూలవ్యాధి, కోష్ఠక్రిమిరోగము, ఇవి యన్నియు నివర్తించుటయేగాక అగ్నిదీప్తి, హృదయహితము వీనిని గలుగఁజేయును. ఇది జీవకునిచే జెప్పబడిన సౌరేశ్వరఘృతము.

### విడంగాదితైలము.

విడంగం శారిబార్క్యేషు నాగరే చిత్రకే తథా,
భద్రదార్వేలకాఖ్యే చ సర్వేషు లవణేషు చ. 29
తైలం పక్వం పిబేద్వాపి శ్లీపదానాం నివృత్తయే,

తా. వాయువిడంగములు, సుగంధపాల, జిల్లేడువేరు, శొంఠి, చిత్రమూలము, భద్రదారు, ఏలకులు, పంచలవణములు, వీనినన్నిటిని సమముగచేర్చి, తైలమునందు వైచి పక్వముగకాచి పుచ్చుకొనిన శ్లీపదము నివర్తించును.

——॥ శ్లీపదమునకు పథ్యములు ॥——

పురాతనాః షష్టికశాలయశ్చ యవాః కులుత్థాలశునం పటోలమ్. 30
వార్తాకసౌభాంజనకారవేల్లపునర్నవామూలముపోదికా చ,
ఏరండతైలం సురభీజలం చ కటూని తిక్తాని చ దీపనాని. 31
ఏతాని పథ్యాని భవంతి పుంసాం రోగే సతి శ్లీపదనామధేయే,

తా. ౬౦ దినములకు పండెడిప్రాతవడ్లు, సంబావడ్లు, ఉలవలు, ఉల్లిగడ్డలు, పొట్లకాయ, వంకాయ, మునగకాయ, కాకరకాయ, తెల్లగలిజేరువేరు, బచ్చలికూర, ఆముదము, గోమూత్రము, కారము, వగరు, దీపనముగనుండు పదార్థములు ఇవి శ్లీపదరోగమునందు పథ్యములని తెలియవలయును.

——॥ అపథ్యములు ॥——

పిష్టాన్నం దుగ్ధవికృతిం గుడమానూపమామిషమ్. 32
స్వాదమ్లం పారియాత్రం చ సింధువింధ్యనదీజలమ్,
పిచ్ఛిలం గుర్వభిష్యంది శ్లీపదీ పరివర్జయేత్. 33

తా. పిష్టాన్నము, పాలతోచేయబడు పదార్థములు, బెల్లము, జలప్రాంత్యమునందలి జంతువులమాంసము, స్వాగుపదార్థములు, పులుసు, పారియాత్రము, సింధునది, వింధ్యనది వీనియందలి ఉదకము, జిగటపదార్థములు, గురుపదార్థములు, అభిష్యంది పదార్థములు వీనిని శ్లీపదరోగి విడువవలయును.

---

# అంతర్విద్రధిప్రకరణమ్.

——॥ అంతర్విద్రధిస్వరూపము ॥——

పృథక్సంభూయ వా దోషాః కుపితా గుల్మరూపిణం,
వల్మీకవత్సమున్నద్ధమంతః కుర్వన్తి విద్రధిమ్. 1

తా. వాతాదిదోషములు వేర్వేరుగగాని లేక నేకముగగాని ప్రకోపించినవై గుల్మముతో సమముగురూపముగలిగి, వల్మీకతుల్యముగనుండు విద్రధిని గలుగఁ జేయును.

——॥ విద్రధ్యుత్పత్తిస్థానములు-వానివానిలక్షణములు ॥——

గుదే వస్తిముఖే నాభ్యాం కుక్షౌ వంక్షణయోస్తథా,
వృక్కయోః ప్లీహ్ని యకృతిహృదయే క్లోమ్ని చాప్యథ. 2

ఏషాముక్తాని లింగాని బాహ్యావిద్రధిలక్షణైః,
గుదే వాతనిరోధస్తు వస్తౌ కృఛ్రాల్పమూత్రతా. 3
నాభ్యాం హిక్కా తథాటోపః కుక్షౌ మారుతకోపనమ్,
కటిపృష్ఠగ్రహస్తీవ్రో వంక్షణోత్థే చ విద్రధౌ. 4
వృక్కయోః పార్శ్వసంకోచః ప్లీహ్న్యుఛ్ఛ్వాసావరోధనమ్,
సర్వాంగప్రగ్రహస్తీవ్రో హృది కంపశ్చ జాయతే. 5
శ్వాసో యకృతిహిక్కా చ క్లోమ్ని పేపీయతే పయః.

తా. గుదము, పొత్తికడుపు, నాభి, కుక్షి, గజ్జలు, వృక్క, (ఉదరమునం దిరుపార్శ్వములందు వెన్నెముకలనాశ్రయించియుండు మాంసవిశేషము) ప్లీహ, (ఎడమప్రక్కయందు పచ్చనైయుండు మాంసవిశేషము) యకృతి (కుడిపార్శ్వమున నల్లనైయుండు మాంసవిశేషము) క్లోమ (నీరుతిత్తి) వీనియందుబుట్టిన పేహిద్రధులు, బాహ్యవిద్రధిలక్షణములతో తుల్యలక్షణములు గలవిగనుండును. వానిలో గుదజవిద్రధి యందు వాతనిరోధము, వస్తిముఖమున జనించిన విద్రధియందు అతికష్టముగ మూత్ర మునువిడుచుట, నాభియందు జనించిన విద్రధియందు ఎక్కిళ్లు గుడగుడశబ్దము, కుక్షి యందుత్పన్నంబైన విద్రధియందు వాతప్రకోపము, గజ్జలయందు జనించిన విద్రధి యందు కటిప్రదేశము, పృష్ఠభాగము ఇవి బిగబట్టుట, వృక్కములయందు జనించిన విద్రధియందుప్రక్కలను కుంగదీయుట, ప్లీహస్థానమున జనించిన విద్రధియందు ఉచ్ఛ్వాసనిరోధము, హృదయమునందు జనించిన విద్రధియందు, సర్వావయవములు బిగబట్టుట, వణుకు, యకృత్ప్రదేశమునందు జనించిన విద్రధియందు శ్వాస, ఎక్కిళ్లు, నీరుతిత్తియందు జనించిన విద్రధియందు మాటిమాటికి ఉదకపానమునుచేయుట ఇట్టి లక్షణములు గలిగియుండును.

## విద్రధిసంప్రాప్తి

త్వగ్రక్తమాంసమేదాంసి ప్రదూష్యాస్థిసమాశ్రితాః. 6
దోషాశ్శోఫం శనైర్ఘోరం జనయంత్యుచ్ఛ్రితాభృశమ్,
మహామూలం రుజావంతం వృత్తం వాప్యథవా యతమ్. 7
సవిద్రధిరితి ఖ్యాతో విజ్ఞేయః షడ్విధశ్చ సః,
పృథగ్దోషైస్సమస్తైశ్చ క్షతేనాప్యసృజా తథా. 8
షణ్ణామపి హి తేషాం తు లక్షణం సంప్రచక్ష్యతే,

తా. అస్థులను ఆశ్రయించియుండు వాతాదిదోషములు మిక్కిలి ప్రకో పించి అస్థులనాశ్రయించినవై చర్మము, రక్తము, మాంసము, మేదస్సు వీనిని జెరచి

భయంకరమగువాపునుగలుగఁజేయును. ఉత్పత్తికాలమునందు మిక్కిలి పోట్లునొప్పి గలిగి గుండ్రముగగాని, నిడుపుగగాని, భయంకరమగు వాపునుగలుగఁజేయును. దానిని విద్రధియనియెదరు. అది వేర్వేరుగ వాతవిద్రధి, పిత్తవిద్రధి, శ్లేష్మవిద్రధి, సన్నిపాతవిద్రధి, క్షతజవిద్రధి, రక్తజవిద్రధి అని ఇటుల ఆరువిధంబులుగనుండును. యీ ఆరింటికి క్రమముగ లక్షణంబుల వివరించెదను.

### వాతజవిద్రధిలక్షణము

కృష్ణోరుణో వా విషమో భృశమత్యర్థవేదనః. 9
చిత్రోత్థానప్రపాకశ్చ విద్రధిర్వాతసమ్భవః,

తా. నల్లగను, యెఱ్ఱగను, విషమముగను, మిక్కిలి వేదనగలదిగను, నానావిధములగు ఉత్పత్తి, పాకము వీనితోగూడియుండునదిగ నుండునది వాతజవిద్రధియని తెలియవలయును.

### పిత్తజవిద్రధిలక్షణము

పక్వోదుంబరసంకాశశ్శ్యావో వా జ్వరదాహవాన్. 10
క్షిప్రోత్థానప్రపాకశ్చ విద్రధిః పిత్తసంభవః,

తా. పండిన అత్తిపండుతోతుల్యముగగాని, నల్లగగాని యుండినదై, జ్వరము, దాహము వీనితోగూడి, ఉత్పత్తి, పాకము ఇవి శీఘ్రముగ గలుగునది పిత్తజవిద్రధి యని తెలియవలయును.

### కఫజవిద్రధిలక్షణము

శరావసదృశః పాండుశ్శీతః స్నిగ్ధోఽల్పవేదనః. 11
చిరోత్థానప్రపాకశ్చ విద్రధిః కఫసమ్భవః,

తా. మూకుడుతోతుల్యముగను, తెల్లగను, శీతలముగను, నున్నగను, స్వల్పవేదనగలదిగను, ఉత్పత్తిఅయిన బహుకాలమునకు పక్వమగునదిగను నుండునది కఫజవిద్రధియని తెలియవలయును.

### సన్నిపాతజవిద్రధిలక్షణము

నానావర్ణరుజాస్రావో ఘంటాలో విషమో మహాన్. 12
విషమం పచ్యతే చాపి విద్రధిస్సాన్నిపాతికః,

తా. నానావిధములగునొప్పి, నానావిధములగు రక్తస్రావము, ఘంటవలెనుండుట, చిన్నదిగను లేక విషమముగను (అనగా అసాధ్యముగనుండుట, పెద్దదిగ) నుండుట విషమపాకము, (కొంతభాగము చిరకాలముమీద మరికొంత భాగము

శీఘ్రముగ పక్వమగుట) ఇట్టి లక్షణములుగలది సన్నిపాతజవిద్రధియని తెలియవల యును.

—అభిఘాత (ఆగంతు) జన్యవిద్రధిలక్షణము—

తైస్తైర్భావైరభిహతే క్షతే వాఽపథ్యకారిణః. 13
క్షతోష్మా వాయువిసృతస్సరక్తం పిత్తమీరయేత్,
జ్వరస్తృష్ణా చ దాహశ్చ జాయన్తే తస్య దేహినః. 14
ఆగంతువిద్రధిర్జ్ఞేయః పిత్తవిద్రధిలక్షణః,

తా. లోష్టము, కఱ్ఱలు, పాషాణాదులు వీనిచేగలిగిన దెబ్బగాని లేక గాయ ముగాని గలిగియుండునపుడు అపథ్యముచేయుటవలన వాతము ప్రకోపించి, తద్ద్వారా వృద్ధిబొందిన క్షతోష్మ రక్తముతోగూడినదై, పిత్తమును ప్రకోపింపజేసి జ్వరము, దప్పి, తాపము వీనిని గలుగజేయుచు పిత్తవిద్రధిలక్షణములతోగూడియుండిన అభి ఘాతజవిద్రధియని తెలియవలయును.

—రక్తజవిద్రధిలక్షణము—

కృష్ణస్ఫోటావృతశ్శ్యావస్తీవ్రదాహరుజాకరః. 15
పిత్తవిద్రధిలింగస్తు రక్తవిద్రధిరుచ్యతే,

తా. నల్లనిపొక్కులతోగూడి, శ్యామవర్ణముగలదై, తీవ్రమగుతాపము, నొప్పి, జ్వరము, ఇవిగలిగి, పిత్తవిద్రధి లక్షణములతోగూడియుండునది రక్తవిద్రధి యని తెలియవలయును.

—స్తనజవిద్రధిలక్షణము—

పవనేన స్తనశిరాస్సంవృతాః ప్రాప్య యోషితామ్. 16
సూతానాం గర్భిణీనాం తు సంభవేచ్ఛ్వయథుర్ఘనః,
స్తనే స్త్రీయస్సదుగ్ధేవా వా బాహ్యవిద్రధిలక్షణః. 17
నాడీనాంశ్చసూక్ష్మవక్త్రిత్వాత్కన్యానాం న స జాయతే,

తా. ప్రసవించినస్త్రీలు లేక గర్భిణీస్త్రీలు, వీర్లయొక్క పాలతోగూడి యుండు స్తనములయందు వాతము ప్రకోపించి, సిరలనుబొంది, వానిముఖముల నడ్డ గించి, సంకుచితములుగచేసి, బాహ్యవిద్రధిలక్షణములుగల కఠినమగు వాపును జనింపఁ జేయును. దానిని స్తనజవిద్రధియనియెదరు. అది కన్యకలయొక్క స్తననాడీముఖ ములు సూక్ష్మములుగనుండుటవలన వారలకు ఈ స్తనవిద్రధి జనింపకయుండు. (దీనికి వాతాదివిద్రధులలోనే అంతర్భావము.)

సాధ్యాసాధ్యవిద్రధిలక్షణము

హృన్నాభివస్తివర్జ్యాయే తేషు భిన్నేషు బాహ్యతః. 18
జీవేత్కదాచిత్పురుషో నేతరేషు కథంచన,
సాధ్యా విద్రధయః పంచ వివర్జ్యస్సాన్నిపాతికః. 19
ఆమపక్వవిదగ్ధత్వం తేషాం శోథవదాదిశేత్,

తా. హృదయము, నాభి, వస్తి, వీనిని వదలి, ఇతరస్థలములయందు జనించిన విద్రధి వెలపలకు పగిలినయెడల, ఒకానొకప్పుడు పురుషుడు జీవించును. హృదయము, నాభి, పొత్తికడుపు వీనియందు జనించిన రోగి మృతిని జెందును. మరియు పైనుదహరింపబడిన ౫ విద్రధులు సాధ్యములు సన్నిపాతవిద్రధి అసాధ్యము. వానిలో ఆమ, పక్వ, విదగ్ధావస్థలు మూడును శోఫతో సమానముగా నుండునని తెలియవలయును.

అసాధ్యలక్షణము

ఆధ్మాతం బద్ధనిష్యందం ఛర్దిహిక్కాతృషాన్వితమ్. 20
రుజాశ్వాససమాయుక్తం విద్రధిర్నాశయేన్నరమ్,

తా. కడుపుబ్బరము, వ్రణమునందు స్రావనిరోధము, వాంతి, ఎక్కిళ్లు, దప్పి, నొప్పి, శ్వాస ఇవిగల విద్రధిరోగి మృతిని జెందును.

విద్రధిస్రావనిర్గమనము

నాభేరుపరిజాః పక్వా యాంత్యూర్ధ్వమితరేత్వధః. 21
అధఃస్రుతేషు జీవేత్తు స్రుతేషూర్ధ్వం న జీవతి,

తా. బొడ్డుకుపైన జనించిన విద్రధిపండినయెడల నోటివలన స్రావముగలుగును. బొడ్డుకుక్రిందుగ జనించిన విద్రధియందు గుదద్వారమున స్రావముగలుగును. (నాభియందు జనించిన విద్రధియందు, ఉభయమార్గములయందును, స్రావముకలుగును) విద్రధులయందు అధోమార్గమువలన స్రావముగలిగిన రోగిజీవించును. ఊర్ధ్వమార్గమువలన స్రావముగల రోగి మృతిజెందునని తెలియవలయును.

విద్రధికి వరుణాదికషాయము

కాసీససైంధవశిలాజతుహింగుచూర్ణై
ర్మిశ్రీకృతో వరుణవల్కలజఃకషాయః. 22
అభ్యంతరే స్థితమపక్వమతిప్రమాణం
నృణామయం హరతి విద్రధిముగ్రశోఫమ్,

తా. కాసీసము, సైంధవలవణము, శిలాజితు, ఇంగువ, వీనినిచూర్ణించి, వులి

మిడిపట్టకషాయము బెట్టి, అందు వైచి పుచ్చుకొనిన, లోపలనుండి పక్వముగాక, మిక్కిలి గొప్పదిగనుండు భయంకరమైన వాపుగల విద్రధి నివర్తించును.

శిగ్ర్వాదికషాయము

శిగ్రుదీప్యవరుణదిర్వయామినీకుంజరాశనకృతః కషాయకః. 23
బోళచూర్ణసహితోంతరస్థితం విద్రధిం ప్రశమయేదసంశయమ్,

తా. మునగవేరుపట్ట, ఓమము, ఉలిమిడిపట్ట, పసపు, మ్రానిపసపు, రావిపట్ట వీనిని సమాంశములుగ కషాయము బెట్టి బోళచూర్ణమునందు వైచి పుచ్చుకొనిన లోపలనుండు విద్రధి నివర్తించును.

పునర్నవాదికషాయము

శ్వేతవర్షాభువో మూలం మూలం వరుణకస్య చ. 24
జలేన క్వథితం పీతమపక్వం విద్రధిం జయేత్,

తా. తెల్లగలిజేరువేరు, ఉలిమిడిలేరు వీనిని కషాయము బెట్టి పుచ్చుకొనిన పక్వముగాకయుండు విద్రధి నివర్తించును.

దశమూలాదికషాయము

దశమూలచ్ఛిన్నరుహాపథ్యా దారుపునర్నవాః. 25
జ్వరవిద్రధిశోఫేషు శిగ్రువిశ్వయుతా హితా,

తా. దశమూలములు, తిప్పతీగ, కరకవోలుపు, దేవదారు, తెల్లగలిజేరు, మునగవేరు, శొంఠి వీనిని కషాయము బెట్టి పుచ్చుకొనిన, జ్వరము, విద్రధి, వాపు ఇవి నివర్తించును.

వాతవిద్రధికికషాయము

పునర్నవాదారువిశ్వదశమూలభవాంభసా. 26
గుగ్గులుం రుబుతైలం వా పిబేన్మారుతవిద్రధౌ,

తా. తెల్లగలిజేరువేరు, మ్రానిపసపు, శొంఠి, దశమూలములు, వీనిని సమాంశములుగ కషాయముబెట్టి, అందు గుగ్గిలచూర్ణము లేక ఆముదముచేర్చి పుచ్చుకొనిన వాతవిద్రధి నివర్తించును.

కఫజవిద్రధికికషాయము

త్రిఫలాశిగ్రువరుణదశమూలాంభసా పిబేత్. 27
గుగ్గులుం మూత్రసంయుక్తం విద్రధౌ కఫసంభవే,

తా. త్రిఫలములు, మునగవేరుపట్ట, ఉలిమిడిపట్ట, దశమూలములు వీనిని

కషాయముబెట్టి, అందు గుగ్గిలచూర్ణము, గోమూత్రము వీనిని చేర్చి పుచ్చుకొనిన కఫజవిద్రధి నివర్తించును.

విద్రధిలేపము

యవగోధూమముద్గైశ్చ శ్లక్ష్ణపిష్టైః ప్రలేపయేత్. 28
విలీయతే క్షణేనైవ పక్వశ్చైవ హి విద్రధిః,

తా. యవలు, గోధుమలు, పెసలు వీనిని మెత్తగనూరి లేపనముజేసిన పక్వమగు విద్రధినశించును.

వాతవిద్రధిలేపము

వ్యాఘ్రీమూలకకల్కైస్తు వసాతైలఘృతాన్వితైః. 29
సుఖోష్ణో బహుళో లేపః ప్రయోజ్యో వాతవిద్రధౌ,

తా. ఎఱ్ఱఆముదపువేరును, ముల్లంగిగడ్డను కల్కముజేసి, మాంసరసము, నెయ్యి, నూనె, వీనినిచేర్చి కొంచము వెచ్చజేసి దట్టముగ లేపనముజేసిన వాతవిద్రధి నివర్తించును.

త్రిఫలాదిగుగ్గులు

త్రీణిపలాని ఫలత్రితయస్య ద్వేతు పలే భవతో మగధాయాః. 30
పంచపలాని భవంతి పురస్య స్యాత్త్రిఫలాదికగుగ్గులుయోగః,

తా. కరక, తాడి, ఉశిరికలు ఇవిప్రత్యేకము ౧ పలము, పిప్పళ్లు ౨ పలములు, గుగ్గిలము ౫ పలములు, వీనినన్నిటిని నేకముగజేర్చి చూర్ణించిన త్రిఫలాగుగ్గులు అనఁబడును. దీనిని సేవించిన అంతర్విద్రధి నివర్తించును.

కజ్జలీయోగము

వరుణాదికషాయేణ రసగంధకకజ్జలీమ్. 31
భుక్త్వా నిహన్తి మాషైకాంబాహ్యామంతశ్చ విద్రధిమ్,
అపక్వే త్వేతదుద్దిష్టం పక్వే తు వ్రణవత్క్రియా. 32

తా. వరుణాదికషాయముతో, రసము, గంధకము వీనిని కజ్జలిగనూరి, మాషమాత్రముభక్షించిన, బాహ్యవిద్రధి, అంతర్విద్రధి ఇవి నివర్తించును. మఱియునది పక్వముగాకయుండిన దీనినే చేయవలయును. పక్వమైన పిదప వ్రణక్రియను జేయఁదగును.

జలౌకాపాతనము

రసాలఫలతుల్యో యశ్శోఫో బాహ్యోథ చాంతరః,

పృథగ్గాహారుజానాహ కారకో విద్రధిస్స్మృతః. 33
జలౌకాపాతనం శస్తం సర్వస్మిన్నేవ విద్రధౌ,
ముహుర్విరేకో లఘ్వన్నం స్వేదః పిత్తోత్తరం వినా. 34

తా. మామిడిఫలముతో తుల్యముగ వెలపలగాని లేక లోపలగాని వాపు గలిగి వేరుగ, తాపము, నొప్పి, కడుపుబ్బరము వీనిని చేయుచుండిన విద్రధియనంబడును. ఈ సర్వవిద్రధులయందు, జలగలనంటించి రక్తమునుదీసి, పిదప విరేకము లఘువుగ అన్నము, పిత్తముద్రేకించకుండ చమటదీయుట మొదలగు చికిత్సలజేయవలయును.

## త్రిఫలాయోగము

పక్వేషు విద్రధిషు పూయమతిస్రవత్సు నాడీషు చ వ్రణగదేషు భగందరేషు,
స్యాద్గండమాలిషు ఫలత్రికగుగ్గులుస్సాత్మ్యత్పథ్యం ఫలత్రికఘృతం లఘుభోజనం చ. 35

తా. పక్వమగువిద్రధులయందును, నెత్తురు చీమునుస్రవించు విద్రధులయందును, నాడీవ్రణములయందును, భగందరములయందును, గండమాలలయందును, ఫలత్రికగుగ్గులు శ్రేష్ఠమైనదిగనుండును. దీనికి పథ్యము, ఫలత్రికఘృతము, లఘుభోజనమని తెలియవలయును.

## సౌభాంజననిర్యాసయోగము

సౌభాంజనస్య నిర్యాసో హింగుసైంధవసంయుతః,
అచిరాద్విద్రధిం హన్తి ప్రాతః ప్రాతర్నిషేవితః. 36

తా. మునగబంక, ఇంగువ, సైంధవలవణము వీనినిచేర్చి చూర్ణించి, ప్రతిరోజు ప్రాతఃకాలమునందు సేవించిన విద్రధి నివర్తించును.

## విద్రధికిపథ్యములు

ఆమస్థే రేచనం చైవ లేపస్స్వేదోఽస్రమోక్షణమ్,
జీర్ణాశ్శ్యామాకకలమాః కులుత్థాలశునాని చ. 37
రక్తశిగ్రుశ్చ నిష్పావకారవేల్లపునర్నవాః,
శ్రీపర్ణీం చిత్రకం క్షౌద్రం శోఫఘ్నాని చ సర్వశః. 38
పక్వావస్థే శస్త్రకర్మ పురాణా రక్తశాలయః,
ఘృతం తైలం ముద్గరసో విలేపీ ధన్వజో రసః. 39
శాలిశాకం చ కదలీ పటోలం హిమవాలుకమ్,

చందనం తప్తశీతాంబు సర్వం చాపి వ్రణోదితమ్. 40
నరాణాం విద్రధివ్యాధౌ యథావస్థం యథామలమ్,
పథ్యాన్యేతాని సర్వాణి నిర్దిష్టాని మహర్షిభిః. 41

తా. విద్రధిఅపక్వముగనుండిన రేచనము, లేపము, చెమటదీయుట, రక్తమోషణము, మరియు పాతచాములు, పాతవడ్లబియ్యము, ఉలవలు, వెల్లుల్లి, ఎఱ్ఱిమునగ, అనుములు, కాకరకాయ, తెల్లగలిజేరు, కూరనెల్లి, చిత్రమూలము, తేనె, వాపునకు జెప్పియుండు సర్వవస్తువులు ఇవిఅన్నియు హితములుగనుండును. విద్రధిపక్వమైయుండిన, శస్త్రకర్మ, ప్రాతయెఱ్ఱబియ్యము, నెయ్యి, నూనె, పెసరగంజి, విలేపి, నిర్జలదేశజంతుమాంసరసము, చెరుకు, అల్లము, అరటికాయ, పొట్లకాయ, కర్పూరము, చందనము, కాచిచల్లార్చిననీళ్లు, మరియు వ్రణములకై జెప్పబడిన పత్థ్యకారకపదార్థములు, వీనిని సర్వావస్థలయందు దోషబలాబలముల నెరింగి పత్థ్యము లిడవలయును.

అపథ్యములు

శోఫినాం యాన్యపథ్యాని వ్రణినామపి యాని చ,
క్రమాదామేచపక్వే చ విద్రధౌ వర్జయేన్నరః. 42

తా. వాపుగలమనుజునికి అపథ్యకరములుగనుండునవి అపక్వవిద్రధియందును, వ్రణముగలమనుజునికి అపథ్యకరములుగనుండునవి పక్వవిద్రధియందును అపథ్యము లని తెలియవలయును.

---

# వ్రణరోగప్రకరణమ్.

వ్రణరోగకర్మవిపాకము

జాత్యుత్తమస్త్రీగమనాజ్జాయతే మస్తకవ్రణీ,
తత్పాతకవిశుద్ధ్యర్థం ప్రాజాపత్యవ్రతం చరేత్. 1

తా. ఉత్తమజాతిగలస్త్రీతో సంగమముజేసినవాడు శిరోవ్రణముగలవాడుగ జనించును. తత్పాపవిశుద్ధికై ప్రాజాపత్య వ్రతమును చేయవలయును.

కర్మకాలే కుక్కుటం చ ఖరాదీన్వా య ఈక్షతే,
స నాసికావ్రణీ చ స్యాదార్ద్రనేత్రశ్చ జాయతే. 2
ఉద్యన్నద్యైత్యలచాచాజ్యం జుహుయాదయుతం చరుమ్,

శ్రీసూక్తం చ జపేద్రక్షాం దూర్వాక్షతవిమిశ్రితామ్. 3
శిఖాయాం చ నిబధ్నీయాత్ శివసంకల్పమంత్రితామ్,

తా. సంధ్యావందనాది పుణ్యకర్మలచేయుకాలమునందు, కోడి, గార్దభము, మొదలగువాని నీక్షించిన, నాసికావ్రణముగలవాడుగ జనించును; లేక, ఆడును కండ్లుగలవాడుగనైనను జనించును. తన్నివృత్తికై "ఉద్యన్నద్య" అనుఋక్కుచే పదివేలమారులు అన్నాజ్యములచే హోమముచేసి, శ్రీసూక్తమును జపించి, పిదప, శిఖ యందురక్షణార్థమై శివసంకల్పమంత్రితమగు అక్షతలను దూర్వాదళమును ధరించు కొనవలయును.

## వ్రణభేదములు

ద్విధా వ్రణః పరిజ్ఞేయశ్శారీరాగంతుభేదతః. 4
దోషైరాద్యస్తయోరన్యశ్శస్త్రాదిక్షతసమ్భవః,

తా. వ్రణము శారీరమనియు, ఆగంతుకమనియు భేదములచే రెండు విధ ములుగనుండును. అందు మొదటిదియగు శారీరవ్రణము వాతాదిదోషములచే జనిం చును. రెండవదియగు ఆగంతుకవ్రణము శస్త్రాదులగాయమువలన జనించునని తెలియ వలయును.

## వాతికవ్రణలక్షణము

స్తబ్ధః కఠినసంస్పర్శో మందస్రావో మహారుజః. 5
తుద్యతే స్ఫురతి శ్యావో వ్రణో మారుతసంభవః,

తా. జడముగనుండుట, స్పృశించిన కఠినముగనుండుట, కొంచెముగ స్రవిం చుట, మిక్కిలి పోట్లుగలుగుట, పొడిచినటుల నొప్పితో గూడియుండుట, అదరుట, నల్లగనుండుట ఇట్టి లక్షణములుగలది వాతజవ్రణమని తెలియవలయును.

## పైత్తికవ్రణలక్షణము

తృష్ణామోహజ్వరక్లేదదాహదుష్టావదారణైః. 6
వ్రణం పిత్తకృతం విద్యాద్గంధైస్స్రావైశ్చ పూతికైః,

తా. దప్పి, మోహము, జ్వరము, చెమట, తాపము, చీల్చబడినటులనొప్పి, వాసన, దుర్గంధముతో చీముస్రవించుట ఇట్టి లక్షణములు గలిగియుండిన పిత్తజ వ్రణము అని తెలియవలయును.

## శ్లేష్మజవ్రణలక్షణము

బహుపిచ్ఛో గురుస్నిగ్ధస్తిమితో మందవేదనః. 7
పాండువర్ణోల్పసంక్లేదీ చిరపాకీ కఫోద్భవః,

తా. మిక్కిలి జిగటగనుండుట, గురుత్వము, దట్టము, నిశ్చలము, కొంచము నొప్పి, పాండురవర్ణము, కొంచము స్రావము, చిరకాలమునకు పండుట, ఇట్టి లక్షణములు గలిగియుండిన శ్లేష్మజవ్రణమని తెలియవలయును.

రక్తజ ద్వంద్వజవ్రణలక్షణము

రక్తో రక్తస్రుతీ రక్తాద్ద్విత్రిజస్స్యాత్తదన్వయైః. 8

తా. రక్తవర్ణముగలదై రక్తమును స్రవించుచుండు వ్రణము రక్తజవ్రణమనియు, దోషద్వయసంబంధమువలన జనించినది ద్వంద్వజవ్రణమనియు, త్రిదోష రక్తసంబంధమువలన జనించిన వ్రణము, సన్నిపాతజవ్రణమనియును తెలియవలయును.

సుఖవ్రణలక్షణము

త్వఙ్మాంసజస్సుఖే దేశే తరుణస్యానుపద్రవః,
ధీమతోభినవః కాలే సుఖసాధ్యస్సుఖవ్రణః. 9

తా. చర్మము, మాంసము, మర్మరహితస్థలములు, వీనియందు జనించి, జ్వరము, తృష్ణ మొదలగు నుపద్రవములులేనిదై, యౌవనము, యుక్తాయుక్తజ్ఞానము గల పురుషులకు, హేమంత శిశిరకాలములయందు జనించిన నూతనవ్రణము, సుఖవ్రణమనియు నది సుఖసాధ్యంబనియును తెలియవలయును.

కృఛ్రసాధ్యాసాధ్యవ్రణలక్షణము

గుణైరన్యతమైర్హీనస్తతః కృఛ్రోవ్రణస్స్మృతః,
సర్వైర్విహీనో విజ్ఞేయస్త్వసాధ్యో నిరుపక్రమః. 10

తా. పూర్వమందు జెప్పబడిన, త్వఙ్మాంసజేత్యాది శ్లోకమునందు జెప్పబడిన గుణములలో తక్కువగుణములుగల వ్రణము కష్టసాధ్యంబనియు, ఆశ్లోకమునందలి గుణములలో సర్వగుణములు లేకయుండు వ్రణము అసాధ్యంబనియు తెలిసికొనవలయును. ఇట్టి వ్రణములకు చికిత్సఁజేయరాదు.

దుష్టవ్రణలక్షణము

పూతిపూయాతిదుష్టాసృక్స్రావ్యుత్సంగీ చిరస్థితిః,
దుష్టవ్రణోతిగంధాదిశ్శుద్ధలింగవిపర్యయః. 11

తా. దుర్గంధముగ చీమును, చెడినరక్తమును స్రవింపుచు, దీర్ఘకాలమువరకు, పైన ఉబ్బుగను, లోపల బోలుగనుండి, అసహ్యమగు గంధముగలదై, వికారమగు వర్ణస్రావ వేదనలతోగూడి, శుద్ధవ్రణ లక్షణరహితంబైయుండునది దుష్టవ్రణమని యెరుంగవలయును.

## శుద్ధవ్రణలక్షణము

జిహ్వాతలాభోఽతిమృదుశ్ల క్ష్ణస్స్నిగ్ధోల్పవేదనః,
సువ్యవస్థో నిరాస్రావశ్శుద్ధో వ్రణఇతి స్మృతః. 12

తా. నాలుకయొక్క అడుగుభాగము, వలె మృదువుగను, నున్నగను, స్నిగ్ధముగను నుండి, అల్పవేదనతో గూడుకొనినదై, ఉబ్బుమొదలగునవి లేక దోష రక్తాది స్రావములు లేక నేయుండునది శుద్ధవ్రణమని తెలియవలయును.

## వ్రణరోహణలక్షణము

కపోతవర్ణప్రతిమాయస్యాంతాః క్లేదవర్జితాః,
స్థిరాశ్చ పిటకావంతో రోహతీతి తమాదిశేత్. 13

తా. చుట్టూ పావురపిట్ట కంఠసమమగు వర్ణముగలిగి క్లేదరహితమై సడలక సన్నని పండ్లవంటి అంచులతో వ్యాప్తమైయుండు వ్రణము బాగుగ మానుచున్నదని తెలియవలయును.

## బాగుగమానిన వ్రణముయొక్క లక్షణము

రూఢవర్త్మానమగ్రంథిమశూనమరుజం వ్రణమ్,
త్వక్సవర్ణం సమతలం సమ్యగ్రూఢం తమాదిశేత్. 14

తా. ముఖము లెస్సగ పూడిపోవుట, కురుపుపైనుబ్బు, వాపు, పోట్లు లేకయుండుట, చర్మముతో సమానవర్ణము గలదిగనుండుట, (నాలుకతోగాని, అరచేతిలోగాని) సమానముగనుండుట, ఇట్టి లక్షణములుగల వ్రణము, బాగుగమానినదని తెలియవలయును.

## వ్రణకృచ్ఛ్రసాధ్యతాలక్షణము

కుష్ఠినాం విషజుష్టానాం శోషిణాం మధుమేహినామ్,
వ్రణాః కృచ్ఛ్రేణ సిధ్యన్తి యేషాం చాపి వ్రణే వ్రణాః. 15

తా. కుష్ఠువు, విషము, క్షయరోగము, మధుమేహము, ఇవిగల పురుషునికి జనించినవ్రణములు, కష్టసాధ్యములు మరియు వ్రణముపై మరియొక వ్రణముజనించిన, అదియును కష్టసాధ్యమని తెలియవలయును.

## సాధ్యాసాధ్యవ్రణలక్షణము

వసాం మేదోథమజ్జానంమస్తులింగం చ యస్స్రవేత్,
ఆగంతుజో వ్రణస్సిధ్యేన్న సిధ్యేద్దోషసంభవః. 16

తా. క్రొవ్వు, మేదస్సు, మజ్జ, మస్తకస్నేహము, వీనిని వెడలింపజేసెడి

వ్రణము ఆగంతుక జనితంబైయుండిన సాధ్యంబు. దోషజనితంబైయుండిన నసాధ్యంబని తెలియవలయును.

—⊙ అసాధ్యవ్రణలక్షణము ⊙—

మద్యాగర్వాజ్యసుమనఃపద్మచందనచంపకైః,
సుగంధా దివ్యగంధాశ్చ ముమూర్షూణాం వ్రణాస్స్మృతాః. 17

తా. మద్యము, అగరు, నెయ్యి, జాజిపుష్పము, కమలము, చందనము, సంపంగిపువ్వు లేక దివ్యములగు పారిజాతాది పుష్పములు, వీనియొక్క సువాసనము వెడలింపజేయుచుండు వ్రణమువలన రోగి మరణమును బొందునని తెలియవలయును.

—⊙ మతాంతరము ⊙—

యే చ మర్మసు సంభూతా భవంత్యత్యర్థవేదనాః,
దహ్యంతే చాంతరత్యర్థం బహిశ్శీతాశ్చ యే వ్రణాః. 18
దహ్యన్తే బహిరత్యర్థం భవంత్యంతశ్చ శీతలాః,
ప్రాణమాంసక్షయశ్వాసకాసారోచకపీడితాః. 19
ప్రవృద్ధపూయరుధిరా వ్రణా యేషాం చ మర్మసు,
క్రియాభిస్సమ్యగారబ్ధా న సిధ్యంతి చ యే వ్రణాః. 20
వర్జయేదేవ తాన్వైద్యస్సంరక్షన్నాత్మనో యశః,

తా. మర్మస్థానములయందుజనించి, మిక్కుటమగు వేదనగల వ్రణములును, లోపల తాపము వెలుపల శీతలముగనుండు వ్రణములును, వెలుపల తాపము లోపల శీతలముగనుండు వ్రణములును, బలమాంసములు క్షీణించి, శ్వాస, దగ్గు, అరోచకము వీనితోగూడి మిక్కిలిబాధను గలుగజేయుచుండు వ్రణములును, మర్మస్థానమునందుత్పన్నమై మిక్కుటముగ చీమును రక్తమును స్రవింపజేయుచుండు వ్రణములును, లెస్సగ చికిత్సజేయబడియు సాధ్యముకాకయుండు వ్రణములును అసాధ్యములు. యశస్సునుగోరు వైద్యుడు వీనిని విడువవలయును.

—⊙ వ్రణశోఫస్వరూపము ⊙—

ఏకదేశోత్థితశ్శోఫో వ్రణానాం పూర్వలక్షణమ్. 21
షడ్విధస్స్యాత్పృథక్సర్వరక్తాగంతునిమిత్తజః,
శోఫాః షడేతే విజ్ఞేయాః ప్రాగుక్తైశ్శోఫలక్షణైః. 22
విశేషః కథ్యతే తేషాం పక్వాపక్వవినిశ్చయే,

తా. వ్రణములు పుట్టుటకుముం దెక్కడనైన నొకచోటవాపుగలిగిన నది వ్రణపూర్వరూపమగును. వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, రక్త, ఆగంతుక భేదములచే నది

ఆరుప్రకారములుగలదై, పూర్వోక్త శోఫలక్షణములతో గూడియుండు వానియొక్క పక్వాపక్వాద్యవస్థల నిర్ణయించుటకు తగిన విశేషలక్షణముల తెలియజేయుచున్నాడను.

## ప్రణపరిపాకలక్షణము

విషమం పచ్యతే వాతాత్పిత్తోత్థశ్చాచిరం చిరమ్. 23
కఫజః పిత్తవచ్ఛోఫో రక్తాగంతుసముద్భవః,

తా. వ్రణము వాతదోషమువలన విషమపాకముగలదిగను, పిత్తదోషమువలన శీఘ్రముగ పక్వమగునదిగను, కఫదోషమువలన చిరకాలమునకు పక్వమగునదిగను, రక్తాగంతుక దోషములవలన పిత్తవ్రణమువలె శీఘ్రముగ పక్వమగునదిగనుండును.

## అపక్వవ్రణలక్షణము

మందోష్మతాల్పశోథత్వం కాఠిన్యం త్వక్సవర్ణతా. 24
మందవేదనతా చైవ శోథానామామలక్షణమ్,

తా. అపక్వవ్రణమునందు వాచినప్రదేశమును స్పృశించిన కొంచెము ఉష్ణముగనుండుట, కొంచెము వాపుగలిగి కఠినముగనుండుట, విచ్ఛాయగనుండుట, కొంచెము పోటుగలిగియుండుట ఇవియన్నియు గలిగియుండును.

## పచ్యమానవ్రణలక్షణము

దహ్యతే దహనేనేవ క్షారేణేవ చ పచ్యతే. 25
పిపీలికాగణేనేవ దశ్యతే ఛిద్యతే తథా,
భిద్యతే చైవ శస్త్రేణ దండేనేవ చ తాడ్యతే. 26
పీడ్యతే పాణినేవాంతస్సూచీభిరివ తుద్యతే,
సోషాచోషో వివర్ణస్స్యాదంగుళ్యేవావపాట్యతే. 27
ఆసనే శయనే స్థానే శాన్తిం వృశ్చికవిద్ధవత్,
న గచ్ఛేదాతతశ్శోథో భవేదాధ్మాతవస్తివత్. 28
జ్వరస్తృష్ణారుచిశ్చైవ పచ్యమానస్య లక్షణమ్,

తా. వ్రణపాకకాలంబున అగ్నితో కాల్చబడినటులనుండుట, క్షారాదుల నునిచినటుల చిమచిమలాడుట, చీమలుకుట్టినటుల నొప్పుట, శస్త్రముతో పొడిచినటులగాని, చీల్చబడినటులగాని నుండుట, లేక కఱ్ఱతో గొట్టబడినటులనుండుట, చేతితో పిసికినటులగాని, లోపల సూదులతో బొడిచినటులగాని యుండుట, వేదన గలదై తాపముతో గూడియుండుట, అగ్నిచే వేయించబడినటుల బాధగలుగుట, వివర్ణత, వేళ్లతో బగలదీయబడినటులనుండుట, కూర్చొనియుండునపుడు పరుండినపుడు నిలువబడియుండునపుడు తేలుకుట్టినటుల వేదనగలిగి యెల్లపుడు శాంతిజెందక యుండుట,

వాపు మిక్కుటమగుటవలన ఉబ్బిన వస్తివలెనుండి జ్వరము, దప్పి, అరుచి వీనితో గూడుకొనియుండునది పచ్యమానవ్రణమని తెలియవలయును.

పక్వవ్రణలక్షణము

వేదనోపశమశ్శోథో లోహితోల్పో నచోన్నతః. 29
ప్రాదుర్భావో వలీనాం చ తోదః కండూర్ముహుర్ముహుః,
ఉపద్రవాణాం ప్రశమో నిమ్నతా స్ఫుటనం త్వచః. 30
వస్తావివాంబుసంచారస్స్యాచ్ఛోథోంగుళిపీడితే,
పూయస్యగమనంప్రాప్తేమధ్యలంతే చ పీడతే. 31
భక్తాకాంక్షాభవేచ్చైవ శోథానాం పక్వలక్షణమ్,

తా. వేదన కొంచెమునివర్తించుట, యెఱ్ఱనై కొంచెము వాపుగలుగుట, వ్రణమగుట, చిన్నమడుతలుపడుట, పోటు, మాటిమాటికి దురదగలుగుట, పిత్తమువలన జనించిన దాహాద్యుపద్రవములు శమించుట, వాపుయందొత్తిన పల్లముపడుట, చర్మము పగులుట, వాపును వ్రేలితోనదిమిన వస్తియందుండు నుదకమువలె చీము ఈవలయావలజలించుట, వ్రణముయొక్క నొకప్రదేశము నదిమిన చీము మరియొక చోటికిజనుట, అన్నమునందిచ్ఛ ఇట్టి లక్షణములుగలది పక్వవ్రణమని తెలియవలయును.

వ్రణమున త్రిదోషసంబంధము

నర్తేనిలాద్రుగ్నవినాచపిత్తం పాకః కఫం వాపి వినా న పూయః. 32
తస్మాద్ధి సర్వే పరిపాకకాలే పచంతి శోథాస్త్రిభిరేవ దోషైః,

తా. వాతములేక పోట్లును, పిత్తములేక పాకంబును, కఫములేక చీమును గలుగనేరవు. కావున నన్నివాపులు పరిపక్వకాలమునందు త్రిదోషసంబంధమునే గలవియై పరిపక్వమును జెందును.

అనిర్గత పూయదోషము

కక్షం సమాసాద్య యథైవవహ్నిర్వాయ్వీరితస్సందహతి ప్రసహ్య.
తథైవ పూయోప్యవినిస్సృతో హి మాంసం శిరాస్నాయు చ
ఖాదతీహ,

తా, అగ్ని, వాయుసహాయముచే తృణపుంజమును భస్మము జేయువిధంబున చీము బయలువెడలకుండుటచే నాచీము తపించి మాంసము, శిరలు, స్నాయువులు వీనిని భక్షించుచుండును.

వ్రణవైద్యగుణదోషము

ఆమం విదహ్యామానం చ సమ్యక్పక్వం చ లక్షయేత్. 34

జానీయాత్స భవేద్వైద్యశ్శేషాస్తస్కరవృత్తయః,

తా. వ్రణములయొక్క అపక్వత, పచ్యమానత్వము, పక్వత్వము వీనిని బాగుగ తెలిసికొనువాడే వైద్యుడు. తక్కినవారలు దొంగవైద్యవృత్తిగలవారని తెలియవలయును.

అనిశ్చితకారివ్రణవైద్యదోషము

యశ్ఛినత్త్యామమజ్ఞానాద్యశ్చ పక్వముపేక్షతే. 35
శ్వపచావివ మంతవ్యౌ తావనిశ్చితకారిణౌ,

తా. అజ్ఞానముచే పక్వముగాని వ్రణమును పక్వమైనదని భేదించువాడును లేక పక్వమగు వ్రణమును పేక్షించెడి వైద్యుడును చండాలురతో తుల్యుడని యెరుంగవలయును.

న్యగ్రోధాదికషాయము

న్యగ్రోధోదుంబరాశ్వత్థకదంబప్లక్షవేతసైః. 36
కరవీరార్కకటుకైః కషాయో రోపణే హితః,

తా. మఱ్ఱి, అత్తి, రావి, కడిమి, జువ్వి, ప్రబ్బలి, కరవీరము, జిల్లేడు, కటుకరోహిణి వీనినికషాయముబెట్టి బాగుగకడిగిన వ్రణములు మానును.

నింబాదికల్కము

నింబపత్రఘృతక్షౌద్రదార్వీమధుకసంయుతా. 37
వర్తిస్తిలానాం కల్కోర్వాశోధయేద్రోపయేద్వ్రణమ్,
నింబశమ్యాకజాత్యర్కసప్తపర్ణాశ్వమారకాః. 38
కృమిఘ్నామూత్రసంయుక్తాః సేకలేపనధావనైః.
కరంజారిష్టనిర్గుండీరసో హన్యాద్వ్రణేకృమీన్. 39

తా. వేపాకు, మ్రానిపసపు, యష్టిమధుకము వీనిని తేనె, నెయ్యితోచేర్చి నూరి వస్త్రమునకు లేపనముజేసి వర్తిగనొనర్చిగాని, లేక నువ్వులకల్కముతోగాని, వ్రణశోధనము, అర్చుట, వీనినిఁజేయవలయును. మరియు వేప, రేల, జాజి, జిల్లేడు, సప్తపర్ణి, గన్నేరు, వాయువిడంగములు, గోమూత్రము వీనికషాయముచే సేచనము, లేపనము, కడుగుట వీనినిఁజేయుట మరియు కానుగ, వేప, వావిలి వీనిరసములచే సేచన, లేపన, ధావనములంజేయుట వీనివలన వ్రణమున క్రిములు నశించును.

త్రిఫలాదికషాయము

యే క్లేదపాకస్రుతిగంధవంతో వ్రణా మహాన్తస్సరుజాస్సశోఫాః.

ప్రయాన్తి తే గుగ్గులుమిశ్రితేన పీతేన శాన్తిం త్రిఫలాజలేన. 40

తా. త్రిఫలకషాయమునందు గుగ్గిలచూర్ణముగలిపి పుచ్చుకొనిన పోట్లు, పాకము, స్రావము, దుర్గంధము ఇవిగలిగి నొప్పితోగూడి వాపుతోగూడిన గొప్ప విగనుండు వ్రణములు నివర్తించును.

కాంజికకల్కము

కల్కః కాంజికసంపిష్టస్స్నిగ్ధశ్శాఖోటకత్వచః,
సువర్ణఇవ నాగానాం వాతశోఫవినాశనః. 41

తా. పెద్దశేకుపట్టను కాంజికముతోనూరి కల్కముజేసి లేపనముజేసిన గరుత్మంతు డెటుల సర్పముల నశింపజేయునో ఆటుల వాతవ్రణశోఫమును నివర్తింపజేయును.

వ్రణదారణమునకు దంతిమూలాదిలేపము

దన్తీమూలకచిత్రత్వక్స్నుహ్యర్కపయసాగుడైః,
భల్లాతకాస్థికాసీససైంధవైర్దారణస్స్మృతః. 42

తా. దంతిమూలము, చిత్రమూలపువోలుపు, బొంతజెముడుపాలు, బెల్లము, జీడిగింజలు, కాసీసము, సైంధవలవణము వీనినన్నియు నూరి లేపనముజేసిన వ్రణములు పగులును.

హస్తిదంతాదిలేపము

హస్తిదన్తం జలే ఘృష్టం బిందుమాత్రప్రలేపితమ్,
అత్యంతం కఠినే చాపి శోఫే పాచనభేదనమ్. 43

తా. ఏనుగుకొమ్మును ఉదకముతోనూరి బిందుమాత్రము లేపనముజేసిన మిక్కిలి గట్టిగనుండువ్రణము పక్వమై పగులును.

యవాదిలేపనము

యవగోధూమచూర్ణం చ సక్షారం దారణం పృథక్,
హరిద్రాభస్మచూర్ణాభ్యాం ప్రలేపో దారణః పరః. 44
అజవిట్క్షారమచకప్రలేపో వ్రణదారుణః,

తా. యవలు, గోధుమలు వీనినినూరి అందు యవక్షారముగలిపి లేపనముజేసినను లేక పసపుభస్మములో సున్నముగలిపి లేపనముజేసినను లేక మేకపెంటిక బూడిదెలో సాంబరలవణమును గలిపి లేపనముజేసినను వ్రణము పగులును.

### దుష్టవ్రణలేపము

నింబకోలకపత్రాణాంలేపస్స్యాద్వ్రణశోధనః. 45
నింబపత్రతిలైః కల్కోమధునాకృతశోధనః,
నింబపత్రంతిలైర్దన్తీత్రివృత్సైంధవమాక్షికైః,
దుష్టవ్రణప్రశమనో లేపశ్శోధనకేసరీ. 46

తా. వేపాకు, రేగాకు వీనినినూరిగాని, నువ్వులకల్కములో వేపాకు చూర్ణము, తేనెజేర్చిగాని, వేపాకు, నువ్వులు, దంతివేరు, తెగడ, సైంధవలవణము వీనిని మెత్తగచూర్ణించి తేనెతోకలిపిగాని లేపనముజేసిన దుష్టవ్రణ వాపును నివర్తించును.

### మనశ్శిలాదిలేపనము

మనశ్శిలాసమంజిష్ఠసలాక్షరజనీద్వయైః,
ప్రలేపస్సఘృతక్షౌద్రస్త్వక్ఛుద్ధికరస్స్మృతః. 47

తా. మణిశిల, మంజిష్ఠ, లక్క, పసపు, మానిపసపు వీనిని చూర్ణించి నెయ్యి, తేనెచేర్చి కలిపి లేపనముజేసిన చర్మము శుద్ధంబగును.

### అయోరజ ఆదిలేపము

అయోరజస్సకాసీసత్రిఫలాకుసుమాన్వితః,
ప్రలేపః కురుతే దార్వ్యా సద్యఏవ నవాంత్వచమ్. 48

తా. లోహభస్మము, అన్నభేది, త్రిఫలములు, లవంగములు, మానిపసపు వీనిని నూరి లేపనముజేసిన వ్రణముమాని కొత్తచర్మము బుట్టును.

### మాతులుంగాదిలేపము

మాతులుంగాగ్నిమంథౌ చ సురదారుమహౌషధమ్,
సహింస్రా చైవ రాస్నా చ ప్రలేపాద్వాతశోఫహృత్. 49

తా. మాదీఫలము, కూరసెల్లి, దేవదారు, శొంఠి, జటామాంసి, సన్నరాస్నము వీనిని నూరి వ్రణమునకు లేపనముజేసిన వాతజవ్రణశోఫ నివర్తించును.

### శ్లేష్మజవ్రణశోఫకు అజగంధాదిలేపము

అజగంధాశ్వగంధా చ కాలాసరళయా సహ,
కంపిల్లకా చ శృంగీ చ ప్రలేపశ్శ్లేష్మశోఫహా. 50

తా. వామింటవేరు, పెన్నేరుగడ్డ, నల్లతెగడ, తెల్లతెగడ, కంపిల్లము, కర్కాటకశృంగి వీనినినూరి లేపనముజేసిన శ్లేష్మజవ్రణశోఫ నివర్తించును.

కృష్ణాపురాణపిణ్యాకశిగ్రుత్వక్ సికతా శివా,
మూత్రపిష్టస్సుఖోష్ణోయం ప్రలేపః శ్లేష్మశోథహా. 51

తా. పిప్పళ్లు, పాతగానుగపిండి, మునగవేరుచెక్క, తెల్లచక్కెర, కరక బొలుపు వీనిని గోమూత్రముతో నూరి, కొంచెము ఉష్ణముజేసి లేపనముజేసిన శ్లేష్మవ్రణశోఫ నివర్తించును.

పిత్తజవ్రణశోఫనలేపము

దూర్వాచనళమూలం చ మధుకం చందనం తథా,
శీతలైశ్చ గణైస్సర్వైః ప్రలేపో పిత్తశోఫహా. 52

తా. గరిక, దేవనళమూలము, యష్టిమధుకము, చందనము, శీతలములగు ఔషధగణము వీనినినూరి లేపనముజేసిన పిత్తజవ్రణశోఫ నివర్తించును.

జాత్యాదిఘృతము

జాతీపత్రపటోలనింబకటుకా దార్వీ నిశా సారిబా,
మంజిష్ఠాభయతుత్థసిక్థమధుకైర్నక్తాహ్వబీజైస్సమైః. 53
సర్పిః సిద్ధమనేన సూక్ష్మవదనామర్మాశ్రితాస్స్రావిణో,
గంభీరాస్సరుజో వ్రణాస్సగతికాశ్శుద్ధ్యన్తి రోహన్తి చ. 54

తా. జాజికాయ, జాపత్రి, చేదుపొట్ల, వేప, కటుకరోహిణి, మానిపసపు, పసపు, సుగంధపాల, మంజిష్ఠ, వట్టివేరు, మైలతుత్తము, మైనము, యష్టిమధుకము, కానుగువిత్తులు వీనిని సమభాగములుగచేర్చి కషాయముబెట్టి అందు నెయ్యిచేర్చి ఘృతపక్వముగ వండి లేపనముచేసిన, సూక్ష్మముఖములు కరిగి మర్మములను ఆశ్రయించి, స్రవించుచు, గంభీరమగు ముట్టామునొప్పిగల వ్రణములు నాడీవ్రణములు శుద్ధములై మానిపోవును.

పారదాదిమలహరఘృతము

రసగంధకయోశ్చూర్ణం సమంమృద్దారుశృంగకమ్,
సర్వతుల్యంతు కంపిల్లం కించిత్తుత్థసమన్వితమ్. 55
సర్వం సంమేళయేద్దత్వా ఘృతం సర్వచతుర్గుణమ్,
పిచుప్లుతం ప్రదాతవ్యం దుష్టవ్రణవిశోధనమ్. 56
నాడీవ్రణహరం చైవ సర్వవ్రణనిషూదనమ్,
యే వ్రణా న ప్రశామ్యంతి భేషజానాం శతేన చ. 57
అనేన తే ప్రశామ్యంతి సర్పిషా స్వల్పకాలతః,

తా. రసము, గంధకము వీనిని సమభాగములుగ ఖల్వమునందువైచి మెత్తగ నూరి దానికి సమముగ ముదారుసింగునుగలిపి మర్దించి, వీనికన్నిటికిసమము కంపిల్లము, కొంచెము మైలతుత్తముగలిపి, బాగుగనూరి దీనికి నాలుగింతలు నెయ్యిగలిపి దానిలో ప్రత్తినిదడిపి, వ్రణముపైనునిచిన, దుష్టవ్రణము శుద్ధంబగుటయేగాక, నాడీవ్రణము, సర్వవ్రణములు నశించును. మరియు ననేకౌషధములవలన సహా శాంతిని పొందకుండు వ్రణము లీఘృతమువలన స్వల్పకాలములో నివర్తించును.

## స్వర్జికాదిఘృతము

స్వర్జికా చ యవక్షారః కంపిల్లం చ హరేణుకా. 58
టంకణం శ్వేతఖదిరం తుత్థచూర్ణం చ గోఘృతైః,
సర్వం సమాంశం సంచూర్ణ్య మర్దయేత్ప్రహరం దృఢమ్. 59
స్వర్జికాద్యమిదం సర్పిస్సర్వవ్రణహరం పరమ్,

తా. సర్జక్షారము, యవక్షారము, కంపిల్లము, రేణుకలు, వెలిగారము, తెల్ల చంద్ర, మైలతుత్తము వీనిని సమాంశములుగ చూర్ణించి, ఆవునెయ్యితో నొక ఝాము మర్దించి లేపనము మొదలగునవి జేసిన సర్వవ్రణములు నివర్తించును.

## అమృతాదిగుగ్గులు

అమృతా పటోలమూలం త్రికటుం త్రిఫలాం కృమిఘ్నబీజాని. 60
కృత్వా సమాంశచూర్ణం తత్తుల్యో గుగ్గులుర్యోజ్యః,
ప్రతివాసరమేకైకాం ఖాదేద్వటికామథాక్షపరిమాణామ్. 61
జేతుం వ్రణవాతాస్రం గుల్మోదరపాండుశోఫాదీన్,

తా. తిప్పతీగ, చేదుపొట్లవేరు, శొంఠి, పిప్పలి, మిరియాలు, త్రిఫలములు, వాయువిడంగములు, వీనిని సమభాగములుగచేర్చి చూర్ణించి, యీచూర్ణమునకు సమము గుగ్గిల చూర్ణమునుజేర్చి, మాత్రలుజేసి ప్రత్యహము అక్షప్రమాణము భక్షించుచుండిన, వ్రణములు వాత రక్తము, గుల్మము, ఉదరరోగము, పాండు రోగము. వాపు ఇవియన్నియు నివర్తించును.

## త్రిఫలాగుగ్గులువటుకములు

త్రిఫలాచూర్ణసంయుక్తో గుగ్గులుర్వటకీకృతః. 62
నిషేవితో విబంధఘ్నో వ్రణశోధనరోపణః,

తా. త్రిఫలచూర్ణముతో గుగ్గిలముచేర్చి మాత్రలుజేసిభక్షించిన మలబంధము నివర్తించి వ్రణము మానును.

విడంగాదిగుగ్గులువటుకములు

విడంగం త్రిఫలావ్యోషచూర్ణం గుగ్గులునా సమమ్. 63
సర్పిషా వటకాన్కుర్యాత్ ఖాదేద్వా హితభోజనః
దుష్టవ్రణాపచీమేహాకుష్ఠనాడీవిశోధనః. 64

తా. వాయువిడంగములు, త్రిఫలములు, త్రికటుకములు, వీనినిచూర్ణించి యీచూర్ణమునకు సమము గుగ్గులు చూర్ణమునుచేర్చి, నెయ్యివైచి మాత్రలుచేసి సేవించి, పథ్యముగ భుజించిన దుష్టవ్రణములు, అపచి, మేహము, కుష్ఠము, నాడీవ్రణము, ఇవి శుద్ధమగును.

వ్రణశోధనరోపణవిధి

తిలసైంధవయష్ట్యాహ్వానింబపత్రనిశాయుగైః,
త్రివృన్మధుయుతైః పిష్టైః ప్రలేపో వ్రణశోధనః. 65
తిలకల్కస్సలవణో ద్వే హరిద్రే త్రివృద్ఘృతమ్,
మధుకం నింబపత్రాణి లేపస్స్యాద్వ్రణశోధనః. 66

తా. నువ్వులు, సైంధవలవణము, అతిమధురము, వేపాకు, పసపు, మానిపసపు, తెగడ వీనినిచూర్ణించి తేనెతోమర్దించి లేపనముజేసిన దుష్టవ్రణము శుద్ధమగును. మరియు, నువ్వులకల్కములో సైంధవలవణము, పసపు, మానిపసపు, తెగడ, అతిమధురము, వేపాకు వీనినిచూర్ణముజేసి నేతితోగలిపి లేపనముజేసిన దుష్టవ్రణము శుద్ధమగును,

వ్రణక్షాళనము

తతః ప్రక్షాళనే క్వాథః పటోలీనింబపత్రజః,
అవిశుద్ధే విశుద్ధే తు న్యగ్రోధాదిత్వగుద్భవః. 67
పంచమూలీద్వయం వా తే న్యగ్రోధాదిశ్చ పైత్తికే,
ఆరగ్వధాదికో యోజ్యః కఫజే సర్వకర్మసు. 68

తా. చేదుపొట్ల, వేపాకు వీనికషాయముతో శుద్ధముకాని వ్రణమును గడుగవలయును. మర్రిమొదలగు వానిపట్టలయొక్క కషాయముతో, శుద్ధవ్రణములగడుగవలయును. దశమూలకషాయముతో, వాతవ్రణమును గడుగవలయును. న్యగ్రోధాదిగణ కషాయముతో పిత్తవ్రణమును, రేలమొదలగు వానికషాయముతో కఫజవ్రణములను గడుగవలయును,

—॥ వ్రణాపచారములు ॥—

వ్రణేష్వాయథురాయాసాత్సచ రాగశ్చ జాగరాత్,
తౌ చరుక్చదివాస్వాపాత్తాశ్చ మృత్యుశ్చ మైథునాత్. 69

తా. వ్రణమునందు ఆయాసమువలనవాపు, జాగరణవలనవాపు, ఎరుపు వర్ణము, పగటినిద్రవలన ఎరుపువర్ణము, వాపు, పోట్లు, మైధునమువలనవాపు, ఎరుపు వర్ణము పోట్లు, మరణము ఇవి గలుగునని తెలియవలయును.

—॥ వ్రణివర్జ్యద్రవ్యములు ॥—

ఆమ్లం దధి చ శాకం చ మాంసమానూపవారిజమ్,
జీరం గురూణి చాన్నాని వ్రణీ తు పరివర్జయేత్. 70

తా. వ్రణరోగముగలవారలు పులుసు, పెరుగు, ఆకుకూరలు, జలజంతుమాంసము, జీలకఱ్ఱ, గురుకర అన్నములు, వీనిని విడువవలయును.

---

# అగ్నిదగ్ధవ్రణప్రకరణమ్.

—॥ అగ్నిదగ్ధవ్రణస్వరూపము ॥—

తత్ర స్నిగ్ధం రూక్షం వాశ్రిత్య ద్రవ్యమగ్నిర్దహతి,
అగ్నిసంతప్తో హి స్నేహస్సూక్ష్మమార్గానుసారిత్వాత్. 1
త్వగాదీననుప్రవిశ్యాశు దహతి,
తస్మాత్స్నేహదగ్ధేధికా రుజో భవంతి. 2
తత్ర ప్లుష్టం దుర్దగ్ధం సమ్యగ్దగ్ధమతిదగ్ధం చేతి చతుర్విధం భవత్యగ్నిదగ్ధమ్,

తా. అగ్ని, స్నిగ్ధరూక్షద్రవ్యముల నాశ్రయించి, దహనముజేయును. మఱియు నగ్నిచే తపింపబడినతైలము సూక్ష్మమార్గమువలన (అనగా రోమకూపమువలన) త్వఙ్మాంసాది సప్తధాతువులయందు ప్రవేశించి, శీఘ్రముగ దహింపంజేయును. కాలిన స్నేహదగ్ధమున విశేషవేదనగలుగును. ఆయగ్నిదగ్ధము, ప్లుష్టము, దుర్దగ్ధము, విదగ్ధము, అతిదగ్ధమని ౪ విధములుగలదిగ నుండును.

—॥ దాహవిశేషజ్ఞానము ॥—

తత్ర వివర్ణమాత్రం ప్లుష్యతే తత్ప్లుష్టమ్. 3
యత్రోత్తిష్ఠంతి స్ఫోటాస్తీవ్రదాహవేదనాశ్చిరాచ్చోపశామ్యంతి తద్దుర్దగ్ధమ్,

సమ్యగ్దగ్ధమవగాఢం తాళఫలవర్ణం సుస్థితం పూర్వలక్షణయుక్తమ్. 4
అతిదగ్ధేతు త్వఙ్మాంసావలంబనగాత్రవిశ్లేషణసిరాస్నాయుసంధ్యస్థి
వ్యాపాదేనాతిమాత్రవేదనాజ్వరదాహపిపాసామూర్ఛాశ్వాసోపద్ర
వా భవంతి,
ఇతి ప్లుష్టాదిభేదేన వహ్నిదగ్ధశ్చతుర్విధో వ్రణో భవతి. 5

తా. అగ్నిదగ్ధవ్రణములయందు చర్మము వివర్ణమగువరకు కాలిన, ప్లుష్టమనియు, కాలిన దానిపై బొబ్బలుపుట్టి తీవ్రమగుతాపము, వేదన వీనితోగూడి బహుకాలమునకు మానిన దుర్దగ్ధమనియు, లోతైన మూలముగలిగి తాటిపండు వర్ణముతో సమానవర్ణముగలదై బొబ్బలతో వ్యాపించినదై మిక్కుటమగు దాహముతో గూడియుండునది సమ్యగ్దగ్ధమనియు, చర్మమాంసముల దహింపజేయుటచే వానిని కదులునటుల జేసి సిరలు, నరములు, సంధులు, యెముకలు వీనిని జెరచి మిక్కులి వేదన, జ్వరము, మంట, దప్పి, మూర్ఛ, శ్వాస వీనిని గలుగంజేసిన అతిదగ్ధమనియును తెలియవలయును. ఇటుల అగ్నిదగ్ధవ్రణములు ౪ విధంబులుగ నుండును.

—— అగ్నిదగ్ధవ్రణచికిత్స ——

ప్లుష్టస్యాగ్నిప్రశమనే కార్యముష్ణం తథౌషధమ్,
శీతాముష్ణాం చ దుర్దగ్ధే క్రియాం కుర్యాత్తతః పునః. 6
ఘృతాలేపనసేకాంస్తు శీతాన్యేవాస్య కారయేత్.
అతిదగ్ధే విశీర్ణాని మాంసాన్యుద్ధృత్య శీతలామ్. 7
క్రియాం కుర్యాచ్చ తాం కాలే శాలితండులకండనైః,
తిందుక్యాశ్చ కషాయైర్వా ఘృతమిశ్రైః ప్రలేపయేత్. 8
సమ్యగ్దగ్ధే తు గాక్షీరీప్లక్షచందనగైరికైః,
సామృతైస్సర్పిషా యుక్తైరాలేపం కారయేద్భిషక్. 9

తా. ప్లుష్టాగ్నిదగ్ధవ్రణమునందు ఉష్ణములగు ఔషధముల లేపనముజేయవలయును. దుగ్ధగ్ధవ్రణమునందు శీతములగు క్రియలనుగాని లేక ఉష్ణక్రియలనుజేసి పిదప ఘృతాదులయొక్క లేపనము, సేచనము మొదలగు శీతకరములగు క్రియలను జేయవలయును. అతిదగ్ధవ్రణమునందు శిథిలమై వ్రేలుచుండు మాంసమును ఛేదించి శీతకరక్రియను, వరిబియ్యపు పిండిని, నల్లతుమికిపట్ట కషాయముతోచేర్చి నేతిని గలిపి లేపనము జేయవలయును. సమ్యగ్దగ్ధమునందు, వెదురుప్పు, మఱ్ఱి, చందనము, కావిరాయి, తిప్పతీగ వీనికల్కమునందు నెయ్యికలిపి కాచి లేపనము జేయవలయును.

### ధాతకీచూర్ణము

అగ్నినాప్నిచవిసర్పేకీటలూతావ్రణేషు చ,
చిరోత్థేషు చ దుష్టేషు నాడీమర్మాశ్రితేషు చ. 10
అగ్నిదగ్ధవ్రణే దేయం ధాతకీచూర్ణముత్తమమ్.
అతసీతైలసంమిశ్రం వహ్నిదగ్ధవ్రణాపహమ్. 11

తా. ధాతకియను గ్రంధ్యము (అనగా ఆరెపువ్వు)ను చూర్ణించి వెల్లఅగిశ విత్తుల తైలముతోకలిపి పూసిన అగ్నిదగ్ధవ్రణము, విసర్పి, కీటవ్రణము, లూతవ్రణము, చిరకాలము క్రిందటజనించి దుష్టములుగనుండు వ్రణములు, నాడీమర్మము వీనినాశ్రయించియుండు వ్రణములు ఇవి యన్నియు నివర్తించును.

### త్రిఫలాచూర్ణము

అంతర్ధూమవిదగ్ధం త్రిఫలాచూర్ణం విమిశ్రితం తైలైః,
క్షౌమైశ్శీఘ్రంశమయత్యగ్నివ్రణమాశులేపేన. 12

తా. త్రిఫలములను పొగపోకుండ కాల్చి చూర్ణించి తైలముతోగాని తేనెతోగాని చేర్చి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము నివర్తించును.

### దగ్ధయవచూర్ణము

దగ్ధయవభస్మచూర్ణం తిలతైలాక్తం ప్రలేపనాదచిరాత్,
హారశిఖిదాహాదగ్ధం భూయోభ్యంగాద్వ్రణం చాశు. 13

తా. యవలనుకాల్చి భస్మముచేసి నువ్వులనూనెతోచేర్చి మాటిమాటికి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము శీఘ్రముగ నివర్తించును.

### పత్థ్యాదిలేపము

పత్థ్యాకర్దమజీరకమధుసిక్థకసర్జమిశ్రితో లేపః,
గవ్యం ఘృతమపహరతి చ పావకజనితం వ్రణం సద్యః. 14

తా. కరక్కాయ, బురద, జీలకఱ్ఱ, మైనము, గుగ్గిలము వీనిని నూరిగాని లేక ఆవునేతిని గలిపి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము నివర్తించును.

### సుధాదిలేపము

సుధాం పురాతనీం దధ్నో వారిణా పరిపేషితామ్,
లేపనం తైలదగ్ధస్య విస్ఫోటవ్యాధినాశనమ్. 15

తా. పాతసున్నమును, పెరుగుమీదితేటలోనూరి లేపనముజేసిన తైలదగ్ధవ్రణము, విస్ఫోటవ్యాధి ఇవి నివర్తించును.

### లాంగలీఘృతము

ఉభే హరిద్రేమంజిష్ఠామధుకంలోధ్రకట్ఫలే,
కంపిల్లకముభే మేదే లాంగలీమూలమేవ చ. 16
పిప్పలీ త్రిఫలా చైవ నింబపత్రం చ కార్షికమ్,
కపిలాయాఘృతప్రస్థం పచేత్తద్ద్విగుణం పయః. 17
పలద్వయం చ సిక్థస్య సిద్ధేపూతే చ దాపయేత్,
లాంగలీకం ఘృతం నామ వ్రణానాం రోపణం పరమ్. 18

తా. పసపు, మానిపసపు, మంజిష్ట, యష్టిమధుకము, లొద్దుగపట్ట, కాయఫలము, కంపిల్లము, మేద, మహామేద, చెన్నచర్లగడ్డ, పిప్పళ్లు, త్రిఫలములు, వేపఆకు, వీనినన్నియు ప్రత్యేకము ౧ కర్షము కపిలగోవుయొక్క ఘృతము ౧ ప్రస్థము, పాలు ౨ ప్రస్థములు, వీనినన్నియు నేకముగజేర్చి ఘృతపక్వముగవండి అందు ౨ పలములమైనముజేర్చి సిద్ధపరచిన ఘృతమునుబూసిన వ్రణము నివర్తించును.

### చందనాదితైలము

చందనం వటశుంగాశ్చ మంజిష్ఠా మధుకం తథా,
ప్రపౌండరీకం దూర్వా చ పతంగం ధాతకీ తథా. 19
ఏతైస్తైలం విపక్తవ్యం గోక్షీరేణ సమాయుతమ్,
అగ్నిదగ్ధే వ్రణే శ్రేష్ఠం తత్క్షణాద్రోపణం పరమ్. 20

తా. చందనము, మఱ్ఱిచిగుళ్లు, మంజిష్ఠ, అతిమధురము, ప్రపౌండరీకము, గరిక, రక్తచందనము, ఆరెపువ్వు వీనికల్కమునందు, ఆవుపాలు, నూనెచేర్చి, తైలపక్వముగకాచి, లేపనముచేసిన, అగ్నిదగ్ధవ్రణము తత్క్షణమునందే, అంచుగట్టి మానును.

### మధూచ్ఛిష్టాదితైలము

మధూచ్ఛిష్టం సమధుకం లోధ్రం సర్జరసం తథా,
మూర్వా చందనమంజిష్ఠాః పిష్ట్వా సర్పిర్విపాచయేత్. 21
సర్వేషామగ్నిదగ్ధానాం వ్రణరోపణముత్తమమ్,

తా. మైనము, అతిమధురము, లొద్దుగ, గుగ్గిలము, చాగ, చందనము, మంజిష్ఠ. వీనిని కల్కముచేసి అందు నెయ్యిచేర్చికాచి లేపనమొనర్చిన అగ్నిదగ్ధవ్రణము అంచుగట్టి మానును.

### పటోలాదితైలము

సిద్ధం కషాయకల్కాభ్యాం పటోల్యాః కటుతైలకమ్. 34

దగ్ధవ్రణరుజాస్రావదాహవిస్ఫోటనాశనమ్,

తా. చేదుపొట్లకషాయము దానికల్కము, వీనిలో, ఆవనూనెచేర్చికాచి లేపనముచేసిన అగ్నివ్రణదగ్ధమునందలినొప్పి, స్రావము, తాపము, బొబ్బలు, ఇవి హరించును.

అగ్నిదగ్ధవ్రణము సమాప్తము

---

# ఆగంతుకవ్రణప్రకరణమ్.

ఆగంతుకవ్రణనిదానము

నానాధారాముఖైశ్శస్త్రైర్నానాస్థాననిపాతితైః,
భవన్తి నానాకృతయో వ్రణాస్తాంస్తాన్నిబోధ మే. 1

తా. నానావిధములగు పదునుగల ముఖములుగల శస్త్రములచేత, శరీరముయొక్క నానావిధస్థానములయందు దెబ్బలుతగులుటవలన జనించిన నానావిధములగు ఆకారములుగల వ్రణములయొక్క స్వరూపముల వివరించెదను.

ఆగంతుకవ్రణభేదములు

ఛిన్నం భిన్నం తథా విద్ధం క్షతం పిచ్చితమేవ చ,
ఘృష్టమాహు స్తథా షష్ఠం తేషాం వక్ష్యామి లక్షణమ్. 2

తా. ఛిన్న, భిన్న, విద్ధ, క్షత, పిచ్చిత, ఘృష్టములన ఆగంతువ్రణములు ౬ విధములుగనుండును. వాని లక్షణముల వివరించుచున్నాడను.

ఛిన్నలక్షణము

తిర్యక్ఛిన్నమృజుర్వాపి యో వ్రణస్త్వాయతో భవేత్,
గాత్రస్యపాతనం తద్ధిఛిన్నమిత్యభిధీయతే. 3

తా. శరీరమునందు, ఆయుధప్రహారములచే, అడ్డముగ, వక్రముగ, లేక పొడవుగ తెగిన వ్రణము ఛిన్నమనంబడును.

భిన్నవ్రణలక్షణము

శక్తికుంతేషుఖడ్గాగ్రవిషాణై రాశయో హతః,
యత్కించిత్స్రవతే తద్ధి భిన్నలక్షణముచ్యతే. 4

తా. బల్లెము, కుంతము, బాణము, కత్తియొక్కకొన, కొమ్ము, దంతము, ఈ ఆయుధములచే కోష్ఠమునందు పొడవబడుటవలన కొంచముర్తక్తము స్రవించిన దానిని భిన్నవ్రణమనియెదరు.

### కోష్ఠలక్షణము

స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్య చ,
హృదుండుకః పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే. 5

తా. ఆమాశయము, అగ్న్యాశయము, పక్వాశయము, మూత్రాశయము, రక్తాశయము, రొమ్ము, మలాశయము, పుప్ఫుసము అను నీస్థలంబులు కోష్ఠములనంబడును.

### కోష్ఠభేదలక్షణము

తస్మిన్ భిన్నే రక్తపూర్ణే జ్వరో దాహశ్చ జాయతే,
మూత్రమార్గగుదాస్యేభ్యో రక్తం ఘ్రాణాచ్చ గచ్ఛతి. 6
మూర్ఛాశ్వాసతృషాధ్మానమభక్తచ్ఛందఏవచ,
విణ్మూత్రవాతసంగశ్చ స్వేదస్రావోఽక్షిరక్తతా. 7
లోహగంధిత్వమాస్యస్య గాత్రదౌర్గంధ్యమేవ చ,
హృచ్ఛూలం పార్శ్వయోశ్చాపి విశేషం చాత్ర మే శృణు. 8

తా. కోష్ఠముభిన్నమైరక్తముచే నిండియుండిన జ్వరము, తాపము, మూత్రమార్గము, గుదము, ముఖము, నాసిక వీనివలన రక్తముస్రవించుట, మూర్ఛ, శ్వాస, దప్పి, కడుపుబ్బరము, అన్నద్వేషము. మలమూత్రవాతనిరోధము, మిక్కిలి చెమట, కన్నులెఱ్ఱగనుండుట, నోరు ఇనుమువాసనగనుండుట, శరీరదౌర్గంధ్యము, హృదయశూల, పార్శ్వశూల ఇట్టి లక్షణములుగలుగును. ఐనను దీనియందు విశేషముగ గలుగునట్టి లక్షణముల వివరించెదను.

### ఆమాశయస్థితరక్తలక్షణము

ఆమాశయస్థే రుధిరే రుధిరం ఛర్దయత్యపి,
అధ్మానమతిమాత్రం చ శూలం చ భృశదారుణమ్. 9

తా. ఆమాశయమునందు రక్తముచేరియుండిన రక్తమునుగ్రక్కుట, మిక్కిలి కడుపుబ్బరము, మిక్కిలి భయంకరమగుశూల ఇట్టి లక్షణములుగలుగును.

### పక్వాశయస్థరక్తలక్షణము

పక్వాశయగతే చాపి రుజాగౌరవమేవ చ,
అధఃకాయే విశేషేణ శీతతా చ భవేదిహ. 10

తా. పక్వాశయమున రక్తముజేరియుండిన, శూల, గురుత్వము, నడుముకు క్రిందిభాగమున మిక్కిలి శీతము, ఇట్టి లక్షణములు గలిగియుండును.

### విద్ధలక్షణము

సూక్ష్మాస్యశల్యాభిహతం యదంగం త్వాశయం వినా,
ఉత్తుండితం నిర్గతం వా తద్విద్ధమితి నిర్దిశేత్. 11

తా. సూక్ష్మముఖముగల శల్యముచే ఆమాశయము వినాగా, ఇతర అవయవముల యందు, పొడవబడుటవలన, శల్యము బయలు వెడలినదిగాని, ముఖములోపల గలదిగ గానియుండిన దానిని విద్ధమనియెదరు.

### క్షతవ్రణలక్షణము

నాతిచ్ఛిన్నం నాతిభిన్నముభయోర్లక్షణాన్వితమ్,
విషమం వ్రణమంగేషు తత్క్షతం త్వభినిర్దిశేత్. 12

తా. శరీరము ఎక్కువగ ఛేదింపబడక, ఎక్కువగ భేదింపబడకను నుండుటవలన, ఛిన్నభిన్నలక్షణములతో గూడుకొని హెచ్చుతగ్గుగలదిగనుండిన దానిని క్షతజవ్రణమని యెదరు.

### పిచ్ఛితవ్రణలక్షణము

ప్రహారపీడనాభ్యాం తు యదంగం పృథుతాం గతమ్,
సాస్థి తత్పిచ్ఛితం విద్యాన్మజ్జారక్తపరిప్లుతమ్. 13

తా. దెబ్బ, బండి మొదలగు వాటివలన నలుగుట పీనివలన అంగము విస్తరించి ఎముకలతో గూడి మజ్జారక్తములచేగప్పబడిన వ్రణభావముగలదైయుండిన, దానిని పిచ్ఛితమనియెదరు.

### ఘృష్టవ్రణలక్షణము

ఘర్షణాదభిఘాతాద్వా యదంగం విగతత్వచమ్,
ఉషాస్రావాన్వితం తద్ధి ఘృష్టమిత్యభినిర్దిశేత్. 14

తా రాపిడి, లేక, అభిఘాతము వీనివలన శరీరముయొక్క పైనుండు చర్మమువీడి మంటతో గూడి రక్తమును స్రవించుచుండిన దానిని ఘృష్టవ్రణమనియెదరు.

### శల్యవ్రణలక్షణము

శ్యావం సశోథం పిటికాన్వితం చ ముహుర్ముహుశ్శోణితవాహనంచ,
మృదూన్నతం బుద్బుదతుల్యమాంసం వ్రణం సశల్యం సరుజం వదన్తి.

తా. వ్రణము, నల్లనివర్ణము, వాపు, కురుపులు వీనితోగూడికొని, మాటి మాటికి రక్తమును స్రవింపంజేయుచు, మృదువుగనుండినదై, నీరుబుగ్గవలె పైకి లేచిన మాంసముగలదై నొప్పిగలిగియుండిన దానిని శల్యవ్రణమనియెదరు.

—॥ కోష్ఠగతశల్యలక్షణము ॥—

త్వచోఽతీత్య సిరాదీని భిత్వా వా పరిహృత్య వా,
కోష్ఠే ప్రతిష్ఠితం శల్యం కుర్యాదుక్తానుపద్రవాన్. 16

తా. శల్యము యేడుచర్మములకు లోపలప్రవేశించి, నరములు, మాంసము బోలునరములు, ఎముకలు, వీనిని భిన్నముచేసిగాని, భిన్నముసేయకగాని, కోష్ఠమును ప్రవేశించిన, దీనియందు పైనుదహరింపబడిన శల్యవ్రణోపద్రవములు గలుగునని తెలియవలయును.

—॥ అసాధ్యకోష్ఠభేదలక్షణము ॥—

తత్రాంతర్లోహితం పాండుశీతపాదకరాననమ్,
శీతోచ్ఛ్వాసం రక్తనేత్రమానద్ధం పరివర్జయేత్. 17

తా. ఎవనికి కోష్ఠములోనరక్తము సంచితంబైయుండి, పాండువర్ణము, కరపాదశీతలము, శ్వాస చల్లగ వెడలుట, నేత్రములు యెఱ్ఱనైయుండుట, కడుపుబ్బరము, ఇట్టి లక్షణములు గలిగియుండునో, అట్టిమనుజుని విడువవలయును.

—॥ మర్మక్షతసామాన్యలక్షణము ॥—

భ్రమః ప్రలాపః పతనం ప్రమోహో విచేష్టనం గ్లానిరథోష్ణతా చ,
స్రస్తాంగతా మూర్ఛనమూర్ధ్వవాతస్తీవ్రా రుజో వాతకృతాశ్చ తాస్తాః. 18

మాంసోదకాభం రుధిరం చ గచ్ఛేత్సర్వేంద్రియార్థోపరమస్తథైవ,
దశార్ధసంఖ్యేష్వథవిక్షతేషు సామాన్యతో మర్మసులింగముక్తమ్. 19

తా. భ్రమ, కలవరించుట, క్రిందబడుట, ఇంద్రియ మనోమోహము, కాళ్లు చేతులు విదిలించుట, బడలిక, ఉష్ణము, అంగసంధులు వదిలినటులనొచ్చుట, మూర్ఛ, యెగయూపిరి, వాతజన్యమగు తీవ్రబాధ, రక్తము మాంసముగడిగిన నీళ్లవలెగా, రుట, సకలేంద్రియ వ్యాపారము పరమించుట, యిట్టి లక్షణములు, సామాన్యముగ, ఉత్తరమందు జెప్పబడబోయ్యెడి మర్మములగు, మాంసము, సిరలు, స్నాయువు అస్థిసంధులయొక్క క్షతములవలన కలుగునని తెలియవలయును.

—॥ మర్మరహితసిరావిద్ధలక్షణము ॥—

సురేంద్రగోపప్రతిమం ప్రభూతంరక్తం స్రవేత్తత్క్షయజశ్చ వాయుః,
కరోతి రోగాన్వివిధాన్యథోక్తాన్ సిరాసు విద్ధాస్వథవాక్షతాసు. 20

తా. సిరనుబొడుచుటవలనగాని, లేక దానియందుగాయము అగుటవలనగాని

ఇంద్రగోప (ఆర్ద్రి)పురుగుతో సమానవర్ణముగలిగి, యెఱ్ఱనైనరక్తము, మిక్కిలి స్రవించినందున, మర్మరహితసిరావిద్ధమని తెలియవలయును. మరియు, ఆరక్తము క్షీణించుటవలన, వాతము, ప్రకోపించి, నానావిధములగు ఆక్షేపకాదివికారముల గలుగంజేయును.

## స్నాయువిద్ధలక్షణము

కౌబ్జ్యం శరీరావయవావసాదః క్రియాస్వశక్తిస్తుములా రుజశ్చ,
చిరాద్వ్రణో రోహతి యస్య చాపి తం స్నాయువిద్ధం పురుషం వ్యవస్యేత్. 21

తా. కుబ్జత్వము, శరీరమునందుబడలిక, పనులుచేయుటయందు శక్తిలేక యుండుట, మిక్కిలివేదన, ఇవిగలిగి గాయముచిరకాలమునకు, మాంసపూరితమగు నేని, నది స్నాయువిద్ధమని తెలియవలయును.

## సంధివిద్ధలక్షణము

శోథాభివృద్ధిస్తుములా రుజశ్చ బలక్షయః పర్వసు భేదశోథౌ,
క్షతేషు సంధిష్వచలాచలేషు స్యాత్సర్వకర్మోపరమశ్చ లింగమ్. 22

తా. చలనముగాని, లేక చలనములేకుండుటగాని, గలసంధులయందు గాయముతగులుటవలన, వాపుగలిగి వృద్ధిపొందుట, మిక్కిలివేదన, బలక్షయము, సంధులయందు విగవబడినటుల నొప్పిగలుగుట, వాపు, ఏపనియుజేయుటకు తోచక యుండుట, ఇట్టి లక్షణములు గలిగియుండిన, సంధివిద్ధవ్రణమని యెరుంగవలయును.

## అస్థివిద్ధలక్షణము

ఘోరారుజో యస్యనిశాదినేషు సర్వాస్వవస్థాసు చ నైతి శాన్తిమ్,
భిషగ్విపశ్చిద్విదితార్థసూత్రస్త మస్థివిద్ధం పురుషం వ్యవస్యేత్. 23

తా. రాత్రిపవలు భయంకరమగు నొప్పిగలిగి జాగ్రదాది సర్వావస్థలయందును శమించకయుండిన వైద్యవేత్తయగువాడు అస్థులయందు దగిలిన గాయమని యెరుంగవలయును.

## సిరాదిమర్మవిద్ధలక్షణము

యథాస్వమేతాని విభావయేచ్చ లింగాని మర్మస్వభితాడితేషు,

తా. సిరాదిమర్మస్థానములయందు దెబ్బదగిలినట్లు పూర్వమందుజెప్పబడి యుండు భ్రమ ప్రలాపము మొదలగు లక్షణములవలన యెరుంగవలయును. మరియు చకారమువలన యీలక్షణములును సామాన్యలక్షణములును గలిగియుండునని తెలియవలయును.

### మాంసమర్మవిద్ధలక్షణము

పాండుర్వివర్ణః స్పర్శితం న వేత్తి యో మాంసమర్మస్వభితాడిత
స్స్యాత్. 24

తా. పాండువర్ణము, వివర్ణత్వము, స్పర్శజ్ఞానశూన్యత, ఇవిగలవాడుగనుండిన దానిని మాంసమర్మమునందు గాయముతగులుటవలన గలిగినవ్రణమని తెలియవలయును.

### సర్వవ్రణోపద్రవములు

విసర్పః పక్షఘాతశ్చ సిరాస్తంభోపతానకః,
మోహోన్మాదవ్రణరుజాజ్వరస్తృష్ణాహనుగ్రహాః. 25
కాసశ్ఛర్దిరతిసారో హిక్కాశ్వాసస్సవేపథుః,
షోడశోపద్రవాః ప్రోక్తా వ్రణానాం వ్రణచింతకైః. 26

తా. విసర్పము, పక్షాఘాతము, సిరాస్తంభనము, అపతానకము, మోహము, ఉన్మాదము, వ్రణమునందుపీడ, దప్పి, చెంపలుబిగబట్టుట, దగ్గు, వాంతి, అతిసారము, ఎక్కిళ్లు, ఉబ్బసము, కంపము, ఈ ౧౬ ఉపద్రవములు, వ్రణరోగముల యందు జనించునని, వ్రణవేత్తలగువైద్యులు వచించెదరు.

### వంశత్వగాది కషాయము

క్వాథో వంశత్వగేరండశ్వదంష్ట్రాశ్మభిదాకృతః,
హింగుసైంధవసంయుక్తః కోష్ఠస్థం స్రావయేదసృక్. 27

తా. వెదురుపట్ట, ఆముదపువేరు, పల్లేరువేరు, పాషాణభేది వీటిని సమాంశములుగ కషాయముబెట్టి అందు ఇంగువ, సైంధవలవణముచేర్చి పుచ్చుకొనిన కోష్ఠమునందుండు రక్తము స్రవించును.

### ఆగంతుకవ్రణచికిత్స

యష్టీమధుకయుక్తేన కించిదుష్ణేన సర్పిషా,
మత్వాగంతువ్రణం వైద్యైర్ఘృతక్షౌద్రసమన్వితమ్. 28
శక్త్యా క్రియా ప్రయోక్తవ్యా పిత్తరక్తోష్మనాశనీ,

తా. ఆగంతుకవ్రణమునందు, అతిమధురచూర్ణమును నేతితోచేర్చి కాచి కొంచము ఉష్ణముగనుండునపుడు, లేపనముజేయవలయును. మరియు పిత్తరక్తము, ఉష్ణము వీనిని నశింపజేయు క్రియను శక్త్యనుసారముగా నుపయోగించిన, ఆగంతుకవ్రణములు మానును.

### ఆగంతుకవ్రణసామాన్యచికిత్స

బుద్ధ్వాగంతువ్రణం వైద్యో ఘృతక్షౌద్రసమన్వితామ్. 29
శీతాం క్రియాం చరేదాశు రక్తపిత్తోష్మనాశినీమ్,

తా. వైద్యుడు, ఆగంతుకవ్రణమును లెస్సగదెలిసికొని, రక్త, పిత్త, ఉష్ణ నాశనకర, శీతకరములగు క్రియలను, నెయ్యి, తేనె, వీటితోజేర్చి చేయవలయును.

క్రుద్ధే సద్యోవ్రణే కుర్యాదూర్ధ్వం చాధశ్చ శోధనమ్. 30
లంఘనం చ బలం జ్ఞాత్వా భోజనం చాస్రమోక్షణమ్,

తా. ప్రకోపించియుండు, ఆగంతుకవ్రణమునందు, వమనము, విరేచనము, లంఘనము, భోజనము, రక్తమోక్షము, వీనిని వ్రణరోగియొక్క బలాబలానుగుణ్యముగ జేయవలయును.

### ఛిన్న భిన్న విద్ధవ్రణోపచారములు

ఛిన్నే భిన్నే తథావిద్ధే క్షతే సద్యో భిషగ్వరః. 31
పటసూత్రేణ సంవేష్ట్య వ్రణం వ్రణవిశారదః,
ముహుర్ముహుర్యథాదుఃఖం న ప్రాప్నోతి వ్రణీ నరః. 32

తా. వైద్యుడు, ఛిన్న, భిన్న, విద్ధవ్రణములయందు సద్యస్కాలమందే, వస్త్రమునుజుట్టి దారముతోగట్టి మాటిమాటికి దుఃఖముగలుగకుండునటుల చూడవలయును.

### ఉపచారము

అథవా దీప్యలవణపోటల్యా స్వేదయేన్ముహుః,
సంతప్తయా తప్తలోహపాత్రసంయోగతః క్రమాత్. 33
దుష్టం రక్తం స్థితం చాపి శృంగాలాబ్వాదిభిర్హరేత్,

తా. ఓమము, ఉప్పు, వీనిని మెత్తగనూరి, లోహపాత్రయందునించి వెచ్చజేసి మాటిమాటికి స్వేదనముజేసి, దుష్టరక్తమును, శృంగము, అలాబు మొదలగువానిచే దీయవలయును.

### సద్యోవ్రణచికిత్స

సద్యః క్షతః వ్రణే వైద్యస్సశూలే పరిషేచయేత్. 34
యష్టీమధుకమిశ్రేణ నాతిశీతేన సర్పిషా,
కషాయమధురాశ్శీతాః క్రియాస్సర్వాస్తు యోజయేత్. 35
సద్యో వ్రణానాం సప్తాహాత్ పశ్చాత్పూర్వోక్తమాచరేత్,

చికిత్సితం తు తత్సర్వం సామాన్యవ్రణనాశనమ్. 36

తా. శూలతో గూడుకొనిన సద్యఃక్షతవ్రణమునకు, యష్టిమధుకచూర్ణమును నెయ్యిలో వైచి కాచి నులివెచ్చగా కాగవలెను. సద్యోవ్రణములకు వగరు, మధురము, శీతలములగు సర్వక్రియలను ఏడుదినములుచేసి తరువాతవెనుక జెప్పిన సామాన్యవ్రణ నాశన చికిత్సలను చేయవలెను.

### ఆమాశయపక్వాశయగతరుధిరోపచారములు

ఆమాశయస్థే రుధిరే వమనం పథ్యముచ్యతే,
పక్వాశయస్థే దేయం చ విరేచనమసంశయమ్. 37

తా. గాయముతగులుటవలన ఆమాశయమునందు రక్తముచేరియుండిన వమనం బును, ఇటులనే పక్వాశయమునందు రక్తముజేరియుండిన రేచనమును చేయించ వలయును.

### సప్తవింశతిగుగ్గులు

త్రికటుత్రిఫలా ముస్తా విడంగా మృతచిత్రకమ్,
పటోలం పిప్పలీమూలం హాపుషా సురదారు చ. 38
తుంబురుః పుష్కరం చవ్యం విశాలారజనీద్వయమ్,
బిడం సౌవర్చలం క్షారః సైంధవం గజపిప్పలీ. 39
యావంత్యేతాని సర్వాణి తావద్ద్విగుణగుగ్గులుః,
కోలప్రమాణాం వటికాం భక్షయేన్మధునా సహ. 40
కాసం శ్వాసం తథాశోఫమర్శాంసి చ భగందరమ్,
హృచ్ఛూలం పార్శ్వశూలం చ కుక్షివస్తిగుదే రుజమ్. 41
అశ్మరీం మూత్రకృచ్ఛ్రం చాప్యాంత్రవృద్ధిం తథా క్రిమీన్,
చిరజ్వరోపసృష్టం చక్షతోపహతవర్ష్మణామ్. 42
ఆనాహంచతథోన్మాదం సర్వకుష్ఠోదరాణి చ,
నాడీదుష్టవ్రణాన్హన్యాత్ ప్రమేహాన్ శ్లీపదం తథా. 43
ధన్వంతరికృతో హ్యేషసర్వరోగనిషూదనః,
సప్తవింశతికో నామ గుగ్గులుః ప్రథితో మహాన్. 44

తా. త్రికటుకము, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిడంగములు, తిప్పతీగె, చిత్రమూలము, చేదుపొట్ల, పిప్పలీమూలము, బోడతరము, దేవదారు, ధనియాలు, పుష్కరమూలము, చవ్యము, వెట్టిపుచ్చ, పసపు, మానిపసపు, బిడాలవణము, సౌవర్చలవణము, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, గజపిప్పలి,

వీటిని సమాంశములుగచూర్ణించి, యీ చూర్ణమునకు రెండింతలు, శుద్ధిచేసిన గుగ్గిలపు చూర్ణముచేర్చి మర్దించి, రేగుగింజలంత మాత్రలుచేసి, తేనెతో పుచ్చుకొనిన కాస, శ్వాస, వాపు, మూలవ్యాధి, భగందరము, హృదయశూల, పార్శ్వశూల, లోకడుపుశూల, పొత్తికడుపుయందునొప్పి, గుదశూల అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, అంత్రవృద్ధి, కృములు, పురాణజ్వరము, గాయము, కడుపుబ్బరము, ఉన్మాదము, సర్వకుష్ఠువులు, సర్వోదరములు, దుష్టనాడీవ్రణములు, ప్రమేహములు, శ్లీపదము, ఇవియన్నియును నివర్తించును. ఇది సర్వరోగనివారణకై, ధన్వంతరిచే జెప్పంబడిన, సప్తవింశతి గుగ్గులు యనంబడును.

## గౌర్యాదిఘృతము

గౌరీంహరిద్రాంమంజిష్ఠాం మాంసీంమధుకమేవ చ,
ప్రపౌండరీకం హ్రీబేరం నతం ముస్తం సచందనమ్. 45
జాతీనింబపటోలాని కరంజంకటురోహిణీ,
మధూచ్ఛిష్టం మధూకం చ మహామేదాంతథైవచ. 46
పంచవల్కలతోయేన ఘృతప్రస్థం విపాచయేత్,
ఏతద్గౌరాదికం సర్పిస్సర్వవ్రణవిశోధనమ్. 47
ఆగంతుకాశ్చ సహజాస్సుచిరోత్థాశ్చ యే వ్రణాః,
నాడీవ్రణశ్చ విషమో నశ్యంత్యేవ న సంశయః. 48

తా. గోరోచనము, పసవు, మంజిష్ఠ, జటామాంసి, అతిమధురము, ప్రపౌండరీకము, కురువేరు, గ్రంధితగరము తుంగముస్తలు, చందనము, జాజి, వేప, చేదుపొట్ల, కానుగవిత్తులు, కటుకరోహిణి, మైనము, ఇప్ప, మహామేద, వీనికల్కము, పంచవల్కలములు, కషాయమువైచి, అందొకప్రస్థము నెయ్యిచేర్చి, ఘృతపక్వముగ వండి, లేపనముచేసిన, సర్వవ్రణములు, ఆగంతుకవ్రణములు, సహజవ్రణములు, దీర్ఘకాలముగనుండువ్రణములు, నాడీవ్రణములు, దుష్టవ్రణములు, వీనినన్నిటిని నివర్తింపంజేయును.

## జాత్యాదితైలము

జాతీనింబపటోలానాం నక్తమాలస్య పల్లవాః,
సిక్థకం మధుకం కుష్ఠం ద్వే నిశే కటురోహిణీమ్. 49
మంజిష్ఠాంపద్మకం లోధ్రమభయాంనీలముత్పలమ్,
తుత్థకం శారిబాం బీజం నక్తమాలస్య చ క్షిపేత్. 50
ఏతాని సమభాగాని పిష్ట్వా తైలం విపాచయేత్,

విషవ్రణసముత్థేషు స్ఫోట కేషు చ కచ్ఛుషు. 51
కండూవిసర్పరోగేషు కీటదష్టేషు సర్వదా,
సద్యశ్శస్త్రప్రహారేషు దగ్ధవిద్ధక్షతేషు చ. 52
నఖదన్తక్షతే దేహే దుష్టమాంసావఘర్షణే,
భక్షణార్థమిదం తైలం హితం శోధనరోపణమ్. 53

తా. జాజిచిగురు, వేపచిగురు, చేదుపొట్లాకు, క్రొను గాకు, మైనము, యష్టిమధుకము, చంగల్వకోష్ఠు, పసపు, మానిపసపు, కటుకరోహిణి, మంజిష్ఠ, పద్మకాష్ఠము, లొద్దుగ, కరక్కాయ, నల్లకలువగడ్డలు, మైలతుత్తము, సుగంధపాలవేరు, కానుగవిత్తులు, వీనిని సమభాగములుగ చేర్చినూరి, కల్కముచేసి, అందు తైలము జేర్చి, కాచి సేవించిన, విషమవ్రణము, సర్వవిస్ఫోటకములు, గజ్జి, దురద, విసర్పరోగము, పురుగుకాటు, శస్త్రప్రహారమువలన తత్కాలమునందుగలిగిన గాయములు, కాలిన గాయములు, పొడిచిన గాయములు, నఖదంతములవలనగలిగిన గాయము, శరీరమునందలి దుష్టమాంసమును ఛేదించుటవలన, గలిగిన గాయము, రాపిడివలనగలిగిన గాయము, ఇవియన్నియు పరిశుద్ధమై ఆంచుగట్టి మానును.

## విపరీతకమల్లతైలము

సిందూరకుష్ఠ విషహింగు రసోనచిత్రబాణాంఘ్రిలాంగలిక కల్కవిపక్వతైలమ్,
గోదంతలాజహతభుక్స్రుతవాతఫేనైః క్లిన్నవ్రణప్రశమనో విపరీతమల్లః. 54
ఖడ్గాభిఘాతగురుగండమహోపదంశనాడీవ్రణవిచర్చికకుష్ఠపామాః,
ఏతాన్నిహన్తి విపరీతకమల్లనామతైలం యథేష్టశయనాసనభోజనస్య. 55

తా. సిందూరము, చంగల్వకోష్ఠు, నాభి, ఇంగువ, వెల్లుల్లిపాయలు, చిత్రమూలము, తెల్లవెంపలివేరు, చెన్నచర్లగడ్డ, హరిదళము పేలాలు, మైలతుత్తము, నల్లమందు వీనికల్కమునందు తైలముజేర్చికాచి, వ్రణములకు లేపనముచేసిన, స్రావముగల వ్రణముల నశింపజేయును. మరియు, విపరీతమల్లకమను నీతైలము లేపనమువలన, ఖడ్గప్రహారమువలన గలిగినవ్రణము, పెద్దగంటులు, భయంకరమగు ఉపదంశము నాడీవ్రణములు వ్రణములు, విచ్చరిక, కుష్ఠువు, గజ్జి, ఇవియన్నియును నశించును. దీనికి పథ్యములేదు.

### సర్వవ్రణములకుపథ్యములు

యవషష్టికగోధూమపురాణాస్సితశాలయః,
మసూరతువరీముద్గయూషశ్చ మధుశర్కరాః. 56
విలేపీ లాజమండశ్చ జాంగలామృగపక్షిణః,
ఘృతం తైలం పటోలం చ వేత్రాగ్రం బాలమూలకమ్. 57
వార్తాకం కారవేల్లం చ కర్కోటీ తండులీయకమ్,
ఏతత్పథ్యం నరైస్సేవ్యం యథావస్థం యథామలమ్. 58
వ్రణశోథేవ్రణే సద్యోవ్రణే నాడీవ్రణేషు చ,

తా. యవలు, ౬౦ - దినములకు పండినవడ్లబియ్యము; గోధుమలు, పాతతెల్ల వడ్లబియ్యము, చిరుశనగలు కందులు పెసలు వీనియొక్క యూషము, తేనె, చక్కెర, విలేపి, పేలాలయొక్క మండము, జాంగలదేశమునందలి పశుపక్షిమాంసము, నెయ్యి, నూనె, పొట్లకాయ, వెదురుమొలకలు, లేతముల్లంగి, వంకాయలు, కాకరకాయలు, ములుదోసకాయ, చిర్రికూర, ఇవియన్నియు, వ్రణశోథవ్రణము, సద్యోవ్రణము, నాడీవ్రణము, వీటికి పథ్యములుగాన; యీరోగములయొక్క అవస్థాభేదములు, దోషాదోషములనెరింగి, పథ్యమున కుపయోగించుకొనవలయును.

### అపథ్యములు

రూక్షామ్లశీతం లవణం వ్యవాయమాయాసముచ్చైః పరిభాషణం చ,
ప్రియాసమాలోకనమహ్నినిద్రాంప్రజాగరం చక్రమణంనితాంతమ్,
శోకం విరుద్ధాశనమంబుపానం తాంబూలశాకాని చపత్రవంతి. 60
అజాంగలం మాంసమసాత్మ్యమన్నం వివర్జయేత్తంవ్రణితః ప్రయత్నాత్,

తా. రూక్షము; పులుసు, శీతలము, ఉప్పు, ఇవిగలద్రవ్యములు, మైథునము, ఆయాసము, గొప్పగమాటలాడుట, స్త్రీలనుజూచుట, దినానిద్ర, రాత్రులయందు జాగరణము, మిక్కిలిసంచారము, శోకము, విరుద్ధాశనము, ఉదకపానము, తాంబూలము, ఆకుకూరలు, జలజంతుమాంసము, శరీరప్రకృతికి అనుకూలముగాని యన్నము, ఇవియన్నియు, వ్రణరోగముగల వారికపథ్యములుగాన, వీటిని అతిప్రయత్నముచే విడువవలయును.

శ్రీ ర స్తు.

# నాడీవ్రణప్రకరణమ్.

## నాడీవ్రణకర్మవిపాకము

పరేషాం వ్రణభేదేన ముష్టిఘాతేన చైవ హి,
అసత్యవచనాచ్చైవ ప్లీహాష్ఠీలయుత స్తథా. 1
నాడీవ్రణీచ జాయేత తద్రోగస్యాపనుత్తయే,
చాంద్రాయణం చాతికృచ్ఛ్రం ప్రతిచాంద్రాయణం చరేత్. 2
అతిరౌద్రేణ సూక్తేన చాష్టోత్తరశతాహుతీః,
కూష్మాండహోమః కర్తవ్యః సోమారుద్రజప స్తథా. 3
యత్కించేదమిదం సమ్యగ్దశవేదయుతసంఖ్యయా,

తా. పరులయొక్క వ్రణమును భేధించినవాడును లేక, ముష్ట్యాదులచే ఘాతజేసినవాడును, అసత్యమునుసంభాషించువాడును, ప్లీహ, అష్ఠీల, నాడీవ్రణము, ఇవి గలవాడుగజనించును. ఆయారోగములయొక్క నివృత్తికై, చాంద్రాయణము, అతికృచ్ఛ్రము, ప్రతిచాంద్రాయణము, వీనినిజేసి, పిదప, అతిరౌద్రసూక్తముచే, అష్టోత్తరశతము హోమముచేసి, కూష్మాండహోమమును సహాజేసి, పిదప, (సోమారుద్ర, యత్కించేదంవరుణ) యను ఋక్కులచే పదివేలు జపించవలయును.

## నాడీవ్రణనిదానము

యశ్శోథమామమతిపక్వముపేక్షతేజ్ఞో
యో వా వ్రణం ప్రచురపూయమసాధువృత్తః. 4
అభ్యంతరం ప్రవిశతి ప్రవిదార్యతస్య
స్థానాని పూర్వవిహితాని తత స్సపూయః,
తస్యాతిమాత్రగమనాద్గతిరిష్యతే తు
నాడీవ యద్వహతి తేన మతా తు నాడీ. 5

తా. మూర్ఖుడగు మనుజుడు, పండినవాపును, అపక్వమనితలంచి యుపేక్షించుట, చీము నిండియుండు వ్రణమును పేక్షించుట, వీనివలన చీము పూర్వోక్తమగు, త్వఙ్మాంసాదిస్థానములపొంది భేదించి, మిక్కిలి లోపలికి పోవుటవలన, ఏకమార్గము

గలదై, దానివలన చీము నాడీవలె స్రవించుచుండిన దానిని నాడీ వ్రణమనియెదరు. మరియు వ్రణమార్గము నతిక్రమించి నడచుటచేత గతియనియునందురు.

### నాడీవ్రణభేదములు

దోషైస్త్రిభిర్భవతి సా పృథగేకశశ్చ
సంమూర్ఛితైరపి చశల్యానిమిత్తతో౽న్యా.

తా. నాడీవ్రణము వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, శల్యాజములని అయిదు విధంబులు గలదిగనుండును.

### వాతనాడీవ్రణలక్షణము

తత్రానిలాత్పరుపసూక్ష్మముఖీసశూలా
ఫేనానువిద్ధమధికం స్రవతి క్షపాసు. 6

తా. వ్రణముఖము పరుషము సూక్ష్మముగనుండుట, శూల, రాత్రులయందు నురుగుతోగూడి మిక్కిలి స్రవించుట, ఇట్టి లక్షణములుగలది, వాతనాడీవ్రణమని తెలియవలయును.

### పిత్తనాడీవ్రణలక్షణము

పిత్తాత్తు తృడ్జ్వరకరీ పరిదాహయుక్తా
పీతం స్రవత్యధికముష్ణమహ స్సు చాపి,

తా. దప్పి, జ్వరము, దాహము ఇవి కలిగియుండుట, పసపువర్ణముగల చీము ఉష్ణముగలదై పగటియందధికముగ స్రవించుట ఇట్టి లక్షణములు గలిగియుండిన పిత్తనాడీవ్రణమని తెలియవలయును.

### కఫనాడీవ్రణలక్షణము

జ్ఞేయా కఫాద్బహుఘనార్జునపిచ్ఛిలా
స్రా స్తబ్ధా సకండురరుజారజనీ ప్రవృద్ధా. 7

తా. చీము గట్టిగ తెల్లగ బంకవెడలుట, స్తబ్ధత, దురద, నొప్పి, రాత్రులయందధికముగ చీముకారుట, ఇట్టి లక్షణములుగలది శ్లేష్మనాడీవ్రణమని యెరుంగవలయును.

### శల్యజనాడీవ్రణలక్షణము

నష్టం కథంచిదనుమార్గముదీరితేషు
స్థానేషు శల్యమచిరేణగతింకరోతి,
సాఫేనిలం మథితముష్ణమసృగ్విమిశ్రం.
స్రావం కరోతి సహసా సరుజం చ నిత్యమ్. 8

తా. కంటకము మొదలగు శల్యములు, త్వఙ్మాంసాదులయందు ప్రవేశించి, కనుపడక నియమములైన వేగ క్షయాది కారణములు లేనివై సూక్ష్మమార్గములుగలవై శల్యజవ్రణములను గలుగఁజేయును. అందువలన, రక్తస్రావము సఁఋగుగ వేడిగ రక్తయుక్తముగ వెడలుటయే గాక, మథింపబడినటుల పోట్లు గలిగియుండునని తెలియవలయును.

## సన్నిపాతనాడీవ్రణలక్షణము

దాహజ్వరశ్వాసనమూర్ఛనవక్త్రశోషా
యస్యాం భవంతి విహితాని చ లక్షణాని,
తామాది శేత్పవనపిత్తకఫప్రకోపా
ద్ఘోరామసుక్షయకరీమివ కాళరాత్రిమ్. 9

తా. దాహము, జ్వరము, శ్వాస, మూర్ఛ, నోరుయెండుట ఇట్టి లక్షణములుగలిగి, పూర్వోక్త, వాత, పిత్త, కఫప్రకోపమువలన గలిగెడి లక్షణములు గలిగియుండిన దానిని సన్నిపాత నాడీవ్రణమనియెదరు. ఇది భయంకరమై ప్రాణముల హరించుటయందు కాళరాత్రి తుల్యముగ నుండును.

## సాధ్యాసాధ్యలక్షణము

నాడీత్రిదోషప్రభవా న సిధ్యేచ్ఛేషాశ్చతస్రః ఖలు యత్నసాధ్యాః,

తా. సన్నిపాతనాడి అసాధ్యమనియును, మిగిలిననాలుగు యత్నసాధ్యములనియును తెలియవలయును.

## వాతనాడీవ్రణచికిత్స

నాడీం వాతకృతాం సాధుపాటితాం లేఖయేద్భిషక్. 10
ప్రత్యక్పుష్పీఫలయుతైస్తిలైః పిష్టైః ప్రలేపయేత్,

తా. వాతనాడీవ్రణమును శస్త్రముతోచీల్చి, లేఖనక్రియనుజేసి, పిదప తెల్లయుత్తరేణివిత్తులు, నువ్వులు వీనినినూరి లేపనముజేయవలయును.

## పిత్తనాడీవ్రణమునకులేపము

పైత్తికం తిలమంజిష్ఠానాగదంతీనిశాహ్వయైః. 11

తా. పిత్తజనాడియందు నువ్వులు, మంజిష్ఠ, నాగదంతి, పసపు వీనినినూరి లేపనముజేయవలయును.

## కఫనాడీవ్రణమునకు తిలాదిలేపనము

శ్లైష్మికం తిలయష్ట్యాహ్వానికుంభారిష్టసైంధవైః,

తా. కఫనాడీవ్రణమునందు నువ్వులు, యష్టిమధుకము, నాగదంతి, వేప, సైంధవలవణము వీనినినూరి లేపనము జేయవలయును.

శల్యనాడీవ్రణలేపము

శల్యజాం తిలమంజిష్ఠామధ్వాజ్యైర్లేపయేన్మహుః. 12

తా. శల్యనాడి వ్రణమునందు తిలలు, మంజిష్ఠ వీనిని తేనె, నెయ్యితో నూరి లేపనము జేయవలయును.

నాడీవ్రణసామాన్యచికిత్స

నాడీనాం గతిమన్వీక్ష్య శస్త్రేణోత్పాట్య కర్మవిత్,
సర్వం వ్రణక్రమం కుర్యాచ్ఛోధనం రోపణాదికమ్. 13
కృశదుర్బలభీరూణాం నాడీమర్మాశ్రితా తు యా,
క్షారమాత్రేణ సంఛింద్యాన్న శస్త్రేణ కదాచన. 14

తా. బుద్ధిమంతుడగు వైద్యుడు నాడీగతిక్రమమును తెలిసికొని, శస్త్రముచే దానిని పగలకోసి, సర్వవ్రణములయందుచేయుశోధన రోపణాదిక్రియలను జేయవలయును. మరియు కృశత్వము, దౌర్బల్యము, భయము, ఇవి గలవార్లకు జనించిన నాడీవ్రణములను, మర్మస్థలములను ఆశ్రయించియుండు నాడీవ్రణములను, క్షారములవలన ఛేదించవలయును. శస్త్రములవలన నెప్పటికిని ఛేదించ నేగూడదని తెలియవలయును.

నాడీవ్రణచికిత్స

ఆదౌ భగ్నం విదిత్వా తు సేచయేచ్ఛీతవారిణా,
పంకేనాలేపనం కార్యం బంధనం చ కుశాన్వితమ్. 15
ఆలేపనార్థం మంజిష్ఠామధుకం చామ్లపేషితమ్,
శతధౌతఘృతోన్మిశ్రం శాలిపిష్టం చ లేపనమ్. 16
నాడీనాం గతిమన్వీక్ష్య శస్త్రేణోత్పాట్య కర్మవిత్,

తా. అభిఘాతము మొదలగు వానివలన యెముకలు విరిగినయెడల, మొదట చల్లనీళ్లుబోసి, పిదప, శస్త్రాదులతో శిరలు తెగకుండకోసి, శరీరమునందు గుచ్చుకొనియుండు శల్యములదీసి, దానిపై యొఱ్ఱమన్నును కలిపిబూసి, దర్భలవైచి కట్టుకట్టి, తదనంతరము, మంజిష్ఠ, యష్టిమధుకము, వీనిని నిమ్మపండ్లపులుసుతో నూరి లేపనము జేసి, ౧౦౦ మార్లుకడగబడిన నెయ్యిలో బియ్యపుపిండినిగలిపి లేపనము జేయవలయును.

విడంగాదిగుగ్గులు

విడంగత్రిఫలావ్యోషచూర్ణం గుగ్గులునా సమమ్. 17
సర్పిషా వటికాం కృత్వా ఖాదేద్వా హితభోజనః,
దుష్టవ్రణా పచీమేహకుష్ఠనాడీవిశోధనః. 18

తా. వాయువిడంగములు, కరక, తాడి, ఉసిరికలు, శొంఠి, పిప్పలి, మిరియాలు వీనిని సమములుగ చూర్ణించి, యీచూర్ణమునకు సమము, గుగ్గిలచూర్ణమును జేర్చి, నెయ్యితో మాత్రలుజేసి సేవించుచు, హితభోజనమొనర్చిన దుష్టవ్రణము, అపచి, మేహము, కుష్ఠము, నాడీవ్రణము ఇవి నివర్తించును.

నరాస్థితైలము

నరాస్థితైలలేపేన స్ఫుటితస్స్యతి వ్రణః,

తా. మనుష్యునియొక్క యెముకలవలన దీయబడు, * నూనెను లేపనముజేసిన వ్రణముపగిలి అంచుగట్టి యెండిపోవును.

నిర్గుండీతైలము

సమూలపత్రాం నిర్గుండీం పీడయిత్వా రసేన తు. 19
తేన సిద్ధం సమం తైలం నాడీదుష్టవ్రణాపహమ్,

తా. వావిలిని సమూలముగదంచి రసముదీసి, అందు నూనెజేర్చి కాచి లేపనముజేసిన దుష్టవ్రణములు మానును.

ఆరగ్వధాదివర్తి

ఆరగ్వధనిశాకోలచూర్ణాజ్యక్షౌద్రసంయుతా. 20
సూత్రవర్తిర్వ్రణే యోజ్యా శోధనీ గతినాశినీ,

తా. రేల, పసపు, రేగుకొంతి వీనినిచూర్ణించి, అందు, నెయ్యి, తేనెచేర్చికలిపి, నూలుతో వత్తినిజేసి దానిని తడిపి నాడీవ్రణమునందు దూర్చిన వ్రణము శుద్ధమగును.

జాత్యాదివర్తి

జాత్యర్కశమ్యాకకరంజదన్తీసింధూత్థసౌవర్చలయావశూకైః. 21
వర్తిః కృతా హన్త్యచిరేణ నాడీం స్నుక్క్షీరపిష్టా సహసైంధవేన,

తా. జాజి, జిల్లేడు, రేల, క్రానుగ, దంతివేరు, సైంధవలవణము, సౌవర్చలవణము, యవక్షారము వీనిని నుదకముతో నూరి, వస్త్రమునకుబట్టించి వత్తిజేసిగాని

* ఎముకలలోనుండు మజ్జను ఎముకలు వెచ్చజేసి పైకి వెడలించినది నరాస్థితైలము.

లేక జెముడుపాలతో సైంధవలవణమునునూరి వర్తిజేసిగాని వ్రణమునందుచిన, నాడీవ్రణము నివర్తించును.

గుగ్గులు లేపము

గుగ్గులుత్రిఫలావ్యోషైస్సమాంశై శ్చాజ్యయోజితః. 22
నాడీందుష్టవ్రణం లేపోజయేదపి భగందరమ్,

తా. శుద్ధిజేసినమహిసాక్షి గుగ్గిలము, త్రిఫలములు, త్రికటుకములు వీనిని సమాంశములుగ నేతితోనూరి లేపనముజేసిన నాడీవ్రణము, భగందరము ఇవి నివర్తించును.

---

# భగందరప్రకరణమ్.

భగందర కర్మవిపాకము

స్వగోత్రస్త్రీప్రసంగేన జాయతే చ భగందరీ,
తేనాపి నిష్కృతిః కార్యా మేషీదానేన యత్నతః. 1
దేవానాం యో ముఖం హవ్యవాహనస్సర్వపూజితః,
తస్యత్వం వాహనం పూజ్యం దేవైస్సేంద్రైర్మహర్షిభిః. 2
భగందరం పూర్వకర్మవిపాకోత్థం తు యన్మమ,
తత్సర్వం నాశయ క్షిప్రం సౌఖ్యం చాపి ప్రవర్ధయ. 3

తా. స్వగోత్రస్త్రీతో సంగమముచేయువాడు, భగందరరోగముగలవాడగును. తన్నివారణార్థమై, (బంగారుగొరిశెలు, వెండికొమ్ములు మొదలగువానితో నలంకరింపబడియుండును,) మేకనుచేయించి దానిని దేవానాంయోముఖంహవ్యవాహన యను మంత్రముతో దానం బొసంగవలయును.

భగందర స్వరూపము

గుదస్య ద్వ్యంగుళే దేశే పార్శ్వతః పిటికార్తికృత్,
భిన్నో భగందరో జ్ఞేయస్సచ పంచవిధో మతః. 4

తా. గుదమునకుప్రక్క రెండుఅంగుళముల ప్రదేశమున నొకపురుపుపుట్టి మిక్కిలి పోటుతోగూడి పగిలిన, దానిని భగందరమనియెదరు. ఇది ఐదువిధములు గలదిగనుండును.

భగందర పూర్వరూపము

కటీకపాలనిస్తోదదాహకండూరుజాదయః,

భవన్తి పూర్వరూపాణి భవిష్యతి భగందరే. 5

తా. కటిప్రదేశము, తలపుఱ్ఱె, పీనియందుపోట్లు, మంట, దురద ఇవి మొదలగునవి కలుగబోయ్యేడి భగందరవ్రణమునకు పూర్వరూపములని తెలియవలయును.

భగందరలక్షణములు

వాతాద్భిన్నారుణో వర్ణః పిత్తాద్రక్తో భగందరః,
కఫాచ్ఛ్వేతో ఘనస్రావః కండూకఠినతాయుతః. 6
శంబూకావర్తవన్నాడీపిటికాగో స్తనాకృతిః,
బహురక్తస్రవేద్గాఢః క్రిమియుక్త స్త్రిదోషజః. 7
ఔదాసీన్యాద్యదా పక్వం రేతో మూత్రపురీషకమ్,
వసావత్స్రవతే పక్వం కష్టసాధ్యో భగందరః. 8
త్రిదోషోత్థోప్యసాధ్యశ్చ క్షతజశ్చవిశేషతః,
అథ సర్వప్రయత్నేన పాకః కార్యో భగందరే. 9

తా. పగిలియొఱ్ఱగనుండిన వాతజభగందరమనియు, రక్తవర్ణముగనుండిన పిత్తజభగందరమనియు, తెలుపు, మిక్కిలి స్రవించుట, దురద ఇవి గలిగి కఠినముగనుండిన శ్లేష్మజభగందరమనియు, నాడి నత్తగుల్లవలెజుట్టుకొని ఆవుచన్నుతో సమానమగు. ఆకారముగలుగుపిటికలతో వ్యాపింపబడియుండునదియు అనేకరంధ్రములతోగూడి మిక్కిలి పులిసిరుగారుచు పురుగులతో గూడియుండిన త్రిదోషజభగందరమనియును నెరుంగవలయును. యీభగందరమును చికిత్సజేయుక యుపేక్షజేసినందువలనపండి, రేతోమూత్రపురీషముల వసవలె స్రవింపజేయును. ఇటుల, పక్వమగుభగందరము, కష్టసాధ్యము. త్రిదోషభగందరమసాధ్యము. క్షతజభగందరము మిక్కిలి యసాధ్యమైనను, భగందరముల సర్వప్రయత్నములవలన పక్వమగునటులఁ జేయవలయును.

శతపోనకభగందరము

కషాయరూక్షై రతికోపితోనిల స్త్వపానదేశే పిటికాం కరోతియామ్,
ఉపేక్షణాత్పాకముపైతిదారుణం రుజా చ భిన్నారుణఫేనవాహినీ. 10
తత్రాగమో మూత్రపురీషరేతసాం వ్రణైరనేకైశ్శతపోనకం వదేత్,

తా. వగరు, రూక్షముగలపదార్థములను సేవించుటవలన, వాతము మిక్కిలి ప్రకోపించి, గుదమునందు కురుపులను గలుఁగఁజేయును. వాని నుపేక్షించిన భయంకరమగు పాకముగలిగి పగిలి పోటుతోగూడి, ఎఱ్ఱనై, నురుగుతోగలసి, చీమును

స్రవింపఁజేయుచు ననేక వ్రణములుగలదై, వానికిబదు రంధ్రములవలన, మలమూత్రశుక్రములను స్రవింపుచుండిన, నది, శతపోనకభగందరమనంబడును. ఇది జల్లెడవలె ఆనేక ఛిద్రములుగలదిగనుండుటవలన శతపోనకమనంబడును. (ఇది వాతజము.)

ఉష్ట్రశిరోధరభగందరలక్షణము

ప్రకోపనైః పిత్తమతిప్రకోపితం
కరోతి రక్తాం పిటికాం గుదాశ్రితామ్. 11
తామాశుపాకాఽహిమపూయవాహినీం
భగందరం తూష్ట్రశిరోధరం వదేత్,

తా. పిత్తకరములగు పదార్థముల మిక్కుటముగ సేవించుటవలన పిత్తము మిక్కుటముగ ప్రకోపించి, గుదమునందు, వొంటెమెడతో తుల్యంబుగనుండు యెఱ్ఱని వ్రణమును జనింపజేయును. అది శీఘ్రముగపక్వమై, వేడిగ చీమును స్రవింపచేయుచుండు దానిని, ఉష్ట్రగ్రీవభగందరమనియెదరు. (ఇది పిత్తజము)

పరిస్రావిభగందరలక్షణము

కండూయనో ఘనస్రావీ కఠినో మందవేదనః. 12
శ్వేతావభాసః కఫజః పరిస్రావీ భగందరః,

తా. కఫజనితమగు దురద గట్టిగ చీముస్రవించుట, కురుపు గట్టిగనుండుట, కొంచమునొప్పి, తెలుపుగనుండుట, ఇట్టి లక్షణములుగలది పరిస్రావిభగందరమనంబడును. (ఇది కఫజము)

శంబూకావర్తభగందరలక్షణము

బహువర్ణరుజా స్రావాః పిటికా గోస్తనోపమాః. 13
శంబూకావర్తవన్నాడీశంబూకావర్తకో మతః,

తా. ఆవుచన్నులవలె కురుపులుపుట్టి, అనేకవిధవర్ణములుగలిగి, నొప్పి, స్రావము ఇవి గలదై, వ్రణము, నత్తగవ్వయందలి సుడితో సమానమగునట్టి లక్షణములు గలిగియుండిన శంబూకావర్తభగందరమని తెలియవలయును. (ఇది సన్నిపాతజము)

ఉన్మార్గిభగందరలక్షణము

క్షతాత్తతిః పాయుగతా వివర్ధతే
హ్యుపేక్షణాత్సుప్తః కృమయో విదార్యతే. 14

ప్రకుర్వతే మార్గమనేకధాముఖైః వ్రణై స్తదున్మార్గి భగందరం
వదేత్,

తా. కంటకములు మొదలగువాని యభిఘాతమువలన, గుదసమీపమునందు గలిగిన గాయము నుపేక్షించుటవలన వృద్ధినిబొందును. అందు పురుగులు జనించి అది అనేక విధరంధ్రములతో గూడిన నాడులనుగా దొలచి వ్యాపించినదైయుండిన దానిని ఉన్మార్గిభగందరమనియును (దీనినే క్షతజభగందరమనియును) వచించెదరు.

భగందరసాధ్యాసాధ్యలక్షణము

ఘోరాస్సాధయితుం దుఃఖాస్సర్వఏవ భగందరాః. 15
తేష్వసాధ్యస్త్రిదోషోత్థః క్షతజశ్చ విశేషతః,

తా. సర్వభగందరములు, సామాన్యముగ అసాధ్యంబులు. వానిలో త్రిదోషజభగందరము మిక్కిలి యసాధ్యము. క్షతజభగందరము అన్నిటికన్నను అసాధ్యమని యెరుంగవలయును.

అసాధ్యభగందరలక్షణము

వాతమూత్రపురీషాణి క్రిమయశ్శుక్రమేవ చ. 16
భగందరాత్ప్రస్రవంతి నాశయన్తి తమాతురం,
తథాపి తస్య కర్తవ్యా చికిత్సా జీవితావధి. 17

తా. భగందరమువలన, వాత, మూత్ర, పురీష, కృమి, శుక్రములు వెడలుచుండిన, అట్టిరోగి జీవించడుగాని, ప్రాణముండువరకు చికిత్సను జేయవలయును.

భగందరమునకు ఖదిరాదికషాయము

ఖదిరత్రిఫలాక్వాథో మహిషీఘృతసంయుతః,
విడంగచూర్ణసంయుక్తో భగందరవినాశనః. 18

తా. చండ్రచావ, త్రిఫలములు, వీనిని కషాయముబెట్టి, అందు బఱ్ఱెనెయ్యి, వాయువిడంగచూర్ణముచేర్చి పుచ్చుకొనిన భగందరము నివర్తించును.

రసాంజనాదికల్కము

రసాంజననిశాద్వంద్వమంజిష్ఠానింబపల్లవైః,
త్రివృత్తేజోవతీదన్తీకల్కో నాడీవ్రణాపహః. 19

తా. రసాంజనము, పసపు, మానిపసపు, మంజిష్ఠ, లేతవేపఆకు, తెగడ, తేజోవతి, (మాల్కంగిణి) దంతివేళ్లు వీనిని కల్కముచేసి పుచ్చుకొనిన నాడీవ్రణము నివర్తించును.

## రవితాండవరసము

శుద్ధసూతం ద్విధా గంధం కుమారీరసమర్దితమ్,
త్ర్యహాన్తే గోళకం కృత్వాహాండికాంతే నిరోధయేత్. 20
తయోస్సమే తామ్రపాత్రే శుద్ధేచ తామ్రలేపితే,
తం భాండం భస్మనాపూర్య చుల్ల్యాం తీవ్రాగ్నినా పచేత్. 21
త్రియామాన్తే సముద్ధృత్య చూర్ణయేత్స్వాంగశీతలమ్,
జంబీరస్య ద్రవైః పిష్ట్వా రుద్ధ్వా సప్తపుటైః పచేత్. 22
గుంజైకం మధునాజ్యేన లిహ్యాద్ధన్తి భగందరమ్,
ముసలీలశునం చానుహ్యారనాళయుతం పిబేత్. 23
కర్తవ్యోమధురాహారోదివాస్వాపంచమైథునమ్,
వర్జయేచ్ఛీతమాహారం రసేస్మిన్రవితాండవే. 24

తా. శుద్ధిజేసినరసము ౧ భాగము, శుద్ధిజేసినగంధకము ౨ భాగములు వీనిని ఖల్వమునందునిచి, కలబందరసముతో 3 దినములు మర్దించి ముద్దజేసి, పైరస గంధకములకు సమముగ శుద్ధిచేసిన తామ్రమునుగ్రహించి, డబ్బిచేసి, దానిలో నాముద్దనునిచి, దానిపైమూసి, సంధులకు లేపనమునుచేసి హండికా యంత్రమునందునిచి, దానినిండా బూడిదెబోసి పొయిమీదనునిచి, తీవ్రాగ్నిచే 3 ఝాములువండి, సాంగశీతలమునదీసి, ఖల్వములోనునిచి, చూర్ణముచేసి, నిమ్మపండ్లరసముతో 7 మాట్లునూరి 7 మార్లుపుటంబిడి, అందొక గురిగింజయెత్తు, తేనెతోగాని, నేతితోగాని నాకి, తోడనే నేలతాడిగడ్డలు, వెల్లుల్లిపాయలు, వీనిని కలితోనూరి, యీయనుపానమును సేవించిన భగందరము మానును. ఈరసము సేవించుకాలమున మధురాహారములం జేయవలయును. పగటినిద్ర, మైధునము, శీతలాహారము, వీనిని వర్జించవలయును.

## బిడాలాస్థిలేపము

త్రిఫలారససంయుక్తబిడాలాస్థిప్రలేపనమ్,
దుష్టవ్రణం నిహన్త్యాశు భగందరహరం పరమ్. 25

తా. త్రిఫలములయొక్క కషాయముచే పిల్లియెముకనునూరి లేపనముజేసిన, దుష్టవ్రణము, భగందరము, ఇవి నివర్తించును.

## కుష్ఠాదిలేపము

కుష్ఠం త్రివృత్తిలా దన్తీ మాగధీ సైంధవం మధు,
రజనీ త్రిఫలా తుత్థం హితం స్యాద్వ్రణలేపనే. 26

తా. క్రోష్ఠము, తెగడ, నువ్వులు, దంతిమూలము, పిప్పళ్లు, సైంధలవణము, తేనె, పసపు, త్రిఫలములు, తుత్థము వీనినినూరి లేపనముజేసిన భగందరము మానును.

తిలాదిలేపము

తిలా త్రివృన్నాగదన్తీ మంజిష్ఠాజ్యైస్ససైంధవైః,
సక్షౌద్రైశ్చ ప్రలేపోయం భగందరకులాంతకృత్. 27

తా. నువ్వులు, తెగడ, నాగదంతి, మంజిష్ఠ, సైంధవలవణము, వీనినిచూర్ణించి, నెయ్యి, తేనె వీనినికలిపి లేపనముజేసిన భగందరము మానును.

వటపత్త్రాదిలేపము

వటపత్రేష్టికా శుంఠీ గుడూచీ సపునర్నవా,
సుపిష్టైః పిటికాజుష్టే లేపశ్శస్తో భగందరే. 28

తా. మఱ్ఱిఆకులు, ఇటికె, శొంఠి, తిప్పతీగె, తెల్లగలిజేరువేరు, వీనిని బాగుగనూరి లేపనముజేసిన పిటికలతోగూడిన, భగందరము మానును.

అన్యత్తిలాదిలేపము

తిలాభయాలోధ్రమరిష్టపత్రం నిశావచాకుష్ఠమగారధూమః,
భగందరేనాడ్యుపదంశయోశ్చ దుష్టవ్రణేశోధనరోపణోయమ్. 29

తా నువ్వులు, కరక్కాయ, లొద్దుగ, వేపఆకు, పసపు, వస, కుష్ఠము, కరుధూపము వీనినినూరి లేపనముజేసిన భగందరము, నాడీవ్రణము, ఉపదంశము, దుష్టవ్రణము, వీనికి శోధన రోపణములను గలుగఁజేయును.

యష్ట్యాదిలేపము

యష్టికాంచామృతాంశుంఠీంవటపత్రం పునర్నవామ్,
జలైః పిష్ట్వా ప్రలిమ్పేత్తుపిత్తోత్థే తు భగందరే. 30

తా. అతిమధురము, తిప్పతీగ, శొంఠి, మఱ్ఱిఆకు, తెల్లగలిజేరువేరు వీనిని నీళ్లతోనూరి లేపనముచేసిన పిత్తజభగందరము మానును.

శ్లేష్మజభగందరమునకు కాంచన్యాదిలేపము

కాంచనీ ద్వే నిశేముండీ మంజిష్ఠా చ శతావరీ,
గంధకం ధాతకీపుష్పం తుల్యం లవణపంచకమ్. 31
కన్యాద్రవయుతో లేపః శ్లేష్మోత్థే చ భగందరే,

తా. దేవకాంచనము, పసపు, మానిపసపు, బోడతరము, మంజిష్ఠ, పిల్ల

పీచర, గంధకము, ఆరెపువ్వు, పంచలవణములు వీనిని సమాంశములుగ ఖల్వమున వైచి కలుబందరసముతో నూరి లేపనము జేసిన శ్లేష్మభగందరము మానును.

క్రిమియుక్తభగందరమునకు విడంగాదిలేపము

విడంగత్రిఫలాచూర్ణపిప్పలీమధుతైలకైః. 32
లేపో భగందరం హన్తి క్రిమియుక్తం న సంశయః,

తా. వాయువిడంగములు, త్రిఫలములు, పిప్పళ్లు, వీనిని సమాంశములుగ చూర్ణించి తేనె నూనెకలిపి లేపనముజేసిన క్రిమియుక్తమైన భగందరము మానును.

అపక్వభగందరచికిత్స

స్రావ్యం రక్తం వ్రణేఽపక్వేజలూకాం వా ప్రదాపయేత్. 33
లాంగలీం కృష్ణధుత్తూరంవిషముష్టిం చ లేపయేత్,
నిర్గుండ్యాశ్చ ద్రవైః పిష్ట్వా లేపయేద్వార్క్షమూలకమ్. 34
అపక్వోచ్ఛిర్యతే గ్రంధీ రక్తమోక్షే కృతేపివా,

తా. అపక్వమగు భగందరవ్రణమునందు, సొరకాయబుర్రలు మొదలగువాని చేగాని, జలగలచేగాని, రక్తమునుదీసియు, చన్నచర్లగడ్డ, నల్లఉమ్మెత్త, విషముష్టి, వీనినినూరి లేక జిల్లేడువేళ్లను, వావిలియాకురసముతో నూరి, లేపనము జేసియు పక్వ మొనర్చవలెను. ఇటులజేసిన పాకమునందు చితుకును.

వాతవ్రణమునకువిడంగాదివటుకములు

విడంగేంద్రయవం కృష్ణా త్రిభ్యోద్విగుణితం పురమ్. 35
త్రిఫలాంగుగ్గులోస్తుల్యాం ఘృతేన సహ మేళయేత్,
భక్షయేన్మధునా కర్షం మారుతోత్థే భగందరే. 36

తా. వాయువిడంగములు, కొడిశపాల, పిప్పళ్లు వీనినిసమాంశములుగ చూర్ణముజేసి, యీచూర్ణమునకు రెండింతలు గుగ్గిలము, గుగ్గిలమునకు సమము త్రిఫల చూర్ణమునుచేర్చి, నేతితో మర్దించి, కర్షమాత్రము, తేనెతో పుచ్చుకొనిన వాతజ భగందరము మానును.

పిత్తజభగందరచికిత్స

పిత్తాధిక్యే ప్రదాతవ్యో రసోయం రవితాండవః,
వాకుచీబీజచూర్ణం చాప్యనుస్యాదుష్ణవారిణా. 37

తా. పూర్వమందు జెప్పియుండు, రవితాండవరసములో, బావంచి విత్తుల చూర్ణమునుగలిపి, ఉష్ణోదకముతో పుచ్చుకొనిన పిత్తజభగందరము మానును.

౼ శ్లేష్మజభగందరచికిత్స ౼

సంమర్ద్యాజ్యే కఫోత్థస్య దాతవ్యో రవితాండవః,
ఛాయాశుష్కం దేవదారునిష్కార్ధం లవణం పలమ్. 38
పిష్ట్వా కోష్ణజలైః పీత్వాప్యనురోగం తుతం జయేత్,

తా. నేతితోమర్దించబడిన, పూర్వోక్తరవితాండవరసమును, పుచ్చుకొనిన పిదప దేవదారుచెక్కను నీడనుయెండించి చూర్ణించి, అందర్ధనిష్కములో ఒక పలము సైంధవముచేర్చి, ఉష్ణోదకముతో సేవించిన శ్లేష్మజ భగందరము మానును.

౼ భగందరమునకుయోగరాజగుగ్గులు ౼

పిప్పలీ పిప్పలీమూలం చవ్యచిత్రకనాగరైః. 39
పాఠావిడంగేంద్రయవైః హింగుభార్జీవచాన్వితైః,
సర్షపాతివిషాజాజీజీరకైః రేణుకాయుతైః. 40
గజకృష్ణాజమోదాచకటుకామూర్వామిశ్రితైః,
సమభాగాన్వితైరేతైస్త్రిఫలాద్విగుణాన్వితైః. 41
త్రిఫలాసహితైరేతైస్సమభాగం చ గుగ్గులుమ్,
ఏతచ్చూర్ణీకృతం శ్లక్ష్ణం ఘృతేనచపరిప్లుతమ్. 42
యోగరాజఇతి ఖ్యాతం భక్షయేత్ప్రాతరుత్థితః,
అర్శాంసి వాతగుల్మం చ పాండుశోఫమరోచకమ్. 43
హన్తిశూలముదావర్తం ప్రమేహం వాతశోణితమ్,
కుష్ఠం క్షయ మపస్మారం హృద్రోగం గ్రహణీగదమ్. 44
మహాచ్ఛాప్యగ్నిమాంద్యం చ శ్వాసంకాసంభగందరమ్,
సంతతాభ్యాసయోగేన వలీపలితనాశనమ్, 45
శేతోదోషం యోనిదోషం స్వరదోషం వినాశయేత్,

తా. పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, వినబొద్ది, పాయ విడంగములు, కొపిశవిత్తులు, ఇంగువ, గంటుభారంగి, వస, తెల్లావాలు, అతివస, జాజికాయ, జీలకఱ్ఱ, రేణుకలు, గజపిప్పలి, ఓమము కటుకరోహిణి, చాగదుంప, వీనిని సమాంశములుగచూర్ణించి, యీచూర్ణమునకు రెండింతలు, త్రిఫలచూర్ణము, వీనికన్నిటికి సమము, శుద్ధిచేసిన గుగ్గిలచూర్ణమునుగలిపి, నేతితో, (తానికాయలంత మాత్రలుచేసి, ౪ మండలములు,) ప్రాత (స్సాయం) కాలములయందు సేవించిన, అర్శసును, వాతగుల్మము, పాండువు,వాపు, అరుచి, శూల, ఉదావర్తము, ప్రమేహము, రక్తవాతము, కుష్ఠువు,, క్షయ, అపస్మారము, హృద్రోగము, గ్రహణి, ప్రబలమైన,

అగ్నిమాంద్యము, శ్వాస, దగ్గు, భగందరము, ముసిమి, శుక్రదోషము, యోనిదోషము, స్వరదోషములు, ఇవియన్నియు నివర్తించును. (మరియు దీనిని చిన్న మెత్తుసిందూరము, పావుశేరు, నక్కపిట్టాకురసము ౧ తులము మిరియాలపొడి యీఅనుపానముతోగాని, పావుశేరు, దొమ్మడోలుగడ్డరసము ౧ తులము మిరియపు చూర్ణము చిన్న మెత్తుసింధూరము, వీనియనుపానముతోగాని ౪ మాసములు పుచ్చుకొనిన భగందము మానును.)

## స్యందనతైలము

చిత్రకార్కౌత్రివృత్పాఠా వాకుచీహయమారకౌ. 46

సుధాం వచాం లాంగలినీం హరితాళం సువర్చికామ్,

జ్యోతిష్మతీం చ సంహృత్య తైలం ధీరో విపాచయేత్. 47

ఏతద్ధి స్యన్దనం నామతైలం దిహ్యాద్భగందరే,

శోధనం రోపణంచైవ సవర్ణకరణం తథా. 48

తా. చిత్రమూలము, జిల్లేడు, తెగడ, విషబొద్ది, బావంచివిత్తులు, వాడగన్నేరు, బొంతజెముడు, వస, చెన్నచర్లగడ్డ, హరితాళము, సౌవర్చలవణము, జ్యోతిష్మతి, వీనినిచేర్చి, తైలమునుకాచి, లేపనముజేసిన, భగందరమునకు, శోధనరోపణములుగలిగి చర్మమున వర్ణమును బొందును.

## నిశాతైలము

నిశార్కక్షీరసింధ్వగ్నిపుంఖీలాంగలివత్సకైః,

ఏభిః ప్రసాధితం తైలం భగందరవినాశనమ్. 49

తా. పసపు, జిల్లేడుపాలు, సైంధవలవణము, చిత్రమూలము, వెంపలి, పొత్తిగడ్డ, కొడిశపాల, వీనినిసిద్ధము జేయుబడినతైలమును, లేపనముచేసిన, భగందరము మానును.

## కరవీరతైలము

కరవీరనిశాదన్తీలాంగలీలవణాగ్నిభిః,

మాతులుంగార్కపయసా పచేత్తైలం భగందరే. 50

తా. కరవీరమూలము, పసపు, దంతివేరు, చన్నచర్లగడ్డ, ఉప్పు, చిత్రమూలము, మాదీఫలపువేరు, జిల్లేడుపాలు, వీనిచేతైలము సిద్ధపరిచి లేపనముచేసిన, భగందరము మానును.

## దార్వీవర్తి

స్నుహ్యర్కదుగ్ధదార్వీభిర్వర్తిం కృత్వా ప్రయోజయేత్.

భగందరవ్రణే శాన్త్యై యోజ్యా నాడీవ్రణేషు చ. 51

తా. బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, వీనితో మానిపసపునునూరి వస్త్రమునకు బట్టించి వర్తిజేసి, భగందరనాడీవ్రణములయందునిచిన నాడీవ్రణము భగందరము, ఇవి మానును.

—॥ నిశాదివర్తి ॥—

నిశాం సైంధవసిద్ధార్థక్షౌద్రగుగ్గులుసంయుతామ్,
వర్తిర్భగందరే యోజ్యా తథా నాడీవ్రణేషు చ. 52

తా. పసపు, సైంధవలవణము. ఆవాలు, గుగ్గిలము, వీనిని తేనెతోనూరి వస్త్రమునకు బట్టించి, నాడీవ్రణభగందరములయందునిచిన, నాడీవ్రణభగందరములు మానును.

—॥ భగందరవ్రణమునకు పథ్యములు ॥—

ఆమే సంశోధనం లేపో లంఘనం రక్తమోక్షణమ్,
పక్వే పునశ్శస్త్రవిధిస్తథా క్షారాగ్నికర్మణీ. 53
సర్వత్ర శాలయో ముద్గా విలేపీ జాంగలో రసః,
పటోలం శిగ్రువేత్రాగ్రం పత్తూరో బాలమూలకమ్. 54
తిలసర్షపయోస్తైలం తిక్తవర్గో ఘృతం మధు,
ఏతత్పథ్యం నరైస్సేవ్యం యథాదోషం భగందరే. 55

తా. భగందరము పక్వముగాకయుండిన శోధనము, లేపనము, లంఘనము, రక్తమోక్షము వీనినిజేయవలయును. పక్వవ్రణమునందు శస్త్రికర్మ, క్షారాగ్నికర్మల చేయవలయును. మరియు శాలిధాన్యము, పెసలు, విలేపి, జాంగలమాంసరసము, పొట్లకాయ, మునగకాయ, వెదురుమొలకలు, సీటిపిప్పలి, లేతముల్లంగి, నువ్వులనూనె, ఆవనూనె, వగరుగనుండుపదార్థములు, నెయ్యి, తేనె ఇవియన్నియు భగందరమునందు దోషములనెరింగి పథ్యములిడవలయును.

—॥ అపథ్యములు ॥—

వ్యాయమమం మైథునం యుద్ధం పృష్ఠయానం గురూణి చ,
సంవత్సరం పరిహరేద్వ్యావద్దృఢగుదో నరః. 56

తా. వ్యాయామము, మైథునము, యుద్ధము, అశ్వాదులనెక్కుట, గురుకరపదార్థములు వీనిని భగందరరోగి ౧ సంవత్సరము వెళ్లువరకుగాని గుదప్రదేశము దృఢపడువఱకుగాని విసర్జించవలయును.

శ్రీ ర స్తు.

# ఉపదంశప్రకరణమ్.

## ఉపదంశకర్మవిపాకము

మాతృగామీ భవేద్యస్తు తస్య లింగం వినశ్యతి,
చాండాలీగమనే చైవ శ్వేతకుష్ఠం ప్రజాయతే. 1
తస్య ప్రతిక్రియాం కర్తుం కుంభముత్తరతో న్యసేత్,
తస్యోపరికుబేరప్రతిమాం సౌవర్ణీం కృష్ణవస్త్రావృతాంమాల్య
భూషితామ్. 2
ఆవాహనాదినాషోడశోపచారైః ప్రత్యహం పూజయేత్,
అథర్వణవేదపారాయణం కుర్యాత్. 3
సమాప్తే పారాయణే ప్రతిమాం బ్రాహ్మణాయ దద్యాత్,
దానమంత్రః—
నిధీనామధిపో దేవః శంకరస్య ప్రియస్సఖా. 4
సౌమ్యాశాధిపతిశ్శ్రీమాన్మమ పాపం వ్యపోహతు,
ఇమం మంత్రం సముచ్చార్య ఆచార్యాయ యథావిధి. 5
దద్యాదేవం హీనకుష్ఠీ లింగనాశీ చ శుధ్యతి,

తా. మాతృగమనము జేసినవానికి లింగనాశనమగును, మరియు, చండాలస్త్రీ సంగమనము జేసినవానికి, శ్వేతకుష్ఠుపుగలుగు. తద్దోషశమనార్థమై, అగ్నికినుత్తరభాగమునందు, కలశమునునిచి, దానిపై కుబేరప్రతిమనుజేసియునిచి, నల్లనివస్త్రమునుగట్టి, పుష్పమాలికలచే నలంకరించి, ప్రతిదినమావాహనాది షోడశోపచారములచే పూజించి, దానికెదురుగ అథర్వణవేద, పారాయణమునుచేసి, సమాప్తియయిన పిదప, ఆప్రతిమను 'నిధీనామధిపోదేవేత్యాది' మంత్రముతో యథావిధిగ, ఆచార్యులవారికి దానంబొసంగిన హీనకుష్ఠము, లింగనాశక (ఉపదయో) రోగము, ఇవి నివర్తించును.

## ఉపదంశరోగనిదానము

హస్తాభిఘాతాన్నఖదన్తఘాతాదధావనాద్రత్యతిసేవనాద్వా. 6
'యోనిప్రదోషాచ్చ భవన్తి శిశ్నే పంచోపదంశా వివిధాపచారైః

తా. హస్తములతో బిసుకుట, గోళ్లతో గీరుట, దంతములతో గొరుగుట, ఇవి మొదలగువానియొక్క అభిఘాతము, రత్యంతమున శిశ్నమునకడగక నుపేక్షించుట, మిక్కిలి మైధునముచేయుట, యోనిదోషము, చకారమువలనదుర్గంధయుక్తములగు యుదకములతో కడుగుకొనుట ఇట్టి కారణమువలన ఆయిదువిధములగు ఉపదంశ రోగములు జనించును.

### ఉపదంశభేదములు లక్షణములు

శేఫోపర్యుపదంశస్స్యాత్సచపంచవిధస్స్మృతః. 7
స్తబ్ధమేఢ్రో౽తిరుగ్వాతాత్పిత్తాద్రక్తాతిదాహవాన్,
కఫాత్కాఠిన్యకండూవాన్ రక్తజః పిత్తలక్షణః. 8
సర్వలింగస్త్రిదోషాఖ్యస్స తు లింగవినాశనః,

తా. శిశ్నముమీద వాత, పిత్త, శ్లేష్మ, రక్త, త్రిదోషజములని ఉపదంశ రోగములు ౫ విధములుగ జనించును. అందు వాతోపదంశమునందు శిశ్నము మొద్దువలె మిక్కిలినొప్పితోగూడియుండుట, పైత్త్యోపదంశమునందు శిశ్నము ఎఱ్ఱనై మంటలతోగూడియుండుట, శ్లేష్మోపదంశమునందు శిశ్నముకఠినమై దురదతో గూడియుండుట, రక్తోపదంశమునందు పైత్త్యోపదంశలక్షణములేగలిగియుండుట, త్రిదోషోపదంశమున సర్వలక్షణములు గలిగియుండుటయేగాక, శిశ్నముసహానశించును, ఇదియసాధ్యము, ఉపదంశమన (కొరుకుడురోగము.)

### వాతోపదంశలక్షణము

సతోదభేదస్ఫురణైస్సకృష్ణైస్స్ఫోటైర్వ్యవస్యేత్పవనోపదంశమ్. 9

తా. శిశ్నమునందు నల్లనికురుపులుజనించి సూదులతోబొడిచినటుల వేదన, పగుళ్లు, ఆతుము ఇవిగలిగియుండిన వాతోపదంశమని తెలియవలయును.

### పిత్తరక్తోపదంశలక్షణము

పీతైర్బహుక్లేదయుతైస్సదాహైః పిత్తేన రక్తాత్పిశితావభాసైః,

తా. పసపువర్ణములుగల కురుపులుజనించి మిక్కిలిస్రావము మంటలు ఇవి గలిగియుండిన పిత్తోపదంశమనియు, మాంసమువంటి రొట్టనికురుపులు గలిగియుండిన రక్తోపదంశమనియును తెలియవలయును.

### కఫోపదంశలక్షణము

సకండురైశ్శోథయుతైర్మహద్భిశ్శుక్లైర్ఘనస్రావయుతైః కఫేన. 10

తా. దురద, వాపు ఇవిగలిగి తెల్లనివర్ణముగల గొప్పకురుపులతోగూడి గట్టిగ చీము స్రవించునది కఫోపధంశమని యెరుంగవలయును.

## సన్నిపాతోపదంశలక్షణము

నానావిధస్రావరుజోపపన్నమసాధ్యమాహుస్త్రిమలోపదంశమ్,

తా. అనేకవిధములగు స్రావములు, నొప్పిగలిగియుండిన సన్నిపాతోపదంశమని తెలియవలయును. ఇదిఅసాధ్యము.

## అసాధ్యోపదంశలక్షణము

విశీర్ణమాంసం కృమిభిః ప్రజగ్ధం ముష్కావశేషం పరివర్జయేత్తు. 11

తా. శిథిలమాంసముగల యుపదంశరోగిని క్రిములచే శిశ్నము భక్షింపబడి వృషణములుమాత్రము మిగిలియుండురోగిని వైద్యుడు విడువవలయును.

సంజాతమాత్రే నకరోతిమూఢః క్రియాంనరో యోవిషయే ప్రసక్తః,
కాలేన శోథక్రిమిదాహపాకైర్విశీర్ణశిశ్నో మ్రియతే స తేన. 12

తా. ఉపదంశరోగము బుట్టినతోడనే చికిత్సజేయక విషయములయందాసక్తిచేతయుండు మూఢునియొక్క శిశ్నము కొంతకాలమునకు పిదప వాపు, పురుగులు, తాపము, పాకము వీనితోగూడి శిథిలంబగును. అందువలన ఉపదంశరోగి నశించును.

## లింగవర్త్యుపదంశలక్షణము

అంకురైరివ సంభూతైరుపర్యుపరి సంస్థితైః,
క్రమేణ జాయతే వర్తిస్తామ్రచూడశిఖోపమా. 13
కోశస్యాభ్యంతరే సంధౌ సర్వసంధిగతాపి వా,
లింగవర్తిరితి ఖ్యాతా లింగార్శ ఇతి చాపరే. 14
కుళుత్థాకృతయః కేచిత్కేచిత్పద్మదళోపమాః,
మేఢ్రసంధౌ నృణాం కేచిత్కేచిత్సర్వాశ్రయాస్స్మృతాః. 15
రుజా దాహార్తిబహుళా స్తృష్ణాతోదసమన్వితాః,
స్త్రీణాం పుంసాం చ జాయన్తే హ్యుపదంశాస్సుదారుణాః. 16

తా. శిశ్నముమీదమాంసపు మొలకఒకదానిమీదనొగటిబుట్టి, కోడిజుట్టువలె వర్తిగనై, వృషణములకులోపలగాని లేక సర్వసంధులయందుగాని ప్రవేశించుచున్నది. ఈరోగమును లింగవర్తియనియు, కొందరు లింగార్శమనియును వచించెదరు. అందు కొన్ని ఉలవలతో తుల్యముగను, కొన్ని తామరాకులతో తుల్యముగను, మేఢ్రసంధులయందుగాని సర్వశరీరమునందుగానిజనించి త్రిదోషజన్యములుగ నుండుటవలన మిక్కిలివేదన, తాపము, మిక్కిలినొప్పి, దప్పి, సూదులతో బొడిచినటుల వేదన వీనితోగూడియుండును. మరియు త్రిదోషజన్యమై భయంకరముగనుండు నీయుపదంశము స్త్రీపురుషులిరువురకు జనించునని తెలియవలయును.

### పిత్తోపదంశమునకు గైరకాదికషాయము

గైరికాంజనమంజిష్ఠామధుకోశీరపద్మకైః,
సచందనోత్పలైః క్వాథః పేయః పిత్తోపదంశహా. 17

తా. కావిరాయి, రసాంజనము, మంజిష్ఠ, యష్టిమధుకము, వట్టివేరు, తామరకాడలు, చందనము, నల్లకలువదుంప వీనిని సమముగ కషాయముకాచి పుచ్చుకొనిన పిత్తోపదంశము మానును.

### పిత్తరక్తోపదంశములకు నింబాదికషాయము

నింబార్జునాశ్వత్థకదంబశాలజంబూవటోదుంబరవేతసాద్భిః,
ప్రక్షాళనాల్లేపనతోఘృతస్యచూర్ణాన్నపిత్తాస్రకృతోపదంశః. 18

తా. వేపయీనెలు, మద్దిపట్ట, రావిపట్ట, కడిమిపట్ట, యేపెపట్ట, నేరేడుపట్ట మఱ్ఱిపట్ట, అత్తిపట్ట, ప్రబ్బలిపట్ట వీనినిసమముగ కషాయముకాచి దీనిచే వ్రణమునుగడగినను లేక యీదినుసులతో, ఘృతము సిద్ధపరచిలేపనముచేసినను, లేక చూర్ణించి పుచ్చుకొనినను రక్తపిత్తోపదంశములు నివర్తించును.

### సర్వోపదంశములకు పటోలాదికషాయము

పటోలనింబత్రిఫలాకిరాతైః క్వాథం పిబేద్వా ఖదిరాసనాభ్యామ్,
సగుగ్గులుం వా త్రిఫలాయుతంవాసర్వోపదంశాపహరః ప్రయోగః.

తా. చేదుపొట్ల, వేపయీనెలు, కరక, తాడి, ఉశిరికెలు, నేలవేము వీని కషాయమునుగాని లేక చంద్ర: వేగిస వీనికషాయమునందు గుగ్గిలచూర్ణమునుగాని లేక త్రిఫలచూర్ణమునుగాని కలిపిగానిపుచ్చుకొనిన సర్వోపదంశములు మానును.

### ఆమ్రత్వక్ స్వరసపానము

ఆమ్రత్వచం వినిష్పీడ్య నిగృహ్య స్వరసం పలమ్,
చతుఃపలేత్వజాక్షీరేసంయుక్తం ప్రపిబేత్ప్రగే. 20
ఏవం మునిదినం కుర్యాదుపదంశవ్రణే హితమ్,

తా. మామిడిపట్టనుదంచి ఒకపలమురసముదీసి, అందు ౪ పలముల మేక పాలుగలిపి ౭ దినములు ప్రాతఃకాలమున పుచ్చుకొనిన ఉపదంశరోగము నివర్తించును.

### సర్జికాదిచూర్ణము

సర్జికాంతుత్థకాసీసైశ్శైలేయం సరసాంజనమ్. 21
మనశ్శిలాసమైశ్చూర్ణం వ్రణవీసర్పనాశనమ్,

తా. సర్జక్షారము, మైలతుత్థము, అన్నభేది, శిలాజితు, రసాంజనము, మణిశిల వీనిని సమముగ చూర్ణించి ప్రయోగించిన వ్రణము, విసర్పము ఇవి నివర్తించును.

బబ్బూలదళాదిచూర్ణములు

బబ్బూలదళచూర్ణేన దాడిమత్వగ్భవేనవా. 22
గుండనం లింగదేశస్థే లేపః పూగఫలేన వా,

తా. తుమ్మ ఆకుచూర్ణముగాని, దాడింబపట్టచూర్ణముగాని, లింగవ్రణము నందుచల్లుట చేతను, పూగఫలమునునూరి లేపనముజేసినను ఉపదంశము నివర్తించును.

పంచోపదంశములకు సర్వవ్యాధిహారణరసము

హింగుళోద్ధరసంభాగంద్వాభాగౌరసకర్పురమ్. 23
రసతుల్యం బలిం దద్యాత్ఖల్వమధ్యేవిమర్దయేత్,
దత్వాండే మృత్పుపైర్నద్ధేవాలుకాయంత్రగం పచేత్. 24
దినైకం తుక్రమాగ్నా తు స్వాంగశీతం సముద్ధరేత్,
పూజయేద్గురువిప్రాదీన్ యథారోగం ప్రయోజయేత్. 25
గుంజాచతుష్టయం ఖాదేన్నాగవల్లీదళైర్యది,
షండోపి లభతే పుంస్త్వం వాజీకరణముత్తమమ్. 26
అపుత్రః పుత్రమాప్నోతి జీవేచ్చ శరదాం శతమ్,
వలీపలితహృచ్ఛూలవాతశ్లేష్మనిబర్హణమ్. 27
అయం వ్యాధిహారసూతః పూజ్యపాదేన నిర్మితః,

తా. ఇంగిలీకమునందుదీసినరసము ౧ భాగము, శుద్ధిజేసినకర్పూరము ౨ భాగములు, శుద్ధగంధకము ౧ భాగము వీనిని ఖల్వమునందునిచి మర్దించి, (ఖజ్జలిచేసి) దానిని కోడిగ్రుడ్డునందునిచి, దానిపైచీలమన్నుయిచ్చి ౧ దినము వాలుకాయంత్రమున మందమధ్యమతీక్ష్ణాగ్నులతోవండి, స్వాంగశీతలమునగ్రహించి గురుబ్రాహ్మణపూజలంజేసి ౪ గురుగింజలయెత్తు రోగబలానుసారముగ తమలపాకులోనునిచి సేవించిన షండత్వము, ముదిమి, హృదయశూల, కఫవాతము, ఉపదంశము ఇవి నివర్తించుటయేగాక పుంస్త్వము, అపుత్రకునికి ౧౦౦ సంవత్సరములు ఆయుష్యము, మిక్కిలిగ వీర్యవృద్ధి వీనినిగలుగంజేయును. ఇది పూజ్యపాదులచే నిర్మింపబడిన సర్వవ్యాధిహారణరసము.

ఉపదంశకుఠారరసము

కంకుష్ఠం కుష్ఠకం చైవ తోలకం తు పృథక్పృథక్, 28

తోలార్థం తుత్థకం గ్రాహ్యం శృంగబేరరసేన తు,
మర్దయిత్వా వటీ కార్యా బదరాస్థిమితాభిషక్. 29
శృంగబేరరసేనైవ సాయంప్రాతశ్చ భక్షయేత్,
మధురామ్లం మత్స్యదుగ్ధకూష్మాండం చ వివర్జయేత్. 30
ఉపదంశకుఠారోయం రసస్సర్వత్ర పూజితః,

తా. * మురుదారుసింగు ౧ తులము, చంగల్వకోష్ఠు ౧ తులము, శుద్ధిచేసిన మైలతుత్తము ౪ తులము వీనిని ఖల్వమునందునిచి అల్లపురసముతో మర్దించి, రేగుగింజలంతమాత్రలుచేసి, అందొక మాత్ర చొప్పున అల్లపురసముతో సాయం ప్రాతః కాలములయందు సేవించిన ఉపదంశము హరించును. దీనిని సేవించుకాలమునందు మధురము, పులుసు, మత్స్యములు. పాలు, గుమ్మడికాయ వీనిని విడువవలయును.

సూతాదివటుకములు

శుద్ధసూతం చ భల్లాతం పిప్పలీమూలకంకణా. 31
ఆకల్లకంజాతిపత్రీ ఖురకం దేవపుష్పకమ్,
మర్దయేత్సమభాగేన పురాణగుడమిశ్రితమ్. 32
ఉపదంశేషు సర్వేషు ప్రమాణేరక్తికా వటీ,

తా. † శుద్ధరసభస్మము, జీడిగింజలు, మోడి, పిప్పళ్లు, అక్కలకఱ్ఱ, జాపత్రి, ఖురాసానివాము, లవంగములు వీనిని సమభాగములుగ చేర్చి, ఖల్వములో వైచి పాత బెల్లముకలిపి బాగుగమర్దించి గురిగింజలంత మాత్రలుచేసి వానిలో నొక్కొకటి వంతున సేవించిన ఉపదంశములు మానును.

వాతోపదంశమునకు లేపనము

ప్రపౌండరీకమధుకరాస్నాకుష్ఠపునర్నవా. 33
సరళాగరుభద్రాఖ్యైర్లేపో వాతోపదంశహా,

తా. ప్రపౌండరీకము, అతిమధురము, రాస్న, చంగల్వకోష్ఠము, తెల్లగలిజేరువేరు, సరళదేవదారు, అగరు, భద్రముస్తలు వీనినినూరి లేపనముజేసిన వాతోపదంశము మానును.

దారుహరిద్రాదిలేపనము

త్వచో దారుహరిద్రాయాః శంఖనాభీరసాంజనమ్. 34
లాక్షాగోమయనిర్యాసం తైలం క్షౌద్రం ఘృతం పయః,

---

* కంకుష్ఠమన మృద్దారు శృంగియనునది విచార్యము.

† రసభస్మమన రసకర్పూరమును గ్రహించవలెను.

ఏభిస్సుపిష్టైస్తుల్యాంశైరుపదంశే ప్రలేపయేత్. 35
వ్రణాస్త్వనేన శామ్యన్తి శ్వయథుర్దాహఏవచ,

తా. మానిపసపు, శంఖునాభి, రసాంజనము, లక్క, గోమయరసము, నూనె, తేనె, నెయ్యి, పాలు వీనినన్నియు సమభాగముగ నేకముగజేర్చి బాగుగనూరి లేపనముజేసిన ఉపదంశము, వ్రణములు, వాపు దాహము ఇవి నివర్తించును.

రసాంజనాదిలేపనము

రసాంజనం శిరీషేణ పథ్యయా చ సమన్వితమ్. 36
సక్షౌద్రం లేపనం యోజ్యం సద్యో రోపయతి వ్రణమ్,

తా. రసాంజనము, దిరిశనపుపట్ట, కరక్కాయ వీనిని చూర్ణించి తేనెలో కలిపి లేపనముజేసిన వ్రణము అంచుగట్టి శీఘ్రముగ మానును.

పారదాదిలేపనము

పారదం గంధకం తాళం దరదం చ మనశ్శిలామ్. 37
పృథక్కర్షం ద్వికర్షం చ ముర్దారం శంఖజీరకే,
విధాయ కజ్జలీం శ్లక్ష్ణాం మర్దయేత్సురసారసైః. 38
ఛాయాశుష్కాం తతః కృత్వా పునరున్మత్తజద్రవైః,
విమర్ద్యాథ వటీ కార్యా హ్యుపదంశే ప్రయోజయేత్. 39
గోఘృతేన ప్రలేపోయం వ్రణానాం రోపణే హితః,

తా. రసము, గంధకము, తాళకము, ఇంగిలీకము, మణిశిల ఇవి ప్రత్యేకము ౧ కర్షము, మురుదారుసింగు, శంఖభస్మము, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకము ౨ కర్షములు వీనిని ఖల్వములోవైచి మెత్తగనూరి తులసిఆకురసముతో మర్దించి నీడను యెండించి పిదప ఉమ్మెత్తఆకురసముతో మర్దించి మాత్రలుజేసి ఆవునేతితోచాది లేపనముజేసిన ఉపదంశ వ్రణము సహా అంచుగట్టిమానును.

వటప్రరోహాదిలేపము

వటప్రరోహార్జునజంబులోధ్రపథ్యాహరిద్రాసహితః ప్రలేపః, 40
సర్వోపదంశేష్వవరోపణార్థంచూర్ణంచతజ్జంవిమలాజలేన,

తా. మఱ్ఱివూడలు, మద్దిపట్ట, నేరేడుపట్ట, కరక్కాయ, లొద్దుగ, పసపు వీనినన్నియునూరి, సంబరేణుఆకురసముగలిపి లేపనముజేసిన ఉపదంశము నివర్తించును.

త్రిఫలాదిలేపము

దహేత్కటాహేత్రిఫలాం తాం మషీం మధుసంయుతాన్

కృతో్వపదంశేలిమ్పేత్తుసద్యో రోపయతి వ్రణమ్,

తా. త్రిఫలములను కటాహమునందునిచి కాల్చి మసిచేసి, తేనెతోకలిపి లేపనముజేసిన ఉపదంశములు మానును.

—⊙ లింగరోగహారలేపములు ⊙—

మహాశంఖం జలైః పిష్ట్వా తేన లింగం ప్రలేపయేత్. 42
లింగరోగం నిహంత్యాశు లేపోయం వ్యాధినాశకః,
కుష్ఠపూగవచాతోయైస్సార్ద్రై ర్వాఖాదిరోత్థితైః. 43
జలైర్ఘృష్టైః ప్రలేపోయం లింగరోగహారః పరమ్,
క్షాళయే త్త్రిఫలాక్వాథైః పక్వం లింగం పునఃపునః. 44
తచ్చూర్ణ లేపమాత్రేణ చాంకురం చ జయేద్ధ్రువమ్,

తా. పెద్దశంఖమును ఉదకముతోనూరి, శిశ్నమునకు లేపనముజేసిన, ఉపదంశమునివర్తించును. లేక చంగల్వకోష్ఠు, పోకలు, వస వీనినిగాని, కాచునుగాని నీళ్లతోనూరి లేపనముజేసినను లేక వాపుపక్వమైనపిదప త్రిఫలకషాయముతో లింగమును పలుమారుకడిగినను లింగముయొక్కవాపు నివర్తించును లేక త్రిఫలములనుగాల్చి మసిజేసి శిశ్నమునకు లేపనముజేసిన శిశ్నమునందలి యంకురములు నిశ్చయముగ నివర్తించును.

—⊙ భూనిమ్బఘృతము ⊙—

భూనింబనింబత్రిఫలాపటోలకరంజజాతీఖదిరాసనానామ్. 45
సతోయకల్కైఘృతమాశుపక్వంసర్వోపదంశాపహారం ప్రదిష్టమ్,

తా. నేలవేము, వేప, త్రిఫలములు, చేదుపొట్ల, క్రానుగ, జాజి, చండ్రవేగిస వీనిపట్టలు వీనినన్నియుకల్కముజేసి, అందునెయ్యిచేర్చి, ఘృతపక్వముగవండి సేవించిన సర్వోపదంశములు నివర్తించును.

—⊙ కరంజాదిఘృతము ⊙—

కరంజబీజార్జునశాలజంబూవటాదిభిః కల్కకషాయసిద్ధమ్. 46
సర్పిర్నిహన్యాదుపదంశదోషం సదాహపాకం స్రుతిరాగయుక్తమ్,

తా. కానుగవిత్తులు, మద్దిపట్ట, యేపెపట్ట, నేరేడుపట్ట, మఱ్ఱిపట్ట వీనిని కల్కముజేసి, అందు నెయ్యిచేర్చి, ఘృతపక్వముగవండి లేపనముజేసిన దాహము, పాకము, స్రావము, ఎఱుపు వీనితోయుక్తమగు ఉపదంశము మానును.

### త్రిఫలాదిప్రక్షాళనము

త్రిఫలాయాః కషాయేణ భృంగరాజరసేన వా. 47
వ్రణప్రక్షాళనం కుర్యాదుపదంశప్రశాన్తయే,

తా. కరక, తాడి, ఉశిరికెలకషాయముతోగాని, గుంటగలగరరసముతోగాని వ్రణమునుగడిగిన ఉపదంశము నివర్తించును.

### అశ్వత్థాదిప్రక్షాళనము

అశ్వత్థోదుంబరప్లక్ష వటవేతసజశ్శృతైః. 48
వ్రణశోథోపదంశానాం నాశకః క్షాళనైః స్మృతః,

తా. రావిపట్ట, అత్తిపట్ట, జువ్విపట్ట, మఱ్ఱిపట్ట, ప్రబ్బలి వీనికషాయముతో కడిగిన వ్రణమునందువాపు, ఉపదంశము నివర్తించును.

### జయాదిప్రక్షాళనము

జయాజాత్యశ్వమారార్క శమ్యాకానాందళైః పృథక్. 49
కృతం ప్రక్షాళనం క్వాథం మేఢ్రిపాకే ప్రయోజయేత్,

తా. తక్కలి, జాజి, గన్నేరు, జిల్లేడు, రేల వీనిఆకులచే, ప్రత్యేకము కషాయముకాచిగడిగిన మేఢ్రపాకము నివర్తించును.

### బాలహరీతక్యాదియోగము

బాలపథ్యాపలైకం తు తుత్థం శాణమితం తథా. 50
నింబుద్రవేణ సంమర్ద్య దృఢం సప్తదినాని వై,
గుటికాం చణకప్రాయాం ఛాయాశుష్కాం తు కారయేత్. 51
శీతోదకానుపానేన నిత్యమేకాం ప్రదాపయేత్,
ఘస్రాణామేకవింశత్యా ముచ్యతే తూపదంశతః. 52
శాలిగోధూమముద్గాశ్చ గోసర్పిః పథ్యమీరితమ్,

తా. కరకపిందెలు ౧ పలము, శుద్ధిచేసిన మైలతుత్థము కొలు పలము, వీనిని నిమ్మపండ్లరసముతో ౭ దినములు మర్దించి శనగలంతమాత్రలుజేసి నీడనుయెండించి శీతోదకానుపానముతో నిత్యమొకమాత్రచొప్పున ౨౧ దినములుపుచ్చుకొని గోధుమాన్నము, వరిబియ్యపుఅన్నము, పెసలు, ఆవునెయ్యి యీపథ్యమునుజేసిన ఉపదంశము మానును.

### ఉపదంశమునకుపథ్యములు

అజాక్షీరం యథాజీర్ణం గోధూమం పథ్యమాచరేత్. 53

తా. మేకపాలు, గోధుమాన్నము ఇవి జీర్ణమగునంత ఉపదంశమునందు పథ్యములు.

అపథ్యములు

దివానిద్రాం మూత్రవేగం గుర్వన్నం మైథునం గుడమ్,
ఆయాసమమ్లం తక్రం చ వర్జయేదుపదంశవాన్. 54

తా. పగటినిద్ర, మూత్రవేగమును నిరోధించుట, గురుకరములగు అన్నములు, స్త్రీసంభోగము, బెల్లము, ఆయాసము, పులుసు, పులిమజ్జిగ వీనిని ఉపదంశరోగముగల మనుజుడు విడువవలయును.

---

# శూకదోషప్రకరణమ్.

శూకదోషనిదానము

అక్రమాచ్ఛేఫసో వృద్ధిం యోభివాంఛతి మూఢధీః,
వ్యాధయస్తస్య జాయన్తే దశ చాష్టౌ చ శూకజాః. 1

తా. మందబుద్ధిగల పురుషుడు క్రమహీనుడై శిశ్నములావుగావలయునను వాంఛచే విషజంతువులను (అనగా జలమునందుండు పురుగులను) లేపనముజేయుట వలనను, దుష్టయోనిసంబంధమువలనను, యోనిలో వెంట్రుకలుగలుగు స్త్రీసంబంధము వలనను ౧౮ విధములగు శూకదోషములు జనించునని తెలియవలయును.

సర్షపికలక్షణము

గౌరసర్షపసంస్థానా శూకదుర్భగ్నహేతుకా,
పిటికా శ్లేష్మవాతాభ్యాం జ్ఞేయా సర్షపికా చ సా. 2

తా. పైశ్లోకమునందు జెప్పబడిన దుష్టశూకముల లేపనముచేసిన కారణముచే కఫవాతములు ప్రకోపించి తెల్లావాలతో తుల్యములుగనుండు కురుపులను శిశ్నమునందు గలుగఁజేయును. దానిని సర్షపికయని తెలియవలయును.

అష్ఠీలికాలక్షణము

కఠినావిషమైర్భుగ్నై ర్వాయునాష్ఠీలికా భవేత్,

తా. అప్రశస్తమగు శూకముల లేపనమువలన వాతము ప్రకోపించి గుండ్రముగను కఠినముగనుండు కురుపులను గలుగంజేయును. దానిని యష్ఠీలికయనియెదరు.

గ్రథితలక్షణము

శూకైర్యత్పూరితం శశ్వద్గ్రథితం నామ తత్కఫాత్, 3

తా. మాటిమాటికి శూకలేపనమువలన కఫము ప్రకోపించి శిశ్నముపై కుడ తలను గలుగంజేయును. దానిని గ్రథితమనియెదరు.

కుంభికాలక్షణము

కుంభికారక్తపిత్తోత్థాజాంబవాస్థినిభా శుభా,

తా. శూకలేపనముచే రక్తపిత్తములు ప్రకోపించి నేరేడువిత్తులవలెనుండు నల్లనికురుపులను గలుగంజేయును. దానిని కుంభికయని తెలియవలయును.

అలజీలక్షణము

తుల్యాజాం త్వలజీం విద్యాద్యథాప్రోక్తాం విచక్షణైః. 4

తా. శూకలేపమువలన ప్రమేహపిటికాలక్షణమునందు జెప్పబడిన అలజీలక్షణములతో తుల్యమగు కురుపులుజనించిన, అలజియనంబడును.

మృదితలక్షణము

మృదితం పీడితం యత్తు సంరబ్ధం వాతకోపతః,

తా. శూకలేపము జేసినపిదప శిశ్నమును పిసుకుటవలనను లేక, అదుముట వలనను వాతము ప్రకోపించి, శిశ్నమునవాపునుగలుగంజేయును. దానిని మృదితమని వచించెదరు.

సంమూఢపిటికాలక్షణము

పాణిభ్యాం భృశసంమూఢే సంమూఢపిటికా భవేత్. 5

తా. శూకలేపనాంతమునందు, చేతులచే మిక్కిలిబిసుకుటవలన నోరులేకుండు కురుపులు జనించును. దానిని సంమూఢపిటిక యనియెదరు.

అవమంథలక్షణము

దీర్ఘా బహ్వ్యశ్చ పిటికా దీర్యన్తే మధ్యతస్తు యాః,
సోవమంథఃకఫాసృగ్భ్యాం వేదనారోమహర్షకృత్. 6

తా. శూకలేపనమువలన కఫరక్తములు ప్రకోపించి పొడవుగను మిక్కుటముగను మధ్యమధ్యమున పగిలినటులనుండు పిటికలు శిశ్నముమీదగలుగును. అందువలన వేదన రోమాంచము ఇవి గలుగు. దానిని అవబదుంథమని తెలియవలయును.

పుష్కరికాలక్షణము

పిత్తశోణితసంభూతపిటికా పిటికాచితా,
పద్మకర్ణికసంస్థానాజ్ఞేయా పుష్కరికా చ సా.

తా. శూకదోషజనిత పిత్తరక్తములవలన కురుపులుజనించి వెంబడినే సగ

కురుపులతో వ్యాపింపబడి ఒకటిగ జేరుటవలన కమలకర్ణిక తెరంగున గనుపించు దానిని పుష్కరికయని యెదరు.

స్పర్శహానిలక్షణము

స్పర్శహానిం తు జనయేచ్ఛోణితం శూకదూషితమ్,

తా. శూక లేపనమువలన రక్తముదుష్టమై చర్మమున స్పర్శజ్ఞానమును లేకుండు నటుల జేయును. దానిని స్పర్శహానియని యెదరు.

ఉత్తమాలక్షణము

ముద్గమాషోద్గమారక్తారక్తపిత్తోద్భవాశ్రయా. 8
వ్యాధి రేషోత్తమా నామ శూకాజీర్ణనిమిత్తజః,

తా. శూకముల పరమారు లేపనము జేయుటవలన రక్తపిత్తములు ప్రకోపించి పెసలు మినుములు వీనితో తుల్యములుగనుండు యెఱ్ఱనికురుపులను శిశ్నమునందు గలుగంజేయును. దానిని ఉత్తమయని యెదరు.

శతపోనకలక్షణము

ఛిద్రైరణుముఖైర్లింగం చితం యస్య సమంతతః. 9
వాతశోణితజో వ్యాధిర్విజ్ఞేయశ్శతపోనకః,

తా. శూకదోషజనిత వాతపిత్తములవలన శిశ్నముమీద ననేక సూక్ష్మముఖములు గల ఛిద్రములుజనించిన శతపోనకమనబడును.

త్వక్పాకలక్షణము

వాతపిత్తకఫోత్థస్తు త్వక్పాకోజ్వరదాహవాన్. 10

తా. శూకదోషజనిత వాతపిత్తకఫములవలన శిశ్నమునందుండు చర్మముపండి జ్వరము, దాహము ఇవిగలిగిన త్వక్పాకమని తెలియవలయును.

శోణితార్బుదలక్షణము

కృష్ణైస్స్ఫోటైస్సరక్తాభిః పిటికాభిర్నిపీడితమ్,
యస్య వాస్తురుజా చోగ్రా జ్ఞేయం తచ్ఛోణితార్బుదమ్. 11

తా. శూకదోషమువలన శిశ్నముపై నల్లగ లేక యెఱ్ఱగనుండు కురుపులు జనించి, వ్రణస్థానమునందు మిక్కిలి పోట్లుగలిగిన నది శోణితార్బుదమనబడును.

మాంసార్బుదలక్షణము

మాంసదోషేణ జానీయాదర్బుదం మాంససంభవమ్,

తా. శూకదోషముచే మాంసముచెడిన దానిని మాంసార్బుదమని యెదరు.

### మాంసపాకలక్షణము

శీర్యంతే యస్య మాంసాని యస్య సర్వాశ్చ వేదనాః, 12
విద్యాత్తం మాంసపాకం తు సర్వదోషకృతం భిషక్,

తా. శూకదోషమువలన శిశ్నమునందలిమాంసముకుళ్లి వీడిపడి అనేకవిధములగు పీడలను గలుగజేయుచుండిన మాంసపాకమనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

### విద్రధిలక్షణము

విద్రధిం సన్నిపాతేన యథోక్తమభినిర్దిశేత్. 13

తా. శూకదోషమువలనజనించి, విద్రధిరోగనిదానమునందు జెప్పబడియుండు సన్నిపాతవిద్రధిలక్షణతుల్యంబుగనుండునది విద్రధియని తెలియవలయును.

### తిలకాలకలక్షణము

కృష్ణానిచిత్రాణ్యథవా శూకాని సవిషాణి తు,
పాతితాని పచంత్యాశు మేఢ్రం నిరవశేషతః. 14
కాలాని భూత్వా మాంసాని శీర్యంతే యస్య దేహినః,
సన్నిపాతసముత్థాంస్తు తాన్విద్యాత్తిలకాలకాన్. 15

తా. నలుపు లేక విచిత్రమైనఛాయ ఇవిగల విషశూకముల లేపనమువలన ఆక్షణముననే శిశ్నమంతయుబండి అందుండు సర్వమాంసము తిలలవలె నల్లనై రాలిన తిలకాలకమని చెప్పెదరు. ఇదియును త్రిదోషమువలన జనించును.

### అసాధ్యశూకదోషము

తత్ర మాంసార్బుదం యచ్చ మాంసపాకశ్చ యస్స్మృతః,
విద్రధిశ్చ న సిధ్యంతి యే చ స్యుస్తిలకాలకాః. 16

తా. ఈ శూకదోషములలో మాంసార్బుదము, మాంసపాకము, విద్రధి, తిలకాలకము ఇవి యసాధ్యంబులు.

### శూకదోషచికిత్స

హితం చ సర్పిషః పానం పథ్యం చాపి విరేచనమ్,
హితశ్శోణితమోక్షశ్చ శూకరోగేషు దేహినామ్.

తా. శూకదోషమునందు ఘృతపానము, మృదువిరేచనము, రక్తమోక్షణము ఇవి హితములుగనుండును.

—॥ సార్షపికా చికిత్స ॥—

ఉల్లిఖ్య సార్షపీం తాలపత్రేణాథ ప్రలేపయేత్,
తిందుక త్రిఫలాలోధ్రై ర్గోమూత్ర పరిపేషితైః. 18

తా. సార్షపమను శూకదోషమునందు తాటిఆకులతో లేఖనక్రియనుజేసి, తుమికి, త్రిఫలములు, లొద్దుగచెక్క వీనిని గోమూత్రముతో నూరి లేపము జేయవలయును.

—॥ అష్ఠీలికా చికిత్స ॥—

అష్ఠీలాయాం హృతే రక్తే శ్లేష్మగ్రంథిక్రియాం చరేత్,

తా. అష్టీలయను శూకరోగమునందు రక్తస్రావమునుజేసి శ్లేష్మగ్రంథికి చేయు చికిత్సనే చేయవలయును.

—॥ గ్రథిత చికిత్స ॥—

స్వేదయేద్గ్రథితం యచ్చ నాడీస్వేదేన బుద్ధిమాన్. 19
సుఖోష్ణైరుపనాహైశ్చ వ్రణోక్తైరుపనాహయేత్,

తా. గ్రథితమను శూకరోగమునందు బుద్ధిమంతుడగు వైద్యుడు గొట్టముతో స్వేదనమొనర్చి చెమటదీయుటయే గాక, వ్రణమునకు జెప్పబడియుండు కట్లును సుఖోష్ణముగ చేసి కట్టవలయును,

—॥ కుంభికా చికిత్స ॥—

కుంభికాయాం హరేద్రక్తం పక్వాయాం శోధితే వ్రణే, 20
తిందుక త్రిఫలాలోధ్రైర్లేపస్తైలం చ రోపణమ్,

తా. కుంభికయను శూకరోగమునందు రక్తమును దీయవలయును. పండిన యెడల వ్రణశోధన క్రియలనుజేసి, పిదప తుమికి, త్రిఫలములు, లొద్దుగచెక్క వీని లేపనము, నానావ్రణహరద్రవ్యములతో సిద్ధముచేయఁబడును. తైలలేపనమును జేసిన వ్రణముమానును.

—॥ అలజీకా చికిత్స ॥—

అలజ్యాం హృతరక్తాయాం పూర్వ ఏవ క్రియాక్రమః. 21

తా. అలజీయను శూకదోషమునందు రక్తమునుదీసి కుంభికమునకు జేసిన చికిత్సనే జేయవలయును.

—॥ అవమంథ చికిత్స ॥—

క్రియేయమవమంథేపి రక్తం శోధ్యం యథోభయోః,

తా. అవమంథనమును శూకరోగమునందు సహా పూర్వోక్త కుంభిక, అలజీలవలె రక్తస్రావమును జేయవలయును.

పుష్కరీమూఢపిటికాచికిత్స

క్రమః పిత్తవిసర్పోక్తః పుష్కరీమూఢయోర్హితః. 22

తా. పుష్కరికము, మూఢపిటిక, యీశూకదోషములయందు విసర్పము నందు జెప్పబడియుండు చికిత్సలఁ జేయవలయును.

ఉత్తమాశూకరోగచికిత్స

ఉత్తమాఖ్యాం తు పిటికాం సంస్వేద్య బహుశో ఘృతైః,
కల్కైశ్చూర్ణైః కషాయైశ్చ క్షౌద్రయుక్తైరుపాచరేత్. 23

తా. ఉత్తమాశూకరోగమునందు విశేషముగనొత్తడమిచ్చి, పిదప వ్రణహారఘృత, కల్క, చూర్ణ, కషాయములలో తేనెచేర్చి ఉపచరించవలయును.

శతపోనకచికిత్స

రసక్రియా విధాతవ్యా లిఖితే శతపోనకే,
పృథక్పర్ణ్యాదిభిస్సిద్ధం తైలం దేయమనంతరమ్. 24

తా. శతపోనకమను శూకరోగమునందు ప్రథమమందు లేఖనక్రియనుజేసి, పిదప పారదక్రియను చేయుటయేగాక శాలిపర్ణి మొదలగువానిచే సిద్ధముజేయబడిన తైలమును బూాయవలయును.

త్వక్పాక స్పర్శహాని మృదితములకుచికిత్స

త్వక్పాకే స్పర్శహానౌ చ సేచయేన్మృదితే పునః,
బలాతైలేన కోష్ణేన మధురైశ్చోపనాహయేత్. 25

తా. త్వక్పాకము, స్పర్శహాని, మృదితములను శూకరోగములయందు మందోష్ణముగనుండు బలాతైలముచే సేచనక్రియనుజేసి వానికి మధురౌషధములనునిచి కట్టుకట్టవలయును.

తిలకాలకచికిత్స

తిలకాలం సముల్లిఖ్య క్షురేణ లఘుపాణినా,
భిషజాత్ర కర్తవ్యం సద్యోవ్రణచికిత్సితమ్. 26

తా. తిలకాలకమను శూకదోషమునందు మంగలకత్తితో తేలికగాచివ్వి, సద్యోవ్రణచికిత్సఁజేయవలయును. (ఇటులనే మాంసార్బుదము, మాంసపాకము, విద్రధి వీనియందుసైతము చికిత్సఁజేయవలయును.)

ఉపదంశశూకదోషములకుపథ్యములు

ఛర్దిర్విరేకో ధ్వజమధ్యనాడీవేధో జలూకాపరిపాతనం చ,
సేకః ప్రలేపో యవశాలయశ్చ ధన్వామిషం ముద్గరసో ఘృతాని. 27
కటిల్లకం శిగ్రుఫలం పటోలం శాలిం చ శాకం నవమూలకం చ,
తిక్తం కషాయం మధుకూపవారి తైలం చ హన్త్యాదుపదంశరోగమ్.

తా. వమనము, విరేచనము వీనిని జేయించుట, లింగమధ్యమముననుండు నిరను వేధించుట, జలగలనంటించుట, సేచనము, లేపనము వీనినిజేయుట; యవధాన్యము, అరణ్యజంతుమాంసము, పెసరకట్టు. నెయ్యి, కాకరకాయ, మునక్కాయ, పొట్లకాయ, వరియన్నము, శాకము, లేతముల్లంగి, చేదు, వగరు, తీపుగలరసములు, బావినీళ్లు, నూనె ఇవి ఉపదంశరోగమునకు పథ్యకరములు.

అపథ్యములు

* దివానిద్రా మూత్రవేగం గుర్వన్నం మైథునం గుడమ్,
వ్యాయామమమ్లం తక్రం చ వర్జయేదుపదంశవాన్. 29

తా. పగలునిద్రించుట, మూత్రవేగము నడ్డగించుట, గుర్వన్నమును భక్షించుట, మైధునముజేయుట, బెల్లమునుదినుట, వ్యాయామముసేయుట, పులుసు, మజ్జిగ వీనిని సేవించుట ఇవి ఉపదంశ శూకరోగములకు అపథ్యకరములగుటచే విసర్జింపవలయును.

## క్షుద్రరోగప్రకరణమ్.

అజగల్లికాలక్షణము

స్నిగ్ధాసవర్ణా గ్రథితానీరుజా ముద్గసన్నిభా,
కఫవాతోత్థితాజ్ఞేయా బాలానామజగల్లికా. 1

తా. పిల్లవాండ్రకు కఫవాతమువలన పెసలంత కురుపులుజనించి మినమిన లాడుచు చర్మసమాన వర్ణముగను, గుండ్రముగను, నొప్పిలేనివిగనుండిన దానిని అజగల్లికయని తెలియవలయును.

యవప్రఖ్యాలక్షణము

యవాకారా సుకఠినా గ్రథితా మాంససంశ్రితా,
పిటికా శ్లేష్మవాతాభ్యాం యవప్రఖ్యేతి చోచ్యతే, 2

* ఇది యుపదంశప్రకరణమునగూడ జెప్పబడెను.

తా. కఫవాతములవలన కురుపులుజనించి యవలవలె కఠినముగను, గుండ్రము గను, మాంసాశ్రితముగనుండిన దానిని యవప్రఖ్యయని తెలియవలయును.

అంధాలజీలక్షణము

ఘనామవక్త్రాం పిటికామున్నతాం పరిమండలామ్,
అంధాలజీమల్పపూయాం తాం విద్యాత్కఫవాతజామ్. 3

తా. కఫవాతములవలన కఠినముగను, ముఖరహితముగను, ఉబ్బుగనుండు కురుపులుబుట్టి, వానిచుట్టు చిన్నకురుపులువ్యాపించి కొంచెము చీముతోగూడియుండిన దానిని అంధాళజీ అని తెలియవలయును.

వివృతపిటికాలక్షణము

వివృతాస్యాం మహాదాహాం పక్వోదుంబరసన్నిభామ్,
సమండలాం పిత్తకృతాం వివృతాం నామ తాం విదుః. 4

తా. పిత్తసంబంధమువలన నోరుదెరచుకొని, మిక్కిలిదాహముతోగూడి, పండిన మేడిపండుతో తుల్యమై, చుట్టు సన్నకురుపులతో వ్యాపింపబడియుండునది వివృతపిటికయని తెలియవలయును.

కచ్ఛపికాలక్షణము

గ్రథితాః పంచ వా షడ్వా దారుణాః కచ్ఛపోన్నతాః,
కఫానిలాభ్యాం పిటికా జ్ఞేయా కచ్ఛపికా బుధైః. 5

తా. కఫవాతమువలన ౫ లేక ౬ కురుపులుజనించి, తాబేటివీపువలె నున్నతమై భయంకరముగనుండిన దానిని కచ్ఛపికయని యెఱుంగవలయును.

వల్మీకలక్షణము

గ్రీవాంసకక్షాకరపాదదేశే సంధౌ గళే వా త్రిభిరేవ దోషైః,
గ్రంథిస్సవల్మీకవదక్రియాణాం జాతః క్రమేణైవ గతః ప్రవృద్ధిమ్.6
ముఖైరనేకైస్స్రుతితోదవద్భిర్విసర్పవత్సర్పతిచోన్నతాగ్రైః,
వల్మీకమాహుర్భిషజో వికారం నిష్ప్రత్యనీకం చిరజం విశేషాత్. 7

తా. మెడ, భుజశిరస్సులు, చంకలు, హస్తములు, పాదములు, సంధులు, కంఠము ఈ స్థలములయందు త్రిదోషములవలన పాముపుట్టవలె గ్రంథిజనించి, చికిత్స జేయకుండుటవలన క్రమక్రమముగ వృద్ధిపొంది, అనేకముఖములు, స్రావము, సూదులతో బొడిచినటుల పోట్లు, ఉన్నతమగు ముఖము ఇవిగలదై విసర్పమువలె ప్రసరించిన దానిని వల్మీకమని తెలియవలయును. దీనియందు ఔషధోపచారము జేయుట

కశక్యము. మరియు నిది జనించి మిగుల కాలము గడచిన ఔషధోపచారముల కసాధ్యమని యెదరు

### పనసికాలక్షణము

కర్ణస్యాభ్యంతరే జాతాం పిటికాముగ్రవేదనామ్,
స్థిరాం పనసికాం తాం తు విద్యాద్వాతకఫోత్థితామ్. 8

తా. వాతకఫములచే చెవిలోపల పనసకాయ ముండ్లవలె కఠినముగనుండు పిటికజనించి మిక్కిలి పోటుతోగూడియుండిన దానిని పనసిక యనియెదరు. (మరియు నిది చెవిచుట్టూ జనించునని భోజరాజుమతము.)

### జాలగర్దభలక్షణము

విసర్పవత్సర్పతి యశ్శోథస్తనురపాకవాన్,
దాహజ్వరకరః పిత్తాత్సజ్ఞేయో జాలగర్దభః. 9

తా. పిత్తముచే విసర్పరోగమువలె నంతటవ్యాపించిగాని లేక కొంచెము పండినదిగానియుండు వాపుజనించి దాహము, జ్వరము వీనితోగూడియుండిన దానిని జాలగర్దభమని తెలియవలయును.

### ఇంద్రవృద్ధలక్షణము

పద్మకర్ణికవన్మధ్యే పిటికాభిస్సమాచితామ్,
ఇంద్రవృద్ధాం తు తాం విద్యాద్వాతపిత్తోత్థితాం భిషక్. 10

తా. వాతపిత్తములచే కమలముల యొక్క మిద్దెవలె మధ్యను నొకకురుపుజనించి, దానిచుట్టూ సన్నని కురుపులుజనించిన దానిని ఇంద్రవృద్ధమని యెరుంగవలయును.

### గర్దభికలక్షణము

మండలం వృత్తముత్పన్నం సరక్తం పిటికాచితమ్,
రుజాకరీం గర్దభికాం తాం విద్యాద్వాతపిత్తజామ్. 11

తా. వాతపిత్తమువలన గుండ్రముగను, ఉబ్బుగను, ఎఱ్ఱగనునుండు పిటికలచే వ్యాప్తమై మండలములుగలిగి, మిక్కిగి నొప్పిగలిగియుండిన గర్దభికయని యెరుంగవలయును.

### పాషాణగర్దభలక్షణము

వాతశ్లేష్మసముద్భూతశ్శ్వయథుర్హనుసంధిజః,
స్థిరో మందరుజస్స్నిగ్ధో జ్ఞేయః పాషాణగర్దభః. 12

తా. వాతకఫములచే హనుసంధులయందు కఠినముగను, మందమగు నొప్పిగలిగియుండు వాపుజనించి, మినమినలాడుచుండిన పాషాణగర్దభమని తెలియవలయును,

### ఇరివేల్లికాలక్షణము

పిటికాముత్తమాంగస్థాం వృత్తాముగ్రజ్వరాన్వితామ్,
సర్వాత్మికాం సర్వలింగాం జానీయాదరివేల్లికామ్. 13

తా. త్రిదోషములవలన శిరస్సుపై గుండ్రముగ కురుపుజనించి, మిక్కిలి పీడ, జ్వరము, త్రిదోషలక్షణములు ఇవిగలిగియుండిన ఇరివేల్లిక యనియెదరు.

### కక్షపిటికాలక్షణము

బాహుకక్షాంసపార్శ్వేషు కృష్ణస్ఫోటాం సవేదనామ్,
పిత్తకోపసముద్భూతాం కక్షామిత్యభినిర్దిశేత్. 14

తా. భుజము, చంకలు, భుజశిరస్సులు, పార్శ్వములు వీనియందు పిత్తప్రకోపమువలన నల్లని కురుపులుజనించి, వేదనతోగూడియుండిన దానిని కక్షపిటికయని తెలియవలయును.

### గంధనామ్నీలక్షణము

ఏకామేతాదృశీం దృష్ట్వా పిటికాం స్ఫోటసన్నిభామ్,
త్వగ్గతాం పిత్తకోపేన గంధనామ్నీం ప్రచక్షతే. 15

తా. పిత్తప్రకోపమువలన చర్మమునందు పెద్ద బొబ్బతో తుల్యమగు కురుపు బుట్టిన దానిని గంధనామ్ని యనియెదరు.

### అగ్నిరోహిణీలక్షణము

కక్షభాగేషు యే స్ఫోటా జాయన్తే మాంసదారణాః,
అన్తర్దాహజ్వరకరా దీప్తపావకసన్నిభాః. 16
సప్తాహాద్ద్వాదశాహాద్వాపక్షాద్వా హన్తి మానవమ్,
తామగ్నిరోహిణీం విద్యాదసాధ్యాం సాన్నిపాతికీమ్. 17

తా. చంకయందు మాంసమును వీడునటులజేసెడి కురుపులుజనించి, అంతర్దాహతాపములుగలవై మండుచున్న యగ్నివలె యుగ్రమైయుండిన దానిని అగ్నిరోహిణి యని తెలియవలయును. నిది వాతాధిక్యమైయుండిన ౭ దినములు, పిత్తాధిక్యమైయుండిన ౧౦ దినములు, కఫాధిక్యమైయుండిన ౧౫ దినములకును యీరోగిని మరణమును బొందించును, ఇది సాన్నిపాతికమగుటచే అసాధ్యమని తెలియవలయును.

### చిప్యలక్షణము

నఖమాంసమధిష్ఠాయ వాతపిత్తే చ దేహినామ్,
కుర్వాతే దాహపాకౌ చ తం. వ్యాధిం చిప్యమాదిశేత్. 18

తా. వాతపిత్తములు నఖమాంసముల నాశ్రయించి దాహపాకములను గలుగఁజేసిన దానిని చిప్పమని యెరుంగవలయును. (ఇది గోరుచుట్టందురు.)

## కునఖలక్షణము

తదేవాల్పతరైర్దోషైః కునఖం పురుషం వదేత్,
అభిఘాతాత్ప్రదుష్టో యో నఖో రూక్షోఽసితఃఖరః. 19
భవేత్తం కునఖం విద్యాత్కుళీరమితి సంజ్ఞితమ్,

తా. చిప్పమే స్వల్పదోషమువలనజనించిన కునఖమనబడును. మరియు నఖము అభిఘాతమువలన దుష్టమై రూక్షత, నీలవర్ణము, కాఠిన్యము ఇవిగలదై యుండిన దానిని కునఖమనియు, కుళీరమనియును వచించెదరు. (కునఖమన పుప్పిగోరు.)

## అనుశయీలక్షణము

గంభీరామల్పసంరంభాం సవర్ణాముపరి స్థితామ్. 20
పాదస్యానుశయీం తాం తు విద్యాదంతఃప్రపాకినీమ్,

తా. పాదముమీద చర్మసమానవర్ణముగను, గంభీరముగను, కొంచెము ఉబ్బు గలదిగనుండు కురుపుజనించి లోపలబండినదానిని అనుశయీయని తెలియవలయును.

## విదారికలక్షణము

విదారీకందవద్వృత్తాం కక్షవంక్షణసంధిషు. 21
విదారికామితి వదేత్సరుజాం సర్వవేదనామ్,

తా. నేలగుమ్ముడుగడ్డవలె గుండ్రముగ చంకలయందుగాని లేక గజ్జలయందుగాని గ్రంధిజనించి, నొప్పితోగూడినదై సర్వదోషలక్షణములతో గూడియుండిన దానిని విదారికయని యెదరు. ఇది సన్నిపాతమువలన జనించును. (ఇదియ చంకతాళి కురుపు.)

## శర్కరాలక్షణము

ప్రాప్య మాంసశిరాస్నాయుశ్లేష్మామేదస్తథానిలః. 22
గ్రంథిం కరోత్యసౌ భిన్నో మధుసర్పిర్వసానిభమ్,
స్రవత్యాస్రావమనిలస్తత్ర వృద్ధిం గతః పునః. 23
మాంసం విశోష్య గ్రథితాం శర్కరాం జనయేత్తతః,

తా. కఫమేదోవాతములు, మాంసశిరాస్నాయువులయందుజేరి గ్రంధిరూపమై పగిలి, తేనె, నెయ్యి, క్రొవ్వు వీనితోసమానముగనుండు స్రావమును గలుగఁజేయుచుండును. అందు వాతము మాటిమాటికి వృద్ధిబొంది మాంసమును శుష్కింపజేయుచు, చిన్నచిన్నగ్రంధుల జనింపంజేసిన దానిని శర్కరయనియెదరు.

శర్కరార్బుదలక్షణము

దుర్గంధిక్లిన్నమత్యర్థం నానావర్ణం తతస్సిరాః. 24
సృజన్తి రక్తం సహసా తద్విద్యాచ్ఛర్కరార్బుదమ్,

తా. శర్కరజనించినవెనుక అచ్చటి శిరలవలన దుర్గంధక్లేదయుక్తమై నానా విధములుగ (అనగా ఘృతము, మేదస్సు, వస వీనివలె) రక్తస్రావము హఠాత్తుగ గలిగిన దానిని శర్కరార్బుదమనియెదరు.

పాదదారిలక్షణము

పరిక్రమణశీలస్య వాయురత్యర్థరూక్షయోః. 25
పాదయోః కురుతే దారీం సరుజాం తలసంశ్రితామ్,

తా. మిక్కుటముగ నడుచుటచే వాతసంబంధమువలన నరికాలు మిక్కిలి రూక్షంబై పగిలి నొచ్చుచుండిన దానిని పాదదారి యనియెదరు.

కందరలక్షణము

శర్కరోన్మథితే పాదే క్షతే వా కంటకాదిభిః. 26
గ్రంథిః కోలవదుత్పన్నో జాయతే కదరం తు తత్,

తా. సూదిజాయిని ద్రొక్కుటచేగాని లేక కాలియందు గ్రుచ్చుకొనిన ముల్లును దీయునపుడు లోన ముల్లువిరుగుటచే నైని గాయమై రేగుపండంత ఉబ్బుగల గ్రంధిజనించిన దానిని కదర మనియెదరు. (ఇదియే ఆనెయందురు.)

అలసలక్షణము

క్లిన్నాంగుళ్యంతరౌ పాదౌ కండూదాహరుజాన్వితౌ. 27
దుష్టకర్దమసంస్పర్శాదలసం తం వినిర్దిశేత్,

తా. దుర్వాసనగల బురద దగులుటచే కాలియొక్క వేళ్లసందులయందలి మాంసముకుళ్లి నీరుకారుచు, దురద, మంట, పోట్లు వీనితోగూడియుండిన దానిని అలసయని యెరుంగవలయును. (ఇదియ కాళ్లుపాయుట లేక ఒరయుట.)

దారుణలక్షణము

దారుణా కండురా రూక్షా కేశభూమిః ప్రపద్యతే. 28
కఫమారుతకోపేన విద్యాద్దారుణకం తు తత్,

తా. కఫవాత ప్రకోపమువలన వెంట్రుకలుండు ప్రదేశమున భయంకరమైనదురదగలిగి, సన్నకురుపులతో నిండి పండియుండిన దానిని దారుణ మనియెదరు. (ఇది కఫవాత ప్రకోపమువలన జనించినను, రక్తపిత్త సంబంధములేకనే పాకము జెందకుండుటంజేసి రక్తపిత్తసంబంధముగలదైయుండును.)

### అరూంషికాలక్షణము

అరూంషి బహువక్త్రాణి బహుక్లేదాని మూర్ధని, 29
కఫాసృక్క్రిమికోపేన నృణాం విద్యాదరూంషికామ్.

తా. కఫరక్తక్రిమికోపమువలన శిరస్సున ననేకముఖములుగల కురుపులు గలిగి, అందు బంకగస్రావము వెడలుచుండిన దానిని అరూంషికయని యెరుంగవలయును. (ఇవియే అడుసుపుండ్లు.)

### తారుణ్యపిటికాలక్షణము

శాల్మలీకంటకప్రఖ్యాః కఫమారుతకోపజాః. 30
జాయంతే పిటికాయూనాం జ్ఞేయాస్తా ముఖదూషకాః,

తా. కఫవాతప్రకోపమువలన యౌవనకాలమునందు ముఖమున బూరుగ ముండ్లతో తుల్యముగ నుండు కాయలుజనించి, ముఖము వికారముగనుండిన దానిని ముఖదూషికయనిగాని, తారుణ్యపిటకలనిగానియనియెదరు. (ముఖదూషికయన మొటిమలు.)

### పలితలక్షణము

క్రోధశోకశ్రమకృతశ్శరీరోష్మా శిరోగతః. 31
పిత్తం చ కేశాన్పచతి పలితం తేన జాయతే,
వాతికం విషమం రూక్షం పీతం పిత్తాత్సితం కఫాత్. 32
సర్వరూపాన్వితం విద్యాత్సన్నిపాతసమన్వితమ్,
రూక్షం శ్లక్ష్ణం చ సూక్ష్మం చ జరాపలితముచ్యతే. 33

తా. క్రోధము, శోకము, శ్రమ వీనివలన శరీరోష్ణపిత్తములు శిరస్సునందు ప్రవేశించి వెంట్రుకలపండునటులంజేసిన దానిని పలితమనియెదరు. ఇదేరీతిగ వాత, పిత్త, కఫములు శిరమునందుచేరి పలితమును జనింపంజేయును. అందు వాత ప్రాబల్యమున వెంట్రుకలు సగమునల్లగ, సగము తెల్లగ, రూక్షముగ నుండును. పిత్త ప్రాబల్యమున పీతవర్ణముగనుండును. కఫప్రాబల్యమువలన శ్వేతవర్ణముగను, సన్నిపాతమువలన పూర్వోక్తసర్వలక్షణములతో గూడియుండును. మరియు వెంట్రుకలు రూక్షముగ, సున్నగ, సూక్ష్మముగనుండిన జరాపలితమనియెదరు.

### వలీపలితరోగనిదానము, తచ్చికిత్స

వలీపలితరోగాశ్చ వాతదోషాదిసంచయాత్,
భైషజ్యం మునిభిశ్చాత్ర చంద్రోదయముదీరితమ్. 34

తా. వాతాదిదోషములు ప్రకోపించి వలీపలితరోగముల గలుగంజేయును. వీనియందు చంద్రోదయము శ్రేష్ఠమని మునులు వచించిరి. (వలియన శరీరము ముడ తలుపడుట, పలితమన వెంట్రుకలునరియుట.)

## ఇంద్రలుప్తరోగనిదానము

క్రిమిభ్యః కేశనాశస్స్యాత్తస్య నామేంద్రలుప్తకమ్,
తద్భావే చ సువిజ్ఞేయా భైషజ్యే తు జయన్తికా. 35

తా. క్రిములవలన వెంట్రుకలూడిన దానిని ఇంద్రలుప్తమనియెదరు దీని తక్కలియాకురసముత్రాగుటయే గాక, వెంట్రుకలూడినస్థలమున నాయాకురసమున లేపనముజేసిన వెంట్రుకలు మరలజనించి వృద్ధిజెందును. (ఇది పేనుకొరుకు.)

## ఖాలిత్యసంప్రాప్తి

రోమకూపానుగం పిత్తం వాతేన సహ మూర్ఛితమ్,
ప్రచ్యావయతి రోమాణి తతశ్శ్లేష్మా సశోణితః. 36
రుణద్ధి రోమకూపాంస్తు తతోఽన్యేషామసంభవః,
తదింద్రలుప్తం విజ్ఞేయం ఖాలిత్యమితి చాపరే. 37

తా. పిత్తము వాతముతోగలిసి ప్రకోపించి రోమకూపములయందు జేరుట వలన వెంట్రుకలూడి, కఫరక్తములు రోమకూపముల బంధించుటవలన వెంట్రుకల మరల జనింపకుండుగాన దానిని ఇంద్రలుప్తము లేక ఖాలిత్యము అనియెదరు (ఖాలిత్యమన బట్టతల.)

## పద్మినీకంటకలక్షణము

కంటకై రాచితం వృత్తం మండలం పాండుకండురమ్,
పద్మినీకంటకప్రఖ్యైస్తదాఖ్యం కఫవాతజమ్. 38

తా. తామరముండ్లవలె గుండ్రమై పాండువర్ణముగలిగి, దురదతోగూడి యుండు ముండ్లు జనించిన దానిని పద్మినీకంటకమనియెదరు. ఇదికఫవాతజనితమ తెలియవలయును.

## జతుమణిలక్షణము

సమముత్పన్నమరుజం మండలం కఫరక్తజమ్,
సహజం లక్ష్మ చైకేషాం లక్ష్యో జతుమణిస్స్మృతః. 39

తా. కఫరక్తమువలన ఉత్పత్తియైనదిమొదలు సమముగను, ఉబ్బుగను వేదనాహీనముగనుండు మండలములు దేహమునందుత్పన్నంబులైన దానిని కొందరు లక్ష్మయనియు, మరికొందరు లక్ష్యమనియు, ఇంకొకొందరు జతుమణియనియు చెప్పె

దరు. (ఇది స్త్రీపురుషులకుజనించునట్టి స్థానవిశేషంబులచే శుభాశుభములగలుగం జేయునని తెలియవలయును. ఇదియ పుట్టుమచ్చ.)

## మాషలక్షణము

అవేదనం స్థిరం చైవ యస్మిన్గాత్రే ప్రదృశ్యతే,
మాషవత్కృష్ణముత్పన్నమనిలాన్మాషమాదిశేత్. 40

తా. వాతమువలనదేహముపై వేదనారహితముగను, కఠినముగను, నల్లగను, కొంచెము ఉబ్బుగనునుండు దద్దుజనించి మినపగింజలవలెనుండిన దానిని మాషమని యెదరు. (మాషమన పులిపిరికాయ.)

## తిలకాలకలక్షణము

కృష్ణాని తిలమాత్రాణి నీరుజాని సమాని చ,
వాతపిత్తకఫోద్రేకాత్తాన్విద్యాత్తిలకాలకాన్. 41

తా. వాత, పిత్త, కఫ ప్రకోపమువలన మచ్చలుజనించి, నల్లగ నువ్వుగింజలవలె నొప్పిలేక చర్మసమానముగనుండిన వానిని తిలకాలకమనియెదరు (తిలకాలకమనినను పుట్టుమచ్చలు.)

## న్యచ్ఛలక్షణము

మహద్వా యది వాత్యల్పం శ్యావం వా యది వా సితమ్,
నీరుజం మండలం గాత్రే న్యచ్ఛమిత్యభిధీయతే. 42

తా. శరీరముపైనపెద్దదిగగాని లేక చిన్నదిగగాని, నల్లగగాని, నొప్పిలేకయుండు మచ్చబుట్టియుండినదానిని న్యచ్ఛమనియెదరు.

## వ్యంగలక్షణము

క్రోధాయాసప్రకుపితో వాయుః పిత్తేన సంయుతః,
ముఖమాగమ్య సహసా మండలం విసృజత్యతః. 43
నీరుజం తనుకం శ్యావం ముఖే వ్యంగం తమాదిశేత్,

తా. కోపము, ఆయాసము వీనివలన వాతముప్రకోపించి పిత్తముతోచేరి ముఖముమీద వేదనాహీనముగను, పలచగను, శ్యామవర్ణముగను నుండు మండలములనుజనింపజేసిన దానిని వ్యంగమనియెదరు. (ఇదేమంగు.)

## నీలికాలక్షణము

కృష్ణమేవంగుణం గాత్రే ముఖే వా నీలికాం విదుః, 44

తా. పైజెప్పబడినప్రకారము నల్లనిమండలములు శరీరముపైగాని, ముఖముపైగాని గలిగిన దానిని నీలికయనియెదరు.

బిందువులుగమాత్రము వెడలిన నిరుద్ధప్రకశమని తెలియవలయును. ఇది వాతము వలన జనించును.

—— సన్నిరుద్ధగుదలక్షణము ——

వేగసంధారణాద్వాయుర్విహతో గుదసంశ్రితః,
నిరుణద్ధి మహాస్రోతస్సూక్ష్మద్వారం కరోతి చ, 53
మార్గస్య సౌక్ష్మ్యాత్కృచ్ఛ్రేణ పురీషం తస్య గచ్ఛతి,
సన్నిరుద్ధగుదం వ్యాధిమేనం విద్యాత్సుదారుణమ్. 54

తా. మలమూత్రాదివేగముల నడ్డగించుటవలన గుదాశ్రితవాతము ప్రకోపించి గుదమునడ్డగించి గుదద్వారమును సన్నముగచేయును. వానివలన మలము మిక్కిలి ప్రయాసచేవెడలును. ఇదిసన్నిరుద్ధగుదమనబడును. ఇది మిక్కిలి భయంకరమగునది.

—— అహిపూతనలక్షణము ——

శకృన్మూత్రసమాయుక్తేఽధౌతేఽపానే శిశోర్భవేత్,
స్విన్నే వా స్నాప్యమానే వా కండూరక్తకఫోద్భవా. 55
తతః కండూయనాత్క్షిప్రం స్ఫోటాస్స్రావశ్చ జాయతే,
ఏకీభూతం వ్రణం ఘోరం తం విద్యాదహిపూతనమ్. 56

తా. శిశువు మలమూత్రోత్సర్జనముచేసినపిదప గుదమునుకడుగకుండుట చేనేని, చెమటనుదుడువకుండుటచేనేని, స్నానమును చేయించినపిదప దుడువకుండుటచేనేని, రక్తకఫములుప్రకోపించి దురదనుగలుగంచేసి పిదప గోకుటచే శీఘ్రముగ కురుపులుజనించి, స్రావమునుగలుగజేసి, ఒకటితోనొకటి కలుసుకొని విస్తారమునుజెందియుండును. దానిని అహిపూతనయనివచించెదరు. యీ భయంకర రోగము తరుచుగ శిశువులకేజనించునని తెలియవలయును.

—— వృషణకచ్ఛూలక్షణము ——

స్నానోత్సాదనహీనస్య మలో వృషణసంస్థితః,
యదా ప్రక్లిద్యతే స్వేదాత్కండూస్సంజాయతే తదా. 57
కండూయనాత్తతః క్షిప్రం స్ఫోటాస్స్రావశ్చ జాయతే,
ప్రాహుర్వృషణకచ్ఛూం తాం శ్లేష్మరక్తప్రకోపజామ్. 58

తా. స్నానముజేయుకాలమునందు వృషణములను బాగుగ కడుగకుండుటవలన వృషణములయందు మలినముచేరి చెమటవలన తేమగలదై మిక్కిలి జిలను గలుగ

జేయును. దానిని గోకినతత్క్షణమునందే కురుపులుత్పన్నమై స్రవించుచుండును. దీనిని వృషణకచ్ఛమనియెదరు. ఇది కఫరక్తమువలన జనించును.

## నూరకదంష్ట్రిలక్షణము

సదాహో రక్తపర్యంతస్త్వక్పాకీ తీవ్రవేదనః,
కండూమాఙ్జ్వరకారీ చ సస్యాత్సూకరదంష్ట్రికః. 59

తా. గుదమండలిచర్మము దాహయుక్తమై ఎఱ్ఱనై పండి తీవ్రమగు వేదన, దురద, వాపు లేక వ్రణము ఇవిగలదై జ్వరసహితముగనుండిన దానిని సూకరదంష్ట్రి మనియెదరు.

## వదనదుర్గంధనిదానము

కఫపిత్తే గళే జాతే వక్త్రే దుర్గంధసంభవః,
తచ్ఛాంత్యర్థం వదిష్యామి భైషజ్యం లోకమోహనమ్. 60

తా. కఫపిత్తములు ప్రకోపించి కంఠమునందుజేరిన నోటియందుదుర్గంధము జనించును. అది శమించుటకై ప్రశస్తమగు చికిత్సల వచించెదను.

## పులిపిర్లనిదానము

వాతేన కఠినం పీతం జాయతే కందుభేదనమ్,

తా. వాతమువలన కఠినమై పచ్చగనుండు పులిపిర్లు జనించును.

## ఛాయారోగనిదానము

ఛాయారోగం ప్రవక్ష్యామి వాతదోషాదిసంభవమ్. 61
ఉత్తమాంగస్య కేశేషు రక్తరూపం ప్రజాయతే,

తా. వాతాదిదోషములవలన శిరస్సునందలి కేశములు రక్తవర్ణములయ్యేనేని దానిని ఛాయారోగమనియెదరు.

## అజగల్లికాచికిత్స

తత్రాజగల్లికామామాం జలౌకాభిరుపాచరేత్. 62
శుక్తిసౌరాష్ట్రికాక్షారకల్కైశ్చ లేపయేన్ముహుః,

తా. అజగల్లిక పక్వమగుటకుపూర్వము జలగలనంటించి రక్తమునుదీసి, దానియందు ఆలుచిప్పసున్నము, పటికారము వీనిని కల్కముజేసి మాటిమాటికి లేపనము జేయవలయును.

కఠినాం క్షారయోగైశ్చ ద్రావయేదజగల్లికామ్. 63
శ్యామాలాం గలికామూర్వాకల్కైరపి విలేపయేత్,

తా. అజగల్లిక కఠినంబై యుండిన దానిపై క్షారమునుబూసి స్రావమును జేయించి, నల్లతెగడ, చన్నుచల్లగడ్డ, చాగ వీనినినూరి లేపనముజేసిన అజగల్లికా రోగము నివర్తించును.

—⊙ యవప్రఖ్యాంధాలజీచికిత్స ⊙—

అంధాలజీం యవప్రఖ్యాం పూర్వాం స్వేదైరుపాచరేత్. 64
మనశ్శిలాదేవదారుకుష్ఠైరేతాం ప్రలేపయేత్,
పక్వాం వ్రణవిధానేన యథోక్తేన ప్రసాధయేత్. 65

తా. అంధాలజీ, యవప్రఖ్య వీనియందు పూర్వము స్వేదనకర్మజేసి పిదప మణిశిల, దేవదారు, చంగల్వకోష్ఠు వీనినినూరి లేపనముచేసి పక్వమైనపిదప శీఘ్రముగ వ్రణచికిత్సను జేయవలయును.

—⊙ వివృత ఇంద్రవృద్ధ గర్దభ జాలగర్దభచికిత్స ⊙—

వివృతామింద్రవృద్ధాం చ గర్దభం జాలగర్దభమ్,
పైత్తికస్య విసర్పస్య క్రియయా సాధయేద్భిషక్. 66

తా. వివృత, ఇంద్రవృద్ధ, గర్దభము, జాలగర్దభము యీరోగములయందు పిత్తవిసర్పమునకు జెప్పబడిన క్రియనే జేయవలయును.

పాకే తు లేపయేదాజ్యైః పక్వైర్మధురభేషజైః,
నీలీపటోలమూలాభ్యాం సాజ్యాభ్యాం లేపనం హితమ్. 67
జాలగర్దభరోగం తు సద్యో హన్తి సవేదనమ్,

తా. పైజెప్పబడిన వివృతాదులు పండినయెడల వానియందు మధురౌషధములతో జేయబడిన ఘృతము లేపనముజేయవలయును. మరియు జాలగర్దభమునందు నీలి, చేదుపొట్లవేరు వీనిని నేతితోనూరి, లేపనముజేసిన పోట్లు తత్క్షణమునందే నివర్తించును.

—⊙ కచ్ఛపికాచికిత్స ⊙—

కచ్ఛపీం స్వేదయేత్పూర్వం తతఏభిః ప్రలేపయేత్. 68
కల్కీకృతైర్నిశాకుష్ఠశిలాతాళకదారుభిః,
తాం పక్వాం సాధయేచ్ఛీఘ్రం భిషగ్వ్రణచికిత్సయా. 69

తా. కచ్ఛపికయందు తొలుత చెమటదీసి, పిదప పసపు, చెంగల్వకోష్ఠు, మణిశిల, తాళకము, దేవదారు వీనికల్కమును లేపనముజేసి, అది పక్వమైనపిదప వ్రణచికిత్సను జేయవలయును.

## వల్మీకచికిత్స

మనశ్శిలాసభల్లాతసూక్ష్మైలాగరుచందనైః,
జాతీపల్లవకల్కైశ్చనింబతైలం విపాచయేత్. 70
వల్మీకం నాశయేత్తద్ధి బహుచ్ఛిద్రం బహువ్రణమ్,

తా. మణిశిల, జీడి, సన్నయేలకులు, అగరు, చందనము, జాజియాకులు వీనికల్కములో వేపనూనెకలిపి కాచి, లేపనముజేసిన అనేక ఛిద్రములతోగూడి బహువ్రణములుగల వల్మీకము నివర్తించును.

## పనసికాచికిత్స

భిషక్పనసికాం పూర్వాం స్వేదనైరపతర్పణైః. 71
జయేద్విదారివల్లేపైశ్శిగ్రుదేవద్రుమోద్భవైః,

తా. పనసికయందు మొదట స్వేదకర్మను, అపతర్పణ క్రియనుచేసి పిదప విదారికయందు జెప్పబడు మునగ, దేవదారు వీనిపట్టల నుదకముతోనూరి లేపనము జేసిన పనసిక నివర్తించును.

## పాషాణగర్దభచికిత్స

సురదారుశిలాకుష్ఠైస్స్వేదయిత్వా ప్రలేపయేత్. 72
కఫమారుతశోఫఘ్నో లేపః పాషాణగర్దభే,

తా. మొదట స్వేదకర్మనుచేసినపిదప దేవదారు, మణిశిల, చెంగల్వకోష్ఠు వీనినినూరి లేపనముచేసినను లేక కఫ, వాత, శోఫహారములగు లేపనముచేసినను పాషాణగర్దభము నివర్తించును.

## ఇరివేల్లికాచికిత్స

పైత్తికస్య విసర్పస్య యా చికిత్సా ప్రకీర్తితా, 73
తామేవ భిషగాదద్యాచ్చికిత్సామిరివేల్లకే,

తా. ఇరివేల్లికమునందు పూర్వోక్తపిత్తవిసర్పచికిత్సనే జేయవలయును.

## కక్షపిటికాగంధనామ్నీచికిత్స

కక్షాం చ గంధనామ్నీం చ చికిత్సేచ్చ చికిత్సకః. 74
పైత్తికస్య విసర్పస్య క్రియయా పూర్వముక్తయా,

తా. కక్షపిటికా, గంధనామ్ని వీనియందు పూర్వోక్తపిత్తవిసర్పరోగచికిత్సనే జేయవలయును.

## అగ్నిరోహిణీచికిత్స

పిత్తవీసర్పవిధినా సాధయేదగ్నిరోహిణీమ్. 75
రోహిణ్యాం లంఘనం కుర్యాద్రక్తమోక్షణరూక్షణే,
శరీరస్య చ సంశుద్ధిం తాం తు వృద్ధాం పరిత్యజేత్. 76

తా. అగ్నిరోహిణియందు తొలుత పిత్తవిసర్ప చికిత్సను జేసి, లంఘనము, రక్తమోక్షము, రూక్షకరవిధి వీనిని జేయుటచే అగ్నిరోహిణిని నివర్తింపం జేయుటయే గాక విరేకాదులకొసంగవలయును. అది వృద్ధిజెందెనేని విడువవలయును.

## చిప్ప కునఖచికిత్స

చిప్యం రుధిరమోక్షేణ శోధనేనాప్యుపాచరేత్,
గతోష్మాణమథైనం తు సేచయేదుష్ణవారిణా. 77
శస్త్రేణాపి యథాయోగ్యముచ్ఛిద్య స్రావయేత్తతః,
వ్రణోక్తేన విధానేన రోపయేత్తు విచక్షణః. 78

తా. చిప్యమునందు రక్తమునుదీసి శోధనమునుం జేయవలయును. రక్తమును దీసినవెనుక యుష్ణముతగ్గినపిదప ఉష్ణోదకముతో సేకముజేయవలయును. మరియు యథాయోగముగ దానిని శస్త్రముతోఛేదించి, రక్తమును స్రవింపజేసి, వ్రణ చికిత్సనుచేసి మాంసపూరితముగ జేయవలయును.

శ్లేష్మవిద్రధివచ్చైవ కునఖం సముపాచరేత్,
నఖకోటిప్రవిష్టేన టంకణేన చ శామ్యతి. 79

తా. కునఖమునందు శ్లేష్మవిద్రధి చికిత్సంజేయుటయేగాక గోళ్లసందులయందు వెలిగారచూర్ణమునునించిన కునఖము నివర్తించును.

## చిప్యమునకు హారిద్రాకల్కము

స్వరసేన హారిద్రాయాః పాత్రే కృత్వాయసేభయామ్,
ఘృష్ట్వా తజ్జేన కల్కేన లింపేచ్చిప్యం పునఃపునః. 80

తా. పసపురసములో కరకచూర్ణమునుగలిపి, ఇనపపాత్రలోనుంచి మర్దించి మాటిమాటికి లేపనముచేసిన చిప్యము నివర్తించును.

## అనుశయీచికిత్స

హరేదనుశయీం వైద్యః క్రియయా శ్లేష్మవిద్రధేః,

తా. అనుశయిఅనురోగమునకు శ్లేష్మవిద్రధియందు జెప్పఁబడియుండు క్రియను చేయవలయును.

విదారికాచికిత్స

విదారికాయాం ప్రథమం జలౌకాయోజనం హితమ్. 81
పాటనం చ విపక్వాయాం తతో వ్రణవిధిస్స్మృతః,

తా. విదారికయందు తొలుత జలగలనంటించి రక్తమును దీసివేయుట హితకరము. మరియు నది పక్వమైనపిదప ఛేదించి వ్రణచికిత్సను జేయవలయును.

శర్కరార్బుదచికిత్స

మేదోర్బుదవిధానేన సాధయేచ్ఛర్కరార్బుదమ్. 82

తా. శర్కరార్బుదమును మేదోర్బుదచికిత్సలచే నివర్తింపజేయవలయును.

పాదదారికి మధూచ్ఛిష్టాదిలేపము

మధూచ్ఛిష్టవసామజ్జాఘృతక్షారవిమిశ్రితైః,
సర్జాహ్వాసింధూద్భవయోశ్చూర్ణం మాక్షికసంయుతమ్. 83
నిర్మథ్య కటుతైలాక్తం హితం పాదప్రమార్జనే,

తా. మైనము, కొవ్వు, మజ్జ, నెయ్యి, యవక్షారము వీనితో గుగ్గిలము, సైంధవలవణము, తేనె, తెల్లఆవనూనెగలిపిమర్దించి, పాదములకు లేపనముచేసిన పాదదారిక నివర్తించును.

మదనాదిలేపము

మదనసైంధవగుగ్గులుగైరికాజ్యమధువాలకపంకవిలేపనాత్. 84
ప్రపుటితం త్వఖిలం చరణద్వయం వికచతామరసప్రతిమం భవేత్,

తా. మంగకాయ, సైంధవలవణము, గుగ్గిలము, కావిరాయి, కురువేరు వీనిని చూర్ణించి, నెయ్యి, తేనెకలిపి లేపనముజేసిన కాలి పగుళ్లుమాని తామరపువ్వువలె మృదువుగనుండును.

మధుసిక్థకసైంధవఘృతగుడ మహిషాక్షసాలనిర్యాసైః. 85
గైరికసహితైర్లేపః పాదస్ఫుటనాపహస్సిద్ధః,

తా. తేనె, మైనము, సైంధవలవణము, నెయ్యి, బెల్లము, మహిషాక్షి, గుగ్గిలము, తెల్లధూపము (మద్దిబంక), కావిరాయి వీనిని నేకముగనూరి లేపనముజేసిన పాదదారి నివర్తించును.

మదనం చ తథా సిక్థం సాముద్రలవణం తథా, 86
మహిషీనవనీతేన సంతప్తం లేపనే హితమ్,
సప్తాహాత్స్ఫుటితౌ పాదౌ జాయేతే కమలోపమౌ, 87

తా. మంగకాయ, మైనము, సముద్రలవణము వీనిని బఱ్ఱెవెన్నతో చేర్చి కాచి ౭ దినములు లేపనముజేసిన కాళ్ల పగుళ్లు నివర్తించి కమలతుల్యముగ నుండును.

## కదర చికిత్స

దహేత్కదరముద్ధృత్య తైలేన దహనేన వా,

తా. కదరమును ఛేధించి తీసి నూనెతోగాని, అగ్నితోగాని కాల్చిన నివర్తించును.

## అలస చికిత్స

పాదౌ సిక్త్వారనాళేన లేపనం త్వలసే హితమ్. 88
పటోలకునటీనింబ రోచనామరిచైస్తిలైః,
క్షుద్రాస్వరససిద్ధేన కటుతైలేన లేపయేత్. 89
తతః కాసీసకునటీతిలచూర్ణైర్వచూర్ణయేత్,

తా. అలసరోగమునందు తోలుత కలిని పాదములయందుబోసి, పిదప చేదుపొట్ల, మణిశిల, వేప, గోరోజనము, మిరియాలు, నువ్వులు వీనిచూర్ణములో ములకపండ్లరసము, తెల్లావనూనెగలిపి తైలపక్వముగ కాచి, పాదములకు లేపనముచేసి, అన్నభేది, మణిశిల, నువ్వులు వీనినిచూర్ణించి దానిపైనద్దిన అలసరోగము నివర్తించును.

కరంజబీజం రజనీకాసీసంపద్మకం మధు. 90
రోచనాహరితాళం చ లేపోయమలసే హితమ్,

తా. కానుగవిత్తులు, పసపు, అన్నభేది, తామరకాడలు, తేనె, గోరోచనము, హరితాళము వీనినినూరిలేపనముచేసిన అలసమునివర్తించును.

## దారుణచికిత్స

దుగ్ధేన ఖాఖసైర్బీజైః ప్రలేపాద్దారుణం హరేత్. 91

తా. పాలతో గసగసాలనునూరి లేపనముచేసిన దారుణకు నివర్తించును.

## కంటకార్యాదిలేపము

కంటకారీఫలరసైస్తుల్యం తైలం విపాచయేత్,
జపాపుష్పద్రవైర్వాథ తల్లేపో దారుణప్రణుత్. 92

తా. నేలములకపండ్లరసమునకుగాని, దాసానిపువ్వులరసమునకుగాని సమముగ నూనెకలిపికాచి లేపనముచేసిన దారుణము నివర్తించును.

## భృంగరాజతైలము

భృంగరాజరసేనైవ లోహకిట్టం ఫలత్రికమ్,
శారిబాం చ పచేత్కల్కే తైలం దారుణనాశనమ్. 93
అకాలపలితం కండూమింద్రలుప్తం చ నాశయేత్,

తా. గుంటగలగరాకురసముతో లోహకిట్టము, త్రిఫలములు, సుగంధపాల వేళ్లు వీనికల్కమును, తైలమునుగలిపి కాచి లేపనముచేసిన దారుణము, అకాలము నందు వెంట్రుకలునరయుట, దురద, ఇంద్రలుప్తము ఇవి నివర్తించును.

## ఇంద్రలుప్తచికిత్స

ఇంద్రలుప్తాపహో లేపో మధునా బృహతీరసః. 94
గుంజామూలం ఫలం వాపి భల్లాతకరసం తథా,
లేపయేన్నవనీతేన శ్వేతాశ్వఖురజాం మషీమ్. 95

తా. ములకపండ్లరసమునందు తేనెగాని లేక గురివిందవేరు లేక గింజలు రసము కాని జీడిగింజలరసము వీనియందు తెల్లగుఱ్ఱపు గిట్టను మశిజేసి వెన్నతో కలిపికాని లేపనముజేసిన ఇంద్రలుప్తము నివర్తించును.

హస్తిదన్తం మషీం కృత్వా ఛాగదుగ్ధం రసాంజనైః,
రోమాణ్యేతేన జాయన్తే లేపాత్పాణితలేష్వపి. 96

తా. ఏనుగదంతమునుమసిజేసి, మేకపాలు, రసాంజనము వీనిని నేకముగనూర లేపనముచేసిన శిరస్సుయందు వెంట్రుకలు మొలుచుటయేగాక అరచేతియందు సహా జనించును.

## జాత్యాదితైలము

జాతీకరంజవరుణకరవీరాగ్నిపాచితమ్,
తైలమభ్యంజనాద్ధన్తి ఇంద్రలుప్తం న సంశయః. 97

తా. జాజిపూలు, కానుగ, వులిమిడి, కరవీరము, చిత్రమూలము వీని రసము నందు తైలముజేర్చి కాచి అభ్యంజనము జేసిన ఇంద్రలుప్తము నివర్తించును.

త్రిఫలాంచోత్పలం కందం యష్టికాం భృంగజం రసమ్,
రసార్ధం తిలతైలం స్యాత్పక్వా తైలావశేషకమ్. 98
తల్లేపాత్కేశవృద్ధిస్స్యాత్పంచవారం విశేషతః,
ఆమలక్యా మూలచూర్ణం పిష్ట్వా వటజటాం తు వా. 99
మర్దయిత్వా రసైర్లేపస్తూర్ణం కేశవివర్ధనమ్,

తా. త్రిఫలములు, నల్లకలువగడ్డలు, అతిమధురము వీనిని సమాంశములుగ చూర్ణించి గుంటగలగరాకురసముతోనూరి కల్కముచేసి, అందు గుంటగలగరాకు రసము, దానికర్ధభాగము నువ్వులనూనెకలిపి చిక్కగకాచి ౨౧ మార్లు తలయంటు కొనిన వెంట్రుకలు పెరుగును. మరియు ఉశిరికవేరు, మఱ్ఱిఊడలు, జటామాంసి వీనిని నూరి రసముదీసి తలయంటుకొనిన కేశములు వృద్ధియగును.

హస్తిదన్తీం ఫలం ధాత్ర్యా తిలతైలేన పాచయేత్. 100
తేన భృంగసమాః కేశాస్థిరాశ్చాపి భవంతిచ,

తా. నాగదంతివిత్తులు, ఉశిరికపప్పు వీనినినూరి కల్కముచేసి అందు నూనె కలిపి కాచి తలయంటుకొనిన తుమ్మెదరెక్కలతో సమమగు వెంట్రుకలుజనించి స్థిరములుగనుండును.

కృష్ణగోమూత్రసంపిష్టజపాపుష్పప్రలేపనాత్. 101
బహుకేశాన్వితం శీర్షమింద్రలుప్తే ప్రజాయతే,

తా. దాసానిపుష్పములు నల్లయావుమూత్రముతోనూరి ఇంద్రలుప్తముచే వెంట్రుకలూడిన స్థలమున దట్టముగలేపనముచేసిన మరల వెంట్రుకలు జనించును.

ఇంద్రలుప్తచేంద్రయవైశ్శిరసస్తువిలేపనమ్. 102
ఘృష్ట్వేంద్రయవకాసీసమనోహ్వాతుత్థకోషణైః
హన్యాద్దారురసైర్వాపి గుంజామూలఫలైస్తథా. 103
తథా లాంగలికామూలైః కరవీరరసేన వా,
సక్షౌద్రక్షుద్రవార్తాకస్వరసేన వినశ్యతి. 104
ధుత్తూరకస్య పత్రాత్థభల్లాతకరసేనవా,
అథవా మాక్షికం హన్తి తిలపుష్పాద్రికర్ణికైః. 105
తైలతోవాహస్తిదన్తస్య మషికాచౌషధం పరమ్,

తా. కొడిశపాలనుక్షౌద్రకముతోనూరి శిరస్సునలేపనముజేసినను లేక కొడిశ పాల, అన్నభేది, మణిశిల, మైలతుత్తము, పిప్పలి వీనిని దేవదారురసముతో నూరి గాని లేక పెద్దగురిగింజవేరు, దానివిత్తులునూరిగాని, చిన్నచర్లగడ్డ, గన్నేరువేరు రసముతోనూరిగాని లేక నేలములకరసములో తేనెగలిపిగాని లేక ఉమ్మెత్తాకును జీడిగింజల రసముతోనూరిగాని లేక నువ్వులపువ్వు, తెల్లగంటెన వీనిని తేనెతో నూరిగాని, ఏనుగుదంతపుమసిని నూనెలో కలిపిగాని ఇంద్రలుప్తమునందు మిక్కుటముగ వెంట్రుకలు జనించును.

—॥ భృంగరాజతైలము ॥—

నీలీమూలకషాయే తు బీజం ఖదిరసారజమ్. 106
నీలీం నీలాంజనం చైవయష్టీమధుకమేవచ,
మార్కవస్వరసప్రస్థం తైలప్రస్థం విపాచయేత్. 107
అనేన లిప్తాః కేశాస్స్యుః మృదవః షట్పదైస్సమాః,
ఇంద్రలుప్తహరం చైవ పాలిత్యం చైవ నాశయేత్. 108
తైలం రహస్యం పరమం వలీపలితనాశనమ్,

తా. నీలిచెట్లను నలియగొట్టి కషాయముకాచి, అందు చంద్రవిత్తులచూర్ణము, నీలివేరు, నీలాంజనము, యష్టిమధుకము వీనికల్కమువైచి, ౧ ప్రస్థము గుంటగలగరాకురసము ౧ ప్రస్థము నూనెకలిపి తైలముకాచి వెంట్రుకలకు లేపనముచేసిన ఇంద్రలుప్తము, వలీపలితము ఇవి నివర్తించి వెంట్రుకలు తుమ్మెదలవలె నల్లనై యుండును.

బృహతీఫలసంయుక్త గుంజామూలం ఫలైస్తథా. 109
లేపేన నశ్యతి క్షిప్రమింద్రలుప్తమనేకధా,

తా. ములకపండ్లు గురిగింజవేరు గురిగింజలు వీనినినూరి లేపనముచేసిన అనేకవిధములగు ఇంద్రలుప్తము నివర్తించును.

—॥ అరూంషికాచికిత్స ॥—

నీలోత్పలస్య కింజల్కో ధాత్రీఫలసమన్వితః. 110
యష్టీమధుకయుక్తశ్చ లేపాద్ధన్యాదరూంషికామ్,

తా. నల్లకలువ కింజల్కములు ఉశిరికెకాయ అతిమధురము వీనినినూరి లేపనముచేసిన అరూంషికారోగము నివర్తించును.

—॥ త్రిఫలాది తైలము ॥—

త్రిఫలాయా రజోయష్టిమార్కవోత్పలశారిబాః. 111
సైంధవంతైలమేతైస్తు లేపాద్ధన్యాదరూంషికామ్,

తా. త్రిఫలములు, అతిమధురము, గుంటగలగర, నల్లకలువ, సుగంధపాల, సైంధవలవణము వీనికల్కములో నూనెకలిపి కాచి లేపనముచేసిన అరూంషిక నివర్తించునని తెలియవలయును.

—॥ పిణ్యాకాదిలేపము ॥—

పురాణమపి పిణ్యాకం పురీషం కుక్కుటస్య చ. 112
మూత్రపిష్టం ప్రలిప్తేత్తచ్ఛీఘ్రం హన్యాదరూంషికామ్,

తా. పాతగానుగపిండి, కోడిమలము వీనినిగోమూత్రముతో నూరి లేపనము చేసిన అరూంషిక నివర్తించును.

తారుణ్యపిటికాచికిత్స

జాతీఫలం చందనం చ మరిచం సహపేషితమ్. 113
ముఖేలేపేన హన్త్యాశు పిటికాం యావనోద్భవామ్,

తా. జాజికాయ, చందనము, మిరియాలు వీనినినూరి ముఖమునందు లేపనము చేసిన యావనమువలన జనించిన పిటికలు నివర్తించును.

సిద్ధార్థాదిలేపము

సిద్ధార్థకవచాలోధ్రసైంధవైశ్చ ప్రలేపనమ్. 114
గవ్యేన చార్జునత్వగ్వామంజిష్ఠావాసమాక్షికా,
కంటకైశ్శాల్మలైర్వాచ్ఛ క్షీరపిష్టైః ప్రలేపనమ్. 115
ముఖేయువానపిటికా సంక్షయం యాత్యసంశయమ్,

తా. తెల్లఆవాలు, వస, లొద్దుగ, సైంధవలవణము వీనిని (ఆవుపాలతో) నూరి లేపనముచేసినను లేక మద్దిపట్టను ఆవుపాలతో నూరి లేపనముచేసినను లేక మంజిష్ఠ తేనెలోకలిపి లేపనముచేసినను లేక బూరగముళ్లను పాలతో నూరి ముఖమునందు లేపనముచేసినను యావన పిటికలు నివర్తించును.

మంజిష్ఠాదితైలము

న్యగ్రోధోదుంబరాశ్వత్థ ప్లక్షాణాంపీతనస్యచ. 116
త్వచాంవై షోడశపలంక్వాథచూర్ణం ప్రకల్పయేత్,
ద్విరష్టగుణితైస్తోయైః పాచయేత్పాదశేషకమ్. 117
కషాయాంశం గవాం క్షీరం క్షీరార్ధం తిలతైలకమ్,
మంజిష్ఠాంద్వేనిశేలోధ్రంతువరీంతాళకం శిలామ్. 118
లాక్షాం గోరోచనాం కుష్ఠం కుంకుమంచందనద్వయమ్,
గైరికం సికకం తుత్థం వటమర్జునవల్కలమ్. 119
నాగకేసరకాలీయపద్మబీజాబ్జకేసరాన్,
పారదం గంధకం పత్రం త్వచం చ ప్రతికార్షికమ్. 120
సర్వం పాచ్యం తైలశేషం ప్రత్యక్షాద్వ్యంగనాశనమ్,
వదనం చంద్రతుల్యం స్యాత్సప్తరాత్రాన్న సంశయః. 121

తా. మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, అంబాళము వీనిపట్టలను దినుసుకు ౧౬ పలములచొప్పునదంచి ౧౨౮ పలముల నీళ్లుబోసి, నాలవపాలు మిగులునటుల కషాయముకాచి, దానికి సమము ఆవుపాలు, ఆవుపాలకుసమము నూనెగలిపి, అందు మంజిష్ఠ, పసపు, మానిపసపు, లొద్దుగచెక్క, తువరిమన్ను, హరిదళము, మణిశిల, లక్క, గోరోజనము, చెంగల్వకోష్టు, కుంకుమపువ్వు, చందనము, రక్తచందనము, కావిరాయి, మైనము, మైలుతుత్థము, మఱ్ఱిచిగుళ్లు, ఏరుమద్దిచెక్క, నాగకేసరములు, కృష్ణచందనము, తామరవిత్తులు, తామరకింజల్కములు, పాదరసము, గంధకము, ఆకుపత్రి, లవంగపుచెక్క వీనినిచూర్ణించి ప్రత్యేకము కర్షప్రమాణము చొప్పున చేర్చి తైలశేషముగకాచి వడియగట్టి ముఖమునందు లేపనముచేసిన ౭ దినములలో వ్యంగనము నివర్తించి ముఖము చంద్రతుల్యముగనుండును.

## ముఖమంగుకు చికిత్స

ముఖచ్ఛాయాకరం వంగభస్మస్యాన్మాహిషం పయః,
మాక్షికం తాళకం తుత్థం రాజావర్తం శిలాజితు. 122
మహిషాక్షం శిలాసూతం తుల్యం క్షీరైస్తు మాహిషైః,
సప్తాహం మర్దయేద్గాఢం వ్యంగఘ్నం కాన్తివర్ధనమ్. 123
మహిషీక్షీరమథితమేతదుద్వర్తనంహితమ్,
ముఖవర్ణకరం స్త్రీణాం తిలకాలం చ నాశయేత్. 124

తా. వంగభస్మమును బఱ్ఱెపాలతో నూరిగాని, స్వర్ణమాక్షికము, తాళకము, మైలతుత్థము, రాజావర్తము, శిలాజిత్తు, మహిసాక్షి, గుగ్గిలము, మణిశిల, పాదరసము వీనిని సమభాగములుగ బఱ్ఱెపాలతో ౭ దినములు దృఢముగనూరిగాని లేపనము జేసిన ముఖమండలిమంగు (అనగా ముఖముయొక్క నలుపు) మాని ముఖమునకు కాంతి గలుగును. మరియు బఱ్ఱెపాలనుచిలికి వెన్నదీసి ముఖమునందు మర్దనజేసిన స్త్రీలకు ముఖమంగు నివర్తించును. మఱియు తిలకాలకముగూడ నశించును.

## వటపత్రాదిలేపములు

వటస్య పాండుపత్రాణి మాలతీరక్తచందనమ్,
కుష్ఠం కాలీయకం లోధ్రమేభిర్లేపం ప్రయోజయేత్. 125
యువానపిటికానాం తు వ్యంగానాం చ వినాశకమ్,

తా. పండుమఱ్ఱియాకులు, జాజియాకులు, రక్తచందనము, చెంగల్వకోష్ఠు, మానిపసపు, లొద్దుగపట్ట వీనినినూరి లేపనముచేసిన యౌవనపిటికలు, మంగు ఇవి నివర్తించును.

గౌరీహరిద్రామంజిష్ఠాఘృతం గౌరాశ్చ సర్షపాః. 126
పేష్యం గైరికమేభిశ్చాప్యజాక్షీరేణ సంయుతమ్,
ఏతేనైవ భవేద్వక్త్రముదయాదిత్యసన్నిభమ్. 127

తా. గోరోచనము, పసపు, మంజిష్ఠ, నెయ్యి, తెల్లావాలు, కావిరాయి వీనిని మేకపాలతోనూరి ముఖమునకు లేపనముజేసిన మంగు నివర్తించి ముఖము బాలసూర్యసదృశముగనుండును.

మహిషీక్షీరసంఘృష్టైరజనీరక్తచందనైః,
కృతో లేపో నిహంత్యాశు శ్యామికాం గండయోః స్థితామ్. 128

తా. పచ్చిపసపు, రక్తచందనము వీనిని బఱ్ఱెపాలతోనూరి లేపనముచేసిన ముఖమంగు నివర్తించుటయేగాక చెంపలయందుండు నల్లనిమచ్చలు సహా నివర్తించును.

సోమరాజ్యారజన్యాచహ్యాశ్వక్షీరస్య లేపనమ్,
మనశ్శిలాశ్వేతలోధ్రద్వినిశాసర్షపైస్సమమ్. 129
వారిపిష్టాహితో లేపో వదనే శ్యామికాం హరేత్,

తా. బావంచివిత్తులు, పచ్చిపసపు వీనిని గుఱ్ఱపుపాలతోనూరి లేపనముచేసినను, మణిశిల, తెల్లలొద్దుగచెక్క, పసపు, మానిపసపు, తెల్లావాలు వీనిని సమాంశములుగ నీళ్లతోనూరి లేపనముజేసినను ముఖమునందలి నల్లనిమచ్చలు, మొటిమలు నివర్తించును.

## జాతిఫలాదిలేపము

జాతీఫలస్య లేపస్తు హరేద్వ్యంగం చ నీలికామ్. 130
అర్కక్షీరహరిద్రాభ్యాం మర్దయిత్వా ప్రలేపనాత్,
ముఖకార్ష్ణ్యం శమం యాతి చిరకాలోద్భవంధ్రువమ్. 131

తా. జాజికాయనునూరి లేపనముచేసిన వ్యంగము, నీలిక నివర్తించును, మరియు పసపును జిల్లేడుపాలతోనూరి లేపనముచేసిన ముఖమునందలి నలుపు నివర్తించును.

## మసూరాదిలేపము

మసూరైః క్షీరసంపిష్టైర్లిప్తమాస్యం ఘృతాన్వితైః,
సప్తరాత్రాద్భవేత్సత్యం పుండరీకదళోపమమ్. 132

తా. చిరుశనగలను పాలతోనూరి, నేతితోకలిపి ౭ రోజులు ముఖమునందు మర్దించిన కమలతుల్యముగనుండును.

—॥ కుంకుమాదితైలము ॥—

కుంకుమం చందనం లోధ్రం పతంగం రక్తచందనమ్,
కాలేయకముశీరంచ మంజిష్ఠామధుయష్టికా. 133
పత్రకం పద్మకం పద్మం కుష్ఠం గోరోచనం నిశా,
లాక్షా దారుహరిద్రా చ గైరికం నాగకేసరమ్. 134
పలాశకుసుమం చాపి ప్రియంగుశ్చ వటాంకురాః.
మాలతీ చ మధూచ్ఛిష్టం సర్షపాస్సురభిర్వచా. 135
చతుర్గుణపయఃపిష్టైరేతై రక్షమితైః పృథక్,
పచేన్మందాగ్నినా వైద్యస్తైలం ప్రస్థద్వయోన్మితమ్. 136
వదనాభ్యంజనాదేతద్వ్యంగం నీలికయా సహ,
తిలకం మాషకం న్యచ్ఛం నాశయేన్ముఖదూషికామ్. 137
పద్మినీకంటకం వాపి హరేజ్జతుమణిం తథా,
విదధ్యాద్వదనం పూర్ణచంద్రమండల సుందరమ్. 138

తా. కుంకుమపువ్వు, చందనము, లొద్దుగ, రసకర్పూరము, రక్తచందనము, కృష్ణాచందనము, వట్టివేరు, మంజిష్ఠ, అతిమధురము, తమాలపత్రి, తామరకాడలు, కమలములు, చెంగల్వకోష్టు, గోరోచనము, పసపు, లక్క, మానిపసవు, కావిరాయి, నాగకేసరములు, మోదుగపువ్వు, ప్రేంకణము, మఱ్ఱిపూడలు, జాజి, మైనము, తెల్లావాలు, తులసి, వస వీనిని ప్రత్యేకము ౧ కర్షముపంతునచేర్చి, నాలుగింతల నీళ్ల యందువైచి కషాయముకాచి వడియగట్టి అందు ౨ ప్రస్థముల నూనెవైచి, మందాగ్నిచే కాచి ముఖమునందు లేపనముజేసికొనిన వ్యంగము, నీలిక, తిలకము, మాషకము, న్యచ్ఛము, ముఖదూషిక, పద్మినీకంటకము, జతుమణి ఇవి నివర్తించి ముఖము పూర్ణ చంద్రమండలతుల్యముగనుండును.

—॥ పలితచికిత్స ॥—

కంటకారీఫలరసైస్తుల్యం తైలం విపాచయేత్,
జపాపుష్పద్రవైర్వాపి తల్లేపః పలితం హరేత్. 139

తా. నేలములకపండ్లరసమునకు సమముగ నూనెకలిపి కాచి లేపనముచేసినను లేక దాసానిపువ్వులరసముతో నూనెనుకాచి లేపనముచేసినను పలితము నివర్తించును.

ద్వినిశానవనీతేన లేపాత్పలితకండునుత్,
నీలోత్పలం తిలాఞ్యష్టిం సర్షపాన్నాగకేసరమ్. 140

టిని నేకముగచేర్చి మందాగ్నిచే పక్వముగ కాచి 2 దినములు అభ్యంజనము చేసికొనిన నీలిక, వ్యంగము, మొటిమలు, వలీపలితము ఇవి నివర్తించుటయేగాక ముఖము నిర్మలముగను వెంట్రుకలు నల్లగను ముఖము బంగారువంటి కాంతిగలదిగనునుండును.

పరివర్తికాచికిత్స

పరివర్తేఘృతాభ్యక్తం సుస్విన్నముపనాహయేత్,
త్రిరాత్రం పంచరాత్రం వా వాతఘ్నైశ్శాల్వణాదిభిః. 148
తతోభ్యజ్య శనైశ్చర్మ వేశయేత్పీడయేన్మణిమ్,
ప్రవిష్టే చర్మణి మణౌ క్లేదయేదుపనాహయేత్. 149

తా. పరివర్తకమునందు శిశ్నమునకు నెయ్యిబూసి చెమటందీసి వాతహరమైన * శాల్వణాదులచే 3 దినములుగాని లేక 5 దినములుగాని కట్టుగట్టి, పిదప ఘృతమునుబూసి శిశ్నమణిని చర్మముతో మెల్ల మెల్లగ సంధింపజేయవలెను. అట్లు చర్మము సరిగా సంధింపబడినతరువాత వాతహరములగు పదార్థములచే సిద్ధము జేయబడిన ఘృతాదులచేదడిపి కట్టుగట్టవలెను.

అవపాటికాచికిత్స

స్నేహస్వేదైరిమాం వైద్యశ్చికిత్సేదవపాటికామ్,

తా. అవపాటికయందు స్నేహస్వేదోపచారములం జేయవలయును.

నిరుద్ధప్రకశచికిత్స

నిరుద్ధప్రకశేనాడీం లోహీముభయతోముఖీమ్. 150
దార్వీం చ వా జతుకృతాం ఘృతాక్తాం సంప్రవేశయేత్,
పరిషించేద్వసాం మజ్జాం శింశుమారవరాహయోః. 151
చక్రతైలం తథా యోజ్యం వాతఘ్నద్రవ్యసంయుతమ్,
అహ్నః స్థూలతరాం సమ్యక్ నాడీం గర్భే ప్రవేశయేత్. 152
భిత్వా వా సేవనీం ముక్త్వా సద్యః క్షతవదాచరేత్,

తా. నిరుద్ధప్రకశమునందు ఇనుము, వెదురు, లక్క [illegible] దేనిచేనైన నొక గొట్టమును 2 ముఖములుగలదిగ చేయించి నెయ్యిబూసి [illegible] లోపల ప్రవేశింపజేయుటచే దానినోరునుదెరచి † మొసలి, పంది వీనియొక్క [illegible], మజ్జను వాతహరద్రవ్యములతో సిద్ధము చేయబడిన చక్రతైలమునుబోసి [illegible] జూరోజుకు వల

* శాల్వణమనగా మాంసాదులతో జేయబడు ద్రవ్యముతో [illegible] స్వేదనము.

† శింశుమారమనగా మొసలికాదు; కాని సముద్రమునందుండు మొసలి వంటి జంతువు.

మగు గొట్టమును బెట్టి రంధ్రమును పెంచవలెను లేక సేవనీయనునాడినివదలి ఛేదించి సద్యఃక్షతోపచారముల జేయవలయును.

సన్నిరుద్ధగుదచికిత్స

సన్నిరుద్ధగుదేత్రైలైస్సేకోవాతహరైర్హితః.
తథానిరుద్ధప్రకశే క్రియాపి కథితా హితా, 153

తా. సన్నిరుద్ధగుదమునందు వాతహరములగు తైలముల సేచనముచేయవలయును. మరియు నిరుద్ధ ప్రకశమునందు జెప్పబడిన క్రియనుచేసిన హితముగనుండును.

అహిపూతనచికిత్స

శంఖసౌవీరయష్ట్యాహ్వై ర్లేపః కార్యో హి పూతనే. 154

తా. శంఖము, తెల్లసురమారాయి, అతిమధురము వీనినినూరి లేపనము జేసిన అహిపూతన నివర్తించును.

పటోలాదిఘృతము

పటోలపత్రత్రిఫలారసాంజనవిపాచితమ్,
పీతం ఘృతం నాశయతి కృచ్ఛ్రమప్యహిపూతనమ్. 155

తా. చేదుపొట్లాకు, కరక, తాడి, ఉశిరికెలు, రసాంజనము వీనికల్కములో సిద్ధముచేయబడు ఘృతమును పానముచేసిన కష్టసాధ్యమగు అహిపూతన నివర్తించును.

వృషణకచ్ఛూచికిత్స

సర్జాంబుకుష్ఠసైంధవసితసిద్ధార్థైః ప్రకల్పితో యోగః,
ఉద్వర్తనేన నియతం శమయతి వృషణస్య కండూతిమ్. 156

తా. సర్జరసము, కురువేరు, చెంగల్వకోష్ఠు, సైంధలవణము, తెల్లావాలు వీనినినూరి లేపనము జేసిన వృషణములయందలి దురదమానును.

కాసీసాదిలేపము

కాసీసరోచనాతుత్థమారితాళరసాంజనైః,
అమ్లపిష్టైర్నిర్దిలేపోముష్కకండ్వహిపూతనే. 157

తా. అన్నభేది, గోరోచనము, మైలుతుత్తము, హరితాళకము, రసాంజనము వీనిని నిమ్మపండ్లపులుసుతోనూరి లేపనముజేసిన వృషణములయందలి దురద, అహిపూతన నివర్తించును.

సూకరదంష్ట్రచికిత్స

రాజీవమూలకల్కః పీతో గవ్యేన సర్పిషా ప్రాతః,

శమయతి సూకరదంష్ట్రోద్భూతం జ్వరం ఘోరమ్. 158

తా. ఎఱ్ఱతామరగడ్డల కల్కములో ఆవునెయ్యికలిపి ప్రాతఃకాలమున సేవింపుచుండిన సూకరదంష్ట్రమువలన గలిగిన భయంకరమగు జ్వరము నివర్తించును.

## వదనదుర్గంధచికిత్స

స్వరసో మాతులుంగస్య సంయుతో మధుసర్పిషా,
తాలుదేశే ప్రదేయశ్చ చూర్ణితం సైంధవం తథా. 159
గోజలైః క్వథితం పథ్యామిసికుష్ఠకణాన్వితమ్,
వదనస్య దురామోదం నిహంతి పరిశీలితమ్. 160
ధృతం చ కాంజికం దోషే పరితో భక్షయేత్సితామ్,
తథా కృతే భవేదాస్యే దురామోదానుమర్దనమ్. 161

తా. మాదీఫలరసములో తేనె లేక నెయ్యి వీనినికలిపి తాలువులలో రాసినను, సైంధవలవణచూర్ణమును తాలుప్రదేశమునందునించినను కరక్కాయలు, సదాప, చెంగల్వకోష్ఠు, పిప్పలి వీనిని చూర్ణముజేసి, గోమూత్రములో కషాయముకాచి త్రాగినను నోటిదుర్గంధముమానును. లేక కలిలో పంచదారకలిపి గండూషముజేసిన నోటిదుర్గంధము మానును.

## కుష్ఠాదిగుటికలు

గోమూత్రే క్వాథయేత్కుష్ఠం వాలుకం సహరీతకీ,
పిష్ట్వా ధార్యావటీర్వక్త్రే ముఖదుర్గంధనాశనీః. 162

తా. చెంగల్వకోష్ఠు, కూతురుబుడమ, కరక్కాయలు వీనిని చూర్ణముజేసి, గోమూత్రములో కలిపివండినూరి మాత్రలుజేసి పుక్కిటియందుంచుకొనిన ముఖదుర్గంధము నివర్తించును.

## లాజాదివటుకములు

లాజాన్ జాతీఫలం పూగం మధునాద్యాత్ పిబేదను,
శీతతోయం పలార్ధం చాప్యాస్యదుర్గంధశాంతయే. 163

తా. పేలాలు, జాజికాయ, పోకవక్కలు వీనిని సమభాగములుగ ఖల్వమునందునించి తేనెజేర్చిమర్దించి, మాత్రలుజేసి సేవించి, తోడనే ½ పలము శీతోదకమును పుచ్చుకొనిన ముఖదుర్గంధము నివర్తించును.

## పులిపిర్లచికిత్స

అశ్వత్థస్య త్వచో భస్మచూర్ణేన సమమిశ్రితమ్,

నవనీతం ద్వయోస్తుల్యం మర్ద్యం తేన విలేపయేత్. 164
ఆననే గుదపార్శ్వే చ కట్యాం వా పిటకా జయేత్,

తా. రావిచెక్క, బూడిద, కొత్తసున్నము వీనిని సమభాగములుగ గ్రహించి వానికిసమము వెన్నకలిపి లేపనముజేసిన ముఖము, గుదపార్శ్వము, నడుము వీనియందుండు పులిపిర్లునశించు. (మరియు నక్కపిట్టాకురసము బూసిన పులిపిర్లు నివర్తించును.)

ఛాయారోగచికిత్స

జపాపుష్పశతం హంతి కృష్ణగోమూత్ర లేపనాత్. 165
గుంజామూలఫలం చూర్ణం కంటకారీఫలద్రవైః,
తేన లేపో నిహంత్యాశు చ్ఛాయారోగం సుదుస్సహమ్. 166

తా. నూరుదాసానిపువ్వులను, నల్లావుపంచితముతోనూరి లేపనముజేసిన ఛాయారోగము నివర్తించును. మరియు గురిగింజవేరు, విత్తులు, సున్నము వీనిని చూర్ణించి, నేలములకపండ్లరసముతోనూరి లేపనముజేసిన అసాధ్యమగు ఛాయారోగము నివర్తించును.

పథ్యాపథ్యములు

క్షుద్రరోగేషు సర్వేషు నానారోగానుకారిషు,
దోషాన్దూష్యానవస్థాం చ నిరీక్ష్య మతిమాన్భిషక్. 167
తస్య తస్య చ రోగస్య పథ్యాపథ్యాని సర్వశః,
యథాదోషం యథాదూష్యం యథావస్థం చ కల్పయేత్. 168

తా. నానారోగములననుసరించియుండు సకల క్షుద్ర రోగములయందును దోషము, దూష్యము అవస్థ, వీనిని వైద్యుడు చక్కగపరీక్షించి ఆయారోగమునకు తగిన పథ్యాపథ్యముల వచింపవలయును.

క్షుద్రరోగముసమాప్తము.

---

# స్నాయురోగప్రకరణమ్.

నారికురుపుస్వరూపము

శాఖాసు కుపితో దోషశ్శోథం కృత్వా విసర్పవత్,
భినత్తి తత్క్షణంతత్ర సోష్మామాంసం విశోష్య చ.

కుర్యాత్తంతునిభం జీవం వృత్తంశుక్లద్యుతిం బహిః,
శనైశ్శనైః క్షతాద్యాతిచ్ఛేదాత్కోపముపైతి సః. 2
తత్పాతాచ్ఛోఫశాన్తిస్స్యాత్పునస్థానాన్తరే భవేత్,
సస్నాయుక ఇతిఖ్యాతః క్రియోక్తాతు విసర్పవత్. 3
బాహ్వోర్యది ప్రమాదేనజంఘయోస్తృప్యతేక్వచిత్,
సంకోచంఖంజతాంచైవఛిన్నతంతుః కరోత్యసౌ. 4

తా. హస్తపాదాదులయందుండు వాతాదిదోషముప్రకోపించి, విసర్పమువలె వాపుగలుగజేసి, దానిని వెంటనే పగులునటులజేసి, ఆసురుపునందలి యూష్మముతోచేరి మాంసమునుశోషింపజేసి, దారముతోతుల్యముగను, తెల్లగను, చుట్టుకొనియుండు * నొకజీవమును గలుగజేయును. అది ఆసురుపునుంచిబయటకు మెల్లమెల్లగవచ్చుచుండి నడుమతెగిన మిక్కిలి ప్రకోపించినదై, పిదప ఆవాపుశాంతినిజెంది మరల మరియొక ప్రదేశమునజనించు. అద్దానిని స్నాయుకమని తెలియవలయును. దీనికి విసర్పమువలె చికిత్సచేయవలయును. మరియు నిదిప్రమాదముచే బాహువులు, పిక్కలు వీట్లయందుజనించిన మిక్కిలివేదనను గలుగజేయుచు బయలువెడలునపుడు నడుమదెగిన సంకోచమును గాని, కుబ్జత్వమును గాని గలుగజేయును. (స్నాయుకమన నారికురుపు.)

## స్నాయుకభేదములు - లక్షణములు

వాతేన శ్యావరూక్షస్సరుగథ దహనాన్నీలపీతస్సదాహో,
యశ్శ్వేతశ్శ్లేష్మణాస్యాత్పృథుగరిమయుతో దోషయుగ్మాద్ద్విలింగః.
రక్తాచ్చారక్తకాన్తిస్సమధికదహనః సర్వజస్సర్వలింగో,
రోగోసావష్టధేత్థం మునిభిరభిహితస్స్నాయుకస్తంతుకీటః. 6

తా. స్నాయురోగము వాతాధిక్యముచే శ్యామముగను, రూక్షముగను, నొప్పిగలదిగనుండును. పిత్తాధిక్యముచే నీలవర్ణము లేక పసపువర్ణము ఇవిగలదిగనుండి దాహముతోగూడినదిగనుండును, శ్లేష్మాధిక్యముచే తెల్లగను, గొప్పదిగను, బరువుగను, నుండును. మరియుద్వంద్వలక్షణములచే జనించినది ద్వంద్వజమని యెరుగవలెను. రక్తాధిక్యముచే జనించినది మిక్కిలి రక్తకాంతినిగలదిగను, మిక్కిలి తాపముగలదిగనుండును. మరియు, వాతపిత్తకఫములుమూడును, ప్రకోపముగనుండునది, సన్నిపాతజమనియును ఇటులస్నాయుకరోగము యెనిమిదివిధములుగనుండును. మరియుస్నాయుకమన తంతురూపముగనుండుకీటకమని మునులు వచించిరి.

---

* జీవమనగా పామువంటిదియు పురుగువంటిదియునగు పదార్థము.

## చికిత్సాక్రమము

అహింస్రామూలగోమూత్రకల్కాల్లేపస్తు వాతజే,
పంచవల్కలకల్కేన హితో లేపోత్ర పిత్తజే. 7
శ్లేష్మజే స్నాయుకే లేపః ప్రశస్తః కాంచనారజైః,
ద్వంద్వాభ్యాం ద్వంద్వజే లేపస్సర్వైస్తైస్సర్వజేహితః. 8
రక్తజే స్నాయుకే లేపో వటప్లక్షత్వచో హితః,
విసర్పోక్తాః క్రియాస్సర్వాస్స్నాయుకే తు హితా మతాః. 9

తా. ఆరెదొండవేరును గోమూత్రముతో నూరి లేపనము జేసిన వాతజస్నాయురోగము, పంచవల్కలకల్కమును లేపనముచేసిన పిత్తజస్నాయురోగము, దేవకాంచనపుపట్టనూరి లేపనముచేసిన శ్లేష్మజస్నాయురోగము, ద్వంద్వ చికిత్సలచే ద్వంద్వజస్నాయురోగము, వాతపిత్తశ్లేష్మములకు జెప్పిన సర్వచికిత్సలచే సన్నిపాతజ స్నాయురోగము, మఱ్ఱి జువ్వి వీనిపట్టలనునూరి లేపనము జేసిన రక్తజస్నాయురోగము, నివర్తించును. మరియు నీస్నారోగములయందు విసర్పరోగచికిత్సలం జేసిన హితముగ నుండును.

కుష్ఠరామఠశుంఠీభిః కల్కశ్శిగ్రుసమన్వితః,
పానలేపనయోగేన జన్తుపీడావినాశనః. 10
శిగ్రుమూలఫలైః పిష్టైః కాంజికేన స్ససైంధవైః,
లేపనం చాగ్నిలశునరాజికాపిష్టకేనవా. 11
బబ్బూలబీజం గోమూత్రపిష్టం హన్తి ప్రలేపనాత్,
స్నాయుకాని సమస్తాని సశోథాని సరుంజి చ. 12

తా. చెంగల్వకోష్ఠు, ఇంగువ, శొంఠి, మునగవేరు వీనిని కల్కముచేసి పుచ్చుకొనినను లేక లేపనముజేసినను జంతుపీడ నివర్తించును. మరియు మునగవేరు మునగవిత్తులు, సైంధవలవణము వీనిని కాంజికముతో నూరి లేపనముచేసినను లేక వెల్లుల్లి, చిత్రమూలము, ఆవాలు వీనినినూరి లేపనము జేసినను స్నాయురోగము నివర్తించును. మరియు నల్లతుమ్మవిత్తులను గోమూత్రముతో నూరి లేపనముచేసిన వాపు, నొప్పి వీనితోగూడియుండు సకలస్నాయురోగములు నివర్తించును.

సుధయాఖండలవణం జలేనాలోడ్య లేపయేత్,
అనేన తు ప్రయోగేణ త్రిదినాదేవ నశ్యతి. 13
పాఠాథగరుడీమూలం పిబేత్స్నాయుకనాశనమ్,

తిలపిణ్యాకలేపో వా హ్యారనాళేన పేషితః. 14
తక్రేణ వాథ తైలేన హ్యాశ్వగంధాం ప్రలేపయేత్,
శ్వేతవిష్ణుక్రాన్తయా వా శిగ్రుమూలేన వా పునః. 15
పుంమూత్రైః కాంచనీం పిష్ట్వా లేపస్స్నాయుకజిద్భవేత్,

తా. సున్నము, బిడాలవణము వీనిని నీళ్లలోకలిపి, 3 దినములు లేపనము జేసినను లేక పాతాళగరుడివేరును నీళ్లలోనూరి పుచ్చుకొనినను లేకనువ్వుల(గానుగ) పిండిని కాంజికముతోకలిపి లేపనముజేసినను లేక పెన్నేరుగడ్డనుగాని లేక తెల్ల విష్ణుక్రాంతనుగాని లేక మునగవేరునుగాని మజ్జిగతో గాని లేక నూనెతో గానినూరి లేపనముచేసినను లేక పసపును మనుజమూత్రముతోనూరి లేపనముజేసినను స్నాయుక రోగము నివర్తించును.

వార్తాకమూలం పుంమూత్రైః పత్రంవాశ్వత్థజం తథా. 16
సుతప్తం బంధయేచ్చాపి నిహన్యాత్స్నాయుకం గదమ్,
వాగుడూచీరసేన టంకణక్షారః పేయః. 17
అథవా శణబీజభాగమేకం గోధూమపిష్టభాగమేకం,
ద్వయమేకీకృత్య ఘృతేన పక్త్వ్యం గుడేన త్రిదినం తత్. 18
భక్షయిత్వా స్నాయుకాద్విముచ్యతే,

తా. వంగవేరునుగాని లేక రావిఆకులనుగాని మనుజమూత్రముతోనూరి వుడికించికట్టుగట్టిన స్నాయురోగమునివర్తించును. మరియు తిప్పతీగరసముతో వెలిగారము కలిపిపుచ్చుకొనినను లేక జనపవిత్తులు ౧ భాగము, గోధుమపిండి ౧ భాగము వీనిని నేకముగచేసి, నేతితోనుడికించి, బెల్లముగలిపి మూడుదినములు భక్షించినను స్నాయురోగము నివర్తించును.

గవ్యం సర్పిస్త్ర్యహం పీత్వా నిర్గుండీస్వరసం త్ర్యహమ్. 19
పీత్వా స్నాయుకమత్యుగ్రం జయత్యేవ న సంశయః,
రామఠం టంకణక్షారం ప్రత్యేకం శణసమ్మితమ్. 20
చూర్ణయిత్వా సప్తదినం ఖాదేత్సంధ్యాద్వయే నరః,
అనేన యోగరాజేన స్నాయుకో నశ్యతి ధ్రువమ్. 21

తా. ఆవునెయ్యిని మూడుదినములుపుచ్చుకొని పిదపవావిలి ఆకురసమును మూడుదినములు పుచ్చుకొనిన ఉగ్రమగుస్నాయుకరోగము నివర్తించును. లేక

ఇంగువ, వెలిగారము వీనిని ప్రత్యేకము క్షణమాత్రముచేర్చి యేడుదినములు ప్రాత స్సాయంకాలములయందు పుచ్చుకొనినను స్నాయుకము నివర్తించును.

మూలం సుపవ్యా హిమవారిపిష్టం పానాదినాతంతుగదం ప్రచండమ్,
శాన్తిం నయేత్స్వర్ణమాశు పుంసాంమృగీమదశ్చాపిఘృతేన పీతః,
అతివిషముస్తకభార్ఙ్గివిశ్వౌషధపిప్పలీవిభీతక్యః,
చూర్ణితపీతాఃకృమిహాఃపుంసాముష్ణేన వారిణాక్షిత్యమ్. 23
పారావతపురీషస్య మధునా కల్కితస్య చ,
గిలితా గుటికా హన్తి స్నాయుకామయమద్భుతమ్. 24

తా. పిప్పలిమూలమును చల్లనీళ్లతో నూరి పుచ్చుకొనినను లేక కస్తూరిని నెయ్యితోచేర్చిపుచ్చుకొనినను లేక అతివస, తుంగముస్తలు, భారంగి, శొంఠి పిప్పలి, తాడికాయ వీనినిచూర్ణించి వేడినీళ్లలోకలిపి పుచ్చుకొనినను లేక పావురపిట్టమలమును తేనెతోకలిపి గుటికలుచేసి, మ్రింగినను స్నాయురోగము నివర్తించును.

నింబశమ్యాకజాత్యర్కసప్తపర్ణాశ్వమారకాః,
కృమిఘ్నా మూత్రసంయుక్తాస్సేకలేపనధావనైః. 25
వృంతాకం భర్జితం భాండే కృత్వా దధ్నా సహోపరి,
బంధయేత్స్నాయుకో యాతి బహిస్సప్తదినాత్ఖలు. 26
గోధూమశణబీజస్య చూర్ణం గ్రాహ్యం సమాంశకమ్,
ఘృతపక్వం గుడేనాత్తం త్రిదినాత్స్నాయుకాపహామ్. 27

తా. వేప, రేల, జాజి, జిల్లేడు, సప్తపర్ణి, గన్నేరు వీనినిమూత్రముతో నూరిసేకము, లేపనము, ధావనము వీనినిజేసినను లేక వంకాయను భాండమునందునిచి వేయించి, పెరుగులోకలిపి కట్టుకట్టుచుండినను నారియేడుదినములకు బయలువెడలును లేక గోధుమలు, జనపవిత్తులు వీనినిసమముగచూర్ణించి, నేతితో వండి బెల్లముచేర్చి పుచ్చుకొనిన మూడుదినములకు స్నాయురోగము (అనగానారికురుపు) నివర్తించును.

---

# ముఖరోగప్రకరణమ్.

## ముఖరోగకర్మవిపాకము

కూటసాక్షీ భవేద్వక్త్రరోగీ శోణితపిత్తవాక్,
కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత చాంద్రాయణమథాపరమ్. 1

కుర్యాత్కూష్మాండహోమం చ గాయత్రీమయుతం జపేత్,
దద్యాద్ధిరణ్యం వ్రీహీంశ్చ ముఖరోగస్య శాన్తయే. 2

తా. తప్పుసాక్ష్యము చెప్పెడివానికి ముఖరోగము, రక్తపిత్తరోగము ఇవి జనించును. తన్నివారణకై కృచ్ఛ్ర, అతికృచ్ఛ్ర, చాంద్రాయణ ప్రాయశ్చిత్తములం జేసికొని కుష్మాండహోమమును ౧౦౦౦౦ మార్లు గాయత్రీజపమునుజేసి సువర్ణము, ధాన్యము వీనిని దానముజేయవలయును.

### ముఖరోగనిదానము

అనూపపిశితక్షీర దధిమాషాదిసేవనాత్,
ముఖమధ్యే గదాన్కుర్యుః క్రుద్ధా దోషాః కఫోత్తరాః. 3

తా. జలచరజంతుమాంసము, పాలు, పెరుగు, మినుములు మొదలగువానిని మిక్కిలిగ సేవించుటవలన కఫప్రధానమగు వాతాదిదోషములు ప్రకోపించి నోటి యందు రోగముల గలుగఁజేయును.

### ముఖరోగసంఖ్య

దంతేష్వష్టావోష్ఠయోశ్చమూలేషుదశపంచచ,
నవతాలునిజిహ్వాయాం పంచసప్తదశామయాః. 4
కంఠేత్రయస్సర్వసరాష్టకమష్టిశ్చతుఃపరాః,

తా. దంతరోగములు ౮, ఓష్ఠరోగములు ౮, దంతమూలరోగములు ౧౫, తాలు(లోదవడ) రోగములు ౯, జిహ్వారోగములు ౫, కంఠరోగములు ౧౭, సర్వసరరోగములు ౩, ఇటుల ముఖరోగములు ౬౫ విధంబులని తెలియవలయును.

### ఓష్ఠరోగసంఖ్య

పృథగ్దోషైస్సమస్తైశ్చ రక్తజో మాంసజస్తథా. 5
మేదోజశ్చాభిఘాతోత్థఏవమష్టోష్ఠజా గదాః,

తా. కఫజము, వాతజము, పిత్తజము, సన్నిపాతజము, రక్తజము, మాంసజము, మేదోజము, అభిఘాతజములని ఓష్ఠరోగములు ౮ విధములుగనుండును.

### వాతజోష్ఠరోగలక్షణము

కర్కశౌ పరుషౌ స్తబ్ధౌ కృష్ణౌ తీవ్రరుజాన్వితౌ. 6
దాల్యేతే పరిపాట్యేతే ఓష్ఠౌ మారుతకోపతః,

తా. పెదవిగరగరలాడుట, కఠినముగను, జడముగను, నల్లగనుండుట, తీవ్రముగుపీడతోగూడియుండుట, పగులుట, చర్మమువీడుట ఇట్టి లక్షణములుగలది వాతజోష్ఠరోగమని యెరుంగవలయును.

—— పైత్తికోష్ఠరోగలక్షణము ——

చీయేతే పిటికాభిస్తు సరుజాభిస్సమంతతః. 7
సదాహపాకపిటికౌ పీతాభాసౌ చ పిత్తతః,

తా. పెదవులయందంతట పిటికలులేచి నొచ్చుట, పెదవులుమండుట, పాకమును బొందుట, కురుపులు పసపు వర్ణముగ నుండుట ఇట్టిలక్షణములుగలది పైత్తికోష్ఠరోగమని యెఱుంగవలయును.

—— శ్లైష్మికౌష్ఠరోగలక్షణము ——

సవర్ణాభిస్తు చీయేతే పిటికాభిరవేదనౌ. 8
భవతస్తు కఫాదోష్ఠౌ పిచ్ఛిలౌ శీతలౌ గురూ,

తా. పెదవి చర్మముతో సమానవర్ణముగలకురుపులతో వ్యాప్తమైయుండుట, కొంచెము నొచ్చుట, జిగటగనై చల్లగ బరువుగనుండుట ఇట్టి లక్షణములుగలది శ్లైష్మికౌష్ఠరోగమని యెఱుంగవలయును.

—— సాన్నిపాతికౌష్ఠరోగలక్షణము ——

సకృత్కృష్ణౌ సకృత్పీతౌ సకృచ్ఛ్వేతౌ తథైవ చ. 9
సన్నిపాతేన విజ్ఞేయావనేకపిటికాన్వితౌ,

తా. పెదవు లొకానొకప్పుడు నల్లగను, మఱియొక సమయమున పచ్చగను, వేరొకపుడు తెల్లగనుండుట, అనేకవ్రణము (కురుపు)లతో వ్యాప్తమైయుండుట ఇట్టిలక్షణములుగలది సన్నిపాతికౌష్ఠరోగమని యెఱుంగవలయును.

—— రక్తజౌష్ఠరోగలక్షణము ——

ఖర్జూరీఫలవర్ణాభిః పిటికాభిర్నిపీడితౌ. 10
రక్తోపసృష్టౌ రుధిరం స్రవతశ్శోణితప్రభౌ,

తా. పెదవిపై ఖర్జూరపుకాయతో సమానమగు వర్ణముగల కురుపులు జనించి రక్తముగారుట, పెదవిరక్తమువలె యెఱ్ఱగనుండుట ఇట్టి లక్షణములుగలది రక్తజౌష్ఠరోగమని యెఱుంగవలయును.

—— మాంసజౌష్ఠరోగలక్షణము ——

మాంసదుష్టౌ గురూ స్థూలౌ మాంసపిండవదుద్గతౌ. 11
జన్తవశ్చాత్ర మూర్ఛంతి నరస్యోభయతో ముఖాత్,

తా. పెదవులు బరువుగను, స్థూలముగను, మాంస పిండమువలె నుబ్బుగనుండుట, రెండు దవడలప్రక్కలను పెదవులయందు పురుగులు జనించుట ఇట్టిలక్షణములుగలది మాంసజౌష్ఠమని యెఱుంగవలయును.

## మేదజౌష్ఠరోగలక్షణము

సర్పిర్మండప్రతీకాశౌ మేదసా కండురౌ గురూ. 12
స్వచ్ఛం స్ఫటికసంకాశమాస్రావం స్రవతో భృశమ్,
తయోర్వ్రణో న సంరోహేన్మృదుత్వం చ న గచ్ఛతి. 13

తా. పెదవి పేరిన నేతివలె తెల్లగను, దురదతో గూడినదిగను, బరువుగను, పెదవియందు స్ఫటికమువలె స్వచ్ఛముగనుండు స్రావమధికముగ గలుగుట, పెదవిపైగలిగిన వ్రణము మానకుండుట, కఠినముగనుండుట ఇట్టిలక్షణములు గలిగియుండిన మేదోజౌష్ఠరోగమని యెఱుంగవలయును.

## అభిఘాతజౌష్ఠరోగలక్షణము

ఓష్ఠౌ పర్యవదీర్యేతే పీడ్యేతే చాభిఘాతతః,
గ్రథితౌ చ తదా స్యాతాం కండూక్లేదసమన్వితౌ. 14

తా. పెదవిచుట్టు చీలుట, పోట్లు, గంట్లుగలుగుట, దురదగలిగి బంకగనుండుట ఇట్టి లక్షణములుగలది అభిఘాతజౌష్ఠరోగమని తెలియవలయును.

## దంతమూలరోగసంఖ్య

శీతాదో గదితః పూర్వం దన్తపుప్పుటకస్తథా,
దన్తవేష్టస్సౌషిరశ్చ మహాసౌషిర ఏవ చ. 15
తతః పరిదరః ప్రోక్తః తతస్తూపకుశస్స్మృతః,
వైదర్భశ్చ తతః ప్రోక్తో ఖల్లీవర్ధన ఏవ చ. 16
అధిమాంసకనామా చ దన్తనాడ్యశ్చ పంచ చ,
దన్తవిద్రధిరప్యత్ర దన్తవేష్టేషు షోడశ. 17

తా. శీతాదము, దంతపుప్పుటకము, దంతవేష్టము, సౌషిరము, మహాసౌషిరము, పరిదరము, ఉపకుశము, వైదర్భము, ఖల్లివర్ధనము, అధిమాంసకము, దంతనాడులు అయిదు, దంతవిద్రధి ఇటుల దంతమూల రోగములు ౧౬ విధములుగల విగనుండును.

## శీతాదలక్షణము

శోణితం దన్తవేష్టేభ్యో యస్యాకస్మాత్ప్రవర్తతే,
దుర్గంధీని సకృష్ణాని ప్రక్లేదీని మృదూని చ. 18
దన్తమాంసాని శీర్యన్తే పచంతి చ పరస్పరమ్,
శీతాదో నామ స వ్యాధిః కఫశోణితసంభవః. 19

తా. దంతములనుండి అకస్మాత్తుగ రక్తము వెడలుట, దంతములయొక్క మాంసము దుర్గంధమై, నల్లనై తడిసి మృదువై వీడుట, ఒకదంతముయొక్క పైమాంసము పండి మరియొకదాని మాంసమును పండించుట ఇట్టి లక్షణములు గలిగియుండిన శీతాదమని యెరుంగవలయును. ఇది కఫరక్తములవలన జనించును.

దంతపుప్పుటలక్షణము

దన్తయోస్త్రిషు వా యస్య శ్వయథుర్జాయతే మహాన్,
దన్తపుప్పుటకో నామ సవ్యాధిః కఫరక్తజః. 20

తా. దంతమూలమునందు ౨, ౩ దంతములపైమీదను వాపులుజనించిన దానిని దంతపుప్పుటమని తెలియవలయును. ఇది కఫరక్తమువలన జనించును.

దంతవేష్టలక్షణము

స్రవన్తి పూయం రుధిరం చలా దన్తా భవన్తి చ,
దన్తవేష్టస్స విజ్ఞేయో దుష్టశోణితసంభవః. 21

తా. రక్తము దుష్టమగుటవలన దంతములవలన రక్తము, చీము కారుచు కదలుచుండిన దంతవేష్టమని తెలియవలయును.

సౌషిరలక్షణము

శ్వయథుర్దంతమూలేషు రుజావాన్ కఫరక్తజః,
లాలాస్రావీ సవిజ్ఞేయస్సౌషిరో నామనామతః. 22

తా. కఫరక్తములవలన దంతమూలములయందు వాపు, నొప్పిగలిగి జొల్లుగారుచుండిన సౌషిరమని యెరుంగవలయును.

మహాసౌషిరలక్షణము

దన్తాశ్చలంతి వేష్టేభ్యస్తాలుచాప్యవదీర్యతే,
యస్మిన్స సర్వతో వ్యాధిర్మహాసౌషిరసంజ్ఞకః. 23

తా. త్రిదోషమువలన, చిగుళ్లుగదలుట, లోదవడపగులుట ఇట్టి లక్షణములు గలిగియుండిన మహాసౌషిరమని యెరుంగవలయును.

పరిదరలక్షణము

దన్తమాంసాని శీర్యన్తే యస్మిన్ ష్ఠీవతి చాప్యసృక్,
పిత్తాసృక్కఫజో వ్యాధిర్జ్ఞేయః పరిదరో హిసః. 24

తా. దంతమాంసమువీడి, యుమిసిన రక్తముపడుచుండిన పరిదరమని తెలియవలయును. ఇది పిత్తరక్తకఫములవలన జనించును.

## ఉపకుశలక్షణము

వేష్టేషు దాహః పాకశ్చ తాభ్యాం దన్తాశ్చలంతిచ,
అవాక్కృతాః ప్రస్రవంతి శోణితం మందవేదనాః. 25
ఆధ్మాయంతే స్రుతే రక్తే ముఖే పూతిశ్చ జాయతే,
యస్మిన్నుపకుశో నామ పిత్తరక్తకృతో గదః. 26

తా. చిగుళ్లనాశ్రయించియుండు మాంసమునందు తాపముగలిగి పండుట వలన దంతములు కదలుట, ముఖమునువంచిన కొంచెము నొప్పిగలిగి రక్తము స్రవించుట, రక్తముస్రవించినపిదప మాంసముపండి మరల పొక్కుట, నోటియందు దుర్గంధము వెడలుట, పిత్తరక్తకృత వికారములతోగూడియుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన ఉపకుశయని తెలియవలయును.

## వైదర్భలక్షణము

ఘృష్టేషు దన్తమూలేషు సంరంభో జాయతే మహాన్,
భవంతి చపలా దంతాస్సవైదర్భోభిఘాతజః. 27

తా. చిగుళ్ల నాశ్రయించియుండు మాంసమును దృఢముగ తోముటచే నధికమగు వాపుగలిగి దంతములు గదలుచుండిన వైదర్భమనియొదరు. ఇది యభిఘాతము వలన జనించును.

## * ఖల్లీవర్ధనలక్షణము

మారుతేనాధికో దంతో జాయతే తీవ్రవేదనః,
ఖల్లీవర్ధనసంజ్ఞో వై జాతే రుక్చ ప్రశామ్యతి. 28

తా. వాతసంబంధమువలన పంటిపై మరియొక పల్లుజనించుచు అది జనించునపుడు మిక్కిలి పోట్లుగలుగుట, పెరిగిన వేదన శమించుట ఇట్టి లక్షణములుగలది ఖల్లీవర్ధనమని యెరుంగవలయును.

## కరాళలక్షణము

శనైశ్శనైః ప్రకురుతే వాయుర్దంతసమాశ్రితః,
కరాళాన్వికటాన్దంతాన్ కరాళో న చ సిధ్యతి. 29

తా. వాతము చిగుళ్లనాశ్రయించి మెల్లమెల్లగ దంతముల వంకరజేయుచుండిన కరాళమని యెరుంగవలయును. ఇది యసాధ్యము.

## అధిమాంసక లక్షణము

హానవ్యే పశ్చిమే దన్తే మహాన్ శోథో మహారుజః,

---

* వర్ధనమనిసుశ్రుతమున గలదు.

లాలాస్రావీ కఫకృతో విజ్ఞేయో హ్యధిమాంసకః. 30

తా. దవడకొనలో దంతమూలమునందు లావుగవాపుగలిగి, మిక్కిలి పోటును గలుగంజేయుచు, మిక్కిలిగ జొల్లుకారుచుండిన దానిని అధిమాంసకమనియెదరు. ఇది కఫమువలన జనించినదని తెలియవలయును.

దంతవిద్రధిలక్షణము

దన్తమాంసం మలైస్సాస్రైర్బాహ్యాతః శ్వయథుర్మహాన్,
సదాహరుక్స్రవేద్భిన్నః పూయాస్రుద్దన్తవిద్రధిః. 31

తా. దంతమాంసము, మలము, రక్తము వీనిని స్రవించుచు వెలపల గొప్ప వాపుగలిగి మంట పోట్లుగలిగి పగిలి చీమును స్రవించుచుండిన దంతవిద్రధియని తెలియవలయును.

నాడీవ్రణలక్షణము

దన్తమూలగతా నాడ్యః పంచ జ్ఞేయా యథేరితాః,

తా. నాడీవ్రణము, వాత, పిత్త, కఫ, సన్నిపాత, ఆగంతుక భేదములన నైదువిధంబులని జెప్పబడియెను. అదిదంతమూలములయందు జనించును. (మరియు నిది వరకు జెప్పబడిన ౧౧ విధములగు దంతమూలరోగలక్షణములను, ౫ విధంబులగు నాడీదంత లక్షణములును జేరి ౧౬ విధంబులగు, ఐనను కరాళమనునది సుశ్రుతాచార్యునిమతమునందధికంబగుటచే దానిలక్షణము నిచట నుదహరింపపడినను దంతవిద్రధితోచేరి ౧౬ విధములని తెలియవలయును. అనగా కరాళమనునది సుశ్రుతమతము గలదు, దంతవిద్రధియని స్వమతమున జెప్పబడెనని భావము.*

దంతరోగములు దాళనలక్షణము

దీర్యమాణేష్వివ రుజా యస్య దన్తేషు జాయతే. 32
దాలనో నామ సవ్యాధిస్సదాగతినిమిత్తజః,

తా. దంతములు పగులగొట్టబడినటుల నొప్పిగలిగియుండిన దానిని దాళనమనియెదరు. ఇది వాతమువలనగలుగును.

క్రిమిదంతరోగలక్షణము

కృష్ణచ్ఛిద్రశ్చలస్రావీ ససంరంభో మహారుజః. 33
అనిమిత్తరుజో వాతాత్సజ్ఞేయః క్రిమిదన్తకః,

* ఈనిరూపణము సరిపడలేదు. దంతవిద్రధి, కరాళము అనురెండును సధికముగా నీగ్రంథకర్తవర్ణించినదే. సుశ్రుతమున నీరెండునులేవు. దంతమూలరోగములు ౧౫ అనిగూడ మొదటజెప్పబడెనుగదా!

తా. వాతసంబంధమువలన దంతములయందు నల్లనిరంధ్రములుగలిగి, కదలుచు, స్రవించుచు, వాపు, మిక్కిలిపోట్లు, నిష్కారణముగనొప్పి ఇట్టిలక్షణములు గలిగియుండిన క్రిమిదంతమనియెదరు. (దీనియందు నల్లనిఛిద్రములు, క్రిములు ఇవి దుష్టరక్తమువలన జనించును.)

భంజనకలక్షణము

వక్త్రం వక్రం భవేద్యస్య దన్తభంగశ్చ జాయతే. 34
కఫవాతకృతో వ్యాధిస్సచ భంజనసంజ్ఞకః,

తా. నోరువంకరగనైదంతములూడిన భంజనకమనియెదరు. ఇది కఫవాతప్రకోపమువలన జనించును.

దంతహర్షలక్షణము

శీతరూక్షప్రవాతామ్లస్పర్శానామసహా ద్విజాః. 35
పిత్తమారుతకోపేన దన్తహర్షస్సనామతః,

తా. శీతలము, రూక్షము, పులుసుగలపదార్థములు, గాలి వీనిని సహించకుండిన దానిని దంతహర్షమని తెలియవలయును. ఇది పిత్తవాతప్రకోపమువలన జనించును. (మరియు నిది వాతజన్యమైయుండినను వ్యాధిస్వభావమువలననుష్ణము సహాసహించుట కశక్యమైయుండును.)

దంతశర్కరాలక్షణము

మలో దన్తగతో యస్తు పిత్తమారుతశోషితః. 36
శర్కరేవ ఖరస్పర్శా సా జ్ఞేయా దన్తశర్కరా,

తా. దంతగతమలము పిత్తవాతములవలన శోషించుటచేత నిసుకవలె గరగరలాడుచుండిన దానిని దంతశర్కరయనియెదరు.

కపాలికాలక్షణము

కపాలేష్వివదీర్ణేషు దన్తానాం సైవ శర్కరా. 37
కపాలికేతి సా జ్ఞేయా సదా దన్తవినాశినీ,

తా. పైనుదహరింపబడిన దంతశర్కర (దంతమలము) చిల్లపెంకులవలెపగిలిన దంతశర్కరయనంబడును. ఇది యెల్లపుడు దంతముల నశింపంజేయును.

శ్యావదంతలక్షణము

యోసృఙ్మిశ్రేణ పిత్తేన దగ్ధో దన్తస్త్వశేషతః. 38
శ్యావతాం నీలతాం వాపి గతస్స శ్యావదన్తకః,

తా. రక్తయుక్తపిత్తమువలన దంతములయందంతట కాలినట్టునల్లగగాని లేక నీలవర్ణముగగానియుండిన శ్యావదంతమని యెరుంగవలయును.

హనుమోక్షలక్షణము

వాతేనతైస్తైర్భావైస్తుహనుసంధిర్విసంహతః. 39
హనుమోక్షఇతిజ్ఞేయోవ్యాధిరర్దితలక్షణః,

తా. వాతసంబంధమువలనను, అభిఘాతాదులవలనను, చెంపసంధులువీడినది హనుమోక్షమనంబడును. ఇది అర్దితవాతలక్షణయుక్తమైయుండును.

జిహ్వాగతరోగసంఖ్య

వాతజః పిత్తజశ్చాపి కఫజోఽలాససంజ్ఞకః. 40
ఉపజిహ్వాచహిగదా జిహ్వాయాం పంచ కీర్తితాః,

తా. జిహ్వారోగములు వాతజ, పిత్తజ, కఫజ, ఉల్లాసక, ఉపజిహ్వాకలన ౫ విధములుగనుండును.

వాతజజిహ్వారోగలక్షణము

జిహ్వానిలేన స్ఫుటితా ప్రసుప్తా భవేచ్చ శాకచ్ఛదనప్రకాశా. 41

తా. నాలుకపగిలి మొద్దుబారి (అనగా రసజ్ఞానహీనంబై) టేకువృక్షముల యాకులవలె కరకరలాచుండిన వాతజజిహ్వారోగమని తెలియవలయును.

పిత్తజజిహ్వారోగలక్షణము

పిత్తేన పీతా పరిదహ్యతే చ దీర్ఘైస్సరక్తైరపి కంటకైశ్చ,

తా. నాలుకపసపువర్ణముగలదై, దాహము (మంట) తోగూడిపొడవై యెఱ్ఱగనుండు ముండ్లతోగూడియుండిన దానిని పిత్తజ జిహ్వారోగమనియెదరు.

కఫజజిహ్వారోగలక్షణము

కఫేన గుర్వీ బహులాచితాచమాంసోచ్ఛ్రయైశ్శాల్మలికంటకాభైః.

తా. నాలుకబరువుగనుండి బూరుగముండ్లవంటి మాంసపుమొలకలచే మిక్కిలి వ్యాపింపబడియుండిన దానిని కఫజజిహ్వారోగమనియెదరు.

అలాసజిహ్వారోగలక్షణము

జిహ్వాతలే యశ్శ్వయథుః ప్రగాఢస్సోఽలాససంజ్ఞః కఫరక్తజాతః,
జిహ్వాం సతు స్తంభయతిప్రవృద్ధో మూలేచజిహ్వాభృశమేతిపాకమ్.

తా. కఫరక్తమువలన నాలుకయందు భయంకరమగు వాపుగలిగిన దానిని అలాసమనియెదరు. అదివృద్ధిపొంది నాలుకను స్తంభింపజేసి నాలుకయొక్క మూలమునందు మిక్కుటముగ పాకమును జనింపజేయును. (ఇది యసాధ్యము.)

## ఉపజిహ్వికాలక్షణము

జిహ్వాగ్రరూపశ్శ్వయథుస్సజిహ్వామున్నమ్య జాతః కఫరక్తజాతః,
లాలాకరః కండుయుతస్సచోషస్స్యాతూపజిహ్వా కథితా భిషగ్భిః. 44

తా. కఫరక్తములవలన నాలుక కొనవలె వాపుజనించి పొడవై మిక్కిలి జొల్లుకార్చుచు దురద, మంట వీనితోగూడియుండిన యుపజిహ్వికా రోగమని తెలియవలయును.

## తాలుగతరోగములలో కంఠశుండీలక్షణము

శ్లేష్మాసృగ్భ్యాంతాలుమూలాత్ప్రవృద్ధోదీర్ఘశ్శోథోధ్మాతవస్తిప్రకాశః,
తృష్ణాకాసశ్వాసకృత్తంవదన్తివ్యాధింవైద్యాఃకంఠశుండీతినామ్నా.

తా. కఫరక్తములవలన లోదవడ మూలముననుబ్బి, గాలితోనింపబడిన వస్తివలె దీర్ఘమగు వాపుగలిగి, దప్పి, దగ్గు, ఉబ్బసము గలిగియుండిన కంఠశుండి యనబడును.

## తుండీకేరీలక్షణము

శోథాచ్ఛూలాత్తోదదాహప్రపాకైఃప్రాగుక్తాభ్యాంతుండికేరీమతా తు,

తా. కఫరక్తమువలన వాపు, శూల, పోట్లు, తాపము, పాకము మొదలగు వానితోగూడి (యడవిప్రత్తికాయ యాకారము గలదిగ) నుండిన తుండీకేరీయని తెలియవలయును.

## అధ్రుషలక్షణము

శోథస్స్తబ్ధో లోహితస్తాలుదేశే రక్తాజ్జ్ఞేయస్సోధ్రుషోరుగ్జ్వరశ్చ.46

తా. లోదవడయందు రక్తవికారముచే జడముగను, యెఱ్ఱగనుండు వాపు గలిగి పోట్లతోగూడి జ్వరముగలిగియుండిన అధ్రుషమని తెలియవలయును.

## కచ్ఛపలక్షణము

కూర్మోత్సన్నోఽవేదనోఽశీఘ్రజన్మా రోగోజ్ఞేయఃకచ్ఛపశ్శ్లేష్మణాతు,

తా. కఫదోషమువలన తాబేటివీపువలె నుబ్బుగ వేదనతో గూడిన వాపు పావకాళముగ జనించిన కచ్ఛపమని యెఱుంగవలయును.

## అర్బుదలక్షణము

పద్మాకారంతాలుమధ్యేతుశోథంవిద్యాద్రక్తాదర్బుదంప్రోక్తలింగమ్.

తా. లోదవడ మధ్యమున రక్తదోషమువలన తామరమిన్నెవలె వాపుగలిగి అర్బుదనిదానమందు జెప్పబడిన రక్తార్బుదలక్షణములతో గూడియుండిన అర్బుదమనంబడును.

### మాంససంఘాతలక్షణము

దుష్టం మాంసం నీరుజం శ్లేష్మణాతు
తాలున్యన్తశ్చేన్మాంససంఘాతమాహుః,

తా. కఫదోషమువలన లోదవడ మధ్యమున, మాంసము దుష్టమై ఉబ్బి వేదనారహితమైయుండిన మాంససంఘాతమని యెరుంగవలయును.

### తాలుపుప్పుటలక్షణము

నీరుక్స్థాయీ కోలమాత్రః కఫాత్స్య
న్మేదోయుక్తాత్పుప్పుటస్తాలుదేశే. 48

తా. మేదోయుక్తకఫముచే లోదవడయందు వేదనారహితమై, స్థిరమై, రేగుపండు ప్రమాణముగలదైయుండువాపుజనించిన తాలుపుప్పుటమని యెరుంగవలయును.

### తాలుశోషలక్షణము

శోషోత్యర్థం దీర్యతే చాపితాలుశ్శ్వాసశ్చోగ్రస్తాలుశోషోనిలాచ్చ,

తా. వాతమువలన లోదవడ మిక్కిలి యెండి, పగిలి, భయంకరమగుశ్వాస వెడలుచుండిన దానిని తాలుశోష మనియెదరు.

### తాలుపాకలక్షణము

పిత్తంకుర్యాత్పాకమత్యర్థఘోరం తాలున్యేవంతాలుపాకంవదన్తి.49

తా. పిత్తప్రకోపముచే లోదవడ కడుభయంకరముగపండిన తాలుపాకమనంబడును.

### కంఠరోగములలో రోహిణీలక్షణము

గళేనిలః పిత్తకఫౌ చ మూర్ఛితౌ
ప్రదూష్య మాంసం చ తథైవ శోణితమ్,
గళోపసంరోధకరై స్తథాంకురై
ర్నిహన్త్యసూన్వ్యాధిరయం హిరోహిణీ. 50

తా. కంఠమధ్యమునందు వాతపిత్తకఫములుప్రకోపించి, మాంసరక్తములను జెరచి, కంఠమునడ్డగించెడియంకురముల గలుగంజేసిన దానిని రోహిణియనియెదరు, అది ప్రాణముల హరించునదిగనుండును.

### వాతజరోహిణీలక్షణము

జిహ్వాంసమన్తాద్భృశవేదనాస్తుమాంసాంకురాఃకంఠనిరోధనాయే,
సా రోహిణీ వాతకృతా ప్రదిష్టా వాతాత్మకోపద్రవగాఢయుక్తా.

తా. నాలుకయందంతట కడు వేదనాయుక్తమైన మాంసపు మొలకలు జనించి కంఠమునడ్డగించుటవలన కంఠస్తంభాది నానోపద్రవములతో గూడియుండిన వాత రోహిణియని యెరుంగవలయును.

పిత్తజరోహిణీలక్షణము

క్షిప్రోద్గమా క్షిప్రవిదాహపాకా తీవ్రజ్వరా పిత్తనిమిత్తజాతా,

తా. శీఘ్రముగ జనించి, దాహయుక్తమై శీఘ్రముగ పండుటవలన తీవ్రముగుజ్వరముతో గూడియుండిన పిత్తజరోహిణియని తెలియవలయును.

కఫరోహిణీలక్షణము

స్రోతోనిరోధిన్యపి మందపాకా స్థిరాంకురా యా కఫసంభవా సా. 52

తా. కంఠమార్గమునడ్డగించి చిరకాలమువిూద పండునదియై, కఠినమైన మొలకలుకలదై యుండిన కఫజరోహిణియని తెలియవలయును.

సన్నిపాతజరోహిణీలక్షణము

గంభీరపాకిన్యనివార్యవీర్యా త్రిదోషలింగా త్రితయోత్థితా సా,

తా. గంభీరపాకము (అనగా లోనచీము) గలదై, ఔషధోపచారములకసాధ్యమై, పూర్వోక్తత్రిదోషలక్షణములతో గూడియుండునది సన్నిపాతజరోహిణియని తెలియవలయును. ఇది తత్క్షణమునందే ప్రాణముల హరించును.

రక్తజరోహిణీలక్షణము

స్ఫోటైశ్చితా పిత్తసమానలింగాఽసాధ్యా ప్రదిష్టా రుధిరాత్మకాతు,

తా. బొబ్బలచే వ్యాపింపబడి, పిత్తరోహిణీ లక్షణములతో గూడియుండిన, రక్తజరోహిణియని తెలియవలయును. ఇది యసాధ్యము.

కంఠశాలూకలక్షణము

కోలాస్థిమాత్రః కఫసంభవో యో గ్రంథిర్గళే కంటకశూకభూతః,
ఖరస్థిరశ్శస్త్రనిపాతసాధ్యస్తం కంఠశాలూకమితి బ్రువంతి. 54

తా. కంఠమున కఫమువలన రేగుబిత్తు ప్రమాణముగల గ్రంధిగలిగి ముండ్లు, జలశూకములం వీనివలె వేదనను గలుగజేయుచు, గరగరగను, కఠినముగను నుండిన కంఠశాలూకమని తెలియవలయును. ఇది శస్త్రసాధ్యము.

అధిజిహ్వాలక్షణము

జిహ్వాగ్రరూపశ్శ్వయథుః కఫాత్తు జిహ్వోపరిష్టాదపి రక్తమిశ్రాత్,
జ్ఞేయో ధిజిహ్వః ఖలు రోగఏష వివర్జయేదాగతపాకమేనమ్. 55

తా. రక్తయుక్తకఫముచే నాలుకకుపైన వాపుగలిగి నాలుకకొనవలెనుండిన అధిజిహ్వకమని తెలియవలయును. ఇది పండిన యసాధ్యంబగును.

వలయలక్షణము

బలాసఏవాయతమున్నతం చ గ్రంథిం కరోత్యన్నగతిం నివార్య.
తం సర్వథైవాప్రతికార్యవీర్యం వివర్జనీయం వలయం వదన్తి. 56

తా. కఫముచే పొడవుగను, ఉబ్బుగనుండు గ్రంధిజనించి దానివలన అన్నములోనదిగక, సర్వోపచారములకు అసాధ్యముగాకయుండిన దానిని వలయమని తెలియవలయును. (గ్రంథాంతరమున ఘటసర్వమని చెప్పబడును.) ఇదియసాధ్యము.

బలాసలక్షణము

గళే తు శోథం కురుతః ప్రవృద్ధౌ శ్లేష్మానిలౌ శ్వాసరుజోపపన్నమ్,
మర్మచ్ఛిదం దుస్తరమేనమాహుర్బలాససంజ్ఞం నిపుణా వికారమ్. 57

తా. ప్రకోపించిన కఫవాతములు కంఠమునందు వాపును గలుగంజేయుట వలన నుబ్బసముకలిగి, కంఠమునొచ్చుచు, మర్మస్థానమును భేదింపుచుండిన బలాసమని తెలియవలయును. ఇది యసాధ్యము.

ఏకబృందలక్షణము

వృత్తోన్నతోంతశ్శ్వయథుస్సదాహస్సకండురోపాకమృదుర్గురుశ్చ,
నామ్నైకబృందః పరికీర్తితోసౌ వ్యాధిర్బలాసక్షతజప్రసూతః. 58

తా. కఫరక్తములు ప్రకోపించుటవలన కంఠమునందు గుండ్రముగను, ఉబ్బుగను, కొంచెము దాహయుక్తముగను, దురదతోగూడినదిగనుండు వాపు లోన జనించి, కొంచెముపండి, కొంచెముమృదువుగను, గురువుగనుండిన ఏకబృందమని తెలియవలయును.

బృందలక్షణము

సమున్నతం వృత్తమమందదాహం తీవ్రజ్వరం బృందముదాహరంతి,
తం చాపి పిత్తక్షతజప్రకోపాద్విద్యాత్సతోదం పవనాత్మకం తు. 59

తా. కంఠమునందు ఉబ్బుగను, గుండ్రముగను, తీవ్రదాహయుక్తముగను, జ్వరయుక్తముగనుండు వాపుగలిగిన బృందమని తెలియవలయును. ఇది వాతపిత్త ప్రకోపమువలన జనించి, పొడిచినటుల వేదనతోగూడియుండును. (ఇది బృందమునందు అవస్థాభేదము గలదిగనుండుటవలన వేరుగ జెప్పగూడదు.)

శతఘ్నీలక్షణము

వర్తిర్ఘనా కంఠనిరోధినీ యా చితాతిమాత్రం పిశితప్రరోహైః,

అనేకరుక్ప్రాణిహారీ త్రిదోషా జ్ఞేయా శతఘ్నీ తు శతఘ్నిరూపా.

తా. కంఠమునందు గుండ్రముగను, పొడవుగను, కఠినముగనుండువాపు జనించి కంఠమునడ్డగించు వావునందు మాంసపుమొలకలు తీవ్రముగ మిక్కిలి జనించి పోట్లు, తాపము, దురద మొదలగు అనేకవిధములైన బాధలతోగూడియుండుట, ముండ్లతోవ్యాపింపబడిన ఫిరంగివలెనుండుట ఇట్టిలక్షణములుగలది శతఘ్నియని తెలియవలయును. ఇది ప్రాణములహరింపజేయును.

గిలాయులక్షణము

గ్రంథిర్గళే త్వామలకాస్థిమాత్రస్థిరోల్పరుగ్యః కఫరక్తమూర్తిః.
సంలక్ష్యతేసక్తమివాశనం చ సశస్త్రసాధ్యస్తు గిలాయుసంజ్ఞః. 61

తా. కంఠమునందు కఫరక్తసంబంధమువలన ఉసిరికకాయవిత్తువంటి గ్రంధి జనించి, కఠినమై, స్వల్పవేదనగలిగి, యన్నము మ్రింగిన ధారాళముగ దిగకుండునటుల జేసిన గిలాయువని తెలియవలయును. ఇది శస్త్రసాధ్యము.

గళవిద్రధిలక్షణము

సర్వంగళంవ్యాప్యసముత్థితోయశ్శోథోరుజస్సంతిచయత్రసర్వాః,
ససర్వదోషో గళవిద్రధిస్తు తస్యైవ తుల్యాః ఖలు సర్వజస్య. 62

తా. త్రిదోషసంబంధమువలన వాపు కంఠమునందంతటజనించి నానావిధములగు బాధలతోగూడి త్రిదోషవిద్రధిలక్షణములతోగూడియుండిన గళవిద్రధియని తెలియవలయును.

గళౌఘలక్షణము

శోథో మహానన్నజలావరోధీ తీవ్రజ్వరో వాయుగతేర్నిహంతా,
కఫేనజాతోరుధిరాన్వితేన గళే గళౌఘః పరికీర్త్యతేసౌ. 63

తా. రక్తయుక్తకఫముచే కంఠమునందు ప్రబలముగువాపుజనించి యన్నోదకములలోన జననియ్యక తీవ్రజ్వరముతోగూడి వాతసంచారము లేకయుండిన దానిని గళౌఘమని తెలియవలయును.

స్వరఘ్నలక్షణము

యస్తామ్యమానశ్శ్వసితి ప్రసక్తం భిన్నస్వరశ్శుష్కవిముక్తకంఠః,
కఫోపదిగ్ధేష్వనిలాయనేషు జ్ఞేయస్సరోగశ్శ్వసనాత్స్వరఘ్నః. 64

తా. కంఠమునందు వాతమార్గము కఫముచేనడ్డగింపబడుచుండ, మాటిమాటికి నేత్రములకు చీకట్లుగ్రమ్మి, యొల్లపుడుశ్వాసమునువిడుచుట, స్వరము భేదించుట,

కంఠము రొండుట, ఉమ్మిమిఁగుటకు సాధ్యముకాక యుండుట ఇట్టి లక్షణములు గలది స్వరఘ్నమని తెలియవలయును. (ఇదివాతజన్యము.)

మాంసతానకలక్షణము

ప్రతానవాన్యశ్శ్వయథుస్సుకష్టో గళోపరోధం కురుతే క్రమేణ,
సమాంసతా నేతి బిభర్తి సంజ్ఞాంప్రాణప్రణుత్పర్వకృతో వికారః.

తా. కంఠమునందువాపుగలిగి క్రమముగ కంఠమును వ్యాపించి యడ్డగించి, మిక్కిలి కష్టమునుగలుగంజేయుచు ప్రాణములనపహరించునది మాంసతానకమని తెలియవలయును. (ఇది త్రిదోషజనితము.)

విదారీలక్షణము

సదాహతోదం శ్వయథుం సుతీవ్రమంతర్గళే పూతివిశీర్ణమాంసమ్,
పిత్తేన విద్యాద్వదనే విదారీం పార్శ్వేవిశేషాత్సతు యేన శేతే. 66

తా. కంఠమునందు పిత్తప్రకోపముచే తీవ్రమగువాపుగలిగి దాహము, పోట్లు వీనితోఁగూడి దుర్గంధయుక్తమగు మాంసము వీడుచుండిన దానిని విదారియని తెలియవలయును. ఇదిపరుండెడి పార్శ్వమునందే విశేషముగ జనించును.

వాతజసర్వసరలక్షణము

స్ఫోటైస్సతోదైః ర్వదనంసమంతాద్యస్యాచితంసర్వసరస్సవాతాత్,

తా. వాతసంబంధమువలన నోటియందంతట బొబ్బలుజనించి, సూదులతోఁ బొడిచినతెరంగున పోట్లుగలిగియుండిన సర్వసరమని తెలియవలయును. అనగా ముఖపాకము.

పైత్తికసర్వసరలక్షణము

రక్తైస్సదాహైః పిటకైస్సపీతైర్యస్యాచితం చాపి సపిత్తకోపాత్. 67

తా. పిత్తప్రకోపమువలన నోటియందెఱ్ఱగ లేక పచ్చగనుండు కురుపులం జనించి మంటతోఁగూడియుండిన పైత్తికసర్వసరమని తెలియవలయును.

కఫజసర్వసరలక్షణము

అవేదనైః కండుయుతైస్సవర్ణైర్యస్యాచితం చాపి సవైకఫేన,

తా. కఫప్రకోపమువలన స్వల్పవేదన, దురద, చర్మముతో సమానవర్ణము గల బొబ్బలు నోటిలోవ్యాపించియుండిన కఫజసర్వసరమని యెఱుంగవలయును. ఇదియు అస్యపాకము.

## అసాధ్యముఖరోగములు

ఓష్ఠప్రకోపేన వర్జ్యాస్స్యుర్మాంసరక్తప్రకోపజాః. 68
దన్తమూలే తు వర్జ్యా తు త్రిలింగగతిసాపిరా,
దన్తేషు చ న సిధ్యంతి శ్యావదాలనభంజనాః. 69
జిహ్వాగతేష్వలాసశ్చ తాలవ్యేష్వర్బుదం తథా,
స్వరఘ్నో వలయో బృందో బలాసశ్చ విదారికా. 70
గలౌఘో మాంసతానశ్చ శతఘ్నీ రోహిణీ గళే,
అసాధ్యాః కీర్తితా హ్యేతే రోగా నవ దశైవ తు. 71
తేషు చాపి క్రియాం వైద్యః ప్రత్యాఖ్యాయ సమాచరేత్,

తా. ఓష్ఠరోగములలో మాంసజ, రక్తజ, త్రిదోషజములన 3 రోగములు; దంతమూలరోగములలో సన్నిపాతజము, నాడీసాపిరములన ౨ రోగములు; దంతరోగములలో శ్యావ, దాలన, భంజనములన 3 రోగములు; జిహ్వారోగములలో అలాసమను ౧ రోగము; తాలుగతరోగములలో అర్బుదమను ౧ రోగము; కంఠగతరోగములలో సర్వఘ్ను, వలయ, బృంద, బలాస, విదారిక, గళౌఘమాంసతానక, శతఘ్ని, రోహిణీలను ౯ రోగములు ఇటుల నీ ౧౯ రోగములు అసాధ్యములుగాన వానికి చికిత్సజేయుకాలమున కుదురుట దుర్లభమని చెప్పి వైద్యుడు ఔషధమునివ్వవలయును.

## వాతజోష్ఠరోగమునకు తైలాదిలేపము

తైలం ఘృతం సర్జరసం ససిక్థం రాస్నాగుడం సైంధవగైరికే చ. 72
పక్త్వా సమాంశం దశనచ్ఛదాక్తంత్వగ్భేదహాంత్ప్రవ్రణోపణం చ,

తా. నూనె, నెయ్యి, సర్జరసము, మైనము, రాస్న, బెల్లము, సైంధవలవణము, కావిరాయి వీనిని సమాంశములుగ కాచి పెదవులపై లేపనముజేసిన పెదవి పగుళ్లు మానును.

## రాళాది లేపనము

రాళేనసిక్థేనగుడేన పక్వం తైలం ఘృతం వా వినిహన్తి లేపాత్.73
త్వక్భేదపారుష్యరుజోఽధరస్య పూయాస్రసంస్రావమపిప్రహాణ్యాత్,

తా. గుగ్గిలము, మైనము, బెల్లము వీనితో నూనెగాని నెయ్యిగాని కలిపి కాచి లేపనముజేసిన చర్మపీడ, గరగరలాడుట, పోట్లు, చీము, రక్తముకారుట ఇవి నివర్తించును.

### పిత్తోష్ఠరోగచికిత్స

వేధం సిరాణాం వమనం విరేకం తిక్తస్య పానం రసభోజనం చ. 74
శీతాః ప్రదేహాః పరిషేచనం చ పిత్తోపసృష్టేష్వధరేషు కుర్యాత్,

తా. పిత్తవికారముగల పెదవి రోగములయందు సిరావేధన, వమనము, విరేచనము, కటురసపానము, మాంసరసయుక్తభోజనము, శీతకరలేపనము, పిత్తహరములగు ఔషధ కషాయములయొక్క పరిషేచనము మొదలగు నుపచారములం జేయవలయును.

### సర్వోష్ఠరోగసామాన్యచికిత్స

ఓష్ఠరోగేష్వశేషేషు దృష్ట్వాదోషముపాచరేత్. 75
తేషు వ్రణత్వం యాతేషు వ్రణవత్సముపాచరేత్,

తా. సకలఓష్ఠరోగములయందు దోషానుగుణ్యమగుచికిత్సలను లేక వ్రణమై యుండిన వ్రణచికిత్సలను జేయవలయును.

### శీతాదరోగచికిత్స

శీతాదే హృతరక్తే తు తోయం నాగరసర్షపైః. 76
నిఃక్వాథ్య త్రిఫలాం వాపి కుర్యాద్గండూషధారణమ్,

తా. శీతాదమను దంతరోగమునందు (మునుపటి తెరంగున) రక్తమునుదీసి శొంఠి, తెల్లావాలు వీనికషాయముతోగాని, త్రిఫలకషాయముతోగాని గండూషము చేయవలయును.

### కాసీసాదిచూర్ణము

కాసీసలోధ్రకృష్ణామనశ్శిలాసప్రియంగుతేజోహ్వా. 77
ఏషాం చూర్ణం మధుయుక్శీతాదే పూతిమాంసహరమ్,
తైలం ఘృతం వా వాతఘ్నం శీతాదే సంప్రశస్యతే. 78

తా. అన్నభేది, లొద్దుగ, పిప్పళ్లు, మణిశిల, ప్రేంఖణము, వెన్క్డడు (మాల్కంగిణి) వీనిని చూర్ణించి తేనెగలిపి లేపనముజేసినను లేక వాతహరతైలములను గాని, ఘృతములనుగాని లేపనముజేసినను దుర్గంధము గలిగి శిథిలమైయుండు మాంసమును హరించును.

### దంతపుప్పుటచికిత్స

లోధ్రం పతంగం మధుకం లాక్షాచూర్ణైర్మధుప్లుతైః,
గండూషే క్షీరిణో యోజ్యాస్సక్షౌద్రఘృతశర్కరాః. 79

తా. లొద్దుగ, రసకర్పూరము, అతిమధురము, లక్క వీనినిచూర్ణించి తేనెతో కలిపిగాని మఱ్ఱి, అత్తి, రావి, అంబాళము, కలజువ్వి వీనిపట్టలచూర్ణములో తేనె, నెయ్యి, చక్కెరకలిపిగాని * గండూషముచేసిన దంతవేష్టరోగము నివర్తించును.

జీరకాదిచూర్ణము

జరణలవణపథ్యాశాల్మలీకంటకానామనుదినమనుఘృష్టం దన్తమూలేషు చూర్ణమ్,
వ్రణదరణరుగస్రస్రావచాంచల్యశోథానపయనతి వివస్వానంధకారానివాహ. 80

తా. జీలకఱ్ఱ, ఉప్పు, కరక, బూరగముండ్లు వీనిని సమాంశములుగ చూర్ణము చేసి దానితో ప్రతిదినము దంతములతోమిన సూర్యుడంధకారమును నివర్తింపజేయు తెరంగున దంతవ్రణము, దంతపుపగుళ్లు, పోట్లు, రక్తస్రావము దంతచలనము, వాపు వీనిని శీఘ్రముగ నివర్తింపజేయును.

కణాదిచూర్ణము

కణాసింధూత్థజరణ చూర్ణం తూర్ణం వ్యపోహతి.
ఘర్షణాద్దన్తచాంచల్య వ్యథాశోథాస్రసంస్రవాన్. 81

తా. పిప్పళ్లు, సైంధవలవణము, జీలకఱ్ఱ వీనిని చూర్ణముచేసి దంతములను తోమిన దంతములు కదులుట, పోట్లు, వాపు, రక్తస్రావము ఇవి నివర్తించును.

భద్రముస్తాది వటుకములు

భద్రముస్తాభయావ్యోమవిడంగారిష్టపల్లవైః,
గోమూత్రపిష్టైర్గుటికాం ఛాయాశుష్కాం ప్రకల్పయేత్. 82

తాని దధ్యాన్ముఖే నిశ్యాం చలదన్తాతురో నరః,
నాతఃపరతరం కించిచ్చలదన్తస్య భేషజమ్. 83

తా. భద్రముస్తలు, కరక్కాయ, శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, వేపాకు వీనిని గోమూత్రముతో నూరి మాత్రలుచేసి నీడనుఎండించి, రాత్రులయందు నోటిలోవేసుకొనిపరుండిన దంతములుగట్టియగును. దంతచలనమునకు దీనికన్న శ్రేష్ఠమగు ఔషధము మరియొకటిలేదు.

సౌషిరచికిత్స

సౌషిరే ధృతరక్తే తు లోధ్రముస్తారసాంజనైః,

* గండూషమనగా పుక్కిట బట్టుట.

సక్షౌద్రైశ్శస్యతే లేపో గండూషే క్షీరిణో హితాః. 84

తా. సౌషిరమనురోగమునందు రక్తమునుదీసి లొద్దుగ, తుంగముస్తలు, రసాంజనము వీనిచూర్ణమును తేనెలోకలిపి లేపనముచేసినను లేక క్షీరవృక్ష కషాయముతో గండూషమొనర్చినను హితముగనుండును.

## వైదర్భచికిత్స

శస్త్రేణోత్కృత్య వైదర్భం దన్తమూలాని శోధయేత్,
తతః క్షారం ప్రయుంజీత క్రియాస్సర్వాశ్చ శీతలాః. 85

తా. వైదర్భమును, దంతమూలరోగమును శస్త్రముతో భేదించి రక్తస్రావమును జేయించుటయేగాక, క్షారలేపనమును సమస్తమగు శీతకరలేపనములను జేయవలయును.

## అధిమాంసకచికిత్స

ఛిత్వాధిమాంసం సక్షౌద్రైరేతైశ్చూర్ణైరుపాచరేత్,
వచా తేజోవతీ పాఠా సర్జికాయావశూకజైః. 86
క్షౌద్రం ద్వితీయం పిప్పల్యా కబలే చాత్ర కీర్తితమ్,
పటోలనింబత్రిఫలాకషాయశ్చాత్ర ధావనః. 87

తా. అధిమాంసమను దంతమూలరోగమునుఛేదించి దానిపై వస, వెక్కుడుతీగ, విషబొద్ది, సర్జక్షారము, యవక్షారము, వీనికల్కములో తేనెకలిపిగాని లేక పిప్పలిచూర్ణములో తేనెకలిపిగాని నోటియందు ధరించవలయును. మరియు చేదుపొట్ల, వేప, త్రిఫలములు వీనికషాయముచే అధిమాంసమును గడుగవలయును.

## దంతవిద్రధికి సామాన్యచికిత్స

విద్రధ్యుక్తం చ విధివద్విదధ్యాద్దన్తవిద్రధౌ,
శస్త్రకర్మభిషక్తత్ర కుశలో నైవ కారయేత్. 88

తా. దంతవిద్రధియందు సామాన్యవిద్రధియొక్క సర్వచికిత్సలంజేయవలయునేగాని శస్త్రకర్మను జేయగూడదు.

## క్రిమిదంతచికిత్స

నీలీవాయసజంఘాకటుతుంబీమూలమేకైకమపి,
సంచూర్ణ్య దశనవిధృతం దశనక్రిమిపాతనంప్రాహుః. 89

తా. నీలి, వెలమసంధి, చేదుసార వీనివేళ్లను ప్రత్యేకముగచూర్ణించి దంతములయందునిచిన దంతక్రిములు నివర్తించును.

### శారిబాపర్ణధారణము

పిష్ట్వా చ శారిబాపర్ణం దృఢం దన్తేషు ధారయేత్,
పతంతి దన్తకీటాశ్చ చాంచల్యం హరతి క్షణాత్. 90

తా. తెల్లసుగంధపాలఆకునునూరి పండ్లయందదిమివుంచుకొనిన దంతకీటకము లూడిపడి దంతములు గట్టిపడును.

### కాసీసాదిగుటికలు

కాసీసంహింగుసౌరాష్ట్రీదేవదారుసమంజలైః,
గుటికాం ధారయేద్దన్తక్రిమిశూలహరాం పరామ్. 91

తా. అన్నభేది, ఇంగువ, తువరిమన్ను, దేవదారు వీనిని సమభాగములుగ నుదకముతోనూరి మాత్రలుజేసి దంతములపైనునిచిన క్రిమిదంతశూల హరించును.

### శర్కరాచికిత్స

అచ్ఛిందన్దంతమూలాని శర్కరాముద్ధరేద్భిషక్,
లాక్షాచూర్ణైర్మధుయుతైస్తదస్తాం ప్రతిసారయేత్. 92

తా. దంతమూలములయందు గంటుపడి నొప్పిజనించకుండునటుల దంతములపైనుండు శర్కర(మలము)నుగీచితీసి, లక్కచూర్ణమును తేనెలోకలిపి మెల్లగ రుద్దవలయును.

### కపాలికాచికిత్స

దన్తహర్షక్రియాం చాత్ర కుర్యాన్నిరవశేషతః,
కపాలికాకృచ్ఛ్రితమా తత్రాప్యేషా క్రియా హితా. 93

తా. దంతశర్కరయందును, కపాలికయనుదంతరోగమునందును దంతహర్షమునకై జెప్పబడిన సర్వచికిత్సలజేయవలయును.

### నాడీవ్రణచికిత్స

ఛిత్త్వా మాంసాని శస్త్రేణ భవేయుః పరితో యది,
ఉద్ధృత్య చ దహేచ్చాపి క్షారేణ జ్వలనేన వా. 94

తా. నాడీవ్రణమునందు చుట్టుమాంసముండిన శస్త్రముతోఛేదించి క్షారముతోగాని, అగ్నితోగాని కాల్చవలయును.

### దంతరోగములకులాక్షాదితైలము

తైలం లాక్షారసం క్షీరం పృథక్ప్రస్థమితం పచేత్,
ద్రవ్యైః పలమితైరేతైః క్వాథైశ్చాపి చతుర్గుణైః. 95

లోధ్రకట్ఫలమంజిష్ఠాపద్మకేసరపద్మకైః,
చందనోత్పలయష్ట్యాహ్వైస్తైలం వదనే ధృతమ్. 96
దాలనం దన్తచాలం చ దన్తమోక్షం కపాలికామ్,
శీతాదం పూతివక్త్రం చాప్యరుచిం విరసాస్యతామ్. 97
హన్యాదాశు గదానేతాన్కుర్యాద్దన్తానపి స్థిరాన్,
లాక్షాదికమిదం తైలం దన్తరోగేషు పూజితమ్. 98

తా. నూనె, లక్కరసము, పాలు వీనిని ప్రత్యేకము ౧ ప్రస్థము గ్రహించి, అందు లొద్దుగ, కవ్వగుమ్ముడు, మంజిష్ఠ, తామరకింజల్కములు, పద్మకము, చందనము, నల్లకలువగడ్డ, అతిమధురము వీనికషాయమును నూనెకు నాలుగింతలు గలిపి వీటికల్కమునుజేర్చి చిక్కగతైలముకాచి, నోటియందునిలిచికొనిన పండ్లుపగులుట, పండ్లుకదలుట, అకాలమునదంతములూడుట, కపాలికము, శీతాదము, పూతివక్త్రము, అరుచి, నోటివిరసత్వము వీనిని శీఘ్రముగ నివర్తింపజేయుటయేగాక దంతముల గట్టిపరచును.

## కుష్ఠాదిచూర్ణము

కుష్ఠం దార్వీలోధ్రమబ్దంసమంగా పాఠా తిక్తా తేజనీ పీతికా చ,
చూర్ణం శస్తం ఘర్షణే తద్ద్విజానాం రక్తస్రావం హన్తికండూంరుజంచ.

తా. చంగల్వకోష్ఠు, మానిపసపు, లొద్దుగ, తుంగముస్తలు, మంజిష్ఠ, అగళు శొంఠి, (లేక చిరుబొద్ది) కటుకరోహిణి, చాగ, పసపు వీనిచూర్ణముతో దంతములు తోమిన, రక్తస్రావము, దురద, పోట్లు ఇవిహరించును.

## జాతీపత్రాదిచూర్ణము

జాతీపత్రపునర్నవాగజకణాఃకోరంటకుష్ఠేవచామ్,
శుంఠీదీప్యహరీతకీతిలమిదంశ్లక్ష్ణంసమం చూర్ణయేత్. 100
తచ్చూర్ణం వదనేధృతం విజయతే దౌర్గంధ్యదన్తవ్యథామ్,
చాంచల్యం చ తథా వ్రణశ్వయథురుక్కండూక్రిమివ్యాపదః. 101

తా. జాజియాకులు, గలిజేరు, గజపిప్పలి, గోరింట, చెంగల్వకోష్ఠు, వస, శొంఠి, ఓమము, కరక్కాయ, నువ్వులు వీనిని సమభాగములుగచూర్ణించి నోటిలో ధరించిన నోటిదుర్గంధము, దంతశూల, దంతచలనము, దంతవ్రణము, వాపు, పోట్లు, దురద, పురుగులు ఇవియన్నియు నివర్తించును.

## దంతరోగములయందుపథ్యములు

ఫలాన్యమ్లాని శీతాంబురూక్షాన్నందన్తధావనమ్,

తథాపి కఠినం భక్ష్యం దన్తరోగీ వివర్జయేత్. 102

తా. పుల్లనిఫలములు చల్లనీళ్లు, దూష్యాన్నము, దంతధావనము, కఠినపదార్థముల భక్షించుట వీనిని దంతరోగివిడువవలయును.

ఉపజిహ్వికకు వ్యోషాదిచూర్ణము

వ్యోషక్షారా భయా వహ్నిచూర్ణమేతత్ప్రఘర్షయేత్,
ఉపజిహ్వికశాంత్యర్థమేభిస్తైలం చ పాచయేత్. 103
గృహధూమారనాళేన క్వాథం సమధు సైంధవమ్,
పాణినా మర్దయేచ్చాస్యేత్యూపజిహ్వా ప్రశామ్యతి. 104

తా. త్రికటుకములు, యవక్షారము, కరక్కాయలు, చిత్రమూలము వీని చూర్ణముతో తోమినను, మరియు పైద్రవ్యములచే తైలముకాచి గండూషము జేసినను, మరియు కరుధూపమునుకలిలో కాచి, అందు తేనె, సైంధవలవణము కలిపి వ్రేలితో మర్దనజేసినను ఉపజిహ్వకారోగము శాంతనిబొందును.

కంఠశుండ్యాదిచికిత్స

తుండికేర్యాం ధ్రువేకూర్మే సంఘాతే తాలుపుప్పుటే,
ఏషఏవ విధిః కార్యో విశేషాచ్ఛస్త్రకర్మణి. 105

తా. తుండికేరి, ధ్రువము, కూర్మము, సంఘాతము, తాలుపుప్పుటము వీనియందు శస్త్రకర్మలనుజేయునెడ క్రిందజెప్పబడు చికిత్సల మిక్కిలిగజేయవలయును.

తాలుశోష తాలుపాకచికిత్స

స్నేహస్వేదా తాలుశోషే. విధిశ్చానిలనాశనః,
తాలుపాకే తు కర్తవ్యం విధానం పిత్తనాశనమ్. 106

తా. తాలుశోషమునందు స్వేదములను, స్నేహములను, వాతనాశకరౌషధసేవనలను జేయవలయును. మరియు తాలుపాకమునందు పిత్తనాశకరచికిత్సలను జేయవలయును.

గళశుండిఛేదనవిధి

అంగుష్ఠాంగులిసందంశేనాకృష్య గళశుండికామ్,
ఛేదయేన్మండలాగ్రేణ జిహ్వోపరి తు సంస్థితామ్. 107

తా. నాలుకపైజనించియుండు గళశుండిని అంగుష్ఠాంగుళములతో పట్టి యీడ్చి మండలాగ్రమను శస్త్రముతో ఛేదించవలయును.

పిప్పల్యతివిషాకుష్ఠవచామరిచనాగరైః,
క్షౌద్రయుక్తైస్సలవణైస్తతస్తాం. ప్రతిసారయేత్. 108

తా. పిప్పలి, అతివస, చెంగల్వకోష్ఠు, వస, మిరియాలు, శొంఠి వీనిని చూర్ణించి, తేనె, సైంధవము కలిపి వేలితో రుద్దిన గళశుండి నివర్తించును.

రోహిణీసామాన్యచికిత్స

రోహిణీనాం తు సాధ్యానాం హితం శోణితమోక్షణమ్,
వమనం ధూమపానం చ గండూషో నస్యకర్మ చ. 109

తా. పంచరోహిణులలో సాధ్యంబగు దానియందు రక్తముదీసి వమనము, ధూమపానము, గండూషము, నస్యకర్మ వీనిని చేయవలయును.

వాతజరోహిణీచికిత్స

వాతజాంతుహృతేరక్తే లవణైః ప్రతిసారయేత్,
సుఖోష్ణాన్స్నేహగండూషాన్ధారయేచ్చాప్యభీక్ష్ణశః. 110

తా. వాతజరోహిణియందు రక్తముదీసి సైంధవలవణముతో రుద్దవలయును. మరియు సుఖోష్ణముగనుండు స్నేహగండూషముల మాటిమాటికి ధరించవలయును.

పిత్తజరోహిణీచికిత్స

విస్రావ్య పిత్తసంభూతాం సితాక్షౌద్రప్రియంగుభిః,
ఘర్షయేత్కబలో ద్రాక్షాపరూషైః క్వథితైర్హితః. 111

తా. పిత్తజరోహిణీ రోగమునందు రక్తస్రావమునుజేయించి, చక్కెర, తేనె వీనిలో ప్రేంకణపు చూర్ణమునుగలిపి రుద్ది, ద్రాక్ష, ఖర్జూరపుపండు వీనికషాయమును నోటియందు ధరించవలయును.

రక్తజరోహిణీచికిత్స

పిత్తవత్సాధయేద్వైద్యో రోహిణీం రక్తసంభవామ్,
తా. రక్తజరోహిణీ రోగమునందు పిత్తజరోహిణీ చికిత్సనే చేయవలయును.

కంఠశాలూకచికిత్స

విస్రావ్య కంఠశాలూకం సాధయేత్తుండికేరివత్. 112
ఏకకాలే యవాన్నం చ భుంజీత స్నిగ్ధమల్పశః,

తా. కంఠశాలూక రోగమునందు రక్తస్రావంబొనర్చి తుండికేరి తెరంగున చికిత్సను జేయవలయును. మరియు దీనియందు కొంచెము ఘృతముతో జేర్చబడిన యవాన్నము నొకపూట భక్షించవలయును.

కఫజరోహిణీచికిత్స

అంగారధూమకటుకైః కఫజాం ప్రతిసారయేత్. 113

శ్వేతావిడంగదన్తీషు తైలం సిద్ధం ససైంధవమ్,
నస్యకర్మణి దాతవ్యం కబలం చ కఫోచ్ఛ్రియే. 114

తా. కఫజరోహిణీ రోగమునందు కరిధూపమును కటుకరోహిణితో చేర్చి రుద్ద వలయును; తెల్లతులసి, వాయువిడంగములు, దంతివేరు వీనితో తైలము కాచి, అందు సైంధవలవణమును గలిపి నస్యమును నోటియందు ధారణమును జేయవలయును.

### ఆధిజిహ్వ, ఏకబృంద, బృంద, గిలాయు, గళవిద్రధి చికిత్స

ఉపజిహ్వాకవచ్చాపి సాధయేదధిజిహ్వకమ్,
ఏకబృందం తు విస్రావ్య విధిం శోధనమాచరేత్. 115
ఏకబృందమివ ప్రాయో బృందం చ సముపాచరేత్,
గిలాయుశ్చాపి యో వ్యాధిస్తం చ శస్త్రేణ సాధయేత్. 116
అమర్మస్థం తు సంపక్వం ఛేదయేద్గళవిద్రధిమ్,

తా. అధిజిహ్వక రోగమునందు ఉపజిహ్వక రోగచికిత్సను జేయవలయును. ఏకబృందరోగమునందు రక్తమునుదీసి, పిదప శోధనవిధిని జేయువలయును. మరియు బృందరోగమునందు ఏకబృందచికిత్సను జేయవలయును. మరియు గిలాయువునందు శస్త్రచికిత్సనొనర్చవలయును. గళవిద్రధి మర్మరహిత స్థలములయందు జనించి పండిన దానిని ఛేదించవలయును.

### సర్వసర సామాన్యచికిత్స

వాతాత్సర్వసరం చూర్ణైర్లవణైః ప్రతిసారయేత్. 117
తైలం వాతహరైస్సిద్ధం హితం కబలనస్యయోః,
పిత్తాత్మకే సర్వసరే శుద్ధకాయస్య దేహినః. 118
సర్వః పిత్తహరః కార్యో విధిర్మధురశీతలః,
ప్రతిసారణగండూష ధూమసంశోధనాని చ. 119
కఫాత్మకే సర్వసరే క్రమం కుర్యాత్కఫాపహమ్,

తా. వాతజసర్వసరమనగా వాతజ ముఖపాకమునందు, దానినుప్పుతో రుద్ది, వాతనాశకరౌషధములతో సిద్ధముజేయబడిన తైలముచే గండూషము, నస్యము వీనిని జేయవలయును. పిత్తజసర్వసరమునందు మొదట విరేచనమునకిచ్చి, పిదప పిత్తనివర్తకములగు సర్వమధురశీతకరచికిత్సలజేయువలయును. మరియు కఫజసర్వసరమునందు ప్రతిసారణగండూషధూమపానశోధనములను, సర్వకఫహర చికిత్సలను జేయువలయును.

### కళరోగచికిత్స

కంఠరోగేష్వసృఙ్మోక్షః తీక్ష్ణైర్నస్యాదికర్మభిః. 120
చికిత్సకశ్చికిత్సాం తు కుశలోత్ర సమాచరేత్,

తా. గళరోగమునందు రక్తస్రావంబొనర్చి, తీక్ష్ణకరౌషధములనిచ్చి, నస్యాది కర్మలజేయవలయును.

### మృద్వీకాదిచూర్ణము

మృద్వీకాకటుకావ్యోష దార్వీత్వక్త్రిఫలాఘనమ్. 121
పాఠారసాంజనం దూర్వా తేజోహ్వాతిసుచూర్ణితమ్,
క్షౌద్రయుక్తం విధాతవ్యం గళరోగే మహౌషధమ్. 122

తా. ద్రాక్షపండు, కటుకరోహిణి, త్రికటుకములు, మానిపసపు, లవంగపట్ట, త్రిఫలములు, తుంగముస్తలు, విషబొద్ది, రసాంజనము, గరిక, వెక్కుడుతీగె వీని చూర్ణమునందు తేనెకలిపి గళమునందు లేపనముజేయవలయును.

### ముఖపాకసామాన్యచికిత్స

ముఖపాకే సిరావేధశ్శిరసశ్చ విరేచనమ్,
మధుమూత్రఘృతక్షీరైశ్శీతైశ్చ కబలగ్రహాః. 123

తా. సర్వముఖపాకములయందు సిరావేధనము, శిరోవిరేచనము వీనినిజేసి, తేనె, గోమూత్రము, నెయ్యి, పాలు, శీతకరపదార్థములు వీనికల్కమును ముఖమునందు ధరింపవలయును.

పంచవల్కలజః క్వాథస్త్రిఫలాసంభవోథవా,
ముఖపాకే ప్రయోక్తవ్యస్సక్షౌద్రో ముఖధావనే. 124

తా. పంచవల్కల కషాయములోగాని, త్రిఫలకషాయములోగాని తేనె కలిపి నోరునుగడిగిన ముఖపాకము హరించును.

### యష్టీమధ్వాదితైలము

యష్టీమధుపలమేకం త్రింశన్నీలోత్పలస్య తైలస్య,
ప్రస్థం తద్ద్విగుణపయో విధినా పక్వం తు నస్యేన. 125
నిశివదనస్య స్రావం క్షపయతి గాత్రస్య దోషసంఘాతమ్,
వపుషస్స్వర్ణసమానంవర్ణంతనుతేఽపిజస్తూనామ్. 126

తా. అతిమధురము ౧ పలము, నల్లకలువగడ్డలు ౩౦ పలములు, నూనె ౧ ప్రస్థము, పాలు ౨ ప్రస్థములు ఇటుల వీనినన్నిటిని నేకముగచేర్చి,మందాగ్నిలో

తైలముగాచి, రాత్రులయందు నస్యముచేయించిన ముఖస్రావము, శరీరమునందు లేపనముచేసిన శరీరదోషము నివర్తించి, బంగారువంటి కాంతిగలుగును.

### ఖదిరాదిగుటికలు

*ఖదిరస్య తులాం తోయ ద్రోణే పక్త్వాష్టశేషితే,
జాతికోశేందుపూగైశ్చ చాతుర్జాతమృగాండజైః. 127
పృథక్కర్షమితైః పిష్టైర్మేళయిత్వా చణోపమాః,
వటీకార్యాముఖే ధార్యా సానిహన్త్యఖిలాన్ గదాన్. 128
జిహ్వోష్ఠదంతవదన గళతాలు సముద్భవాన్,

తా. ౧౦౦ పలముల చంద్రపట్టనుదంచి, ద్రోణప్రమాణోదకమునం దునిచి ౮వ పాలు మిగులునటుల కషాయముకాచి వడియగట్టి, అందు, జాజికాయ, పచ్చకర్పూరము, మంచివక్కలు, దాల్చిని, ఏలకులు, లవంగపత్రి, నాగకేసరములు, కస్తూరి వీనినిచూర్ణించి ప్రత్యేకము ౧ కర్షముచొప్పున గలిపి, సెనగగింజలంతమాత్రలుచేసి నోటియందుంచుకొని, దానిరసమును మ్రింగుచుండిన సర్వముఖరోగములు, జిహ్వారోగములు, పెదవిరోగములు, దంతరోగములు లోదవడరోగము ఇవి నివర్తించును.

### ముఖరోగమునందుపథ్యములు

స్వేదో విరేకో వమనం గండూషః ప్రతిసారణమ్. 129
కబలోసృక్స్రుతిర్నస్యం ధూమశ్శస్త్రాగ్నికర్మణీ,
తృణధాన్యం యవా ముద్గా కుళుత్థా జాంగలో రసః. 130
బహుపుత్రీ కారవేల్లం పటోలం బాలమూలకమ్,
కర్పూరనీరే తాంబూలం తప్తాం బుఖదిరోద్ధృతమ్. 131
కటుతిక్తౌ చ వర్గోయం మిత్రం స్యాన్ముఖరోగిణామ్,

తా. చమటదీయుట, విరేచనము, వమనము, గండూషము, ప్రతిసారణము, కబలధారణము, రక్తమోక్షణము, నస్యము, ధూమపానము, శస్త్రకర్మ, అగ్నికర్మ, దూసరిబియ్యము లేక వెదురుబియ్యము, యవలు, పెసలు, ఉలవలు, జాంగలమాంసము, నేలఉశిరిక, కాకర, చల్లపిల్లగడ్డలు, చేదుపొట్ల, లేతముల్లంగి, పచ్చకర్పూరము,

* ఖదిరకషాయమును వడియగట్టి తిరిగి కాచి రసక్రియగాజేసి అందు జాజికాయ మొదలగువాని చూర్ణమునుచేర్చి వటికలజేయవలెను. లేనిచో గషాయముగానుండిన మాత్రలుకావు.

నీళ్లు, తాంబూలము, చంద్రకషాయము, కారము, చేదుగల రసములు ఇవి ముఖరోగములయందు పథ్యములని తెలియవలయును.

—అపథ్యములు—

దన్తకాష్ఠం స్నానమమ్లం మత్స్యమానూపమామిషమ్. 132
దధి క్షీరం గుడం మాషం రూక్షాన్నం కఠినాసనమ్,
అధోముఖేన శయనం గుర్వభిష్యందకారి చ. 133
ముఖరోగేషు సర్వేషు దివానిద్రాం చ వర్జయేత్,

తా. దంతకాష్ఠము, స్నానము, పులుసు, మత్స్యములు, అనూపజంతుమాంసము, పెరుగు, పాలు, బెల్లము, మినుములు, రూక్షాన్నము, కఠినాసనము, బోరగిలపరుండుట, గుర్వన్నము, పెరుగు మొదలగు నభిష్యందివస్తువులు, పగటినిద్ర వీనిని ముఖరోగమునందు వర్జించవలయును.

---

# కర్ణరోగప్రకరణమ్.

—కర్ణరోగ కర్మవిపాకము—

మాతాపితృగురూణాం చ దేవబ్రాహ్మణయోస్తథా,
శృణోతి నిందాం బుధ్యా యః కర్ణాభ్యాం తస్య శోణితమ్. 1
పూయం చైవ స్రవత్యస్య శాన్తిః కృచ్ఛ్రచతుష్టయాత్,
హిరణ్యారక్తవస్త్రాణాం దానాద్బ్రాహ్మణభోజనాత్. 2
జపాద్ధోమాచ్చ భవతి సౌరమంత్రేణ శక్తితః,

తా. తల్లి, తండ్రి, గురువు, దేవతలు, బ్రాహ్మణులు మొదలగువారి నిందను బుద్ధిపూర్వకముగ వినుచుండినవానికి చెవియందు రక్తము, చీము స్రవించును. తన్నివృత్తికై ౪ ప్రాజాపత్యజపిమ ప్రాయశ్చిత్తములంజేసి, బంగారము, ఎఱ్ఱనివస్త్రములను దానముచేయుటయేగాక, బ్రాహ్మణసంతర్పణమును, శక్త్యనుగుణ్యముగ సౌరమంత్రజపహోమమును జేయవలయును.

—కర్ణరోగ భేదములు—

కర్ణశూలః ప్రణాదశ్చ బాధిర్యం క్ష్వేడఏవ చ. 3
కర్ణస్రావః కర్ణకండూః కర్ణగూథస్తథైవ చ,
ప్రతినాహో జన్తుకర్ణో విద్రధిర్ద్వివిధస్తథా. 4

కర్ణపాకః పూతికర్ణ స్తథా వార్శశ్చతుర్విధః,
తథార్బుదం సప్తవిధం శోఫశ్చాపి చతుర్విధః. 5
ఏతే కర్ణగతా రోగా అష్టావింశతిరీరితాః,

తా. కర్ణశూల, కర్ణనాదము, బాధిర్యము, క్ష్వేడము, కర్ణస్రావము, కర్ణకండు, కర్ణగూథము, ప్రతినాహము, జంతుకర్ణము, ద్వివిధవిద్రధి, కర్ణపాకము, పూతికర్ణము, చతుర్విధకర్ణార్శము, సప్తప్రకారఅర్బుదము, చతుర్విధశోఫ ఇటుల కర్ణగతరోగములు ౨౮ విధములని తెలియవలయును.

కర్ణశూలలక్షణము

సమీరణశ్శ్రోత్రగతోఽన్యథా చరన్ సమంతతశ్శూలమతీవకర్ణయోః,
కరోతి దోషైశ్చ యథాస్వమావృతస్సకర్ణశూలః కథితో దురాసదః,

తా. కర్ణగతవాతము ప్రకోపించి, ప్రతిలోమముగ నంతటసంచరింపుచు, "శ్లో. ఏకః ప్రకుపితో దోషస్సర్వానేవప్రకోపయేత్" అను న్యాయానుసరణి కఫపిత్తరక్తములజెరచి, వానితోగూడి తమతమబలానుగుణ్యముగ "శ్లో. మూర్ఛాదాహోజ్వరశ్వాసః క్లమోథవమథుస్తథా। ఉపద్రవాఃకర్ణశూలే భవంత్యేతేమరిష్యతః" అనువచనమునందు జెప్పబడిన ఉపద్రవములతోగూడి కష్టసాధ్యమగు శూలను గలుగజేయును. ఇదియె కర్ణశూలయనబడును.

కర్ణనాదలక్షణము

కర్ణస్రోతస్థితే వాతే శృణోతి వివిధాన్స్వరాన్, 7
భేరీమృదంగశంఖానాం కర్ణనాదస్స ఉచ్యతే,

తా. వాతము చెవిలోనుండి శబ్దవాహినీ సిరల సమీపమున కేగుటవలన భేరీమృదంగ శంఖాదిక శబ్దమువంటి పలువిధములైన శబ్దముల వినబడజేసిన కర్ణనాదమనబడును.

బాధిర్య లక్షణము

యదా శబ్దవహాం వాయుస్స్రోతఆవృత్య తిష్ఠతి. 8
శుద్ధశ్శ్లేష్మాన్వితోవాపి బాధిర్యం తేన జాయతే,

తా. వాయువు కఫముతోగలసిగాని కలయకగాని శబ్దవాహినీస్రోతస్సుల నడ్డగించుటవలన చెవుడు గలుగును.

కర్ణక్ష్వేడలక్షణము

వాయుః పిత్తాదిభిర్యుక్తో వేణుఘోషసమం స్వనమ్. 9

కరోతి కర్ణయోః క్ష్వేడం కర్ణక్ష్వేడస్స ఉచ్యతే,

తా. వాతము పిత్తాదులతోఁగలసి చెవిలో పిల్లనగ్రోవిశబ్దమువంటి శబ్దమును గలుగజేసిన కర్ణక్ష్వేడమని తెలియవలయును.

కర్ణస్రావలక్షణము

శిరోభిఘాతాదథవా నిమజ్జనాజ్జలే ప్రపాకాదథవాపి విద్రధేః. 10
స్రవేద్ధి పూయం శ్రవణోనిలార్దితస్సకర్ణసంస్రావ ఇతి ప్రకీర్తితః,

తా. శిరస్సునందు దెబ్బదగులుటవలనగాని లేక నీళ్లయందుదుమికి మునుగుట వలనగాని లేక చెవిలోజనించినవిద్రధి పండియుండుటవలనగాని వాతముప్రకోపించి చెవివలన చీముస్రవింపజేయుచుండిన కర్ణస్రావమని యెఱుంగవలయును.

కర్ణకండూలక్షణము

మారుతః కఫసంయుక్తః కర్ణే కండూం కరోతి చ. 11

తా. వాతము కఫముతోఁగూడి చెవిలో దురదనుగలుగంజేసిన కర్ణకండూయని తెలియవలయును.

కర్ణగూథలక్షణము

పిత్తోష్మశోషితశ్లేష్మా జాయతే కర్ణగూథకః,

తా. పిత్తోష్మముచే కఫముయెండి గుబిలిగనైన దానిని కర్ణగూథమని తెలియవలయును.

కర్ణప్రతినాహలక్షణము

సకర్ణగూథో ద్రవతాం యదా గతోవిలాయితోఘ్రాణముఖం ప్రపద్యతే.
తదా సకర్ణప్రతినాహసంజ్ఞితో భవేద్వికారశ్శిరసోర్ధభేదకృత్,

తా. చెవియందుండు గుబిలి స్వయముగ ద్రవించిగాని లేక స్నేహస్వేదాదుల వలన ద్రవించిగాని ముక్కు, నోరు వీనివలన వెడలిన ప్రతినాహమనంబడును. దీనివలన అరతలనొప్పికూడగలుగును.

క్రిమికర్ణలక్షణము

యదా తు మూర్ఛంత్యథవాపి జన్తవ
స్సృజంత్యపత్యాన్యథవాపిమక్షికాః. 13
తదవ్యంజనత్వాచ్ఛ్రవణో నిరుచ్యతే
భిషగ్భిరాద్యైః కృమికర్ణకో గదః,

తా. చెవులలో పురుగుజనించి వ్యాపించుటవలనగాని లేక ఈగలు పిల్లలు పెట్టుటవలనగాని కర్ణమార్గము నడ్డగించిన దానిని క్రిమికర్ణమనియెదరు.

జంతుకర్ణలక్షణము

పతంగాశ్శతపద్యశ్చ కర్ణస్రోతః ప్రవిశ్య హి. 14
అరతిం వ్యాకులత్వం చ భృశం కుర్వన్తి వేదనామ్,
కర్ణో నిస్తుద్యతే తస్య తదా వై పుర్పురాయతే. 15
కీటే చరతి రుక్తీవ్రా నిష్పందే మందవేదనా,

తా. మిడుత, జెఱ్ఱి, జోరీగ మొదలగునవి చెవులలో ప్రవేశించుటవలన నెమ్మదిలేకుండుట, ప్రాణములు వ్యాకులముజెందుట, మిక్కిలివేదనగలుగుట, చెవిలో బొడుచునటులుండుట, గులగులలాడుట, పురుగులు సంచరించుచుండినప్పుడు తీవ్రవేదనగలుగుట, సంచరించక స్తబ్దముగనుండిన వేదనతగ్గుట ఈలక్షణములు గలిగియుండిన జంతుకర్ణమని యెరుంగవలయును.

కర్ణవిద్రధిలక్షణము

క్షతాభిఘాతప్రభవస్తువిద్రధిర్భవేత్తథా దోషకృతో౽పరః పునః.
సరక్తపీతారుణమస్రమాస్రవేత్ప్రతోదధూమాయనదాహచోషవాన్

తా. చెవియందు పుడక మొదలగువానిచేనేని లేక దెబ్బచేనేని, గాయముచేనేని వాతాదిదోషములవలననేని విద్రధిజనించిన కర్ణవిద్రధియనఁబడును. అదిపగిలిన వాతాదిదోషక్రమముగ ఎరుపు లేక పసుపువర్ణము లేక అరుణవర్ణము ఇట్టిలక్షణములుగల రక్తమునుస్రవించుట, పొడిచినట్లుండుట, పొగబయలు వెడలినట్లుండుట, మంట, చోషముగలుగుట ఇట్టిలక్షణములు గలిగియుండును.

కర్ణపాకలక్షణము

కర్ణపాకస్తు పిత్తేన కోథవిక్లేదకృద్భవేత్. 17
కర్ణవిద్రధిపాకాద్వా జాయతే చాంబుపూరణాత్,

తా. పిత్తమువలనగాని లేక కర్ణవిద్రధి పక్వమగుటవలనగాని లేక చెవిలో నీళ్లుపోవుటవలనగాని దుర్గంధత్వము, ద్రవత్వము వీనితోగూడిన కర్ణపాకరోగము జనించును. అనగా కర్ణవ్రణము.

పూతికర్ణలక్షణము

పూయంస్రవతి యః పూతిసజ్ఞేయః పూతికర్ణకః. 18

తా. చెవులనుంచి దుర్గంధయుక్తమగు చీముపెడలిన పూతికర్ణమని తెలియవలయును.

కర్ణశోథార్బుదార్శలక్షణములు

కర్ణశోథార్బుదార్శాంసి జానీయాదుక్తలక్షణైః,

తా. కర్ణశోథ, కర్ణార్బుదము, కర్ణార్శస్సు వీనిలక్షణంబుల పూర్వమువలె నెరుంగఁదగును.

వాతకర్ణరోగలక్షణము

నాదోతిరుక్కర్ణమదస్య శోషస్స్రావ స్తనుశ్చాశ్రవణం చ వాతాత్.

తా. వాతసంబంధమువలన చెవియందునాదము మిక్కిలిపోట్లు చెవియందలి గుబిలిశోషించుట, తేటగస్రావము, చెవుడు ఇవి గలిగియుండును.

పిత్తజకర్ణరోగలక్షణము

శోథస్సరాగోదరణం విదాహస్సపీతపూతిస్రవణం చ పిత్తాత్,

తా. పిత్తసంబంధమువలన చెవులయందువాపు ఎఱ్ఱగనుండుట పగుళ్లు, మంట, కొంచెము పసపువర్ణము దుర్గంధముగ స్రవించుట ఇట్టి లక్షణములు గలిగియుండును.

కఫజకర్ణరోగలక్షణము

వైశ్రుత్యకండూస్థిరశోథశుక్లాస్స్నిగ్ధాస్రుతి శ్లేష్మభవేతిరుక్చ. 20

తా. కఫసంబంధమువలన విపరీతముగవినిపించుట, దురద, వాపు కఠినముగ నుండుట, తెల్లగ, బంకగనుండుస్రావము, మిక్కిలిపోట్లు ఇట్టిలక్షణములు గలిగి యుండును.

సన్నిపాతజకర్ణరోగలక్షణము

సర్వాణి రూపాణి చ సన్నిపాతాత్స్రావశ్చ తత్రాధికదోషవర్ణః,

తా. సన్నిపాతసంబంధమువలన సర్వదోషలక్షణములతోగూడి, అధికముగ నుండు దోషవర్ణమగు స్రావము గలిగియుండును.

కర్ణశోథలక్షణము

సౌకుమార్యాచ్చిరోత్సృష్టే సహసాపి ప్రవర్ధితే. 21
కర్ణశోథో భవేత్పాళ్యాం సరుజః పరిపోటవాన్,

తా. సౌకుమార్యమువలన చెవులుకుట్టినతోడనే తమ్మెను క్రమముగవృద్ధి పరచక నుపేక్షించి పిదప త్వరగా వృద్ధిచేయయత్నించిన వానియందునొప్పి పగుళ్లు వీనితోగూడిన వాపుగలిగినదానిని కర్ణశోథయనిరుదరు.

### పరిపోటకలక్షణము

కృష్ణారుణనిభ స్తబ్ధస్సవాతాత్పరిపోటకః. 22

తా. వాతసంబంధమువలన నల్లగను లేక యెఱ్ఱగను కఠినముగనుండు వాపు జనించిపగిలిన దానిని పరిపోటకమనియెదరు.

### కర్ణోత్పాతలక్షణము

గుర్వాభరణసంయోగాత్తాడనాద్ఘర్షణాదపి,
శోథః పాళ్యాం భవేచ్ఛ్యావో దాహపాకరుజాన్వితః. 23
రక్తో వా రక్తపిత్తాభ్యాముత్పాతస్సగదో మతః,

తా. చెవులయందు బరువగు ఆభరణములధరించుటవలనగాని, లేక అభిఘాతమువలనగాని, లేక రుద్దుటవలనగాని, రక్తపిత్తములు ప్రకోపించి చెవితమ్మెలయందు నీలము లేక యెఱుపుగలవాపునుగలుగజేసి దానివలన మంట పాకము పోట్లు ఇవి గలిగిన ఉత్పాతమనియెదరు.

### కర్ణోన్మంథకలక్షణము

కర్ణం బలాద్వర్ధయతః పాళ్యాం వాయుః ప్రకుప్యతి. 24
కఫం సంగృహ్య కురుతే శోథం స్తబ్ధమవేదనమ్,
ఉన్మంథకస్సకండూకో వికారః కఫవాతజః. 25

తా. బలాత్కారముగ చెవిరంధ్రమును వృద్ధిపరచుటవలన చెవితమ్మెయందు వాతము ప్రకోపించి కఫముతోచేరి స్తబ్ధమై స్వల్పవేదన దలవాపును గలుగంజేసి దానియందు దురదను యెల్లప్పుడు జనింపంజేయుచుండిన ఉన్మంథకమని వచించెదరు. ఇది కఫవాతమువలన జనించును.

### దుఃఖవర్ధనలక్షణము

సంవర్ధ్యమానే దుర్వృద్ధే కండూదాహరుజాన్వితః,
శోఫో భవతి పాకశ్చ త్రిదోషో దుఃఖవర్ధనః. 26

తా. విరుద్ధప్రదేశమునందు చెవికుట్టి వృద్ధిచేయుటచే దురద, తాపము, పోట్లు, పాకము వీనితోగూడినవాపును జనింపంజేసినదానిని దుఃఖవర్ధనమనియెదరు. ఇది త్రిదోషములవలన నుత్పన్నంబగును.

### పరిలేహిలక్షణము

కఫాసృక్క్రిమిసంభూతస్సవిసర్పన్నితస్తతః,
లిహేచ్ఛష్కులీం పాలీం పరిలేహీత్యసౌ స్మృతః. 27

తా. చెవికి శ్మేయందు కఫరక్తక్రిములవలన వాపుజనించి అంతట తిరుగుచు కర్ణపుటమునందు వ్యాపించి యందలి మాంసమును భక్షించిన పరిలేహియనంబడును.

—॥ కర్ణవ్రణలక్షణము ॥—

శ్రవణాంతర్వ్రిణం జాతం క్రిమిదుర్గంధసంయుతమ్,
తచ్ఛాంత్యర్థం వదిష్యామి భైషజ్యం లోకమోహనమ్. 28

తా. చెవియందు వ్రణముజనించి క్రిమి దుర్గంధములతోగూడి చీముగారుచుండిన కర్ణవ్రణమనంబడును, ఇది నివర్తించుటకై లోకమోహకరమగు ఔషధమును జెప్పెదను.

—॥ అసాధ్యకర్ణరోగోపద్రవము ॥—

మూర్ఛా దాహో జ్వరః కాసః క్లమోథ వమథుస్తథా,
ఉపద్రవాః కర్ణశూలే భవంత్యేతే మరిష్యతః. 29

తా. మూర్ఛ, దాహము, జ్వరము, దగ్గు, క్లమ, వాంతి ఇవి కర్ణశూలరోగమునం దుపద్రవములనియు చంపుననియును తెలియవలయును.

—॥ కర్ణశూలకు శృంగబేరాదితైలము ॥—

శృంగబేరరసం క్షౌద్రం సైంధవం తైలమేవచ,
కవోష్ణం కర్ణయోర్ధార్యమేతత్స్యాద్వేదనాపహమ్. 30

తా. అల్లపురసములో తేనె, సైంధవలవణము (తెల్లావ)నూనెకలిపి తైలము మిగులునటులకాచి, కొంచెము వెచ్చగనుండునపుడే చెవులలోవేసిన కర్ణశూల నివర్తించును.

—॥ లశునాదిస్వరసము ॥—

లశునార్ద్రికశిగ్రూణాం వరుణామూలకస్య చ,
కదళ్యాస్స్వరసశ్శ్రేష్ఠఃకదోష్ణః కర్ణపూరణే. 31

తా. ఉల్లిగడ్డలు, అల్లము, మునగచక్క, ఉలిమిడివేరు, ముల్లంగి, అరటి, వీనిరసమును (ఆవనూనెతో కలిపి)కాచి కించిదుష్ణముగ చెవిలోవేసిన కర్ణశూల నివర్తించును.

సౌవీరశుష్కార్ద్రికమాతులుంగమాంసీజటాగుగ్గులుసైంధవాని,
విపాచ్య తైలే కటుకే నిషించేచ్ఛీఘ్రిం హరేత్కర్ణరుజం చ తీవ్రామ్.

తా. కలి, (తరవాణి) శొంఠిరసము, మాదీఫలరసము, జటామాంసి, మహిషాక్షి గుగ్గిలము, సైంధవలవణము వీనిని తెల్లావనూనెలోవైచికాచి, చెవులలోవైచిన భయంకరమగు చెవిపోటు నివర్తించును.

### అర్కాంకురాదిస్వరసము

అర్కాంకురానమ్లసిష్టాన్ తైలాఢ్యాన్ లవణాన్వితాన్,
సన్నిదధ్యాత్సుధాకాండే పూరితే మృత్స్నయా వృతే. 33
పుటపాకే తయా స్విన్నం పీడయేదారసాగమాత్,
సుఖోష్ణం తద్రసం కర్ణే ప్రక్షిపేచ్ఛూలశాన్తయే. 34

తా. జిల్లేడుచిగుళ్లను నిమ్మపండ్లరసముతో నూరి అందు నూనె, సైంధవలవణము గలిపి, కల్కముచేసి దీనిని పచ్చిజెముడు కర్రగా తొలచి, అందునిచి దానిపైమూసి చీలమన్ను లేపనముజేసి పుటపాకమునందునిచి పక్వముగ కాల్చి రసమునుపిండి సుఖోష్ణముగ చెవిలో వేశిన కర్ణశూల నివర్తించును.

### అర్కపత్రరసము

అర్కస్య పత్రం పరిణామపీతమాజ్యేన లిప్తం శిఖియోగతప్తమ్,
ఆపీడ్యతస్యాంబుసుఖోష్ణమేవ కర్ణే నిషిక్తం హరతేతిశూలమ్. 35

తా. పండుజిల్లేడాకులకు నెయ్యిబట్టించి నిప్పుమీద వెచ్చజేసి రసమునుపిండి సుఖోష్ణముగ చెవిలో వేశిన కర్ణశూల నివర్తించును.

### శ్యోనాకతైలము

తైలం శ్యోనాకమూలేన మందేగ్నౌ విధినా శృతమ్,
హరేదాశు త్రిదోషోత్థం కర్ణశూలం ప్రపూరణాత్. 36

తా. దుందిలపువేరుకల్కములో నూనెకలిపి మందాగ్నిచే పక్వముగకాచి చెవిలోవైచిన త్రిదోషమువలన జనించిన చెవిపోటు నివర్తించును.

### హింగ్వాదితైలము

హింగుసైంధవశుంఠీభిస్తైలం సర్షపసంభవమ్,
విపక్వం హరతేఽవశ్యం కర్ణశూలం ప్రపూరణాత్. 37

తా. ఇంగువ, సైంధవలవణము, శొంఠి వీనికల్కమునందు ఆవనూనెజేర్చి కాచి సుఖోష్ణముగ చెవియందువైచిన చెవిపోటు నివర్తించును.

### నాగరాదితైలము

నాగరసైంధవమాగధిముస్తాహింగువచాలశునం తిలతైలమ్,
అర్కసుపక్వపలాశరసేన కర్ణరుజం బధిరం వినిహన్తి. 38

తా. శొంఠి, సైంధవలవణము, పిప్పళ్లు, తుంగముస్తలు, ఇంగువ, వస, వెల్లుల్లిపాయలు వీనికల్కములో నువ్వులనూనె పండుజిల్లేడాకురసము వీనినిచేర్చి తైలముకాచివైచిన చెవిపోట్లు చెవుడు ఇవి నివర్తించును.

౼౼ కర్ణనాద బాధిర్యములకు అపామార్గతైలము ౼౼

శేఖరికక్షారజలే తత్కృతకల్కేన సాధితం తిలజమ్,
అపహరతి కర్ణనాదం బాధిర్యం చాపి పూరణతః. 39

తా. ఉత్తరేణు క్షారోదకము, ఉత్తరేణుకల్కము వీనిలో నువ్వులనూనె గలిపి తైలముకాచి చెవిలోవైచిన కర్ణనాదము, చెవుడు ఇవి నివర్తించును.

౼౼ హింగ్వాదితైలము ౼౼

హింగ్వబ్దదారుమిసిమూలకభస్మభూర్జ
త్వక్క్షారసింధురుచకోద్భిదశిగ్రువిశ్వైః,
సస్వర్జికావిడవచాంజనమాతులుంగై
రంభారసైస్సమధుసూక్తమిదం విపక్వమ్. 40
తైలం ప్రసిద్ధమితితచ్ఛ్రవణామయఘ్నం
కర్ణప్రణాదబధిరత్వహరం నరాణామ్,
భ్రూమస్తకశ్రవణశష్కులికాంతరాళ
శూలాపహం చరకసుశ్రుత పూజితం చ. 41

తా. ఇంగువ, తుంగముస్తలు, దేవదారు, పెద్దసదాప, ముల్లంగిభస్మము, భుజపత్రము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, అట్టుప్పు లేక చవిటిఉప్పు, మునగ, శొంఠి, సర్జక్షారము, బిడాలవణము, సురమాణాయి, మాదీఫలరసము, అరటిరసము, మధుసూక్తము వీనికల్కములో నువ్వులనూనెకలిపి చక్కగ కాచి చెవిలోవేసిన కర్ణరోగము కర్ణనాదము, చెవుడు, కనుబొమలు శిరము చెవి, చెవిరంధ్రము వీనియందలి శూల నివర్తించునని చరకసుశ్రుత గ్రంథములయందు జెప్పబడియెను.

౼౼ బిల్వతైలము ౼౼

గవాం మూత్రేణ బిల్వాని పిష్ట్వా తైలం విపాచయేత్,
సజలం చ సదుగ్ధం చ తద్బాధిర్యహరం పరమ్. 42

తా. మారేడుపండ్లను ఆవుపంచితముతోనూరి అందు ఉదకము, మేకపాలు నూనె వీనిని చేర్చికాచి చెవిలోపలవైచిన చెవుడు నివర్తించును.

౼౼ దీపికాదితైలము ౼౼

బృహతః పంచమూలస్య కాండాన్యష్టాంగుళానిచ,
క్షౌమేణావేష్ట్య సంసిచ్య తైలేనాదీపయేత్తతః. 43
యత్తైలం చ్యవతే తేభ్యస్సుఖోష్ణం తేన పూరయేత్,

క్షేయం తద్దీపికాత్తైలం కుష్ఠదేవతరోస్తథా. 44

తా. ఎనిమిదంగుళములప్రమాణముగల * బృహత్పంచమూలముల కట్టగట్టి దానికి తెల్లపట్టుగుడ్డనుచుట్టి నూనెలో బాగుగ దడిపి వెలిగించి యందు స్రవించెడి తైలమును దీసికొని సుఖోష్ణముగ చెవిలో వైచినను లేక చంగల్వకోష్ఠు దేవదారు వీనినినుండి పైప్రకారము తైలమునుదీసి చెవిలో వేశినను చెవుడు హరించును.

## నిర్గుండ్యాదితైలము

నిర్గుండిజాతిరవిభృంగరసో నరం భా
కార్పాసశిగ్రుసురసార్ద్రికకారవేల్లాః,
ఏషాం రసే తిలభవం సవిషం సుపక్వం
బాధిర్యనాదకృమివేదనపూయహన్త్రు. 45

తా. వావిలి, జాజికాయ, జిల్లేడు, గుంటగలగర, వెల్లుల్లి, అరటి, ప్రత్తికాయ, మునగ, తులసి, అల్లము, కాకర, వీనిరసములలో నూనెగలిపి అందు కొంచము నాభినివైచి సిద్ధముజేసి చెవిలోవేశిన చెవుడు, కర్ణనాదము, క్రిములు, శూల, చీముగారుట ఇవి నివర్తించును.

## బీజపూర రసము

సర్జకాచూర్ణసంయుక్తం బీజపూరరసం క్షిపేత్,
కర్ణస్రావరుజాడా తు ప్రశస్తం నాత్ర సంశయః. 46

తా. మాదీఫలరసములో సర్జక్షారముజేర్చి చెవిలోవైచిన కర్ణస్రావము శూల మొదలగునవి నిస్సంశయముగ నివర్తించును.

## సముద్రఫేనచూర్ణము

సముద్రఫేనచూర్ణం తు న్యస్తం శ్రవణసంస్రవే,
పూయస్రావం వ్రణం సాంద్రం హన్తి ధ్వాన్తమివాంశుమాన్. 47

తా. † సముద్రపు నురుగుచూర్ణమును చెవిలోవేశిన సూర్యుండంధకారమును నశింపకజేయు తెరంగున చెవియందలి చీము, వ్రణము, బంక వీనిని నివర్తింపజేయును.

## కర్ణస్రావచికిత్స

జంబ్వామ్రపత్రం తరుణం సమాంశం కపిత్థకార్పాసఫలం చ సార్ద్రిమ్,

* మారేడు, నెల్లి, దుందిలము, చల్లగుమ్మడి, కడలి అనునవి బృహత్పంచమూలములు.

† సముద్రఫేనమనగా సారపిల్లియనివాడుటగలదు.

ధృత్వా రసం తన్మధునా విమిశ్రం స్రావాపహం సంప్రవదన్తితజ్ఞాః. 48
ఏతైశ్శృతం నింబకరంజతైలం ససార్షపం స్రావహరం ప్రదిష్టమ్,

తా. లేత నేరేడాకులు లేతమామిడాకులు వీనిని సమభాగములుగ ముద్దజేసి అందు లేతవెలగకాయరసమును ప్రత్తికాయరసమును తేనెనుగలిపి చెవిలోవేసినను లేక పై ద్రవ్యములతోడ వేప, కానుగ వీనినూనెనుచేర్చి ఆందావనూనెనుగలిపి చిక్కగ కాచి చెవిలోవేసినను కర్ణస్రావము మానును.

కర్ణరోగమునకు రాస్నాదిచూర్ణము

రాస్నామృతైరండసురాహ్వావిశ్వం
తుల్యం విచూర్ణ్యాథ విమిశ్ర్య ఖాదేత్. 49
వాతామయీ కర్ణశిరోగదీ చ నాడీవ్రణీ చాపి భగందరీ చ,

తా. సన్నరాస్నము, తిప్పతీగె, ఆముదపువేరు, దేవదారు, శొంఠి వీనిని చూర్ణించి సమముగచేర్చి సేవించిన వాతరోగము, కర్ణరోగము, శిరోరోగము, నాడీవ్రణము, భగందరము ఇవి నివర్తించును.

క్రిమికర్ణచికిత్స

రవిరవిభక్తవ్యోషానేకీకృత్యప్రపీడయేద్బద్ధ్వా. 50
వసనాంతర్గాతరసం శ్రవణే పరిపూరయేద్యుక్త్యా,
కర్ణజలౌకానియతం కృమికీటపిపీలికాస్తథాన్యేపి. 51
నిపతంతి నిర్విశేషాత్ కారండాశ్చాపి మూండస్థాః,

తా. జిల్లేడాకులు, సూర్యకాంతపువేరు, త్రికటుకములు వీనినినూరి గుడ్డను గట్టి చెవిలిలో యుక్తిగబిండిన కర్ణములయందలి జల్లజెఱ్ఱి పురుగులు కీటకములు చీమలు తలలోనిపురుగులు ఇవియన్నియు ఊడిపడును.

పూతికర్ణమునకు ఆమ్రాది తైలము

ఆమ్రజంబూప్రవాళాని మధూకస్య వటస్య చ. 52
ఏభిస్తు సాధితం తైలం పూతికర్ణగదం హరేత్,

తా. మామిడి నేరేడు ఇప్ప మఱ్ఱి వీనిచిగుళ్లనుకల్కముచేసి అందు తైలమును జేర్చికాచి చెవిలోవైచిన చీముకారుట నివర్తించును.

గంధకతైలము

చూర్ణేన గంధకశిలారజనీభవేన
ముష్కంశకేన కటుతైలపలాష్టకంతు. 53

ధత్తూరపత్రరసతుల్యమిదం విపక్వం
నాడీం జయేచ్చిరభవామపి కర్ణజాతామ్,

తా. గంధకము, మణిశిల, పసపు వీనిని నాలుగుతులములయెత్తు చూర్ణము జేసి అందు 32 తులములయెత్తు తెల్ల ఆవనూనె, 32 తులములయెత్తు ఉమ్మెత్తాకు రసమునుగలిపి కాచి చెవిలోవైచిన దీర్ఘకాలమునుంచియుండు కర్ణనాడీరోగము నివర్తించును.

## శతావరీ తైలము

శతావరీవాజిగంధా * పయస్యైరండబీజకైః. 54
తైలం విపక్వం సక్షీరం పాలీం సంవర్ధయేత్సుఖమ్,

తా. పిల్లపీచర, పెన్నేరుగడ్డ, ఆముదపువిత్తులు వీనిని పెరుగుమీదితేటతో నూరికల్కముజేసి అందు నూనె పాలుచేర్చి కాచిలేపనముజేసిన చెవితమ్మెలు సుఖముగ వృద్ధినిబొందును.

## జీవనీయతైలము

జీవంత్యా చాశ్వగంధార్కవాకుచీబీజసైంధవైః. 55
హాలినీసురసాభ్యాం చ గోధాకంకవసాన్వితమ్,
తైలం విపక్వమభ్యంగాదున్మంథం నాశయేద్ధ్రువమ్. 56

తా. పాలతూర, పెన్నేరుగడ్డ, జిల్లేడుపాలు, భావంచివిత్తులు, సైంధవలవణము, చన్నచగ్లగడ్డ, తులసి, ఉడుము, గ్రద్ద వీనిక్రొవ్వులనేకముగజేసి తైలములో చేర్చికాచి అభ్యంజనముచేసిన ఉన్మంథకము శీఘ్రముగ నివర్తించును.

## కర్ణరోగపథ్యములు

గోధూమాశ్శాలయో ముద్గా యవాశ్చాపి ఘృతం తథా,
లావో మయూరో హరిణస్తిత్తిరిర్వనకుక్కుటః. 57
పటోలం శిగ్రువార్తాకం సునిషణ్ణం కటిల్లకమ్,
రసాయనాని సర్వాణి బ్రహ్మచర్యమభాషణమ్. 58
ఉపయుక్తం యథాదోషమిదం కర్ణామయే హితమ్,

తా. గోధుమలు, వరిబియ్యము, పెసలు, యవలు, నెయ్యి, లావుకపిట్ట, నెమలి, జింక, తిత్తిరిపక్షి, అడవికోడి, పొట్లకాయ, మునగకాయ, వంకాయ,

---

* పయస్యా అనగా పిన్నపాలగాని క్షీరకాకోళిగానియగును. పయస్య మనగా ఔదుగుగూడనగును.

చెంచలికూర, కాకరకాయ, సర్వరసాయనములు, బ్రహ్మచర్యము, మాటలాడకుండుట, ఇది కర్ణరోగమునందు, దోషానుగుణ్యముగ, పథ్యంబులని తెలియవలయును.

అపథ్యములు

దన్తకాష్ఠం శిరస్స్నానం వ్యాయామం శ్లేష్మలం గురు. 59
కండూయనం తుషారం చ కర్ణరోగీ పరిత్యజేత్,

తా. దంతకాష్ఠము, శిరస్స్నానము, సంచారము, కఫకరాన్నము, గుర్వన్నము, గోకుట, మంచు వీనిని కర్ణరోగి విసర్జించవలయును,

# నాసారోగప్రకరణమ్.

పీనసమను నాసారోగస్వరూపము

ఆనహ్యతే యస్య విశుష్యతే చ ప్రక్లిద్యతే ధూప్యతి చైవ నాసా,
నవేత్తి యో గంధరసాంశ్చ జంతుర్జుష్టంవ్యవస్యేత్పతుపీనసేన. 1
తంచానిలశ్లేష్మభవంవికారంబ్రూయాత్ప్రతిశ్యాయసమానలింగమ్,

తా. ముక్కుడచికొనుట, ఎండుట, ముక్కునసీరుకారుట, పొగవెడలునటుల సంతాపముగలుగుట, గంధరసముల తెలియకనుండుట ఈలక్షణములుగలది, పీనసరోగమని యెరుంగవలయును, ఈవాతశ్లేష్మజవికారము ప్రతిశ్యాయముతో సమముగనుండు లక్షణములతోగూడియుండును.

నాసారోగనిదానము

అవశ్యాయానిలరజోభాషాతిస్వప్నజాగరైః. 2
నిర్వాతోచ్ఛ్వసరోధేనపీతేనాశుద్ధవారిణా,
అత్యంబుపానాద్రమణైశ్ఛర్ది ర్బాష్పగ్రహాదిభిః. 3
క్రుద్ధావాతోల్బణాదోషానాసాయాంకుర్వతేగదాన్,

తా. మంచు, గాలి, దుమ్ము, అతిసంభాషణము, అతినిద్ర, అతిజాగరణ, గాలిలేనిప్రదేశము, ఊపిరినణచుట, దుష్టోదకపానము, మిక్కిలిఉదకపానము, జలక్రీడలు, వాంతి, కన్నీరు వీనినడ్డగించుట వీనివలన వాతప్రధానమగుదోషములు ప్రకోపించి నాసారోగంబుల జనింపంజేయును.

నాసారోగనామములు

ఆదౌ చ పీనసః ప్రోక్తః పూతినాసస్తతః పరమ్. 4
నాసాపాకోత్ర గణితః పూయశోణితమేవ చ,

క్షవథుర్భ్రంశథుర్దీప్తః ప్రతినాహః పరిస్రవః. 5
నాసాశోషః ప్రతిశ్యాయాః పంచసప్తార్బుదాని చ,
చత్వార్యర్శాంసి చత్వారశ్శోథాశ్చత్వారి తాని చ. 6
రక్తపిత్తాని నాసాయాం చతుస్త్రింశద్గదాస్స్మృతాః,

తా. పీనస, పూతినాస, నాసాపాకను, పూయశోణితము, క్షవథు, భ్రంశథు, దీప్తనాస, ప్రతినాహను, పరిస్రావము, నాసాశోష, ౫ విధములగు ప్రతిశ్యాయములు, ౭ విధములగు నాసార్బుదములు, ౪ విధములగు నాసార్శస్సులు, ౪ విధములగు నాసాశోథలు, ౪ విధములగు రక్తపిత్తయుక్త నాసారోగములు ఇటుల ౩౪ విధములుగనుండును.

పీనసరోగనిదానము

పూయం స్రవతి దుర్గంధం నాసాయామతితాపకృత్. 7

తా. ముక్కున మిక్కిలి తాపముగలిగి దుర్గంధముగ చీము కారుచుండిన పీనసయని యెరుంగవలయును.

పీనసరోగభేదములు

రక్తం పీతం తథా శ్వేతం నీలం హారిద్రమిశ్రితమ్,
పూయం స్రవతి దుర్గంధం పీనసాఖ్యం చ సప్తకమ్. 8

తా. రక్తవర్ణము, పీతవర్ణము, శ్వేతవర్ణము, నీలవర్ణము, పసపువర్ణము, మిశ్రవర్ణము, దుర్గంధయుక్తము ఇటుల పీనస ౭ విధముల స్రవించుచుండునని తెలియవలయును.

పూతినాసలక్షణము

దోషైర్విదగ్ధైర్గళతాలుమూలే సంమూర్ఛితో యస్య సమీరణస్తు,
వినేతిపూతిర్ముఖనాసికాభ్యాం తం పూతినాసం ప్రవదన్తి రోగమ్. 9

తా. గొంతు, లోదవడ వీనిమధ్యమునందు దుష్టపిత్తరక్తాదిదోషములతో వాతముచేరి, నోరు, ముక్కు వీనివల్లదుర్గంధయుక్తముగ శ్లేష్మముబయలువెడలిన దానిని పూతినాసమని తెలియవలయును.

నాసాపాకలక్షణము

ఘ్రాణాశ్రితం పిత్తమరూంషి కుర్యాద్యస్మిన్వికారే బలవాంశ్చపాకః,
తన్నాసికాపాకమితి వ్యవస్యేద్విక్లేదకోథావథవాపి యత్ర. 10

తా. నాసికము నాశ్రయించియుండు పిత్తము దుష్టంబగుటవలన నాసికమునందు వ్రణముజనించి లోనపడి చీముచేదడని దుర్గంధముగ స్రవించుచుండిన నది నాసికాపాకమని తెలియవలయును.

పూయరక్తలక్షణము

దోషైర్విదగ్ధైరథవాపి జన్తోర్లలాటదేశేభిహతస్య తైస్తైః,
నాసాస్రవేత్పూయమసృగ్విమిశ్రంతంపూయరక్తం ప్రవదన్తిరోగమ్.

తా. వాతాదిదోషములు దుష్టంబులగుటచేగాని లేక లలాటదేశమునందు దెబ్బదగులుటచేగాని ముక్కునుంచి చీము, రక్తము స్రవించుచుండిన పూయరక్తమని యెరుంగవలయును.

క్షవథు లక్షణము

ఘ్రాణాశ్రితే మర్మణి సంప్రదుష్టో యస్యానిలో నాసికయా నిరేతి,
కఫానుయాతో బహుశోతిశబ్దం తం రోగమాహుః క్షవథుం విధిజ్ఞాః.

తా. ముక్కు నాశ్రయించియుండు శృంగాటకమను మర్మస్థానమునందుండు వాతము దుష్టమై కఫముతోగలసి గొప్పశబ్దమును జేయుచు ముక్కువలనబయలు వెడలిన క్షవథువని తెలియవలయును. (అనగా తుమ్ము.)

ఆగంతుకక్షవథులక్షణము

తీక్ష్ణోపయోగాదతిజిఘ్రితో వా భావాన్కటూనర్కనిరీక్షణాద్వా,
సూత్రాదిభిర్వాతరుణాస్థిమర్మణ్యుద్ఘాటితేన్యః క్షవథుర్నిరేతి. 13

తా. ఆవాలు మొదలగు తీక్ష్ణపదార్థముల భక్షణచేనేని లేక కారముగల పదార్థముల వాసనచూచుటచేనేని లేక సూర్యనిరీక్షణచేనేని లేక ముక్కులోవత్తిని ఉనుచుటచేనేని తరుణాస్థిమర్మము (అనగా ఫణామర్మము) చలింపబడి ఆగంతుక క్షవథువును జనింపజేయును (మరియు ఆగంతుకదోషక్షవథులు రెండును సమానములని యెరుగవలయును.)

భ్రంశథులక్షణము

ప్రభ్రశ్యతే నాసికయా హి యస్య సాంద్రో విదగ్ధో లవణః కఫశ్చ,
ప్రాక్సంచితో మూర్ధని సూర్యతప్తేతంభ్రంశథుంవ్యాధిముదాహరంతి.

తా. పూర్వము శిరస్సునందు చేరియుండు కఫము సూర్యతాపమువలన ద్రవించి గట్టిగను, (రక్తాధిక పీతవర్ణముగను) ఉప్పగను, నాసికారంధ్రమువలన మిక్కిలిగ వెడలిన దానిని భ్రంశథువని యెదరు.

### దీప్తనాసా లక్షణము

ఘ్రాణే భృశం దాహసమన్వితే తు వినిస్సరేద్ధూమఇవేహ వాయుః,
నాసా ప్రదీప్తేవచయస్యజంతోర్వ్యాధిం తు తం దీప్తముదాహరంతి.

తా. ముక్కు మిక్కిలితాపముతోగూడియుండ వాతముపొగవలె బయలు వెడలుచు ముక్కును మిక్కిలి ప్రదీప్తిని గలుగజేసిన దీప్తనాసికా రోగమని తెలియవలయును.

### ప్రతీనాహలక్షణము

ఉచ్ఛ్వాసమార్గం తు కఫస్సవాతో రుంధ్యాత్ప్రతీనాహముదాహరేత్తమ్

తా. కఫము వాతముతోగూడి ఉచ్ఛ్వాసమార్గము నడ్డగించుటవలన నాసికారంధ్రముల శ్వాస బాగుగ ప్రసరింపకుండిన దానిని ప్రతినాహ నాసారోగమని యెదరు.

### నాసాస్రావలక్షణము

ఘ్రాణాద్ఘనః పీతసిత స్తనుర్వాదోషస్స్రవేత్స్రావముదాహరేత్తమ్.

తా. ముక్కువలన గట్టిగను, పసపువన్నెగను లేగ తెల్లగను, తేటగను, కఫము స్రవించుచుండిన నాసాస్రావ మనియెదరు.

### నాసాపరిశోషలక్షణము

ఘ్రాణాశ్రితే స్రోతసి మారుతేన గాఢం ప్రదీప్తే పరిశోషితే చ,
కృచ్ఛ్రాచ్ఛ్వసేదూర్ధ్వమధశ్చ జన్తుర్యస్మిన్సనాసాపరిశోష ఉక్తః.

తా. వాతమువలన ముక్కురంధ్రము మిక్కిలి పరితపించి యుండుటచే నరుడు ఆయాసముమీద క్రింద, పైన శ్వాసనువదలిన దానిని నాసాపరిశోష మనియెదరు.

### అపక్వపీనసలక్షణము

శిరోగురుత్వమరుచిర్నాసాస్రావ స్తనుస్స్వరః,
క్షామః ష్ఠీవే త్తథాభీక్ష్ణమామపీనసలక్షణమ్. 18

తా. శిరస్సు జడముగనుండుట, అరుచి, నాసికమునుండి తేటగ నీరు కారుట, స్వరహైన్యము, మాటిమాటికి ముక్కులయందుండు చీమిడి ఆకర్షించి వుమియుట ఇట్టి లక్షణములు గలిగియుండిన అపక్వపీనసయని తెలియవలయును.

పక్వపీనసలక్షణము

ఆమలింగాన్వితశ్శ్లేష్మాఘనః ఖేషు నిమజ్జతి,
స్వరవర్ణవిశుద్ధిశ్చ పరిపక్వస్య లక్షణమ్. 19

తా. పూర్వోక్తఅపక్వపీనసలక్షణయుక్తమైయుండుకఫము ఘనీభవించి నాసికము మొదలగు స్రోతస్సులయందునిలుచుట, స్వరవర్ణములు స్పష్టములుగనుండుట ఇట్టి లక్షణములుగలిగియుండిన పీనస పక్వమైనదని యెరుగదగును.

ప్రతిశ్యాయోత్పత్తి

సంధారణాజీర్ణరజోతిభాషాక్రోధర్తువైషమ్యశిరోభితాపైః,
ప్రజాగరస్వప్నవాంబుశీతావశ్యాయకైర్మైథునబాష్పసేకైః. 20
సంస్త్యానదోషే శిరసి ప్రవృద్ధో వాయుః ప్రతిశ్యాయముదీరయేత్తు,

తా. మలమూత్రాదివేగములనడ్డగించుట, జీర్ణముగాకయుండుట, ముక్కులో దుమ్ముప్రవేశించుట, అతిగమాటలాడుట, కోపముసేయుట, ఋతువుమారుట, ఎండవలన శిరస్సుతపించుట, జాగరణసేయుట, పగలునిద్రించుట, క్రొత్తనీరు త్రాగుట, శీతపదార్థములుసేవించుట, మంచుననిలుచుట, అతిమైథునముసేయుట, కన్నులనీరుకారుట ఇట్టికారణములచే మూలాధారమగుకఫము శిరస్సున ఘనీభవించుట వలన వాతముప్రకోపించి పడిశముగలుగజేయును. దానిని ప్రతిశ్యాయమనియెదరు.

ప్రతిశ్యాయోత్పత్తికికారణము

చయం గతా మూర్ధని మారుతాదయః
పృథక్సమస్తాశ్చ తథైవ శోణితమ్. 21
ప్రకుప్యమానావివిధైః ప్రకోపనై
స్తతః ప్రతిశ్యాయకరా భవన్తి,

తా. శిరస్సునందు ప్రత్యేకముగ వాతాదిప్రత్యేకదోషములుగాని, సర్వదోషములుగాని రక్తముతో సంచితములై బలవద్విరోధము, దివానిద్ర మొదలగుకారణములచే ప్రకోపించి ప్రతిశ్యాయమును జనింపజేయును

ప్రతిశ్యాయపూర్వరూపము

క్షవప్రవృత్తిశ్శిరసోతిపూర్ణతాతథాంగమర్దః పరిహృష్టరోమతా.22
ఉపద్రవాశ్చాప్యపరే పృథగ్విధాన్నృణాం ప్రతిశ్యాయపురస్సరా
స్స్మృతాః,

తా. తుమ్ములువచ్చుట, తల బరువుగనుండుట, శరీరము పీకుట, గగుర్పాటు,

నానావిధరోగములు (అనగా ఘ్రాణధూమాయనాదికములు) గలుగుట ఇవియ ప్రతిశ్యాయమునకు పూర్వరూపములు.

వాతజప్రతిశ్యాయలక్షణము

ఆనద్ధా పిహితా నాసా తనుస్రావప్రసేకినీ. 23
గళతాల్వోష్ఠశోషశ్చ నిస్తోదశ్శంఖయోరపి,
భవేత్స్వరోపఘాతశ్చ ప్రతిశ్యాయేనిలాత్మజే. 24

తా. ముక్కు కట్టబడినటులనుండుట, అడచికొనియుండుట, తేటగనీరుకారుట, గొంతు, లోదవడ, పెదవి ఇవియెండుట, కణతలపోట్లు, గొంతులో బొంగురుపోవుట ఇట్టిలక్షణములు గలిగియుండిన వాతజప్రతిశ్యాయమని తెలియవలయును.

పిత్తజప్రతిశ్యాయలక్షణము

ఉష్ణస్సపీతకస్స్రావో ఘ్రాణాత్స్రవతి పైత్తికే,
కృశోతిపాండుస్సంతప్తో భవేదుష్ణాభిపీడితః. 25
సధూమమగ్నిం సహసావమతీవచ నాసయా,

తా. నాసికముచేలన వేడిగ పసపువర్ణముగ స్రావముగలుగుట, అందువలన శరీరముకృశించి పాండువర్ణముగనుండుట, తాపమును, ఉష్ణమును నోర్వలేకుండుట, ముక్కువలన పొగతో అగ్నివెడలినట్లుండుట ఇట్టిలక్షణములుగలిగియుండిన పిత్తజ ప్రతిశ్యాయమని తెలియవలయును.

కఫజప్రతిశ్యాయలక్షణము

ఘ్రాణాత్కఫః కఫకృతే శ్వేతశ్శీతస్స్రవేద్బహుః. 26
శుక్లావభాసశ్శూనాక్షో భవేద్గురుశిరా నరః,
కంఠతాల్వోష్ఠశిరసాం కండూభిరభిపీడితః. 27

తా. ముక్కువలన చీమిడి తెల్లగను, శీతలముగను, మిక్కుటముగను మాటి మాటికి స్రవించుట, శరీరము తెల్లనగుట, కన్నులుబ్బుట, తల బరువుగనుండుట, గొంతు, లోదవడ, పెదవి, శిరస్సు వీనియందు దురదగలుగుట ఇట్టిలక్షణములుగలది కఫజప్రతిశ్యాయమని తెలియవలయును.

సన్నిపాతప్రతిశ్యాయలక్షణము

భూత్వా భూత్వా ప్రతిశ్యాయో యస్యాకస్మాన్నివర్తతే,
సంపక్వో వాప్యపక్వో వా సతు సర్వభవస్స్మృతః. 28

తా. పడిశము పలుమారుజనించి పండిగాని లేక పండకగాని అకస్మాత్తుగ నిలిచిన నది సన్నిపాతప్రతిశ్యాయమని తెలియవలయును.

దుష్టప్రతిశ్యాయలక్షణము

ప్రక్లిద్యతే పునర్నాసా పునశ్చ పరిశుష్యతి,
పునరానహ్యతే చాపి పునర్వివ్రియతే తథా. 29
నిశ్వాసోవాతిదుర్గంధో నరో గంధం న వేత్తి చ,
ఏవం దుష్టప్రతిశ్యాయం జానీయాత్కృచ్ఛ్రసాధనమ్. 30

తా. ముక్కు మాటిమాటికి తడిసినట్లుండుట, మరల శోషించుట, మరల అడుచుకొనుట, మరల ముక్కు దెరచికొనుట, దుర్గంధముగ నిశ్వాసము వెడలుట, వాసనదెలియకపోవుట ఇట్టిలక్షణములుగలది దుష్టప్రతిశ్యాయమని తెలియవలయును. ఇదికష్టసాధ్యము. (ఇదిప్రతిశ్యాయములలో అవస్థాభేదముగలదిగ నుండుటంజేసి ఆరవదిగ గణింపబడియెను.)

రక్తప్రతిశ్యాయలక్షణము

రక్తజే తు ప్రతిశ్యాయే రక్తస్రావః ప్రవర్తతే,
తామ్రాక్షశ్చ భవేజ్జంతురురోఘాతప్రపీడితః. 31
దుర్గంధోచ్ఛ్వాసవదనో గంధానపి న వేత్తి సః,

తా. ముక్కువలన రక్తము స్రవించుట, కన్నులెఱ్ఱగనుండుట, ఉరఃక్షత పీడతోతుల్యమగు పీడలుగలుగుట, ఉచ్ఛ్వాసము, నోరు వీనియందు దుర్గంధము వెడలుట, వాసన దెలియకుండుట ఇట్టిలక్షణములుగలది రక్తజప్రతిశ్యాయమని తెలియవలయును.

అసాధ్యప్రతిశ్యాయలక్షణము

సర్వఏవ ప్రతిశ్యాయా నరస్యాప్రతికారిణః. 32
దుష్టతాం యాన్తి కాలేన తదాఽసాధ్యా భవన్తి చ,
మూర్ఛంతి కృమయశ్చాత్ర శ్వేతాస్స్నిగ్ధాస్తథాఽణవః. 33
కృమిజో యశ్శిరోరోగస్తుల్యం తేనాస్య లక్షణమ్,

తా. సర్వప్రతిశ్యాయముల నుపేక్షించుటవలన కాలాంతరమునందు దుష్టములై అసాధ్యములై, తెల్లగను, నున్నగను, సన్నముగనుండు క్రిములు ముక్కులో జనించును. దానియందు క్రిమిజశిరోరోగలక్షణములు గలిగియుండును.

ప్రతిశ్యాయోపేక్షాజవికారములు

బాధిర్యమాంధ్యమఘ్రత్వం ఘోరాంశ్చ నయనామయాన్. 34
శోథాగ్నిసాదకాసాదీన్వృద్ధాః కుర్వన్తి పీనసాః,

తా. సర్వపీనసలు వృద్ధిపొందిన చెవుడు, మందదృష్టి, వాసనదెలియకుండుట, భయంకరమగు నేత్రరోగము, వాపు, అగ్నిమాంద్యము, దగ్గు మొదలగునవి జనించును.

నాసికార్శోలక్షణము

నాసికారంధ్రయోశ్చైవ హ్యాజస్తనవదుద్భవేత్. 35
తన్నామ మునిభిః ప్రోక్తం నాసికార్శ ఇతిధ్రువమ్,

తా. నాసికారంధ్రములయందు మేకచన్నులవలె కాయలుజనించిన, వానిని నాసికార్శములనియెదరు.

అర్బుదం సప్తధా శోథాశ్చత్వారోర్శశ్చతుర్విధమ్. 35
చతుర్విధం రక్తపిత్తముక్తం ఘ్రాణేపి తద్విదుః,
శిరోలలాటతాలూనాం గౌరవం దోషవిగ్రథా. 37
సార్శసాం సార్బుదానాం చ దోషకోపాకృతిస్సమా,
అర్శాంసి గోస్తనాకారాణ్యర్బుదం కోలసన్నిభమ్. 38

తా. నాసికారోగముల యొక్క సంఖ్యాపూర్తికై మరల ఆ విధములుగ వక్కాణించుచున్నాడు. అవి యెట్లనిన అర్బుదము ౭ విధములనియు, నాసాశోథ ౪ విధములనియు, నాసారక్తము ౪ విధములనియును, మరియు శిరస్సు, లలాటము, దవడలు ఇవిబరువుగనుండుట, దోషయుక్తమగుట ఇవియు అర్శస్సులకు, అర్బుదములకు దోషకోపము, ఆకారము సమముగనుండును. అర్శస్సులు ఆవుచన్నులవలెనుండుననియు, అర్బుదములు రేగుపండ్లవలెనుండుననియును తెలియవలయును.

పీనసరోగచికిత్స

సర్వేషు పీనసేష్వాదౌ నివాతాగారగో భవేత్,
శిరసోభ్యంజనైస్స్వేదైర్నస్యైర్మందోష్ణభోజనైః. 39
వమనైర్ఘృతపానైశ్చ యథా దోషముపాచరేత్,

తా. సర్వపీనసరోగములయందు ప్రథమమందు గాలిలేనియింటియందుండుట, శిరోభ్యంజనము, స్వేదకర్మ, నస్యము, మందోష్ణభోజనము, వమనము, ఘృతపానము ఇటుల దోషానుగుణ్యముగ నుపచారములు జేయవలయును.

సర్వపీనసములకుచికిత్స

సర్వేషు సర్వకాలం పీనసరోగేషు జాతమాత్రేషు. 4(
మరిచం గుడేన దధ్నా భుంజీత నరస్సుఖం లభతే,

తా. సర్వపీనసలయందు. పెరుగులో మిరియాలపొడి, బెల్లముగలిపి యెల్లప్పుడు సేవింపుచుండిన సర్వపీనసరోగములు నివర్తించి సుఖముగనుండును.

గుడాదియోగము

గుడమరిచవిమిశ్రం పీతమాశు ప్రకామం
హరతి దధి నరాణాం పీనసం దుర్నివారమ్. 41
యది తు సఘృతమన్నం శ్లక్ష్ణగోధూమచూర్ణైః
కృతముపహరతేసౌ తత్క్షణాత్స్యావకాశః,

తా. బెల్లము, మిరియాలచూర్ణము సేకముగచేర్చి, పెరుగులోకలిపి పుచ్చుకొనిన దుర్నివారకమగుపీనస శీఘ్రముగ నివర్తించును. మరియు నేతితోగూడియుండు గోధుమరవ్వఅన్నము భక్షించిన పీనసరోగము నివర్తించును.

పీనసరహస్యాదులు

ఉష్ణోదకేన వా నస్యం పిప్పలీ నాగరం నిశా. 42
దేవదారుఫలార్ద్రేణ గుంజైకం శీతవారిణా,
సప్తాహే పీనసం హన్తి నాసారోగం చ నాశయేత్. 43

తా. పిప్పలి, శొంఠి, మిరియాలు వీనిని ఉష్ణోదకముతో నూరి నస్యముజేసినను లేక దేవదారుమంగపండ్లు, అల్లము, వీనిని శీతోదకముతో నూరి గురిగింజప్రమాణము ౭ దినములు నస్యముచేసినను, పీనస, నాసారోగము ఇవి నివర్తించును. (మరియు పాపరపండును నస్యముజేసినను పీనస నివర్తించును.)

ద్రాక్షాదితైలము

ద్రాక్షా శుంఠీ విడంగాని పిప్పలీ కుష్ఠచూర్ణితమ్,
తతో దశగుణైస్తోయైః క్వాథయేత్పాదశేషితమ్. 44
ఘృతం చూర్ణసమం క్షిప్త్వా ప్యాజ్యం వా తిలతైలకమ్,
స్నేహావశేషం తత్పాచ్యం నస్యాన్నాసామయం జయేత్. 45

తా. ద్రాక్ష, శొంఠి, వాయువిడంగములు, పిప్పళ్లు, చెంగల్వకోష్టు వీనిని సమభాగములుగ చూర్ణించి, చూర్ణమునకు పదింతలు ఉదకముబోసి, నాలవపాలు మిగులునటుల కాచి, అందుపైచూర్ణమునకు సమముగ నెయ్యిగాని, నువ్వులనూనెగాని వైచి, తైలము మిగులువరకు కాచి నస్యముచేసిన నాసారోగము నివర్తించును.

జీవంత్యాదికషాయము

ద్వాత్రింశత్పలదుగ్ధం తు పాచయేత్సమవారిణా,

జీవన్తీందశమూలం చ తస్మిన్దశపలం క్షిపేత్. 46
పాదశేషం హరేత్క్వాథంనస్యాత్పీనసనాశనమ్,

తా. మనుబాల, దశమూలములు వీనిచూర్ణము ౧౦ పలములుచేర్చి పాలు ౩౨ పలములు, నీళ్లు ౩౨ పలములుచేర్చి నాలవపాలు మిగులునటుల కషాయముకాచి నస్యముజేసిన పీనసరోగము నివర్తించును.

అశ్వగంధాదితైలేన నస్యాన్నాసారుజం హరేత్. 47
సైరేయకాదితైలేన శిరోలేపాచ్చ తం జయేత్,

తా. అశ్వగంధాదితైలమును నస్యముచేసినగాని లేక సైరేయకాదితైలమును శిరస్సున అభ్యంజనముజేసినగాని పీనసనివర్తించును.

కణాదినస్యము

కణాసైంధవకం పిష్ట్వాహ్యుష్ణనీరేణ నస్యతః. 48
నాసాశ్రవణవాతం చ కంఠవాతం చ నాశయేత్,

తా. పిప్పలి, సైంధవలవణము వీనిని వేడినీళ్లతోనూరి నస్యముజేసిన నాసావాతము, శ్రవణవాతము, కంఠవాతము ఇవి నివర్తించును.

కృష్ణజీరం వస్త్రబద్ధమాఘ్రాతం పీనసప్రణుత్. 49
ఆఘ్రాతోరజనీధూమః సద్యశ్లేష్మహరోభవేత్,
అర్కమూలకృతం నస్యం కామిలాం దుస్సహాం హరేత్. 50

తా. నల్లజీలకఱ్ఱ బట్టనుగట్టి వాసనచూచిన పీనసహరించును. పసపుకాల్చి పొగ ఆఘ్రాణించిన దగ్గునివర్తించును. జిల్లేడువేరును నస్యముజేసిన ప్రబలమగు కామిల హరించును.

నిర్గుండీస్వరసప్రస్థే తైలప్రస్థం విపాచయేత్,
త్రిఫలాం త్ర్యూషణం చైవ జీరకద్వయసైంధవే. 51
పునర్నవామూలం చ మాయూరం బీజమేవ చ,
కల్కీకృత్యప్రదాతవ్యమజాక్షీరం చ దాపయేత్. 52
నస్యమేతత్ప్రయోక్తవ్యం నాసారోగవినాశనమ్,

తా. వావిలియాకురసము ౧ ప్రస్థము, నూనె ౧ ప్రస్థముచేర్చి వీనిలో త్రిఫలములు, త్రికటుకములు, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, సైంధవలవణము, తెల్లగలిజేరువేరు, (ఉత్తరేణివిత్తులు వీనికల్కమును ౨ శేర్లు) మేకపాలుగలిపి తైలపక్వముగకాచి, నస్యముజేసిన నాసారోగము నివర్తించును.

### పూతినాసమునకు వ్యాఘ్రీతైలము

వ్యాఘ్రీదన్తీ వచాశిగ్రుసురసావ్యోషసైంధవైః. 53
సిద్ధం తైలం నసి క్షిప్తం పూతినాసాగదాపహమ్,

తా. నేలములక, దంతివేరు, వస, మునగ, తులసి, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము వీనికల్కముతోగాని లేక కషాయముతోగాని తైలము సిద్ధపరచి నస్యముజేసిన పూతినాసారోగము నివర్తించును.

### శిగ్రుతైలము

శిగ్రుసింహీనికుంభానాం బీజైస్సవ్యోషసైంధవైః. 54
బిల్వపత్రరసే సిద్ధం తైలం స్యాత్పూతినాసనుత్,

తా. మునగవిత్తులు, నేలములకవిత్తులు, నాగదంతివిత్తులు, శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, మారేడాకురసము వీనిచేసిద్ధముచేయబడిన తైలమును నస్యముజేసిన పూతినాసారోగము నివర్తించును.

### నాసాపాకమునకు సర్జకాదిఘృతము

సర్జార్జునోదుంబరవత్సకానాం త్వచా కషాయైః పరిధావనేన.  55
కషాయకల్కైర పిచైభిరేవ సిద్ధం ఘృతంఘ్రాణవిపాకనాశి,

తా. సర్జరసము, మద్ది, అత్తి, కొడిసెపాల, వీనిపట్టలను కషాయముకాచి ఆకషాయముచే నాసాపాకవ్రణమును గడుగుటయేగాక పైపట్టలయొక్క కల్కమునందుగాని కషాయమునందుగాని నెయ్యిచేర్చికాచి రాసిన నాసాపాకము నివర్తించును.

### పాఠాదితైలము

పాఠాద్విరజనీమూర్వాపిప్పలీజాతిపల్లవైః. 56
ఏభిశ్చ తైలం సంసిద్ధం నస్యతః పీనసాపహమ్,

తా. అగభుశొంఠి లేక విషబొద్ది, పసపు, మ్రానిపసపు, చాగవేరు, పిప్పలి వీనిని కషాయములో జాజిఆకురసము తైలమునుగలిపి చిక్కగకాచి నస్యము చేయించిన పీనసము మానును.

### వ్యోషాదిగుటికలు

వ్యోషాచిత్రకతాళీసతిత్రిడీచామ్లవేతసమ్. 57
సచవ్యాజాజితుల్యాంశైమేలాత్వక్పత్రపాదికమ్,
వ్యోషాదికమిదం చూర్ణం పురాణగుడమిశ్రితమ్. 58
పీనసశ్వాసకాసఘ్నం రుచిస్వరకరం పరమ్,

తా. శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తాళీసపత్రి, చింత, పుల్ల ప్రబ్బలి, చవ్యము, జీలకఱ్ఱ ఇవి ప్రత్యేకము, ౧ భాగము, ఏలకులు, లవంగపట్ట, లవంగపత్రి ఇవి ప్రత్యేకము సాలభాగము ఇటుల వీనినన్నిటిని చూర్ణించి పాత బెల్లముగలిపి మాత్రలుజేసి భక్షించిన పీనస, శ్వాస, దగ్గు ఇవి నివర్తించుటయే గాక రుచి, స్వరము వీనిని కలుగజేయును.

పూయరక్తచికిత్స

పూయాస్రే రక్తపిత్తఘ్నాః కషాయానావనానిచ. 59
పాకదాహాదిరోగేషు శీతలేపాదికాః క్రియాః,

తా. చీము, రక్తము ఇవి స్రవించు నాసారోగమునందు రక్తపిత్తహర కషాయములు నస్యములు మొదలగువానితో చికిత్సచేయవలయును. దానియందుపాక దాహాదులుగలిగియుండిన శీతకరములగులేపనములు సేకములు జేయవలయును.

షడ్బిందుఘృతము

భృంగం లవంగం మధుకం చ కుష్ఠం సనాగరం గోఘృతమిశ్రితం చ.
షడ్బిందునాసాగతపీనసంచశిరోగతం రోగశతం నిహన్తి,

తా. గుంటగలగర, లవంగములు, అతిమధురము, చెంగల్వకోష్ఠు, శొంఠి వీనికషాయములో ఆవునెయ్యిచేర్చి పక్వముగవండి అరుబిందువులునస్యముజేయించిన నాసాగతపీనస శిరోరోగము మొదలగు సర్వరోగములు నివర్తించును.

క్షవథుకు శుంఠ్యాదిఘృతము

శుంఠీకుష్ఠకణాబిల్వద్రాక్షాకల్కకషాయవత్. 61
తైలం పక్వమథాజ్యం వా నస్యాత్క్షవథునాశనమ్,

తా. శొంఠి, చెంగల్వకోష్ఠు, పిప్పలి, బిల్వఫలము, ద్రాక్ష వీనికల్కమునందు గాని లేక కషాయమునందు గాని నూనె లేక నెయ్యిచేర్చి స్నేహపక్వముగవండి నస్యముచేసిన క్షవథు నివర్తించును.

ఘృతగుగ్గులుమిశ్రస్య సిక్థకస్య ప్రయత్నతః. 62
ధూమః క్షవథురోగఘ్నో భ్రంశథుఘ్నశ్చ దేహినామ్,

తా. నెయ్యి, గుగ్గిలము, మైనము వీనిని సేకముగజేసి పొగపైచిన క్షవథు, భ్రంశథు ఇవి నివర్తించును.

దీప్తనాసారోగచికిత్స

నస్యం హితం నింబరసాంజనాభ్యాం దీప్తే శిరస్స్వేదనమత్ర శస్తమ్.
నస్యే కృతే క్షీరజలావసేకాః శంసంతి భుంజీత చ ముద్గయూషైః,

తా. వేపరసము, రసాంజనము వీనియొక్క నస్యమును (కుంభికాశాకముల వలన) కొంచెము స్వేదమును నస్యముచేసినపిదప పాలునీరునుచేర్చి సేచనమును చేయించుటయేగాక పథ్యము పెసరకట్టిడిన దీప్తనాసారోగము నివర్తించును.

నాసాస్రావచికిత్స

నాసాస్రావే ఘ్రాణయోశ్శ్వైవచూర్ణం
నాడ్యా దేయం చావపీడాశ్చపథ్యాః. 64
తీక్ష్ణధూమాన్దేవదార్వగ్నికాభ్యాం
మాంసం చాజం పథ్యమత్రాదిశంతి,

తా. నాసాస్రావమునందు కరక్కాయచూర్ణమును గొట్టముతో ప్రవేశబెట్టుట పథ్యమగు అవపీడనము దేవదారు, చిత్రమూలము మొదలగువానియొక్క తీక్ష్ణధూమములు వీనిచేనుపచారములంజేయవలయును. మరియు దీనియందు మేకమాంసమును భుజించవలయును.

ప్రతిశ్యాయచికిత్స

ప్రతిశ్యాయేషు సర్వేషు గృహం వాతవివర్జితమ్. 65
వస్త్రేణ గురుణోష్ణేనశిరసో వేష్టనం హితమ్,

తా. సర్వప్రతిశ్యాయములయందును వాతరహితస్థలమునందుండుట, దళముగను ఉష్ణముగనుండు వస్త్రమును తలకుగట్టుకొనుట ఇవి హితకరములుగ నుండును.

బాలమూలయూషము

బాలమూలకయూషశ్చ కుళుత్థోత్థశ్చ పూజితః, 66
స్వేదఉష్ణం హితం భోజ్యం పాచనాయ ప్రశస్యతే,

తా. ప్రతిశ్యాయమునందు లేతముల్లంగి, ఉలవలు వీనియూషము చెమటదీయుట, ఉష్ణకరభోజనము వీనిని సేవించుటవలన ప్రతిశ్యాయము పక్వమగును.

పిప్పల్యాదినస్యము

తతః పక్వం కఫం జ్ఞాత్వా హరేచ్ఛీర్షవిరేచనైః. 67
పిప్పల్యశ్శిగ్రుబీజాని విడంగం మరిచాని చ,
అవపీడఃప్రశస్తోయం ప్రతిశ్యాయనివారణః. 68

తా. కఫము పక్వమైనపిదప శీర్షవిరేచనముచేయించి కఫమును దీసివేయవలయును. పిప్పళ్లు, మునగవిత్తులు, వాయువిడంగములు, మిరియాలు వీనిని అవపీడననస్యము చేయించవలయును. ఇటులజేసిన ప్రతిశ్యాయ నివారణయందు ప్రశస్తములుగ నుండును.

వాతజప్రతిశ్యాయచికిత్స

వాతికే తు ప్రతిశ్యాయే పిబేత్సర్పిర్యథాక్రమమ్,
పంచభిర్లవణై స్సిద్ధం పంచమూలగణేనచ. 69

తా. వాతికప్రతిశ్యాయమునందు పంచలవణములు లేక * పంచమూలములు వీనితో సిద్ధమగు ఘృతపానం బొనర్చవలయును.

పిత్తజప్రతిశ్యాయచికిత్స

హితం పిత్తప్రతిశ్యాయే పాచనార్థం ఘృతం పయః,
శృంగబేరేణ పయసా శృంగబేరమథాపివా. 70

తా. పిత్తజ ప్రతిశ్యాయమునందు పాచనార్థమై నెయ్యి, పాలు, అల్లపు రసము వీనిని నేకముగగాని లేక పాలు, అల్లపురసము గలిపిగాని పానము జేయవలయును.

కఫజప్రతిశ్యాయచికిత్స

కఫజే సర్పిషా స్నిగ్ధం తిలమాషవిపక్వయా,
యవాగ్వా పాయయిత్వా తు శ్లేష్మఘ్నం క్రమమాచరేత్. 71

తా. కఫజ నాసారోగమునందు ఘృతముచే స్నిగ్ధముగచేసి పిదప నువ్వులు మినుములు వీనిచే సిద్ధము చేయబడిన యవాగుతో కఫనివారకములగు ఔషధముల సేవించవలయును.

ధూమపానవర్తి

దార్వీంగుదనికుంభైశ్చ కిణీహ్వాసరళేన చ,
వర్తయోత్ర కృతా యోజ్యా ధూమపానే యథావిధి. 72

తా. మానిపసపు, గారపట్ట, దంతి, ఉత్తరేణు, సర్జరసము వీనిని నుదకముతో నూరి వస్త్రమునకుబట్టించి వర్తిజేసి యథావిధిగ ధూమపానంబొనర్చిన కఫజ ప్రతిశ్యాయము నివర్తించును.

చిత్రహరీతకీరసాయనము

చత్వార్యత్ర శతాని చిత్రకజటాయుక్పంచమూలాన్మృతా,
ధాత్రీణాచపలానివాత్రిభిరపాంద్రోణైశ్చసంక్వాథయేత్. 73
పాదస్థే క్వథనే గుడస్య చ శతం పథ్యాఢకేనాన్వితమ్,
పక్త్వవ్యం శృతశీతలే చ మధునః ప్రస్థార్ధమాత్రం క్షిపేత్. 74

---

* ఇచ్చట బృహత్పంచమూలములను గ్రహింపవలెను.

వ్యోమస్యత్రిసుగంధకస్య చ పలాన్యత్రైవ షట్ప్రక్షిపేత్,
క్షారస్యార్ధపలం రసాయనమిదం సంసేవ్యతాం సర్వదా. 75
శోష శ్వాసమలావరోధవమథు శ్లేష్మ ప్రతిశ్యాయిభిః,
క్షీణోరఃక్షతహిక్కికాకఫశిరోరోగ ప్రనష్టాగ్నిభిః. 76

తా. చిత్రమూలము, పంచమూలములు, తిప్పతీగె, ఉశిరికవోలుపు వీనిని ౮౦౦ పలములు గ్రహించి ౩ ద్రోణములయుదకములో వైచి నాలవపాలు మిగులునటుల కషాయము కాచి వడియగట్టి అందు ౧౦౦ పలములు బెల్లము, ఆఢక ప్రమాణము కరక్కాయలు చేర్చి పక్వము చేసి చల్లారినపిదప ౪ ప్రస్థము తేనె, ౬ పలములు త్రికటుకములు, త్రిసుగంధములు ౪ పలము, యవక్షారము గలిపి సదా సేవింపుచుండిన శోష, శ్వాస, మలబద్ధము, వాంతి, దగ్గు, పడిశము, కృశత్వము, ఉరఃక్షతము, ఎక్కిళ్లు, కఫజశిరోరోగము, మందాగ్ని ఇవి నివర్తించును.

### హింగ్వాదితైలము

హింగువ్యోషవిడంగకట్ఫలవచారుక్తీక్ష్ణగంధైర్యుతైః,
లాక్షాశ్వేతపునర్నవాబ్దకుటజైః పుష్పైశ్చనాకోద్భవైః. 77
ఇత్యేభిః కటుతైలమేతదనలే మందే సమూత్రం శృతమ్,
పీతం నాసికయా యథా విధిభవేన్నాసామయేభ్యో హితమ్. 78

తా. ఇంగువ, శొంఠి, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, కాయఫలము (అనగా కన్వగుమ్మడు) వస, చెంగల్వకోష్ఠు, నల్లమునగ, లక్క, తెల్లగలిజేరు, తుంగముస్తలు, కొడిశవిత్తులు, లవంగములు వీనికషాయము చేగాని లేక కల్కము చేగాని తెల్లావనూనెగోమూత్రము చేర్చి మందాగ్నిచే కాచి యథావిధిగ నస్యము చేసిన నాసారోగము నివర్తించును.

### నాసారోగ సామాన్యచికిత్స

రక్తపిత్తం చ శోథశ్చ తథార్శాంస్యర్బుదాని చ,
నాసికాయాం స్యురేతేషాం స్వంస్వం కుర్యాచ్చికిత్సితమ్ 79

తా. నాసికయందు రక్తపిత్తము, వాపు, అర్శస్సు, అర్బుదము, అనునాసికారోగములు జనించిన ఆయారోగచికిత్సనే జేయవలయును.

### నాసార్శస్సునకు గృహధూమాదితైలము

గృహధూమకణాదారుక్షారనక్తాహ్వసైంధవైః.
సిద్ధం శిఖరిబీజైశ్చ తైలం నాసార్శసాం హితమ్. 80

తా. కరుభూపము, పిప్పళ్లు, దేవదారు, యవక్షారము, పసపు, సైంధవలవణము, ఉత్తరేణువిత్తులు వీనిచే తైలమును సిద్ధపరచి ముక్కుయందు వైచిన నాసికార్శస్సు నివర్తించును.

కరవీరాదితైలము

రక్తస్య కరవీరస్య పుష్పం జాతేశ్చ మల్లికా,
తిలతైలం సమం త్వేతైః పక్వం నాసార్శసాం హితమ్, 81

తా. ఎఱ్ఱగన్నేరుపువ్వులు, జాజిపువ్వులు, మల్లెపువ్వులు వీనికి సమముగ తిలతైలమునుచేర్చి తైలపక్వముగ కాచి ముక్కులయందు వైచిన నాసికమునుంచి రక్తము స్రవించుట మానును.

రక్తప్రతిశ్యాయచికిత్స

రక్తపిత్తోద్భవే పేయం సర్పిర్మధురకైః శ్రృతమ్,

తా. రక్తపిత్తమువలనజనించిన ప్రతిశ్యాయమునందు మధురద్రవ్యములతో గాచిన నెయ్యినిపానముచేసిన రక్తప్రతిశ్యాయము నివర్తించును.

ధాత్రీలేపము

సర్పిషా భృష్టయా ధాత్ర్యా శిరసో లేపతః క్షణాత్. 82
నాసాయాం సంప్రవృత్తం చ రుధిరం చ వినశ్యతి,

తా. నేతితో ఉశిరికవొలుపునునూరి శిరమునకు లేపనముచేసిన ముక్కువలన రక్తముపడుట నివర్తించును.

ప్రతిశ్యాయసామాన్యచికిత్స

విడంగం సైంధవం హింగుగుగ్గులుస్సమనశ్శిలః. 83
ప్రతిశ్యాయేవచాయుక్తం సక్తుధూమం పిబేన్నరః,
ఏతచ్చ చూర్ణమాఘ్రాతం ప్రతిశ్యాయం వినాశయేత్. 84

తా. వాయువిడంగములు, సైంధవలవణము, ఇంగువ, గుగ్గిలము, మనుశిల, వీనిచూర్ణమును మూటగట్టి వాసనచూచుచుండిన ప్రతిశ్యాయము నివర్తించును. మరియు వస, పేపుడుపిండి వీనిని నిప్పునవైచి పొగనాఘ్రాణించినను ప్రతిశ్యాయము నశించును.

సక్తుధూమము

ఘృతతైలసమాయుక్తం సక్తుధూమం పిబేన్నరః,
సధూమస్యాత్ప్రతిశ్యాయకాసహిక్కాపహారః పరః. 85

తా. నెయ్యి, నూనె వీనిలో పేలపిండికలిపి దానిపొగను వాసనచూచుచు పీల్చుచుండిన పడిశము, దగ్గు, ఎక్కిళ్లు ఇవి నివర్తించును.

నవసాగరయోగము

ప్రతిశ్యాయేషు సశిరఃపీడేషు నవసాగరమ్,
సమానంచసుధాచూర్ణం సూక్ష్మం సంచూర్ణితం ద్వయమ్. 86
గుంజామాత్రం తు తచ్చూర్ణం నస్యప్రథమనంచరేతి,
నశ్యంత్యనేన యత్నేన ప్రతిశ్యాయశిరోరుజః. 87

తా. తలనొప్పితోగూడియుండు ప్రతిశ్యాయముజనించిన నవాసాగరము, సున్నము వీనిని సమముగ ఖల్వమునవైచినూరి గురిగింజయెత్తు ముక్కున ప్రథమ నస్యముజేసిన ప్రతిశ్యాయము తలనొప్పి ఇవి నివర్తించును.

ప్రతిశ్యాయహరనస్యము

వచాయాశ్చూర్ణమాఘ్రాయ వాససా పోటలీకృతమ్,
కారవీం వస్త్రబద్ధాం వా ప్రతిశ్యాయమపోహతి. 88

తా. వసనుగాని లేక ఓమమునుగాని చూర్ణించి వస్త్రమునకుగట్టి వాసన పీల్చిన పడిసెము మానును.

శఠ్యాదిచూర్ణము

శఠీసామలకీవ్యోషచూర్ణం సర్పిర్గుడాన్వితమ్,
హార్తేద్ఘోరం ప్రతిశ్యాయంపార్శ్వహృద్వస్తిశూలనుత్. 89

తా. కచోరము, ఉశిరికెవరుగు, శొంఠి, పిప్పలి, మిరియాలు వీనిచూర్ణములో నెయ్యి, బెల్లముకలిపి భక్షించిన మిక్కిలి భయంకరమగుపడిశము, పార్శ్వము, రొమ్ము, వస్తి వీటియందలి శూల నివర్తించును.

క్రిమినాసాచికిత్స

క్రిమిఘ్నా యే క్రమాః ప్రోక్తా స్తాన్ప్వై కృమిషు యోజయేత్,
ధావనాని కృమిఘ్నాని భేషజాని చ బుద్ధిమాన్. 90

తా. క్రిమిరోగమునందు జెప్పబడిన ఔషధములవలనను క్రిమినాశకరధావనములవలనను క్రిమినాసారోగము నివర్తించును.

క్రిమిహరచికిత్స

రక్తామ్లస్వరసశ్శుద్ధ స్తక్రేణ సహ నస్యతః,
తస్య పర్ణాని పిష్ట్వాచ బధ్నీయాన్నాసికాముఖే. 91

పతంతి కీటకాస్సద్యో యోగోయం త్రిదినే హిత,,
పీనసాన్ను చ్యుతే రోగీ శతశో నుమితం త్విదమ్. 92

తా. ఎర్రగోగుకూర స్వరసమునువడిచుగట్టి మజ్జిగలో కలిపి నస్యముచేసి పిదప ఎర్రగోగాకుకూరనునూరి నాసికాముఖమునసునిచి 3 దినములుగట్టిన తక్షణము పురుగులు పడిసెము ఇవి నివర్తించును.

నాసికార్శోనివర్తకోపాయము

నాసారంధ్రేంగుళీంక్షిప్త్వా నాసికార్శశ్చపీడయేత్,
వర్త్రి ప్రవిష్టం యుక్త్యా వై పాతయేద్వ్యాధివేదిభిః. 93

తా. ముక్కు రంధ్రములలో వ్రేళ్లునునిచి అదిమిన కొండనాలికవద్దగాని లేక అంగిటియందుగాని నాసికార్శస్సుదిగును దానిని వేళ్లతో బట్టి యుక్తిగదెంపి వేయవలయును.

అశ్వగంధాదితైలేన నస్యన్నాసార్శసోహితమ్,
అహింస్రపత్రం లశునం మరీచం చ తథా స్మృతమ్. 94

తా. అశ్వగంధాది తైలమునుగాని లేక ఆరెదొండఆకు వెల్లుల్లిపాయలు, మిరియాలచూర్ణము వీనిని గలిపిగాని 2 మార్లు నస్యముచేసిన ముక్కున చీముకారుట నివర్తించును.

నాసికారోగములకు పథ్యములు

స్వేదస్స్నేహాశ్శిరోభ్యంగః పురాణా యవశాలయః,
కుళుత్థముద్గయోర్యూషో గ్రామ్యజాంగలజా రసాః. 95
వార్తాకం కుళకం శిగ్రు కర్కోటం బాలమూలకమ్,
లశునం దధితప్తాంబు వారుణీచ కటుత్రయమ్. 96
కట్వమ్లలవణం స్నిగ్ధముష్ణం చ లఘుభోజనమ్,
నాసారోగే పీనసాదౌ సేవ్యమేతద్యథామలమ్. 97

తా. చమటదీయుట, స్నేహసేకము, అభ్యంజనము, పాతయవలు, వరిబియ్యము, ఉలవలు, పెసలు, వీనియూషము, గ్రామ్యమాంసరసము, జాంగలమాంసరసము, వంకాయ, చేదుపొట్ల, మునగకాయ, మాశేదుకాయ, లేతముల్లంగి, వెల్లుల్లి, పెరుగు, ఉష్ణోదకము, మద్యము, త్రికటుకములు, కారము, పులుసు, ఉప్పు, జిగటగలపదార్థములు, ఉష్ణలఘుభోజనము వీనిని నాసారోగము గలవారికి దోషానుగుణ్యముగ పథ్యములని గ్రహింపవలయును.

—అపథ్యములు—

స్నానంక్రోధంశకృన్మూత్ర వాతవేగాఞ్శుచంద్రవమ్,
భూమిశయ్యాంచయత్నేన నాసారోగీపరిత్యజేత్. 98

తా. స్నానము, క్రోధము, మలమూత్ర వాతవేగముల నడ్డగించుట, శోకము, ద్రవపదార్థములు, భూమిపైపరుండుట వీనిని నాసారోగము గలవారలు ప్రయత్నపూర్వకముగ విసర్జించవలయును.

—పీనసరోగములకు పథ్యములు—

లఘ్వన్నం స్నిగ్ధలవణముష్ణభోజనమార్ద్రికమ్,
పక్షిమాంసం గుడం క్షీరం చణకాస్త్రికటూత్కటమ్. 99
బాలమూలకజోయూషః కుళుత్థస్య చ పూజితమ్.

తా. లఘుకరాన్నము, సముద్రలవణము, వేడియన్నము, అల్లము, పిట్టిమాంసము, బెల్లము, పాలు, శనగలు, త్రికటుకములు, లేతముల్లంగితో యుక్తముగ కాచబడిన యూషము, ఉలవకట్టు, చకోరమువలన పెసరకట్టు వీనిని పీనసరోగములయందు పథ్యములుగ గ్రహించవలయును. (మరియు, నోత్తడమిచ్చుట, పొగత్రాగుట ఇవి పీనసయందు ప్రశస్తములుగ నుండును.)

---

# శిరోరోగప్రకరణమ్.

—శిరోరోగభేదములు—

శిరోరోగాశ్చ జాయన్తే వాతపిత్తకఫైస్త్రిభిః,
సన్నిపాతేన రక్తేన క్షయేణ కృమిభిస్తథా. 1
సూర్యావర్తానంతవాతార్ధావభేదకశంఖకైః,

తా. శిరోరోగము వాతజ, పిత్తజ, కఫజ, సన్నిపాతజ, రక్తజ, క్షయజ, క్రిమిజ, సూర్యావర్త, అనంతవాత, అర్ధావభేదక, శంఖములన ౧౧ విధములై యుండును. వానిలక్షణముల వివరించెదరు.

—శిరోరోగనిదానము—

ధూమాతపతుషారాంబు క్రీడాతిస్వప్నజాగరైః. 2
ఉత్స్వేదాతిపురోవాత బాష్పనిగ్రహరోదనైః,
అంత్యంబుమద్యపానేన క్రిమిభిర్వేగధారణైః. 3
ఉపధానమృజాభ్యంగ ద్వేషాచ్చ ప్రతతేక్షణైః,

అసాత్మ్యగంధదుష్టాన్న భాషాద్యైశ్చ శిరోగదః. 4
ఏకాదశవిధస్యాస్య లక్షణాని ప్రచక్ష్మతే,

తా. ధూమము, యెండ, మంచు, జలక్రీడ, అతినిద్ర, అతిజాగరణ, మిక్కిలిగనుండు తూర్పుగాలి, కన్నులనీరును నిరోధించుట, రోదనము అధికము, నుదకపానము, అతిమద్యపానము, క్రిమి మలమూత్రవేగనిరోధము, పరుగులిడుట, ఘట్టిగ తలఅంటుకొనుట, ద్వేషమువలన కన్నులు మిక్కిలి తెరచిచూచుట, దుష్టగంధము, దుష్టాన్నము, మిక్కిలి సంభాషణ ఈకారణములవలన శిరోరోగము జనించును. అది ౧౧ విధములుగ నుండును. వాని లక్షణంబుల వివరించెద.

వాతజశిరోరోగలక్షణము

యస్యానిమిత్తం శిరసో రుజశ్చ భవంతి తీవ్రా నిశి చాతిమాత్రమ్. 5
బంధోపతాపైః ప్రశమశ్చ యత్ర శిరోభితాపస్ససమీరణేన,

తా. కారణములేక అకస్మాత్తుగ తలనొచ్చుట, రాత్రులయందు మిక్కిలి తలనొచ్చుట, కట్టువలనగాని లేక ఆవిరిచ్చుటవలనగాని తలనొప్పి శమించుట ఇట్టిలక్షణములుగలది వాతజ శిరోరోగమని తెలియవలయును.

పిత్తజశిరోరోగలక్షణము

యస్యోష్ణమంగారచితం తథైవ భవేచ్ఛిరో చేసిన ముఖ్యాక్షినాసమ్. 6
శీతేన రాత్రౌ చ భవేచ్ఛమశ్చ శిరోభితాపస్సతు పిత్తకోపాత్,

తా. శిరస్సుపై నిప్పులుంచినటుల మండుట, కన్నులు ముక్కులు వీనివలన కాలినట్లు సెగవెడలుట, శీతకరపదార్థములవలనగాని లేక రాత్రులయందుగాని శమించుట ఇట్టిలక్షణములు గలిగియుండిన పిత్తజశిరోరోగమని తెలియవలయును.

కఫజశిరోరోగలక్షణము

శిరోభవేద్యస్య కఫోపదిగ్ధం గురుప్రతిస్తబ్ధమథో హిమం చ. 7
శూనాక్షికూటం వదనం చ యస్య శిరోభితాపస్సకఫప్రకోపాత్,

తా. శిరస్సు కఫముచే పూయబడినటులుండుట, బరువుగనుండుట, కట్టబడినటులనుండుట, చల్లగనుండుట, కన్నురెప్పలు ముఖము ఇవియుబ్బుట ఇట్టి లక్షణములు గలిగియుండిన కఫప్రకోపమువలన జనించిన తలనొప్పియని తెలియవలయును.

సన్నిపాతజశిరోరోగలక్షణము

శిరోభితాపే త్రితయప్రవృత్తే సర్వాణి లింగాని సముద్భవంతి. 8

తా. వాత, పిత్త, కఫజ శిరోరోగలక్షణములన్నియు గలిగియుండిన సన్నిపాతమువలన గలిగిన తలనొప్పియని తెలియవలయును.

### రక్తజశిరోరోగలక్షణము

రక్తాత్మకః పిత్తసమానలింగస్స్పర్శాసహత్వం శిరసో భవేచ్చ.

తా. పిత్తజశిరోరోగ లక్షణములతోఁగూడికొనినదై, శిరస్సు స్పర్శమునోర్వలేకయుండిన నది రక్తజ శిరోరోగమని తెలియవలయును.

### క్షయజశిరోరోగలక్షణము

అసృగ్వసాశ్లేష్మసమీరణానాం శిరోగతానామిహసంక్షయేణ. 9
క్షవప్రవృత్తిశ్శిరసోభితాపః కష్టో భవేదుగ్రరుజోతిమాత్రమ్,
సంస్వేదనచ్ఛర్దనధూమనస్యైరసృగ్విమోక్షైశ్చ వివృద్ధిమేతి. 10

తా. శిరమునందలి రక్తము, వస, కఫము, వాయువు ఇవి క్షయించుటవలన కష్టతరమైన మిక్కిలి భయంకరమగు తలపోటుజనించి మిక్కిలి తుమ్ములువచ్చుట, శిరస్సు తపించుట, స్వేదనక్రియ, వాంతి, పొగత్రాగుట, నస్యము, రక్తస్రావము వీని వలన వృద్ధిపొందుట ఇట్టిలక్షణములుగలది క్షయజ శిరోరోగమని తెలియవలయును.

### క్రిమిజశిరోరోగలక్షణము

నిస్తుద్యతే యస్య శిరోతిమాత్రం సంభక్ష్యమాణం స్ఫురతీవ చాంతః,
ఘ్రాణాచ్చగచ్ఛేద్రుధిరం సపూయం శిరోభితాపః కృమిభిస్సఘోరః.

తా. శిరస్సున సూదులతోఁపొడిచినతెరంగున మిక్కిలినొప్పిగలుగుట, శిరము నందలిమెదడు పురుగులచే భక్షింపబడినటులుండుట, శిరము మిక్కిలి చలించునటు లుండుట, ముక్కువలన చీముతోఁడరక్తముగారుట, (ముక్కునుండిపురుగులు వొకా నొకసమయమున వెడలుట.) ఇట్టిలక్షణములుగలది క్రిమిజశిరోరోగమని తెలియ వలయును. (భయంకరమగు నీరోగము ప్రాణము హరించును.)

### సూర్యావర్త శిరోరోగలక్షణము

సూర్యోదయం యా ప్రతిమందమందమక్షిభ్రువంరుక్సముపైతిగాఢా,
వివర్ధతే చాంశుమతా సహైవ సూర్యాపవృత్తౌ వినివర్తతే చ. 12
శీతేన శాన్తింలభతే కదాచిదుష్ణేన జన్తుస్సుఖమాప్నుయాద్వా,
సర్వాత్మకం కష్టతమం వికారం సూర్యాపవృత్తం తముదాహరన్తి.

తా. సూర్యోదయముమొదలు కన్నులు, కనుబొమ్మలు వీనియందు మంద మందమునొచ్చుటను ప్రారంభించి సూర్యుఁడెటుల వృద్ధిజెందునో అటులనే క్రమముగా వృద్ధిజెంచి సూర్యుడపరాహ్ణగతుడై యెటులక్రమముగతగ్గునో అటులనేతగ్గుచు సూర్యాస్తమయమునకు నిశ్శేషముగ నివర్తించుటయు, నొకానొకసమయమున శీతోప చారమువలనగాని ఉష్ణోపచారమువలనగాని సుఖముగలుగుట, సన్నిపాతవికారములు

గలుగు ఇట్టిలక్షణములుగలది సూర్యావర్తమని యెఱుంగవలయును. ఇది కష్టసాధ్యము. (ఇదియే బొమ్మనొప్పియందురు.)

### అనంతవాత లక్షణము

దోషాస్తుదుష్టాస్త్రయఏవమన్యాం సంపీడ్యగాఢంసరుజాంసుతీవ్రామ్,
కుర్వంతి సాక్షిభ్రువిశంఖదేశే స్థితిం కరోత్యాశు విశేషతస్తు. 14
గండస్యపార్శ్వేచకరోతికంపం హనుగ్రహంలోచనజాంశ్చరోగాన్,
అనంతవాతం తముదాహరంతి దోషత్రయోత్థం శిరసో వికారమ్. 15

తా. వాత పిత్త కఫములు దుష్టంబులై, మెడయొక్క వెనుకటిసిరనాశ్రయించి బలముగలాగుచు కన్నులు కనుబొమలు కణత వీనిని జెంది, కడుతీవ్రమైన పీడనుగలుగం జేయుట, దానిసంబంధమువలన చెంపలయొక్క పార్శ్వములు మిక్కిలి వణుకుట, చెక్కిళ్లుబిగపట్టుకొనుట, నేత్రరోగములుగలుగుట ఇట్టిలక్షణములుగలది అనంతవాతమని దెలియవలయును. ఇది త్రిదోషములవలన జనించును.

### అర్ధావభేదలక్షణములు

రూక్షాశనాత్యధ్యశనప్రాగ్వాతహిమమైథునైః,
వేగసంధారణాయాసవ్యాయామైః కుపితోనిలః. 16
కేవలస్సకఫోవార్ధం గృహీత్వా శిరసో బలీ,
మన్యాభ్రూశంఖకర్ణాక్షిలలాటేర్ధేతి వేదనామ్. 17
శస్త్రారణినిభాం కుర్యాత్తీవ్రాం సోర్ధావభేదకః,
నయనం వాథవా శ్రోత్రమభివృద్ధో వినాశయేత్. 18

తా. రూక్షాన్నమును సేవించుట, అజీర్ణముగనుండునపుడు భక్షించుట, తూర్పుగాలి, మంచు, మైథునము వీనినిసేవించుట, మలమూత్రవేగము నడ్డగించుట, శ్రమ, వ్యాయామము మొదలగువానివలన వాతముగాని లేక వాతకఫముగాని ప్రకోపించి అర్ధశిరస్సునాశ్రయించి పెడతలపెద్దనరము, కనుబొమలు, కణత, చెవి, కన్నులు, లలాటము వీనియొక్క నొసపార్శ్వమునందువ్యాపించి బలమై శస్త్రముతో బొడిచినటులగాని అగ్నిదీపెడికర్రనుమథించినటులగాని తీవ్రమగువేదనను గలుగజేసిన దానిని అర్ధావభేదమనియెదరు. ఇది మిక్కుటముగ వృద్ధిపొందిన అభాగముయొక్క కన్నునుగాని చెవినిగాని నశింపజేయునని తెలియవలయును.

### శంఖకలక్షణము

పిత్తరక్తానిలాదుష్టాశ్శంఖదేశే విమూర్ఛితాః,
తీవ్రరుగ్దాహరాగం హి శోథం కుర్వన్తి దారుణమ్. 19

సశిరోవిషవద్వేగీ నిరుద్ధ్యాశు గళం తథా,
త్రిరాత్రాజ్జీవితం హన్తి శంఖకో నామ నామతః. 20
త్ర్యహాజ్జీవతి భైషజ్యం ప్రత్యాఖ్యాయాస్య కారయేత్,

తా. పిత్తరక్తవాతంబులు దుష్టములై కఫముతో గలసి మిక్కిలి వృద్ధిపొంది కణతలవ్యాపించి మిక్కుటముగ పోట్లును మంటను ఎరుపువర్ణమైభయంకరమైన వాపును గలుగంజేయును. ఈవాపు విషవేగముగలదై శిరమువఱన గొంతువరకు వ్యాపించి శీఘ్రముగ గొంతునుపట్టుకొని మూడుదినములలో మనుజునిజంపును. ఇది శంఖక మనంబడును. రోగి మూడుదినములకు పిదప జీవించియుండిన నసాధ్యమనియెరిగించి వైద్యుడు చికిత్సజేయవలయును.

వాతజ శిరోరోగ చికిత్స

శిరోభిఘాతేనిలజే వాతవ్యాధివిధిం చరేత్. 21
ఘృతేనాక్తం శిరో రాత్రౌ పిబేద్యూషం పయో నువా,

వాతజశిరోభిఘాతమునందు వాతరోగచికిత్సను జేయువలయును. మరియు రాత్రియందు శిరస్సున నెయ్యిపట్టించి యూషమునుగాని పాలనుగాని పుచ్చుకొనవలయును.

పిత్తజశిరోరోగచికిత్స

పిత్తాత్మకే శిరోరోగే స్నిగ్ధం సమ్యగ్విరేచనమ్. 22
మృద్వీకాత్రిఫలేక్షూణాం రసైః క్షీరైర్ఘృతైరపి,

తా. పిత్తజశిరోరోగమునందు ద్రాక్ష, త్రిఫలములు, చెరకు వీనిరసములు, పాలు, నెయ్యి వీనిచే బాగుగ విరేచనము చేయించవలయును.

కఫజశిరోరోగ చికిత్స

శ్లైష్మికే చందనైరూక్షైర్లేపస్వేదాది కారయేత్. 23

తా. కఫజశిరోరోగమునందు చందనము, రూక్షకరద్రవ్యములు వీనిని లేపనమును, స్వేదాది కర్మలను జేయవలయును.

సాన్నిపాతికశిరోరోగచికిత్స

సన్నిపాతసముత్థేత్ర ఘృతం తైలం చ వస్తయః,
ధూమశ్చం నస్యం శిరోరేకలేపస్వేదాద్యమాచరేత్. 24

తా. సన్నిపాతజ శిరోరోగమునందు నెయ్యి, తైలము, వస్తికర్మ వీనిచే చికిత్సజేయుటయేగాక నాసికముచే ధూమమును పీల్పించుట, మస్తకవిరేచనము, లేపనము, స్వేదము మొదలగు క్రియల జేయవలయును.

స్వేదనం ఘృతగోధూమైర్ని గుండ్యాః క్వథితేన వా,
సన్నిపాతోద్భవాం హన్తి పీడాం హి హితపాచనైః. 25

తా. నెయ్యి గోధుమలు వీనినిగాని వావిలి కషాయముగాని వెచ్చగానుండగా దానివలన స్వేదమును జేయుటయేగాక హితకరమగు పాచనమునకు సహా యిచ్చిన సన్నిపాత శిరోరోగము నివర్తించును.

రక్తజశిరోరోగచికిత్స

రక్తజే పిత్తవత్సర్వం భోజనాలేపసేచనమ్,
శీతోష్ణయోశ్చ విన్యాసో విశేషాద్రక్తమోక్షణమ్. 26

తా. రక్తజశిరోరోగమునందు సర్వపిత్తనాశకరభోజనములు, లేపనములు, శీతోష్ణపదార్థముల శిరస్సునందు ధరించుట, విశేషముగ రక్తమును స్రవింపజేయుట ఇవి మొదలగువానిని జేయవలయును.

క్రిమిజశిరోరోగచికిత్స

క్రిమిజే తు శిరోరోగే వ్యోషనక్తాహ్వశిగ్రుజైః,
అజామూత్రేణ సంపిష్టైర్నస్యం కృమిహరం స్మృతమ్. 27

తా. త్రికటుకములు, కానుగపట్ట, మునగపట్ట వీనిని మేకపంచితముతో నూరి నస్యముచేసిన క్రిములు నివర్తించును.

సూర్యావర్తచికిత్స

సూర్యావర్తప్రశమనం పాయయేత్సగుడం హవిః,
తిలదుగ్ధప్రలేపేన సూర్యావర్తం జయేత్త్ర్యహమ్. 28

తా. నెయ్యిలో బెల్లముగలిపి తాగినను లేక నువ్వులనుపాలతో నూరి లేపనము జేసినను సూర్యావర్తము మూడుదినములలో నివర్తించును.

సూర్యావర్తశిరోరోగచికిత్స

సూర్యావర్తే శిరావేధో నావనం క్షీరసర్పిషోః,
హితః క్షీరఘృతాభ్యాసస్తాభ్యామేవ విరేచనమ్. 29

తా. సిరనువేధించుటయేగాక పాలు, నెయ్యి వీనియొక్క నస్యముయొక్క పానమును జేయించి మరియు వానిచేతనే విరేచనమును సహా జేయించిన [illegible]ర్యావర్త శిరోరోగము నివర్తించును.

అనంతవాతశిరోరోగచికిత్స

అనంతవాతే కర్తవ్యస్సూర్యావర్తహితో విధిః,

సిరావేధశ్చ కర్తవ్యోఽనంతవాతప్రశాన్తయే. 30

తా. పైనూర్యావర్తమునకు జెప్పియుండు చికిత్సలనుచేసి సిరావేధనమును చేసిన అనంతవాతము నివర్తించును.

—॥ వాతజశిరోరోగమునకు ఏరండాదిలేపము ॥—

ఏరండచక్రమర్ద్దోత్థబీజపిష్టారనాళకైః,
లలాటలేపనంహన్తి వాతకోపశిరోరుజామ్. 31

తా. ఆముదపువిత్తులు తగిరిశెవిత్తులు వీనిని పుల్లనికలితోనూరి లలాటమునందు పట్టువైచిన వాతప్రకోపమువలన జనించిన తలనొప్పి నివర్తించును.

కుష్ఠమేరండమూలం చ నాగరం తక్రపేషితమ్,
కవోష్ణం చ శిరఃపీడాం మాత్రాలేపనతో హరేత్. 32

తా. చెంగల్వకోష్ఠు, ఆముదపువేరు, శొంఠి వీనిని మజ్జిగతోనూరి వుడికించి కొంచెము ఉష్ణముగనుండగ దట్టముగ పట్టువైచిన వాతజనితమగు తలపోటు నివర్తించును.

కుష్ఠమేరండమూలం చ లిప్తంకాంజికపేషితమ్,
శిరోర్తిం వాతజాం హన్యాత్పుష్పం వా ముచుకుందజమ్. 33

తా. చెంగల్వకోష్ఠు, ఆముదపువేరు వీనిని కాంజికముతోనూరిగాని లేక ముచుకుందపుపువ్వులను కలితోనూరిగాని పట్టువైచిన వాతజశిరోరోగము నివర్తించును.

—॥ పిత్తజశిరోరోగమునకు చందనాదిలేపము ॥—

చందనోశీరయష్ట్యాహ్వాబలావ్యాఘ్రినఖోత్పలైః,
క్షీరపిష్టైః ప్రదేహస్స్యాచ్ఛృతైర్వా పరిషేచనమ్. 34

తా. చందనము, వట్టివేరు, అతిమధురము, చిట్టాముట్టి, వ్యాఘ్రినఖము, నల్లకలువదుంప వీనిని పాలతోనూరి పట్టువైచినను లేక వీనికషాయముచే స్నానము చేయించినను పిత్తమువలన జనించిన తలనొప్పి నివర్తించును.

ధాత్రీకసేరుహ్రీబేరపద్మపద్మకచందనైః,
దూర్వోశీరనళానాం చ మూలైః కుర్యాత్ప్రలేపనమ్, 35
శిరోర్తిం పిత్తజాం హన్యాద్రక్తపిత్తరుజం తథా,

తా. ఉశిరికెవొలుపు, పరికెడములు, కురువేరు, తామరపూలు, పద్మకము చందనము, గరికె, వట్టివేరు, నళమనుగ్రంథ్యము వీనినినూరి పట్టువైచిన పిత్తమువలన పుట్టినతలనొప్పి రక్తపిత్తజనితమగు తలనొప్పి, ఇవి నివర్తించును.

## కఫజశిరోరోగమునకు హారేణ్వాదిలేపము

హారేణునతశ్శైలేయముస్తైలాగరుదారుభిః. 36
మాంసీరాస్నోరుబూకైశ్చ కోష్ణో లేపః కఫార్తినుత్,

తా. రేణుకలు, గ్రంధికతగరము, శిలారసము, తుంగముస్తలు, ఏలకులు, కృష్ణాగరు, దేవదారు, జటామాంసి, సన్నరాస్నము, ఆముదపువేరు వీనిని నూరి వుడికించి కొంచెము ఉష్ణముగనుండునపుడు పట్టువేసిన కఫజనితమగు తలపోటు నివర్తించును.

## ప్రపున్నాటాదిలేపము

శుంఠీకుష్ఠప్రపున్నాటదేవకాష్ఠైస్సమాహిషైః. 37
మూత్రపిష్టైస్సుఖోష్ణైశ్చ లేపశ్శ్లేష్మశిరోర్తినుత్,

తా. శొంఠి, చెంగల్వకోష్ఠు, తగిరిశెవిత్తులు, దేవదారు, మహిసాక్షిగుగ్గిలము వీనిని ఆవుపంచితముతో నూరి వుడికించి కొంచము వెచ్చగ పట్టువేచిన శ్లేష్మమువలన జనించిన శిరశ్శూల నివర్తించును.

## రక్తజశిరోరోగమునకు కృష్ణాదిలేపము

కృష్ణాబ్దశుంఠీమధుకశతాహ్వోత్పలవాలకైః. 38
జలపిష్టైశ్శిరోలేపస్సద్యశ్శూలనివారణః,

తా. పిప్పళ్లు, తుంగముస్తలు, శొంఠి, యష్టిమధుకము, పిల్లపీచర, నల్లకలువ, కురువేరు వీనిని నుదకముతో నూరి, శిరస్సునందు పట్టువేచిన తత్క్షణమునందే శూల నివర్తించును.

## సూర్యావర్తమునకు శారిబాదిలేపము

శారిబోత్పలకుష్ఠాని మధుకం చామ్లపేషితః. 39
సర్పిస్తైలయుతో లేపస్సూర్యావర్తార్ధభేదయోః,

తా. సుగంధపాలవేరు, నల్లకలువగడ్డలు, చెంగల్వకోష్ఠు, అతిమధురము వీనిని ఆమ్లద్రవ్యముతో నూరి, అందు నెయ్యి, నూనెకలిపి పట్టువేచిన సూర్యావర్తము, అర్ధావభేదమను తలనొప్పి ఇవిమానును.

## అర్ధావభేదమునకు మరీచాదిలేపము

మరిచం భృంగజైర్ద్రావైర్లిప్తం మరిచతండులమ్. 40
అర్ధశీర్షవ్యథాం హన్తి లేపో వా శుంఠిపాదినా,

తా. మిరియాలుగాని లేక మిరియాలు, బియ్యము వీనినిగాని గుంటగలగరాకు రసముతోనూరి లేపనముజేసినను లేక శొంఠిని ఉదకముతోచాది లేపనము జేసినను, అర్ధావభేదకమనుతలనొప్పి నివర్తించును.

శారిబాదిలేపము

శారిబాకుష్ఠమధుకవచాకృష్ణోత్పలై స్తథా. 41
లేపస్సకాంజికస్నేహస్సూర్యావర్తార్ధభేదయోః,

తా. సుగంధపాలవేరు, చెంగల్వకోష్ఠు, అతిమధురము, వస, పిప్పళ్లు, నల్ల కలువ వీనిని కలితోనూరి నేయికలిపి లేపనముచేసిన సూర్యావర్తము, అర్ధభేదము ఇవి నివర్తించును.

శంఖకమునకు దార్వ్యాదిలేపము

దార్వీ హరిద్రా మంజిష్ఠా సనింబోశీరపద్మకమ్. 42
ఏతత్ప్రలేపనం కుర్యాచ్ఛంఖకస్య ప్రశాన్తయే,

తా. మానిపసపు, పసపు, మంజిష్ఠ, వేపవేరు, వట్టివేరు, పద్మకము వీనినినూరి పట్టువైచిన శంఖకము నివర్తించును.

బలా నీలోత్పలం దూర్వా తిలాః కృష్ణాః పునర్నవా. 43
శంఖకేనంతవాతే చ లేపస్సర్వశిరోర్తినుత్,

తా. ముత్తవపులగ, నల్లకలువ, గరికె, నల్లనువ్వులు, తెల్లగలిజేరు వీనినినూరి పట్టువైచిన శంఖకము, అనంతవాతము సమస్తతలనొప్పులు ఇవి నివర్తించును.

తలనొప్పులకు అమృతామలకతైలము

అమృతామలకమైలేయం భృంగాహ్వా చైవ కేతకీ. 44
కుమారీస్వరసశ్చైషాంతైలప్రస్థం విపాచయేత్,
క్షీరప్రస్థసమాయుక్తం మధుయష్టిత్రిజాతకమ్. 45
కుష్ఠం జాతీఫలం ద్రాక్షా శతాహ్వాచందనద్వయమ్,
మాలతీముకుళోశీరవాలకంచాక్షబీజకమ్. 46
ఏభిర్నిష్కప్రమాణైశ్చ శనైర్మృద్వగ్నినా పచేత్,
అనేనాభ్యంజనం శ్రేష్ఠం శిరోభ్రమణకంపనే. 47
శిరశ్శూలే నేత్రశూలే హ్యర్ధభేదశిరోరుజి,
శిరోవస్తౌహితంవర్ణ్యమక్షిరోగే విశేషతః. 48

తా. తిప్పతీగె, ఉశిరికెపండ్లు, సూగుదోసాకు, గుంటగలగరాకు, మొగలి చన్నులు, కలుబంద వీనిస్వరసమును ప్రత్యేకము ౧ ప్రస్థము, నూనె ౧ ప్రస్థము,

పాలు ౧ ప్రస్థము వీనినన్నిటి నేకముగచేర్చి, అందు అతిమధురము, యాలకులు, లవంగములు, ఆకుపత్రి, కోష్ఠు, జాజికాయ, ద్రాక్షపండు, సదాపవిత్తులు, శ్రీగంధము రక్తచందనము, జాజిమొగ్గలు, వట్టివేళ్లు, కురువేరు, తాడికాయవిత్తులు వీనిని ప్రత్యేకము ౧ తులముచొప్పున చూర్ణించివైచి తైలముసిద్ధపరచి తలయంటుకొనిన తలదిరుగుట, తలవణుకు, తలనొప్పి కన్నులయందలి నొప్పి, అరతలనొప్పి ఇవినశించును. శిరోవస్తియందు హితము. అక్షిరోగమును నివర్తింపజేయును. శరీరవర్ణమునకు హితము.

### ఐలేయకతైలము

ఐలేయకస్య స్వరసం తైలక్షీరసమం పచేత్,
చందనం సరళం ద్రాక్షాం మధుకం చ సితాం తు గామ్. 49
సర్వపిత్తవికారఘ్నం శిరోభ్రమణకంపనుత్,

తా. నాగుదోసాకురసము, నూనె, పాలు వీనిని సమముగచేర్చి అందు చందనము, దేవదారు, ద్రాక్షపండు, అతిమధురము, చక్కెర, తవక్షీరి వీనిని ప్రత్యేకము తులమెత్తువైచి తైలముసిద్ధపరచి సేవించిన సర్వపిత్తవికారములు, శిరోభ్రమణము, తలవణుకు ఇవి నివర్తించును.

### భృంగామలకతైలము

ఆఢకం భృంగరాజస్య రసమామలకస్య చ. 50
క్షీరద్రోణేన సంయుక్తమాఢకం తైలమాపచేత్,
యష్టించందనకుష్ఠేచరాస్నాశ్రీరేబలాత్రయమ్. 51
కచోరం చ నిశాం లాక్షాంత్వగేలాపత్రధాన్యకమ్,
మిశిద్వయం వాలకం చ పృథక్కర్షద్వయం క్షిపన్. 52
తత్ భృంగామలకం నామ్నా శిరోరోగాన్వినాశయేత్,
దన్తరోగాన్కర్ణరోగాన్ విషమజ్వరనాశకమ్. 53
క్షయాపస్మారకుష్ఠాదీన్ నాశయత్యాశు వాతజిత్,

తా. గుంటగలగరాకురసము, ఉశిరికపండ్లరసము, నూనె వీనిని ప్రత్యేకము ౧ ఆఢకము, పాలు ౧ ద్రోణము వీనిని నేకముగచేర్చి కాచుచు, అందు అతిమధురము, శ్రీగంధము, చంగల్వకోష్ఠు, దుంపరాష్న, వట్టివేళ్లు, చిట్టాముట్టి,* పేరాముట్టి, నాగముత్తవపులగవేళ్లు, కచోరములు, పసపు, లక్క, లవంగపుచెక్క, ఏలకులు, ఆకుపత్రి, ధనియాలు, సదాపవిత్తులు, పెద్దసదాప, కురువేరు వీనిని ప్రత్యేకము ౧ తులముచొప్పున చూర్ణించివైచి తైలముకాచి, పానాభ్యంజన సేవనములచేసిన

తలనొప్పులు, దంతరోగములు, కర్ణరోగములు, విషమజ్వరములు, క్షయ, అపస్మారము, వాతము, కస్తము ఇవి శీఘ్రముగ నివర్తించును.

## కుమారీ తైలము

సమూలగృహకన్యాయా స్స్వరసే చ చతుర్గుణే. 54
తైలం క్షీరసమం క్షిప్త్వా కల్కద్రవ్యాణి దాపయేత్,
మంజిష్ఠాంజనశారిబాబ్దకటుకాతక్కోలజాతీఫలైః. 55
శ్రీఖండత్రిఫలాజటీతగరరుగ్యష్టీచతుర్జాతకైః,
సోశీరాగరుచోరయుగ్మమృగనాభీందూత్పలాప్లంజ్ఞకైః. 56
తైలం నేత్రశిరోర్తిహారిపయసస్సిద్ధం కుమారీరసే,

తా. కలబందసమూలమునరికి, రోటిలోవేసిదంచి వడియగట్టినరసము ౧ కుంచము, నూనెమానెడు, పాలు మానెడు కలిపి తైలపక్వముగవండుచూ అందు మంజిష్ఠ, రసాంజనము, సుగంధపాల, తుంగముస్తలు, కటుకరోహిణి, తక్కోలములు, జాజికాయ. శ్రీగంధము, త్రిఫలకములు, జటామాంసి, గ్రంధితగరము, కోష్ఠు, యష్టిమధుకము, చాతుర్జాతములు, వట్టివేరు, అగరు, తెల్లకచ్చూరములు, నల్లకచ్చూరములు, కస్తూరి, పచ్చకర్పూరము, నల్లకలువదుంప, కుసువేరు వీనిని ప్రత్యేకము ౧ తులముచొప్పునచేర్చి చూర్ణించివైచి తైలపక్వముగకాచి అభ్యంజనము చేసికొనిన నేత్రశూల, శిరశ్శూల ఇవి నివర్తించును.

## వాతజశిరోరోగమునకు నవనాథసిద్ధతైలము

వాశానిర్గుండిధుత్తూరవహ్నిమంథదినేశ్వరాః. 57
పత్రస్నుహీకంటకారీహ్యేరండశ్చ వసంతికా,
ఏషాంక్వాథం నవప్రస్థం పత్రసారం చ తత్సమమ్. 58
గోఘృతం ప్రస్థమాత్రం చ చిత్రాత్తైలస్యతద్ద్వయమ్,
తైలంచతుః ప్రస్థమాత్రమజాక్షీరం చ తత్సమమ్. 59
ఇమాని భాండే నిక్షిప్య తైలపాకేన పాచయేత్,
వ్యోషావిడంగం చక్రాంగీ మహారాష్ట్రీ చ కుష్ఠకమ్. 60
ఏలాలవంగం తాళీసపత్రం దేవకుసుమం త్వచా,
తాళీఫలం పత్రచవ్య జాతీఫలకముస్తకమ్. 61
శ్యామాపత్రం శుక్తినఖమహిసాక్షీ చ ధూపకమ్,
చందనద్వితయం హ్యాంబు మృగనాభిశ్చ కుంకుమమ్. 62
చంద్రనామకమేతాని ప్రత్యేకం పలమాత్రకమ్,

సంచూర్ణ్య కల్కద్రవ్యాణి తైలే నిక్షిప్య పాచయేత్. 63
ఏతదభ్యంజనాన్నస్యాన్మర్దనాదిసుసేవనాత్,
శిరోవాతం వాతశూలం పీనసం కంపవాతకమ్, 64
నిహన్తి సర్వదాభ్యాసాదశీత్యనిలనాశకమ్,
నవనాథమిదం ఖ్యాతం తైలం లోకోపకారకమ్. 65

తా. అడ్డసరము, వావిలి, నల్లఉమ్మెత్త, కూరనెల్లి, జిల్లేడు, ఆకుజెముడు, ములక, అముదము, ములుముస్తెలు వీనివేళ్లకషాయము ప్రత్యేకము ౧ ప్రస్థము, వీనిఆకులరసము ప్రత్యేకము ౧ ప్రస్థము, అవునెయ్యి ౧ ప్రస్థము, చిట్టాముదము ౨ ప్రస్థములు, నూనె ౪ ప్రస్థములు, మేకపాలు ౪ ప్రస్థములు వీనినన్నిటిని ౧ భాండమునందుచేర్చి, తైలపాకముగ కాచుచు అందు త్రికటుకములు, వాయువిడంగములు, కటుకరోహిణి, మరాటిమొగ్గలు, చెంగల్వకోష్ఠు, ఏలకులు, లవంగములు, తాళీసపత్రి, లవంగపుచెక్క, తాడికాయలు, ఆకుపత్రి, చవ్యము, జాజికాయ, తుంగముస్తలు, పచ్చాకు, నఖంచిప్పయనుగ్రంథ్యము, మహిసాక్షి, సాంబ్రాణి, మంచిగంధపుచెక్క, కృష్ణాగరు, కురువేరు వీనిని ప్రత్యేకము ౧ పలముచొప్పున చూర్ణించివైచి తైలముకాచిదించి, అందు వగహాయెత్తు కస్తూరి, తులము పచ్చకర్పూరము, ౩ తులముల కుంకుమపువ్వు వీనినినూరిచేర్చి అభ్యంజన నస్యమర్దనాదులంచేసిన శిరోవాతము, వాతజశిరశ్శూల, పీనస, కంపవాతము, నిరంతరసేవనవలన అశీతి వాయువులు ఇవియన్నియూ నివర్తించును.

## తిక్తకోశాతకీతైలము

తిక్తకోశాతకీప్రస్థమజాక్షీరం చ తత్సమమ్,
భృంగరాజరసం ప్రస్థం ఘృతం కుడుపసమ్మితమ్. 66
ఏరండతైలం కుడుపం ప్రస్థార్ధం తిలతైలకమ్,
త్రిజాతత్రిఫలాకుష్ఠ మధుకోశీరశారిబాః. 67
చందనద్వయమంజిష్ఠా శతాహ్వారజనీత్రయమ్,
ఏభిర్నిష్కప్రమాణైశ్చశనైర్మృద్వగ్నినా పచేత్. 68
తిక్తకోశాతకీతైలం నామ్నాచాభ్యంజనాదిభిః,
అక్షిరోగశిరశ్శూలశిరోవాతాన్ హరేత్పరమ్. 69
శిరోవస్తౌ హితంచైవ హ్యక్షిరోగే విశేషతః,

తా. చేదుబీరాకురసము ౧ ప్రస్థము, మేకపాలు ౧ ప్రస్థము, గుంటగలగరాకురసము ౧ ప్రస్థము, అవునెయ్యి ౪ పలములు, చిట్టాముదము ౪ పలములు,

నువ్వులనూనె ౨౹౪ పలములుచేర్చి తైలపక్వముగ కాచుచు, అందు ఆకుపత్రి, లవంగపు చెక్క, యాలకులు, త్రిఫలములు, కుష్ఠము, అతిమధురము, వట్టివేరు, సుగంధపాల వేళ్లు, శ్రీగంధము, కృష్ణాగరు, మంజిష్ఠ, సదాపవిత్తులు, మంచి పసపు,మానిపసపు, కస్తూరిపసపు వీనిని ప్రత్యేకము ౧ వరాహయెత్తు చూర్ణించివైచి తైలపక్వముగ కాచి, అభ్యంజనాదులజేసికొనిన అక్షిరోగము, శిరోరోగము, శిరోవాతము ఇవి నివర్తించును. మరియు శిరోవస్తియందును నేత్రరోగములందునుగూడ హితకరము.

## అర్ధావభేదమునకు బృహజ్జీవక తైలము

జీవకర్షభకౌ వాపి ద్రాక్షా చ మధుకం బలా. 70
నీలోత్పలం చందనం చ విదారీ శర్కరా తథా,
తైలప్రస్థం పచేదేభిశ్శనైః పయసి షడ్గుణే. 71
జాంగలస్య తు మాంసస్య తులార్ధస్వరసేన తు,
సిద్ధమేతద్భవేన్నస్యం తైలమర్ధావభేదకమ్. 72
బాధిర్యం కర్ణశూలం చ తిమిరం గళగండకమ్,
వాతికం పైత్తికం చైవ శీర్షరోగం నియచ్ఛతి. 73
దన్తచాలం శిరశ్చాలం బృహజ్జీవకతైలకమ్,

తా. జీవకము, ఋషభకము, ద్రాక్ష, అతిమధురము, చిట్టాముట్టి, నల్లకలువ దుంప, చందనము, నేలగుమ్ముడుగడ్డ వీనికల్కము నొనర్చి అందునూనె ౧ ప్రస్థము, పాలు ౬ ప్రస్థములు, జాంగల జంతుమాంసరసము ౫౦ పలములుచేర్చి తైలపక్వముగ కాచి, నస్యముచేసిన అర్ధావభేదకము, బాధిర్యము, చెవిపోటు, తిమిరము, గళగండము, వాతికశిరోరోగము, పైత్తికశిరోరోగము, దంతచలనము, తలవణకు ఇవి నివర్తించును.

## శిరోవికారమునకు షడ్బిందుతైలము

ఏరండమూలం తగరం శతాహ్వాజీవంతికాసైంధవరాస్నికేచ. 74
భృంగం విడంగం మధుయష్టికా చ విశ్వౌషధం కృష్ణతిలస్య తైలమ్,
అజాపయస్తైస్తువిమిశ్రితం తు చతుర్గుణే భృంగరసే విపక్వమ్. 75
షడ్బిందవోనాసికయోః ప్రదేయాస్సర్వాన్నిహన్యుశ్శిరసోవికారాన్,
చ్యుతాంశ్చ కేశాంశ్చలితాంశ్చ దన్తాన్నిబద్ధమూలాన్సుదృఢీకరోతి.
సుపర్ణదృష్టిప్రతిమంచచక్షుః కుర్వంతి బాహ్వోరధికం బలం చ,

తా. ఆముదపువేరు, గ్రంథితగరము, పిల్లపీచర, జీవంతి, (పాలకూర) సన్నరాష్ట్రము, సైంధవలవణము, గుంటగలగర, వాయువిడంగములు, అతిమధురము, శొంఠి

వీనినిచూర్ణించి, నల్లనువ్వులనూనె, మేకపాలు వీనికి నాలుగింతల గుంటగలగరాకు రసములోకలిపి, పైచూర్ణమునువేచి తైలపక్వముగకాచి, ముక్కులయందు ౾ బిందువులువైచిన సమస్తశిరోవికారములను నివర్తింపజేయుటయేగాక వీడిపోవుకేశములు, చలించుచుండు దంతములు ఇవి దృఢపడును, మరియు గరుత్మంతునితో సమమగు దృష్టి, అధికబాహుబలము ఇవి గలుగును.

## నీలోత్పలాదితైలము

నీలోత్పలం కణా యష్టీ చందనం పుండరీకకమ్. 77
ప్రతికర్షంచతుష్కం స్యాత్తైలం షోడశకం పలమ్,
చతుష్షష్టిపలం ధాత్రీ ఫలానాం రసమాహరేత్. 78
పచేత్తైలావశేషం తు నస్యేనాభ్యంజనేన వా,
యోజ్యం హన్తి శిరస్తోదం పలితం చ వినాశయేత్. 79

తా. నల్లకలువదుంప, పిప్పలి, అతిమధురము, చందనము, తెల్లతామరపువ్వు వీనిని ప్రత్యేకము ౪ కర్షములు, నువ్వులనూనె ౧౬ పలములు, ఉశిరికకాయలరసము ౬౪ పలములు వీనినన్నిటిని నేకముగచేర్చి, తైలము పక్వముగకాచి, నస్యముగాని అభ్యంజనముగాని జేసుకొనిన తలనొప్పి, పలితము ఇవి నివర్తించును.

## శారిబాదితైలము

శారిబా హ్యమృతా యష్టీ త్రిఫలా నీలముత్పలమ్,
భృంగరాజ స్తృణం కుంభీ మహానింబపలాని చ. 80
కటుతైలం పచేదేభిః సార్ధం యవరసేన తు,
కండూం చ దారుణాం హంతి శిరోరోగం చ నాశయేత్. 81

తా. సుగంధపాల, తిప్పతీగె, అతిమధురము, త్రిఫలములు, నల్లకలువపూలు, గుంటగలగర, కామంచిగడ్డి, కాయఫలము, తురకవేపఫలము వీనికల్కములో ఆవనూనె, యవలకషాయము వీనినిచేర్చి తైలముకాచి సేవించిన దారుణమగు దురద, తలనొప్పి ఇవి నివర్తించును.

## నాగరాదినస్యము

నాగరకల్కవిమిశ్రం క్షీరం నస్యేన యోజితం పుంసామ్,
నానాదోషోద్భూతాం శిరోరుజం హన్తి తీవ్రాం చ. 82
శిరోర్తిం నాశయత్యాశు పుష్పం వా ముచుకుందజమ్,

తా. శొంఠికల్కములో పాలుంగలిపి నస్యముచేసిన నానావిధములగు దోషవశ

లవలనగిలిగిన శిరోరోగమునివర్తించును. మరియు ముచుకుందపువ్వులునూరి లేపనము జేసిన శిరోరోగము నివర్తించును.

॥ పిప్పల్యాదినస్యము ॥

పిప్పలీంసైంధవంయోజ్యంతైలేనాజ్యేన వా నసి. 83
శిరశ్శూలం నిహంత్యాశు తమస్సూర్యోదయో యథా,

తా. పిప్పళ్లు, సైంధవలవణము వీనినిచూర్ణించి, నూనెలోగాని లేక నేతిలోగానికలిపి (పాకముజేసి) నస్యముజేసిన సూర్యోదయమెటుల నంధకారమును నివర్తింపజేయునో అటుల మస్తకశూలను నివర్తింపజేయును.

॥ సూర్యావర్తమునకు దశమూలాదినస్యము ॥

దశమూలీకషాయైస్తు సర్పిస్సైంధవసంయుతైః. 84
నస్యమర్ధావభేదఘ్నం సూర్యావర్తశిరోర్తినుత్,

తా. దశమూలములకషాయములో నెయ్యి, సైంధవలవణము గలిపి నస్యముజేసిన అరతలనొప్పి, సూర్యావర్తము ఇవి నివర్తించును.

॥ భృంగరాజాదినస్యము ॥

భృంగరాజరసశ్ఛాగీక్షీరతుల్యోర్కతాపితః. 85
సూర్యావర్తం నిహన్త్యాశు నస్యేనైవ ప్రయోగతః,

తా. గుంటగలగరాకు రసమునకుసమముగ మేకపాలుగలిపి, సూర్యపుటమిడి నస్యముజేసిన సూర్యావర్త మతి శీఘ్రముగ నివర్తించును.

॥ గాంధార్యాదినస్యము ॥

గాంధారీ చ జటామాంసీ ఘృతేన సహ పాచయేత్. 86
తదాజ్యం నస్యమాత్రేణ నిహంత్యర్ధశిరోరుజమ్,

తా. గంజాయిఆకు, జటామాంసి వీనికల్కములో నెయ్యికలిపి కాచి నస్యముజేసిన అరతలనొప్పి నివర్తించును.

॥ తువర్యాదినస్యము ॥

అర్ధావభేదేతువరీదళోద్భవంరసంసుదూర్వారసమిశ్రితం చ, 87
నస్యేనయుంజ్యాద్భిషగేవబుద్ధిమాన్ శిరోరుజంనాశయతిస్మతత్క్షణమ్,

తా. కందియాకు, గరికె వీనిరసములను నస్యముజేసిన అరతలనొప్పినివర్తించును.

॥ విడంగాదినస్యము ॥

విడంగాని తిలాన్ కృష్ణాన్ సమాన్ పిష్ట్వా విలేపయేత్. 88
నస్యం చాథాచరేత్తస్మాదర్ధభేదం వ్యపోహతి,

తా. వాయువిడంగములు, నల్లనువ్వులు, వీనిని సమాంశములుగనూరి లేపనము, నస్యముజేసిన అరతలనొప్పి నివర్తించును.

గిరకర్ణ్యాదినస్యము

గిరకర్ణీఫలం మూలం సజలం నస్యమాచరేత్. 89
మూలం వా బంధయేత్కర్ణే నిహన్త్యర్ధశిరోరుజమ్,

తా. తెల్లగంటెనవిత్తులనుగాని లేక దానివేరునుగాని ఉదకముతోనూరి నస్యముచేసినను లేక దానివేరును చెవికిగట్టుకొనినను అరతలనొప్పి మానును.

దుగ్ధమదనాదినస్యము

సితోపలయుతం ఘృష్టం మదనం గోపయోన్వితమ్. 90
నస్యతోనుదితేసూర్యే నిహన్త్యర్ధావభేదకమ్,

తా. కలకండ, మ్రంగకాయ వీనినిచూర్ణించి, ఆవుపాలతోకలిపి సూర్యావర్తమను తలనొప్పికి సూర్యోదయమునకు ముందే నస్యముజేయించిన సూర్యావర్తము, అరతలనొప్పి ఇవి నివర్తించును.

గుడాదినస్యము

నావనం సగుడం విశ్వం పిప్పలీసైంధవాంబుభిః. 91
భుజస్తంభాదిరోగేషు సర్వమూర్ధగదేషు చ,

తా. బెల్లము, అల్లపురసము, పిప్పలి, సైంధవలవణము వీనిని ఉదకముతో నూరి నస్యముజేయించిన భుజస్తంభాదిరోగము, సకలశిరోరోగములు నివర్తించును.

శర్కరాదినస్యము

సశర్కరం కుంకుమమాజ్యభృష్టం నస్యం విధేయం పవనాసృగుత్థే.
భ్రూశంఖకర్ణాక్షిశిరోర్ధశూలే దినాభివృద్ధిప్రభవే చ రోగే,

తా. నేతితోవేయించబడిన కుంకుమపువ్వును పంచదారతోకలిపి నస్యము జేయించిన వాతిరక్తమువలన కనుబొమలు, కణతలు, చెవి, కన్నులు వీనియందు జనించిన శూల, అరతలనొప్పి, సూర్యావర్తము ఇవి నివర్తించును.

దాడింబాదియోగము

శిరశ్శూలే తు సంజాతే నాసారక్తం స్రవేద్యది, 93
దాడిమీపుష్పదూర్వోత్థరసంనస్యేప్రయోజయేత్,
కర్పూరంమాక్షికందుగ్ధం నస్యేపానే సితాపయః, 94

తా. దాడింబపువ్వు, గరికె వీనిరసమునుగాని లేక కర్పూరము, తేనె, పాలు వీనినిగాని శిరోమర్దనము) నస్యముచేసి, పానముచేసిన మస్తకశూలవలన గలిగిన

రక్తస్రావముహరించును. మరియు పానముజేయునెడల పంచదార, పాలు గలప వలయును.

### ఉదుంబరయోగము

ఉదుంబరఫలం పక్వం ఘృతపక్వం సితాయుతమ్,
ఏలామరిచసంయుక్తం భుక్తం స్యాద్రక్తశాన్తయే. 95
కంటకారీఫలరసం లిప్తం హంతి శిరోరుజమ్,

తా. పండినఅత్తిపండులో నెయ్యి, పంచదారకలిపి పాకముచేసి, ఏలకులు, మిరియాలు వీనిచూర్ణమునుగలిపి భక్షించిన నాసికారక్తస్రావము నివర్తించును. మరియు ములకపండ్లరసముదీసి శిరస్సునకు లేపనముచేసిన మస్తకశూల నివర్తించును.

### కరంజాదిశీర్ష విరేచనము

కరంజశిగ్రుబీజాని పత్రకం సర్షపత్వచః. 96
సర్వేషాం శీర్షరోగాణా మేతచ్ఛీర్ష విరేచనమ్,

తా. కానుగవిత్తులు, మునగవిత్తులు, లవంగపత్రి, తెల్లావాలు, లవంగపట్ట వీనిచూర్ణముతో శిరోవిరేచనముచేయించుట సర్వశిరోరోగములయందు ప్రశస్తముగ నుండును.

### శిరోరోగమునందు పథ్యములు

స్వేదో నస్యం ధూమపానం విరేకో లేపస్సేకో లంఘనం శీర్షవస్తిః. 97
రక్తోన్ముక్తిర్వహ్నికర్మోపనాహో జీర్ణం సర్పిశ్శాలయష్షష్టికాశ్చ,
యూషోదుగ్ధంధన్వమాంసంపటోలంశిగ్రుర్ద్రాక్షావాస్తుకం కారవేల్లమ్.
ఆమ్రంధాత్రీ దాడిమం మాతులుంగం తైలం తక్రం కాంజికం నారికేళమ్,
పథ్యాకుష్ఠం భృంగరాజః కుమారీముస్తోశీరం చంద్రికా గంధసారః.
కర్పూరం చ ఖ్యాతిమానేష వర్గస్సేవ్యోమర్త్యైశ్శీర్షరోగే యథాస్వమ్,

తా. ఆవిరి మొదలగు వానిచే చెమటదీయుట, నస్యము, ధూమపానము, విరేచనము, లేపనము, సేచనము, లంఘనము, శిరోవస్తి, రక్తస్రావము, రక్షవేయుట, కట్టుగట్టుట, పాతనెయ్యి, ఆరవైదినములకు పండు వడ్లబియ్యము, యూషము, పాలు, అడవిమృగముమాంసము, పొట్లకాయ, మునగకాయ, ద్రాక్షపండు, చక్రవర్తికూర, కాకరకాయ, ఉసిరికెకాయ, దాడింబకాయ, మాదీఫలము, నూనె, మజ్జిగ, కలి, టెంకాయ, కరక్కాయ, చెంగల్వకోష్ఠు, గుంటగలగర, కలబంద, తుంగముస్తలు, పట్టివేరు, వెన్నెల, చందనము, కర్పూరము ఇవి శిరోరోగమునకు పథ్యము అని తెలియవలయును.

—॥ శిరోరోగమునం దపథ్యములు ॥—

క్షవజృంభామూత్రబాష్ప నిద్రావిడ్వేగమంజనమ్. 100
దుగ్ధం నీరం విరుద్ధాన్నం విరుద్ధజలమజ్జనమ్,
దంతకాష్ఠం దివా నిద్రాం శిరోరోగీ పరిత్యజేత్. 101

తా. తుమ్ము, ఆవలింత, మూత్రము, కన్నీరు, నిద్ర, మలము, వీని వేగమును నిరోధించుట, అంజనము, పాలు, విరుద్ధఉదకములో స్నానముచేయుట, దంతకాష్ఠము, దివానిద్ర ఇవి శిరోరోగముగలవాండ్లకు అపథ్యములుగాన విడువవలయును.

---

# నేత్రరోగప్రకరణమ్.

—॥ నేత్రరోగనిదానము ॥—

ఉష్ణాభితప్తస్య జలప్రవేశాద్దూరేక్షణాత్స్వప్నవిపర్యయాచ్చ,
స్వేదాద్రజోధూమనిషేవణాచ్చ ఛర్దేర్విఘాతాద్వమనాతియోగాత్,
ద్రవాన్నపానాతినిషేవణాచ్చ విణ్మూత్రవాతక్రమనిగ్రహాచ్చ,
ప్రకృష్టసంరోదనశోకకోపాచ్ఛిరోభిఘాతాదతిమద్యపానాత్. 2
తథా ఋతూనాం చ విపర్యయేణ క్లేశాభిఘాతాదతిమైథునాచ్చ,
బాష్పగ్రహాత్సూక్ష్మనిరీక్షణాచ్చ నేత్రే వికారాంజనయంతి దోషాః. 3

తా. ఎండలో శరీరమును కాచుకొనిన పిదప వెంటనే శీతోదకములో ప్రవేశించుట (అనగా శరీరము చలిచే వ్యాపింపబడి, శరీరమునుండి ఉష్ణము ఊర్ధ్వగతంబై, నేత్రములయందలి తేజస్సును తిరస్కరించి నేత్రరోగములను గలుగంజేయును.) దూరముగనుండు పదార్థములనుచూచుట, స్వప్నవిపర్యయము (అనగా పగలు నిద్రించుట, రాత్రులయందు జాగరణముజేయుట.) కన్నులకావిరిదగులుట లేక చమటపట్టి కంటిలోనే జీర్ణంబగుట, కంటిలో దుమ్ముపడి యందు నిలిచియుండుట, పొగదగులుట, వాంతివేగము నడ్డగించుట, అధికముగ వాంతులగుట, ద్రవముగనుండు నన్నపానాదుల మిక్కిలిసేవించుట, మలము, మూత్రము, అపానవాతము, వీని వేగము నడ్డగించుట, ఎల్లపుడు కన్నీరువిడుచుట, దుఃఖించుట, కోపమునుపొందుట, తలపైదెబ్బదగులుట, మిక్కుటముగ మద్యపానముజేయుట, శీతకాలమునందు ఉష్ణము, ఉష్ణకాలమునందు శీతముగలుగుట, క్లేశము; మనోదుఃఖమునుగాని లేక కామాదిదుఃఖములనుగాని పొందుట, అభిఘాతమును జెందుట, మిక్కిలిగ మైథునము జేయుట, కంటినీరుయొక్క వేగమునడ్డగించుట, సూక్ష్మపదార్థములం చూచుట, ఇట్టి

కారణములచే వాతాదిదోషములు ప్రకోపించి నేత్రరోగములను గలుగజేయు చున్నది.

## సుశ్రుతే నేత్రరోగసంప్రాప్తి

సిరానుసారిభిర్దోషైర్విగుణైరూర్ధ్వమాశ్రితైః,
జాయన్తే నేత్రభాగేషు రోగాః పరమదారుణాః. 4

తా. వాతపిత్తకఫములు ప్రకోపించి, నేత్రములయందలి సిరలనాశ్రయించి, అందు వాత, పిత్త, కఫ, రక్త, సన్నిపాత, ఆగంతుక భేదములచే ౭౬ విధంబులగు భయంకరములైన నేత్రరోగములను జనింపజేయునని సుశ్రుతాచార్యాభిప్రాయము.

## నేత్రరోగసంఖ్య

కృష్ణే పంచ నవైవ సంధిషు దశత్రీణ్యత్ర శుక్లేఖిలే,
జాతాష్షోడశవర్త్మజాః ఖలు చతుర్వింశాస్తథా వింశతిః. 5
సప్తాతంతుగతాశ్చతుర్నవతిరిత్యక్ష్ణోరశేషామయాః,
యో వేత్తి వ్యవహర్తుమేషవిదుషామగ్రే సమర్థో భవేత్. 6

తా. కంటినల్లగుడ్డునందు ౫, సంధులయందు ౯, తెల్లగుడ్డునందు ౧౩, నేత్రములయందంతట ౧౬, కంటిరెప్పలయందు ౨౪, నేత్రనాడులయందు అంతటను ౨౭ ఇటుల నేత్రములయందు జనించురోగములు ౯౪ విధంబులని తెలియవలయును. ఇటుల వీనిభేదముల తెలిపి చికిత్సజేయువాడే వైద్యోత్తముడని యెరుగవలయును.

## అభిష్యంద భేదములు

వాతపిత్తకఫాద్రక్తాదభిష్యందశ్చతుర్విధః,
తత్ర తానుచితైః పత్తైర్విబ్ధీయాత్త్రిదినం భిషక్. 7

తా. వాత, పిత్త, కఫ, రక్తభేదములవలన అభిష్యందము ౪ విధములై యుండును. (అందు వాతాభిష్యందమున కన్నులెఱ్ఱనై నీరుకారుచు, పోట్లతోగూడి యుండును. పిత్తాభిష్యందమున కన్నులెఱ్ఱనై మిక్కిలి మంటలతోగూడి మెరమెర లాడుచుండును. శ్లేష్మాభిష్యందమున కన్నులు పుసిగట్టి దురదతో గూడియుండును. రక్తాభిష్యందమున కన్నులలో దుర్మాంసము గలిగియుండును.) వానియందు మొదట రెప్పగాకునుగట్టి పిదప ఉష్ణోత్తాకను తమలపాకును 3 దినములుగట్టిన నేత్రాభిష్యందము మానును.

## అభిష్యందరోగములకు సర్వనేత్రరోగమూలత్వము

వాతాత్పిత్తాత్కఫాద్రక్తాదభిష్యందశ్చతుర్విధః,
ప్రాయేణ జాయతే ఘోరస్సర్వనేత్రామయాకరః. 8

తా. అభిష్యందరోగము, వాత, పిత్త, కఫ, రక్తభేదములవలన ౪ విధంబు లుగనుండును. వాని వేదననోర్చుట మిక్కిలిఅశక్యము. ఇది అధిమంథాది సర్వనేత్రరోగ ముల కుత్పత్తిస్థానము. (ఇక సర్వ నేత్రములయందు జనించురోగముల వచించెదను.)

వాతాభిష్యందలక్షణము

నిస్తోదన స్తంభనరోమహర్ష సంఘర్ష పారుష్యశిరోభితాపాః,
విశుష్కభావశ్శిశిరాశ్రుతా చ వాతాభిపన్నే నయనే భవంతి. 9

తా. సూదులతో బొడిచినటుల పోట్లుగలుగుట, నేత్రములు జడముగ నుండుట, శరీరము గగుర్పొడుచుట, కంటిరెప్పలొరసికొనుట, కఠినముగనుండుట, శిరస్సు వేడిగనుండుట, నేత్రముఎండియుండుట, కన్నులవలన చల్లనినీరుకారుట ఇట్టి లక్షణములుగలది వాతాభిష్యందమని తెలియవలయును.

పిత్తాభిష్యందలక్షణము

దాహప్రపాకౌ శిశిరాభినందో ధూమాయనం బాష్పసముచ్ఛ్రియశ్చ,
ఉష్ణాశ్రుతా పీతకనేత్రతా చ పిత్తాభిపన్నే నయనే భవంతి. 10

తా. మిక్కిలి తాపము; కన్నులచుట్టు కురుపులుపుట్టుట, కన్నులయందు చల్లని పదార్థముల బూయుటయందిచ్ఛగలుగుట, కన్నులపొగ వెడలుట, కన్నులయం దెల్లపుడు కొంచెము వేడిగనీరువెడలుట, కన్నులు పచ్చగనుండుట ఇట్టి లక్షణములు గలిగియుండిన పిత్తాభిష్యందమని తెలియవలయును.

కఫాభిష్యందలక్షణము

ఉష్ణాభినందో గురుతాక్షిశోథః కండూపదేహావతిశీతతా చ,
స్రావో బహుః పిచ్ఛిలఏవచాపి కఫాభిపన్నే నయనే భవంతి. 11

తా. కన్నులకావిరిపుచ్చుటయందిచ్ఛ, గురుత్వము, నేత్రములయందు వాపు, దురద, కన్నులు బంకగను, చల్లగనుండుట, మిక్కిలి బంకగనుండు నీరుకారుట ఇట్టి లక్షణములుగలిగియుండిన కఫాభిష్యందమని తెలియవలయును.

రక్తాభిష్యందలక్షణము

తామ్రాశ్రుతా లోహితనేత్రతా చ రాజ్యస్సమంతాదతిలోహితాశ్చ,
పిత్తస్య లింగాని చ యాని తాని రక్తాభిపన్నే నయనే భవన్తి. 12

తా. కన్నులవెఱ్ఱనినీరు గారుట, కన్నులెఱ్ఱగనుండుట, కంటిచుట్టు నెఱ్ఱగనుండు రేఖలువ్యాపించియుండుట, పిత్తాభిష్యందలక్షణములతో గూడియుండుట ఇట్టి లక్షణములుగలిగియుండిన రక్తాభిష్యందమని తెలియవలయును.

### అథామంధోత్పత్తి

వృద్ధైరేతై రభిష్యందై ర్నరాణామక్రియావతామ్,
తావంత_స్త్వధిమంథాస్స్యుర్నయనే తీవ్రవేదనాః. 13

తా. అభిష్యందరోగములందు ఉపచారములు చేయబడకుండుటచే వృద్ధిజెంది ౪ విధములగు అధిమంథరోగముల గలుగజేయును. దానిసంబంధమువలన నేత్రముల యందు తీవ్రమగు వేదనగలుగును. ఇది అధిమంథసామాన్యలక్షణము.

### అధిమంథసామాన్యలక్షణము

ఉత్పాట్యత ఇవాత్యర్థం నేత్రం నిర్మథ్యతే తథా,
శిరసోర్ధం చ తం విద్యాదధిమంథం స్వలక్షణైః. 14

తా. శిరస్సుయొక్క అర్ధభాగము పగలగొట్టినటులనొచ్చుట, కన్నులలో నిసుకబోసినటుల మిక్కిలి వేదనగలుగుట, రోగప్రభావమునలన అంతటయందు వేదన గలుగుట ఇట్టి లక్షణములుగలిగియుండిన అధిమంథమని తెలియవలయును. (మరియు దీనియందు వాతాభిష్యందలక్షణములే గలిగియుండును.)

### దోషభేదమువలన కాలావధి

హన్యాద్దృష్టిం శ్లైష్మికస్సప్తరాత్రాద్యోధీమంథో రక్తజః పంచరాత్రాత్,
షడ్రాత్రాద్వా వాతికో వై నిహన్యాన్మిథ్యాచారాత్పైత్తికస్సద్య ఏవ.

తా. శ్లైష్మిక అధిమంథము ౭ దినములకు, రక్తజఅధిమంథము ౫ దినములకు, వాతికఅధిమంథము ౬ దినములకు పైత్తిక అధిమంథము మిథ్యోపచారమువలన తత్కాలమునందే (అనగా ౩ దినములలో) కన్నులదృష్టిని నశింపజేయును. (కావున లంఘనప్రలేపాదిక్రియార్థమై అంజననిషేధార్థమై వ్యాధిస్వభావమునుబట్టి కాలావధి జెప్పబడియెను.)

### ఆమనేత్రలక్షణము

ఉదీర్ణవేదనం నేత్రం రాగోద్రేకసమన్వితమ్,
ఘర్షనిస్తోదశూలాశ్రుయుక్తమామాన్వితం విదుః. 16

తా. కన్నులు మిక్కిలి వేదనతోగూడినవై, మిక్కిలి యెఱ్ఱనై యిసుకబోసినటుల గరగరలాడుచు, సూదులతో బొడుచునటుల వేదనగలవై చురుకుతోగూడి నీరును కార్చుచుండిన ఆమయుక్తనేత్రములని యెఱుంగవలయును. (ఈలక్షణము అంజనాదినిషేధముకొఱకును లఘ్వన్నము నిచ్చుటకొఱకును వచింపబడియెను.)

### నిరామలక్షణము

మందవేదనతా కండూస్సంరంభాశ్రుప్రశాంతతా,
ప్రసన్నవర్ణతా చాక్ష్ణోస్సంపక్వం దోషమాదిశేత్. 17

తా. వేదన తగ్గి, దురదకలిగి, వాపు, పోట్లు కన్నులు నీరుకారుటనిలిచి నిర్మలముగనుండిన దోషము పక్వమైనదని తెలియవలయును.

### శోఫయుక్తఅక్షిపాకలక్షణము

కండూపదేహాశ్రుయుతః పక్వోదుంబరసన్నిభః,
సంరంభీ పచ్యతే యస్తు నేత్రపాకస్సశోఫజః, 18
శోథహీనాని లింగాని నేత్రపాకేత్వశోథజే,

తా. కన్నులయందు వాపుకలిగి పండుటవలన, పండిన అత్తిపండుతోతుల్యంబై దురదగలిగి, జిగటగనీరుకారిన శోఫజన్యనేత్రపాకమని యెరుంగవలయును. మరియు వాపులేకనే నేత్రపాకముగలిగి తక్కిన లక్షణములతోగూడియుండిన త్రిదోషజనిత కేవలనేత్రపాకమని (అధిమంథమని) తెలియవలయును.

### హతాధిమంథలక్షణము

ఉపేక్షణాదక్షి యదాధిమంధో వాతాత్మకస్సాదయతి ప్రసహ్య. 19
రుజాభిరుగ్రాభిరసాధ్యఏష హతాధిమంథః ఖలు నేత్రరోగః,

తా. వాతజఅధిమంథమునకు చికిత్సజేయకనుపేక్షించుటచే, కన్నులుశోషించి, దానివలన, సూదులతోబొడిచినటులవేదన, తాపము మొదలగు మిక్కిలిపీడగలుగును, ఇదియుహతాధిమంథమనంబడును. ఈ నేత్రరోగమసాధ్యంబులు.

### వాతపర్యయలక్షణము

వారం వారం చ పర్యేతి భ్రువౌ నేత్రే చ మారుతః. 20
రుజశ్చ వివిధాస్తీవ్రాస్సజ్ఞేయో వాతపర్యయః,

తా. వాతము క్రమముగ మాటిమాటికి కనుబొమలయందుజేరి అక్కడనుంచి నేత్రములయందు పలుమారు వ్యాపించి, నానావిధములైన తీవ్రపీడలను గలుగజేసిన వాతపర్యయమని తెలియవలయును.

### శుష్కాక్షిపాకలక్షణము

యత్కూణితందారుణరూక్షవర్త్మ సందహ్యతే చావిలదర్శనం చ.21
సుదారుణం యత్ప్రతిబోధనే చ శుష్కాక్షిపాకోపహతం తదక్షి,

తా. కన్నులుమూతపడి రెప్పలు కఠినంబులై రూక్షముతోగూడినవై మంటలు అధికమౌట, కన్నులులోనికిబోవుట, తెరచుటకు శక్యముగాకపోవుట ఇట్టి లక్షణ

ములుగలిగినది శుష్కాక్షిపాకమని యెరుంగవలయును (ఇది రక్తసహితవాతమువలన జనించును.)

అన్యతోవాతలక్షణము

యస్యావటూ కర్ణశిరోహనుస్థో మన్యాగతోవాప్యనిలోన్యతో వా.
కుర్యాద్రుజం వై భ్రువిలోచనే చతమన్యతో వాతముదాహరంతి,

తా. ముచ్చిలిగుంట, చెవులు, శిరస్సు, * కటుమర్లు, పెడతలపెద్దనరము వీనియందుగాని, ఇతరస్థలములయందుగాని యుండువాతము, కనుబొమల మధ్య భాగమునందుగాని లేక కన్నులయందుగాని తోవ, భేదాదిపీడలంగలుగజేయు దానిని అన్యతోవాతమని వచించెదరు.

అమ్లాధ్యుషితలక్షణము

శ్యావం లోహితపర్యంతం సర్వం చాక్షి ప్రపచ్యతే. 23
సదాహశోథం సస్రావమమ్లాధ్యుషితమమ్లతః,

తా. నడుమ కొంచెము నీలవర్ణముగను, చుట్టుప్రక్కల యెఱ్ఱగనుండినదై సర్వనేత్రము పండుట, (అనగా పసపుచాయగలకురుపులులేచుట) కొంచెము తాపము, వాపు, నీరుకారుట ఇట్టిలక్షణములుగలది అమ్లాధ్యుషితమని తెలియవలయును, ఇది పులుసుగలభోజనాదుల మిక్కుటముగ సేవించుటవలనజనించును.

శిరోత్పాతలక్షణము

అవేదనా వాపి సవేదనా వా యస్యాక్షిరాజ్యో హి భవంతి తామ్రాః.
ముహుర్విరజ్యంతి చ యాస్సతాదృగ్వ్యాధిస్సిరోత్పాతఇతి ప్రదిష్టః,

తా. కన్నులయందుండుసిరలు వేదనారహితంబులైగాని, వేదనాసహితంబులైగాని, యెఱ్ఱనై, మాటిమాటికి మిక్కిలి యెఱ్ఱనగుచుండిన, సిరోత్పాతమని తెలియవలయును. ఇది రక్తదోషమువలన జనించును.

సిరాహర్షలక్షణము

మోహాత్సిరోత్పాతఉపేక్షితస్తు జాయేత రోగస్తు సిరాప్రహర్షః.25
తామ్రాస్రమచ్ఛం స్రవతి ప్రగాఢం తథా నశక్నోత్యభివీక్షితుం చ,

తా. అవివేకమువలన సిరోత్పాతరోగమునకు చికిత్సజేయక నుపేక్షించుటచే సిరాప్రహర్షమను రోగము జనించును. దీనియందు కన్నులయందెఱ్ఱగను, స్వచ్ఛముగను నీరుకారుచుండిన కన్నులుదెరచి చక్కగజూచుట కశక్యముగనుండును. ఇటుల కన్నులయందంతటజనించు ౧౭ విధంబులగు రోగలక్షణంబులు వచింపబడియెను.

---

* (కటుమర్లు అనగా కంటిక్రింద మొదలుకొని చెక్కిళ్లపార్శ్వభాగము.)

## నల్లగుడ్డుయందుజనించురోగములు.

### సవ్రణశుక్ర లక్షణము.

నిమగ్నరూపం తు భవేద్ధి కృష్ణే సూచ్యేవ విద్ధం ప్రతిభాతి యద్వై
స్రావం స్రవేదుష్ణమతీవ యచ్ఛ తత్సవ్రణం శుక్రముదాహరంతి,

తా. నేత్రముయొక్క నల్లగుడ్డుయందు జనించురోగము సవ్రణమనంబడును. కన్నుయొక్క నల్లగుడ్డుయందు పుష్పపుట్టిలోనమునిగినట్లుగను, నడుమసూదితో బెజ్జము వేయబడినట్లుగనుండి, అత్యుష్ణమై మిక్కిలి నీరును కార్చుచుండిన దానిని సవ్రణశుక్రమనియెదరు. (దీనిలో బాధగలుగుట, క్షతమునపెడగలుగుట సహజంబైనను కన్నులవంటిసుకుమారస్థలములయందు గలిగెడి విశేషబాధను వోర్చుటకశక్యమని భోజాదులుజెప్పిరి. ఈవ్రణశుక్లంబసాధ్యము. ఐనను అవస్థాభేదములవలన ఒకానొకసమయములో సాధ్యంబగు, అట్టిఅవస్థాభేదంబు లెవ్వియనిన.)

### అవస్థాభేదసాధ్యశుక్రనిరూపణము.

దృష్టేస్సమీపే న భవేత్తు యత్తున చావగాఢం న చ సంస్రవేద్ధి. 27
అవేదనం వా నచ యుగ్మశుక్రం తత్సిద్ధిమాయాతి కదాచిదేవ,

తా. పుష్పము దృష్టికిసమీపమున గలుగక, లోతుగవ్యాపించక, మిక్కిలి స్రావము, [illegible] శుక్రము కొన్నొకపుడు సాధ్యమగును. మరియు రెండుశుక్రములు జనించిన అసాధ్యము.

### అవ్రణశుక్రలక్షణము.

స్యందాత్మకం కృష్ణగతం సచోషం శంఖేందుకుంద ప్రతిమావభాసమ్.
వైహాయసాభ్రప్రతనుప్రకాశమథావ్రణం సాధ్యతమం వదన్తి,

తా. అభిష్యందమువలనజనించి కంటియొక్క నల్లగుడ్డుయందు దోషముతోగూడి శంఖము, చంద్రుడు, మల్లెపువ్వు వీనివలె తెల్లనై ఆకాశమునందుండు మేఘమువలె * సూక్ష్మప్రకాశముగలదై వ్రణరహితంబైయుండు శుక్రము సుఖసాధ్యమని చెప్పెదరు.

### అవ్రణశుక్రకృచ్ఛ్రసాధ్యత్వము.

గంభీరజాతం బహలం చ శుక్రం చిరోత్థితం వాపి వదన్తి కృచ్ఛ్రమ్. 29

తా. కంటినల్లగుడ్డుయందు రెండుపొరలకు లోపలజనించి విశాలమై చిరకాలమునకు ముందు జనించియుండు శుక్రము కష్టసాధ్యము.

---

* Mild.

## అవ్రణశుక్రాసాధ్యత్వము

విచ్ఛిన్నమధ్యం పిశితావృతం వాచలం సిరాసూక్ష్మమదృష్టికృచ్ఛ,
ద్విత్వగ్గతం లోహితమంతతశ్చ చిరోత్థితం చాపి వివర్జనీయమ్. 30

తా. శుక్రముయొక్క మధ్యమునందుండు మాంసము కరిగిదానివలనఛిద్రము (అనగా నడుమపల్లము) గలదిగాని లేక శుక్రమునకు చుట్టూ మాంసముపెరిగి చలనముగలదిగాని నుండి సిరలవలన వ్యాప్తంబైయుండుటవలన సూక్ష్మమై దృష్టినినశింప జేయుచు రెండవపటలమునవ్యాపించి చుట్టుప్రక్కలెఱ్ఱనై జనించి చిరకాలంబై యుండు శుక్రము అసాధ్యంబగుటచే దానిని విడువవలయును.

## ప్రరాంతకార అవ్రణశుక్రాసాధ్యత్వము

ఉష్ణాశ్రుపాతః పిటికా చ నేత్రే యస్మిన్భవేన్ముద్గనిభం సశుక్రమ్,
తదప్యసాధ్యం ప్రవదన్తి కేచిదన్యచ్చ యత్తిత్తిరిపక్షితుల్యమ్. 31

తా. కన్నులయొక్క రెండవ పటలమునందు శుక్రము వ్యాపించుటవలన మిక్కిలి వేడిగ కన్నీరు స్రవించుటయేగాక సన్ననిగుల్లలచే వ్యాపింపబడి పెసలతో సమానమైన శుక్రముగలిగిన యసాధ్యము. మరియు నాశుక్రము తిత్తిరిపక్షియొక్క రెక్కవర్ణముతో సమానముగనుండిన అసాధ్యమని కొందరు వచించెదరు.

## అక్షిపాకాత్యయలక్షణములు

శ్వేతస్సమాక్రామతి సర్వతో హి దోషేణ యస్యాసితమండలం తు,
తదక్షిపాకాత్యయమక్షిపాకం సర్వాత్మకం వర్జయితవ్యమాహుః. 32

తా. కంటియొక్క నల్లగుడ్లయందు దోషసంబంధమువలన నల్లగుడ్డుయందంతట శుక్రమువ్యాపించిన సన్నిపాతజ అక్షిపాకాత్యయమనబడును. ఇది అసాధ్యమగుటచే వైద్యుడు విడువవలయును.

## అజకాజాతలక్షణము

అజాపురీషప్రతిమో రుజావాన్ సలోహితో లోహితపిచ్ఛిలాశ్రుః,
విగృహ్య కృష్ణం ప్రచయోభ్యుపైతి తచ్చాజికాజాతమతి వ్యవస్యేత్.

తా. నల్లగుడ్డుయొక్క మూడవపొర నాశ్రయించియుండెడి మేదస్సు ఉంటగనై,నల్లగుడ్డును భేదించి యుండిన మేక పెంటికవలెనున్నదమై నొప్పిగలిగి కొంచెము యెఱ్ఱనై,యెఱ్ఱగను చిక్కగను నీరుగారుచుండిన దానిని అజకాజాతమనియెదరు. ఇటుల కంటినల్లగుడ్డుయందు జనించురోగములు వచింపబడియెను.

## దృష్టిగత (తిమిర) రోగములు

ప్రథమపటలస్థదోషలక్షణము

ప్రథమే పటలే యస్య దోషా దృష్ట్యాం వ్యవస్థితాః,
అవ్యక్తాని చ రూపాణి కదాచిదథ పశ్యతి. 34

తా. కంటియొక్క ప్రథమపటలము (అనగా మొదటిపొరలో) వాతాది దోషములు వ్యాపించి దానివలన ఒకానొకప్పుడు ఘటపటాది పదార్థములను అస్పష్టములుగ గనుపరచును.

ద్వితీయపటలస్థదోషలక్షణము

దృష్టేర్భృశం విహ్వలతి ద్వితీయం పటలం గతే,
మక్షికామశకాన్కేశాఞ్జాలకాని చ పశ్యతి. 35
మండలాని పతాకాంశ్చ మరీచిం కుండలాని చ,
పరిప్లవాంశ్చ వివిధాన్వర్షమభ్రం తమాంసి చ. 36
దూరస్థాని చ రూపాణి మన్యతేథ సమీపతః,
సమీపస్థాని దూరే చ దృష్టేర్గోచరవిభ్రమాత్, 37
యత్నవానపి చాత్యర్థం సూచీపాశం న పశ్యతి,

తా. రెండవపటలమునందు దోషము వ్యాపించుటవలన దృష్టికి పదార్థము బాగుగ కనుపరచకనుండును. అటులకన్నుల కెదుట ఈగెలు, దోమలు, వెంట్రుకలు, వలలు, మండలము, పతాకము, కిరణము, కుండలము, నానావిధములగు కప్పలు మొదలగునవి దుముకునటుల వర్షము, మేఘము, అంధకారము ఇవి లేనియప్పుడు దృష్టికగుపడుట, విషయభ్రాంతివలన దూరముగనుండుపదార్థములు సమీపములుగను, సమీపముననుండుపదార్థములు దూరముగనుండునటులతోచుట, మిక్కిలి ప్రయత్నముచేసినను సూదిరంధ్రముకనుపించకుండుట ఇట్టిలక్షణములుకలుగును.

తృతీయపటలస్థ (తిమిర) లక్షణము

ఊర్ధ్వం పశ్యతి నాధస్తాత్తృతీయం పటలం గతే. 38
మహాంత్యపిచ రూపాణి ఛాదితానీవ చాంబరైః,
కర్ణనాసాక్షిహీనాని వికృతాని చ పశ్యతి. 39
యథాదోషం చ రజ్యేత దృష్టిర్దోషే బలీయసి,
అధస్థే తు సమీపస్థం దూరస్థం చోపరి స్థితే. 40
పార్శ్వస్థితే పునర్దోషే పార్శ్వస్థం నైవ పశ్యతి,
సమంతతస్థితే దోషే సంకులానీవ పశ్యతి. 41

దృష్టిమధ్యస్థితే దోషే మహద్ధ్రిస్వం చ పశ్యతి,
ద్విధా స్థితే ద్విధా పశ్యేద్బహుధా వానవస్థితే. 42
దోషే దృష్టిస్థితే తిర్యగేకం వై మన్యతే ద్విధా,

తా॥ మూడవపటలమునందు దోషము వ్యాపించుటవలన మీదుగనుండు పదార్థములు గనుపించుట, క్రిందనుండు పదార్థములు గనుపడకుండుట, పెద్దవిగనుండు పదార్థములు వస్త్రముగప్పినటుల గనుపించుట, మనుజులు ముక్కు, చెవులు, కన్నులు లేనివారుగ వికారరూపముగలవారలుగ గనుపించుట, రక్తమాంసమేద ఆదిక సహాయమువలన వాతాదిదోషములు బలిష్ఠంబులగుచుండ దృష్టికి వాతాదిదోషములననుసరించి యెరుపు, పసపు, తెలుపువర్ణములుగలుగుట, దోషమధోభాగమునం దుండుటవలన సమీపముననుండు పదార్థములు బాగుగగనుపించకపోవుట, దోషము పైభాగమునందుండుటవలన దూరమునందుండు పదార్థములు బాగుగగనుపించకుండుట, ప్రక్కలయందుండుటవలన ప్రక్కలయందుండు పదార్థములు బాగుగ గనుపించకుండుట, దోషంబంతట వ్యాపించియుండుటవలన పదార్థము లొకదానితో నొకటి చేరియుండునటుల గనుపించుట, దోషము దృష్టిమధ్యమునందుండుటవలన స్థూల పదార్థములు సూక్ష్మముగ గనుపించుట, రెండుస్థలములయందు దోషము నిలిచి యుండుటవలన రెండు రెండు పదార్థములుగ గనుపించుట, దోషముచంచలముగ నుండుటవలన నొకపదార్థం బనేకరూపములుగ గనుపించుట, దృష్టిగతదోషము అడ్డముగనుండిన ఒక పదార్థము రెండుగ గనుపించుట ఇట్టి లక్షణములు గలిగి యుండును.

### చతుర్థపటలస్థతిమిరలక్షణము

తిమిరాఖ్యస్సవై రోగశ్చతుర్థపటలం గతః. 43
రుణద్ధి సర్వతో దృష్టిం లింగనాశమతః పరమ్,
అస్మిన్నపి తమోభూతే నాతిరూఢే మహాగదే. 44
చంద్రాదిత్యౌ సనక్షత్రావంతరిక్షే చ విద్యుతః,
నిర్మలాని చ తేజాంసి భ్రాజిష్ణూని చ పశ్యతి. 45

తా. వాతాదిదోషములు నాలవపటలమునందు చేరుటచే తిమిరమను పేరుచే దృష్టినంతట నిరోధించును. ఇదియె లింగనాశమని వచింపబడును. ఇది వృద్ధిపొందకుండు కాలమునందే ఆకాశమునందు చంద్రసూర్య నక్షత్రములు, మెరుపులు, నిర్మలముగ దీప్తతేజస్సుగలవిగ గనుపించును.

## ప్రకారాంతరలింగనాశస్వరూపము

సఏవ లింగనాశస్తు నీలికా కాచసంజ్ఞితః,

తా. తృతీయపటలమును బొందియుండు కాచబిందువు నుపేక్షించుటవలన అది నాలవపటలమును జేరిన లింగనాశనమనియు నీలికయనియు జెప్పబడును. ఇది అసాధ్యము.

తత్ర వాతేన రూపాణి భ్రమంతీవ హి పశ్యతి. 46
ఆవిలాన్యరుణాభాని వ్యావిద్ధానీవ మానవః,
పిత్తేనాదిత్యఖద్యోతశక్రచాపతటిద్గణాన్. 47
నృత్యతశ్చైవ శిఖినస్సర్వం నీలం చ పశ్యతి,
కఫేన పశ్యేద్రూపాణి స్నిగ్ధాని చ సితాని చ. 48
సలిలప్లావితానీవ పరిజాడ్యాని మానవః,
పశ్యేద్రక్తేన రక్తాని తమాంసి వివిధాని చ. 49
ససితాన్యథ కృష్ణాని పీతాన్యపి చ మానవః,
సన్నిపాతేన చిత్రాణి విప్లుతాని చ పశ్యతి. 50
బహుధా చ ద్విధావాపి సర్వాణ్యేవ సమంతతః,
హీనాంగాన్యధికాంగాని జ్యోతీంష్యపిచ పశ్యతి. 51

తా. పైనుదహరింపబడిన సర్వపటలములయందు వ్యాపించియుండు వాతదోషమువలన రూపముదిరుగునట్లుగను, కల్మషముగను, ఎఱ్ఱగను, వంకరగను కనుపించుట, పిత్తదోషమువలన సూర్యుడు, మిణుగురుపురుగు, ఇంద్రధనస్సు, మెరుపు వీనిని నృత్యములుజేయునట్టినెమళ్లను, సర్వవస్తువులును, నీలముగచూచుట, కఫదోషమువలన స్నిగ్ధముగను, తెల్లగను, నీటిలోమంచితీసినటులను, మందముగను గనుపించుట, రక్తదోషమువలన ఎఱ్ఱగను, కొంచెము తెల్లగను, నల్లగను, పసుపుగ గనుపించుట, సన్నిపాతదోషమువలన నానావిధవర్ణములుగను, విపరీతముగను అనగా ఒకవస్తువు రెండుగగాని అనేక రూపములుగగాని గనుపించుట, మరియు జ్యోతిస్సులు హీనములైన అంగములుగలవిగగాని లేక అధికాంగములుగలవిగగాని, అనేకవిధములుగగాని గనుపించుచుండును.

## పరిమ్లాయికలక్షణము

పిత్తం కుర్యాత్పరిమ్లాయి మూర్ఛితం రక్తతేజసా,
పీతాదిశస్తథోద్యోతాన్ప్రవిం చాపి స పశ్యతి. 52
వికీర్యమాణాన్ఖద్యోతైర్వృక్షాం స్తేజోభిరేవ చ,

తా. పిత్తము రక్తముతో మిశ్రమమై పరిమ్లాయియనుతిమిరరోగమును జనింప జేయును. దానిసంబంధమువలన దిక్కులు, ఎండ, సూర్యుడు, పసపువర్ణముగను మరియు వృక్షములు, మిణుగురు పురుగులు, తేజస్సు వీనితో వ్యాపింపబడినవిగను గనుపించుచుండును.

రాగభేదమువలనలింగనాశవివరము

వక్ష్యామి షడ్విధం రాగైర్లింగనాశమతఃపరమ్. 53
రాగోఽరుణో మారుతజః ప్రదిష్టో మ్లాయీ చ నీలశ్చ తథైవ పిత్తాత్,
కఫాత్సితశ్శోణితజస్సరక్తస్సమస్తదోషప్రభవో విచిత్రః. 54

తా. వర్ణభేదసంఖ్యవలన లింగనాశనమను రోగము ఆరువిధంబులుగనుండును. అందు వాతజ లింగనాశన మెఱ్ఱగను, పిత్తజలింగనాశనము పచ్చగ లేక నీలముగను, కఫజలింగనాశనము తెల్లగను, రక్తజ లింగనాశనం బెఱ్ఱగను, సర్వదోషజ లింగనాశనము నానావర్ణములు గలదిగనునుండును.

పరిమ్లాయిరాగవిశేషలక్షణము

అరుణం మండలం దృష్ట్యాం స్థూలకాచారుణప్రభమ్,
పరిమ్లాయిని రోగే స్యాన్మ్లాయి నీలం చ మండలమ్. 55
దోషక్షయాత్కదాచిత్స్యాత్స్వయం తత్ర ప్రదర్శనమ్.

తా. పరిమ్లాయిరోగమునందు దృష్టికిపైనలావుగను, గాజువలె నెఱ్ఱగనుండు మండలముజనించి పచ్చగను, నీలముగనుండును. దానియందు దోషము తగ్గినయెడల ఒకానొకపుడు కన్నులు తమంతటతామే గనుపించును. (ఇచట దోషశబ్దమునకు జన్మాంతర కర్మమని జెప్పెదరు.)

దృష్టిమండలగతరాగలక్షణము

అరుణం మండలం వాతాచ్చంచలం పరుషం తథా. 56
పిత్తాన్మండలమానీలం కాంస్యాభం పీతమేవచ,
శ్లేష్మణా బహులం స్నిగ్ధం శంఖకుందేందుపాండురమ్. 57
చలత్పద్మపలాశస్థశ్శుక్లో బిందురివాంభసః,
మృద్యమానే చ నయనే మండలం తద్విసర్పతి. 58
ప్రవాళపద్మపత్రాభం మండలం శోణితాత్మకమ్,
దృష్టిరాగో భవేచ్చిత్రో లింగనాశే త్రిదోషజే. 59
యథాస్వం దోషలింగాని సర్వేష్వేవ భవంతి హి,

తా. వాతమువలన దృష్టిమండలము ఎఱ్ఱగను, చంచలముగను, గరగరగనుండును. పిత్తమువలన కొంచెము నీలముగను, కాంస్యమువంటివర్ణముగలదిగను లేక పసపు వర్ణముగలదిగనుండును. కఫమువలన దళముగను, జిగటగను, శంఖము, మల్లెపువ్వు, చంద్రుడు వీనివలె తెల్లగనుండును. మరియుఁకన్నులనలిచిన తామరాకుమీద కదలు చుండు తెల్లని ఉదకబిందువువలె ఇటునటు నీరుకదలుచుండును. రక్తమువలన దృష్టి మండలము పగడమువలెగాని లేక యెఱ్ఱదామరపుష్పము తెరంగున నెఱ్ఱగగాని యుండును. త్రిదోష లింగనాశనమునందు విచిత్రవర్ణములుగల మండలములు గలిగి యుండును. మరియు సర్వలింగనాశనరోగములయందాయారోగదోషలక్షణములే గలిగి యుండును.

## దృష్టిరోగసంఖ్య

షడ్లింగనాశాష్షడిమే చ రోగాదృష్ట్యాశ్రయాష్షట్చ షడేవ చ స్యుః.

తా. పూర్వమునందు జెప్పబడియుండు ఆరువిధములైన లింగనాశరోగము లును, ఉత్తరత్ర జెప్పబడు పిత్తవిదగ్ధదృష్ట్యాశ్రితరోగంబులారును జేరి ౧౨ విధం బులైన దృష్టిరోగంబులయ్యెను.

## పిత్తవిదగ్ధదృష్టిలక్షణము

పిత్తేన దుష్టేన గతేన వృద్ధిం పీతా భవేద్యస్య నరస్య దృష్టిః,
పీతాని రూపాణి చ తేన పశ్యేత్స వై నరః పిత్తవిదగ్ధదృష్టిః. 61

తా. పిత్తము దుష్టంబగుటవలన వృద్ధిపొంది, దృష్టియందు పసపువర్ణమును గలుగజేయును. దానిసంబంధమువలన సర్వపదార్థములు పచ్చగగనుపించును. ఇదియు పిత్తవిదగ్ధదృష్టియనంబడును.

## దివాంధ్యలక్షణము

ప్రాప్తే తృతీయం పటలం చ దోషే దివా న పశ్యేన్నిశి వీక్షతే సః,
రాత్రౌ సశీతానుగృహీతదృష్టిః పిత్తాల్పభావాదపి తాని పశ్యేత్. 62

తా. మూడవపటలమునందు పిత్తదోషమువ్యాపించుటవలన పగటియందు కన్నులు గనుపించకుండును. రాత్రియందు చల్లగనుండుటచేత పిత్తము కొరవబడును. దానివలన రాత్రులయందు కన్నులు కనుపించును. ఇది దివాంధ్యమనంబడును.

## కఫవిదగ్ధదృష్టిలక్షణము

తథా నరశ్శ్లేష్మవిదగ్ధదృష్టిస్తానేవ శుక్లాని హి మన్యతే తు,

తా. కఫవిదగ్ధదృష్టిగలవానికి సర్వపదార్థములు తెల్లగ గనుపించుచుండును.

### నక్తాంధ్యలక్షణము

త్రిషు స్థితో యః పటలేషు దోషో నక్తాంధ్యమాపాదయతి ప్రసహ్య,
దివా ససూర్యానుగృహీతదృష్టిః పశ్యేత్తురూపాణి కఫాల్పభావాత్,

తా. కఫము మూడవపటలమును జెందుటవలన, నక్తాంధ్యము జనించును. అందు సూర్యుని తాపమువలన పగటియందు కఫము కొరవబడుటచే నేత్రములు గనుపించుచుండును. (నక్తాంధ్యమన రేచీకటి.)

### ధూమదర్శనలక్షణము

శోకజ్వరాయాసశిరోభితాపైరభ్యాహతా యస్య నరస్య దృష్టిః. 64
ధూమ్రాంస్తథా పశ్యతి సర్వభావాన్సధూమదర్శీతి నరః ప్రదిష్టః,

తా. శోకము, జ్వరము, ఆయాసము, శిరోభితాపము వీనివలన పిత్తము ప్రకోపించి దృష్టియందు వికారమును గలుగజేయుటవలన సర్వపదార్థములు పొగచే వ్యాపింపబడియుండునటుల గనుపించును. ఈరోగము ధూమదర్శియని చెప్పంబడును. (అందు సర్వవస్తువులు పగటియందుమాత్రము పొగగమ్మినటుల గనుపించును, రాత్రియందు పిత్తము కొరవబడుటవలన నిర్మలముగ గనుపించును.)

### హ్రస్వదృష్టి లక్షణము

యో హ్రస్వజాడ్యో దివసేషు కృచ్ఛ్రాద్ధ్రస్వాని రూపాణిచ తేనపశ్యేత్.

తా. దోషము దృష్టిమధ్యమును జెందుటవలన పగటియందు లావుగనుండు పదార్థములు సన్నముగ గనుపించిన హ్రస్వదృష్టియనంబడును. ఇది పిత్తమువలన జనించును.

### నకులాంధ్యలక్షణము

విద్యోతతే యస్య నరస్య దృష్టిర్దోషాభిపన్నా నకులస్య యద్వత్,
చిత్రాణి రూపాణి దివా సపశ్యేత్సవై వికారో నకులాంధ్యసంజ్ఞః. 66

తా. దృష్టిదోషముతో వ్యాపింపబడి ముంగిసదృష్టితో సమానమై జిగజిగలాడుచు పగటియందు నానావిధరూపములు గనుపడుచుండిన నకులాంధ్యమనంబడును.

### గంభీరదృష్టిలక్షణము

దృష్టిర్విరూపా శ్వసనోపసృష్టా సంకోచమభ్యంతరతశ్చ యాతి,
రుజావగాఢం చ తమక్షిరోగం గంభీరికేతి ప్రవదన్తి తజ్జ్ఞాః. 67

తా. దృష్టి వాతమువలన వికృతమై, లోపలసంకోచముగలదై పోట్లతో గూడియుండిన గంభీరదృష్టియనియెదరు.

## ఆగంతుకలింగనాశనము

బాహ్యౌ పునర్ద్వావిహ సంప్రదిష్టౌ నిమిత్తతశ్చాప్యనిమిత్తతశ్చ,
నిమిత్తతస్తత్ర శిరోభితాపో జ్ఞేయస్త్వభిష్యందనిదర్శనస్సః. 68

తా. అభిఘాతలింగనాశనము రెండువిధంబులు. అందొకటి ఏదోయొక కారణముచేతను, మరియొకటి నిష్కారణముగను జనించును. అందు విషవృక్ష పుష్పముపైనుండి వచ్చినగాలియొక్క స్పర్శవలన శిరస్సుతపించి, ఆఉష్ణము కన్నులకుదిగి కన్నులుగానరాకుడంజేయును. అది శిరోభితాపమనంబడును. ఇది యొక నిమిత్తజన్యము దీనియందు రక్తాభిష్యంద లక్షణములే గలిగియుండును.

## అనిమిత్తలింగనాశలక్షణము

సురర్షిగంధర్వమహోరగాణాం సందర్శనేనాపి చ భాస్కరస్య,
హన్యేత దృష్టిర్మనుజస్య యస్య సలింగనాశస్త్వనిమిత్తసంజ్ఞః. 69
తత్రాక్షివిస్పష్టమివావభాతి వైడూర్యవర్ణావిమలా చ దృష్టిః,

తా. దేవ, ఋషి, గంధర్వ, మహాసర్ప, సూర్యాదులనురిమిచూచుటవలన దృష్టినష్టంబైన అది అనిమిత్తలింగనాశనమని చెప్పంబడి కన్నులు స్వచ్ఛముగ, దృష్టిశ్యామలవర్ణముగనుండును. (ఈరీతిగదృష్టిగతరోగలక్షణములు వచింపంబడియెను.)

## కంటితెల్లగుడ్డుయందుజనించురోగములు

## అర్మరోగభేదములు

ప్రస్తార్యర్మ తను స్తీర్ణం శ్యావం రక్తనిభం సితే. 70
సశ్వేతం మృదుశుక్లార్మ శుక్లే తద్వర్ధతే చిరాత్,
పద్మాభం మృదు రక్తార్మ యన్మాంసం చీయతే సితే. 71
పృథుర్మృద్వధిమాంసార్మ బహుళం చ యకృన్నిభమ్,
స్థిరం ప్రస్తారిమాంసాఢ్యం శుష్కం స్నాయ్వర్మ పంచమమ్. 72

తా. అర్మరోగంబైదువిధంబులు. అందు కంటియొక్క తెల్లనిభాగముపై తేటగను, విస్తీర్ణముగను, నల్లగను, ఎఱ్ఱగనుండుమాంసముజనించిన ప్రస్తార్యర్మమనియు, తెల్లగను, మృదువుగనుండు మాంసము జనించి కాలక్రమముగ వృద్ధిపొందిన శుక్లార్మమనియు, తామరవలె ఎఱ్ఱగను మృదువుగనుండు మాంసముజనించిన రక్తార్మమనియు, విస్తీర్ణముగను, మృదువుగను, యకృత్తువలె స్థూలముగను నల్లగగనుపించిన అధిమాంసార్మమనియు, కఠినంబై ప్రసరించునదిగనుండి స్రావరహితంబై యుండు మాంసము జనించిన స్నాయ్వర్మమనియు జెప్పబడియెను. (అర్మమన దుర్మాంసము.)

### శుక్తిరోగలక్షణము

శ్యావాస్స్యుః పిశితనిభాస్తు బిందవో యే
శుక్త్యాభాస్సితనియతాస్సశుక్తిసంజ్ఞః,

తా. కంటియొక్క తెల్లగుడ్డుపై నల్లగను, మాంసతుల్యముగను, ముత్యపు చిప్పవర్ణముతో సమముగను బిందువులుజనించిన శుక్తియనంబడును.

### అర్జునలక్షణము

ఏకో యశ్శశరుధిరోపమశ్చ బిందుశ్శుక్లస్థో భవతి తదర్జునం వదంతి.

తా. కన్నులయొక్క తెల్లభాగమునందు కుందేలురక్తమువలె నెఱ్ఱని బిందు వొకటి జనించిన నది అర్జునమనబడును.

### పిష్టకలక్షణము

శ్లేష్మమారుతకోపేన శుక్లే మాంసం సమున్నతమ్,
పిష్టవత్పిష్టకం విద్ధి మలాక్తాదర్శసన్నిభమ్. 74

తా. కఫవాతప్రకోపమువలన కంటియొక్క తెల్లగుడ్డునందు పిండివలె తెల్లగనుండు మాంసముబుట్టిన నది పిష్టకమనంబడును. ఇదిమలయుక్తమగు నద్దము వలె గనుపించుచుండును.

### సిరాజాలలక్షణము

జాలాభః కఠినసిరో మహాంత్సరక్త
స్సంతానస్స్మృత ఇహ జాలసంజ్ఞితస్తు,

తా. కన్నుయొక్క తెల్లగుడ్డునందు కఠినముగను, గొప్పగను, యెఱ్ఱగనుండు సిరలువ్యాపించి వలతో సమానమైయుండిన నది సిరాజాలమనంబడును.

### సిరాజపిటికలక్షణము

శుక్లస్థాస్సితపిటికాస్సిరావృతా యా
స్తా బ్రూయాదసితసమీపజాస్సిరాజాః. 75

తా. కంటియొక్క తెల్లగుడ్డునందు నల్లనిభాగమునకు సమీపమున సిరలు వ్యాపించి తెల్లనై, సన్నకురుపులంగలుగజేసిన దానిని సిరాజపిటికమనియెదరు.

### బలాసలక్షణము

కాంస్యాభో మృదురథ వారిబిందుకల్పో
విజ్ఞేయో నయనసితే బలాససంజ్ఞః,

తా. కంటియొక్క తెల్లనిభాగమునందు కంచుతో సమానమగు కాంతికలది గను, కఠినముగను లేక నీటిబిందువుతో సమముగనుండు గ్రంధిజనించి, కొంచెముబ్బి

గుండ్రముగనుండిన దానిని బలాసమనియెదరు. ఈప్రకారముగ కంటి తెల్లగుడ్డు నందు జనించురోగములు చెప్పబడియెను.

## పూయాలసలక్షణము

పక్వశ్శోథస్సంధిజో యస్సతో
దశ్చ్యతస్సూయం పూతిపూయాలసాఖ్యః. 76

తా. నేత్రసంధియందు వాపుజనించి పండి, సూదులతో పొడిచినటుల వేదనతో గూడి దుర్గంధముగ చీమునుగార్చుచుండిన పూయాలస మనబడును.

## ఉపనాహలక్షణము

గ్రంథిర్నాల్పోదృష్టిసంధావపాకీ కండూప్రాయో నీరుజస్తూపనాహః,

తా. నేత్రసంధియందు లావుగను, కొంచెము పక్వమైనదిగను, మిక్కిలి దురదతో గూడినదిగను, వేదనారహితముగనుండు గ్రంధిజనించిన దానిని ఉపనాహ మనియెదరు.

## నేత్రనాడీలక్షణము

గత్వా సంధీనశ్రుమార్గేణ దోషాః
కుర్యుస్స్రావాన్ లక్షణైస్సైర్వ్యుపేతాన్. 77
తం హి స్రావం నేత్రనాడీతిచైకే తస్యాలింగం కీర్తయిష్యే చతుర్ధా,

తా. వాతాదిదోషము లశ్రువులయొక్క మార్గముచే సంధులయందు ప్రవేశించి, తమతమ లక్షణములతోగూడి స్రావమునుగలుగజేసిన నేత్రనాడియని కొందరుజెప్పెదరు. అది నాలుగువిధములుగనుండును.

పాకస్సంధౌసంస్రవేద్యస్తు పూయంపూయాస్రావోసౌగదస్సంధిజస్తు.
శ్వేతం సాంద్రం పిచ్ఛిలం సంస్రవేద్ధి శ్లేష్మాస్రావోసావికారో మతస్తు,
రక్తాస్రావశ్శోణితాద్యో వికారశ్చ్యతేమష్ణం తత్రరక్తంప్రభూతమ్.
హారిద్రాభం పీతముష్ణంజలం వా పిత్తాస్రావం సంస్రవేత్సంధిమధ్యాత్,

తా. నేత్రసంధియందు వాపుబుట్టిపండి చీముకారుచు, సన్నిపాతలక్షణములతోగూడియుండిన పూయస్రావమనియు, తెల్లగను, గట్టిగను, బంకగను చీముకారు చుండిన శ్లేష్మస్రావమనియు, రక్తప్రకోపమువలన విశేషముగను, ఉష్ణముగను, నేత్రములవలన రక్తముస్రవించుచుండిన రక్తజస్రావమనియు, మరియు నేత్రసంధుల యందు పసపుఛాయగను లేక పచ్చగను, ఉష్ణముగను నీరుగారుచుండిన నది పిత్తజ స్రావమనియును తెలియవలయును.

పర్వణీఅలజీలక్షణము

తామ్రా తన్వీ దాహపాకోపపన్నా
జ్ఞేయా వైద్యైః పర్వణీ వృత్తశోథా. 80
జాతా సంధౌ శుక్లకృష్ణేలజీస్యాత్తస్మిన్నేవఖ్యాపితా పూర్వలింగైః,

తా. కంటియొక్క తెల్లనిసంధిపైగాని లేక నల్లనిసంధిపైగాని ఎఱ్ఱగను, చిన్నదిగను, గుండ్రముగనుండు పిటికలుజనించి, తాపముతోగూడినవై పండిన పర్వణీ యనంబడును. ఆస్థానమునందే పూర్వోక్తప్రమేహపిటిక లక్షణములతోగూడి పెద్దవిగ నుండు పిటికలుజనించిన అలజీయనంబడును.

క్రిమిగ్రంధిలక్షణము

జన్తుగ్రంథౌవర్త్మనః పక్ష్మణశ్చ కండూం కుర్యుర్జంతవస్సంధిజాతాః.
నానారూపావర్త్మశుక్లాంతసంధౌవర్త్మాంతర్దూషయన్తశ్చదృష్టిమ్,

తా. కంటిరెప్పలయందును, రెప్పవెంట్రుకలసంధులయందును నానావిధము లగుక్రిములు దురదగలిగిన నది క్రిమిగ్రంధియనబడును. మరియు నది కంటియొక్క తెల్లభాగమునందలి సంధులయందువ్యాపించి, కన్నుయొక్కలోభాగమును జెరచి లోనదిరుగుచుండును.

వర్త్మరోగము - ఉత్సంగపిటికాలక్షణము

అభ్యంతరముఖీ తామ్రా బాహ్యతో వర్త్మతశ్చ యా, 82
సోత్సంగోత్సంగపిటికా సర్వజా స్థూలకండురా,

తా. కన్నుయొక్క లోభాగమునందు, ముఖముగల కురుపుజనించి ఎఱ్ఱనై, కఠినంబుగ దురదతోగూడి కంటిరెప్పలయొక్క వెలపలి మధ్యభాగమున నుబ్బియుండిన ఉత్సంగపిటికయని వచించెదరు. ఇదిత్రిదోషములవలన జనించును.

కుంభికాలక్షణము

వర్త్మాంతే పిటికాధ్మాతా భిద్యంతే చ స్రవంతి చ. 83
కుంభీకబీజసదృశాః కుంభికాస్సన్నిపాతజాః,

తా. కన్నుయొక్క నొకపార్శ్వమున దాడిమ విత్తువలెనుండు కురుపు జనించి అదిమిన, నుబ్బుచు పగిలి (మసివలె) స్రావమును గలుగజేయుచుండిన నది కుంభిక యనంబడును. ఇది త్రిదోషమువలనజనించును.

పోథకీలక్షణము

స్రావిణ్యః కండురా గుర్వ్యో ర క్తసర్షపసన్నిభాః. 84

రుజావంత్యశ్చ పిటికాః పోథక్యఇతి కీర్తితాః,

తా. రెప్పలయొక్క లోభాగములో ఎఱ్ఱావాలతో సమముగనుండు కురుపులుజనించి రక్తమును గార్చుచు దురదతోగూడి, గురుత్వము, మిక్కిలి నొప్పిగలవై యుండిన పోథకియనంబడును.

### వర్త్మశర్కరాలక్షణము

పిటికా యా ఖరా స్థూలా సూక్ష్మాభిరభిసంవృతా. 85
వర్త్మస్థా శర్కరా నామ స రోగో వర్త్మదూషకః,

తా. కంటియందు కఠినముగను, లావుగనుండు కురుపుజనించి, చుట్టు సన్నని కురుపులచే వ్యాపింపబడియుండిన, వర్త్మశర్కరయనంబడును. ఇది కంటిరెప్పల జెరచును.

### అర్శోవర్త్మలక్షణము

ఉర్వారుబీజప్రతిమాః పిటికా మందవేదనాః. 86
శ్లక్ష్ణాః ఖరాశ్చ వర్త్మస్థాస్తదర్శో వర్త్మ కీర్త్యతే,

తా. కంటిరెప్పలయందు దోసవిత్తులతో సమానంబులగు పిటికలుజనించి అల్ప వేదన, నునుపు, కఠినత్వము ఇవి గలవిగనుండిన అర్శోవర్త్మ మనియెదరు.

### శుష్కార్శోలక్షణము

దీర్ఘాంకురః ఖరస్స్తబ్ధో దారుణోభ్యంతరోద్భవః. 87
వ్యాధిరేషోతి విఖ్యాతశ్శుష్కార్శో నామ నామతః,

తా. కంటిరెప్పలలోపల పొడవుగను, గరగరగను, కఠినముగను, దుఃఖకరముగనునుండు మాంసపుమొలకలుజనించిన దానిని శుష్కార్శ మనియెదరు. ఇది త్రిదోషమువలన జనించును.

### అంజనలక్షణము

దాహతోదవతీ తామ్రా పిటికా వర్త్మసంభవా. 88
మృద్వీ మందరుజా సూక్ష్మా జ్ఞేయా సాంజననామికా,

తా. కంటిరెప్పలయందు తాపము, పోట్లు వీనితోగూడి ఎఱ్ఱగను, మృదువుగను, చిన్నదిగను, కొంచెము వేదనగలదిగనుండు కురుపుజనించిన దానిని అంజన మనియెదరు. ఇది త్రిదోషమువలన జనించును.

### బహుళవర్త్మలక్షణము

వర్త్మోపచీయతే యస్య పిటికాభిస్సమంతతః. 89
సవర్ణాభిస్సిరాభిశ్చ విద్యాద్బహుళవర్త్మ తత్,

తా. రెప్పలయొక్క సర్వప్రదేశము, చర్మముతో సమానముగను, కఠినముగను నుండు కురుపులచే వ్యాపింపబడి ఉబ్బియుండిన బహుళవర్త్మ యనంబడును. ఇది త్రిదోషమువలన జనించును.

వర్త్మబంధలక్షణము

కండూమతాల్పతోదేన వర్త్మశోథేన యో నరః. 90
న సమం ఛాదయేదక్షి యత్రాసౌ వర్త్మబంధకః,

తా. రెప్పలువాచి, దురద, కొంచెము వేదన వీనితోగూడియుండుటవలన మూయుటకు వీలులేకయుండిన వర్త్మబంధమనంబడును. ఇది త్రిదోషములవలన జనించును.

క్లిష్టవర్త్మలక్షణము

మృద్వల్పవేదనం తామ్రం యద్వర్త్మసమమేవచ. 91
అకస్మాచ్చ భవేద్రక్తం క్లిష్టవర్త్మేతి తద్విదుః.

తా. నేత్రములయొక్క క్రిందిరెప్పలు, పైరెప్పలు, ఏకకాలంబున మృదువులై, అల్పవేదనగలవై, ఎఱ్ఱనై, అకస్మాత్తుగ మిక్కిలి ఎఱ్ఱనైయుండిన దానిని క్లిష్టవర్త్మమని యెదరు. ఇది కఫరక్తమువలన జనించును.

వర్త్మకర్దమలక్షణము

క్లిష్టం పునః పిత్తయుతం శోణితం విదహేద్యదా. 92
తదా క్లిన్నత్వమాపన్నముచ్యతే వర్త్మకర్దమమ్,

తా. పూర్వోక్తక్లిష్టవర్త్మమునందు, పిత్తయుక్తరక్తమెపుడు గారెడినో అపుడది బురదవలెనగును. దానిని వర్త్మకర్దమమని యెదరు. ఇది పిత్తాధిక సన్నిపాతము వలన జనించును.

శ్యావవర్త్మలక్షణము

వర్త్మ యద్బాహ్యతోంతశ్చ శ్యావం శూనం సవేదనమ్, 93
తదాహుశ్శ్యావవర్త్మేతి వర్త్మరోగవిశారదాః,

తా. రెప్పలయొక్క పైభాగము, లోభాగము, నల్లనైవాచి పోట్లతోగూడియుండిన శ్యావవర్త్మమనంబడును. ఇది వాతాధిక త్రిదోషమువలన జనించును.

ప్రక్లిన్నవర్త్మలక్షణము

అరుజం బాహ్యతశ్శూనం వర్త్మ యస్య నరస్య హి. 94
ప్రక్లిన్నవర్త్మ తద్విద్యాత్క్లిన్నమత్యర్థమంతతః,

తా. రెప్ప కొంచెము వేదన, వెలుపల వాపుగలదై రెప్పలయొక్క కొలుకుల సమీపమున మిక్కిలి చితచితలాడుచుండిన దానిని ప్రక్లిన్నవర్త్మమనియెదరు. ఇది కఫాధిక్యమువలన జనించును.

అక్లిన్నవర్త్మలక్షణము

యస్య ధౌతాన్యధౌతాని సంబధ్యన్తే పునఃపునః. 95
వర్త్మాన్యపరిపక్వాని విద్యాదక్లిన్నవర్త్మ తత్,

తా. కంటిరెప్పలగడిగినను లేక గడగకున్నను బంకవలె పలుమారు కరుచుకొని, లోభాగమునపండక చీముతోగూడకనుండిన దానిని అక్లిన్నవర్త్మయనియెదరు.

వాతహతవర్త్మలక్షణము

విముక్తసంధి నిశ్చేష్టం వర్త్మ యస్య న మీల్యతే. 96
ఏతద్వాతహరం వర్త్మ జానీయాదక్షిచింతకః,

తా. రెప్పసంధులు వీడుటవలన కనులు తెరచుటకును మూయుటకును, అశక్యంబై, చిన్నదియై రెప్పలుమూతబడకుండిన వాతహతవర్త్మమనంబడును.

అర్బుదలక్షణము

వర్త్మాన్తరస్థం విషమం గ్రంథిభూతమవేదనమ్. 97
ఆచక్షతేర్బుదమితి సరక్తమవిలంబితమ్,

తా. రెప్పలయొక్క లోభాగమున మందవేదనగలదై, కొంచెము ఎఱ్ఱనై, శీఘ్రముగ వృద్ధిపొందునదియై, విషమమైయుండు గ్రంధిజనించిన దానిని అర్బుదమనియెదరు. ఇది త్రిదోషమువలన జనించును.

నిమేషలక్షణము

నిమేషిణీస్సిరావాయుః ప్రవిష్టోవర్త్మసంశ్రయః. 98
ప్రచాలయతి వర్త్మాని నిమేషం నామ తం విదుః,

తా. రెప్పలనాశ్రయించియుండు వాయువు నిమేషోన్మేషములజేయునట్టి సిరలయందుజేరి రెప్పల మాటిమాటికి గదలింపుచుండిన దానిని నిమేషమనియెదరు.

శోణితార్శోలక్షణము

వర్త్మస్థో యో వివర్ధేత లోహితో మృదురంకురః. 99
తద్రక్తజం శోణితార్శశ్ఛిన్నం ఛిన్నం ప్రవర్ధతే,

తా. రక్తసంబంధమువలన రెప్పలయొక్క లోభాగమునందు ఎఱ్ఱగను,

మృదువుగనుసుండు మొలకలుజనించిన దానిని శోణితార్శమనియెదరు. దీనిని మాటి మాటికి కోసినను మరల పెరుగుచుండును.

అగణాలక్షణము

అపాకీ కఠినస్థూలో గ్రంథిర్వర్త్మభవోఽరుజః. 100
సకండూః పిచ్ఛిలః కోలసంస్థానో లగణస్తు సః,

తా. రెప్పలయందు రేగుకాయవలె కఠినముగను, స్థూలముగను, దురదతో గూడినదిగను, జిగటగనుసుండు గ్రంథిజనించిన దానిని లగణమనియెదరు. ఇది కఫాధిక్యమువలన జనించును. (దీనియందుపోట్లు, పాకము (అనగా పండుట) ఇవి లేకయుండును.)

బిసవర్త్మలక్షణము

త్రయో దోషా బహిశ్శోథం కుర్యుశ్ఛిద్రాణి వర్త్మనోః. 101
ప్రస్రవత్యంతరుదకం బిసవద్బిసవర్త్మ తత్,

తా. దోషత్రయ ప్రకోపమువలన రెప్పల పైభాగమువాచి, ఛిద్రములతో గూడి తామర తూండ్లవలె లోనసీరుగారుచుండిన దానిని బిసవర్త్మయనియెదరు.

కుంచనలక్షణము

వాతాద్యావర్త్మసంకోచం జనయంతి యదామలాః. 102
తదా ద్రష్టుం న శక్నోతి కుంచనం నామ తద్విదుః,

తా. వాతాదిదోషములు ప్రకోపించి రెప్పల మూసుకొనునట్లుగజేసి, కన్నులు దెరచిచూచుట కశక్యముగనుండిన దానిని కుంచనమనియు లేక కృఛ్రోన్మీలన మనియును వచించెదరు.

పక్ష్మకోపలక్షణము

ప్రచాలితాని వాతేన పక్ష్మాణ్యక్షి విశంతి హి. 103
ఘృష్యంత్యక్షి ముహుస్తాని సంరంభం జనయన్తి చ,
అసితే సితభాగే చ మూలకోశాత్పతంత్యపి. 104
పక్ష్మకోపస్సవిజ్ఞేయో వ్యాధిః పరమదారుణః,

తా. వాతముచే కంటిరెప్పలు కదలించబడుటవలన వెంట్రుకలు కంటిలో ప్రవేశించి మాటిమాటికి తెల్లగుడ్డుయందుగాని, నల్లగుడ్డుయందుగాని వొరుసుకొనుటచే వాపుకలిగి వెంట్రుకలు మూలమునుండివదులును. ఇది పక్ష్మకోపమనబడును. (అథవా ఉపపక్ష్మమనియు చెప్పంబడును) ఇది మిక్కిలి భయంకరమైనది,

### పక్ష్మశాతలక్షణము

వర్త్మ పక్ష్మాశయగతం పిత్తం రోమాణి శాతయేత్. 105
కండూం దాహం చ కురుతే పక్ష్మశాతం తమాదిశేత్,

తా. రెప్పలు, రెప్పవెంట్రుకలు వీనిమూలమునందుండు పిత్తము ప్రకోపించుటవలన వెంట్రుకలూడి రెప్పలయందు దురద, దాహము వీనిని గలుగజేయును. దానిని పక్ష్మశాతమని వచించెదరు.

### త్రికటుకాద్యంజనము

కటుత్రయం చాపి ఫలత్రయం చ జ్యోతిష్మతీవేల్లకరంజబీజమ్. 106
ప్రపౌండరీకం మధుకం చ తామ్రంసింధూద్భవం వైస్ఫటికంచశంఖమ్,
రసాంజనం గైరికచందనే ద్వే ద్రాక్షానిశాశాబరలోధ్రకం చ. 107
తుత్థంచదార్వీకటురోహిణీ చ పేష్యం కరంజస్వరసేన సర్వమ్,
తుత్థాదిరేకో ద్విగుణో రసాదిః ప్రపౌండరీకాదిగణం త్రిభాగమ్.108
శేషం చతుర్భాగమిదం నిహన్యాద్వర్తిస్తునేత్రే సకలాంశ్చరోగాన్,
కాచం చ పుష్పం పటలం వ్రణంచదుర్మాంసకండ్వాపిటికంకుకూనమ్.
దాహంచరాగంచనిశాంధతాంచ తథాధిమంథం వినిహంతి శీఘ్రమ్,

తా. త్రికటుకములు, త్రిఫలములు, వెక్కుడు (మాల్కంగిణి)వాయువిడంగములు, కానుగవిత్తులు ఇవిప్రత్యేకము నాలుగేసిభాగములు, ప్రపౌండరీకము, అతిమధురము, తామ్రభస్మము, సైంధవలవణము, పటిక, శంఖము, ఇవి దినుసుకు 3 భాగములు, రసాంజనము, కావిరాయి, శ్రీగంధము, రక్తచందనము, ద్రాక్షపండు,పసపు, తెల్లలొద్దుగ, ఎఱ్ఱలొద్దుగ ఇవి దినుసుకు రెండేసిభాగములు, మైలతుత్తము, మానిపసపు, కటుకరోహిణి, ఇవిదినుసుకొక్కొకభాగము ఇటుల వీనినన్నిటిని ఖల్వమునందునిచి, కానుగచెక్క రసముతో మర్దించి, కణికలుజేసి, ఉదకముతోదాది కన్నులబెట్టిన కాచము, పువ్వులు, పటలములు, వ్రణములు, దుర్మాంసము, దురద, పొక్కులు, కూనలు, కంటియందుమంట, కంటియెరుపులు, రేజీకటి, అధిమంథము మొదలగు సర్వనేత్రరోగములు నివర్తించును.

### కతకాద్యంజనము

కతకస్య ఫలం శంఖం సైంధవం త్ర్యూషణం సితా. 110
ఫేనో రసాంజనం క్షౌద్రం విడంగాని మనశ్శిలా,
కుక్కుటాండకపాలం చ ఖల్వమధ్యే వినిక్షిపేత్. 111
సర్వమేతత్సమం కృత్వా నారీక్షీరేణ పేషయేత్,

తిమిరం పటలం కాచమర్మశుక్రం వ్యపోహతి. 112
కండూక్లేదార్బుదం హన్తి మలం బాహ్యం జయేత్తతః,

తా. చిల్లగింజలు, శంఖము, సైంధవలవణము, త్రికటుకములు, చక్కెర, సముద్రపునురుగు, రసాంజనము, తేనె, వాయువిడంగములు, మణిశిల, కోడిగుడ్డు పెంకులు వీనినిసమభాగములుగ చనుబాలతోమర్దించి, కణికలుజేసి, (నిమ్మపండ్ల రసముతోచాది) కన్నులబెట్టిన వర్త్మరోగము, కన్నులదృష్టిని పోగొట్టెడిరోగము, తిమిరము, పటలము, కాచము, అర్మరోగము, కంటిపువ్వులు, దురద, నీరుకారుట నేత్రార్బుదము, కండ్లపుసి ఇవి హరించును.

గరుడాంజనము

సత్రుటిమరిచతుత్థం సైంధవం వార్ధిఫేనం స్ఫటికదరదశంఖం చందనం కుష్ఠలాక్షే. 113
రజనినరకపాలం కుక్కుటాండం కునట్యాకతకశశిసురాహ్వాతార్క్ష్యశైలం సరాళమ్,
అజపయసిపునర్భూమీన దృగ్భృంగినీలీసలిలజవిజయాభిర్ఘర్షితం సప్తవారమ్. 114
తిమిరపటలకాచం ధూమదృక్తాంధకారేహరతికుసుమచోతంరక్తతాం నేత్రపాకమ్,
గరుడసదృశదృష్టిం నిర్మలత్వం చ దత్తే మనుజహితకృతేసంభాషితం పూజ్యపాదైః. 115

తా. ఏలకులు, మిరియాలు, శుద్ధిచేసినమైలతుత్తము, సైంధవలవణము, సముద్రపునురుగు, పటిక, ఇంగిలీకము, శంఖము, శ్రీగంధము,చంగల్వకోష్ఠు, లక్కబియ్యము, పసపు, మనుజునితలపుర్రె, కోడిగుడ్డుపెంకులు, మణిశిల, చిల్లగింజలు, పచ్చకర్పూరము, దేవదారు, రసాంజనము, గుగ్గిలము వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి మేకపాలు, గలిజేరు, పొన్నగంటి, గుంటగలగర, నీలి, తెల్లకలువ, తక్కలి వీనిరసములచే ప్రత్యేకముమర్దించి, (కణికలుజేసి, ఉదకముతోచాది) కన్నులబెట్టిన తిమిరము, పొరలు, కాచము, పొగగప్పినకన్నులు, కనుపించనికన్నులు, కంటిపువ్వులు, కంటిపుసి, కంటియెఱుపు, నేత్రపాకము ఇవిహరించి, గరుడునితోసమమగు దృష్టి, నిర్మలత్వము ఇవి గలుగును. ఇదిలోకహితార్థమైపూజ్యపాదులచే వచింపబడియెను.

రెండవ గరుడాంజనము

కతకసైంధవతుత్థకటుత్రయస్ఫటికశంఖవరాటరసాంజనమ్,

కుసటితామ్రమయో హిమరోహిణీజలధిఫేనవచాన్యకరోటికాః. 116
ఉరగపారదటంకణమంజనం త్రిఫలయామధురోచనకం యుతమ్,
కరజవల్కరసేన సుపేషితం గరుడదృష్టిసమం కురుతే ధ్రువమ్. 117

తా. చిల్లగింజలు, సైంధవలవణము, శుద్ధి జేసిన మైలతుత్థము, త్రికటుకములు, పటిక, శంఖము, గవ్వలు, రసాంజనము, రక్తమణిశిల, తామ్రభస్మము, ఇనుపభస్మము, పచ్చకర్పూరము, కటుకరోహిణి, సముద్రపునురుగు, వస, మనిషితలపుఱ్ఱె, సీసభస్మము, రసభస్మము, వెలిగారము, సౌవీరాంజనము, త్రిఫలములు, అతిమధురము, గోరోచనము వీనిని సమభాగములుగ ఖల్వమున వైచి, కానుగచెక్కరసముతో బాగుగ మర్దించి, (కణికలుజేసి, నీళ్ళతోచాది) కన్నులవైచిన గరుడదృష్టితో సమమగుదృష్టిగలుగును.

## నేత్రాంజనము

కణాసౌవీరకర్పూరనాగపారదతీక్ష్ణకైః,
విషం చ లోహపాత్రే తు నంద్యావర్తరసైర్దినమ్. 118
మర్దయేల్లోహముష్ట్యాథ స్ఫటికం చూర్ణితం క్షిపేత్,
మర్దితం మర్దయేద్భూయో వర్తిశ్శుక్లాన్లపిత్తజిత్. 119

తా. పిప్పళ్లు, సౌవీరాంజనము, పచ్చకర్పూరము, సీసభస్మము, రసభస్మము, లోహభస్మము, శుద్ధిజేసినవత్సనాభి వీనిని సమభాగములుగ ఇనుపపాత్రలోనునిచి * నంద్యావర్తపురసముతో నొకదినము, ఇనుపగుద్దుతో మర్దించి, పటికచూర్ణమునుచేర్చి మరలమర్దించి, కణికలుజేసియెండించి, చాది కన్నులవైచిన కంటిపువ్వులు, అమ్లపిత్తము ఇవి నివర్తించును.

## తామ్రాద్యంజనము

మృతతామ్రం సధాన్యాభ్రం శిఖితుత్థం చ ఖర్పరీమ్,
దశనిష్కం పృథక్చూర్ణమేకీకృత్యా చ ఖర్పరే. 120
క్షిప్త్వా మందాగ్నినా పాచ్యం తద్గర్భే శుద్ధగంధకమ్,
దత్వాల్పమల్పం భూయో హి రుద్ధ్వా ధూమం ప్రయత్నతః. 121
చూర్ణితం జాయతే శుద్ధం త్రింశత్కర్షం తు గంధకమ్,
సముత్తార్య క్షిపేత్తోయే ప్రస్థమాత్రే తు మర్దయేత్. 122
తజ్జలం చాన్యభాండస్థం కృత్వాధః కిట్టవర్జితమ్,
తజ్జలం చాతపే శోష్యం ఘనీభూతే విమిశ్రయేత్. 123

* నంద్యావర్తమున నందివర్ధనము.

శిఖితుత్థం శిలాచూర్ణం కర్షాంశం వస్త్రగాలితమ్,
మధ్వాజ్యస్తన్యతోక్ష్యుక్తం సర్వనేత్రరుజాపహమ్. 124

తా. తామ్రభస్మము, ధాన్యాభ్రకము, శుద్ధమైలుతుత్తము, శుద్ధిచేసినకఫరీ వీనిని ప్రత్యేకము ౧౦ నిష్కములచొప్పున చూర్ణించి, యేకముగచేర్చి మూకుడు యందునిచి పొయిమీదబెట్టి, అందు శుద్ధిచేసి చూర్ణముచేయబడిన ౩౦ కర్షముల గంధకము, మాటిమాటికి కొంచెకొంచెముగవైచుచు దానిని పొగబైలువెడలకుండు నటుల పైమూకుడుమూసి గంధకంబంతయు జీర్ణమగువరకు పాకముజేసిన శుద్ధంబగును. దానిని సాంగశీతలమునదీసి ౧ ప్రస్థము నీళ్లలోగలిపి మర్దించి, నీళ్లకు అడుగుననుండు మష్టునుదీసివైచి, తేటమరియొకకుండలోవైచి, నీళ్లుఇగురువరకు ఎండలోయెండించి, అందు కర్షప్రమాణము శుద్ధిజేసిన మైలుతుత్తమును, శుద్ధిజేసినమణిశిలనుచూర్ణించి వస్త్రఘాలితమొనర్చివైచి కలిపి కణికలుజేసి, తేనెతోగాని లేక నేతితోగాని లేక చనుబాలతోగాని చాది కన్నులవైచిన సర్వనేత్రరోగములు నివర్తించును.

## రసాంజనాద్యంజనము

శుక్లార్మజే విషం కృష్ణాయుక్తం గోమూత్రభావితమ్,
సాముద్రఫేనం స్ఫటికం కురువిందం రసాంజనమ్. 125
కూర్మపృష్ఠం చ తుల్యాంశం సర్వాంశం చ మనశ్శిలా,
శిలాయా ద్విగుణం వ్యోషం వ్యోషాద్ద్విగుణసైంధవమ్. 126
లోహచూర్ణం విషం చైవ ప్రత్యేకం సైంధవాంశకమ్,
పిష్ట్వా క్షౌద్రయుతం చాక్తం పిల్లశుక్లార్మకం జయేత్. 127

తా. అతివస, పిప్పళ్లు యీ రెంటిని గోమూత్రముతో భావనజేసి అవియు సముద్రఫేనము, పటిక, కురువిందము, రసాంజనము, తాబేటివీపుప్పెర, ఇవి సమభాగములు, వీనికి సమము శుద్ధిజేసిన రక్తమణిశిల, రక్తమణిశిలకు రెండింతలు త్రికటుకములు, వానికి రెండింతలు సైంధవలవణము, సైంధవలవణమునకు సమము లోహభస్మము, లోహభస్మమునకు సమము శుద్ధ వత్సనాభి ఇటుల వీనినన్నిటిని నేకముగ జేసి, తేనెతోగాని, నేతితోగాని నూరి, కణికలుజేసి కన్నులవైచిన కంటిపుసి, కంటిపువ్వులు, అర్మరోగము ఇవి నివర్తించును.

## సైంధవాద్యంజనము

సైంధవం సూతకం నాగం ధాత్రీచూర్ణం రసాంజనమ్,
కణాఘృతం సితా క్షౌద్రం నాగవల్లీదళద్రవైః. 128
కాంస్యపాత్రే తామ్రముష్ట్యా దినమేకం విమర్దయేత్,

వర్తిం కృత్వాంజయేద్ధన్తి సర్వనేత్రగతామయాన్. 129

తా. సైంధవలవణము, రసభస్మము, సీసభస్మము, ఉశిరికెవోలుపు చూర్ణము, రసాంజనము, పిప్పళ్లు వీనిని సమాంశములుగ కంచుపాత్రములోనునిచి, నెయ్యి, చక్కెర, పానకము, తేనె, తమలపాకులరసము వీనిచేనొకదినము రాగిగుండుతో మర్దించి కణికలుచేసి కన్నులవేసికొనిన (కంటిపుసి, పువ్వు, ఎరుపు, దురద ఇవి మొదలగు) సర్వనేత్రరోగములు నివర్తించును.

చంద్రకాంజనములు

తుత్థం తామ్రమయో రజో మధువచాంసత్కర్పరం సైంధవమ్,
శంఖంవ్యోషవిళంగసూతకతక్షైర్దార్వీంచ వాటాంకురమ్. 130
ధాత్రీంతాళకరంజమంజనయుతం పిష్టంచలుంగద్రవైః,
పుష్పం నేత్రవికారకాంశ్చ హరతే చంద్రోదితంచంద్రకమ్. 131

తా. శుద్ధిచేసిన మైలుతుత్థము, తామ్రభస్మము, ఇనుపభస్మము, అతిమధురము, వస, పాలతుత్తము, సైంధవలవణము, శంఖము, త్రికటుకములు, వాయువిడంగములు, రసభస్మము, చిల్లగింజలు, మానిపసపు, మఱ్ఱియూడలు, ఉశిరికెపప్పు, శుద్ధిచేసిన తాళకము, కానుగవిత్తులు, రసాంజనము వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి మాదీఫలరసముతో మర్దించి కణికలుజేసి నీళ్లతోచాది కన్నులవైచిన పువ్వులు, సర్వ నేత్రరోగములు నివర్తించును. (ఇది చంద్రునిచే వచింపబడియెను.)

అన్యచ్చ—

లోధ్రంస్ఫాటికమంచ తగరం తుత్థం తథా నాగకమ్,
కర్పూర్యాసహాసింధుగుచ్ఛకమధువ్యోషం విడంగం సమమ్. 132
పత్థ్యాంభృంగకమాతులుంగజరసైః రక్తే చ నేత్రే క్షిపేత్,
పుష్పంకాచకకండుకాంహరతితచ్చంద్రోదితం చంద్రకమ్. 133

తా. పటిక, లొద్దుగచెక్క, రసాంజనము, గ్రంథితగరము, శుద్ధిచేసిన మైలతుత్తము, సీసభస్మము, శుద్ధిచేసిన కపురి, సైంధవలవణము, కానుగవిత్తులు, అతిమధురము, త్రికటుకములు, వాయువిడంగములు, కరక్కాయ వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి గుంటగలగరరసము, మాదీఫలరసము వీనిచేమర్దించి కణికెలుజేసి కన్నులకువేసిన కంటిపువ్వులు, కాచము, దురద వీనిని నివర్తింపజేయును. (దీనిని చంద్రుడు వచించెను.)

కతకమణిశిలాహ్వాంధాత్రికాంక్షీరతుత్థం
దరదమధుకలోధ్రంతాళకంశంభువీర్యం,

త్రికటుయుగకరంజందారుదార్వ్యసవేల్లా
స్ఫటికకుముదశంఖంతామ్రనాగాభ్రికా_న్తమ్. 134
కునటిమణిశిలాజిన్నాగధీం హ_స్తికృష్ణాం
లవణజలధిఫేనం గై_రికాఖ్యంచసర్వమ్,
వటశిఖరకవిశ్వాభృంగరాజార్ద్రికాద్భిః
మృదితమథఘృతైస్స్యాత్క_ల్పితంనేత్రవ_ర్తి. 135
పటలతిమిరపుష్పంకండుకంలోహితంచ
శ్వయథుజలనిబర్హాంచంద్రకాఖ్యాంజనంతత్,

తా. చిల్లగింజలు, శుద్ధిచేసినపీతమణిశిల, ఉశిరికెపప్పు, శుద్ధిచేసినపాలతుత్థము, శుద్ధిచేసిన ఇంగిలీకము, అతిమధురము, లొద్దుగచెక్క, శుద్ధిచేసిన తాళకము, శుద్ధరస భస్మము, త్రికటుకములు, కానుగచెక్క, నల్లచెక్క, కానుగ, దేవదారు, మాని పసపు, మిరియాలు, పటిక, తెల్లకలువ, శంఖము, తామ్రభస్మము, నాగభస్మము, కృష్ణాభ్రికభస్మము, కాంతభస్మము, శుద్ధిచేసిన రక్తమణిశిల, శుద్ధిచేసిన తాళకము, పిప్పళ్లు, గజపిప్పళ్లు, సముద్రపునురుగు, కావిరాయి వీనిని సమభాగములుగ ఖల్వము నందునిచి మఱ్ఱియూడలు, శొంఠి, గుంటగలగర, అల్లము వీనిరసములో మర్దించి కణికలుచేసి ఆవునేతితో చాదికన్నులవైచిన కంటిపొరలు, తిమరములు, కంటిపువ్వులు, దురద, ఎరుపు, కంటివాపు, నీరుకారుట వీనిని హరింపజేయును. (ఇదియును చంద్రునిచే వచియింపబడిన చంద్రకాంజనము)

### ఖర్పరాద్యంజనము

ఖర్పరతుత్థరసాంజనఫేనంశంఖశిలాసపునర్నవ త్రిఫలా. 136
నింబరసేనవిమర్ద్యచవటికాః కాచతిమిరపటలానిచ పుష్పమ్,

తా. శుద్ధిచేసిన కపరి, శుద్ధిచేసిన మైలుతుత్తము, రసాంజనము, సముద్రపు నురుగు, శంఖము, శుద్ధిచేసినరక్తమణిశిల, తెల్లగలిజేరువేరు, త్రిఫలములు వీనిని సమము లుగ ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముతో బాగుగనూరి కణికలుచేసి, నీళ్లతోచాది కన్నులబెట్టిన కాచము, పటలము, (పొరగప్పినకండ్లు) కంటిపువ్వు ఇవి హరించును.

### తిలపుష్పాంజనము

మరిచం ఖర్పరీ చైవ తిలపుష్పం తథైవచ. 137
ఏకైకం ద్విగుణం ప్రోక్తం జంభనీరేణ పేషయేత్,
నాశయే_త్తిమిరం కండూం పటలాన్యర్బుదాని చ. 138
అతిరక్తాని మాంసాని హ్యేకరాత్రేణ నాశయేత్,

తా. మిరియాలు ౨ భాగములు, శుద్ధిజేసినఖర్పరి ౪ భాగములు, నువ్వుపువ్వులు ౭ భాగములు వీనిని ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముతో మర్దించి కణికలు చేసి చాది కన్నులబెట్టిన తిమిరములు, దురద, కంటిపొరలు, అర్బుదము, కంటిఎరుపు, దుర్మాంసము వీనినన్నిటిని నొకదినములో హరింపజేయును.

మరిచాంజనము

మరిచామలకే కరంజబీజం క్రమవృద్ధ్యామృదితంచ భృంగతోయైః.
తిమిరం పటలంనిహన్తికాచంసుకృతంకర్మ యథాద్రుతంభవార్తిమ్,

తా. మిరియాలు ౧ భాగము, ఉశిరికెవొలుపు ౨ భాగములు, కానుగవిత్తులు 3 భాగములు వీనిని ఖల్వమునందునిచి, గుంటగలగరాకు రసముతోనూరి కణికలుజేసి నేత్రములయందంజనము వేసుకొనిన కొనరానికన్నులు, పొరలు, కాచము ఇవి జన్మాంతరసుకృతమువలన సంసారబాధవలె శీఘ్రముగ హరించును.

చంద్రప్రభాంజనము

ఫేనం చ ముండంకతకస్యబీజం నారం కపాలం సహకుక్కుటాండమ్.
మనశ్శిలామాగధికాప్రయుక్తమాజన్మజాతం కుసుమం నిహన్తి,

తా. సముద్రఫేనము, ఇనుపభస్మము, చిల్లగింజలు, మనుష్యునికపాలము, కోడిగుడ్లపెంకులు, శుద్ధిజేసిన మణిశిల, పిప్పళ్లు వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి, (జీలకఱ్ఱకషాయముతోనూరి) కణికలుజేసి కన్నులవైచిన జననము మొదలుకొనియుండు పువ్వులు నివర్తించును.

దార్వ్యాద్యంజనము

దార్వ్యంజనంచ పటలం కాచం పిల్లం తథార్జునమ్. 141
స్రావార్మనక్తరోగాణి కండూం క్లేదం వ్యపోహతి,
యూథికాఘర్షణం శూలం వర్త్మరోగం వినాశయేత్. 142
నాశయేచ్ఛుక్లరోగాంశ్చ విజానీయాద్విశేషతః,

తా. రసాంజనము కన్నులబెట్టిన, కంటిపొరలు, కాచము, కంటిపుసి, అర్జునము, నీరుగారుట, అర్మరోగము, రేచీకటి, దురద, కండ్లంటుకొనుట వీనిని హరింపజేయును. మరియు అడవిమొల్లమొగ్గతో కన్నులతోమిన కంటినొప్పి వర్త్మరోగము, పువ్వులు ఇవి నివర్తించును.

గిరికర్ణికాద్యంజనము

సితగిరికర్ణికమూలం బీజం పుష్పాణి పేషయేద్వర్తిం. 143
శంఖం నిశాభయశుంఠిగతమపి చతుర్నివర్తయేత్,

తా. తెల్లగంటెనవేరు, దానిమిత్తులు, పువ్వులు, శంఖము, పసపు, కరక్కాయ వీనిని సమభాగములుగ గ్రహించి గంటెనవేరురసముతో మర్దించి, కన్నుల బెట్టిన పోయినకన్నులుగూడా మరలవచ్చును.

శిలాద్యంజనము

శిలామాగధికర్పూరం పురాణం తింత్రిణీఫలమ్. 144
కరంజబీజంనేత్రాక్తం దివానక్షత్రదర్శకమ్,

తా. శుద్ధిజేసినమణిశిల, పిప్పళ్లు, పచ్చకర్పూరము, పాతచింతపండు, కానుగవిత్తులు వీనిని నుదకముతో నూరి కన్నులబెట్టిన పగటియందు నక్షత్రములు గనుపడును (పోయినకన్నులుగూడా వచ్చును.)

నారికేళాంజనము

దార్వీవరామధుకమంభసినారికేళేపక్త్వాష్టభాగపరిశిష్టరసం పునస్తత్.
సాంద్రంవిపాచ్య శశిసైంధవమాక్షికాఢ్యం హన్త్యర్మకాచతిమిరార్బుద
వర్త్మరోగాన్,

తా. మానిపసపు, కరక, తాడి, ఉశిరికెలు, అతిమధురము వీనిని ప్రత్యేకము ౧ పలమువంతునచేర్చి నలియగొట్టి, కుంచెడునారికేళపుకాయ నీటిలో వైచి యెనిమిదవ భాగము మిగులునటుల కషాయముకాచి, మరియొకకుండలోవడబోసి, సన్నపుసెగను చిక్కపడువరకుకాచి చల్లార్చి, అందు (౪ మాడలయెత్తు) పచ్చకర్పూరము, (మాడయెత్తు) సైంధవలవణము, (౫ చిన్నములయెత్తు) తేనెకలిపి కన్నులబెట్టిన అర్మము, కాచము, తిమిరము, అర్బుదము, వర్త్మరోగము, నీరుకారుట ఇవి హరించును.

మహానారికేళాంజనము

మధుకవరా దార్వీణాం పృథక్పలం నారికేళసలిలస్య. 146
ప్రస్థే విపచేదేతత్తుర్యాంశం తత్పునః పచేత్పాత్రే,
తుత్థ శశిఫేనగైరికసింధూత్థరసాంజనాని మరిచం చ. 147
ప్రత్యేకపాదనిష్కాంక్షిప్త్వాలోడ్యాక్షమాక్షికైరక్తమ్,
అంజనమఖిలే నేత్రే షడధికనవతిం నిహన్త్యార్తీః. 148

తా. అతిమధురము, కరక, తాడి, ఉశిరికెలు, మానిపసపు వీనిని ప్రత్యేకము ౧ పలమువంతునచేర్చి నలియగొట్టి ౧ ప్రస్థము, నారికడపుకాయనీళ్లలో వైచి నాలుగవ భాగము మిగులునటుల కషాయముకాచి వడకట్టి మరియొకకుండయందునించి, సన్నపుసెగను మరలకాచి (౫ పలములుగ) దించుకొని చల్లార్చి, పిదప అందు శుద్ధిచేసిన మైలతుత్తము, పచ్చకర్పూరము, సముద్రపునురుగు, కావిరాయి, సైంధవలవ

ణము, రసాంజనము, మిరియాలు వీనిచూర్ణమును దినుసుకు 1 నిష్కము చొప్పున కలిపి, తేనె ౧౪ తులము బోసి కన్నులవైచిన ౯౬ నేత్రరోగములు నివర్తించును.

పుష్పాంజనము

మంజిష్ఠా మధుకోత్పలం దధి కణా త్వక్చవ్యగోరోచనమ్,
మాంసీ చందనశంఖకం గిరిమృదాతుత్థం సపుష్పాంజనమ్. 149
సర్వం చైవ సమానమంజనమిదం యోజ్యం సదా చక్షుషామ్,
కండూం క్లేదమలం చ శోణితరుజం పిల్లం చ శుక్లం హరేత్. 150

తా. మంజిష్ట, అతిమధురము, నల్లకలువపువ్వు, పెరుగు, పిప్పళ్లి, లవంగపు పట్ట, చవ్యము, గోరోచనము, జటామాంసి, చందనము, శంఖము, కావిరాయి, శుద్ధి చేసినమైలతుత్తము, పుష్పాంజనము వీనిని సమభాగములుగనూరి, నేత్రములయందు సదాఅంజనము వేయుచుండిన దురద, నీరుకారుట, కంటిపుసి, ఎరుపు, కంటినొప్పి, పిల్లము, శుక్రము ఇవి నివర్తించును.

గోదన్తాద్యంజనము

గోదన్తం కుక్కుటాండం మకరజదశనం శంఖచూర్ణం వరాటమ్,
సారంగోద్భూతదంతం జలధిమలయుతం తామ్రచూర్ణం సతుత్థమ్.
కర్పూరం రాస్నకం వైస్ఫటికమపిమధూచ్ఛిష్టమందాగ్నిపక్వమ్,
పుష్పం చార్శార్జునం త త్తిమిరపటలకం కాచకం హన్తినేత్రే. 152

తా. ఆవుయొక్కదంతము, కోడిగుడ్డుపెంకులు, మొసలిదంతము, శంఖచూర్ణము, గవ్వలచూర్ణము, జింకపండ్లు, సముద్రపునురుగు, తామ్రచూర్ణము, శుద్ధిచేసిన మైలతుత్థము, పచ్చకర్పూరము, సన్నరాస్నము, పటిక వీనిని జుంటిమైనముతో పాత్రయందువైచి మందాగ్నిమీద నునిచి బాగుగ మర్దించి (పిదప నిమ్మపండ్లపులుసుతో మర్దించి కణికలుజేసి) నేత్రములయందంజనమిడిన కంటిపువ్వు, అర్మము, అర్జునము, తిమిరము, కంటిపొరలు, కాచము ఇవి నివర్తించును.

ధాత్ర్యంజనము

ధాత్రీపథ్యావిభీతానాం ఫలమజ్జావిచూర్ణితాం,
వారిణా పూరితాచ్చక్షుస్తిమిరంఘ్నన్తి నిర్భరమ్. 15[illegible]

తా. ఉసిరికపప్పు, కరక్కాయ, తానికాయ వీనిపప్పును చూర్ణముచేసి (ని[illegible] పండ్లరసములో మర్దించి కణికలుజేసి) నీటితో కన్నులయందంజనమువైచిన కన్నుల తి[illegible]రము నివర్తించును.

## వటక్షీరాదిఅంజనము

వటక్షీరేణ సంయుక్తం ముఖ్యం కర్పూరజం రజః,
క్షిప్రమంజనతో హన్తి కుసుమం తద్ద్విమాసతః. 154

తా. పచ్చకర్పూరము మఱ్ఱిపాలతోనూరి కన్నులకు రెండుమాసములుఅంజనంబిడిన కంటిపూలు నివర్తించును.

## పిప్పల్యంజనము

సంఘృష్య పిప్పలీచూర్ణం సఫేనం కాంస్యభాజనే,
సక్షౌద్రం సైంధవోపేత మంజనం శుక్రనాశనమ్. 155

తా. పిప్పలి, సముద్రఫేనము, సైంధవలవణము వీనిని చూర్ణించి కంచుపాత్రయందునిచి తేనెతోనూరి అంజనంబిడిన శుక్రరోగము నివర్తించును.

## కాశ్మర్యాద్యంజనము

కాశ్మరీపుష్పమధుకదార్వీలోధ్రరసాంజనైః,
సక్షౌద్రమంజనం కుర్యాత్పిత్తవ్యాధిప్రశాన్తయే. 156

తా. చల్లగుమ్ముడుపూలు, అతిమధురము, మానిపసపు లొద్దుగ, రసాంజనము వీనిని సమముగ చూర్ణించి, తేనెతోమర్దించి అంజనంబిడిన పిత్తజనేత్రవ్యాధి నివర్తించును.

## నక్తాంధ్యమునకు కణాద్యంజనము

కణాఛాగశకృన్మధ్యే పక్వా తద్రసపేషితా,
అచిరాద్ధన్తి నక్తాంధ్యం తద్వత్సక్షౌద్రమూషణమ్. 157

తా. పిప్పళ్లను, మేకపెంటికలనడుమనునిచి పక్వముజేసి, ఆమేకపెంటికలరసముచేతనేనూరి అంజనంబిడిన నక్తాంధ్యము నివర్తించును. మరియు మిరియాలు తేనెతో అరగదీసి అంజనంబిడిన నక్తాంధ్యము నివర్తించును.

## రసాంజనాద్యంజనము

రసాంజనం శిలాదారుజాతీపత్రరసో మధు,
నక్తాంధతాం జయేదేతదంజనం సాధుయోజితమ్. 158

తా. రసాంజనము, శుద్ధిజేసినమణిశిల, దేవదారు వీనినిజాతీపత్రరసముచేనూరి, తేనెకలిపి, కన్నులకిడిన నక్తాంధ్యము నివర్తించును.

## పిప్పల్యాద్యంజనము

పిప్పలీం త్రిఫలాంలాక్షాంలోధ్రకం చ ససైంధవమ్, 159
భృంగరాజరసేఘృష్ట్వాగుటికాంకారయేద్భిషక్.

అర్శం సతిమిరం కాచం కండూం శుక్రం తథార్జునమ్,
అంజనం నేత్రజాణ్ రోగాన్నిహంత్యేతన్న సంశయః. 160

తా. పిప్పలి, త్రిఫలములు, లక్క, లొద్దుగ, సైంధవలవణము వీనిని సమాంశములుగ ఖల్వమునందునిచి గుంటగలగరాకు రసముచే మర్దించి, గుటికలుచేసి కన్నులకిడిన అర్శరోగము, తిమిరము, కాచము, దురద, శుక్రము, అర్జునము ఇతర నేత్రరోగములు ఇవి నివర్తించును.

తులస్యాద్యంజనము

తులస్యాబిల్వపత్రస్య రసో గ్రాహ్యాస్సమాంశకః,
తాభ్యాం తుల్యం పయో నార్యాస్త్రితయం కాంస్యపాత్రకే. 161
గజవల్ల్యా దృఢంమర్ద్యం తామ్రేణ ప్రహరం పునః,
కజ్జలత్వం సముత్పాద్య తేనాంజ్యాదపిలోచనమ్. 162
సద్యో నేత్రరుజం హన్తి శూలాం పాకసంభవామ్,

తా. తులసిఆకురసము, బిల్వపత్రరసము ఇవిసమభాగములు, వీనికిసమముచనుబాలు వీనిని కంచుపాత్రయందునిచి, మర్దించి అందుగజపిప్పలిచూర్ణమును గలిపి, రాగిచెంబుతో ఒకఝామమర్దించి కాటుకగనొనర్చి అంజనంబిడిన, నేత్రరోగము, పాకమువలనజనించిన నేత్రశూల ఇవి నివర్తించును.

కతకాద్యంజనము

కతకస్య ఫలం శంఖః సైంధవం త్ర్యూషణం సితా. 163
ఫేనో రసాంజనం క్షౌద్రం విడంగాని మనశ్శిలా,
సర్వమేతత్సమం కృత్వా నారీక్షీరేణ పేషయేత్. 164
తిమిరం పటలం కాచమర్మశుక్రం వ్యపోహతి,
కండూం క్లేదార్బుదం హన్తి మలం వాహ్యం జితేక్షితు. 165

తా. చిల్లగింజలు, శంఖము, సైంధవలవణము, శొంఠి, పిప్పలి, మిరియాలు, చక్కెర, సముద్రఫేనము, రసాంజనము, తేనె, వాయువిడంగములు, శుద్ధిజేసిన మణిశిల వీనినన్నిటినిసమములుగ ఖల్వమునందునిచి, చనుబాలచేనూరి కన్నుల వైచిన తిమిరము, పటలము, కాచము, అర్మము, నేత్రశుక్రము, దురద, క్లేదము, అర్బుదము, పుసి ఇవి నివర్తించును.

పునర్నవాద్యంజనము

దుగ్ధేన కండూంక్షౌద్రేణ నేత్రస్రావం చ సర్పిషా,
పుష్పం తైలేన తిమిరం కాంజికేన నిశాంధతామ్. 166

పునర్నవాహరత్యాశు భాస్కరస్తిమిరం యథా,

తా. (శుద్ధిజేసిన) తెల్లగలిజేరు వేరును, చనుబాలతో చాది కన్నులకిడిన దురద, తేనెతో చాదివైచిన కన్నులనీరుకారుట, నేతితో చాదివైచిన కంటిపూలు, నూనెతో చాదివైచిన తిమిరము, కాంజికముతో చాదివైచిన రేచీకటి ఇవి నివర్తించును.

ఉత్పలాద్యంజనము

ఉత్పలస్వాదుసద్రక్తచందన త్రిఫలాకృతమ్. 167
నిశాంధ్యం తిమిరం హన్తి పటలం చక్షురంజనమ్,

తా. కలువపువ్వులు, సైంధవలవణము, రక్తచందనము, త్రిఫలములు వీనిని (నిమ్మపండ్లరసముతో) మర్దించి ఆంజనంబిడిన రేచీకటి, తిమిరము, కంటిపొరలు ఇవి హరించును.

సర్వనేత్రరోగములకు సౌవీరాంజనము

అగ్నితప్తం చ సౌవీరం నిషించేత్త్రిఫలారసే. 168
సప్తవేలం తథా స్తన్యైస్త్రీ(స్త్రీ)ణాం సిక్తం విచూర్ణితమ్,
అంజయేన్నయనే తేన ప్రత్యహం చక్షుషోర్హితమ్. 169
సర్వానక్షివికారాంస్తు హన్యాదేతన్న సంశయః.

తా. తెల్లసుర్మారాయిని నిప్పులో యేడుమార్లుకాచి, దానిని త్రిఫలకషాయముచే యేడుమార్లుచల్లార్చి పిదప చనుబాలచే యేడుమార్లు చల్లార్చవలయును. ఈప్రకారముచేసినపిదప నాసుర్మారాయిని కాటికవలె బాగుగనూరి కన్నుయందంజనంబిడిన సర్వనేత్రరోగములు నివర్తించును. కన్నులకు మిక్కిలి హితముగనుండును.

సర్వనేత్రరోగములకు మృదుచూర్ణాంజనము

శిలాయాం రసకం పిష్ట్వా సమ్యగాప్లావ్య వారిణా. 170
గృహ్ణీయాత్తజ్జలం సర్వం త్యజేచ్చూర్ణమధోగతమ్,
శుష్కం చ తజ్జలం సర్వం పర్పటీసన్నిభం భవేత్. 171
విచూర్ణ్య భావయేత్సమ్యక్త్రి(త్రి)వేలం త్రిఫలారసైః,
కర్పూరస్య రజస్తత్ర దశమాంశేన నిక్షిపేత్. 172
అంజయేన్నయనే తేన సర్వదోషహరం హి తత్,
సర్వరోగహరం చూర్ణం చక్షుషోస్సుఖకారి చ.

తా. కల్కఫరిని కాటుకవలె చక్కగ ఖల్వముననూరి, ఉదకముతో కలిపి దానిపై తేటనీరునువంచుకొని, అడుగుననిలిచిన చూర్ణమును పారవైచి, ఆతేటనీరుయిగురువరకు చక్కగకాచిన అడుగున బిళ్లవలెనిలుచును. అట్టిబిళ్లను త్రిఫలకషాయముచే

ముష్టారుమర్దించి, (మూడుపుటంబులిడి) చూర్ణముజేసి, దీనికిపదియవభాగము పచ్చ కర్పూరమునుజేర్చి కన్నులకంజనంబిడిన సర్వనేత్రరోగములు నివర్తించును.

## నేత్రాంజనము

ఉరగపారదటంకణకాంజనం స్ఫటికతామ్రమయో హిమరోహిణీ,
కతకసైంధవతుత్థకటుత్రయం త్రిఫలయా మధుకేన చ సంయుతమ్.
కరజవల్కరసైః పరిపేషితం గరుడదృష్టిసమాం కురుతే దృశమ్,

తా. నాగసిందూరము, రసకర్పూరము, వెలిగారము, సౌవీరాంజనము, పటిక, తామ్రభస్మము, లోహసిందూరము, పచ్చకర్పూరము, కటుకరోహిణి, చిల్లగింజలు, సైంధవలవణము, మైలతుత్తము, త్రికటుకములు, త్రిఫలములు, అతిమధురము వీనిని సమాంశములుగ ఖల్వమునందునిచి కానుగచెక్కరసముచేనూరి, కణికెలుజేసి, నీడను రొండించి పిదపచాది కన్నులయందిడిన గరుడదృష్టికి సమమగుదృష్టిగలుగును.

## మంజిష్ఠాద్యంజనము

మంజిష్ఠామధుకోత్పలేదధికణాత్వక్ చవ్యగోరోచనే. 175
మాంసీచందనశంఖపత్రగిరిమృత్తాళీసపుష్పాంజనమ్,
సర్వైరేవ సమానమంజనమిదం శస్తం సదా చక్షుషామ్. 176
కండూక్లేదమలాస్రశోణితరుజాపిల్లార్మశుక్లాపహామ్,

తా. మంజిష్ఠ, అతిమధురము, కలువదుంప, పెరుగు, పిప్పళ్లు, లవంగపుచెక్క, సేవ్యము, గోరోచనము, జటామాంసి, రక్తచందనము, శంఖము, ఆకుపత్రి, గైరికము, పుష్పాంజనము వీనిని సమాంశములుగ (నీళ్లతో) మర్దించి, కణికెలుజేసి, నీడనురొండించి, చాదికన్నులకిడిన దురద అంటుకొనుట, పుసి, నీరుకారుట, రొరుపు, నొప్పి, పిల్లము, ఊర్మ్మ, శుక్లము ఇవి నివర్తించును.

## నయనామృతము

కర్పూరమంజనం తుత్థం తార్క్ష్యపీతకరోహిణీః. 177
వరాటం సైంధవం వ్యోమం ఫేనం మధుకచందనే,
శంఖం చ తత్సమం పిష్ట్వా మాతులుంగరసేన తు. 178
మధుసర్పిర్యుతం చైవహ్యంజనం నయనామృతమ్,

తా. పచ్చకర్పూరము, శుద్ధిచేసినసౌవీరాంజనము, శుద్ధిచేసినమైలతుత్తము, రసాంజనము, మానిపసపు, కటుకరోహిణి, గవ్వలు, సైంధవలవణము, త్రికటుకములు, సముద్రపునురుగు, అతిమధురము, శ్రీగంధము, శంఖము వీనిని సమభాగము

లుగ ఖల్వమునందునిచి, మాదీఫలరసముతో మర్దించి, కణికలుచేసి, తేనెతోగాని లేక నేతితోగాని చాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు నివర్తించును.

అన్యన్నయనామృతము

మయూరతుత్థంసింధూత్థం తుత్థం ఫేనం రసాంజనమ్. 179
టంకణం మరిచం తుల్యం జంబీరరసపేషితమ్,
త్రిరాత్రం తామ్రపాత్రస్థం కాచార్మ పటలాపహమ్. 180
కండూవ్రణహరం నామ్నా నయనామృతముత్తమమ్,

తా. శుద్ధిచేసిన మైలతుత్తము, సైంధవలవణము, శుద్ధిచేసినపాలతుత్తము, సముద్రపునురుగు, రసాంజనము, వెలిగారము, మిరియాలు వీనిని సమభాగములుగ తామ్రపాత్రయందునిచి నిమ్మపండ్లరసముతో 3 దినములు మర్దించి కన్నులయందిడిన కాచము, అర్మము, పొరలు, దురద, వ్రణము ఇవి నివర్తించును. ఇది నయనామృత మనబడును.

అర్ధచంద్రోదయము

కర్పూరం స్ఫటికం శంఖం చందనం మధుశారిబా. 181
మంజిష్ఠారజనీద్వంద్వం కతకం గైరికం సమమ్,
సర్వైస్సమం తుత్థకం చ జంబీరరసమర్దితమ్. 182
రాత్ర్యంధ్యం తిమిరం కండూం పటలం కాచమేవ చ,
వర్త్మాంతర్గరుజంపుష్పం మాసేనైకేన శామ్యతి. 183
అర్ధచంద్రోదయో నామ్నా సర్వనేత్రరుజాపహః,

తా. పచ్చకర్పూరము, పటిక, శంఖము, చందనము, అతిమధురము, సుగంధిపాల, మంజిష్ఠ, పసపు, మానిపసపు, చిల్లగింజలు, కావిరాయి ఇవి సమభాగములు, వీనికన్నిటికి సమము శుద్ధిచేసిన మైలతుత్తము వీనిని ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముచే మర్దించి అంజనమిడిన రేచీకటి, తిమిరము, దురద, పొరలు, కాచము, కంటిరెప్పయందు జనించినరోగము, పుష్పములు మొదలగు సర్వరోగములు ఒకమాసములో నివర్తించును. (మరియు శుద్ధిచేసినమైలతుత్తము 3 యేగానులయెత్తు, శుద్ధిచేసిన కఫరి ౧ తులము, శుద్ధిచేసిన పటిక ౧ తులము, ౧౦ జీడిగింజలమని వీనినన్నిటిని నిమ్మపండురసముతో మర్దించి, రాగిపళ్లెరమందునిచి ఆవువెన్నగలిపి, రాగిచెంబుతో మర్దించి ౧౩ దినములు కరాటమునందునిచి, పిదప దానినిదీసి మరల మర్దించి, మరల కరాటమున 33 దినములునిచి కన్నులవైచిన నేత్రరోగములు, మాదకన్నులు, దూలమాదలు, తిమిరమాదలు, పుసిమాదలు, నీరుగారుట, దురద, కామిల, పసరు

కామిల, రేచీకటి, పటలము, శిరోవాతము, కపాలశూలలు, కన్నులదురుట, పక్షాఘాతము, శిరోవాతము, దుర్మాంసము, కంటిఎరుపు, నిలువుకండ్లు, పిల్లములు, అభిష్యందము ఇవి హరించును.) *

## గజకేసరీవర్తి

మనశ్శిలాహతం నాగం నాగాద్ద్విగుణతుత్థకమ్. 184
కించిత్కర్పూరకం మర్ద్యం ద్రోణపుష్పరసైర్దినమ్,
వర్తిరేషా హ్యభిష్యందినాశాయ గజకేసరీ. 185

తా. మణిశిలతోచేసిన సీసభస్మము, సీసభస్మమునకు రెండింతలు శుద్ధిచేసిన మైలతుత్తము, కొంచెము పచ్చకర్పూరము వీనిని ఖల్వమునందునిచి, తుమ్మిపూల రసముతో నొకదినము మర్దించి కణికెలుచేసి కన్నులబెట్టిన అభిష్యందము నివర్తించును.

## చంద్రోదయవర్తి

శంఖనాభిర్విభీతస్య మజ్జా పథ్యా మనశ్శిలా,
పిప్పలీ మరిచం కుష్ఠం వచా చేతి సమాంశకమ్. 186
ఛాగీక్షీరేణ సంపిష్య వర్తిం కుర్యాద్యవోన్మితామ్,
హరేణుమాత్రాం సంఘృష్య జలైః కుర్యాదథాంజనమ్. 187
తిమిరం మాంసవృద్ధిం చ కాచం పటలమర్బుదమ్,
రాత్ర్యాంధ్యం వార్షికం పుష్పం వర్తిశ్చంద్రోదయో జయేత్. 188

తా. శంఖనాభి, తానికాయవిత్తులలోనిపప్పు, కరక్కాయ, మణిశిల, పిప్పళ్లు, మిరియాలు, చెంగల్వకోష్ఠు, వస వీనిని సమభాగములుగ మేకపాలతో మెత్తగనూరి † యవప్రమాణము వర్తివలె పొడవుగజేసి, అందు రేణుకగింజంత ప్రమాణము నీళ్లతోచాది కన్నుల కంజనంబిడిన తిమిరము, మాంసవృద్ధి, కాచబిందువు, పటలము, అర్బుదము, రాత్ర్యాంధ్యము, ఒకసంవత్సరముగనుండు కంటిపువ్వు ఇవి నివర్తించును. ఇది చంద్రోదయ వర్తియనంబడును.

## తిమిరపటలములకువర్తి

అక్షాస్థిమజ్జాయష్ట్యాహ్వాధాత్రీమరిచతుత్థకైః,
జలపిష్టైః కృతావర్తిస్తిమిరాణి వ్యపోహతి. 189

తా. తానికాయలోనిపప్పు, అతిమధురము, ఉశిరికెపప్పు, మిరియాలు, పాల

* ఈకుండలితము టీకాకారుని అనుభవయోగ మని తోచెడిని.

† యవప్రమాణమన యవగింజంత లావుగననిభావము.

తు త్తము వీనిని సమభాగములుగ నీళ్లతోనూరి, కణికలుచేసియెండించి, నీళ్లతోచాది కన్నులపైచిన తిమిరము నివర్తించును.

అన్యచ్చంద్రోదయవర్తి

హారిద్రానింబపత్రాణి పిప్పలీమరిచాని చ,
బీభీతకకరంజాని శంఖనాభిర్మనశ్శిలా. 190
ఏతాని సమభాగాని హ్యాజామూత్రేణ పేషయేత్,
నాశయేత్తిమిరం కండూం పటలాన్యర్బుదాని చ. 191
అపి త్రివార్షికం శుక్రం మాసేనైకేన నాశయేత్,
అధికాని చ మాంసాని రాత్ర్యంధత్వం తథైవచ. 192
వర్తిశ్చంద్రోదయానామనృణాం దృష్టివిశోధినీ,

తా. పసపు, వేపచిగురు, పిప్పళ్లు, మిరియాలు, తానికాయలోని పప్పు, కానుగవిత్తులు, శంఖనాభి, శుద్ధిచేసినమణిశిల వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి మేకపంచితముతోనూరి, కణికెలుజేసి, నీళ్లతోచాది కన్నులపైచిన కన్నులుగానరాకుండుట, దురద, పొరలు, అర్బుదము, మూడువత్సరములుగనుండు కంటిపువ్వులు, దుర్మాంసములు, రేజీకటి వీనినొకమాసములో నివర్తింపజేయును. ఇది మనుజులదృష్టిని శోధించు చంద్రోదయవర్తి.

చంద్రప్రభావర్తి

అశీతిస్తిలపుష్పాణి మరిచాని చ షోడశ. 193
పంచాశజ్జాతిపుష్పాణి షష్టిః పిప్పలితండులాః,
ఇయం చంద్రప్రభా నామ వర్తిస్తిమిరనాశినీ. 194

తా. నువ్వుపువ్వులు ౮౦, మిరియాలు ౧౬, జాజిపువ్వులు ౫౦, పిప్పలిబియ్యము, ౬౦ వీనినన్నిటినినూరి, కణికెలుచేసి కన్నులపైచిన తిమిరము నివర్తించును.

పథ్యాదివర్తి

పథ్యావిభీతధాత్రీణాం బీజైస్త్రిద్వ్యేకభాగికైః,
వర్తిర్నేత్రాంజితా హన్తి ప్రకోపం దారుణం దృశోః. 195

తా. కరకపిందెలు 3 భాగములు, తాడికాయలు ౨ భాగములు, ఉసిరికెపప్పు ౧ భాగము వీనినినీళ్ళతోనూరి కణికెలుజేసి, (నీడనుయెండించి) నీళ్ళతోచాది కన్నులపైచిన కన్నులయందలి నొప్పులుమానును.

కంటిపూలు మొదలగువాటికి లేఖనవర్తి

పలాశపుష్పస్వరసైర్బహుశః పరిభావితా,

కరంజబీజవర్తిస్తు శుక్రాదీన్ శస్త్రవల్లిఖేత్. 196

తా. కానుగవిత్తులచూర్ణమును మోదుగపువ్వులరసముతో పలుమార్లు భావన జేసి, మెత్తగనూరి వర్తివలెపొడవుగమాత్రలుకట్టి వానినినీళ్ళతోచాది, కన్నుల పైచిన కంటిపూలు, మాంసవృద్ధి, పొరలు మొదలగు రోగములు శస్త్రముచేపోయిన తెరంగున నివర్తించును.

## రేచీకటికివర్తి

రసాంజననిశాద్వంద్వమాలతీనింబపల్లవైః,
గోశకృద్రససంయుక్తా వర్తిర్నక్తాంధ్యనాశనీ. 197

తా. రసాంజనము, పసపు, మానిపసపు, జాజిచిగుళ్లు, వేపచిగుళ్లు వీనిని సమముగగ్రహించి గోమయరసముతో మెత్తగనూరి కణికెలుజేసి వానిని ఉదకముతో చాది కన్నులపైచిన రేచీకటి నివర్తించును.

## నేత్రరోగములకు రసకేశ్వరవటుకములు

రసకం సైంధవం తుత్థం టంకణం కటుకత్రయమ్,
మర్దయేన్నింబునీరేణ వటీచ్ఛాయావిశోషితా. 198
అంజితా మధునా నేత్రే నేత్రరోగవినాశినీ,
రూక్షత్వమర్బుదం పుష్పం దుర్మాంసం తిమిరాగ్జునే. 199
పటలం నేత్రవాతం చ కాచబిందూదకాని చ,
అన్యానపి మహారోగాన్నాశయేద్రసకేశ్వరః. 200

తా. కలికప్పరి, సైంధవలవణము, పెరుగుతో వేయించినమైలతుత్థము, పేల్చిన వెలిగారము, శొంఠి, పిప్పలి, మిరియాలు వీనినిచూర్ణముజేసి నిమ్మపండ్లరసముతో మర్దించి వటుకములుజేసి, నీడనుయెండించి, తేనెతోచాది, కన్నులపైచిన కన్నుల యందుండు ఉష్ణము, పుసులుగట్టుట, పుష్పములు, దుర్మాంసములు, రేచీకటి, పొరలు, నేత్రవాతము, కాచబిందువులు, నీరుకారుట, ఇతరములయిన నేత్రరోగములు ఇవి నివర్తించును.

## తారకాద్యవటుకములు

తారం తామ్రం రసం తుత్థం ఖర్పరీంపీతకంజనామ్,
రసాంజనం కాంస్యశంఖౌ హంసపాద్యార్ద్రవైర్దినమ్. 201
వర్తిం కృత్వాంజయేద్ధన్తి సమస్తం నేత్రజామయమ్,

తా. వెండిభస్మము, తామ్రభస్మము, రసభస్మము, శుద్ధిజేసినమైలతుత్థము, శుద్ధి జేసినకపరి, మ్రానిపసపు, కటుకరోహిణి, రసాంజనము, కంచుభస్మము, శంఖము,

వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి, హంసపాదిఆకురసముతో నొకదినము మర్దించి, కణికెలుచేసి కన్నులవైచిన సర్వనేత్రరోగములు నివర్తించును.

—శంఖాదివటుకములు—

శంఖస్య భాగాశ్చత్వార స్తదర్ధం చ మనశ్శిలా. 202
మనశ్శిలార్ధం మరిచం మరిచార్ధం చ సైంధవమ్,
అజాక్షీరేణ సంమర్ద్య ఘుటికాం కారయేద్బుధః. 203
నిశాంధ్యం తిమిరం కాచం పుష్పాణి పటలాని చ,
అతిమాంసాని రక్తాని సప్తరాత్రేణ నాశయేత్. 204
వారిణా తిమిరం హన్తి హ్యర్బుదం హన్తి మస్తునా,
పిచ్చటం మధునా హన్తి స్త్రీక్షీరేణ తథార్జునమ్. 205

తా. శంఖము ౪ భాగములు, శుద్ధిజేసినరక్తమణిశిల ౨ భాగములు, మిరియాలు ౧ భాగము, సైంధవలవణము ½ భాగము ఇటుల వీనిని ఖల్వమునందువైచి మేకపాలతోమర్దించి కణికెలుజేసి నేత్రములయందువైచిన రేచీకటి, కన్నులు గానరాకయుండుట, కాచము, కంటిపూలు, పొరలు, దుర్మాంసము, కంటిఎరుపు ఇవి ౭ దినములలో నివర్తించును. మఱియు నీళ్లతోచాదివేసిన తిమిరము, పెరుగునీళ్లతోచాదివేసిన అర్బుదము, తేనెతోచాదివేసినపిచ్చటమను నేత్రరోగము, చనుబాలతోచాదివేశిన అర్జునము ఇవి నివర్తించును.

—నేత్రరోగములకు రసక్రియ

పారదం విద్రుమం నాగం కాసీసం చ రసాంజనమ్,
సైంధవం త్ర్యూషణం తామ్రం తుత్థం గైరికలోధ్రకే. 206
పుత్రజీవీంశిలాముస్తం గిరికర్ణ్యభయే సమమ్,
చించాం సౌవీరకం శుద్ధం నింబపత్రద్రవైఃకృతా. 207
పిష్ట్వా తామ్రతలే క్షౌద్రైః వర్తిఃకాచార్మశుక్లహా,

తా రసభస్మము, పగడము, సీసభస్మము, కాసీసము, రసాంజనము, సైంధవలవణము, త్రికటుకములు, తామ్రభస్మము, శుద్ధిజేసిన మైలతుత్తము, కావిరాయి, లొద్దుగచెక్క, పుత్రజీవివిత్తులు, శుద్ధిచేశినమణిశిల, తుంగముస్తలు, తెల్లగంటెనవిత్తులు, కరక్కాయ, చింతగింజలు, శుద్ధిచేసిన సౌవీరాంజనము వీనిని సమభాగములుగ ఖల్వమునందునిచి, వేపాకురసముతో తామ్రపాత్రయందునిచి, రాగిగిన్నెతోమర్దించి, కణికెలుజేసి, తేనెతోచాదికన్నులకువైచిన అర్మము, కంటిపువ్వులు ఇవి నివర్తించును.

### నేత్రాంజనరసక్రియ

తుత్థం మాక్షికసింధూత్థసితా శంఖోమనశ్శిలా. 208
గైరికోదధిఫేనే చ మరిచం చేతి చూర్ణయేత్,
సంయోజ్య మధునా కుర్యాదంజనార్థం రసక్రియామ్. 209
వర్త్మరోగార్మతిమిరకాచశుక్రహరీం పరామ్,

తా. మైలతుత్థము, స్వర్ణమాక్షికము, సైంధవలవణము, ఖండశర్కర, శంఖము, మణిశిల, కావిరాయి, సముద్రఫేనము, మిరియాలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి, తేనెలోకలిపి కన్నులకంజనంబిడిన వర్త్మరోగము, అర్మము, తిమిరము, కాచబిందువు, కంటిపూలు ఇవి నివర్తించును.

### తిమిరాదులకు రోపణరసక్రియ

గుడూచీస్వరసః కర్షః క్షౌద్రం స్యాన్మాషకోన్మితమ్. 210
సైంధవం క్షౌద్రతుల్యం స్యాత్సర్వమేకత్ర మర్దయేత్,
అంజయేన్నయనం తేన పిల్లార్మతిమిరాజయేత్. 211
కాచం కండూం లింగనాశం శుక్లకృష్ణగతాన్గదాన్,

తా. కర్షప్రమాణము తిప్పతీగెరసమునందు మాషప్రమాణము తేనె, మాషప్రమాణము సైంధవలవణమువైచి చక్కగమర్దించి నేత్రములకంజనముచేసిన పిల్లము, అర్మము, తిమిరము, కాచబిందువు, దురద, లింగనాశనము, తెల్లగుడ్డు నల్లగుడ్డు వీనియందు జనించెడి సమస్తరోగములు నివర్తించును.

### నేత్రస్రావములకు రోపణీరసక్రియ

బబ్బూలదళనిఃక్వాథో లేహీభూతస్తదంజనాత్. 212
నేత్రస్రావం జయత్యేషా మధుయుక్తారసక్రియా,

తా. నల్లతుమ్మఆకుచు చక్కగ కషాయముకాచి లేహమువలె చిక్కనైన తరువాత అందు కొంచెము తేనెచేర్చి మర్దించి కన్నుల కంజనంబిడిన నిస్సంశయముగ నేత్రస్రావము మానును.

### కొలుకులలోజనించెడిరోగములకు రోపణీరసక్రియ

రసాంజనం సర్జరసో జాతీపుష్పం మనశ్శిలా. 213
సముద్రఫేనో లవణం గైరికం మరిచాని చ,
ఏతత్సమాంశం మధునాపిష్ట్వా ప్రక్లిన్నవర్త్మని. 214
అంజనం క్లేదకండూఘ్నం పక్ష్మణాం చ ప్రరోహణమ్,

తా. రసాంజనము, సర్జరసము, జాజిపువ్వులు, మణిశిల, సముద్రఫేనము, సైంధవలవణము, కావిరాయి, మిరియాలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెలోకలిపి నేత్రముల కంజనంబిడిన కంటిరెప్పలయందలి రోగములు (ఉత్క్లిష్ట వర్త్మరోగము) కంటిసీరు దురద ఇవి హరించుటయేగాక కంటిరెప్పలయందలి రాలి పోయిన వెంట్రుకలు సహా మరల జనించును.

నేత్రరోగమునకుపట్టు

శిగ్రుపల్లవరసస్సమాక్షికో హన్తి సర్వనయనామయాం స్తథా. 215
గైరికాంజనపచంపచాభయా సైంధవైర్జయతిలేపనం బహిః,

తా. మునగాకురసమును తేనెతోచేర్చి కన్నులకువైచిన సమస్తమైన నేత్ర రోగములు నివర్తించును, కావిరాళ్లు, మానిపసపు, నూరతు కరక్కాయలు, సైంధవ లవణము ఇవి మంచినీళ్ళతోచాది కంటిచుట్టూ పట్టువైచిన నేత్రరోగములు నివ ర్తించును,

నేత్రాభిష్యందమునకుపట్టు

శిలాధాత్ర్యభయాదార్వీగైరికైస్సైంధవాన్వితైః. 216
జలపిష్టైర్బహిర్లేపాత్సర్వాభిష్యందనాశనమ్.

తా. మణిశిల, కరక్కాయ, మానిపసపు, కావిరాయి, సైంధవలవణము వీనిని సమముగ నీళ్లతోనూరి కన్నులకుపట్టువైచిన సర్వాభిష్యందములు నివర్తించును.

సర్వనేత్రరోగములకులేపనము

యష్టీగైరికసింధూత్థదార్వీతార్క్ష్యైస్సమాంశకైః. 217
జలపిష్టైర్బహిర్లేపస్సర్వనేత్రామయాపహః,

తా. అతిమధురము, కావిరాయి, సైంధవలవణము, మానిపసపు, రసాంజ నము వీనిని సమభాగములుగ ఉదకముతోనూరి కన్నులచుట్టూ లేపనముజేసిన అభి ష్యందాదిరోగములన్నియు నివర్తించును.

రసాంజనేన వా లేపః పథ్యావిశ్వాదళైరపి. 218
కుమారికాగ్నిపత్రైర్వా దాడిమీపల్లవైరపి,
వచాహరిద్రావిశ్వైర్వా తథా నాగరగైరికైః. 219

తా. రసాంజనమునుగాని, కరక్కాయ, శొంఠి, లవంగపత్రి వీనినిగాని కలు బంద, చిత్రమూలపుఆకులువీనినిగాని, దాడిమచిగుళ్ళనుగాని, వస, పసపు,శొంఠి వీనిని

గాని, శొంఠి, కావిరాయి వీనినిగాని ఉదకములో నూరి కన్నులచుట్టూ లేపనము జేసిన నేత్రరోగములన్నియు నివర్తించును.

దగ్ధ్వాగ్నౌ సైంధవం లోధ్రం మధూచ్ఛిష్టయుతే, ఘృతే,
పిష్టమంజనలేపాభ్యాం సద్యో నేత్రరుజాపహమ్. 220

తా. సైంధవలవణము, లొద్దుగచెక్క వీనినిమాడ్చి అందు మైనమును, నేతిని వైచి మర్దించి కన్నులచుట్టూపట్టు వైచినను లేక అంజనంబిడినను నేత్రరోగము తత్క్షణమే నివర్తించును.

లోహస్య పాత్రే సంఘృష్టో రసో నింబుఫలోద్భవః.
కించిద్ఘనో బహిర్లేపాన్నేత్రబాధాం వ్యపోహతి. 221

తా. ఇనుపపాత్రలో నిమ్మపండ్లరసమును వైచి కొంచెము గట్టిపడువరకు ఇనుముతో మర్దించి కన్నులచుట్టూపట్టు వైచిన నేత్రరోగములన్నియు నివర్తించును.

అర్మరోగమునకు లేపము

సంచూర్ణ్య మరిచం కేశరాజస్వరసమర్దితమ్,
లేపనాదర్మణాం నాశం కరోత్యేష ప్రయోగరాట్. 222

తా. మిరియాలను గుంటగలగరరసముతో నూరి కన్నులచుట్టూపట్టు వైచిన అర్మరోగము మొదలగు నేత్రరోగములు నివర్తించును.

నేత్రరోగములకు పథ్యములు

శాలితందులగోధూమముద్గాస్సైంధవగోఘృతే,
గోపయశ్చ సితా క్షౌద్రం పథ్యం నేత్రగదే స్మృతమ్. 223

తా. వరిబియ్యము, గోధుమలు, పెసలు, సైంధవలవణము, ఆవునెయ్యి, ఆవుపాలు, పంచదార, తేనె ఇవి నేత్రరోగములయందు పథ్యములు.

నేత్రరోగములయందపథ్యములు

సర్వశాకమచక్షుష్యం చక్షుష్యం శాకపంచకమ్,
జీవంతీ వాస్తుమత్స్యాక్షీ మేఘనాదః పునర్నవా. 224
అచక్షుష్యం భవేచ్ఛాకమచక్షుష్యం సురా దధి,
తథా వై హింగులవణం పిణ్యాకం పిష్టమాషకమ్. 225
స్నానంవ్యాయామపానీయాతాంబూలం క్రోధఆతపః,
తేజోనిరీక్షణం జ్వాలామక్షిరోగీ వివర్జయేత్. 226

తా. మనుబాలు, చక్రవర్తికూర, పొన్నగంటికూర, చిత్రికూర, గలిజేరు ఇవి తప్ప తక్కినఆకుకూరలు, కల్లు, పెరుగు, ఇంగువ, ఉప్పు, తెలికపిండి, మినపపిండి వంటకములు, స్నానము, సంచారము, ఉదకపానము, తాంబూలము, కోపము, ఎండ, తేజస్సునుచూచుట, అగ్నిజ్వాల వీనిని నేత్రరోగముగలవారు విడువవలయును.

---

# శుద్ధిప్రకరణమ్.

## సప్తలోహశుద్ధి

స్వర్ణం తారం తామ్రమారం౦నాగవంగౌ చ తీక్ష్ణకమ్,
ధాతవస్సప్త విజ్ఞేయాస్తతస్తాంచ్ఛోధయేద్బుధః. 1
స్వర్ణతారారతామ్రాణాం పత్రాణ్యగ్నౌ ప్రతాపయేత్,
నిషించేత్తుప్రతప్తాని తైలే తక్రే చ కాంజికే. 2
గోమూత్రే చ కులుత్థానాం కషాయే చ త్రిధా త్రిధా,
ఏవం స్వర్ణాదిలోహానాం విశుద్ధిస్సంప్రజాయతే. 3
నాగవంగౌ ప్రతప్తౌ చ గలితౌ తౌ నిషేచయేత్,
త్రిధా త్రిధా విశుద్ధిస్స్యాద్రవిదుగ్ధేపిచ త్రిధా. 4

తా. బంగారు, వెండి, తామ్రము, పిత్తళి, సీసము, తగరము, ఉక్కు ఇవి సప్తధాతువులు. బంగారు, వెండి, పిత్తళి, తామ్రము వీనిని రేకులగావించి అగ్ని యందుకాచి, నూనె, మజ్జిగ, కాంజికను, గోమూత్రము, ఉలవలకషాయము వీనిలో మూడుమూడుమార్లు చల్లార్చవలయును. ఇటులచల్లార్చిన బంగారు మొద లగుధాతువులు శుద్ధంబులగును. మరియు సీసము, తగరము వీనిని నూనె మొదలగువా నిలో మూడుమూడుమార్లుకాచిపోసి, పిదప జిల్లేడుపాలలో మూడుమూడుమార్లు కాచిపోసిన నవి శుద్ధియగును.

## సువర్ణశుద్ధి

వల్మీకమృత్తికాధూమం గైరికం చేష్టకాపటు,
ఇత్యేతా మృత్తికాః పంచజంబీరై రారనాళకైః. 5
పిష్ట్వా కంటకవేధ్యాని స్వర్ణపత్రాణి లేపయేత్,
పుటేత్పృథక్చ సప్తాహం నిర్వాతే త్రింశదుత్పలైః. 6
అధికైర్వాధికే హేమ్ని యావద్వర్ణోవివర్ధతే,

ఇత్యేవంపుటనైర్యుక్త్వా సమ్యక్శుధ్యతి కాంచనమ్. 7

తా. పుట్టమన్ను, కరుధూపము, కావిరాయి, ఇటికరాయి, ఉప్పు వీనిని నిమ్మపండ్లరసము, కాంజికము వినిచేమర్దించి, మిగుల సన్నముగనుండు బంగారు రేకు లకు లేపనముచేసి, ౩౦ పిడకలతో గాలిలేనిచోటపుటము వేయవలయును. ఇటుల ౩ పుటంబులిడిన బంగారము శుద్ధియగును. బంగార మెక్కువైనపిడక లెక్కువచేయ వలెను. బంగారము మంచి వర్ణమును పొందుటయే శుద్ధియని తెలియవలెను.

హేమపంచమృదాశుద్ధం సూక్ష్మపత్రాణి కారయేత్,
శోధయేత్కాంజికేనైవ పశ్చాద్వా నింబుకద్రవైః. 8
తక్రేణ శోధయేద్వారాణ్దుగ్ధే పంచ పునఃపునః,
శోధితంతుద్రవైస్సర్వైః క్షాలయేదుదకైః పృథక్. 9

తా. పంచమృత్తులలో శుద్ధినందిన అపరంజిని రేకులనుగావించి, ఆరేకులను కాంజికము, నిమ్మపండ్లరసము, మజ్జిగ, పాలు వీనితో ప్రత్యేకము అయిదేసిమార్లు కడుగవలయును. మరియు నీ రసములయందు కడిగిన పిదప ప్రత్యేకము ఉదకముతో కడిగిన సువర్ణము శుద్ధియగును.

## సువర్ణభస్మము

కాంచనారరసైర్ఘృష్ట్వా సమాసూతకగంధకౌ,
కజ్జల్యా హేమపత్రాణి లేపయేత్సమమాత్రయా. 10
కాంచనారత్వచః కల్కైర్మూషాయుగ్మం ప్రకల్పయేత్,
ధృత్వా తత్సంపుటే గోళం మృణ్మూషాసంపుటే చ తత్. 11
నిధాయ సంధిరోధం చ కృత్వా సంశోష్య గోమయైః,
వహ్నిం ఖరతరం కుర్యాదేవం దద్యాత్పుటత్రయమ్. 12
నిరుద్ధం జాయతే భస్మ సర్వకార్యేషు యోజయేత్,
కాంచనారప్రకారేణ లాంగలీ హన్తి కాంచనమ్. 13
జ్వాలాముఖీ తథా హన్యాత్తథా హన్తి మనశ్శిలా,

తా. పాదరసము, గంధకము వీనిని సమములుగగ్రహించి, దేవకాంచనపు పట్టరసముతోనూరి, కజ్జలిజేసి, కజ్జలికిసమభాగము స్వర్ణరేకులంబుచ్చుకొని వానికి కజ్జలిని లేపనముజేసి, పిదప నాపట్టనునూరి, దానితో రెండుమూసలనొనర్చి, అమూస యందు బంగారు రేకులనిడి, రెండవమూసనుమూసి, చీలజేసి, దానిని మట్టిమూకుళ్ళ యందునిచి, చీలమన్నుయిచ్చి బాగుగనీడనుయెండించి, అడవిపిడకలతో గజపుటం బోసంగవలయును. ఇటులనే మూడుపుటంబులువైచిన స్వర్ణముభస్మంబగును. ఈ

భస్మమును సర్వకార్యములయం దుపయోగించదగును. మరియు నిటుల చన్నచర్లగడ్డ, జ్వాలాముఖి, మనశిల వీనిచే సహితము స్వర్ణము భస్మంబగును.

పారావతమలైర్లింపేదథవా కుక్కుటోద్భవైః. 14
హేమపత్రాణి తేషాం చ ప్రదద్యాదధరోత్తరమ్,
గంధచూర్ణం సమం దత్వా శరావయుగసంపుటే. 15
ప్రదద్యాత్కుక్కుటపుటం పంచభిర్గోమయోత్పలైః,
ఏవం నవపుటం దద్యాద్దశమంచమహాపుటమ్. 16
త్రింశద్వనోత్పలైర్దేయం జాయతే హేమభస్మకమ్,

తా. బంగారును రేకులు జేసి, పావురపిట్ట లేక కోడి వీనిమలముచే, ఆరేకులకు లేపనము జేసి, యా రేకులకుసమభాగము గంధకచూర్ణమును మట్టిమూకుడుయందునిచి, ఆచూర్ణమధ్యమున బంగారురేకులనునిచి కప్పి, మూకుడుమూసి, చీలజేసి రొండించి, ఐదుయేరుపిడకలచే పుటంబివ్వవలయును. ఈ తెరంగున తొమ్మిదిపుటంబులిడి పిదప 30 పిడకలతో పదియవది మహాపుటంబువైచిన స్వర్ణము బాగుగ భస్మమగును.

సువర్ణభక్షణగుణము

క్షయమేహార్శసాం పాండుకామలావ్రణపిత్తినామ్. 17
పథ్యయోగేన దాతవ్యమౌషధైఃసహ రోగిణామ్,
తథా తేన ప్రకారేణ సర్వరోగాన్వ్యపోహతి. 18

తా. క్షయ, మేహము, మూలవ్యాధి, పాండు, కామిల, వ్రణము, ఉష్ణము వీనికితగు పథ్యముతో నౌషధములలోగలిపి యివ్వవలయును. మరియు నీవిధముగా నిచ్చిన సకలరోగములును తొలంగును.

సువర్ణభస్మగుణము

మృతంహాటకందివ్యకాన్తింతనోతిక్షతంశ్వాసకాసం క్షయం పిత్తవాతౌ,
ప్రమేహాగ్రహణ్యాతిసారాంశ్చ కుష్ఠం జ్వరం హన్తివైషండకేదర్పదంచ.

తా. సువర్ణభస్మము దివ్యమగుదేహకాంతినిగలుగజేయుటయేగాక, గాయము, శ్వాస, దగ్గు, క్షయ, పిత్తము, వాయువు, ప్రమేహము, గ్రహణి, అతిసారము, కుష్ఠము, జ్వరము, నపుంసకత్వము వీనిని నశింప జేయును.

స్వర్ణభక్షణమందుపథ్యములు

దుగ్ధం వై శర్కరోపేతం స్నిగ్ధమన్నం చ పేశలమ్,
వలీపలితనాశాయ స్వర్ణపథ్యాని దాపయేత్. 20

తా. స్వర్ణభక్షణజేయువాడు చక్కెరచేర్చి పాలు, మృదువు, స్నిగ్ధముగ నుండుఅన్నము వీనిని పథ్యములుగ భుజించిన వలీపలితములు నశించును.

అపథ్యములు

కకారసహితం చాన్నం వ్యంజనం తు కపూర్వకమ్,
కకారపూర్వమాంసాని స్వర్ణభుగ్దూరత స్త్యజేత్. 21

తా. కకారాదిగనుండుఅన్నము, కూరలు, మాంసము మొదలగు వానిని స్వర్ణభక్షణజేయువాడు విడువవలయును. *

సువర్ణభస్మ అనుపానములు

మత్స్యపిత్తస్య యోగేన స్వర్ణం తత్కాలదాహజిత్,
భృంగయోగాచ్చ తద్వృష్యం దుగ్ధయోగాద్బలప్రదమ్. 22
పునర్నవాయుతం నేత్ర్యం ఘృతయోగా ద్రసాయనమ్,
స్మృత్యాదికృద్వచాయోగాత్కాంతికృత్కుంకుమేన చ. 23
రాజయక్ష్మం చ పయసా నిర్విషా చ విషం హరేత్,
శుంఠీలవంగమరిచైస్త్రిదోషోన్మాద తాపకమ్. 24

సువర్ణభస్మ అనుపానములు

తా. ఈసువర్ణభస్మమును చేపపిత్తముతో చేర్చి పుచ్చుకొనిన తత్కాలము నందే దాహము, పాలతో పుచ్చుకొనిన క్షయ, నిర్విషముతో సేవించిన విషము, శొంఠి, లవంగములు, మిరియాలు వీనితో పుచ్చుకొనిన త్రిదోషోన్మాదతాపము వీనిని నశింపజేయుటయేగాక గుంటగలగరాకురసముతో వృష్యము, పాలతో బలము, తెల్లగలిజేరువేరురసముతో నేత్రహితము, నేతితో రసాయనము, వసతో స్మృత్యాదులు, కుంకుమపువ్వుతో కాంతి వీనిని గలుగజేయును.

మధ్వామలకచూర్ణం తు సువర్ణం చేతి తత్త్రియమ్,
ప్రాశ్యారిష్టగృహీతోపి ముచ్యతే ప్రాణసంకటాత్. 25
మేధాకామస్తు వచయా శ్రీకామః పద్మకేసరైః,
శంఖపుష్ప్యావయోర్థీ చ విదార్యా చ ప్రజార్థకః. 26

తా. స్వర్ణభస్మము, (౨ గుంజములయెత్తు) ఉశిరికెవొలుపు చూర్ణము, తేనె, వీనిని కలిపి పుచ్చుకొనిన అరిష్టములచే గ్రస్తుడైనను ప్రాణసంకటమువలన ముక్త

* కోద్రవ, కలమ మొదలగువానియన్నములు, కొరవెల్ల,కూష్మాండ,కాకమాచ్యాదిశాకములు, కూర్మ, కేకిప్రభృతిమాంసములనని తాత్పర్యము. ఇదియు పలక్షణము. అపథ్యాన్నశాకమాంసముల విడువవలెనని భావము.

వగును. మరియు నీభస్మమును మేథాకాముడు వసతో పుచ్చుకొనవలయును. శరీర కాంతిగోరెడువాడు తామరకేసరములతోడను పుచ్చుకొనవలయును.

—అశుద్ధసువర్ణదోషము—

బలం చ వీర్యం హరతే నరాణాం రోగవ్రజాన్పోషయతీహ కాయే,
అసౌఖ్యమేవంచ సదైవ హేమాऽపక్వం సదోషం మరణం కరోతి.

తా. అశుద్ధమై దోషసహితమగుస్వర్ణము, బలము, పరాక్రమము వీనినిహరించి శరీరమునందు రోగసమూహము వృద్ధిజేయుటయేగాక అసౌఖ్యము, మృత్యువు ననిని సహా గలుగజేయును.

—రౌప్యోత్పత్తి—

త్రిపురస్య వధార్థాయ నిర్నిమేషైర్విలోచనైః,
నిరీక్షయామాస శివః క్రోధేన పరిపూరితః. 28
తతస్తు కాంస్యమభవత్తస్యైకస్మాద్విలోచనాత్,
అపరస్మాద్వీరభద్రో గణో వహ్నిరివ జ్వలన్. 29
తృతీయాదశ్రుణాం బిందుర్లోచనాదపతద్భువి,
తస్మాద్రజతముత్పన్నం నానాభూమిషు సంస్థితమ్. 30
కృత్రిమం చాపి భవతి వంగాదేస్సూతయోగతః,

తా. పూర్వంబీశ్వరుడు త్రిపురపదార్థము మిక్కుటమగు క్రోధముచే పరిపూర్ణుడై మూడునేత్రములచే జెప్పవాల్పకజూడ అందొకనేత్రమువలన కంచు, మరియొక నేత్రమువలన వీరభద్రుడు, అగ్నివలె ప్రజ్వలించుచున్న ప్రమథగణమును జనించెను. మూడవనేత్రమువలన అశ్రుబిందువు భూమిపయింబడి అందువలన నానాదేశ ప్రసిద్ధంబగు రజతముత్పన్నంబయ్యెను మరియు వంగము మొదలగువానికి రసయోగమువలన జనించినది కృత్రిమరజతంబని యెరుంగవలయును.

రౌప్యం త్రిధా స్యాత్సహజం కృత్రిమం ఖనిసంభవమ్. 31
కైలాసాదుత్థితం యత్తు సహజం రజతం హి తత్,
రామస్య పాదుకాధస్తాన్నిక్షిప్తం కృత్రిమం చ తత్. 32
హిమాచలాదిభూమౌ తు జాయతే ఖనిజం తు తత్,

తా. రజతము సహజమనియు, కృత్రిమమనియు, ఖనిజమనియు మూడువిధములుగనుండును అందు కైలాసమునవలన బుట్టినది సహజమనియు, *శ్రీరామసంబంధమగు పాదుకలయొక్క అధఃప్రదేశమునంగుంచబడినది కృత్రిమమనియు, హిమాచలము మొదలగుభూములయందు బుట్టినది ఖనిజమనియును తెలియవలయును.

---

* ఈవిషయమున నైతిహ్యమేమయినసుండునని తోచెడిని.

త్రివిధం పరికీర్తితంచ రూప్యం సహజం వంగసువేధజంఖనీజమ్. 33
అవలోక్యరసార్ణవాదికాంస్తాన్ సకలైర్వైద్యవరైర్విశారదైశ్చ,

తా. మూడువిధములుగ జెప్పబడిన రౌప్యమునందు సహజమనియు, వంగ వేధజమనియు, ఖనిజమనియును వైద్యశాస్త్రవేత్తలు రసార్ణవము మొదలగు గ్రంథములంజూచి నిర్ణయించిరి.

రౌప్యగ్రహణవిధి

ఉభే వంగజాద్యేనవాగ్రాహ్యారూప్యే
యతో నైవ సౌలభ్యమేవం మృదుత్వమ్. 34
అతో గ్రాహ్యమేకం ఖనీజం చ రౌప్యం
యతశ్శ్వేతవర్ణం చ కౌమల్యయుక్తమ్,

తా. రెండువిధములగు వంగజ, వేధజ, రజతములు, సౌలభ్యము, మృదుత్వము వీనిచేహీనములుగాన గ్రహించుటకు అర్హంబులుగావు. ఖనిజమొకటిమాత్రము శ్వేతవర్ణము, మృదుత్వము వీనితోయుక్తంబైయుండుగాన గ్రహించదగును.

రౌప్యనామంబులు

రౌప్యం సౌధం సుతం తారం రజతం రూపరూపకమ్. 35
శుభ్రం రూప్యం వసుశ్రేష్ఠం రుచిరం శ్వేతకం మతమ్,

తా. రౌప్యము, సౌధము, సుతము, తారము, రజతము, రూపము, రూపకము, శుభ్రము, రూప్యము, వసుశ్రేష్ఠము, రుచిరము, శ్వేతకము ఈ పేర్లచే వెండి విలసిల్లు.

రౌప్యశుద్ధి

పత్రీకృతం తు రజతం సంతప్తం జాతవేదసి. 36
నిర్వాపితమగస్త్యస్య రసైర్వారత్రయం శుచి,

తా. వెండిని రేకులనొనర్చి, అగ్నియందుకాచి, వెల్లగిశరమునందు 3 మార్లు చల్లార్చిన శుద్ధియగును.

అథ రౌప్యదళం వంధ్యా కర్కోటీకందజద్రవైః. 37
భావితం సప్తవారం చ శుద్ధిర్భవతి నిశ్చయః,

తా. వెండిరేకులగొలిమిలోకాల్చి, గొడ్డాకాకరగడ్డ రసములో 7 మార్లు చల్లార్చిన శుద్ధియగును.

రూప్యం శుద్ధం సమాదాయ నాగముఖ్యం తు శోధయేత్. 38
శుద్ధే తారే పునఃపశ్చాత్సూక్ష్మపత్రాణి కారయేత్,
ద్రాక్షాలింత్రిణికాద్రావైశ్శోధయేచ్చ పృథక్పృథక్. 39

తా. శుద్ధమగు రజతమునుగ్రహించి, నాగము మొదలగువానిని లేకుండు నటుల శోధించి, శుద్ధంబగు రజతమును సూక్ష్మమైన రేకులనొనర్చి, చింత, ద్రాక్ష వీని రసములచే వెవ్వేరుగ శుద్ధిజేయవలయును.

॥ రౌప్యభస్మము ॥

భాగైకం తాలకం మర్ద్యం యామమమ్లేన కేనచిత్,
తేన భాగత్రయం తారపత్రాణాంపరిలేపయేత్. 40
ధృత్వా మూషాపుటే రుద్ధ్వా పుటే త్రింశద్వనోత్పలైః,
సముద్ధృత్య పునస్తాలం దత్వా రుద్ధ్వా పుటే పచేత్. 41
ఏవం చతుర్దశపుటైస్తారం భస్మ ప్రజాయతే,

తా. తాళకము ౧ భాగము నిమ్మపండ్లరసముచే నొకయామము మర్దించి తాళకమునకు మూడింతలు వెండిరేకులనుగ్రహించి, పైదానిని వానికి లేపనము జేసి, శరావసంపుటమునందునిచి, చీలమన్నుయిచ్చి, ముప్పదియేరుపిడకలచే పుటంబిడి మరల పైజెప్పినరీతిగ ౧౪ పుటంబులిడిన వెండిభస్మంబగును.

మాక్షికేన దరదేన సంయుతం సూక్ష్మరౌప్యదళసంచయం పుటేత్.
ద్విత్రివారమథ భస్మతాం వ్రజేత్పాతకౌఘఇవ శంకరస్మృతేః,

తా. హేమమాక్షికము, ఇంగిలీకము వీనినిచూర్ణించి, మూసయందు కొంత చూర్ణమును వైచి, అందుపై వెండిరేకులనునించి, పిదప పైచూర్ణమును మరలవైచి, మూసడుమూసి, చీలమన్నుయిచ్చి, గజపుటములు ౨ గాని లేక మూడుగాని వైచిన భస్మంబగును.

తారపత్రాణి సూక్ష్మాణి తత్సమౌ రసగంధకౌ. 43
సూతగంధకయోస్తుల్యం తాలం ఖల్వేథ మర్దయేత్,
కల్కం కృత్వా కుమార్యద్భిస్తేన తాని ప్రలేపయేత్. 44
శరావసంపుటే కృత్వా త్రింశద్వన్యోత్పలైః పుటేత్,
ఏవం రజతమాప్నోతి మృతిం వారద్వయేన వై. 45

తా. సూక్ష్మమగు వెండిరేకులనుగ్రహించి, ఆవెండిరేకులకు సమము రస గంధకములను జేర్చి, యీరసగంధకములకు సమము తాళకమునుగ్రహించి, ఖల్వము నందునిచి కలుబందరసముచే కజ్జలిగావించి, పైవెండిరేకులకు లేపనంబొనర్చి, మూసను

ట్టయందునిచి చీలమన్నుయిచ్చి ౩౦ యెరుడుపిడకలచే ౭ పుటంబులిడిన రజతము భస్మంబగును.

## రౌప్యభస్మభక్షణగుణము

తారం రోగసముద్రపారదమహో పిత్తాపహం వాతజిత్,
గుల్మశ్లేష్మవిషార్తిమేహ శమనం క్షుత్కాన్తిసందీపనమ్. 46
శ్వాసప్లీహయకృద్వలీపలితజిత్పాండ్వార్తిశోఫాపహమ్,
కాసక్షైణ్యయుతక్షయప్రశమనం దీర్ఘాయుషంపుష్టిదమ్. 47

తా. రౌప్యభస్మము, పిత్తము, వాతము, గుల్మము, కఫము, విషము, మేహము, శ్వాస, ప్లీహ, యకృత్, వలీపలితములు, పాండు, వాపు, దగ్గు, క్షీణత్వముతో గూడిన క్షయ వీనిని నశింపజేయుటయే గాక, అకలి, కాంతి, అగ్నిదీప్తి, దీర్ఘాయుష్యము, పుష్టి వీనిని గలుగజేయును.

## రౌప్యభస్మానుపానములు

భస్మీభూతం రజతమమలం తత్సమం వ్యోమభానూ
సర్వైస్తుల్యం త్రికటురజఇదంసర్వమాజ్యేన యుక్తమ్,
లీఢం ప్రాతః క్షపయతి నృణాం యక్ష్మపాండూదరార్శ
శ్శ్వాసాన్కాసాంస్తిమిరమపితథాపిత్తరోగాన శేషాః. 48

తా. రజతభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము వీనిని సమములుగజేర్చి, వీనికన్నిటికి సమము త్రికటుక చూర్ణమునుచేర్చి రోగబలానుసారముగ ప్రాతః కాలమునందు నేతితో పుచ్చుకొనిన క్షయ, పాండువు, ఉదరరోగము, అర్శస్సు, శ్వాస, దగ్గు, తిమిరరోగము, పిత్తరోగములు ఇవి నివర్తించును.

సితయా హన్తి దాహాద్యం వాతపిత్తం ఫలత్రికాత్,
త్రిసుగంధ్యా ప్రమేహాదిరజతం హన్త్యసంశయమ్. 49

తా. ఈ రజత భస్మమును చక్కెరతో పుచ్చుకొనిన దాహము మొదలగునవి, త్రిఫలచూర్ణముతో పుచ్చుకొనిన వాతపిత్తములు, త్రిసుగంధములతో పుచ్చుకొనిన ప్రమేహములు నివర్తించును.

## అశుద్ధరౌప్యదోషము

తారం చ దేహస్య కరోతి తాపం విడ్బంధనం యచ్ఛతి శుక్రనాశమ్,
అపాటవం వీర్యబలేనిహన్తి మేహాన్ గదాన్ పోషయతీహ దుష్టమ్.

తా. అశుద్ధరజితభస్మసేవనవలన శరీరతాపము, మలబంధము, శుక్లనాశము,

అశక్తత, శరీరమునందు మేహవృద్ధి వీనిని గలుగజేయుటయేగాక వీర్యము, బలము వీనిని నశింపజేయును.

### తామ్రోత్పత్తి

రవేర్యత్కాంతిదం తేజః పతితం ధరణీతలే,
తస్మాత్తామ్రం సముత్పన్నమేవమాహుః పురావిదః. 51
తామ్రం తు ద్వివిధం ప్రోక్తం నేపాలం మ్లేచ్ఛనామకమ్,
అతిస్వచ్ఛం మృదుక్లిష్టం కఠినం క్రమశస్స్మృతమ్. 52

తా. మిగుల కాంతికరమగు సూర్యతేజస్సు భూమిపయింబడుటవలన, తామ్రముత్పన్నమైనదని పెద్దలు వచించెదరు. అది నేపాళమనియును, మ్లేచ్ఛమనియును ద్వివిధంబులుగనుండును. అందు నేపాళమనునది మిక్కిలి స్వచ్ఛముగను, మృదువుగను నుండును. మ్లేచ్ఛమనునది మకిలగను, కఠినముగనునుండును.

### తామ్రపరీక్ష

మ్లేచ్ఛం చ నేపాలమథో వదన్తి శుల్బం రసజ్ఞాః ద్వివిధం రసేషు,
యత్తాడనాచ్ఛ్యామతమాచకాన్తి స్తత్తామ్రకంమ్లేచ్ఛకమేవ హేయమ్.
యత్తాడనాద్రక్తతమా చ కాంతి ర్నేపాలకం గ్రాహ్యమథో వదంతి,

తా. రసజ్ఞులగు వైద్యులు తామ్రమును నేపాలమనియు, మ్లేచ్ఛమనియు ద్వివిధములుగ వచించెదరు. అందు నేది బాగుగకడిగిన నల్లనికాంతిగలదిగ నుండునో అది మ్లేచ్ఛముగాన గ్రహించంజనదు. మిగుల నెఱ్ఱగనుండునది నేపాళముగాన గ్రహించదగును.

### తామ్రదోషము

అతఃపరం తామ్రసమాశ్రితాంశ్చ దోషాంశ్చ వక్ష్యే బహుధావిలోక్య.
వాన్తిర్భ్రాన్తిస్సంక్లమస్తాపశూలే కండుత్వం వై రేచితా వీర్యహన్త్రీ,
అష్టౌదోషాః కీర్తితాస్తామ్రమధ్యే తేషాం సమ్యక్ శోధనం కీర్తయిష్యే.

తా. తామ్రమునందుండు దోషముల బాగుగ పరీక్షించి వచించెదను. అవి యెన్మిదియనిన వాంతి, భ్రాంతి, గ్లాని, దాహము, శూల, దురద, రేచకము, వీర్యనాశకత్వము, వీనినన్నిటికిని శోధనమునుం జెప్పెదను.

### తామ్రశుద్ధి

నేపాలం తామ్రమాదాయ కారయేత్పత్రరూపకమ్,
శోధయేదమ్లవర్గేణ ప్రయత్నేన భిషగ్వరః. 56

తా. తామ్రమును సన్నని రేకులనొనర్చి, అమ్లవర్గములతో మిగుల ప్రయత్నముచే శోధనము జేయవలయును.

తక్రం తైలం ధేనుమూత్రం చ వాన్తిం
భ్రాన్తిం హన్యాత్కాంజికం కౌలథాంభః,
వజ్రీదుగ్ధం ధేనుదుగ్ధం క్లమంచ
తాపంహన్యాత్తింత్రిణీనింబుతోయమ్.
శూలం హన్యాత్కన్యకాశిగ్రితోయం
హన్యాద్దుగ్ధం గోఘృతం కండుతాం చ,
రేచం హన్యాత్సూరణం మస్తుతోయం
క్షౌద్రం ద్రాక్షా వీర్యహన్తృత్వమాశు. 58
తప్తాని తప్తాని చ పత్రకాణి తామ్రస్య సూక్ష్మాణి విశోధయేద్వా,
సప్తైవ వారాంశ్చ పృథక్పృథగ్వై తతః పరం శుద్ధతరాణి నూనమ్.

తా. మజ్జిగ, నూనె, గోమూత్రము వీనిలో శుద్ధిచేసిన వాంతి, కాంజికము, వులవకట్టు వీనిలో శుద్ధిజేసిన భ్రాంతి, జెముడుపాలు, ఆవుపాలు వీనితో శుద్ధిజేసిన గ్లాని, చింతాకురసము, నిమ్మపండ్లరసము వీనితో శుద్ధిజేసినసంతాపము, కలబందరసము, ఆవుపాలు, నెయ్యి వీనితో శుద్ధిజేసిన దురద, కందగడ్డరసము, పెరుగుమీదితేట వీనితో శుద్ధిజేసినరేచనము వీనిని నశింపజేయును. తేనె, ద్రాక్ష వీనితో శుద్ధిజేసిన వీర్యహాంతృత్వదోషము నివర్తించును. గాన నీతామ్రపురేకులను కాచికాచి పైజెప్పినవానియందు ప్రత్యేకము నేడేసిమార్లు చల్లార్చిన తామ్రము శుద్ధియగును.

తైలతక్రాదిశుద్ధస్య తద్దోషవినివృత్తయే,
శుల్బస్య శోధనం ప్రాజ్ఞైర్విశేషాత్సముదాహృతమ్. 60
స్నుహ్యర్కక్షీరలవణైస్తామ్రపత్రాణి లేపయేత్,
అగ్నౌ ప్రతాప్య నిర్గుండీరసే సంసేచయేత్త్రిశః. 61
స్నుహ్యర్కక్షీరసేకైర్వా శుల్బశుద్ధిః ప్రజాయతే,

తా. రాగిదుడ్లను రేకులనొనర్చి, కొలిమియందుబాగుగ కాచికాచి నూనె, మజ్జిగ మొదలగువానిచే తామ్రదోషముపోవువరకు చల్లార్చుచు శుద్ధిజేయవలయును. పిదప జెముడుపాలు, జిల్లేడుపాలు, పంచలవణములు వీనినినూరి, యారేకులకు బూసి అగ్నియందుకాచి, వావిలాకురసములో 3 మార్లు చల్లార్చవలయును. లేక జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు వీనిలోనైన చల్లార్చిన తామ్రము శుద్ధియగును.

### తామ్రభస్మము

సూక్ష్మాణి తామ్రపత్రాణి కృత్వా సంస్వేదయేద్బుధః. 62

వాసరత్రయమమ్లేన తతః ఖల్వే వినిక్షిపేత్,
పాదాంశం సూతకం దత్వా యామమమ్లేన మర్దయేత్. 63
తతఉద్ధృత్య పత్రాణి లేపయేద్ద్విగుణేనచ,
గంధకేనామ్లపిష్టేన తస్యకుర్యాచ్ఛగోళకమ్. 64
తతః పిష్ట్వా చ మీనాక్షీం చాంగేరీం వా పునర్నవామ్,
తత్కల్కేన బహిర్గోళం లేపయేద్వ్యంగుళోన్మితమ్. 65
ధృత్వా తద్గోళకం భాండే శరావేణ చ రోధయేత్,
వాలుకాభిః ప్రపూర్యాథ విభూతిలవణాంబుభిః. 66
దత్వా భాండముఖే ముద్రాం తతశ్చుల్ల్యాం విపాచయేత్,
క్రమవృద్ధ్యాగ్నినా సమ్యక్ యావద్యామచతుష్టయమ్. 67
స్వాంగశీతలముద్ధృత్య మర్దయేత్సూరణద్రవైః,
దినైకం గోళకం కుర్యాదర్ధగంధేన లేపయేత్. 68
సఘృతేన తతో మూషాం పుటే గజపుటే పచేత్,
స్వాంగశీతం సముద్ధృత్య మృతం తామ్రం శుభం భవేత్. 69
వాన్తిం భ్రాన్తిం క్లమం మూర్ఛాం న కరోతి కదాచన,

తా. తామ్రపురేకులను సన్నగనొనర్చి, 3 దినములు నిమ్మపండ్లరసముతో నుడికించి దీసి, ఖల్వములోనునిచి యారేకులకు నాలవపాలు రసమునుగలిపి నిమ్మపండ్ల రసముతో ౧ యామముమర్దించి, యారేకులనుదీసి, వానికి రెండింతలు గంధకమును నిమ్మపండ్లరసముతోనూరి, యారేకులకు లేపనముజేసి యెండించి, యారేకులను మడిచి ముద్దజేసి, పిదప దానిపై పొన్నగంటి, పులిచింత, తెల్లగలిజేరు వీనికల్కమును రెండంగుళములదళముగ లేపనముజేసి యెండించి, మూకుళ్లయందునిచి, చీలమన్ను ఇచ్చి వాలుకాయంత్రమునందునిచి, దానిముఖమును బంధించి, ఉప్పు, బూడిదె వీనిని నీటితో నూరి ముద్రజేసి పొయిమీద బెట్టి, నాల్గుయామములు క్రమముగ నగ్నిని వృద్ధిజేయుచువండి, స్వాంగశీతలమునదీసి, మరలనారేకులను కందగడ్డరసముతో ఒకదినమునూరి, పిదప నారేకులకు సమము గంధకము నెయ్యితోనొకదినము నూరి లేపనముజేసి, మూసయందునిచి, చీలమన్నుయిచ్చి, గజపుటంబిడిన తామ్రము బాగుగ భస్మంబగును. దీనివలన వాంతి, భ్రాంతి, క్లమ, మూర్ఛ ఇవి జనించకుండును.

కజ్జలీంగంధసూతస్య మర్దయేన్నింబుకద్రవైః. 70
లేపయేత్తాని పత్రాణి క్షిప్త్వావై ఖర్పరే దృఢే,
వస్త్రమృత్తికయా లిప్త్వా జ్వాలయేద్ధాన్తికే పుటే. 71

స్వాంగశీతలముద్ధృత్య సూక్ష్మచూర్ణం తు కారయేత్,
పంచామృతైః పుటం దేయం శరావే నిక్షిపేత్పునః. 72
ఉద్ధృత్య చూర్ణయేత్పశ్చాద్భవ్యే భాండే నిధాపయేత్,
పూజయేద్భిషజాన్ దేవాన్ తథా ఖేచరవిప్రకాన్. 73
గుంజైకం దాపయేత్పశ్చాద్యోగయుక్తేన ధీమతా,

తా. రసము, గంధకము వీనిని ఖల్వమునందునించి, నిమ్మపండ్ల రసముతో నూరి, కజ్జలిజేసి, రాగిరేకులకు లేపనంబొనర్చి, మూకుళ్లయందునించి, సీలజేసి, గజపుటం బిడి, స్వాంగశీతలమునదీసి, చూర్ణించి, మగల పంచామృతాదులతో పుటంబిడి, స్వాంగ శీతలమునదీసి, చూర్ణించి, సంపుటమునందునించి, దేవ, బ్రాహ్మణ, వైద్యులనుబూజించి, పిదప గుంజామాత్రము సేవించవలయును.

## శుద్ధతామ్రభస్మగుణము

కుష్ఠప్లీహాజ్వరకఫమరుచ్ఛ్వాసకాసార్తిశోఫాం
స్తంద్రాశూలోదరకృమివమీపాండుమోహాతిసారాన్. 74
అర్శోగుల్మక్షయగదశిరోవ్యాధిమేహాదిహిక్కా
శ్శుద్ధం శుల్బం హరతి సతతం వహ్నివృద్ధిం కరోతి,

తా. శుద్ధతామ్రభస్మమును సేవించినకుష్ఠము, ప్లీహ, జ్వరము, కఫము, వాతము, శ్వాస, దగ్గు, వాపు, తంద్ర, శూల, ఉదరము, క్రిమి, వాంతి, పాండు, మోహము, అతిసారము, మూలవ్యాధి, గుల్మము, క్షయ రోగము, శిరోవ్యాధి, మేహము, ఎక్కిళ్లు వీనిని నివర్తింపజేయుటయేగాక అగ్నివృద్ధినిజేయును.

## అశుద్ధతామ్రభస్మదోషము

న విషం విషమిత్యాహుస్తామ్రం తు విషముచ్యతే. 75
ఏకో దోషో విషే తామ్రే త్వష్టౌ దోషాః ప్రకీర్తితాః,
భ్రమో మూర్ఛా విదాహశ్చ స్వేదః క్లేదనవాంతయః. 76
అరుచిశ్చిరసంతాప ఏతే దోషా విషోపమాః,

తా. విషము, అశుద్ధతామ్రము యీరెంటిలో విషమునందేకదోషము, అశుద్ధ తామ్రమునందు భ్రమ, మూర్ఛ, విదాహము, స్వేదము, క్లేదనము, వాంతి, అరుచి, సంతాపము, ఇటులయెనిమిది దోషములుండుగాన ప్రసిద్ధవిషముకన్నను అశుద్ధతామ్ర మేవిషమని తెలియవలయును.

శుల్బం తనోనయతిశోషమశేషధాతూన్
రోగాన్కరోతివివిధాంశ్చనిహంతికాంతిమ్. 77

కుష్ఠంజ్వరంచవిషమాన్కురుతేవిశేషా
త్పాకేనహీనమిహవాన్తివిరేచనేచ,
హన్త్యాయురుష్టెచ్ఛికురుతేవితాపం
మూర్ఛాం విధత్తే హరతే చ శుక్రమ్. 78
నానాగదానాంచసహాయకారిహ్యాశుద్ధశుల్బస్యచ జీవహర్త్రా,

తా. అశుద్ధతామ్రభస్మము, సర్వధాతుశోషము, నానావిధరోగములు, కాంతినాశము, కుష్ఠము, విషమజ్వరము, వాంతి, విరేచనము, ఆయుఃక్షయము, సంతాపము, మూర్ఛ, శుక్రనాశనము వీనిని గలుగజేయుటయేగాక అనేక రోగములను సహాయకారియై ప్రాణముల హరించును.

—వంగోత్పత్తి—

వంగం రంగం త్రపుప్రోక్తం తత్ర దోషాస్తథాపిచ. 79
ఖురకం మిశ్రకం చేతి ద్వివిధం వంగముచ్యతే,
ఖురకం శ్రేష్ఠముద్దిష్టం మిశ్రకం త్వవరం స్మృతమ్. 80
ఖురకం చంద్రరూపాభం సురాకారం చ కీర్త్యతే,
యత్త్వల్పగుణభిన్నం తు వంగం మిశ్రకనామకమ్. 81

తా. వంగమును రంగమని, త్రపువనియుచెందురు. అందుండు దోషములవలెనే రీతిగవచించెదరు. మరియును వంగము ఖురకమనియు, మిశ్రకమనియు రెండు విధంబులుగ చెప్పబడును. అందు ఖురకము శ్రేష్ఠమనియు మిశ్రకము నీచమనియు, మరియును ఖురకముచంద్రరూపముగలదనియు, మిగుల కాంతిగలదనియు, నీలగుణములచే భిన్నంబగునది మిశ్రకమనియును వచించెదరు.

—గ్రాహ్యాగ్రాహ్యవంగలక్షణము—

ద్విధాపి వంగః కథితః ఖనిజో మిశ్రస్తథ వైద్యైస్సుచిబుద్ధిమద్భిః,
మిశ్రోపి దోషాబహవోపి సన్తి గ్రాహ్యః ఖనిజో యది శుభ్రకోసౌ.

తా. వంగము, బుద్ధిమంతులగు వైద్యులచే ఖనిజమని, మిశ్రకమని ద్వివిధముగ చెప్పబడును. అందు మిశ్రకమనునది మిగులదోషములుగలది గాన గ్రహించదగదు. ఖనిజమనునది మిగుల తెల్లగనుండు గాన గ్రహించదగును.

—వంగపరీక్ష—

ధవళం మృదులం స్నిగ్ధం ద్రుతద్రావం సగౌరవమ్,
నిఃశబ్దం ఖురవంగం స్యాన్మిశ్రకం శ్యామశుభ్రకమ్. 83

తా. ద్వివిధవంగమునందు తెల్లగను, మృదువుగను, స్నిగ్ధముగను, శీఘ్రముగ

ద్రవించునదిగను, బరువుగను, * నిశ్శబ్దముగనుండునది ఖురకవంగమనియు, నలుపు, తెలుపువర్ణములుగలసినది మిశ్రకమనియును తెలియవలయును.

వంగశుద్ధి

ద్రావయిత్వా నిశాయుక్తే క్షిప్తం నిర్గుండికారసే,
విశుధ్యతి త్రివారేణ ఖురవంగం న సంశయః. 84

తా. వావిలాకురసమునందు పసపుచూర్ణమునుగలిపి అందు ఖురవంగమును కరిగించి మూడు మార్లుబోసిన శుద్ధియగును.

త్రపూమూత్రవర్గేమ్లవర్గే బహూనాం జలే క్షారతోయేచవజ్రార్కవర్గే,
తతఃక్షాళయిత్వా కదంబస్య నీరే శుభే క్షాళయేత్తప్తకం సప్తవారాన్.

తా. వంగమునుకరిగించి † మూత్రవర్గము, ‡ ఆమ్లవర్గము, సర్వక్షారోదకములు, జొంతజెముడుపాలు, కడిమిపట్టరసము వీనిలోప్రత్యేకమేడేసిమార్లు కరిగించి పోసిన శుద్ధియగును.

వంగభస్మము

మృత్పాత్రే ద్రావితే వంగే చించాశ్వత్థత్వచో రజః,
క్షిప్త్వా తేన చతుర్థాంశమయోదర్వ్యా ప్రచాలయేత్. 86
తతో ద్వియామమాత్రేణ వంగభస్మ ప్రజాయతే,
తతో భస్మసమం తాళం క్షిప్త్వామ్లేన ప్రమర్దయేత్. 87
తతో గజపుటే పక్త్వా పునరమ్లేన మర్దయేత్,
తాళేన దశమాంశేన యామమేకం తతః పుటేత్. 88
ఏవం దశపుటైః పక్వో వంగస్తు మ్రియతే ధ్రువమ్,

తా. వంగమును మట్టిపాత్రయందునిచి, పొయిమీద బెట్టి కరిగించి, అందు చింతబెరడు, రావిపట్ట వీనిచూర్ణమును నాలవపాలువైచుచు యినపగరిటతో రెండు యామములు కలియబెట్టిన వంగము భస్మమగును. పిదప నాభస్మమునకు సమము తాళకముజేర్చి, నిమ్మపండ్లరసముచేనూరి, బిళ్ళలుచేసి, యెండించి, శరావసంపుటమునందునిచి, చీలమన్నుయిచ్చి గజపుటంబిడి, సాంగశీతలమునదీసి, మగల వంగభస్మమునకు ౧౦-వపాలు తాళకముచేర్చి, నిమ్మపండ్లరసముతో ౧ యామము మర్దించి, గజపుటంబిడవలయును. ఇటుల ౧౦ పుటంబులువైచిన వంగము శుద్ధభస్మమగును.

---

* వంగపురేకులను వంచుచున్నప్పుడు కరకరమనుశబ్దము కాకూడదని భావము.
† అష్టమూత్రములు. ‡ ఆమ్లపంచకము.

పాలాశద్రవయుక్తేన వంగపత్రాణి లేపయేత్. 89
తాలేన పుటితం పశ్చాత్ మ్రియతే నాత్ర సంశయః,

తా. మోదుగచెక్కరసముతో తాళకమునునూరి తగరపుఱేకులకు లేపనము చేసి గజపుటంబిడిన భస్మమగును.

వంగభస్మగుణము

కాసే శ్వాసే తథా గుల్మే పీనసే చాప్యురఃక్షతే. 90
ప్రమేహేషు విశేషేణ మృతం వంగం ప్రయోజయేత్,

తా. శుద్ధమగువంగభస్మమును, కాస, శ్వాస, గుల్మము, పీనస, ఉరఃక్షతము, ప్రమేహము వీనియందుపయోగించవలెను.

సకలమేహసమీరణనాశనం భ్రమకఫక్షయపాండువినాశనమ్. 91
శ్వసనశూలయకృద్గ్రహణార్శసప్రదరమేవ నిహన్తి సువంగకమ్,

తా. శుద్ధమగు వంగభస్మము, సకలమేహములు, సకలవాతరోగములు, భ్రమ, కఫము, క్షయ, పాండువు, శ్వాస, శూల, యకృత్, గ్రహణి, అర్శసము, ప్రదరము వీనిని నివర్తింపజేయును.

బల్యం దీపనపాచనం రుచికరం ప్రజ్ఞాకరం శీతలమ్. 92
సౌందర్యైకవివర్ధనం పలితజరా నీరోగతాకారకమ్,
ధాతుస్థైర్యకరం క్షయాక్షయకరం సర్వప్రమేహాపహమ్. 93
వంగం భక్షయతో నరస్య నభవేత్స్వప్నేపి శుక్రక్షయః.

తా. శుద్ధమగు వంగభస్మమును సేవించు మనుజునకు, బలము, అగ్నిదీప్తి, పాచనము, రుచి, బుద్ధి, శీతలము, సౌందర్యము, ధాతుస్థైర్యము ఇవి కలుగుటయే గాక, ముసలితనము, ఇతరవ్యాధులు, క్షయ, సర్వమేహములు ఇవినశించి స్వప్నమునందైనను శుక్రక్షయము గానేరదు.

వంగానుపానములు

కర్పూరేణ సమాయుక్తం ముఖదుర్గంధనాశకమ్. 94
జాతీఫలైః పుష్టికరం వంగభస్మ సదా నృణామ్,
తులసీపత్రసంయుక్తం ప్రమేహాం నాశయేద్ధ్రువమ్. 95
ఘృతేన పాండురోగం చ టంకణైర్గుల్మనాశకమ్,
నిశయా రక్తపిత్తఘ్నం మధునా బలవృద్ధికృత్. 96
ఖండేన సహ పిత్తఘ్నం నాగవల్ల్యా చ బంధనమ్,

పిప్పల్యా చాగ్నిమాంద్యఘ్నంవాసయాశ్వాసకాసహృత్. 97
చంపకస్వరసేనైవ దుర్గంధం నాశయేద్ధ్రువమ్,
నింబుకస్వరసేనాఢ్యం దేహే దహనశాంతికృత్. 98
కస్తూరీవంగసంయుక్తాభక్షణాద్వీర్య బంధనీ,
ఖదిరక్వాథయోగేన చర్మదోషమలాంపహామ్. 99
పూగీఫలానుపానేనాఽజీర్ణం నాశయతే క్షణాత్,
నవనీతసమాయుక్తమస్థిజీర్ణం నవం భవేత్. 100
దుగ్ధైస్సార్థం భవేత్తుష్టిర్విజయా స్తంభనీ భవేత్,
లశునై ర్వాతజాం పీడాన్నాశయే న్నాత్ర సంశయః. 101
సముద్రఫలసంయోగాన్నిగ్గుండ్యా సహాభక్షణాత్,
కుష్ఠం నాశయతే క్షిప్రం సింహనాదోమృగానివ. 102
ఆస్ఫోటజటికాయోగాత్ షండత్వం నాశయేద్ధ్రువమ్,
దేవపుష్పస్య సంయోగే సముద్రఫలయోగతః. 103
నాగపత్రరసై ర్లేపాల్లింగవృద్ధిః ప్రజాయతే,
గోరోచనాలవంగాభ్యాం తిలకామోహనీభవేత్. 104
ఏరండజటికాద్రావే ఘర్షయిత్వా చ వంగకమ్,
లేపయేచ్చ లలాటేషు చార్ధశీర్షగదం జయేత్. 105

తా. వంగభస్మమును, పచ్చకర్పూరముతో పుచ్చుకొనిన ముఖదుర్గంధము నశించును. జాజికాయతో పుచ్చుకొనిన పుష్టికలుగును తులసిఆకుతో పుచ్చుకొనిన మేహము నివర్తించును. నెయ్యితో పుచ్చుకొనిన పాండురోగమునశించును. వెలిగారముతో పుచ్చుకొనిన గుల్మము, పసపుతో సేవించిన రక్తపిత్తము ఇవి నివర్తించును. తేనెతో సేవించిన బలముగలుగును. కలకండతో పుచ్చుకొనిన సిత్తమతోలగును, తమలపాకురసముతో సేవించిన శరీరదార్ఢ్యముగలుగును. పిప్పలీచూర్ణముతో పుచ్చుకొనిన అగ్నిమాంద్యము, అడ్డసరముతో పుచ్చుకొనిన శ్వాసకాసలు, సంపంగిస్వరసముతో పుచ్చుకొనిన శరీరదుర్గంధము, నిమ్మపండ్లరసముతో పుచ్చుకొనిన శరీరతాపమును ఇవి నివర్తించును. కస్తూరితో పుచ్చుకొనిన వీర్యస్తంభనముగలుగును. చండ్రకషాయముతో పుచ్చుకొనిన చర్మరోగము, పోకలతో పుచ్చుకొనిన అజీర్ణము ఇవి నివర్తించును. వెన్నతో పుచ్చుకొనిన పుష్టిని గలుగజేయును. పాలతో పుచ్చుకొనిన సంతోషముగలుగును. * విజయారసముతో సేవించిన వీర్యస్తంభనముగలుగును.

* గంజాయికషాయము.

వెల్లుల్లితో పుచ్చుకొనిన వాతపిడ, † సముద్రఫలము, వావిలి వీనిలో పుచ్చుకొనిన స్వప్నములు, అడవిమల్లె పూలరసముతో పుచ్చుకొనిన నపుంసకత్వము పోవును. లవంగములు, సముద్రఫలము వీనిని సమభాగముగ నూరి, వంగభస్మసహితముగ లింగలేపనము చేసిన లింగవృద్ధియగును. గోరోచనము, లవంగములు వీనిని చేర్చి తిలకంబిడిన మోహముజనించును. ఆముదపు చెట్టుపూలయందు వంగభస్మమును చేర్చి శిరస్సునకు లేపనముచేసిన ‡ శిరోరోగము నివృత్తమగును.

అశుద్ధవంగభస్మదోషము

పాకేన హీనః ఖలు వంగకోసౌ కుష్ఠాని గుల్మాంశ్చ మహోత్శ్వరోగాన్,
పాండుప్రమేహాపచివాతరక్తబలాపహారాం కురుతే నరాణామ్. 106

తా. అశుద్ధ వంగభస్మము, కుష్ఠము, గుల్మము మొదలగు మహారోగములు, పాండు, ప్రమేహము, అపచి, వాతరక్తము మొదలగు రోగములను జేసి బలమును హరింపజేయును.

నాగోత్పత్తి

దృష్ట్వా భోగిసుతాం రమ్యాం వాసుకిశ్శుక్రమాముచత్,
వీర్యజాత స్తతో నాగస్సర్వరోగాపహో నృణామ్. 107

తా. పూర్వము వాసుకి సుందరులగు నాగకన్యలజూచి మోహముచే వీర్యమువదలె నందువలన మనుష్యులయొక్క సర్వరోగముల నపహరింపజేయు నాగముత్పన్నంబయ్యెను.

నాగభేదములు

నాగం చ ద్వివిధం ప్రోక్తం కుమారం శమలం తథా,
కుమారం రసమార్గేషు యోజనీయం గుణాధికమ్. 108

తా. సీసము కుమారమని, శమలమని రెండువిధములుగనుండును. అందు కుమారమనునది గుణాధిక్యముగలదగుటచే రసాయనక్రియలయందు చేర్చదగును.

నాగశుద్ధి

నాగో ద్రుతోగ్నిసంయోగాద్ద్రవిదుగ్ధే నిపాతితః,
సచ్ఛిద్రహాండికాయంత్రే త్రివారం శుద్ధిమాప్నుయాత్. 109

తా. సన్నపుముఖములుగల * హాండికాయంత్రములో జిల్లేడుపాలనునించి అందు నాగమును కరిగించిపోయుచుండవలయును. ఇటుల 3 మార్లుచేసిన శుద్ధియగును.

---

† సముద్రపుప్పకాయ. ‡ తలనొప్పి.

* హాండికాయంత్రమనగా నొకకుండను మూతకు మధ్యమైన మూతినుమూసి ఆమూతికి చిన్న రంధ్రముంచినదై యుండును.

### నాగభస్మము

సీసకం చ శిలాయుక్తం క్షేపయేత్ఖర్పరే దృఢే,
సంస్థాప్య చుల్లికాయాన్తుజ్వాలయేత్క్రమశోఽనలమ్. 110
ఆటరూషకకాష్ఠేన ఘర్షయేత్. సీసకం దృఢమ్,
ఖర్పరందహనాకారం జాయతే చ శనైశ్శనైః. 111
తావత్ప్రజ్వాలయేద్వహ్నిం యావన్నాగోమృతిం వ్రజేత్,

తా. ఇనపబాణలియందు నాగము, మణిశిల వీనినివైచి పొయిమీదబెట్టి క్రమముగ అగ్నిని ప్రజ్వలింపజేసి మృతమగుపర్యంతము అడ్డసరపుకట్టెతో కలియద్రిప్పుచుండిన మొదట బాణలినిప్పువలెనగును. నాగము భస్మమగువఱకు నట్లు వండవలెను.

తాంబూలీరససంపిష్ట శిలాలేపాత్పునః పునః. 112
ద్వాత్రింశద్భిః పుటైర్నాగో నిరుద్ధో యాతి భస్మతామ్,

తా. తమలపాకురసముతో మణిశిలనునూరి శుద్ధిచేసిన నాగపురేకులకు లేపనముచేసి శరావ సంపుటమునందునిచి చీలమన్నుయిచ్చి గజపుటంబోసంగవలయును. ఇటుల ౩౨ పుటంబులువైచిన, భస్మంబగును.

అశ్వత్థచించాత్వక్చూర్ణం చతుర్థాంశేన నిక్షిపేత్. 113
మృత్పాత్రే ద్రావితే నాగే లోహదర్వ్యా ప్రచాలయేత్,
యామైకేన భవేద్భస్మ తత్తుల్యాం చ మనశ్శిలామ్. 114
కాంజికేన ద్వయం పిష్ట్వా పచేద్గృఢపుటేన చ,
సాంగశీతం పునః పిష్ట్వా శిలయా కాంజికేన చ. 115
పునః పుటేచ్ఛరావాభ్యామేవం షష్టిపుటైర్మృతిః,

తా. మట్టిశరావమునందు నాదమునునిచి కరిగించి అందు రావిపట్ట, చింతబెరడు వీనిచూర్ణమును నాగమునకు నాలవపాలుగ్రహించి, కొంచముగవైచుచు, లోహదండముతో యామమాత్రము కలియబెట్టిన భస్మంబగును. ఆ భస్మమునకు సమము మణిశిలనుజేర్చి కాంజికముతోనూరి బిళ్లజేసి యెండించి మూకుళ్లయందునిచి చీలమన్నుచేసి గజపుటమువైచి సాంగశీతలమునదీసి మరల మణిశిలను కాంజికముతోనూరి పుటంబులిడవలయును ఇటుల ౬౦ పుటంబులిడిన భస్మంబగును.

### నాగసిందూరము

లోహపాత్రధృతే నాగే చూర్ణితం రసకం సమమ్. 116

పిష్ట్వా చూర్ణం పచేద్యామం చాల్యం పాషాణముష్టినా,
యామాన్తే హింగులక్షేప్తం చూర్ణితం నాగతుల్యకమ్. 117
మర్దయేత్తదవచ్ఛిన్నం దృఢం పాషాణముష్టినా,
పచేచ్చండాగ్నినా తావద్దినానామేకవింశతిమ్. 118
జాయతే కుంకుమాభస్తు తారం తేనైవ వేధయేత్,
చతుష్షష్టిప్రమాణేన దివ్యం భవతి కాంచనమ్. 119

తా. లోహపాత్రమునందు నాగభస్మమునునిచి ఆభస్మమునకు సమముశుద్ధ ఖల్ కప్పరిచూర్ణమునుజేర్చి పొయిమీదబెట్టి మంటనువేయుచు ఖల్వపుగుండుతో ఒకయామమురుద్ది పిదప శుద్ధిచేసిన ఇంగిలీకచూర్ణమును సమముగజేర్చి అవిచ్ఛిన్నముగమర్దించుచు గాఢాగ్నితో ౨౧ దినములుపచనముజేసిన కుంకుమతో సమమగు సిందూరంబగును. ఇది వెండి. ౬౪ వ భాగము, వెండికరిగించియందుచేర్చిన దివ్యమగు సువర్ణంబగును.

నాగభస్మగుణము

క్షయపవనవికారే గుల్మపాండ్వామయేషు
భ్రమకృమికఫశూలే మేహకాసామయేషు,
గ్రహణిగుదగదే వై నష్టవహ్నౌ ప్రశస్త
శ్శుభవిధకృతనాగః కామపుష్టిం దదాతి. 120

తా. బాగుగసిద్ధంబగు నాగభస్మమునుబుచ్చుకొనిన క్షయ, వాతవికారము, గుల్మము, పాండువు, భ్రమ, క్రిమి, కఫము, శూల, మేహము, కాస, గ్రహణి, గుదరోగము, అగ్నిమాంద్యము వీనిని నశింపజేయుటయేగాక కామపుష్టిని గలుగంజేయును.

నాగో హి నాగశతతుల్య బలం దదాతి
వ్యాధీంశ్చ నాశయతి జీవితమాతనోతి,
వాయుం కృమీనపి నిహన్తి సతి క్తమేవ
వృష్యం చ పిత్తకరమాశు మృతిం నిహన్తి. 121

తా. నాగభస్మము చేదురసముగలదిగనుండును. శుక్లవృద్ధి, పిత్తము వీనిని గలుగంజేయును. మరియు వ్యాధులు, వాయువు, క్రిమి, మృతి వీనిని నివర్తింపజేయుటయేగాక నూరుఏనుగులతో తుల్యమగుబలము జీవితవృద్ధి వీనిని గలుగంజేయును.

## అశుద్ధనాగదోషము

కుష్ఠానిగుల్మారుచిపాండురోగాన్ క్షయం కఫం రక్తవికారకృచ్ఛ్రమ్,
జ్వరాశ్మరీశూలభగందరాదీన్ నాగం త్వపక్వం కురుతే నరాణామ్.

తా. అపక్వనాగభస్మము, కుష్ఠము, గుల్మము, అరుచి, పాండురోగము, క్షయ, కఫము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అశ్మరి, శూల, భగందరము మొదలగువానిని గలుగంజేయును.

## లోహోత్పత్తి

పురా లోమిలదైత్యస్య నిహతస్య సురైర్యుధి,
ఉత్పన్నాని శరీరేభ్యో లోహాని వివిధాని చ. 123

తా. పూర్వము దేవతలచే యుద్ధమునందు జంపబడిన లోమిలుడను రాక్షసునియొక్క శరీరమువలన నానావిధలోహంబు లుత్పన్నంబులయ్యెను.

## లోహభేదములు

కాన్తంతీక్ష్ణంవాథముండంతృతీయంత్రేధాలోహంబుద్ధిమంతోవదన్తి,
దివ్యంమధ్యంచాధమంసంవదంతిగ్రాహ్యంతస్మాత్కాంతలోహంభిషగ్భిః.

తా. లోహము కాంతమనియు, తీక్ష్ణమనియు, ముండమనియు, మూడువిధంబులుగ నుండును. దానిని క్రమముగ ఉత్తమమనియు, మధ్యమమనియు, అధమమనియును జెప్పెదరు. అందు లోహకాంతము ఉత్తమమగుగాన కాంతము నే గ్రహించదగును.

## లోహమారణభేదములు

*లోహానాం మారణం శ్రేష్ఠం సర్వేషాం రసభస్మనా,
మధ్యమం మూలికాభిశ్చ కనిష్ఠం గంధకాదిభిః. 125

తా. సర్వలోహములకు రసభస్మసంబంధముచే మారణము శ్రేష్ఠంబనియు, మూలికాదులచే మధ్యమంబనియు, గంధకతాళకాదులచే హీనంబనియును వచించెదరు.

## లోహగుణములు

ముండాచ్ఛతాధికం తీక్ష్ణం తీక్ష్ణాత్కాంతం శతాధికమ్,
తస్మాన్ముండం పరిత్యజ్య తీక్ష్ణం వా కాన్తముత్తమమ్. 126

తా. లోహంబులలో ముండమనులోహంబుకన్న తీక్ష్ణమనులోహము నూరు గుణంబులధికగుణముగలదనియు ఆ తీక్ష్ణమునకన్న కాంతలోహము శతాధికగుణము

---

* ఈశ్లోకము స్వర్ణాదిసమస్తలోహములకు సంబంధించి రసశాస్త్రములలో వ్రాయబడినది. కేవల లోహమునకే కాదు.

గలదనియును వచించెదరు గాన ముండమునుపరిత్యజించి శ్రేష్ఠంబుగనుండు కాంతమునుగాని లేక తీక్ష్ణమునుగాని గ్రహించందగును.

### లోహశుద్ధి

గరళం క్లమవాన్తివీర్యహా ఇతి దోషాన్ ప్రవదన్తి లోహకే,
అథ శోధనపూర్వకాన్పుటాన్ విధినా తేన వదన్తి సూరయః. 127
శశరక్తేన సంలిప్తం చించార్కపయసా౽యసమ్,
దళం హుతాశనధ్మాతం సిక్తం త్రైఫలవారిణా. 128
ఏవం త్రిశః కృతే లోహం శుద్ధిమాప్నోత్యసంశయమ్,

తా. లోహమునందు విషము, క్లమ, వాంతి, వీర్యనాశకము మొదలగు దోషములుజనించియుండును. గాన శుద్ధులు, పుటములు మొదలగువానిని నీక్రింది విధిగవచించెదరు. అదియెటులన లోహపత్రములకు కుందేటినెత్తురును లేపనము జేసి కొలిమిలోకాచి త్రిఫలకషాయములోతడపవలయును. ఇటుల మూడుమార్లు జేసి పిదప చింతబెరడును జిల్లేడుపాలతోనూరి లేపనముచేసి కొలిమిలోకాచి త్రిఫలకషాయములో చల్లార్చవలయును. ఇటుల మూడుమార్లుచేసిన లోహము శుద్ధంబగును.

క్వాథ్యమష్టగుణే తోయే త్రిఫలాషోడశంపలమ్. 129
తత్క్వాథే పాదశేషే తు లోహస్య పలపంచకమ్,
కృత్వాపత్రాణి తప్తాని సప్తవారం నిషేచయేత్. 130
ఏవం ప్రలీయతే దోషోవిషాదిర్లోహసంభవః,

తా. పదహారుపలముల త్రిఫలములను ౧౨౮ పలముల నీళ్లయందువైచి, నాలవపాలు, మిగులునటుల కషాయముకాచి, లోహమును ౫ పలములు గ్రహించి సన్నరేకులుగచేసి కొలిమియందుకాచి ఆకషాయములో ఏడుమార్లు కాచికాచి చల్లార్చిన లోహమునందలి విషాదిదోషములు నశించి శుద్ధమగును.

### లోహభస్మము

సూతకాద్ద్విగుణం గంధం దత్వా కుర్యాచ్చ కజ్జలీమ్.
ద్వయోస్సమం లోహచూర్ణం మర్దయేత్కన్యకాద్రవైః. 131
యామయుగ్మం తతః పిండం కృత్వా తామ్రస్య పాత్రకే. 132
ఘర్మే ధృత్వా రుబూకస్య పత్రైరాచ్ఛాదయేద్బుధః,
యామార్ధేనోష్ణకో భూయాద్ధాన్యరాశౌ న్యసేత్తతః. 133
దత్వోపరి శరావం తు త్రిదినాంతే సముద్ధరేత,

పిష్ట్వా చ గాలయేద్వస్త్రాదేవం వారితరం భవేత్. 134
ఏవం సర్వాణి లోహాని స్వర్ణాదీన్యపి గాలయేత్,
శిలాగంధార్కదుగ్ధాక్తాః స్వర్ణం వా సర్వధాతవః. 135
మ్రియన్తే ద్వాదశపుటైస్సత్యం గురువచో యథా.

తా. పాదరసము ౧ భాగము, గంధకను ౨ భాగములు, వీనినినూరి కజ్జలిచేసి కజ్జలికిసమను తీక్ష్ణచూర్ణమునుచేర్చి కలుబందరసముతో రెండుయామనులు, ఖల్వము నందు మర్దించి బిళ్లచేసి పిదప దానిని రాగితట్టయందునిచి దానిపై ఆముదపాకులు ౩ లేక ౪ తోమూసి ౪ గడియలు యెండయందునిచి ఆబిళ్లవేడియయిన పిదప దానిపై మంటిశరావముమూసి ధాన్యరాశియందు ౩ దివసంబులునిచి ౪ వదినము బైటికిదీసి చూర్ణించి వస్త్రగాలితమొనర్చి పిదప నీళ్లపైవైచిన ఆచూర్ణములును అప్పుడు శుద్ధ భస్మమైనదని తెలిసికొనవలయును ఈరీతిగ సర్వలోహభస్మములను చేసికొనవలయును. లేక మణిశిల, గంధకము యీరెంటిని జిల్లేడుపాలతోనూరి సర్వధాతువులకు లేపనము చేసి అడవిపిడకలతో ౧౨ గజపుటములిడిన, సర్వధాతువులు భస్మమగును. అదెటు లనిన గురువాక్యమెటుల సత్యముగనుండునో అటుల ఇదియును సత్యము.

ద్వాదశాంశేన దరదం తీక్ష్ణచూర్ణస్య మేళయేత్. 136
కన్యానీరేణ సంమర్ద్యయామయుగ్మం తు తత్పునః,
శరావసంపుటే కృత్వా పుటేద్గజపుటేన వై. 137
సప్తధైవం కృతే లోహరజో వారితరం భవేత్,

తా. శుద్ధిచేసిన లోహచూర్ణమునకు ౧౨వ భాగము, శుద్ధిచేసిన యింగిలీక మునుచేర్చి కలబందరసముతో రెండుయామములు మర్దించి బిళ్లచేసి యెండించి శరావ ములయందునిచి చీలచేసి ఇటుల ౭ గజపుటంబులిడిన శుద్ధభస్మమగును.

అమృతీకరణము

ద్విగుణే త్రిఫలాక్వాథే తుల్యం పిష్ట్వాయ్యయోరజః. 138
పచేన్మధ్యమపాకేన సర్వవ్యాధిజ్వరాపహమ్,

తా. ఉక్తభస్మమును త్రిఫలకషాయమునందు మర్దనజేసి మధ్యమపుటంబిడి దానిని సేవించిన సర్వవ్యాధులు, జ్వరము వీనిని నశింపజేయును.

లోహభస్మగుణము

లోహామృతం కజ్జలసన్నిభం తు భుంక్తేసదాయోరసరాజయుక్తమ్.
తస్యైవ దేహే న భవన్తి రోగా మృతోపి కామం పునరేతి ధామ,

తా. కజ్జలి తుల్యమగు లోహభస్మమును రసభస్మ సహితముగ సేవించిన వాని శరీరమునందు రోగంబులు నిలువనేరవు. మృతుడైనను మరల జీవించును.

లోహం జంతువికారపాండుపవనక్షీణత్వపిత్తామయ. 140
స్థౌల్యార్శోగ్రహణీవికార కఫజిచ్ఛోఫప్రమేహప్రణుత్,
గుల్మప్లీహవిషాసహంబలకరం కాన్తాజనానందకం. 141
సౌఖ్యాలంబిరసాయనం మృతిహరం దృష్టేశ్చ కాన్తిప్రదమ్,
ఆమవాతహరణేషు శోభనం పాండుమేహగదనాశనేఽగదః. 142
దుష్టకుష్ఠపలితాస్రవాతజిత్ స్యాజ్జరామృతివలీవినాశనమ్,
కామలాకవలితక్షతక్షయః పాండుపాండురసుదేహమేహవాక్. 143
రూపసంపదముపైతి మానవో లోహమన్వహమహో లిహన్ శుచి,

తా. శుద్ధమగు లోహభస్మమును ప్రతిదినము సేవించుచుండిన జంతువికారము, పాండురోగము, వాయువు, క్షీణత, పిత్తవ్యాధి, స్థూలత్వము, మూలవ్యాధి, సంగ్రహణి, కఫము, వాపు, ప్రమేహము, గుల్మము, ప్లీహము, విషము, ఆమవాతము, శరీరమునందు తెలుపు, మేహము, కుష్ఠము, వలీపలితములు, రక్తవాతము, జరామరణము, వలి, కామిల, క్షయ వీనిని నశింపజేయుటయే గాక బలము, స్త్రీలయందిష్టము, సౌఖ్యము, రసాయనము, దృష్టినైర్మల్యము, రూపసంపత్తు వీనిని గలుగజేయును.

## కాంతలక్షణము

యత్పాత్రస్థే ప్రసరతి జలే తైల బిందుర్నిషిక్తో
హింగోర్గంధం విసృజతిజలం తిక్తతాం నింబకల్కః. 144
పాచ్యం దుగ్ధం భవతి శిఖరాకారకం నైతి భూమిం
దగ్ధాంగాస్స్యుస్సజలచణకాః కాన్తలోహం తదుక్తమ్,

తా. కాంతపాత్రయందుదకముబోసి తైలబిందువును వైచిన వ్యాపించకుండుట, ఉదకమున కలసిన ఇంగువ యొక్క వాసనపోవుట, వేపకల్కము చేదుపోవుట, మరియు నా కాంతపాత్రలో పాలు కాచిన పొంగిబయటపడకనుండుట, కాంతపాత్రయందు శనగలతడిపియునిచిన వానిపై పొట్టుకాలిపోవుట ఇట్టి లక్షణములుగలది కాంతమని తెలియవలయును.

## కాంతశుద్ధి

జంబీరేచారనాళే చాప్యామ్లతక్రే చ కాన్తకమ్. 145
క్షిప్త్వా సప్తాతపే దేయం కాన్తశుద్ధిర్భవేద్ధ్రువమ్,

తా. నూదంటురాయిని, నిమ్మపండ్లరసము, కాంజికము, పులిమజ్జిగ వీనిలో నేదేనిమార్లుపైచి యేపేశిఘుడియలు యెండించిన శుద్ధియగును.

—॥ కాంతభస్మము ॥—

తచ్ఛుద్ధం కాన్తపాదాంశం గంధకం చ దదేద్భిషక్. 146
అర్కక్షీరేవిమర్ద్యాథ శిలాభేదిరసేన చ,
పలాశత్వగ్రసేనైవ మర్ద్యం గజపుటే పచేత్. 147
ఏవం పుటత్రయే పాచ్యం కాన్తభస్మ భవేద్ధ్రువమ్,

తా. శుద్ధిచేసిన కాంతభస్మమునకు నాలవభాగము గంధకమునుచేర్చి జిల్లేడు పాలు, కొండపిండివేళ్లరసము, మోదుగచక్కరసము వీనిచే ప్రత్యేకముగ మర్దించి మూడు గజపుటంబులిడిన కాంతము భస్మమగును.

—॥ కాంతసిందూరము ॥—

తద్భస్మార్ధం చ దరదం దత్వా ఖల్వేవిమర్దయేత్. 148
కపికచ్ఛూమూలరసే మర్దితం దివసత్రయమ్,
రక్తమృత్స్నావజ్రమూషాం కృత్వా తస్యాంతరేక్షిపేత్. 149
వస్త్రమృత్తికయా లేప్యం పాచ్యం గజపుటత్రయే,
కాన్తం సూర్యోదయసమం సిందూరం భవతి ధ్రువమ్. 150

తా. కాంతభస్మమునకు అరభాగము ఇంగిలీకమునుచేర్చి దూలగొండివేళ్లరసముతో మూడుదినములు మర్దించి యెఱ్ఱమన్నుతో చేయబడిన వజ్రమూసలోనునిచి మూను చీలమన్నులిచ్చి మూడుగజపుటంబులిడిన బాలసూర్యునితో తుల్యమగు సిందూరమగును.

—॥ కాంతద్రుతి ॥—

సృగాలమేషకుర్మాదిశల్యాని చ శిలాజతు,
ఏతత్సర్వం చూర్ణయిత్వా సుతప్తే కాన్తచూర్ణకే. 151
ప్రక్షిపేద్ద్రవతాం యాతి యథాసూతం సునిర్మలమ్,

తా. నక్క, గొఱ్ఱె, తాబేలు వీనియెముకలు శిలాజిత్తు వీనిని చూర్ణించి కాంతచూర్ణమును బాగుగకాచి అందు పైచూర్ణమును కొంచకొంచెముగ వేయుచుండిన రసమువలె నిర్మలముగ ద్రవించును.

—॥ కాంతాభ్రకసిందూరగుణము ॥—

కాంతాభ్రం కఫవాతపిత్తజనితక్షైణ్యం తథా ప్లీహకమ్. 152

శుక్లాక్షిస్రవరక్తపిత్తవికృతీర్నానావిధానామయాన్,
ఛర్దిం హృద్రుజమామవాతమరుచిం మూర్ఛాం శిరోవిభ్రమం. 153
పాండుం వింశతి మేహజాం చ వికృతిం యోన్యామయం గుల్మజమ్,
కాసశ్వాసహలీమకాగ్నిసదనం శూలాతిసారం గరం. 154
నానాక్షిప్రభవాన్ గదాంశ్చ దేహదహనం కంఠప్రరోహాఞ్జయేత్,
కుష్ఠోన్మాదమపస్మృతిం వ్రణలితిం క్షుద్రామయం విద్రధిమ్. 155
వృద్ధిం సప్తవిధం హలీమకగదం హన్యాత్తథానాహకం,
వాతం పిత్తకఫౌ జ్వరం గుదగదం శోషం గ్రహణ్యామయమ్. 156
వైసర్పం వినిహంతి వాతరుధిరం స్థౌల్యామయం కామిలాం,
నానారోగహరానుపానసహితం యద్వా జరాన్నాశయేత్. 157
వృష్యం పుష్టికరం రసాయనవరం జత్రూర్ధ్వరోగాఞ్జయేత్,
దంతానాం దృఢతాంకరోతిచికురాన్ భృంగస్వమాన్ వర్తయేత్.
దేవానామమృతం యథా చ మనుజాన్ రక్షేచ్ఛతం చాయుషః,
మేధాబుద్ధివివర్ధనం శుభకరం వర్ణప్రదం శ్రీకరం. 159
పార్వత్యావృషభధ్వజేన కథితం కాంతాభ్రసిందూరకమ్,

తా. కాంతాభ్రకము, కఫ, వాత, పిత్తజనిత కృశత్వ ప్లీహరోగముల హరింపంజేయునదిగను, శుక్లదోషము, అక్షిస్రావము, రక్తపిత్తవికారము మొదలగు నానావిధరోగములను, వాంతి, రొమ్మునొప్పి, ఆమవాతము, అరుచి, మూర్ఛ, తలదిరుగుట, పాండువు ౨౦ మేహములవలన గలిగిన వికారములు, యోనిరోగము, గుల్మము, కాస, శ్వాసము, హాలీమకము, అగ్నిమాంద్యము, శూల, అతిసారము, కృత్రిమవిషదోషములు, నానావిధ నేత్రరోగములు, శరీరతాపము, కంఠరోగము, కుష్ఠువు, ఉన్మాదము, అపస్మారము, వ్రణము, క్షుద్రరోగములు, విద్రధి, సప్తవృద్ధులు, హాలీమకము, ఆనాహము, వాతపిత్తకఫములు, జ్వరములు, మూలను, శోష, గ్రహణి, విసర్పి, వాతరక్తము, స్థౌల్యము, కామిల వీనిని హరింపంజేయునదిగ నుండుటయే గాక యుక్తానుపానముల సేవించిన సర్వరోగములు, ముదిమి వీనిని నశింపంజేసి వీర్యవృద్ధి, శరీరపుష్టినిగలుగంజేసి జత్రూర్ధ్వగతరోగములను తొలగంజేయును. మరియు కాంతాభ్రకము శ్రేష్ఠమగురసాయనంబు కాంతాభ్రకసిందూరము దంతములకు దృఢత్వమును వెంట్రుకలకు తుమ్మెదలవంటివర్ణమును గలుగంజేయును. మరియు అమృతము జీవతల రక్షించుచందంబున మనుజుల ౧౦౦ సంవత్సరములవరకు

రక్షింపుచుండును. మరియూ దీనివలన మేధ, బుద్ధి, శుభము, వర్ణము, సంపత్తుగలుగును. ఈ కాంతాభ్రకసింధూరమును ఈశ్వరుడు పార్వతీదేవికి నుపదేశించెను.

### లోహభస్మానుపానములు

శూలే హింగుఘృతాన్వితంమధుయుతా" కృష్ణా పురాణజ్వరే. 160
వాతే సాజ్యరసోనకః శ్వసనకే క్షౌద్రాన్వితం త్ర్యూషణమ్,
శీతే వ్యాలలతాదలం సమరిచం మేహే వరా సోపలా. 161
దోషాణాం త్రితయేనుపానముదితం సక్షౌద్రమార్ద్రోద్రకమ్,
ఘృతేన వాతికే దేయం మధునా పైత్తికే జ్వరే. 162
శ్లేష్మపిత్తే చార్ద్రకేన నిర్గుండ్యాశీతివాతకే,
శుంఠీ వాతే సితా పిత్తే కఫే కృష్ణా త్రిజాతకం. 163
సంధిరోగే వరా మేహే ప్రోక్తం లోహానుపానకమ్,

తా. లోహభస్మమును ఇంగువ, నెయ్యి వీనితో చేర్చి సేవించిన శూల, పిప్పలి చూర్ణము, తేనె వీనితో భుజించిన పురాణజ్వరము, వెల్లుల్లి, నెయ్యి వీనితో పుచ్చుకొనిన వాతము, త్రికటుకచూర్ణము, తేనెతో సేవించిన శ్వాస, తమలపాకు, మిరియాలతో సేవించిన శీతలము (జలుబు), త్రిఫలములు, ఖండచక్కెర వీనితో పుచ్చుకొనిన మేహములు, అల్లపురసముతో పుచ్చుకొనిన కఫపిత్తజ్వరము, వావిలిరసముతో సేవించిన అశీతివాతములు, శొంఠితో పుచ్చుకొనిన, కేవలవాతము, చక్కెరతో పుచ్చుకొనిన పిత్తము, పిప్పలిచూర్ణముతో పుచ్చుకొనిన కఫము, లవంగపట్ట, ఏలకులు, లవంగపత్రి వీనితో పుచ్చుకొనిన సంధిరోగములు, త్రిఫలకషాయముతో సేవించిన ప్రమేహము ఇటుల లోహభస్మానుపానముల నెరుంగవలయును.

వల్లం వల్లార్ధమానం చ తథా యోగేన యోజయేత్. 164
త్రిఫలాలోహచూర్ణం చ వలీపలితనాశనమ్,
కజ్జలీమధుకృష్ణాభ్యాం శ్లేష్మరోగనివారణమ్. 165
ఖండేన చచతుర్జాతైరక్తపిత్తనివారణమ్,
పునర్ణవాసుగోక్షీరైర్ద్బలవృద్ధికరం పరమ్. 166
పునర్న్న వారసేనైవ పాండురోగనిషూదనమ్,
హారిద్రాలోహచూర్ణాభ్యాంపిప్పల్యామధునా సహ. 167
వింశతిం చ ప్రమేహాణాం నాశయేన్నాత్ర సంశయః,
శిలాజతుసమాయుక్తం మూత్రకృచ్ఛ్రనివారణమ్. 168
వాసకః పిప్పలీ ద్రాక్షా లోహం చ మధునా సహ,

గుటికాం భక్షయేత్ప్రాతః పంచకాసప్రశాన్తయే. 169
తాంబూలేన సమాయుక్తం భక్షయేల్లోహముత్తమమ్,
అగ్నిదీప్తికరం వృష్యం దేహకాంతివివర్ధనమ్. 170
త్రిఫలామధుసంయుక్తం సర్వరోగేషు యోజయేత్,
పథ్యాసితా లోహభస్మ యథోక్తం గుణదం భవేత్. 171
కిమత్ర బహునోక్తేన దేహలోహకరం పరమ్,
యే గుణామృతరూప్యస్య తే గుణాః కాంతభస్మనః. 172
రూప్యాభావే ప్రదాతవ్యం కాన్తమిత్యాహ భైరవః,

తా. లోహభస్మమును, వల్లప్రమాణముగాని, అరవల్లముగాని, బలానుసారముగ సేవించవలయును. మరియు, త్రిఫలానుపానముతో వలీపలితములు, తేనె, పిప్పలిచూర్ణముతో శ్లేష్మరోగములు, కలకండ, చాతుర్జాతచూర్ణము వీనితో రక్తపిత్తములు నివర్తించును. తెల్లగలిజేరువేరు, అవుపాలు వీనితో సేవించిన బలవృద్ధియగును. తెల్లగలిజేరురసముతో పాండురోగము, పసపుమూర్ణము, పిప్పలిచూర్ణము, తేనె వీనితో వింశతిమేహములు, శిలాజతుచూర్ణముతో మూత్రకృఛ్రము, అడ్డసరము, పిప్పలి, ద్రాక్ష, తేనె వీనితో లోహభస్మమునుచేర్చి మాత్రలుచేసి సేవించిన పంచకాసలు నివర్తించును. తమలపాకులతో సేవించిన, అగ్నిదీప్తి, శుక్లవృద్ధి, దేహకాంతి వీనినిజేయును. త్రిఫలములు, తేనె, ఈఅనుపానముతో సమస్తరోగములకు యివ్వందగును. కరకవొలుపుచూర్ణము, చక్కెర వీనితో యథోక్తగుణములజేయును. రజతభస్మమందేగుణములు జెప్పబడియున్నవో అవి ఈకాంతభస్మమువలనగలుగును. రజతభస్మములేనియెడల కాంతభస్మమును యివ్వవలయునని భైరవుఁడు వచించెను.

లోహసేవనకు అపథ్యములు

కూష్మాండం తిలతైలం చ మాషాన్నం రాజికా తథా. 173
మద్యమమ్లరసశ్చైవ త్యజేల్లోహస్య సేవకః,
మత్స్యజీవకవార్తాకమాషకంకారవేల్లకమ్. 174
వ్యాయామం తీక్ష్ణకం సద్యస్తైలామ్లే దూరతస్త్యజేత్,

తా. లోహభస్మమునుసేవించువాడు కూష్మాండము, నువ్వులు నూనె, మాషాన్నము, ఆవాలు, మద్యము, పులుసురసములు వీనిని వర్జించవలయును. మరియు మత్స్యములు, జీవకశాకము, వంకాయ, మినుములు, కాకరకాయ, వ్యాయామము, కారము మొదలగు తీక్ష్ణద్రవ్యములు, పులుసు, తైలము వీనిని దూరముగవర్జించవలయును.

అశుద్ధలోహదోషము

షండత్వకుష్ఠామయమృత్యుదంచహృద్రోగశూలే కురుతేశ్మరీం చ.
నానారుజానాం చ తథా ప్రకోపం కరోతి హృల్లాసమశుద్ధలోహమ్,
జీవహారి మదకారి చాయసం దేహశుద్ధిహృదసంస్కృతం ధ్రువమ్.
పాటవం న తనుతే శరీరకే దారుణాం హృదరుజాం చ యచ్ఛతి,

తా. అశుద్ధలోహభస్మమును సేవించిన నపుంసకత్వము, కుష్ఠు, మృతి, హృద్రోగము, శూల, అశ్మరీ, నానావిధరోగములు, హృల్లాసము, ప్రాణనాశము, మదము, దేహఅశుద్ధత, అశక్తత, హృదయమునందలి దారుణమగువ్యాధి వినిని గలుగ జేయును.

లోహదోషచికిత్స

మునిరసపిష్టవిడంగం మునిరసలీఢం చిరం స్థితే ఘర్మే. 177
ద్రావయతి లోహదోషాన్ వహ్నిర్నవనీతపిండమివ,

తా. అశుద్ధలోహభస్మసేవనవలన వికారము జనించిన మనుజుడు, అవిశాకు రసములో, వాయువిడంగములనునూరి యారసమునసే కలిపిపుచ్చుకొని యెండలో గూర్చుండిన లోహభస్మజనితదోషము నిప్పునబెట్టిన వెన్నుముద్దవలె ద్రవించును.

లోహభస్మపరీక్ష

మధ్వాజ్యమృతలోహం చ రూప్యసంపుటకేక్షిపేత్. 178
రుద్ధ్వాధ్మాతే చ సంగ్రాహ్యం రూప్యం వై పూర్వమానకమ్,
తదా లోహం మృతం విద్యాదన్యథా మారయేత్పునః. 179

తా. తేనె, నెయ్యి, లోహభస్మము వీనిని నేకముగచేర్చి వెండి సంపుటము నందునిచి చీలజేసి కొలిమియందునిచి ఊది పిదప అందునిచిన వెండి తూనికెకు సమముగనుండిన (కొంత) లోహము బాగుగ భస్మంబైనదని తెలియవలయును. అటుల గాక వెండితరిగిన మరల పుటంబులిడవలయును.

తీక్ష్ణలోహద్రావణము

సురదాలీభవం భస్మ నరమూత్రేణ గాలితమ్,
త్రిసప్తవారం తత్క్షారావాపాత్తీక్ష్ణద్రుతిర్భవేత్. 180

తా. దేవదాళిబూడిదను నరమూత్రమునకలిపి 21 మార్లు వడియగట్టి క్షారమునుదీసి తీక్ష్ణలోహమునుకాచి, దానిపై నాక్షారమును వేయుచుండిన, తీక్ష్ణము ద్రవించి ద్రుతియగును.

## సమస్తలోహద్రావణము

దేవదాళ్యారసైర్భావ్యం గంధకం దినసప్తకమ్,
తేన ప్రవాపమాత్రేణ లోహాస్తిష్ఠన్తి సూతవత్. 181

తా. దేవదాళిరసముతో గంధకమును ౭ దినములు భావనజేసి ఏలోహము నైనను కొలిమిలోనూది దానిపై నాగంధకమును, కొంచముకొంచముగ వేయు చుండిన, లోహము పాదరసమువలె ద్రవించును.

## మండూరలోహకిట్టములయొక్క ఉత్పత్తి

ధ్మాయమానమయో వహ్నౌ పరిత్యజతి యన్మలమ్,
తత్ కిట్టసంజ్ఞాం లభతే తదనేకవిధం మతమ్. 182

తా. ఇనుమును, అగ్నియందు కాచిన యేమలమును వదలునో దానిని కిట్టమని వచించెదరు. అది అనేకవిధంబులుగనుండును.

## కిట్టలక్షణము

ఈషచ్ఛవిగురుస్నిగ్ధం ముండకిట్టం జగుర్బుధాః,
భిన్నాంజనాభం యత్కిట్టం విశేషాద్గురునిర్వ్రణమ్. 183
నిష్కోటరం చ విజ్ఞేయం తీక్ష్ణకిట్టం మనీషిభిః,
పింగం సూక్ష్మం గురుతరం తద్ధ్మాతంచవికోటరమ్. 184
ఛిన్నేచరజతచ్ఛాయం స్యాత్కిట్టంతత్తుకాంతజమ్,

తా. కొంచముకాంతికలిగి, గురువుగను స్నిగ్ధముగనుండునది ముండజకిట్ట మనియు, కాటుకలోసమముగు కాంతికలిగి, బరువై బుడుపులు, రంధ్రములులేనిది తీక్ష్ణజకిట్టమనియు, పచ్చగను, సూక్ష్ముగను, గురువుగను, ఊదినకాలమునందు బుడు పులు, రంధ్రములు లేక విరచిన రజతకాంతిగలది కాంతజకిట్టమనియును తెలియ వలయును.

అకోటరం గురుస్నిగ్ధం దృఢం శతసమాధికమ్. 185
చిరోషితజనస్థానే సంస్థితం కిట్టమాహరేత్,

తా. తొరటలులేక, గురువుగను, స్నిగ్ధముగను, గట్టిగను, ౧౦౦ వర్షములకు మించినదిగను, చిరకాలముగ గ్రామమునందుండు కిట్టమును గ్రహించవలయును.

## కిట్టపరీక్ష

శతోర్ధ్వముత్తమం కిట్టం మధ్యం చాశీతివార్షికం. 186
అధమం షష్టివర్షోర్ధ్వం తతో హీనం విషోపమమ్,

తా. ౧౦౦ సంవత్సరములు గడచిన కిట్టముత్తమమనియు, ౭౦ సంవత్సరములు గడచిన నది మధ్యమకిట్టమనియు, ౬౦ సంవత్సరములుగడచినది హీనమనియు, అంతకన్న తక్కువగనుండిన విషతుల్యమనియును దెలియవలయును.

మండూరముచేయుక్రమము

అక్షాంగారైర్ధమేత్కిట్టం లోహజం తత్ గవాం జలైః. 187
సేచయేత్తప్తతప్తం తత్ సప్తవారం పునఃపునః,
చూర్ణయిత్వా తతః క్వాథైర్ద్విగుణైస్త్రిఫలాభవైః. 188
ఆలోడ్య భర్జయేద్వహ్నౌ మండూరం జాయతే వరం,

తా. కిట్టమును కొలిమిలోనునిచి, దానిని తాడిబొగ్గులనిప్పులోనూది యెఱ్ఱగ కాల్చి తాటితొట్టిలో గోమూత్రమునునిచి, అందు ౭ మార్లు చల్లార్చిన కిట్టము శుద్ధంబగును. దానిని చూర్ణించి, దానికి రెండింతలు త్రిఫలకషాయమునువైచి, కొలిమిలో బెట్టివేయించిన కిట్టము శ్రేష్ఠంబగును.

మండూరగుణము

కిట్టం కషాయం శిశిరం పాండుశ్వయథుశోషజిత్.  189
హలీమకం కామలాం చ హరతే కుంభకామలామ్,

తా. కిట్టమండూరము వగరుగను, చల్లగనునుండుటయేగాక, పాండువు, వాపు, హలీమకము, కామిల, కుంభకామిల వీనిని పోగొట్టును.

లోహవిశేషగుణము

కిట్టాద్దశగుణం ముండం ముండాత్తీక్ష్ణం శతాధికమ్. 190
తీక్ష్ణాల్లక్షగుణం కాన్తం భక్షణాత్కురుతే బలమ్,
సువర్ణమథవా రౌప్యం మృతం యత్ర న విద్యతే. 191
కాన్తలోహేన కర్మాణి కార్యాణి చ భిషగ్వరైః,

తా. కిట్టముకన్న ముండము దశగుణాధిక్యము గలదనియు, నాముండభస్మముకన్న తీక్ష్ణభస్మము శతాధికగుణములుగలదనియు, తీక్ష్ణభస్మకమున్న కాంతము లక్షగుణాధిక్యముగలదనియును వచించెదరు. గాన దీనిని సేవించిన బలమును గలుగ జేయును. మరియు నెచ్చట సువర్ణ, రౌప్యభస్మంబులు లేకయుండునో యచ్చట కాంతభస్మము నుపయోగించవలయును.

కాంస్యశుద్ధి

తింత్రిణీపత్రజద్రావైః కాంస్యం భావ్యం త్రివారకమ్. 192
తతః కులుత్థయూషేణ కాంస్యం శుద్ధం భవిష్యతి,

తా. కంచునుకాచి చింతాకురసము, ఉలవకట్టు వీనిలో మూడేసిమార్లు అద్దిన శుద్ధియగును.

కాంస్యభస్మము

శుద్ధం కాంస్యం దళం కృత్వా సమభాగం బలిం దదేత్.
మర్దితం చార్కదుగ్ధేన చాతపే తాపయేత్పునః,
మర్దితం సప్తవారేణ రవిదుగ్ధే పునఃపునః. 194
వజ్రమూషాగతం పాచ్యం కాననోత్పలభూపుటే,
ఏవం సప్తపుటం దత్వా కాంస్యం భస్మ భవేద్ధ్రువమ్. 195

తా. శుద్ధిజేయబడినకంచును తునకలుజేసి, దానికి సమము గంధకమునుచేర్చి, జిల్లేడుపాలతోనూరి లేపనముచేసి, యెండయందుంచి, వజ్రమూసయందునిచి పిడకలతో భూపుటంబిడవలయును. ఇటుల 7 మార్లు 7 పుటంబులిడిన కంచు భస్మంబగును.

కాంస్యసిందూరము

తద్భస్మార్ధం చ దరదం తదర్ధం శుద్ధగంధకమ్,
తదర్ధం పారదం దత్వా వటక్షీరేణ మర్దయేత్. 196
హంసపాదిరసాశ్వత్థవల్కలక్వాథైరపి,
బర్బరత్వక్కషాయేణ పాలాశత్వగ్రసేన చ. 197
మర్కటీమూలజరసైర్మర్దితం చ ముహుర్ముహుః,
పునర్జంబీరనీరేణ మర్ద్యం సప్తపుటైః పచేత్. 198
పుటే వారణసంజ్ఞే చ విశ్వకర్మపుటేపివా,
బాలసూర్యోదయసమం సిందూరం భవతి ధ్రువమ్. 199

తా. కంచుభస్మమునకు అర్ధభాగము ఇంగిలీకమును, దానికి అర్ధభాగము శుద్ధగంధకమును, దానికి అర్ధభాగము శుద్ధరసమునుచేర్చి, మర్రిపాలు, హంసపాది రసము, రావిచెక్కకషాయము, తుమ్మచెక్కకషాయము, మోదుగచెక్కరసము, దూలగొండివేళ్లరసము వీనితో ప్రత్యేకము నొక్కొక్కమారు మర్దించి, 7 పుటంబు లిడినను లేక కొలిమియందునిచి యూదినను కంచుభస్మము బాలసూర్యునివలె సిందూరించును.

కాంస్యభస్మగుణము

కాంస్యం కషాయముష్ణం చ లఘురూక్షం చ తిక్తకమ్,
కఫపిత్తరుజాహంత్ర చాయుర్దేహబలావహమ్. 200

తా. కంచుభస్మము కషాయమునుగను, ఉష్ణమునుగను, లఘువుగను, రూక్షము గను, వగరుగనుండుటయేగాక కఫపిత్తరోగముల హరింపజేయునదిగను, ఆయుర్దేహ బలకారిగనునుండును.

అశుద్ధకాంస్యదోషము

అశుద్ధమమృతం లోహమాయుర్గ్లారి రుజాకరమ్,
హృత్పీడాం దేహతాపం చ తస్మాచ్ఛుద్ధం సమాచరేత్. 201

తా. అశుద్ధమగు కంచుభస్మము అనేకరుజులను, పీడ, ఱొమ్మునొప్పి, శరీర తాపము వీనిని గలుగజేయును; కావున బాగుగ శుద్ధము జేయబడిన కంచునే భస్మము జేయదగును.

ఇత్తడినామములు

పీతలోహం సింహలకం కపిలం సౌక్యమారకమ్,
వర్తలోహం త్రిలోహం చ రాజరీతిర్మహేశ్వరీ. 202

తా. పీతలోహము, సింహలకము, కపిలము, సౌక్యము, ఆరకము, వర్త లోహము, త్రిలోహము, రాజరీతి, మహేశ్వరీ అనునవి ఇత్తడినామంబులు. (దీనిని కంచువలె శుద్ధిభస్మములం జేసికొనవలయును.)

ఇత్తడిభస్మగుణము

రీతికాయుగళం రూక్షం తిక్తం చ లవణం రసే,
శోధనం పాండురోగఘ్నం కృమిఘ్నం వీర్యవర్ధనమ్. 203

తా. రాజరీతి, కాకతుండి అను రెండువిధములగు ఇత్తడియొక్క భస్మము, రూక్షముగను, వగరుగను, ఉప్పగను, శోధనకారిగనుండుటయేగాక, పాండు రోగము, క్రిములు వీనిని హరింపజేసి వీర్యవృద్ధిని గలుగజేయును.

పారదోత్పత్తి

స్కందాత్తారకహింసార్థం కైలాసే ప్రార్థితస్సురైః,
కరుణాత్మా మహాదేవః పార్వతీవల్లభశ్శివః. 204
రతౌ శంభోః చ్యుతం రేతో గృహీతం వహ్నినాముఖే,
క్షిప్తం తేన చతుర్దిక్షు క్షమాయాం తత్పృథక్పృథక్. 205
సౌమ్యాదిదక్షిణాస్వాస్య గౌరీశాపాన్నకార్యకృత్,
పశ్చిమాయాం తు యత్క్షిప్తం దిశి తత్సర్వకార్యకృత్. 206
ఏషోత్పత్తిస్సమాఖ్యాతా పారదస్య మనీషిభిః,

తా. తారకాసురసంహారార్థమై కుమారస్వామిని జనింపజేయవలయునని కరుణాత్ముడును, మహాదేవుడును, పార్వతీవల్లభుడును నగు ఈశ్వరుని దేవేంద్రుడు మొదలగు సమస్తదేవతలు ప్రార్థింప నతడు కుమారస్వామి జననార్థమై పార్వతితో రతిసల్ప వీర్యముపతనంబయ్యెను. దానినగ్ని గ్రహించు ధరింపనేరక భూమియందు విడచిన నది నలుదిక్కులయందు ప్రత్యేకముగ వ్యాపించెను. అందుత్తర ప్రాగ్దక్షిణదిశలయందుబడినది గౌరీశాపముచే నిష్ఫలముగుటవలన నది ఏకార్యమున నుపయోగించకయుండును. పశ్చిమదిశయందుబడిన రసము సమస్తకార్యములయందుపయోగించును. ఇటుల రసోత్పత్తిక్రమము అయుర్వేదవేత్తలచే జెప్పబడియెను.

## పారదముసు దెచ్చువిధము

ప్రథమే రజసి స్నాతాం హయారూఢాం స్వలంకృతామ్. 207
వీక్షమాణాం వధూం దృష్ట్వా నిష్క్రుష్టః కూపగో రసః,
ఉద్గచ్ఛతి సపవాసౌ తాం దృష్ట్వాప్యతివేగతామ్. 208
అనుగచ్ఛతి తాం సూతస్సీమానం యోజనోన్మితమ్,
ప్రత్యాయాతి తతః కూపం వేగతశ్శివసంభవః. 209
మార్గే నిర్మితగర్తేషు స్థితం గృహ్ణన్తి పారదమ్,
పతితో భూధరోద్దేశే గౌరవాదగ్నివక్త్రగః. 210
సతత్ర భూతలే లీనస్తత్తద్దేశనివాసినః,
తాం మృదం పాతనాయంత్రే క్షిప్త్వా సూతం హరంతి చ. 211

తా. ప్రథమరజస్వలయైస్నానంబొనర్చి అలంకరించుకొని, గుఱ్ఱముపైనెక్కిన కన్యక ఆరసకూపమునకుబోయి, కూపమధ్యమునందుండు రసమునుజూచిన మాత్రముననే రసముపైకిలేచి గుఱ్ఱముపైకినెక్కి అతివేగముగ వెళ్లుచున్న యాస్త్రీని జూచి ఒకయోజనమువరకు వెనుదగిలివచ్చి, మరలి అతివేగమునకూపమును ప్రవేశించిన పిదప ఆస్త్రీసంబంధులు తాముపూర్వముజేసియుండు పల్లంబులలోనిలిచియున్నరసమును గ్రహించెదరు. మరియు పూర్వంబీశ్వరునివీర్యము అగ్నిముఖమునందుబడి నతనిచేభరింపనలవిగాక, మిక్కిలి బరువౌటవలన కొంతి పర్వతప్రదేశమునబడి భూమిలోలీనంబైయుండెను. ఆదేశస్థులు ఆమృత్తుగ్రహించి పాతనాయంత్రమునందునిచి, అందుండురసమును గ్రహించెదరు. రసమును దెచ్చువిధంబిటులని తెలియవలయును.

## రసజాతివర్ణంబులు

రసో విప్రస్సితో రక్తః క్షత్రియః పీతరుక్చవిట్,
శూద్రః కృష్ణ ఇతి ప్రోక్తో వర్ణభేదాచ్చతుర్విధః. 212

బ్రాహ్మణః కల్ప్యతే కల్పే గుటికాయాం చ బాహుజః,
ధాతువాదే తథా వైశ్యశ్శూద్రశ్చేతరకర్మణి. 213
అంతస్సునీలో బహిరుజ్జ్వలాంగో మధ్యాహ్నసూర్యప్రతిమప్రకాశః,
శస్తోథ ధూమ్రః పరిపాండురశ్చ చిత్రస్తు యోజ్యో రసకర్మసిద్ధ్యై.

తా. పాదరసము వర్ణభేదంబులచే నాలుగువిధంబులు. అందు తెల్లగనుండునది బ్రాహ్మణజాతియనియు, ఎఱ్ఱగనుండునది క్షత్రియజాతియనియు, పచ్చగనుండునది వైశ్యజాతియనియు, నల్లగనుండునది శూద్రజాతియనియు జెప్పఁబడును. అందు బ్రాహ్మణజాతి * కల్పవిషయమునందును, క్షత్రియజాతి గుటికలయందును, వైశ్యజాతి ధాతువాదమునందును, శూద్రజాతి యితరకర్మలయందును నుపయోగించును. మరియు లోన నీలవర్ణము, వెలుపలచాకచక్యముగలదై, మధ్యాహ్నర్కునితో తుల్యమగుకాంతిగలదై, ధూమ్రవర్ణము, తెలుపువర్ణము, చిత్రవర్ణముగలదై, ప్రశస్తముగనుండు రసమును సర్వౌషధములయం దుపయోగించుకొనవలయును.

## రస మాహాత్మ్యము

అథాతస్సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం,
ఆయుర్వేదోపదేశేస్మిన్ రసశుద్ధిర్నిగద్యతే. 215
శుష్కేంధనమహారాశిం యద్వద్దహతి పావకః,
తద్వద్ధాతుగతాన్సూతస్సూతదోషాంత్రయోదశ. 216
దర్శనాద్రసరాజస్య బ్రహ్మహత్యా వ్యపోహతి,
స్పర్శనాన్నాశయేద్దేవి గోహత్యాన్నాత్ర సంశయః. 217
కింపునర్భక్షణాద్దేవి ప్రాప్యతే పరమం పదమ్,
దోషహీనో రసో బ్రహ్మ మూర్ఛితస్తు జనార్దనః. 218
మారితో రుద్రరూపస్స్యాద్బద్ధస్సాక్షాన్మహేశ్వరః,
వేధకో దేహలోహాభ్యాం సూతస్సాక్షాత్సదాశివః, 219

తా. ఇక నాయుర్వేదమునజెప్పబడిన ప్రకారము రసశుద్ధిని వచించెదను. ఎండినకట్టెలయొక్క సమూహమును అగ్నిహోత్రుడు దహింపజేయుతెఱంగున ధాతుగతదోషములను పాదరసముదహింపజేయును. ఐనను రసమునందు ౧౩ దోషంబులు గలవు. మరియు రసమునుజూచుటవలన బ్రహ్మహత్యాజనితదోషంబులు, నిస్సంశయముగ నివర్తించును. దానిసేవనవలన స్వర్గాదిపరమపదములుగలుగును. దోషరహితమైన రసము బ్రహ్మస్వరూపమనియు, మూర్ఛనుజెందింపబడిన రసము విష్ణుస్వరూప

* కల్పమనగా లోహవేధ.

మనియు, భస్మముజేయబడినరసము రుద్రస్వరూపమనియు, బంధింపబడినరసము మహేశ్వరస్వరూపమనియు, దేహలోహముల వేధించెడిరసము సదాశివస్వరూపమనియును తెలియవలయును.

శతాశ్వమేధేన కృతేన పుణ్యం గోకోటిభిస్స్వర్ణసహస్రదానాత్,
నృణాం భవేత్సూతకదర్శనేన యత్సర్వతీర్థస్య కృతాభిషేకాత్.

తా. ౧౦౦ అశ్వమేధయాగముల జేయుటచే నే పుణ్యములుగలుగుచున్నదో అదియును, కోటిగోదానము గంగాదిసర్వతీర్థస్నానము, సహస్రస్వర్ణదానము వీనిచే నేపుణ్యముగలుగుచున్నదో అదియును రసదర్శనమువలన నేకలుగును.

మృదః కోటిగుణం స్వర్ణం స్వర్ణాత్కోటిగుణోమణిః,
మణేః కోటిగుణో బాణో బాణాత్కోటిగుణోరసః. 221
రసాత్పరతరం లింగం న భూతన్న భవిష్యతి,

తా. మృత్తుతోచేయబడినలింగముకన్న స్వర్ణలింగము కోటిగుణాధిక్యముగలదనియు, నాస్వర్ణలింగముకన్న మణిలింగము కోటిగుణాధిక్యముగలదనియు, నామణిలింగముకన్న బాణలింగము కోటిగుణాధిక్యముగలదనియు, నాబాణలింగముకన్న రసలింగము కోటిగుణాధిక్యముగలదై సర్వోత్తమముగనుండునుగాన రసలింగముకన్న పరతరమగులింగమునుజూచియు, వినియునెరుంగము.

## రసనామములు

రసో రసేన్ద్రస్సూతశ్చ పారదో మిశ్రకస్తథా. 222
తదా ప్రభృతి కూపస్థం తద్రేతః పంచధా భవేత్,
పారదో రుద్రరేతశ్చ రసధాతుర్మహారసః. 223
రసేంద్రశ్చ పలస్సూతో రసలోహో రసోత్తమః,
సూతరాట్చపలోజైత్రశ్శివబీజం శివస్తథా. 224
అమృతం చ రసేంద్రశ్చ లోకేశో ధూర్తకః ప్రభుః,
రుద్రజో హరతేజశ్చ రసధాతురచింత్యజః. 225
ఖేచరశ్చామరః ప్రోక్తో దేహదో మృత్యునాశనః,
స్కందః స్కందాంశకః సూతో దేవో దివ్యరసస్తథా. 226
ప్రోక్తో రసాయనశ్రేష్ఠస్త్రయస్త్రింశద్రసాహ్వయాః,

తా. ఆకూపమునందుండు శివవీర్యము రసము, రసేంద్రము, సూతము, పారదము, మిశ్రకము ఇటుల నైదువిధంబులుగనుండును. మరియు పారద, రుద్రరేతః, రసధాతు, మహారసు, రసేంద్ర, చపల, సూత, రసలోహ, రసోత్తమ, సూత

రాజ, చపల, చైత్ర, శివబీజ, శివ, అమృత, రసేంద్ర, లోకేశ, ధూర్తక, ప్రభు, రుద్రజ, హారతేజ, రసధాతు, అచింత్యజ, ఖేచర, అమర, దేహద, మృత్యునాశన, స్కంద, స్కందాంశ, సూత, దేవ, దివ్యరస, రసాయనశ్రేష్ఠములను ముప్పది మూడు నామంబులచే విలసిల్లును.

పారదనిందవలనదోషము

బ్రహ్మజ్ఞానేన సంయుక్తో యః పాపీ రసనిందకః. 227
స యాతి నరకే ఘోరే జన్మకోటిశతైరపి,
ఆలాపం గాత్రసంస్పర్శం యః కుర్యాద్రసనిందకైః. 228
యాతి జన్మసహస్రాణి స భవేద్దుఃఖపీడితః,

తా. రసనిందజేయు పాపాత్ముడు బ్రహ్మజ్ఞానయుక్తుడైనను శతకోటిజన్మములవరకు ఘోరనరకమునను భవించును. మరియు నెవ్వడైననట్టిరసనిందకులతో నాలాపము స్పర్శ వీనిని జేసిన జన్మసహస్రములబొంది దుఃఖపీడితుడగును.

రసదోషాష్టకము

ఉడ్డీనం చాపి కౌటిల్యమనవర్తం చ సంకరం. 229
మండత్వపంగుకారిత్వం సమలత్వంగురుత్వకమ్,
సవిషత్వం చ సూతస్య చాష్టదోషాః ప్రకీర్తితాః. 230

తా. ఉడ్డీనదోషము, కౌటిల్యదోషము, అనవర్తదోషము, సంకరదోషము, మండత్వదోషము, పంగుదోషము, బరువుగనుండుటవలన మలదోషము, సవిషత్వదోషము అన నెనిమిదిదోషములు రసమునందుండును. (ఈదోషములుగల రసమును శుద్ధిచేయక నౌషధములలో బ్రయోగించినను లేక సేవించినను రోగములు జనించును.)

దోషాష్టకయుక్తపారదసేవనజనితరోగములు

ఉడ్డీనే శూలదోషస్స్యాత్కౌటిల్యే స్యాత్కపాలరుక్,
అనవర్తే భ్రమశ్చైవ సంకరే ధాతుసంకరః. 231
మండత్వే స్యాదసంతానో పంగుత్వే దాహకుష్ఠకృత్,
మలే జ్వరశ్చ మూర్ఛా చ విషత్వే చ క్షయో భవేత్. 232

తా. ఉడ్డీనదోషమువలన శూలయు, కౌటిల్యదోషమువలన కపాలరోగంబును, అనవర్తదోషమువలన భ్రమయు, సంకరదోషమువలన ధాతుసాంకర్యంబునుగలుగును. మండత్వ దోషమువలన సంతానము గలుగకుండుటయు, పంగుత్వదోషమువలన దాహము లేక కుష్ఠురోగము, మలదోషమువలన జ్వరము లేక మూర్ఛ, విషదోషమువలన శరీరక్షయము ఇవిగలుగును.

**ప్రకారాంతర రసదోషాష్టకము**

నాగో వంగో మలో వహ్నిశ్చాంచల్యం చ విషం గిరిః,
అసహ్యాగ్నిర్మహాదోషా నిషిద్ధాః పారదే స్థితాః. 233

తా. రసమునందు నాగ, వంగ, మల, వహ్ని, చాంచల్య, విష, గిరి, అసహ్యాగ్నులన నెనిమిదివిధములైన మహాదోషంబులుండును.

**రసదోషాష్టకజనితరోగములు**

జాడ్యం గండ స్తమో నాగాత్కుష్ఠం వంగాద్రజో మలాత్,
దాహో వహ్నేర్బీజనాశశ్చాంచల్యాన్మరణం విషాత్. 234
గిరేస్స్ఫోటోగ్నసహతా దోషాన్మోహోభిజాయతే,
విషం వహ్నిర్మలశ్చేతి దోషా ముఖ్యతమా స్త్రియః. 235
ఇమే మరణసంతాపమూర్ఛానాం హేతవః క్రమాత్,
యౌగికౌ నాగవంగౌ ద్వౌ తౌ జాడ్యాధ్మానకుష్ఠదా. 236

తా. రసమునందలి నాగదోషమువలన జాడ్యము, గండమాల, తామసము గలుగును. వంగదోషమువలన కుష్ఠువు మలదోషమువలన రజస్సును, అగ్నిదోషమువలన దాహమును, చాంచల్యదోషమువలన శుక్రనాశనమును, విషదోషమువలన మరణంబును, గిరిదోషమువలన శరీరమున పొక్కులును, అసహ్యాగ్నిదోషమువలన మోహమును గలుగును. ఈయెనిమిదివిధములైన దోషములలో విష, వహ్ని, మలములన మూడుదోషములు ముఖ్యంబులు. అట్లగుటచే నవి మరణము, సంతాపము, మూర్ఛ అనువానిని క్రమముగ గలుగజేయును. మరియు నాగవంగదోషములు సంయోగ జనితములైనవియగుటంజేసి జాడ్యాధ్మానకుష్ఠువులను గలుగజేయును.

**రససప్తకంచుకదోషములు**

నాగో వంగో మలాగ్నీ విషగిరిచపలాస్సప్తసూతస్య దోషాః,
నాగాద్గండాలిరోగం జనయతి బహుశః కుష్ఠమంగే చ వంగాత్. 237
జ్ఞాత్వాజ్ఞానంమలాత్స్యాన్మరణమపి విషాద్దాహమోహౌచవహ్నేః,
జాడ్యం శైలాచ్చ వీర్యచ్యుతిరపి చపలాత్పారదశ్శోధ్యతేతః. 238

తా. రసమునందు నాగ, వంగ, మల, అగ్ని, విష, గిరి, చపలములన సప్త కంచుకదోషములుగలవు. అందు నాగదోషమువలన గండమాలయు, వంగదోషము వలన కుష్ఠువు, మలదోషమువలన తెలిసియు తెలియకుండుట, విషదోషమువలన మరణము, అగ్నిదోషమువలన దాహమోహములు, గిరిదోషమువలన జాడ్యము, చపలదోషమువలన వీర్యనాశనము ఇవిగలుగును; కావున రసమునందలి సప్తకంచుక దోషములు నివర్తించుటకే దానిని శుద్ధిజేయవలయును.

మఱియు రస సప్తకంచుకదోషజనితరోగములు

నాగం వంగం మలం వహ్నిశ్చాంచల్యం చ గిరిర్విషం,
పారదే కంచుకాస్సప్త సంతి నైసర్గికా యతః. 239
ఏతే తు సప్తదోషాశ్చ కుర్వంతి ప్రాణసంకటమ్,
నాగేన జాయతే గండం కుష్ఠం వంగేన జాయతే. 240
విషదోషాద్భవేన్మృత్యుర్గిరికాజడతాపిచ,
చాంచల్యాద్ధాన్యతే వీర్యం తస్మాద్దోషవివర్జితః. 241
సూతః ప్రయోజ్యోయోగేషురసతన్త్రవిశారదైః,

తా. పాదరసమున నాగము, వంగము, మలము, అగ్ని, చాంచల్యము, గిరి, విషజములన 7 సప్తకంచుకదోషంబులు స్వాభావికముగ గలిగియుండును. కావున నట్టిసప్తవిధదోషంబులుగల రసమువలన ప్రాణసంకటముగలుగును. మరియు నాగదోషమువలన గండమాలయు, వంగదోషమువలన కుష్ఠువు, విషదోషమువలన మరణము, గిరిదోషమువలన జాడ్యము, చాంచల్యదోషమువలన వీర్యనష్టము ఇవి గలుగును. కావున నట్టిదోషంబులుగల యశుద్ధమగురసమును వర్జించి శోధించి యోగములలో జేర్చవలెను.

శుద్ధాఽశుద్ధరసగుణములు

దోషహీనో యదా సూతస్తదా మృత్యుజరాపహః. 242
సాక్షాదమృతమప్యేవ దోషయుక్తో రసో విషమ్,

తా. శుద్ధిచే దోషరహితంబైనరసము మృత్యువును, ముదిమినిహరింపజేయుటయేగాక, ప్రత్యక్షముగనమృతతుల్యంబైయుండును. దోషయుక్తరసము విషముతో సమానంబైయుండును.

తస్మాద్దోషనివృత్త్యర్థం రసశుద్ధిర్విధీయతే. 243

తా. కావున దోషమునివర్తించుటకై రసమునకు శుద్ధివిధింపబడుచున్నయది.

రసశుద్ధిక్రమము

రసో గ్రాహ్యస్సునక్షత్రే పలానాం శతసమ్మితః,
పంచాశత్పంచవింశద్వాదశపంచైకమేవ వా. 244
పలాదూనో న కర్తవ్యో రససంస్కారఉత్తమైః,

తా. రసమును మంచినక్షత్రమున ౧౦౦ పలములుగాని, ౫౦ పలములుగాని, ౨౫ పలములుగాని, ౧౨ పలములుగాని, ౫ పలములుగాని ౧ పలముగాని గ్రహించి సంస్కారముజేయువలయును. ఐన నొకపలమునకు తక్కువగ జేయంజనదు.

రససంస్కారమంత్రము

అఘోర ఇతి మంత్రేణ రససంస్కారపూజనమ్. 245
అమంత్రితపదార్థానాం తేజో నిఘ్నంతి భైరవాః,

తా. * అఘోరమంత్రముచేరసమునుబూజించి సంస్కారమును చేయవల యును. అమంత్రితపదార్థములయందలి తేజస్సును భైరవులపహరింతురు.

రసదోషాష్టకనివర్తకోపాయము

అథాతస్సంప్రవక్ష్యామి దోషాష్టకనివారణమ్. 246
ఇష్టకారజనీచూర్ణైష్షోడశాంశై రసస్యచ,
మర్దయేత్తప్తఖల్వేతజ్జంబీరోత్థైర్ద్రవైర్దినమ్. 247
కాంజికే క్షాళయేత్సూతం నాగదోషం విముంచతి,
విశాలాం కోలచూర్ణేన వంగదోషో వినశ్యతి. 248
రాజవృక్షో మలం హంతి చిత్రకో వహ్నిదూషణమ్,
చాంచల్యం కృష్ణధత్తూరస్త్రిఫలావిషనాశనమ్. 249
కటుత్రయం గిరిం హంతి హ్యసహ్యాగ్నిం త్రికంటకః,

తా. ఇక రసమునందలి అష్టదోషనివర్తకోపాయముల వచించెదను. రసము నకు పదియారవభాగము ఇటికపొడి, పసపుచూర్ణము వీనినిజేర్చి నిమ్మపండ్లరసముతో నొకదినము, తప్తఖల్వమునమర్దించి, కలితోగడిగిన రసమునందలి నాగదోషము నివర్తించును. రసమునకు పదియారవభాగము పాపరవేరు, ఊడుగవేరు వీనిచెక్కల చూర్ణమునుచేర్చి, నిమ్మపండ్లరసముబోసి, ఇగిరిపోడియగువరకుమర్దించి, కలితోగడిగిన రసమునందలి వంగదోషమునివర్తించును. రేలవేరుచెక్క, నిమ్మపండ్లరసము వీనితో మర్దించి కలితోగడిగిన రసమునందలిమలదోషము నివర్తించును. చిత్రమూలపు చెక్కచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితోమర్దించి, కలితోగడిగిన అగ్నిదోషము నివర్తించును. నల్లఉమ్మెత్తవేరుచెక్క, నిమ్మపండ్లరసము వీనితోమర్దించి, కలితోగడిగిన చాంచల్యదోషము నివర్తించును. త్రిఫలచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితోమర్దించి, కలితోగడిగిన, విషదోషమునివర్తించును. త్రికటుకచూర్ణము, నిమ్మపండ్లరసము వీనితో మర్దించి, కలితోగడిగిన గిరిదోషము నివర్తించును. పల్లేరువేళ్లచూర్ణము, నిమ్మపండ్ల రసము వీనితో రసమునుమర్దించి, కలితోగడిగిన అసహ్యాగ్నిదోషము నివర్తించును.

---

* "అఘోరేభ్యోஉథఘోరేభ్యోఘోరఘోరతరేభ్యః । సర్వేభ్యస్సర్వశర్వేభ్యోనమస్తే అస్తురుద్రరూపేభ్యః" అనునది అఘోరమంత్రము.

## తప్తఖల్వలక్షణము

ఖల్వే లోహమయే వాథ పాషాణోత్థేప్యథాపివా. 250
అజాశకృత్తుషాగ్నిశ్చ భూగర్భే త్రితయం క్షిపేత్,
తస్యోపరిస్థితం ఖల్వం తప్త ఖల్వమితి స్మృతమ్. 251

తా. ఇనుముతోగాని లేక నల్లజనపరాతితోగాని ఖల్వమునుజేయించి ఏకాంతగృహమున గొయ్యినిత్రొవ్వి, అందు మేకపెంటికలు, ఊక, అగ్ని వీనిని వైచి సెగతగులునటుల దానిపైఖల్వమునునుంచుటయే తప్తఖల్వమనదును.

## రసగతసర్వదోషనివర్తకోపాయము

ప్రతిదోషం కలాంశేన తత్తచ్చూర్ణం సకన్యకమ్,
సువస్త్రగాలితం ఖల్వే సూతే క్షిప్త్వా యథాక్రమమ్. 252
ప్రత్యేకం ప్రత్యహం యత్నాత్సప్తరాత్రం విమర్దయేత్,
ఉద్ధృత్య చారనాళేన మృద్భాండే క్షాళయేత్సుధీః. 253
సర్వదోషవినిర్ముక్తస్సప్తకంచుకవర్జితః,
జాయతే శుద్ధసూతోఽయం యోజయేద్వైద్యకర్మణి. 254

తా, రసస ప్తకంచుకదోషనివారణార్థమై పైజెప్పబడిన ద్రవ్యములలో ప్రతి దానియొక్క 16వ పాలు చూర్ణమును కలబందనుకలిపి ఒక్కొకదినముచొప్పున 3 దినములు నిమ్మపండ్లరసములో రసమునుమర్దించి, మట్టిపాత్రలోనునుంచి, కలితో కడిగి ఆరనిచ్చి, పిదప మంచివస్త్రములోవైచి, ఖల్వములో ప్రత్యేక ప్రత్యేకముగ 3 మార్లు వడియగట్టవలయును. ఇటులజేసిన రసమునందలి సర్వదోషములు సప్త కంచుకదోషములు ఇవి నివర్తించి రసము శుద్ధమగును. అట్టిదానిని ఔషధము లలో బ్రయోగించవలయును.

## రసాష్టాదశసంస్కారవివరణము

స్వేదనం మర్దనం మూర్ఛోత్థాపనం పాతనం త్రిధా,
బోధనం నియమశ్చైవ దీపనం చానువాసనమ్. 255
మారణం జారణం చైవ సారణం ప్రతిసారణం,
క్రామణం వేధనం చైవ దేహే యోగశ్చ శస్యతే. 256

తా. స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థాపనము, అధఃపాతనము, తిర్య క్పాతనము, ఊర్ధ్వపాతనము, బోధనము, నియమనము, దీపనము, అనువాసనము, మారణము, జారణము, సారణము, ప్రతిసారణము, క్రామణము, వేధనము శరీర యోగము, అనునవి రసాష్టాదశసంస్కారములు.

స్వేదనవిధి

త్ర్యూషణం లవణం రాజీ రజనీ త్రిఫలార్ద్రికమ్,
మహాబలా నాగబలా మేఘనాదః పునర్నవా. 257
మేషశృంగీ చిత్రకం చ నవసారం సమం సమమ్,
రసస్య షోడశాంశేన సర్వం యుంజ్యాత్పృథక్పృథక్. 258
ఏతత్సమస్తం వ్యస్తం వా పూర్వామ్లైశ్చైవ పేషయేత్,
లింపేదనేన కల్కేన వస్త్రేనాంగుళమాత్రకమ్. 259
తన్మధ్యే నిక్షిపేత్సూతం బధ్వాతత్ర దినం పచేత్,
డోలాయంత్రే మ్లసంయుక్తే జాయతే స్వేదితో రసః. 260

తా. త్రికటుకములు, సైంధవలవణము, ఆవాలు, పసపు, త్రిఫలములు, అల్లము, పెద్దముత్తవపులగ, నాగముత్తవపులగ, చిట్టిమూర, తెల్లగలిజేరు, ఒద్ది, చిత్రమూలము నవాసాగరము వీనిలో ప్రతిద్రవ్యమును గాని అందు దొరికినవానినిగాని, రసము నకు ౧౬ వ భాగమును గ్రహించి, కలితోనూరి వస్త్రముపై అంగుళప్రమాణము లేపనముజేసి, దానిమధ్యమున పాదరసమునుబోసి, వస్త్రముచేమూటకట్టి, దానిని డోలాయంత్రమునదగిలించి, కలితో ౧ దినమువండుటయే, స్వేదనమనబడును.

మర్దనవిధి

భిషగ్వామర్దయేచ్చూర్ణైరేభిర్మిళిత్వా షోడశాంశతః,
సూతస్య గాలితైర్వస్త్రే వక్ష్యమాణద్రవాదిభిః. 261
గృహధూమేష్టికాచూర్ణం తథా దధిగుడాన్వితమ్,
లవణాసురిసంయుక్తం క్షిప్త్వా సూతం విమర్దయేత్. 262
జీర్ణాభ్రకం తథా బీజం జీర్ణసూతం తథైవ చ,
నైర్మల్యార్థం హిసూతస్యఖల్వే ధృత్వాతు మర్దయేత్. 263
గృహ్ణాతి నిర్మలో రాగాన్ గ్రాసేగ్రాసే విమర్దితః,
మర్దనాఖ్యం హియత్కర్మ తత్సూతగుణకృద్భవేత్. 264

తా. కరుధూపము, ఇటుకచూర్ణము, పెరుగు, బెల్లము, ఉప్పు, ఆవాలు, వీనిని చూర్ణించి వస్త్రగాలితముచేసి ప్రత్యేకము, రసమునకు, పదియారవభాగము చేర్చి, ఆరసాలముమొదలగు ద్రవములువైచి మర్దించిన రసము నిర్మలమగును. మరియు జీర్ణాభ్రికమును, జీర్ణసూతబీజమును రసనైర్మల్యముకొఱకు పాదరసములోవైచి ఖల్వ మున మర్దించిన ప్రతిలోహమును గ్రసించుటలో నధికబలము కలుగును.

గృహకన్యా మలం హంతి త్రిఫలా వహ్నినాశినీ,
చిత్రమూలం విషం హంతి తస్మాత్సంచ ప్రయత్నతః. 265
మిశ్రితం మర్దయేత్సూతం స ప్రత్యేకేణ మూర్ఛయేత్,
ఇత్థం సంమూర్ఛితస్సూతో దోషశూన్యః ప్రజాయతే. 266

తా. కలుబంద, పాదరసమునందలి మలదోషమును, త్రిఫలములు, వహ్ని దోషములను, చిత్రమూలము, విషదోషమును హరింపఁజేయును. కావున మిశ్రిత పాదరసమును, కలుబంద, త్రిఫలములు, చిత్రమూలము పిసిరసములతో ప్రత్యేకము యేకేసిమార్లు మర్దించిన రసము మూర్ఛఁజెందును. ఇటుల మూర్ఛజెందిన రసము దోషరహితముగనుండును.

ఉత్థాపనవిధి

జలైస్స్వేదారనాళైర్వా క్షాళనాదుత్థితో భవేత్,
అథవా పాతనాయంత్రే పాతనాదుత్థితో భవేత్. 267
ఉత్థితః కాంజికక్వాథైః క్షాళనీయస్తతః పరమ్,

తా. పాదరసమును, ఉష్ణోదకముతోగాని, ఉష్ణముగనుండు కలితోగాని, కడిగిదీసికొనిన, ఉత్థితంబగు లేక ఊర్ధ్వపాతనాయంత్రమునందును, ఉత్థితంబగును. ఉత్థాపనానంతరము రసము నుష్ణముగనుండు కలితో కడుగవలయును.

ఊర్ధ్వపాతన విధి

భాగాస్త్రయోరసస్యార్క చూర్ణమంశాంశేనింబుకైః. 268
తతస్సంమర్దయేత్తావద్యావదాయాతి పిండతామ్,
తత్పిండం తలభాండస్థమూర్ధ్వభాండే జలం క్షిపేత్. 269
కృత్వాలంవాలంకే నాతిదత్వావార్ధ్రిం హి మోదకమ్,
సంగోప్య చాగ్నిం మధ్యస్థం చతుర్యామం ప్రబోధయేత్. 270
యుక్తోర్ధ్వభాండసంలగ్నం గృహ్ణీయాత్పారదం తతః,
ఊర్ధ్వపాతనమిత్యుక్తం భిషగ్భిస్సూతశోధనే. 271
ససూతభాండవివరమన్యద్గలతి భాండకే,
తథా సంధిర్ద్వయోః కార్యా పాతనాఖ్యేతుయంత్రకే. 272
యంత్రప్రమాణం వదనాద్గురోర్జ్ఞేయం విచక్షణః,

తా. పాదరసము ౩ భాగములు, జిల్లేడుపట్టచూర్ణము ౧ భాగము వంతున గ్రహించి, అందు కొంచము నిమ్మపండ్లరసముబోసి, గట్టిపడువరకు మర్దించి, దానినథ

స్థితభాండమునందునిచి, పైనిభా ... గ్రోరగిలింటచే డమరుకాయంత్రమనబరగెను. దానిని పొయిమీదనునిచి, పై ... నకు మీదను మినపపిండి మొదలగు వానితో కుదురుచేసి యందు శీతోదకముసు బోయుచు ౩ ఝాములు మధ్యమాగ్నితోవండి, పైకుండనంటియుండు రసమును యుక్తితోగ్రహించవలయును. రసశోధనవిషయమున జేయబడు నీక్రియనే ఊర్ధ్వపాతనమనియెదరు. ఊర్ధ్వపాతనాధఃస్థితభాండ ముఖముతో పైభాండముయొక్క ముఖమునుజేర్చి బాగుగ సంధిలేపనము జేయవలయును. యంత్రప్రమాణమును గురువువలన దెలిసికొనవలయును.

## అధఃపాతనవిధి

త్రిఫలా శిగ్రుశిఖిభిర్లవణాసురిసంయుతైః. 273
నష్టపిష్టం రసం కృత్వా లేపయేదూర్ధ్వభాండకే,
ఊర్ధ్వభాండోదరం లిప్త్వా చాధోభాండే జలం క్షిపేత్. 274
సంధిలేపం ద్వయోః కృత్వా తద్యంత్రం భువి పూరయేత్,
ఉపరిష్టాత్పుటే దత్తే జలే పతతి పారదః. 275
అధఃపాతనమిత్యుక్తం సిద్ధాద్యైస్సూతకర్మణి,

తా. త్రిఫలములు, మునగ, చిత్రమూలము, ఉప్పు, ఆవాలు వీనితో రసమును జేర్చి, రసము మిళితమగువరకు ఖల్వమునందు మర్దించి, డమరుకయంత్రముయొక్క పైపాత్రలోభాగమున దానినిబూసి, క్రిందిపాత్రయందుదకముబోసి, ఆ రెండు పాత్రల జేర్చి, సంధులకు బాగుగ చీలమన్నుయిచ్చి యెండించి, యాపాత్రను భూమిలో పూడ్చి, దానిపై పుటంబిడవలయును. ఇటులచేసిన రసము జలమందు క్రిందిపాత్ర యందుబడును. దీనిని, సిద్ధాదులు రసకర్మతలయందు, అధఃపాతనమునివచించెదరు.

## తిర్యక్పాతనము

ఘటే రసం వినిక్షిప్య సజలం ఘటమన్యకమ్, 276
తిర్యఙ్ముఖం ద్వయోః కృత్వా సమ్ముఖం రోధయేత్సుధీః,
తత్రైవ చుల్ల్యాం సంస్థాప్య యత్నతస్తం తతో భిషక్. 277
రసాదోజ్వాలయేద్వహ్నిం యావత్సూతో జలం విశేత్,
తిర్యక్పాతనమిత్యుక్తం సిద్ధైశ్చార్జునాదిభిః. 278

మిళితౌ నాగవంగౌ చ రసే విక్రయహేతుతః,
గం పిప్పళ్ళ ... స్యాత్కృత్రిమదోషస్తు తన్ముక్తిః పాతనత్రయాత్. 279
వ్యాపించునో సంస్కృతసూతః పాతనావిధియత్నతః,

సర్వదోషవినిర్ముక్తో జాయతే నాత్ర సంశయః. 280

తా. యంత్రమునకు తగినటుల, ఒకింతనిడివిగనుండు రెండుకుండలను గ్రహించి, అందొకదానిలో పాదరసమును మరయొకదానిలో, ఉదకమునువైచి, అడ్డముగనునిచి వానిని చేర్చి, సంధులయందు చీలమన్నుయిచ్చి, రసముబోసిన కుండను పాయిమీదనడ్డముగ యుక్తితోనునిచి పాకముజేసిన రసము నీటిలో ప్రవేశించును, దీని నే నాగార్జునుడు మొదలగు సిద్ధులు, తిర్యక్పాతనమని వచించెదరు. ఇటుల యుక్తిచేమూడువిధములగు పాతనములజేయుటవలన విక్రయోగ్యముచేరిన రసము నందలి, నాగ, వంగదోషములవలని క్రిమిదోషములు నివర్తించును. మరియు నీపాతన విధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించును.

## బోధనము

ఏవం కదర్థితస్సూతః షండత్వమధిగచ్ఛతి,
తన్ముక్తయేస్య క్రియతే బోధనం కథ్యతే హి తత్. 281

తా. పైప్రకారము శోధింపబడిన ప్పుడలయిక జెందిన పాదరసమునందు షండత్వదోషముండును. దాని నివర్తించుటకై బోధనక్రియను వచించెను.

## బోధనక్రియ

కదర్థనేనైవ నపుంసకత్వమేవం భవేదస్య రసస్య పశ్చాత్,
వీర్యప్రకర్షాయ చ భూర్జపత్రే స్వేద్యో జలే సైంధవచూర్ణగర్భే. 282

తా. రసమునకు పైజెప్పబడిన సంస్కారమువలన షండత్వదోషము గలుగును. తన్నివారణార్థమును, రససామర్థ్యము వృద్ధిజెందుటకును, రసమును భూర్జరపత్రము నగట్టి, ఉదకము, సైంధవలవణము వీనితో స్వేదనము జేయవలయును.

## నియమనము

సర్పాక్షీచించకావంధ్యాభృంగాద్బకనకాంబుభిః,
దినం సంస్వేదితస్సూతో నియమాత్స్థిరతాం వ్రజేత్. 283

తా. పాదరసమును సర్పాక్షి, చింత, గొడ్డుకాకర, గుంటగలగర, తుంగ ముస్తలు, ఉమ్మెత్త వీనిరసములతోగాని, లేక కషాయములతోగాని, ౧ దినమువండిన, చాపల్యమువీడిస్థిరముగ నిలచును.

## సందీపనము

కాసీసం పంచలవణం రాజికా మరిచాని చ,
ద్విశిగ్రుబీజమేకత్ర టంకణేన సమన్వితమ్. 284
ఆలోడ్యకాంజికే దోలాయన్త్రే పాచ్యో దినైస్త్రిభిః,

మెత్తు వీనిని ఖల్వమునందునిచి ఖజ్జలిచేసి, దానిని గాజుకుప్పెయందునిచి, కుప్పెకు చీలమన్నుయిచ్చి, దానిముఖమును తెల్లమన్నుతో మూసి, వాలుకాయంత్రమునందునిచి, క్రమాగ్నితో 3 దినములు పచనజేసి, స్వాంగశీతలమున దీసిన దాసానిపువ్వువంటి కాంతిగల భస్మంబగును. దీనిని సకలరోగములయందుపయోగించదగును. మరియు అను పానవిశేషముచే ౨ వల్లములయెత్తు పుచ్చుకొనిన మరణము, ముసలితనము, రోగ సమూహము వీనిని నివర్తింపజేయుటయేగాక శరీరదార్ఢ్యము, శుక్రవృద్ధి, శతా యుస్సు వీనిని గలుగజేయును.

రససిందూరానుపానములు

వాతే క్షౌద్రం సపిప్పల్యపిచకఫగుజిస్త్ర్యూషణం సాగ్నిచూర్ణమ్. 328
పిత్తే సైలాసితాస్యాద్ర్వణమపహతి గదే నాగచార్ద్రామృతాంబు,
పుష్టౌ సాల్పత్రియామాహారసయనఫలా, శాల్మలీ పుష్పవృంతమ్.
కిం వా కాంతాలలాటాభరణమపిరసస్యానుపానంప్రదేయమ్,

తా. పిప్పళ్లు, తేనె వీనిచే వాతము, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్ర మూలము వీనిచే కఫము, ఏలకులు, శర్కర వీనిచే పిత్తము, మరియు శొంఠి, తిప్ప తీగరసము వీనితో సేవించిన స్రవించుగొప్పవ్రణము ఇవి నివర్తించుటయేగాక పసుపు, తెంకాయనీరు, బూరుగపువ్వులతోడిమెలు లేక కుంకుమపువ్వు వీనితో పుచ్చుకొనిన పుష్టినిగలుగజేయును.

పాదరసభస్మఅనుపానములు

రసేంద్రం సేవయేన్నిత్యం చతుర్గుంజాప్రమాణతః. 330
ఆజ్యేన మరిచైస్సార్ధం సేవయేచ్చ రసేశ్వరమ్,
దశభిః పిప్పలీభిర్వా సేవయేచ్చ రసేశ్వరమ్, 331
యథా జలగతం తైలం తత్క్షణాదేవ సర్పతి,
ఏవమౌషధమంగేషు ప్రసర్పత్యనుపానతః. 332
పిత్తే శర్కరయామలేన సహసా వాతే చ కృష్ణాయుతమ్,
దద్యాచ్ఛ్లేష్మణి శృంగబేరసహితం జంబీరనీరైర్జ్వరే. 333
రక్తోత్థే మధునా ప్రవాహరుధిరే స్యాన్మేఘనాదోదకైః,
దద్యాచ్ఛాథ కృతాతిసారవికృతౌ రోగారిసంజ్ఞారసైః. 334

తా. పాదరసభస్మము ४ గుంజములయెత్తు, నెయ్యి, మిరియాలపొడి లేక గం పిప్పళ్ళచూర్ణము వీనితో సేవన్నచేసిన తత్క్షణమునందే నీళ్ళపై తైలబిందువులెట్టుల వ్యాపించునో అట్టుల అనుపానభస్మముచే శరీరమునందు ఔషధముప్రసరించును,

మరియు ఉశీరివొలుపుచూర్ణము, చక్కెర వీనితో పిత్తము, పిప్పళ్లతో వాయువు, అల్లపురసముతో శ్లేష్మము, నిమ్మపండ్లరసముతో జ్వరము, తేనెతో రక్తవికారము, చిత్తివేరురసముతో రుధిరస్రావము, ప్రవాహిక, రేలవేరుతో అతిసారము ఇవి నివర్తించును.

పిప్పలీమరిచైశ్శుంఠీభార్గీభ్యాంమధునా సహ,
కాసశ్వాసప్రశమనో శూలస్య చ వినాశనః. 335
హరిద్రాశర్కరాయక్తోరుధిరస్య వికారనుత్,
త్ర్యూషణత్రిఫలావాసైః కామలాపాండురోగజిత్. 336
శిలాజతుభిరేలాభిస్సితోపలసమన్వితః,
మూత్రకృచ్ఛ్రేప్రశస్తోయం మితినాగార్జునోదితమ్. 337
లవంగం కుఙ్కుమం పత్రీ హింగులం చాకలంకరా,
పిప్పలీ విజయా చైవ సమానీమాని కారయేత్. 338
కర్పూరాదహిఫేనాచ్చనాగాద్భాగార్ధకం క్షిపేత్,
సర్వమేకత్ర సంమర్ద్య ధాతువృద్ధ్యా ప్రదాపయేత్. 339
సౌవర్చలం లవంగం చ భూనింబం చ హరీతకీ,
తస్యానుపానయోగేన సర్వజ్వరవినాశనః. 340
తథా రేకకరః ప్రోక్తః సౌవర్చలఫలత్రికైః,
లవంగం కుఙ్కుమం చైవ దరదేన చ సంయుతం. 341
తాంబూలేన సమం భక్ష్యం ధాతువృద్ధికరః పరమ్,
విదారీచూర్ణయోగేన ధాతువృద్ధికరో మతః. 342
విజయాదీప్యసంయుక్తో వమనస్య వికారనుత్,
సౌవర్చలం హరిద్రా చ విజయా దీప్యకం తథా. 343
అనేనోదరపీడాం చ సద్యోజాతాం వినాశయేత్,
చతుర్వల్లం పలాశస్య బీజం చ ద్విగుణం గుడం. 344
అస్యానుపానయోగేన కృమిదోషవినాశనః,
అహిఫేనం లవంగం చ దరదం విజయా తథా. 345
అస్యానుపానతస్సద్యస్సర్వాతీసారనాశనః,
సౌవర్చలేన దీప్యేన అగ్నిమాంద్యహరఃపరమ్. 346
క్షుద్బోధజనకశ్చైవ సిద్ధనాగార్జునోదితః,
గుడూచీసత్వయోగేన దేహపుష్టికరః స్మృతః. 347

తా. పాదరసభస్మమును పిప్పళ్లు, మిరియాలు, శొంఠి, భారంగి వీనిచూర్ణము, తేనె వీనితోఁ పుచ్చుకొనిన కాస, శ్వాస, శూల ఇవి నివర్తించును. పసపు, చక్కెర వీనితోఁ పుచ్చుకొనిన రక్తవికారము, మరియు త్రికటుకములు, త్రిఫలములు, అడ్డసరము వీనిచూర్ణముతోఁ సేవించిన కామిలా, పాండువు ఇవి నివర్తించును. శిలాజితు, ఏలకులు, కలకండ వీనిచూర్ణముతోఁ పుచ్చుకొనిన మూత్రకృఛ్రము నివర్తించును. లవంగములు, కుంకుమపువ్వు, జాపత్రి, ఇంగిలీకము, అక్కలకఱ్ఱ, పిప్పళ్లు, బంగి ఆకు వీనితోఁ పుచ్చుకొనిన ధాతువృద్ధియగును. మరియు సైంధవలవణము, లవంగము, సీమనేలవేము, కరక వీనిచూర్ణముతోఁ పుచ్చుకొనిన సర్వజ్వరములు నివర్తించును. సైంధవలవణము, త్రిఫలములు, లవంగములు, కుంకుమపువ్వు, ఇంగిలీకము వీనిచూర్ణముతోఁ సేవించిన రేచనముకలుగును. మరియు తమలపాకులు లేక నేలగుమ్మడు వీనితోఁ పుచ్చుకొనిన ధాతువృద్ధియగును. బంగి, ఓమము వీనితోఁ సేవించిన వాంతులునిలుచును. మరియు సైంధవలవణము, పసుపు, బంగి, ఓమము వీనిచూర్ణముతోఁ ఉదరరోగము నివర్తించును. మోదుగవిత్తులు, నాలుగువల్లములు, వీనికి రెండింతలు బెల్లముచేర్చి పుచ్చుకొనిన క్రిములునశించును. మరియు నల్లమందు, లవంగములు, ఇంగిలీకము, బంగి ఆకులు వీనితోఁ పుచ్చుకొనిన సర్వాతిసారములుతొలగును మరియు సైంధవలవణము, ఓమము వీనితోఁ అగ్నిమాంద్యము హరించును. తిప్పసత్తుతోఁ పుచ్చుకొనిన దేహపుష్టి కలుగును.

### పారదభస్మగుణము

దేహస్య శుద్ధిం కురుతే రసో మృతో నానాగదానాం హరణే సమర్థః,
కరోతిపుష్టింహరతే చ మృత్యుం శతాయుషం చైవ కరోతి మానవమ్.
పారదస్సకలరోగపారదో రాజయక్ష్మదవవహ్నివారిదః,
సర్వరోగమపహన్తి తత్క్షణాన్నాగవల్లిదలయోగభక్షణాత్. 349

తా. పాదరసభస్మము దేహశుద్ధికరముగను, అనేకవ్యాధినాశనకరముగను, పుష్టికరముగను, మృత్యునాశనకరముగను, శతాయుష్యకరముగను, సకలరోగముల నివర్తింపజేయునదిగను, రాజయక్ష్మ నాశకరముగనుండును. ఈభస్మమును తమలపాకులతోఁ చేర్చి పుచ్చుకొనిన సర్వరోగములు తత్క్షణమునందే నివర్తించును.

### అశుద్ధపారదభస్మదోషము

సంస్కారహీనం ఖలు సూతరాజం యస్సేవతే తస్యభవంతి బాధాః,
దేహస్య నాశో భవతీహనూనంకుష్ఠాదిదోషాఃజనయేత్సనృణామ్.

తా. అశుద్ధపాదరసమును సేవించిన సకలబాధలు, దేహనాశము, కుష్ఠాది దోషములు వీనిని గలుగజేయును.

### పారదభస్మభక్షణకాలము

ప్రభాతే భక్షయేత్సూతం పథ్యం యామద్వయేగతే,
నోల్లంఘయేత్త్రియామం తు మధ్యాహ్నే నైవ భోజయేత్. 351
తాంబూలాన్తర్గతే సూతే విడ్బంధో నైవ జాయతే,
సకణామృతయాభుక్తో మలబంధం హరేన్నిశి. 352

తా. పారదభస్మమును ప్రాతఃకాలమునందు భక్షించవలయును. రెండుయామములుగడచిన పిదప పథ్యమును భుజించవలయును. మూడుయామములు గడవజనదు. మధ్యాహ్నమున భోజనముచేయకూడదు. ఈభస్మమును తమలపాకులతో పుచ్చుకొనిన మలబద్ధముజనించదు. మరియు తిప్పతీగె, పిప్పళ్లు వీనితో రాత్రియందు సేవించిన మలబంధము నివర్తించును.

### రసాజీర్ణమూలకోపద్రవములు

క్షారం తీక్ష్ణం భూరిచామ్లం చ వర్జ్యం సూతో జీర్ణో జాయతే తేనయస్మాత్,
సూతే జీర్ణే నాభిదేశేషు శూలం దాహో మాంద్యంజాడ్యమాలస్య నిద్రే.
సత్వత్యాగో జాయతే బుద్ధినాశ స్తస్యాజీర్ణే కన్యకాంగవ్యమాజ్యమ్,
కందం చామ్లం మృద్వికాం సేవయేద్వా సూతేజీర్ణేసర్వదోషోపశాంతిః.

తా. రససేవనమునుజేసినవారు ఉప్పు, తీక్ష్ణకరపదార్థములు, పులుసు వీనిని అధికముగ సేవింపజనదు. అధికముగ సేవించినరసము జీర్ణముగాక బొడ్డుక్రింద శూలించుట, శరీరమునంగుమంట, అగ్నిమాంద్యము, జాడ్యము, ఆలస్యము, నిదుర, సత్వక్షయము, బుద్ధినాశనము మొదలగు నుపద్రవములుగలుగును కావున, రసము జీర్ణించుటకు కలుబందరసముతో ఆవునెయ్యిగలిపిగాని లేక పుల్లనికందములగాని లేక దీపద్రాక్షనుగాని సేవింపుచుండిన రసాజీర్ణమువలన గలిగిన సర్వదోషములు నివర్తించును.

### శిరోగతరసదోషనివర్తకోపాయము

కార్పాసదళనిర్యాసైస్తండులీయరసేన వా,
అభ్రకం జీరకైర్యుక్తం లోహచూర్ణం సశర్కరమ్. 355
రసవేధవినాశార్థం కుర్యాద్భైషజ్యముత్తమమ్,

తా. పైడిప్రత్తి ఆకురసములోగాని, చిర్రివేళ్లరసములోగాని అభ్రికసిందూరము, జీలకర్ర, పంచదార వీనినిగలిపిసేవించిన రసవేధలు నివర్తించును. మరియు పైడిప్రత్తిఆకురసములోగాని, చిర్రివేళ్లరసములోగాని లోహభస్మము, జీలకర్ర, పంచదారగలిపి, రెండుమండలములు సేవించిన రసవేధలు నివర్తించును. (ఇదియుత్తమమైనది.)

### రసతాపహారలేపములు

ధాత్రీ కుమారీ సర్పాక్షీ కూశ్మాండం భృంగరాజకమ్. 356
కాకమాచీ మేఘనాదా రంభాకందం సజీరకమ్,
కార్పాసం చామృతాం చైవ జంబుకాబింబతండులమ్, 357
నవనీతైస్సమం లేప్యం చందనైరసతాపనుత్,

తా. ఉసిరికపప్పు, కలుబంద, సర్పాక్షి, బూడిదగుమ్మడుకాయ, గుంటగలగర, నల్లకాచి, చిట్టివేరు, అరటిగడ్డ, జీలకఱ్ఱ, పైడిప్రత్తిఆకు, తిప్పతీగ, నేరేడుచెక్క, దొండాకు, పసిగడుగు వీనినిసమములుగ రసముదీసి, వెన్న, మంచిగంధము గలిపి శరీరమునలేపనముజేసిన రసతాపము నివర్తించును.

### రసతాపనివర్తకోపాయము

జంబూత్వక్త్రిఫలాబింబకుమారీశ్చసమం పిబేత్. 358
రసతాపం మహాఘోరం నాశయేచ్చ సుఖీ భవేత్,

తా. నేరేడుచెక్క, త్రిఫలములు, దొండాకు, కలుబంద వీని సమభాగములుగ రసముదీసి పుచ్చుకొనిన మిగుల భయంకరమగు రసజనితశరీరతాపము నివర్తించును.

కుమారీరససంయుక్తం జీరకం తండులీయకమ్. 359
కార్పాసబీజకం చైవ నవనీతేన పేషయేత్,
చందనేన సమం కృత్వాప్యాలేపో రసతాపనుత్. 360

తా. జీలకఱ్ఱ, చిట్టి, ప్రత్తిగింజలు, వెన్న, మంచిగంధము వీనిని సమభాగములుగ కలుబందరసముతోనూరి శరీరమునకు లేపనముజేసిన తలకెక్కినరసతాపములు నివర్తించును.

### రసతాపములయందుపథ్యములు

రసజనితవిదాహే శీతతోయావగాహో
మలయజఘనసారైర్లేపనంమందవాతాః,
తరుణదధి చ తక్రం నారికేళీఫలాంభః
శిశిరమధురసాద్యైః శీతమన్నం ప్రశస్తమ్. 361

తా. పాదరసమువలన తాపముగలిగిన, శీతోదకస్నానము, శ్రీగంధకర్పూరమిళితలేపనము, చల్లనిగాలి, తియ్యనిపెరుగు, మజ్జిగ, టెంకాయనీరు, శీతకరరసములు, మధురరసములు, చల్లారినఅన్నము వీనిని సేవించుట ప్రశస్తముగ నుండును.

రసౌషధములయందుపథ్యములు

గోధూమజీర్ణశాల్యన్నం గవ్యం క్షీరం ఘృతం దధి,
తండులీయకధాన్యాకపటోలాలాజసైంధవమ్. 362
అభ్రోదకం ముద్గరసం మాంసం జాంగలజం హితమ్,
ఉద్గారే సతి చాత్యర్థం కృష్ణామీనాక్షజీరకమ్. 363
అభ్యంగమనిలక్షోభే తైలైర్నారాయణాదిభిః.
ఆర్తిశ్శీతతోయేన మస్తకే పరిషేచనమ్. 364
తృష్ణాయాం నారికేళాంబు ముద్గయూషం సశర్కరమ్,
ద్రాక్షాదాడిమకర్పూరకదళీనాం ఫలం హితమ్. 365
రసవేధనివృత్త్యర్థందధిక్షీరేక్షుశర్కరాః,
శైత్యోపచారానన్యాంశ్చప్రతికుర్యాద్యథోచితమ్. 366

తా. గోధుమలు, పాతబియ్యపుఅన్నము, ఆవునెయ్యి, ఆవుపెరుగు, ఆవుపాలు, చిర్రికూర, ధనియాలు, పొట్లకాయ, అనుగపుకాయ, సైంధవలవణము, మేఘోదకము, పెసరకట్టు, జాంగలమాంసము వీనిని సేవించుట, మిగుల వమనంబులయ్యెనేని, పిప్పలి, పొన్నగంటికూర, జీలకఱ్ఱ, వీనిని సేవించుట, వాతవికారముజనించిన నారాయణతైలము మొదలగువానిచే అభ్యంజనముజేసుకొనుట, పీడగలిగిన శీతోదకస్నానముజేయుట, దప్పిజనించిన నారికేళోదకము, పంచదారయుగూడియుండు పెసరగంజి, ద్రాక్షపండు, దాడిమపండు, పచ్చకర్పూరము, అరటిపండు, పెరుగు, పాలు, చెఱుకు, పంచదార, ఇతరములైన శైత్యోపచారములు మొదలగు వానిని యథోచితముగజేయుట ఇట్టి యుపచారములచే రసతాపము నివర్తించును.

రసౌషధసేవనయందపథ్యములు

త్యజేత్కూష్మాండవార్తాకవేత్రాగ్రం కారవేల్లకమ్,
మాషాన్మసూరనిష్పావాన్కుళుత్థాన్సర్షపాంస్తిలాన్. 367
బృహతీంరాజికాంబిల్వం దివానిద్రాం చ మైథునమ్,
లంఘనోద్వర్తనే స్నానం తామ్రచూడం సురాసవమ్. 368
జలమాంసారనాళే చ భోజనం కదలీదళే,
కాంస్యకం గురువిష్టంభితీక్ష్ణోష్ణం చ భృశం త్యజేత్. 369
అపథ్యం సూతరాజస్య పురా ప్రోక్తం మహర్షిభిః,

తా. గుమ్మడుకాయ, వంకాయ, వెదురుమొలకలు, కాకరకాయ, మినుు

ములు, సెనగలు, అనుములు, ఫులవలు, అవాలు, నువ్వులు, ములకకాయ, అవాలు, మాకేడుకాయ, పగటియందునిద్ర, స్త్రీసంగమము, లంఘనము, శరీరమర్దన, స్నానము కోడిమాంసము, కల్లు, ఆసవము, జలజంతుమాంసము, కలి, అరటిఆకులో భుజించుట కంచుపాత్రమునందుభుజించుట, గురుకరపదార్థములు, మలబద్ధకరపదార్థములు, తీక్ష్ణకరద్రవ్యములు, ఉష్ణకరద్రవ్యములు ఇవి రససేవనజేయువారల కపథ్యములని తెలియవలయును.

గంధకోత్పత్తి

శ్వేతద్వీపే పురా దేవ్యాస్త్రీరే క్షీరపయోనిధేః. 370
క్రీడంత్యాఆళిభిః సార్ధమభవత్ప్రిస్రుతం రజః,
బహుళం తద్రజోతీవ సుగంధి సుమనోహరమ్. 371
క్షీరార్ణవే తు సాధ్వ్యా యద్దుకూలం రజసాన్వితమ్,
ధౌతమాళిగణైస్తత్ర తజ్జాతం గంధకం రజః. 372
క్షీరాబ్ధిమథనే చాథ అమృతేన సహోత్థితమ్,
నిజగంధేన తాన్సర్వాన్ హర్షయామాస దానవాన్. 373
తతో దేవగణైరుక్తం గంధకాఖ్యో భవత్వయమ్,
రసస్య బంధనార్థాయ జారణాయ భవత్వయమ్. 374
యే గుణాః పారదే ప్రోక్తాస్తేచైవాత్ర భవంత్వితి,
ఇత్యేవం గంధకో నామ విఖ్యాతః క్షితిమండలే. 375
బలినా సేవితః పూర్వం ప్రభూతబలహేతవే,
వాసుకేః కర్షితస్యాస్య తన్ముఖజ్వాలనాద్ద్రుతమ్. 376
వాసో గంధకగంధాఢ్యాస్సర్వతో మిశ్రితాభువః,

తా. పూర్వము క్షీరసముద్రతీరమునందలి, శ్వేతద్వీపమునందు చెలికత్తెలతోడపార్వతీదేవి, క్రీడించుచురజస్వలయైనందున కడుసుగంధకరమును, మనోహరముగనుండు, రజోయుక్తవస్త్రమును చెలికత్తెలు క్షీరసముద్రమునందు క్షాళనజేయుటచే, రజస్సుగంధకముగనయ్యెను. అదిక్షీరాబ్ధిమదనకాలమునందు, నమృతముతోడనుత్పన్నంబయ్యెను. మఱియునది, తనవాసనవలన సకలదైత్యులకు, సంతోషమును గలుగంజేసె, దేవతలుదీనికి, గంధకమనునామంబొసంగి, రసబంధనము, రసజారణము, వీట్లయందుపయోగించునటులను, రసమునకుగల గుణములన్నియు దీనియందు గలిగియుండునటులను, ఆశీర్వదించిరి. అదిమొదలు దీనికి నీభూమండలమున గంధకమని ప్రసిద్ధిగలిగెను. దీనిని పూర్వకాలమున బలిచక్రవర్తి బలముగలుగునిమిత్తము,

భుజించెను. పిదప సముద్రమథనకాలమునందు, వాసుకిని నీడ్చినపుడు దానిముఖ జ్వాలలవలన గంధకముకరిగి భూమియందంతటవ్యాపించెను. అది మొదలు గంధకము భూమియందు లభించుచున్నయది.

### గంధకలక్షణము

గంధశ్చతుర్విధః ప్రోక్తో రక్తః పీతస్సితోఽసితః. 377
రక్తో హేమక్రియాసూక్తశ్శుకతుండనిభో వరః,
పీతశ్చ మలసారాఖ్యో శ్రేష్ఠో రసరసాయనే. 378
శ్వేతోఽత్ర ఘుటికాప్రోక్తో లేపనే లోహమారణే,
సుదుర్లభస్తు కృష్ణశ్చస జరామృత్యునాశనః. 379

తా. గంధకము ఎఱుపువర్ణముగను, పసుపువర్ణముగను, శ్వేతవర్ణముగను, కృష్ణవర్ణముగను ఇటుల నాలుగువిధంబులుగనుండును. అందు రక్తవర్ణముగల గంధకము, చిలుకముక్కుతో తుల్యముగనుండు కాంతిగలదై స్వర్ణక్రియలయందుపయోగించుచు మిక్కిలి ప్రశస్తముగనుండును. పసుపువర్ణముగలది రసరసాయనోపయుక్తంబైయుండును. శ్వేతవర్ణముగలది ఘుటికలు, లేపనములు, లోహమారణము వీనియందుపయోగించును. కృష్ణవర్ణముగలది జరామృత్యువుల తొలగంజేయునుగాని దొరకుట మిక్కిలి దుర్లభముగనుండును.

### శోధనయోగ్యగంధకలక్షణము

కపికచ్ఛునిభచ్ఛాయో నవనీతసమప్రభః,
సమృదుః కఠినస్స్నిగ్ధశ్శ్రేష్ఠో గంధక ఉచ్యతే. 380

తా. దురదగొండివిత్తులతో సమానముగను, వెన్నతోతుల్యముగను నుండు కాంతిగలదిగను, మృదువు, కఠినము, స్నిగ్ధము ఇవిగలదిగనుండు గంధకము శ్రేష్ఠముగ నుండును.

### గంధకశుద్ధి

గంధస్సుక్షీరభాండస్థో వస్త్రే * కూర్మపుటాచ్ఛుచిః,
అథవా కాంజికే తద్వత్ శుధ్యతే పూర్వవత్పుటాత్. 381

తా. గంధకము వస్త్రమునందుపోసి భాండముమీదవాసినగాగట్టి భాండమునందు పాలుపైచి పైనిమూసి కూర్మపుటంబిడినను లేక కాంజికమునందు పైజెప్పినరీతిగ జేసినను గంధకము శుద్ధియగును.

---

* కూర్మపుటమనగా భాండము మూతివరకుపాతి మీద బోరగిలించిన మూకుటిమీద పిడకలతో బుటమిడుట.

లోహపాత్రే వినిక్షిప్య ఘృతమగ్నౌ ప్రదాపయేత్,
తప్తే ఘృతే తత్పమానం క్షిపేద్గంధకజం రజః. 382
విద్రుతం గంధకం జ్ఞాత్వా తంతో వస్త్రే వినిక్షిపేత్,
యథా వస్త్రాద్వినిస్సృత్య దుగ్ధమధ్యే ఖిలఃపతేత్. 383
శీతో నిష్కాసిత స్తస్మాజ్జలం వస్త్రేణ శోషయేత్,
ఏవం నిర్మలతాపన్నో గంధకః శుద్ధ ఉచ్యతే. 384
ఏవం వారత్రయం శోధ్యో భిన్నదుగ్ధేన యత్నతః,
భక్షణార్థం హిభిషజా యోగార్థం తుసకృత్కృతః. 385

తా. లోహభాండమునందు నెయ్యివైచి కాచి నెయ్యికిసమము గంధకము అందువైచి కరిగిన పిదప వస్త్రమునందువైచి పాలలోపిండి పిదప నాపాలుచల్లబడిన తరువాత నందుండి గంధకమునుతీసి గుడ్డతోతుడిచి ఎండించవలయును. ఇటుల 3 మార్లు ప్రత్యేకము పాలతో జేసిన గంధకము భక్షించుటకును ఒకపర్యాయము మాత్రముచేసిన యోగములయందుపయోగించుకొనుటకును ఉత్తమముగ నుండును.

గంధకగుణము

దాపయేద్రోగిణే తం తుసర్వదోషనివారణమ్,
మహాగ్నికారణం చైవ కాసశ్వాసక్షయాపహమ్. 386

తా. శుద్ధమగుగంధకమును రోగికొసంగిన సర్వరోగహరమై అగ్నిదీప్తిని జేయుటయేగాక కాస, శ్వాస, క్షయ ఇవి నివర్తించును.

శుద్ధో గంధో హరేద్రోగాన్ కుష్ఠమృత్యుజరాదికాన్,
అగ్నికారీ మహానుష్ణో వీర్యవృద్ధిం కరోతి చ. 387

తా. శుద్ధిచేసినగంధకము కుష్ఠువు, మృత్యువు, ముదిమిమొదలగువానిని నశింపం జేయుటయేగాక అగ్నిదీపనము, మిగులఉష్ణము, వీర్యవృద్ధి వీనిని గలుంగజేయును.

గంధకఅనుపానము

ఇత్థం విశుద్ధస్త్రిఫలాజ్యభృంగమధ్వన్వితశ్శాణమితోవలీఢః,
గృధ్రాక్షితుల్యం కురుతేక్షియుగ్మంకరోతి రోగంజతమాయురగ్ర్యమ్. 388
శుద్ధో గంధో నిష్కమాత్రం సదుగ్ధస్సే
వ్యోమాసం శౌర్యవీర్యప్రవృద్ధ్యా,
షాణ్మాసాత్స్యాత్సర్వరోగప్రణాశో
దివ్యాం దృష్టిందీర్ఘమాయుస్సు రూపమ్. 389

తా. ౧ శాణమాత్రము శుద్ధగంధకమును, త్రిఫలములు, నెయ్యి, గుంటగలగరాకురసము, తేనె వీనితోఁ పుచ్చుకొనిన నేత్రయుగళము గ్రద్దకన్నులతో తుల్యముగనుండుటయేగాక, రోగములు నివర్తించును. మరియు దీర్ఘాయుష్యముగలుగును. శుద్ధగంధకమును నిష్కమాత్రముపాలలో ౧ మాసము సేవించిన శౌర్యము, వీర్యము వీనిని వృద్ధిజేయును. ౬ మాసములుపుచ్చుకొనిన దివ్యమగుదృష్టి, దీర్ఘాయుష్యము సుందరమగురూపము వీనిని గలుగంజేయుటయేగాక సకలరోగముల నశింపజేయును.

మోచాఫలేన త్వగ్దోషం చిత్రకేన మహాబలమ్,
ఆటరూషకషాయేణ క్షయకాసాజ్జయేద్భృశమ్. 390
మందానలత్వం జయతి త్రిఫలాక్వాథసంయుతః,
ఊర్ధ్వగాన్సకలాన్ రోగాన్హన్తి శీఘ్రం సుగంధకః. 391

తా. శుద్ధగంధకమును అరటిపండుతోఁ పుచ్చుకొనిన, త్వగ్దోషము నివర్తించును. చిత్రమూలముతోఁ పుచ్చుకొనిన మిక్కిలిబలముగలుగును. అడ్డసరపు యీనెల కషాయముతో సేవించిన క్షయ, కాస ఇవి నివర్తించును. త్రిఫలకషాయముతో పుచ్చుకొనిన మందాగ్ని, ఊర్ధ్వగాములగు సకలరోగములు ఇవి నివర్తించును.

### గంధకధృతి

కలాం శవ్యోషసంయుక్తం శుద్ధగంధం విమర్దయేత్,
అరత్నిమాత్రే వస్త్రే తద్విప్రకీర్య్య వివర్తయేత్. 392
సూత్రేణ వేష్టయిత్వా చ యామం తైలే నిమజ్జయేత్,
ధృత్వా సందంశతో వర్తిం మధ్యే ప్రజ్వాలయేచ్చ తామ్. 393
ద్రుతో నిపతితో గంధో నిర్దోషః కాచభాజనే,
తాం ద్రుతిం ప్రక్షిపేత్పత్రే నాగవల్ల్యాస్త్రిబిందుకామ్. 394
దలేన సహితంజగ్ధంసూతార్తించ విమర్దయేత్,
కాసం శ్వాసం చ శూలాని గృహ్ణీయాదపి దుర్ధరమ్. 395
ఆమం విశోషయత్యాశు లఘుత్వం ప్రకరోతి చ,

తా. శుద్ధగంధకమునకు ౧౬ వ పాలు త్రికటుకములనుచేర్చి మర్దించి, పిడితక్కువ మూరవెడల్పుగల గుడ్డయందు నెరపి, వత్తిచేసి దానిని దారముచే జుట్టి ఒకయామము తిలతైలములో నునిచి పిదప దానినిదీసి పటకారుతో ఆ వత్తిమధ్యమునందు పట్టుకొని దీపముసంటించి తల్లక్రిందులుగ గాజుపాత్రయందుబట్టిన అందు స్రవించెడుధృతినిదీసి మరియొక పాత్రయందుంచుకొని అందు మూడుబొట్లు తమల

పాలలో వైచి సేవించిన రసదోషగుణమును మరియు దుర్ఘటమగు కాస, శ్వాస, శూల, ఆమము వీనిని నశింపజేయుటయేగాక, శరీరలాఘవమును గలుగంజేయును.

అశుద్ధగంధకదోషము

అశుద్ధగంధః కురుతే చ కుష్ఠం తాపం భ్రమం పిత్తరుజం తథైవ. 396
రూపం సుఖం వీర్యబలే నిహన్తి తస్మాద్విశుద్ధో వినియోజనీయః,

తా. అశుద్ధగంధకము, కుష్ఠువు, తాపము, భ్రమ, పిత్తరోగము, వీనిని గలుగజేయుటయేగాక రూపము, సుఖము, వీర్యము, బలము, వీనిని నశింపజేయును. కావున ఔషధములయందు శుద్ధిచేయబడిన గంధకమునే జేర్చవలయును.

గంధకభక్షణమందు వర్జ్యపదార్థములు

లవణామ్లాని శాకాని ద్విదళాని తథైవచ. 397
స్త్రియశ్చారోహణం యానం పదా చైతాని వర్జయేత్,

తా. గంధకభక్షణజేయువాడు, ఉప్పు, పులుసు ఆకుకూరలు, పప్పుపదార్థములు, స్త్రీసంగమము, అశ్వాదులనెక్కి తిరుగుట, కాలితో దారినడుచుట, వీనిని వర్జించవలయును.

అభ్రకోత్పత్తి

పురా వధాయ వృత్రస్య వజ్రిణా వజ్రముద్ధృతమ్. 398
విస్ఫులింగాస్తతస్తస్య గగనే పరిసర్పితాః,
తే నిపేతుర్ఘనధ్వానాచ్ఛిఖరేషు మహీభృతామ్. 399
తేభ్య ఏవ సముత్పన్నం తత్తద్గిరిషు చాభ్రకమ్,
తద్వజ్రవజ్రజాతత్వమభ్రమభ్రరవోద్భవాత్. 400
గగనాత్పతితం యస్మాద్గగనం చ తతో మతమ్,

తా. పూర్వము వృత్రాసురవధార్థమై ఇంద్రునిచే విడువబడిన వజ్రాయుధము వలన విస్ఫులింగములు జనించి, గగనమందంతట వ్యాపించినవై, మేఘసమానధ్వని గలవై, పర్వతశిఖరములయందు బడినవాయెను. అందువలన ఆయాపర్వతములయందు, అభ్రకము జనించెను. అందుచే వజ్రమునుండి పుట్టుటచే వజ్రమనియు, మేఘము వంటి ధ్వనిచేయుటచే నభ్రమనియు, నాకాశమునుండి పడుటచే గగనమనియు చెప్పబడుచున్నది.

అభ్రకజాతి వర్ణభేదములు

బ్రహ్మక్షత్రియవిడ్శూద్రభేదాత్స్యాచ్చ చతుర్విధమ్. 401
క్రమేణైవ సితం రక్తం పీతం కృష్ణం చ వర్ణతః,

ప్రశస్యతే సితం తారే రక్తం తత్ర రసాయనే. 402
పీతం హేమని కృష్ణం తు గదే శుద్ధతయాపిచ,

తా. అభ్రికము, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర భేదంబులచే నాలుగు విధంబులుగనుండును. అందు తెలుపు, యెఱుపు, పసుపు, నలుపున్నములుగల ఈ నాలుగును, రససంస్కారవిషయమునందు ఉపయోగించును. మరియు తెల్లగనుండునది, రజితక్రియలయందును, యెఱ్ఱగనుండునది రసాయనములయందును, పచ్చగనుండునది సువర్ణక్రియలయందును, నల్లగనుండునది, రోగనాశన విషయమునందును, ప్రశస్తముగనుండును. మరియు శుద్ధమైనదై యుండును.

కృష్ణాభ్రిక భేదము

పినాకం దర్దురం నాగం వజ్రం చేతి చతుర్విధమ్. 403
కృష్ణాభ్రం కథితం ప్రాజ్ఞైస్తస్య లక్షణముచ్యతే,

తా. కృష్ణాభ్రికము, పినాకమని, దర్దురమని, నాగమని, వజ్రమని ఇటుల ౪ విధములుగనుండుగాన వానిలక్షణములను వచించెదను.

అభ్రిక పరీక్ష

ముంచత్యగ్నౌ వినిక్షిప్తం పినాకం దలసంచయమ్, 404
అజ్ఞానాద్భక్షణాత్తస్య మహాకుష్ఠప్రదాయకమ్,
దర్దురం త్వగ్నినిక్షిప్తం కురుతే దర్దురధ్వనిమ్. 405
గోలకాన్ బహుశః కృత్వా స్యాచ్చ మృత్యుప్రదాయకమ్,
నాగం తు నాగవద్వహ్నౌ ఫూత్కారం పరిముంచతి. 406
తద్భక్షితమవశ్యం తు విదధాతి భగందరమ్,
వజ్రం తు వజ్రవత్తిష్ఠేన్నచాగ్నౌ వికృతిం వ్రజేత్. 407
సర్వాభ్రేషు వరం వజ్రం వ్యాధివార్ధక్యమృత్యుజిత్,

తా. చతుర్విధాభ్రికములయందు, పినాకమను అభ్రికమును, అగ్నియందునిడి కాచిన, రేకులనువదలును దానిని అజ్ఞానముచే భక్షించిన, మహాకుష్ఠమునుగలుగజేయును. దర్దురమనుదానిని, అగ్నియందునిడి కాచిన, కప్పవలెనరచును, దానిని సేవించిన, మలమునుండలుగట్టించి మృత్యువునుగలుగంజేయును. నాగమనుదానిని అగ్నియందు నిడికాచిన, సర్పమువలెబుసబెట్టును, దానిని సేవించిన, అవశ్యముగ భగందరమును గలుగంజేయును. వజ్రమనుదానిని అగ్నియందునిడికాచిన, వజ్రమువలె వికారములఁ జెందకుండును. సర్వాభ్రికములయందు, వజ్రమనునది, వ్యాధి, వార్ధిక్యము, మృత్యువు, వీనిని తొలగంజేయుగాన, వజ్రాభ్రికమే శ్రేష్ఠంబని చెప్పంగవలయును.

అభ్రికశోధనము

వజ్రాభ్రకం వహ్నితప్తం నిక్షిపేత్సప్తస ప్తధా. 408
గోదుగ్ధే త్రిఫలాక్వాథే కాంజికే సురభీజలే,
శుద్ధిమాయాతి మలతః ప్రక్షిప్తం వా విధానతః. 409

తా. వజ్రాభ్రకమును ఆవుపాలు త్రిఫలకషాయము కాంజికము గోమూత్రము వీనియందు ప్రత్యేకముగ యేడేశిమార్లు అగ్నియందుకాచి కాచి తడిపిన శుద్ధియగును.

అథవా బదరీక్వాథే ధ్మాతమభ్రం వినిక్షిపేత్,
మర్దితం పాణినా శుష్కం ధాన్యాభ్రాదతిరిచ్యతే. 410

తా. లేక అభ్రకమును అగ్నియందుకాచి రేగువేళ్లకషాయమునందు తడిపి దానిని యెండించి చేతిలో నలిపిన ధాన్యాభ్రకముకన్న మిగుల శ్రేష్ఠముగ నుండును.

ధాన్యాభ్రకము చేయువిధి

పాదాంశశాలిసంయుక్తమభ్రం బద్ధ్వాధికం బలమ్,
త్రిరాత్రం స్థాపయేన్నీరే తత్క్లిన్నం మర్దయేత్కరైః. 411
తన్నీర ఏవ యత్నేన యావత్సర్వం స్రవేత్తతః,
కంబలాద్గళితం సూక్ష్మం వాలుకాసదృశం భవేత్. 412

తా. అభ్రకమునకు పాలవపాలు వడ్లనుచేర్చి గట్టిగొంగళివస్త్రమునందుమూటగట్టి మూడుదినములు నీళ్లయందునాననిచ్చి (దానినితీసి మెత్తగనూరి పిదప భాండముఖమునకు వస్త్రమునుగట్టి దానిపై నూరినముద్దనువైచి కొంచము వడ్లనుచేర్చి) కొంచ కొంచముగ వుదకమునువైచుచు చేతితో రుద్దిన ఇసుకవలె భాండమునందు స్రవించును. పిదప దానిని తేరనిచ్చి పైనీరును బాగుగవడియగట్టిన ధాన్యాభ్రకమనంబడును.

అభ్రకసిందూరము

ఇత్థం కేచిన్మతం ప్రాహుర్గగనస్య చ మారణమ్,
భృంగరాజరసైశ్చైవాప్యహిశాకరసస్తథా. 413
అశ్వగంధా సనిర్గుండీ రుదంతీ విజయాద్రవైః,
శతావర్యారసైశ్చైవాప్యాటరూషరసస్తథా. 414
బలా చాతిబలా చైవ శాల్మలీ సత్వమేవచ,
కూశ్మాండకరసైశ్చైవ ముస్తాయారసఏవ చ. 415
విదారీవరకందం చ తులసీమదనం తథా,
భల్లాతకరసైశ్చైవ ద్రాక్షాఫలరసస్తథా. 416

కటుంబరారసశ్చైవాప్యర్కక్షీరం తథైవచ,
ఉశీరం వాలుకం కుష్ఠం తథా లోహితపుష్పకమ్. 417
చంపకః కాకమాచీ చ గోక్షురః శతపత్రికా,
దాడిమీకాకపికచ్ఛాభశ్చధాత్రీఫలరస స్తథా. 418
పునర్నవా తథా బ్రాహ్మీ చిత్రకస్య రస స్తథా,
ముండీరసశ్శిరీషస్య గుళూచ్యా స్స్వరస స్తథా. 419
అభ్రకస్య పుటే దేయమేషాం ప్రత్యేకశోద్రవాః,
హన్త్యేవసర్వరోగాంస్తుతమిస్రం భాస్కరో యథా. 420

తా. అభ్రికమారణవిధిని, కొందరు వచించువిధం బెటులనిన. గుంటగలగర. సర్పాక్షి, పెన్నేరుగడ్డ, వావిలాకు, రుదంతి, గంజాయిఆకు, పిల్లిపీచరవేళ్లు, అడ్డసరపాకు, ముత్తవపులగవేరు, పెద్దముత్తవపులగవేరు వీనిరసములతోడను, బూరుగబంకకషాయము, గుమ్ముడుకాయనీళ్లు, తుంగముస్తలు, నేలగుమ్ముడుగడ్డ, తులసిఆకు, మ్రంగవేళ్లు, జీడివేరు, ద్రాక్షపండు, కటుకరోహిణి (రుద్రజడ) వీనిరసములతోడను, జిల్లేడుపాలు, వట్టివేరు, కురువేరు, చెంగల్వకోష్ఠు, మోదుగు, సంపంగివేరు వీనికషాయములతోడను, కామంచి, పల్లేరువేరు, తామరగడ్డ, దాడింబఆకు, దూలగోవిలవేరు, ఉసిరికపండు, గలిజేరువేరు, మండూకబ్రహ్మీ, చిత్రమూలము, బోడతరము, దిరిశినపువేరు, తిప్పతీగె వీనిరసములతోడను, ప్రత్యేకప్రత్యేకముగ, అభ్రికమును మర్దించి, బిళ్లనుచేసి యెండించి, ప్రతిదానిచేనొక్కొకగజపుటంబిడిన, అభ్రికముసిందూరించును, దానిని సేవించిన, సూర్యుడు, అంధకారమును తొలగించుచందంబున, సర్వరోగములు తొలగును.

## శతపుటాభ్రికసిందూరము

పునర్నవామేఘనాదద్రవైర్ధాన్యాభ్రకం దినమ్,
మర్ద్యం గజపుటే పాచ్యం చించాసూరణజైః పునః. 421
ద్రవైర్ముస్తాభవైర్మర్ద్యం పృథగ్దేయం పుటత్రయమ్,
కాసమర్దరసైః పంచగోమూత్రైస్త్రిఫలై రపి. 422
న్యగ్రోధక్వాథకైర్మర్ద్యం కుర్యాద్దశపుటం పునః,
వట్చజంబీరనీరేణ గోక్షీరేణ పుటత్రయమ్. 423
ఏవమర్కదళైర్వేష్ట్య దేయం రుద్ధ్వాచ సంపుటేత్,
శతధా పుటితం భస్మ జాయతే పద్మరాగవత్. 424
నిశ్చంద్రం జాయతే హ్యాభ్రం యథా యోగేషు యోజయేత్,

తా. ధాన్యాభ్రకమును, గలిజేరు, చిర్రి వీనిరసములచే ప్రత్యేకముగ నొక్కొకదినము మర్దించి, ౨ గజపుటంబులిడవలయును. పిదప చింతాకు, కందగడ్డ, తుంగముస్తలు వీనిరసములతో ప్రతేకముగ మర్దించి, ౩ గజపుటంబులును, కసివిందాకు రసముతో మర్దించి, ౫ గజపుటంబులును, గోమూత్రము, త్రిఫలకషాయము వీనితో ప్రత్యేక ప్రత్యేకముగ మర్దించి, అయిదైదుపుటంబులును, మఱ్ఱియూడల కషాయముతో మర్దించి, పదిపుటంబులును, నిమ్మపండ్లరసముతో నూరి, ఆరుపుటంబులును, ఆవు పాలతో నూరి, మూడుపుటంబులును వేయవలయును. ఇటుల పుటంబులిడి, పిదప అభ్రకమును బాగుగమర్దించి, బిళ్లనుజేసి యెండించి, జిల్లేడుఆకులలో నునిచి, మూకుళ్లయందునిచి, చీలచేసి, కెంపువలె నెఱ్ఱగనగువరకు ౧౦౦ గజపుటంబు లిడ వలయును. ఇటులచేసిన, అభ్రకము, నిశ్చంద్రముగ సిందూరించును. దానిని సర్వ రోగముల నుపయోగించందగును.

ముస్తాక్వాథేన ధాన్యాభ్రం పంచత్రింశత్పుటే పచేత్. 425
గోమూత్రైస్త్రిఫలాక్వాథైః పక్త్వా చ పూర్వవత్పచేత్,
పంచవింశత్పుటైరేవం కాసమర్దద్రవైః పచేత్. 426
దేయం పుటత్రయం క్షీరైర్మర్దయేచ్చ పుటేపుటే,
నిశ్చంద్రం జాయతే వ్యాభ్రం జరామృత్యురుజాపహమ్. 427

తా. ధాన్యాభ్రకమును, తుంగముస్తలకషాయముతో మర్దించి, ౩౫ పుటంబు లును, గోమూత్రము, త్రిఫలకషాయము వీనితో ప్రత్యేకముగ ౨౫ పుటంబులును, కసివిందాకురసముతో మర్దించి ౨౫ పుటంబులును, పాలతో మర్దించి ౧౦ పుటంబులు వేసి, పిదప బాగుగమర్దించి, వడియములుజేసి యెండించి, (దానిని, జిల్లేడుఆకులలో గట్టి మూకుళ్లలోనునిచి, గజపుటంబులిడి)న, నిశ్చంద్రముగ అభ్రకము సిందూరిం చును. దానిని సేవించిన ముదిమి, మృత్యువు, సర్వరోగములు హరించును.

ధాన్యాభ్రకం ద్రవైర్మర్ద్యం మత్స్యాక్షీతులసీద్రవైః,
మూలజైః కోకిలాక్షస్య కుమారీ శ్వేతమార్వయోః. 428
వ్యాఘ్రాః పునర్ణవాయాశ్చ దినమేతద్విమర్దయేత్,
కుంజరాఖ్యైః పుటైస్సప్తపిష్ట్వాపిష్ట్వా పచేత్పునః. 429
తద్వత్పంచామృతైః పాచ్యం పిష్ట్వాపిష్ట్వాతు సప్తధా,
ఏవం నిశ్చంద్రతాం యాతి సర్వరోగేషు యోజయేత్. 430

తా. ధాన్యాభ్రకమును, పొన్నగంటి, తులసి, గొలిమిడివేళ్లు, కలుబంద, తెల్లదాగ, వాకుడు, గలిజేరు వీనిరసములచే ప్రత్యేకముగ, నొక్కొకదినముమర్దించి

బిళ్లచేసి యెండించి, మూకుళ్లలోనునిచి, చీలచేసి, ఏడేసిగజపుటంబు లిడవలయును. పిదప దానిని, పంచామృతములతో మర్దించి, ఏడేసిపుటంబులిడవలయును. ఇటుల చేసిన నిశ్చంద్రముగ, అభ్రకము భస్మంబగును. దానిని, సర్వరోగములయందు బ్రయోగింపవలయును. (అభ్రకభస్మను సింధూరించిన పిదప, దానిని, అమృతీకర ణము జేయవలయును.)

—౦ అభ్రకామృతీకరణము ౦—

త్రిఫలాయాః కషాయస్య పలాన్యాదాయషోడశ,
గోఘృతస్య పలాన్యష్టౌ మృతాభ్రస్య పలాన్దశ. 431
మేలయిత్వాలోహపాత్రే పాచయేన్మృదువహ్నినా,
తదేవంజీర్ణమాదాయ సర్వరోగేషు యోజయేత్. 432

తా. అభ్రకభస్మమునకు అమృతీకరణమును వచించెదను. ౧౬పలముల త్రిఫల కషాయము ౮ పలముల ఆవునెయ్యి, ౧౦ పలముల అభ్రకభస్మము వీనిని లోహ పాత్రమునందుంచి, మృద్వగ్నిచే ద్రవ మిగురువరకు కాచి గ్రహించి, సర్వరోగముల యందు జేర్చుకొనందగును.

—౦ అమృతీకృతాభ్రక గుణము ౦—

అనుపానం వినాప్యాభ్రం జరామృత్యురుజాపహమ్,
యోజయేదనుపానైర్వా తత్తద్రోగహరం పరమ్. 433

తా. పైరీతిగ అమృతీకరణము జేయబడిన అభ్రకమును, అనుపానరహితముగ సేవించిన ముసిమి, మృత్యువు, సర్వరోగములు ఇవి హరించును. మరియు అభ్రక సింధూరమును, అనుపానములతో సేవించిన సర్వరోగముల హరింపంజేయును.

—౦ అభ్రకభస్మగుణము ౦—

రోగాన్హంతి ద్రఢయతి వపుర్వీర్యవృద్ధిం కరోతి,
తారుణ్యాఢ్యం రమయతి శతం యోషితాం నిత్యమేవ. 434
దీర్ఘాయుష్యం జనయతి సుతాన్విక్రమైస్సింహతుల్యా,
న్మృత్యుం హన్త్యాప్యహరతి చవయస్సేవ్యమానం మృతాభ్రమ్. 435

తా. శుద్ధమగు అభ్రకభస్మమును ప్రత్యహము సేవించిన రోగములు నశిం చును. మరియు శరీరదార్ఢ్యము, వీర్యవృద్ధి, యౌవనముగల నూఱుగురుస్త్రీలతోడ రమియించుశక్తి, దీర్ఘాయుష్యము, సింహతుల్య పరాక్రమముగల కొమరులు, వీనిని కలుగజేయుటయేగాక మృత్యువును బోగొట్టును, వయసునునిలబెట్టును.

—అభ్రికగుణము—

గౌరీతేజఃపరమమమృతం వాతపిత్తక్షయఘ్నమ్,
ప్రజ్ఞాబోధిప్రశమితజరం వృష్యమాయుష్యమగ్ర్యమ్. 436
బల్యం స్నిగ్ధం రుచిదమకఫం దీపనం శీతవీర్యమ్,
తత్తద్యోగైస్సకలగదహృద్యోగ్యమసూతేంద్రబీజమ్. 437

తా. అభ్రికభస్మము, మిక్కిలి అమృతతుల్యముగ నుండుటయేగాక, బుద్ధి, వీర్యవృద్ధి. ఆయుర్వృద్ధి, బలము, స్నిగ్ధత, రుచి, దీపనము, శీతవీర్యము, జ్ఞానవృద్ధి వీనిని జేయునదిగ నుండును. మరియు వాతము, పిత్తము, క్షయ, ముదిమి ఇంద్రియ నిగ్రహము, కఫము, వీనిని నశింపజేయును. మరియు నానాయోగములలో జేర్చబడి సమస్తరోగముల హరించును.

—అభ్రికభస్మమున కనుపానములు—

శుద్ధాభ్రం ననువల్లకద్వయమితం కృష్ణామధుభ్యాం యుతం,
మేహశ్వాసవిషం చ కుష్ఠమతులం వాతం చ పిత్తం కఫమ్. 438
కాసక్షీణహతిక్షయగ్రహణికాః పాండుం భ్రమం కామిలాం,
గుల్మాద్యం చ తథానుపానవిధినా మృత్యుం చ జేజీయతే. 439

తా. శుద్ధాభ్రికభస్మమును ౨ పలములయెత్తు, పిప్పలిచూర్ణము తేనె, ఈ అనుపానములతో పుచ్చుకొనిన, మేహములు, శ్వాస, విషము, కుష్ఠు, వాయువు, పిత్తము, కఫము, పొడిదగ్గు, క్షతక్షయ, గ్రహిణి, పాండు, భ్రమ, కామిలా, గుల్మము ఇవి మొదలగు సమస్తరోగములు, మృత్యువు వీనిని నశింపజేయును. యథాయోగ్యానుపానములచే సర్వరోగముల నశింపజేయును.

అభ్రకం చ నిశాయుక్తం పిప్పలీ మధునాసహ,
వింశతిం చ ప్రమేహానాం నాశయేన్నాత్ర సంశయః. 440
అభ్రకం హేమసంయుక్తం క్షయరోగవినాశనమ్,
రౌప్యం హేమాభ్రకం చైవ ధాతువృద్ధికరం పరమ్. 441
లవంగమధుసంయుక్తం ధాతువృద్ధికరం పరమ్,
గోక్షీరశర్కరాయుక్తం పిత్తరోగవినాశనమ్. 442
అభ్రకేవిధిసంయుక్తే పథ్యయోగేన యోజితే,
వలీపలితనాశస్స్యాజ్జీవేచ్చ శరదాం శతమ్. 443

తా. అభ్రికభస్మము, తేనె, పిప్పలిచూర్ణము, వీనితో పుచ్చుకొనిన, వింశతి మేహములు, అపరంజివరఖుతో సేవించిన క్షయరోగము, ఇవి నివర్తించును. సువర్ణ

భస్మము, రజితభస్మము, లవంగపుచూర్ణము, తేనె ఈఅనుపానములతో సేవించిన ధాతు వృద్ధి గలుగును. ఆవుపాలు, చక్కెర, వీనితో సేవించిన పిత్తరోగము నివర్తించును. మరియు నీ అభ్రకభస్మమును యుక్తానుపానములతో సేవించిన వలీపలితములు నశించి నూరు సంవత్సరములు జీవించును.

వేల్లవ్యోషసమన్వితం ఘృతయుతం వల్లోన్మితం సేవితమ్,
దివ్యాభ్రం క్షయపాండుసంగ్రహణికా మూరం చ కుష్ఠామయమ్.
సర్వశ్వాసగదం ప్రమేహమరుచిం కాసామయం దుర్ధరమ్,
మందాగ్నిం జఠరవ్యథాం పరిహరేచ్ఛోఫామయాన్నిశ్చితమ్. 445
నాతః పరతరం కించిజ్జరామృత్యు వినాశనమ్,

తా. వల్లప్రమాణ అభ్రకభస్మమును, వాయువిడంగములు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, వీనిచూర్ణములో నెయ్యిచేర్చి సేవించిన క్షయ, పాండురోగము, సంగ్రహణి, కుష్ఠు, సర్వశ్వాసలు, ప్రమేహము, అరుచి, దుర్ఘటమగు దగ్గు, కుక్షిశూల, శోష, వీనిని నశింపజేయును. మఱియు, నీయభ్రక భస్మముకన్న జరామృత్యువులను నశింపజేయునది వేరేమరియొకటియు లేదని తెలియవలయును.

వర్జ్యపదార్థములు

క్షారామ్లం ద్విదలం చైవ కర్కటీకారవేల్లకమ్. 446
వృంతాకం చ కరీరం చ తైలం చాభ్రే వివర్జయేత్,

తా. క్షారములు, పులుసు, ద్విదళధాన్యము, దోసకాయ, కాకరకాయ, వంకాయ, వెదురుమొలకలు, నువ్వులనూనె వీనిని అభ్రకసేవనముచేసినవారు వర్జించవలయును.

అశుద్ధఅభ్రకసేవనయందలిదోషము

పీడాంవిధత్తేవివిధాం నరాణాం కుష్ఠం క్షయం పాండుగదం చశోఫమ్.
హృత్పార్శ్వపీడాశ్చ కరోత్యశుద్ధం భ్రమాన్వితం జాఠరవహ్నిహృత్ స్యాత్,

తా. అశుద్ధాభ్రకభస్మసేవనవలన నానావిధములగు పీడ, కుష్ఠు, క్షయ, పాండు, వాపు, హృదయశూల, పార్శ్వశూల, భ్రమ, అగ్నిమాంద్యము వీనిని గలుగంజేయును.

తాళకోత్పత్తి

సంధ్యాయాం నరసింహేన హిరణ్యకశిపుర్హతః. 448
తచ్ఛవిపవిహాభూత్తాలస్తత్క్షాలేఖనాశ్రితః,

తా. పూర్వము నృసింహమూర్తి సాయంకాలమునందు, హిరణ్యకశిపుడను రాక్షసుని సంహరించి, వాని చంకలరాచినందున, వాని కాంతితో తుల్యమగు తాళక ముత్పన్నంబయ్యెను

—॥ తాళకభేదములు ॥—

హరితాళం ద్విధా ప్రోక్తం పత్రాఖ్యం పిండసంస్థితమ్. 449
తయోరాద్యం గుణైః శ్రేష్ఠం తతో హీనగుణం పరమ్,

తా. హరితాళకము, పత్రాఖ్యమనియు పిండకమనియు రెండువిధంబులుగ నుండును. అందు మొదటిదగు పత్రాఖ్యతాళకము, గుణములచే శ్రేష్ఠముగనుండును. రెండవదిగనుండు పిండకమనునది, దానికన్నగుణహీనముగ నుండును.

—॥ హరితాళలక్షణము ॥—

స్వర్ణవర్ణం గురు స్నిగ్ధం సపత్రం చాభ్రపత్రవత్. 450
పత్రాఖ్యం తాలకం విద్యాద్గుణాఢ్యం తద్రసాయనే,
నిష్పత్రం పిండసదృశం స్వల్పసత్వం తథా లఘు. 451
స్త్రీపుష్పహారకం స్వల్పగుణం తత్పిండతాలకమ్,

తా. బంగారుతో సమమగువర్ణము, స్నిగ్ధగుణము, వీనితో గూడియుండి అభ్రకమువలె రేకులుగలదిగనుండునది, పత్రాఖ్యహరితాళకము. ఇది రసాయనములయం దుత్తమముగనుండునని తెలియవలయును. మరియు పిండమువలె రేకులులేనిదై, స్వల్పసత్వముగలదై, లఘువుగనుండి స్వల్పగుణముగలది పిండాఖ్యతాలకము. అది స్త్రీల యొక్క పుష్పమును నశింపజేయును.

—॥ శుద్ధహరితాలగుణము ॥—

శోధితం హరితాలం తు కాన్తివీర్యవివర్ధనమ్. 452
కుష్ఠాదికఫరోగఘ్నం జరామృత్యుహరం పరమ్,

తా. శుద్ధిజేసిన తాళకము, కాంతి, వీర్యవృద్ధి వీనిని గలుగచేయుటయేగాక కుష్ఠము, కఫరోగములు, ముసలితనము, మృత్యువు వీనిని నశింపజేయును.

—॥ అశుద్ధహరితాలదోషము ॥—

అశుద్ధం తాలమాయుఘ్నం కఫమారుతమేహకృత్. 453
తాపస్ఫోటాంగసంకోచం కురుతే తేన శోధయేత్,

తా. అశుద్ధతాళకము, ఆయువునుక్షయింపజేయుటయేగాక, కఫము, వాయువు, మేహము, శరీరతాపము, బొబ్బలు, శరీరసంకోచము వీనినిగల్గుడం జేయునుగాన దానిని బాగుగ శుద్ధిచేయవలయును.

## హారితాలశోధన

తాలకం కణశః కృత్వా తచ్చూర్ణం కాంజికే క్షిపేత్. 454
డోలాయంత్రేణ యామైకం తతః కూశ్మాండజైర్ద్రవైః,
తిలతైలే పచేద్యామం యామం చ త్రిఫలాజలైః. 455
ఏవం యన్త్రే చతుర్యామం పాచ్యం శుధ్యతి తాలకమ్,

తా. తాలకమును రేకులుగఁదీసి, చిన్న చిన్నవిజేసి, వస్త్రమునందుమూటగట్టి డోలాయంత్రముచే, కాంజికమునందొకయామము, బూడిదెగుమ్మడికాయరసమునందు ఒకయామము, తిలతైలమునందు ఒకయామము, త్రిఫలకషాయమునందొకయామము, ఇటులవండిన తాళకము శుద్ధమగును.

శోధయేత్సరయా యుక్త్యా హైతత్పత్రీకృతం శుభమ్. 456
వస్త్రేణ పోటలీం బద్ధ్వా కాంజికే శోధయేత్త్ర్యహమ్,
కూశ్మాండరసమధ్యే తు త్ర్యహం దుగ్ధేన శోధయేత్. 457
వటదుగ్ధే త్ర్యహం శోధ్యం తాలకం శుద్ధిమృచ్ఛతి,

తా. తాలకమునుసన్నగ రేకులనొనర్చి, వస్త్రమునందుమూటగట్టి, కాంజికమునందుమూడుదినములు, బూడిదెగుమ్మడికాయరసమునందు, మూడుదినములు ఆవుపాలయందుమూడుదినములు, మఱ్ఱిపాలతో మూడుదినములవంతున శుద్ధిచేయవలయును,

## తాళకభస్మము

సదలం తాలకం శుద్ధం పునర్నాగ్వరసేన తు. 458
ఖల్వే విమర్దయేదేకం దినం పశ్చాద్విశోషయేత్,
సంశోష్య గోలకం తస్య కుర్యాత్తం చ విశోషయేత్. 459
తతః పున్నవాక్షారైస్థాల్యర్ధం తు ప్రపూరయేత్,
తత్ర తం గోలకం ధృత్వా పునస్తేనైవ పూరయేత్. 460
ఆకంఠం పిఠరం తస్య పిధానం ధారయేన్ముఖే,
దినాన్యంతరశూన్యాని పంచవహ్నిం ప్రదీపయేత్. 461
స్థాలీం చుల్ల్యాం సమారోప్య క్రమాద్వహ్నిం వివర్ధయేత్,
ఏవం తు మ్రియతే తాలం మాత్రా తస్యైవ రక్తికా. 462
అనుపానాన్యనేకాని యథాయోగ్యం ప్రయోజయేత్,

తా. శుద్ధిచేసినతాలకమును రేకులుగఁదీసి, తెల్లగలిజేరురసములో ఒకదినము మర్దించి, బిళ్లలుచేసిఆరఁబెట్టి, సన్నపునోరుగల మంటిపాత్రలోసగమువరకు తెల్ల

గలిజేరుబూడిదనునిచి దానిపైని తాళకముబిళ్లలనిడితిరిగికొండయొక్క కంఠమువరకు, తెల్లగలిజేరుక్షారమునుబోసి, దానినిమూసి అయిదుదినములు రాత్రింబవలుపొయి మీదనునిచి, క్రమాగ్నులతో యుడ తెగకవండిన, తాళకముభస్మమగును. అందుగుంజ మెత్తు, అనుపానవిశేషములతో సేవించిన సకలరోగములు నివర్తించును.

భస్మపరీక్ష

తాలం మృతం తదా జ్ఞేయం వహ్నిస్థం ధూమవర్జితమ్. 463
సధూమం నమృతం ప్రాహుర్బుద్ధావైద్యా ఇతి స్థితిః,

తా. తాళకభస్మమును, అగ్నియందునిచిన, ధూమములేకయుండిన, శుద్ధభస్మమనియు, పొగతోగూడియుండిన అశుద్ధమనియును తెలిసికొనవలయును.

తాళకభస్మగుణము

అశీతివాతాన్కఫపిత్తరోగాన్ కుష్ఠం చ మేహం చ గుదామయాంశ్చ.
నిహంతి గుంజార్ధమితం తు తాలం మద్వల్లఖండేన సమంచ భుక్తమ్,

తా. తాళకభస్మమును, అర్ధగుంజాప్రమాణము ౬ వల్లములరొత్తు, ఖండచక్కెరతోచేర్చి సేవించిన ఆశీతవాతములు, కఫ, పిత్తరోగములు, కుష్ఠు, మేహము, మూలవ్యాధి వీనిని నశింపజేయును.

తాళకపథ్యాపథ్యములు

ఏతత్సేవజసేవీతు లవణామ్లా వివర్జయేత్. 465
తథా కటురసం వహ్నిమాతపం దుస్తరం త్యజేత్,
లవణం యః పరిత్యక్తుం నశక్నోతి కథంచన. 466
నతు సైంధవమశ్నీయాన్మధురోపరసోహినః,

తా. ఈతాళకభస్మమును సేవించిన మనుజుడు ఉప్పు, పులుసు, కారము, అగ్ని, దుస్తరమగుయెండ వీనిని విడువవలయును. మరియు లవణమునువిడుచుటకు శక్తిలేనివాడుగనుండిన సైంధవలవణము సేవించవలయును. సైంధవలవణము మధురానురసము గలదిగాన దోషముచేయదు.

అంజనోత్పత్తి

అంజనం వామనంచాపికపోతాంజనమిత్యపి. 467

తా. అంజనము, వామనాంజనమనియు, కపోతాంజనమనియు రెండువిధము లుగనుండును.

స్రోతోంజన భేదములు

స్రోతోంజనం తు ద్వివిధం శ్వేతకృష్ణవిభేదతః,

తచ్చ స్రోతోంజనం రూక్షం సౌవీరం శ్వేతమీరితమ్. 468

తా. స్రోతోంజనము (సురుమారాయి) తెల్లగను, నల్లగను, రెండువిధములుగ నుండును. మరియు, నా స్రోతోంజనము రూక్షముగనుండును. సౌవీరాంజనము తెల్లగ నుండును.

### స్రోతోంజనలక్షణము

వల్మీకశిఖరాకారం భిన్నమంజనసన్నిభమ్,
ఘృష్టం తు గైరికాకార మేతత్స్రోతోంజనం స్మృతమ్. 469
స్రోతోంజనం సమం జ్ఞేయం సౌవీరం తత్తు పాండురమ్,
ధూమ్రవర్ణాభమపి వా సౌవీరాంజనముచ్యతే. 470

తా. పుట్టపలెను కోవులవంటి ఆకారముగలిగి, విరచినకాటుకతో తుల్యముగ నుండి, రాచినకావిరాయివలెనుండిన స్రోతోంజనమనియెదరు. మఱియు స్రోతోంజన సమముగనుండి తెల్లగను, లేక ధూమ్రవర్ణముగను నుండిన దానిని సవ్వీరాంజన మనియెదరు.

### స్రోతోంజనాదిశుద్ధి

త్రిఫలావారిణా శోధ్యం తద్ద్వయం శుద్ధిమృచ్ఛతి,
భృంగరాజరసే వాపి స్రోతస్సౌవీరకం శుచి. 471

తా. స్రోతోంజనము, సవ్వీరాంజనము వీనిని త్రిఫలకషాయము, గుంటగలగర రసము వీనియందు పచనచేసిన శుద్ధియగును.

### నీలాంజనాదిశుద్ధి

నీలాంజనం చూర్ణయిత్వా జంబీరద్రవభావితమ్,
దినైకమాతపే శుష్కం శుద్ధ్యేత్కార్యేషు యోజయేత్. 472
ఏవం గైరికకాసీసటంకణాని వరాటికా,
శంఖస్ఫోరీ చ కంకుష్ఠం శుద్ధిమాయాతి నిశ్చితమ్. 473

తా. నీలాంజనమునుచూర్ణించి, నిమ్మపండ్లరసముతో భావనజేసి ఒకదినము ఎండయందెండించిన శుద్ధియగును. దానిని సర్వకార్యములయందు ప్రయోగించుకొనవలయును. మరియు, గైరికము, కాసీసము, వెలిగారము, గవ్వలు, శంఖములు, పటికారము, కంకుష్ఠము వీనినన్నియు నీరీతిగజేసిన శుద్ధియగును.

### అంజనద్వయగుణము

స్రోతోంజనం మృదుస్వాదు చక్షుష్యం కఫపిత్తనుత్,
కషాయం లేఖనం స్నిగ్ధం గ్రాహిచ్ఛర్దివిషాపహమ్. 474

హిన్ధ్వాక్షయా స్రవ్యాచ్చీతం సౌవీరమపి తాదృశమ్,
కింతు ద్వయోరనుశ్రేష్ఠం స్రోతోంజనమితి స్మృతమ్. 475

తా. స్రోతోంజనము, మృదువుగను, స్వాదుగను, నేత్రములకుహితముగను, వగరుగను, శీఖనముగను, స్నిగ్ధముగను, గ్రాహ్యముగను, శీతలముగనుండుటయేగాక, కఫము, పిత్తము, వాంతి, విషయము, ఎక్కిళ్లు, క్షయ, రక్తవికారము, వీనిని నశింపజేయును. మరియు, సౌవీరాంజనమును ఇట్టి గుణములుగలదిగనుండును. ఈరెంటిలో స్రోతోంజనము శ్రేష్ఠముగనుండును.

## కాసీసభేదములు

వాలుకాఖ్యం పుష్పపూర్వం కాసీసం ద్వివిధం స్మృతమ్,
శ్యామపాండురవర్ణం చ ద్వయోః పూర్వం గుణాధికమ్. 476
కాసీసం వాలుకం హ్యేకం పుష్పపూర్వమథాపరమ్,
క్షారామ్లగురుతాఢ్యం చ సోష్ణవీర్యం విషాపహమ్. 477
వాలుకా పుష్పకాసీసం శ్విత్రఘ్నం కేశరంజనమ్,

తా. వాలుకాకాసీసము, పుష్పకాసీసములన కాసీసము ౨ విధంబులుగనుండును. మరియునందు మొదటిది, శ్యామవర్ణముగను, రెండవది, తెలుపువర్ణముగను నుండును. మరియు, వానిలో మొదటిదే గుణాధిక్యముగలదిగనుండును. మరియునిది, క్షారము, పులుసు, గురుత్వము, ఉష్ణవీర్యముకలిగి, కేశరంజనముగనుండుటయేగాక, విషము, శ్విత్రము వీనిని నశింపజేయును.

## కాసీసనామములు

కాసీసంధాతుకాసీసం పాంసుకాసీసకేసరమ్. 478
అన్యం మాల్యరసం పుష్పకాసీసం నేత్రభూషణమ్,

తా. కాసీసము, ధాతుకాసీసము, పాంసుకాసీసము, కేసరము, అన్యము, మాల్యరసము, పుష్పకాసీసము, నేత్రభూషణములన, కాసీసనామంబులని తెలియవలయును.

## శోధనము

సకృద్భృంగాంబునా స్విన్నం కాసీసం నిర్మలం భవేత్. 479

తా. కాసీసమును, గుంటగలగరాకు రసముతో వండిన శుద్ధిమగును.

## కాసీసగుణము

పుష్పాదికాసీసమతిప్రశస్తం సోష్ణం కషాయామ్లమతీవ నేత్ర్యమ్,

విషానిలశ్లేష్మహారం వ్రణఘ్నం శ్విత్రక్షయఘ్నం కచరంజనం చ. 480
వాతశ్లేష్మహారం కేశనేత్రకండూవిషప్రణుత్,
మూత్రకృచ్ఛ్రాశ్మరీశ్విత్రనాశనం పరికీర్తితమ్. 481

తా. పుష్పకాసీసము అతి ప్రశస్తముగను ఉష్ణముగను, వగరుగను, పులుసుగ నుండుటయేగాక, కన్నులకుహితము, కచరంజనము వీనిని గలుగంజేయును. మరియు, విషము, వాయువు, శ్లేష్మము, వ్రణము, శ్విత్రము, క్షయ కేశములు కన్నులు వీనియందుదురద, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి వీనిని నివర్తింపఁజేయును.

## కాసీసభస్మము

బలినా హతకాసీసం కాంతకాసీసమీరితమ్,
ఉభయం సమభాగం హి త్రిఫలావేల్లసంయుతమ్. 482
నిష్కమాత్రే ఘృతే క్షౌద్రే ప్లుతం శాణమితం ప్రగే,
సేవితం హంతి వేగేన తత్తుపాండుక్షయామయాన్. 483
గుల్మప్లీహగదం శూలం మూత్రరోగమశేషతః,

తా. అన్నభేది, గంధకము వీనిని సమములుగ చేర్చి పుటంబిడిన భస్మంబగును. దీనిని కాంతకాసీసమని వచించెదరు. దీనిని త్రిఫలములు, నిష్కమెత్తు, మిరియాలు, మావమెత్తువంతున చూర్ణించి, శాణమెత్తుభస్మమునుచేర్చి తేనెతోగాని, నేతితో గాని ప్రాతఃకాలమున సేవించిన పాండు, క్షయ, గుల్మము, ప్లీహ, శూల, మూత్ర రోగము ఇవి నివర్తించును.

## గైరికభేదములు

పాషాణగైరికం ప్రోక్తం కఠినం తామ్రవర్ణకమ్. 484
సువర్ణగైరికం చాన్యద్గిరిమృద్రక్తగైరికమ్,

తా. గైరికము, రాయివలెకఠినముగనుండి, యెఱ్ఱగనుండునది, పాషాణగైరిక మనంబడును. రెండవది స్వర్ణగైరికము, మూడవది మృద్గైరికము, లేక రక్తగైరికము. ఇటుల 3 భేదములుగ నుండును.

## గైరికశోధనము

గైరికం తు గవాం దుగ్ధైర్ఘర్షితం శుద్ధిమృచ్ఛతి. 485
గైరికస్య స్వరూపం హి నదీనామివ కీర్తితమ్,
గైరికం కించిదాజ్యేన భ్రష్టం శుద్ధం ప్రజాయతే. 486

తా. గైరికము ఆవుపాలతో నూరిన శుద్ధియగు. లేక కొంచము నెయ్యిచేర్చి వేయించిన శుద్ధియగును. గైరికముయొక్క స్వరూపమునదులవలెననేక తీరులనుండును.

## గైరికగుణము

గైరికం రక్తపిత్తాస్రకఫహిక్కావిషాపహమ్,
చక్షుష్యమన్యద్బల్యం చ విశేషాజ్జ్వరనాశనమ్. 487

తా. కావిరాయి, రక్తపిత్తవికారము, కఫము, ఎక్కిళ్లు, విషము, జ్వరము వీనిని నశింపంజేయుటయేగాక నేత్రములకుహితము, బలము వీనిని గలుగంజేయును.

## ఇంగిలీకశుద్ధి

మేషీక్షీరేణ దరదమమ్లవర్గైశ్చ భావితమ్,
సప్తవారం ప్రయత్నేన శుద్ధిమాయాతి నిశ్చితమ్. 488

తా. ఇంగిలీకమును, మేకపాలలో ౭ దినములు భావనచేసి పిదప అమ్లవర్గ ములతో, ౭ దినములు భావనజేసిన ఇంగిలీకము శుద్ధియగును.

హింగుళం స్తన్యపయసా మర్దితం శుద్ధిమాప్నుయాత్,
జంబీరఫలజద్రావైర్మర్ద్యం శుద్ధిర్భవిష్యతి. 489

తా. ఇంగిలీకమును, చనుబాలులోగాని, నిమ్మపండ్లరసముతోగాని బాగుగ మర్దించిన శుద్ధియగును.

## ఇంగిలీక భస్మము

వల్లమాత్రం తాలపిష్టం శరావే స్థాపయేత్తతః,
తస్మిన్ కర్షసమం దేయం శకలం దరదస్య చ. 490
పూరయేదార్ద్రికరసైర్ద్విగుణం తత్ర బుద్ధిమాన్,
పుష్పాణి శాణమాత్రాణి పరితః స్థాపయేత్తతః. 491
శరావసంపుటే దత్వా చ్చుల్ల్యాం మధ్యాగ్నినా పచేత్,
ఘటికాత్రయపర్యంతం తతఉత్తార్య పేషయేత్. 492
తాంబూలే గుంజమాత్రం తు దేయం పుష్టికరం పరమ్,
పాండౌ క్షయే చ శూలే చ సర్వరోగేషు యోజయేత్. 493

తా. వల్లమాత్రము శుద్ధిచేసిన తాళకచూర్ణకమును, శరావమునందునిచి, అందు శుద్ధిచేసిన ఇంగిలీకమును కర్షప్రమాణమునునిచి, అందు ౨ కర్షములు అల్లపురసము, ౧ మాషము లవంగములుపైచి, పైనశరావమునుమూసి చీలచేసి పొయిమీదనునిచి మందాగ్నిచే ౩ గడియలు పక్వముచేసి, సాంగశీతలమునదీసి తమలపాకులతో గుంజ

మెత్తు సేవించిన పుష్టిని గలుగంజేయుటయేగాక పాండు, క్షయ, శూల, సర్వరోగములం వీనియందుపయోగించదగును.

ఇంగిలీకగుణము

హింగుళస్సర్వదోషఘ్నో దీపనోతిరసాయనః,
సర్వరోగహరో వృష్యో జారణే లోహమారణే. 494
హింగుళం మధురం తిక్త ముష్ణవాతకఫాపహమ్,

తా. ఇంగిలీకము సర్వదోషములనుపోగొట్టి అగ్నిదీపనమును గలుగంజేయుటయేగాక సర్వరోగహరమై రసాయనముల కుపయుక్తముగను, వీర్యవృద్ధికరముగను, జారణ మారణోపయుక్తముగను, మధురముగను, వగరుగను, కఫవాతమును నశింపజేయునదిగను నుండును.

అశుద్ధదరదదోషము

అశుద్ధో దరదః కుర్యాత్కుష్ఠం క్లైబ్యం క్లమం భ్రమమ్. 495
మోహం చ శోధయేత్తస్మాత్సిద్ధవైద్యస్తు హింగుళమ్,

తా. అశుద్ధమైన ఇంగిలీకము, కుష్ఠము, నపుంసకత్వము, గ్లాని, భ్రమ, మోహము వీనిని గలుగంజేయుగాన బుద్ధిమంతుడగు వైద్యుడు బాగుగ శుద్ధిచేయవలయును.

మణిశిలాభేదము

మనశ్శిలా త్రిధా ప్రోక్తా శ్యామాంగీ కరవీరకా. 496
ద్విఖండాఖ్యా చ తాసాం తు లక్షణాని నిబోధ మే,
శ్యామాహింగులవద్రక్తాకించిత్పీతా విదీప్తికా. 497
కరవీరా రక్తవర్ణా చూర్ణరూపాతిభారయుక్,
కించిద్రక్తా చ గౌరా చ ద్విఖండా భారవత్తరా. 498
త్రివిధా సువరిష్ఠా స్యాత్కరవీరా మనశ్శిలా,

తా. మణిశిల, శ్యామాంగి, కరవీర, ద్విఖండములన 3 విధంబులుగనుండును, అందు ఇంగిలీకమువలె, యెఱ్ఱగను, కొంచము పచ్చగను, కాంతిహీనముగనుండునది, శ్యామాంగియనియు, యెఱ్ఱగను, చూర్ణముతో సమానముగను, మిక్కిలి బరువుగనుండునది, కరవీరమనియు, కొంచము యెఱ్ఱగను, పచ్చగను, మిగుల బరువుగనుండునది, ద్విఖండమనియును జెప్పంబడును అందు కరవీరమనునది మిగుల శ్రేష్ఠముగనుండును.

### మణిశిలశుద్ధి

అగస్త్యపత్రతోయేన భావితం సప్తవారకమ్. 499
శృంగబేరరసైర్వాపి విసుధ్యతి మనశ్శిలా,

తా. మణిశిలను, అగసిఆకురసముతో 7 భావనలుచేసినను లేక అల్లపురసముతో 7 భావనలుచేసినను శుద్ధియగును.

### శంఖశుద్ధి

ఆమ్లైస్సకాంజికైశ్శంఖోడోలాస్విన్నస్స శుధ్యతి. 500

తా. శంఖమును ఆమ్లవర్గములు, కాంజికము వీనితో డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

### స్వర్ణాదిభస్మపరీక్ష

స్వర్ణం కపోతకంఠాభమారమేవం సదా భవేత్,
శుల్బం మయూరకంఠాభం తారవం గౌసముజ్జ్వలా. 501
కృష్ణసర్పనిభం నాగం తీక్ష్ణం కజ్జలసన్నిభమ్,
తదా శుద్ధం విజానీయాద్వాంతిభ్రాంతివివర్జితమ్. 502

తా. సువర్ణభస్మము, పిత్తలిభస్మము పావురకంఠ తుల్యముగను, తామ్రభస్మము నెమలికంఠవర్ణ సమానముగను, వెండిభస్మము, వంగభస్మము ఇవి స్వచ్ఛముగను, నాగభస్మము కృష్ణసర్ప సమానవర్ణంబుగను, తీక్ష్ణలోహభస్మము, కాటుకతో తుల్యవర్ణము గలదిగను ఇటునుండి, వాంతి భ్రాంతి రహితంబులుగనుండిన శుద్ధంబనియు తెలియవలయును.

### భస్మసేవనప్రమాణము

సేవనస్య ప్రమాణం తు కథయిష్యే హితైషిణః,
వల్లార్ధం కనకం హి సుప్రకథితం రూప్యం చ శుల్బం తథా. 503
తీక్ష్ణం వంగభుజంగమారభసితం వల్లార్ధవల్లోన్మితమ్,
తత్తుల్యా శుభపిప్పలీ నిగదితా క్షౌద్రం చ కర్షోన్మితమ్. 504
సేవ్యం సంపరిహృత్య గ్రీష్మశరదా తామ్రం సుసేవ్యం నరైః,

తా. సకలభస్మములయొక్క సేవన ప్రకారమును వచించెదను. సువర్ణభస్మము, వెండిభస్మము, తామ్రభస్మము వీనిని అర్ధవల్లము పుచ్చుకొనవలయును. మరియు తీక్ష్ణభస్మము, వంగభస్మము, నాగభస్మము, పిత్తళిభస్మము, వల్లార్ధముగాని వల్లప్రమాణముగాని, పిప్పలి, తేనె వీనితో సేవించవలయును. మరియు, తామ్రమును, గ్రీష్మ, శరదృతువుల వర్జించి తక్కినకాలమున సేవించవలయును.

### లోహాష్టకమారణవిధి

తాలేన వంగందరదేన తీక్ష్ణం నాగేన హేమం శిలయా చ నాగమ్. 505
శుల్బం తథా గంధవరేణ నిత్యం తారం చ మాక్షీకవరేణహన్యాత్,

తా. వంగమును తాళకముతో, తీక్ష్ణమును ఇంగిలీకముతో, స్వర్ణమును సీసముచేతను, నాగమును మణిశిలచేతను, తామ్రమును గంధకముతోను, వెండిని మాక్షీకముతోను మారణమును జేయవలయును.

### సప్తధాతువులఅవగుణము

స్వర్ణం సమ్యగశోధితం శ్రమకరం స్వేదావహం దుస్సహమ్. 506
రౌప్యం జాఠరజాడ్యమాంద్యజననం తామ్రం వమిభ్రాంతిదమ్,
నాగం చ త్రపు సాంగదోషదమథో గుల్మాదిశోషప్రదమ్. 507
తీక్ష్ణం శూలకరం చ కాన్తముదితం కార్శ్యామయస్ఫోటదమ్,
అశోధితౌ తౌ యదిముండతీక్ష్ణకౌ క్షుదాపహాగౌరవగుల్మదాయకౌ.
అయశ్చ కాంతశ్చహి తాపకారకావశుద్ధరీతిశ్చహి మోహదాయకా,

తా. బాగుగ శుద్ధిచేయబడని స్వర్ణభస్మము, శ్రమ, దుస్సహమగుచమట వీనిని గలుగజేయును. అశుద్ధరౌప్యభస్మము, ఉదరవ్యాధి, అగ్నిమాంద్యము వీనిని జనింపజేయును. అశుద్ధతామ్రభస్మము, వాంతి, భ్రాంతి వీనిని గలుగంజేయును. అశుద్ధమైన నాగము, త్రపు ఇవి శరీరదోషము. గుల్మాదిశోషమును గలుగంజేయును. అశుద్ధతీక్ష్ణము, అశుద్ధకాంతము. శూల, కృశత్వము, విస్ఫోటము వీనినిగలుగజేయును. అశుద్ధములుగనుండు ముండకాంతములు, ఆకలినిజెరచి, జడత్వము, గుల్మము, తాపము, వీనినిజేయును. అశుద్ధమగు, పిత్తళిభస్మము సమ్మోహాదులంజేయును.

### ఉపధాతునిర్ణయము

స్వర్ణజం స్వర్ణమాక్షీకం తారజం తారమాక్షిమ్. 509
తుత్థం తామ్రభవం జ్ఞేయం కంకుష్ఠం వంగసంభవమ్,
రసకోజసదాజ్జాతో నాగాత్సిందూరసంభవః. 510
లోహాజ్జాతం లోహకిట్టమేతాన్సప్తోపధాతవః,

తా. స్వర్ణమువలన స్వర్ణమాక్షికము, వెండివలన తారమాక్షికము, తామ్రమువలన మైలతుత్థము, వంగమువలన కంకుష్ఠము, జసదమువలన ఖల్ కప్పరి నాగమువలన గంగసింధూరము, లోహమువలన లోహకిట్టము, ఇటుల సప్తధాతువులవలన ఉపధాతువులు జనించినవని యెరుంగవలయును.

స్వర్ణాభావే మృతం తాప్యం తతోపి స్వర్ణగైరికమ్. 511
రూప్యాదీనామలాభే తు ప్రక్షిపేద్విమలాదికమ్,

తా. స్వర్ణము దొరకనియెడల స్వర్ణమాక్షికము లేక స్వర్ణగైరికము, వెండి మొదలగునవి దొరకనియెడల విమలా (తారమాక్షికా) దులం జేర్చుకొనవలయును.

స్వర్ణమాక్షికశుద్ధి

త్రిభాగం మాక్షికం గ్రాహ్యం చతుర్భాగం తు సైంధవమ్. 512
జంభీరజరసైర్వాపి బీజపూరద్రవైః పచేత్,
ఘర్షితం లోహపాత్రే చ యాతి పాత్రే చ రక్తతాం. 513
తతశ్శుద్ధత్వమాయాతి స్వర్ణమాక్షికమీదృశమ్,

తా. మూడుభాగములు స్వర్ణమాక్షికము, నాలుగుభాగములు సైంధవలవణము వీనినినూరి లోహపాత్రయందునిచి, పొయిమీదబెట్టి, అందు నిమ్మపండ్లరసముగాని లేక మాదీఫలరసముగానిపోసి లోహదండముతో కలియబెట్టుచు, పక్వముచేసిన, లోహపాత్రమెపుడు రక్తవర్ణమగునో అపుడు శుద్ధియైనదని తెలియవలయును.

ఏరండతైలలుంగాంబు సిద్ధం శుధ్యతి మాక్షికమ్. 514
పక్వం వా కదలీకందతోయేన ఘటికాద్వయమ్,
తప్తం క్షిప్తం వరాక్వాథే శుద్ధిమాయాతి మాక్షికమ్. 515

తా. మాక్షికమును చూర్ణముచేసి వస్త్రములో మూటగట్టి, ఆముదము, మాదీఫలరసము, అరటిగడ్డలరసము వీనిలో ప్రతిదానిచే రెండుగడియలు డోలాయంత్రమున వండిన మాక్షికము శుద్ధమగును. లేక మాక్షికము నిప్పులోకాచి త్రిఫలకషాయములో తడిపిన మాక్షికము శుద్ధమగును.

హేమమాక్షికభస్మము

మాక్షికస్య చతుర్థాంశం దత్వా గంధం విమర్దయేత్,
ఉరుబూకస్య తైలేన తతః కార్యా సుచక్రికా. 516
శరావసంపుటే కృత్వా పుటేద్గజపుటేన చ,
ధాన్యస్య తుషమూర్ధ్వాధో దత్వా శీతం సముద్ధరేత్. 517
సిందూరాభం భవేద్భస్మ మాక్షికస్య నసంశయః,

తా. హేమమాక్షికమునకు నాలవపాలు గంధకమునుజేర్చి, ఆముదముతో మర్దించి బిళ్లజేసి, శరావసంపుటమునందునిచి, చీలమన్నుయిచ్చి, అగర్తమునందు ధాన్యపుపొట్టును క్రిందునపైన నిండించి, గజపుటంబిడి సాంగశీతలమున దీసిన సిందూరతుల్యముగ భస్మమగును.

## మాక్షికసత్వపాతనము

ఏరండోత్థేన తైలేన గుంజాక్షౌద్రం చ టంకణమ్. 518
మర్దితం తస్య వాపేన సత్వం మాక్షికజం భవేత్,

తా. ఆముదము, గురివిందపలుకులు, తేనె, వెలిగారము వీనినిచేర్చినూరి మాక్షికముపైపైచి నగ్నిలోనునిచి, వూదిన నందు సత్వముదిగును.

## స్వర్ణమాక్షికగుణము

సువర్ణమాక్షికం స్వాదు తిక్తం వృష్యం రసాయనమ్. 519
చక్షుష్యం వస్తిహృత్కంఠపాణ్డుమేహవిషోదరమ్,
అర్శశ్శోఫం విషం కండూం త్రిదోషానపి నాశయేత్. 520

తా. సువర్ణమాక్షికము రుచికరముగను, వగరుగను, వీర్యవృద్ధికరముగను నేత్రహితకారిగనునుండుటయేగాక, వస్తిరోగము, హృద్రోగము. కంఠరోగము, పాండువు, ప్రమేహము, విషదోషము, ఉదరము, మూలవ్యాధి, వాపు, విషరోగము, దురద, త్రిదోషము వీనిని నివర్తింపజేయును.

## స్వర్ణమాక్షికానుపానము

అనుపానం వరావ్యోమం వేల్లం చాజ్యం హిమాక్షికమ్,

తా. స్వర్ణమాక్షికసేవనమునకు, త్రిఫలములు, త్రికటుకములు, మిరియాలు నెయ్యి ఇవి అనుపానములని తెలియవలయును.

## అపక్వమాక్షికదోషములు

మందానలత్వం బలహానిముగ్రాం విష్టంభితానేత్రగదాన్సకుష్ఠాః.521
ఫాలస్య భేదం వ్రణపూర్వకం చ శుద్ధ్యాదిహీనం తను తేతుతాప్యమ్,

తా. అపక్వమగుహేమమాక్షికము అగ్నిమాంద్యము, బలహాని, విష్టంభము, నేత్రరోగము, కుష్ఠము, మస్తకవ్రణములు వీనిని గలుగజేయును.

## తారమాక్షికోత్పత్తి

తారమాక్షికమన్యత్తు భవేత్తద్రజతోపమమ్. 522
కించిద్రజతసాహిత్యాత్తారమాక్షికమీరితమ్,
అనుకల్పతయా తస్య తతో హీనా గుణాస్మృతాః. 523
న కేవలం రౌప్యగుణా వర్తంతే తారమాక్షికే,
ద్రవ్యాంతరస్య సంసర్గాత్ సంత్యన్యేపి గుణా యతః. 524

తా. తారమాక్షికము స్వర్ణమాక్షికమున కితరముగనుండి, రజితముతో సరి

పోల్చదగి, కొంచము గణితముతో సమానముగనుండుటవలన, తారమాక్షికమని వచింప బడియెను. అది వెండికి ప్రతినిధియని వచింపబడినను నంతకంటె హీనగుణములుగలదై, కేవలరౌప్యమునందుండుగుణములు కాక ఇతరదివ్యసంయోగమువలన మరికొన్ని గుణములుగలదిగనుండును.

## తారమాక్షికలక్షణము

కాంస్యవత్తారమాక్షిక్యం కషేఘృష్టం తు రూప్యవత్,
గురుస్నిగ్ధం సితం యత్ర శ్రేష్ఠం స్యాత్తారమాక్షికమ్. 525
స్వర్ణమాక్షికవద్దోషా విజ్ఞేయా తారమాక్షికే,

తా. కంచువలెనుండి, వొరకల్లుయందు రాచిన రౌప్యమువలెనుండి, బరువుగను నునుపుగను, తెల్లగనుండునది శ్రేష్ఠముగు తారమాక్షికమని యెరుగవలయును. అందలిదోషంబుల స్వర్ణమాక్షికమునందు తెలిసికొనినతెరంగున తెలిసికొనవలయును.

## తారమాక్షికశుద్ధి

కర్కోటీమేషశృంగ్యుత్థైర్ద్రవైర్జంబీరజైర్దినమ్. 526
భావయేదాతపే తీవ్రే విమలం శుధ్యతి ధ్రువమ్,

తా. రౌప్యమాక్షికమును చూర్ణించి, గొడ్డుకాకరదుంప, మేషశృంగి, నిమ్మపండ్లు వీనిరసములచే ఒకదినము భావనజేసి, తీవ్రమగు యెండయందుంచిన శుద్ధియగును.

## రౌప్యమాక్షికభస్మము

స్వర్ణమాక్షికవత్ జ్ఞేయం తారమాక్షికమారణమ్. 527
విమలస్య గుణాః కించిన్న్యూనాః కనకమాక్షికాత్,

తా. రౌప్యమాక్షికముయొక్క మారణమును, స్వర్ణమాక్షికము తెరంగున జేయవలయును. తారమాక్షికము స్వర్ణమాక్షికముకన్న కొంచము హీనగుణములుగలదిగనుండును.

## రౌప్యమాక్షికగుణము

మాక్షికో రజతహాటకప్రభశ్శోధితోతిగుణదస్సుసేవితః. 528
మేహకుష్ఠకృమిశోఫపాండుతాపస్మృతిం హరతి సోశ్మరీం జయేత్,
స్వర్ణమాక్షికవజ్జ్ఞేయా దోషాశ్చైవానుపానకమ్. 529

తా. రౌప్యమాక్షికము, వెండితో తుల్యమగుకాంతిగలదిగాని, లేక బంగారుతో తుల్యమగుకాంతిగలదిగాని యుండి, శుద్ధిజేయుటవలన అతిగుణములనిచ్చునది

ట్టియుండును. దానిని సేవించుటవలన, మోహము, వస్తిరుజ, క్రిమి, పాండు, అపస్మారము, అశ్మరి వీనిని హరింపజేయును. మరియు నిది, అశుద్ధంబగుటవలన గలిగెడుదోషంబులు అనుపానములు, స్వర్ణమాక్షికమునందువలె బలిసిరోనవలయును.

తుత్థశోధన

ఓతోర్విష్ఠాసమం తుత్థం సక్షౌద్రం టంకణాన్వితమ్,
త్రివిధం పుటితం శుద్ధం వాంతిభ్రాంతివివర్జితమ్. 530
అమ్లవర్గేణ లులితం స్నేహాసిక్తం హి తుత్థకమ్,
డోలయా వాజిగోమూత్రే దినం పక్వం విశుధ్యతి. 531

తా. మైలతుత్థమునకుసమము, మార్జాలమలము, తేనె, వెలిగారము వీనిని చేర్చినూరి, బిళ్లచేసి, యెండించి, మూసయందుంచి, చీలచేసి 3 పుటంబులిడిన, వాంతి, భ్రాంతిరహితముగ శుద్ధమగును. మరియు అమ్లవర్గముతో నూరి, వస్త్రముతో గట్టి, నూనెలోతడిపి, అశ్వమూత్రముతో గాని, గోమూత్రముతో గాని, డోలాయంత్రమునందు, ౧దినము పచనచేసిన శుద్ధియగును.

పాలతుత్థముశుద్ధి

పలమాత్రం క్షీరతుత్థం చూర్ణం కృత్వా విమర్దితమ్,
పటేబద్ధ్వా శిలాచూర్ణతోయే పాచ్యం విశుధ్యతి. 532

తా. ౧ పలము పాలతుత్థమునుచూర్ణించి, మడతబట్టనుగట్టి, సున్నపునీళ్లతో వండిన, శుద్ధియగును.

మైలతుత్థభస్మము

కించిన్మారణమిత్యుక్తం తుత్థకస్య యథాక్రమమ్,
గంధాశ్మటంకణైర్యుక్తం లకుచద్రావమర్దితమ్. 533
అంధమూషాగతం ద్విత్రికుక్కుటైర్మృతిమాప్నుయాత్,

తా. గంధకము, వెలిగారము, మైలతుత్థము వీనిని సమముగచేర్చి చూర్ణించి అంధమూసయందునించి ౨ లేక 3 కుక్కుటపుటంబులిడిన తుత్థముభస్మంబగును. ఇది యావత్తాభస్మముకాదు, స్వల్పముగానగును.

తుత్థగుణము

తుత్థకం కటుకం క్షారం కషాయం విశదం లఘు. 534
లేఖనం భేదిచక్షుష్యం కండూకృమివిషాపహమ్,

తా. మైలతుత్థము కారముగను, ఉప్పగను, వగరుగను, విశదముగను, లఘు

వుగను, రేచకముగను, నేత్రములకు హితముగనుండుటయేగాక, దురద, క్రిమి విషము వీనిని నశింపఁజేయును.

కల్కప్పరిశుద్ధి

నృమూత్రే వాథ గోమూత్రే సప్తాహం రసకం క్షిపేత్. 535
డోలాయంత్రేణ శుద్ధస్స్యాత్తతః కార్యేషు యోజయేత్,

తా. కల్కప్పరిని మర్దించి, బట్టనుమూటగట్టి, నరమూత్రమునందుగాని లేక గోమూత్రమునందుగాని, డోలాయంత్రమున 2 దినములుంవండిన శుద్ధియగును. దీనిని సర్వకార్యములయందు చేర్చుకొనదగును.

కంకుష్ఠశుద్ధి

కంకుష్ఠం శుద్ధతాం యాతి త్రిధా శుంఠ్యంబుభావితమ్. 536
రసే రసాయనే శ్రేష్ఠం నిస్సత్త్వం బహువైకృతమ్,

తా. కంకుష్ఠమును, శొంఠికషాయముతో, మూడుమార్లు భావనజేసిన శుద్ధియగును. ఇది రసాయనవిషయమై శ్రేష్ఠముగనుండును. కంకుష్ఠమన ముదారశింగు.

కంకుష్ఠగుణము

కంకుష్ఠం తిక్తకటుకం వీర్యే చోష్ణం ప్రకీర్తితమ్. 537
గుల్మోదావర్తశూలఘ్నం రసజం తు వ్రణాపహమ్,

తా. ముదారశింగు చేదుగను, కారముగను, ఉష్ణవీర్యముగలదిగనుండుటయే గాక గుల్మము, ఉదావర్తము, శూల, రసదోషము, కలిములు, వ్రణములు వీనిని నశింపజేయును.

సిందూరశుద్ధి

సిందూరం నింబుకద్రావైః పిష్ట్వా ఘర్మే విశోషయేత్. 538
తతస్తండులతోయేన తథాభూతం విశుధ్యతి,

తా. గిరిసిందూరమును నిమ్మపండ్లరసముతో నూరి, యెండయందుంచి, పిదప తండులోదకముతో నూరి యెండించిన శుద్ధియగును.

గౌరీపాషాణశుద్ధి

ద్విపలం గౌరపాషాణం మర్ద్యం జంబీరవారిణా. 539
పిష్టం కృత్వా పటే బద్ధ్వా డోలాయన్త్రేణ బుద్ధిమాన్,
శిలాక్షారోదకే పాచ్యం భవేచ్ఛుద్ధిర్వినిశ్చయః. 540

తా. రెండుపలములు గౌరీపాషాణమును నిమ్మపండ్లపులుసుతో మర్దించి,

మడతబట్టనుమూటగట్టి, సున్నపునీళ్లలో డోలాయంత్రమున రెండుఝాములు వండిన శుద్ధియగును.

ఉల్లిపాషాణశుద్ధి

ఆఖుపాషాణసంశుద్ధిర్వక్ష్యతే శాస్త్రనిశ్చితా,
చూర్ణీకృతం పటే బద్ధ్వా శిలాక్షారోదకేన చ. 541
డోలాయన్త్రే దినైకం తు పాచితం చ విశుధ్యతి,

తా. ఉల్లిపాషాణమునుచూర్ణముచేసి, మడతబట్టనుమూటగట్టి డోలాయంత్రమున సున్నపునీళ్లలో నొకదినమువండిన శుద్ధియగును.

మధునా పాచయేద్యామంశనైర్మృద్వగ్నినా తతః. 542
ఆఖుపాషాణశుద్ధిశ్చ భవేదేవం విశారదః,

తా. ఉల్లిపాషాణమును తేనెలో వైచి, మందాగ్నిచే నొకఝాము మెల్లమెల్లగ వండిన శుద్ధియగును.

దొడ్డిపాషాణశుద్ధి

గోమూత్రే రక్తపాషాణం డోలాయన్త్రే దినత్రయమ్. 543
పటే బద్ధ్వా తత్ర పాచ్యం సమ్యక్ శుద్ధిర్భవిష్యతి,

తా. దొడ్డిపాషాణమునుచూర్ణించి, జమిలిబట్టనుమూటగట్టి, ఆవుపంచితముతో డోలాయంత్రమున మూడుదినములువండిన శుద్ధియగును.

శిలాజతూత్పత్తి

నిదాఘే ఘర్మసంతప్తా ధాతుసారం ధరాధరాః. 544
నిర్యాసవత్ప్రముంచన్తి తచ్ఛిలాజతుకీర్తితమ్,

తా. పర్వతములెండచేపరితపించబడుటవలన అందుండుధాతుసారము బంకవలె స్రవించిన నది శిలాజతుయనబడును.

శిలాజితుభేదములు

శిలాజతు ద్విధా ప్రోక్తం గోమూత్రం తద్రసాయనమ్. 545
కర్పూరపూర్వకం చాన్యదుక్తం తత్ పాండురం పరమ్,

తా. గోమూత్రశిలాజిత్తు, కర్పూరశిలాజిత్తు అని శిలాజిత్తు రెండు విధములు. అందుమొదటిది గోమూత్రసమవర్ణముగలదిగనుండును, కర్పూరశిలాజిత్తు రొట్టిగగాని లేక తెల్లగగానియుండును, అందు తెల్లనిది మిగులశ్రేష్ఠము.

శిలాజతుశుద్ధి

క్షారామ్లగుగ్గులూపేతమాతపే స్థాపయేద్దినమ్. 546

స్వేదయేద్ఘటికామాత్రం శిలాజతు విశుధ్యతి,

తా. సజ్జక్షారము, యవక్షారము, వెలిగారము, నిమ్మపండ్లపులుసు, గుగ్గిలచూర్ణము వీనితో భావనజేసి ఒకదినము యెండలోనుంచి యొకగడియవండిన శిలాజిత్తు శుద్ధియగును.

— కర్పూరశిలాజిత్తుశుద్ధి —

కర్పూరకశిలాధాతుర్మృణాలరసమర్దితః. 547
అథవోత్పలజైర్యామం సమ్యక్శుద్ధో భవిష్యతి,
గోదుగ్ధైస్త్రిఫలాక్వాథైర్భృంగద్రావైశ్చ మర్దయేత్. 548
ఆతపే దినమేకైకం తచ్ఛుష్కం శుద్ధితాం వ్రజేత్,
శిలాజతుపలోన్మానంమర్ద్యం చోత్పలజై రసైః. 549
ఆతపే ఘటికాసప్త శుద్ధిర్భవతి నిశ్చయః,

తా. కర్పూరశిలాజిత్తును తామరతూండ్లరసముతోగాని, కలువగడ్డలరసముతోగాని నొకఝామము మర్దించిన శుద్ధియగును. మరియు ఆవుపాలు, త్రిఫలకషాయము, గుంటగలగరాకురసము వీనితో నొకదినము (ఇనుపఖల్వమునందు) మర్దించి, యెండ నెండించినను, ౧ పలము కర్పూరశిలాజిత్తును కలువగడ్డల రసముతో ౭ గడియలు భావనజేసి యెండించినను శుద్ధియగును.

— శిలాజతుసేవనప్రకారము —

శిలాజతోష్షోడశాంశం మృద్వీకాయష్టిచందనే. 550
నారికేళోదకం క్షిప్త్వా డోలాయన్త్రేణ పాచయేత్,
తదుద్ధృత్యాతపే శోష్యం తత్తద్రోగానుపానతః. 551
సేవనాత్సర్వరోగఘ్నం కాన్తిపుష్టిబలప్రదమ్,

తా. శిలాజిత్తునకు పదియారవభాగము ద్వీపద్రాక్ష, అతిమధురము, శ్రీగంధము వీనినిగలిపి టెంకాయనీళ్లతో డోలాయంత్రమునవండి, దానినిదీసి యెండలో యెండించి అనుపానవిశేషములతో భక్షించిన సర్వరోగముల నివర్తింపజేయుటయేగాక శరీరకాంతి, పుష్టి బలము వీనిని గలుగజేయును.

— శిలాజతుగుణము —

శుద్ధోయం గిరితప్తకందరభవః పాండుప్రమేహాజ్వర
ప్లీహాశ్లేష్మమరుద్భవాగ్నిసదనత్వగ్దోషశోఫాపహః.
యక్ష్మోన్మాదకశోఫశర్కరక్రిమీకాసార్శశ్చాలపిత్తాపహో,

హాన్త్యాచ్ఛోదరకామిలాశ్మరిజరాకృఛ్ఛాణిపామూపహా. 553

తా. శుద్ధిజేసిన శిలాజిత్తు సేవించుచుండువు, ప్రమేహము, జ్వరము, ప్లీహ, శ్లేష్మ రోగము, వాతరోగము, అగ్నిమాంద్యము, గుల్మము, శోషము, రాజయక్ష్మ, ఉన్మాదము, వాపు, శర్కర, క్రిమిరోగము, రొమ్మునొప్పి, పిత్తము, ఉదరము, కామిల, అశ్మరి, ముదిమి, మూత్రకృచ్ఛ్రము, గజ్జి వీనిని నివర్తింపజేయును.

## అశుద్ధశిలాజతుదోషము

అశుద్ధం దాహమూర్ఛాయాభ్రమపిత్తాస్రశోణితమ్,
శిలాజతు ప్రకురుతే మాంద్యమగ్నేశ్చ విగ్రహమ్. 554

తా. అశుద్ధశిలాజిత్తు దాహము, మూర్ఛ భ్రమ, పిత్తరక్తము, రక్తవికారము, అగ్నిమాంద్యము, మలబద్ధకము మొదలగువానిని గలుగజేయును.

## శుద్ధశిలాజతుపరీక్ష

వహ్నౌ క్షిప్తంభవేద్యస్తులింగాకారంహ్యధూమకమ్,
తృణాగ్రేణాంభసి క్షిప్తం హ్యధోగలతి తంతువత్. 555
గోమూత్రగంధం మలినం శుద్ధంజ్ఞేయంశిలాజతు,

తా. అగ్నిపై వైచినపొగ వెడలకుండుట, పొక కాలమునలింగాకారమును జెందుట, తృణాగ్రముతో నీటియందు వైచిన దారమువలె క్రిందవ్యాపించుట, గోమూత్రమువంటి వాసన వెడలుట ఇట్టిలక్షణములవలన శిలాజతుశుద్ధమని తెలియవలయును.

## సాధారణరసములు

సాధారణరసాః కేచి ద్రసకర్మోపయోగినః. 556
పూర్వశాస్త్రానుసారేణ వక్ష్యంతే లక్షణాదిభిః,
కంపిల్లోలవణం గౌరీపాషాణో నవసాగరమ్. 557
దరదో వహ్నిజారశ్చ గిరిసిందూరమేవచ,
మృద్దారశృంగంచేత్యష్టౌ సాధారణరసాస్స్మృతాః. 558

తా. సాధారణరసముల గొన్నింటిని రసకర్మకుపయోగించును గాన లక్షణాదులతో జెప్పెదను. కంపిల్లము, సముద్రలవణము, గౌరీపాషాణము, నవాసారము, ఇంగిలీకము, వహ్నిజారము, గిరిసిందూరము, మృద్దారశృంగి అనునీయెనిమిదియు సాధారణరసములు.

## కంపిల్లస్వరూపము

ఇష్టికాచూర్ణసంకాశః సవిరేకాయకల్పతే,
సౌరాష్ట్రదేశఖనిజః కంపిల్లఇతి కీర్తితః. 559

తా. సౌరాష్ట్రదేశముయొక్క గనియందుజనించినది కంపిల్లమనిరెదరు. ఇది ఇటికెపొడివలెనుండును. మరియు నిదే విరేచనోపయుక్తముగనుండును.

—కంపిల్లశుద్ధి—

స్వేద్యం హారీతకీసారే కంపిల్లం శుద్ధతాం వ్రజేత్,

తా. కంపిల్లమునుచూర్ణించి, బట్టనుమూటగట్టి, కరక్కాయరసముతోగాని, కలితోగాని డోలాయంత్రమునవండిన శుద్ధియగును.

—కంపిల్లగుణము—

కంపిల్లకో విరేకీ స్యాత్కటూష్ణో వ్రణనాశనః. 560
కఫకాసార్తిహారీ చ జన్తుక్రిమిహారో లఘుః,

తా. కంపిల్లము కొంచెము ఉష్ణముగలదిగను, లఘుకరముగనుండుటయేగాక విరేచనమునుగలుగజేయును. మరియు వ్రణము, దగ్గు, ఉబ్బసము, బాహ్యక్రిములు, అంతరక్రిములు వీనిని నివర్తింపజేయును.

—బోళశుద్ధి—

పలమాత్రం కృష్ణబోళం రక్తం వాకాంజికే శుభే. 561
భావితంచాతపేశుష్కంయామంశుద్ధమ్భవిష్యతి,

తా. ౧ పలము నల్లబోళమునుగాని, ఎఱ్ఱబోళమునుగాని ౧ ఝామకలితో మర్దించి యెండించిన శుద్ధియగును.

—మస్తకీశుద్ధి—

జంబీరనీరైకైర్యామం భావయేదాతపే న్యసేత్. 562
అథవా నరమూత్రేణ శుద్ధిర్భవతి మస్తకీ,

తా. మస్తకిని నిమ్మపండ్లరసముతోగాని, నరమూత్రముతోగాని ౧యామము భావనచేసియెండించిన శుద్ధియగును.

—*కఫరిశుద్ధి—

కఫరీం పలమాత్రం చ చూర్ణం కృత్వా విమర్దయేత్. 563
నరమూత్రే సప్తయామం డోలాయన్త్రే పచేత్తథా,
గోమూత్రేణ ద్వియామం చ పాచయేచ్ఛుద్ధిమాప్నుయాత్. 564
అథవా ఘృతసంమిశ్రా పాచితా కఫరీశుచిః,

తా. పలమాత్రముకఫరిని చూర్ణించి, మడతబట్టనుగట్టి, నరమూత్రముతో

* కఫరియన్నను, కల్కఫరియన్నను, పాలతుత్థమన్నను నీషద్భేదముతో గూడిన యొకేపదార్థమైయున్నది.

౩ యామములును, గోమూత్రముతో ౨ యామములును డోలాయంత్రమున వండిన శుద్ధియగును.

## సర్జక్షారశుద్ధి

సర్జక్షారం కాంజికేన మర్దయేద్ఘటికాద్వయమ్. 565
అథవా చ గవాం మూత్రే శుద్ధిర్భవతి నిశ్చయః,

తా. సర్జక్షారమును ౨ గడియలు కాంజికముతో నూరినను లేక గోమూత్రముతో నూరినను శుద్ధియగును.

## సర్జక్షార గుణము

సర్జక్షారోఽగ్నిజననో గుల్మశూలనివారణః. 566

తా. సర్జక్షారము అగ్నిదీప్తిని గలుగజేయుటయే గాక, గుల్మము, శూల వీనిని నివర్తింపజేయును.

## యవక్షారశుద్ధి

యవక్షారం విమర్ద్యాథ తండులోదకమిశ్రితమ్,
ఆతపే ఘటికామాత్రం క్షిపేచ్ఛుద్ధిర్భవిష్యతి. 567

తా. యవక్షారమును కడుగుతో ౧ గడియమర్దించి, యెండను యెండించిన శుద్ధియగును.

## యవక్షారగుణము

దీపనః కఫవాతఘ్నో యవక్షారో వ్రణాపహః,

తా. యవక్షారము అగ్నిదీప్తిని జనింపజేయుటయే గాక, కఫము, వాతము వీనిని నశింపజేయును.

## పంచలవణశుద్ధి

సైంధవం కాంజికే భావ్యం భవేచ్ఛుద్ధిర్ఘటీద్వయే. 568
అథవా ఛాగమూత్రేణ పాచితం శుద్ధిమాప్నుయాత్,
నింబూనీరేణ సౌవర్చం భావయేచ్ఛుద్ధిమాప్నుయాత్. 569
బిడాలవణకం తక్రే భావయేచ్ఛుద్ధిమాప్నుయాత్,
లవణం కాచకం భావ్యం తింత్రిణీజలఆతపే. 570
సముద్రలవణం లోష్ఠే తప్తం కుర్యాత్త్రియామకమ్.
సమ్యక్ శుద్ధం భవేద్వైద్యస్త్వౌషధేషు ప్రయోజయేత్. 571

తా. సైంధవలవణమును రెండుఘడియలు కలిగో భావనజేసి, యెండనెండించినను లేక మేకపంచితములో వండినను, సౌవర్చలవణమును నిమ్మపండ్లరసముతో భావన

జేసి, యెండ నెండించినను, బిడాలవణమును పుల్లమజ్జిగతో భావనజేసి, యెండ నెండించినను, కాచలవణమును చింతాతురసముతో భావనజేసి, యెండ నెండించినను, సముద్రలవణమును కుండలోబోసి, మూడుయామములు వేయించినను శుద్ధములగును. ఇటుల శుద్ధిజేయబడు వానిని ఔషధములలో చేర్చుకొనవలయును.

లవణాని క్షాళితాని సక్షారేణాంభసాతపే,
శోషితాని విశుధ్య న్తీతి జ్ఞేయం వైద్యపారగైః. 572

తా. పంచలవణముల క్షారోదకముతో కడిగి, యెండ నెండించిన శుద్ధియగును.

పంచలవణగుణము

లవణం పంచధా భిన్నం సైంధవాదివిభేదతః,
సైంధవం చిక్కణం స్నిగ్ధం ఫలకం శ్రేష్ఠముచ్యతే. 573
విశీర్యమాణఫలకం పాటలం చ న శస్యతే,
సైంధవం కఫవాతఘ్నం నిద్రాకుక్షిరుజాపహమ్. 574
సౌవర్చలం కృష్ణరక్తం గుల్మశూలరుజాపహమ్,
కించిత్పీతం బిడం పాండుకుక్షిరోగరుజాపహమ్. 575
కాచోత్థం కాచవర్ణం చ కుక్షిరోగవినాశనమ్,
సాముద్రం కుక్షిరోగఘ్నం సర్వవాతవినాశనమ్. 576

తా. లవణములు సైంధవాదిభేదములవలన ౫ విధములు. అందు సైంధవలవణము నున్నగను, ఘనముగను, పలుకులుగనుండును, ఇది ప్రశస్తమైయుండును. తనంతటతానే పలుకులుగనై పాటలవర్ణముగలదైయుండు సైంధవలవణ మప్రశస్తము. ఇది కఫవాతములు, నిద్ర, కుక్షిరోగము వీనిని నశింపజేయును. సౌవర్చలవణము, కృష్ణరక్తవర్ణములుగలదిగనుండుటయేగాక, గుల్మము, శూలరోగము వీనిని హరింపజేయును, బిడాలవణము, కొంచెము పీతవర్ణముగ నుండుటయేగాక, పాండువు కుక్షిరోగము శరీరపీడను నివర్తింపజేయును, కాచలవణము, కాచవర్ణము గలదిగనుండుటయేగాక, కుక్షిరోగమును నివర్తింపజేయును. సముద్రలవణము, కుక్షిరోగము, సమస్తవాతరోగములు వీనిని నివర్తింపజేయును.

త్రికటుకశుద్ధి

శుంఠీం నిస్త్వక్కృతాం చాథ శిలాక్షారం విలేపయేత్,
నిశిపేచాతపే యామం సమ్యక్శుద్ధిర్భవేద్ధ్రువమ్. 577
వైదేహీం చిత్రకరసే హ్యాతపే భావయేత్తథా,
సమ్యక్శుద్ధిర్భవేదేతాం రసయోగేషు యోజయేత్. 578

మరిచం త్వమ్లతక్రేణ భావితం ఘటికాత్రయమ్,
లోష్ఠేక్షిప్త్వాతతస్తప్తం శుద్ధం భవతి నిశ్చితమ్. 579

తా. కొంతిపై పొట్టునుదీసి కొత్తసున్నము ట్టించి ఒకఝాముయెండలో యెండించిన శుద్ధియగును. పిప్పలిని చిత్రమూలరసములో రెండుగడియలు భావన జేసి యెండనుయెండించిన శుద్ధియగును. మిరియాలను పుల్లనిమజ్జిగతో మూడుగడియలు భావనజేసి పెంకులోబోసి వేయించిన శుద్ధియగును. ఇటుల శుద్ధిజేయబడిన వానిని ఔషధములయందు చేర్చుకొనవలయును.

గజపిప్పలిశుద్ధి

కాంజికే భావితా యామం శుద్ధా వారణపిప్పలీ,
అజామూత్రేణ భావ్యేత శుద్ధిర్భవతి నిశ్చయః. 580

తా. గజపిప్పలిని కలితోగాని లేక మేకపంచితముతోగాని ఒకయామము భావనజేసి యెండనుయెండించిన శుద్ధియగును.

నల్లమందుశుద్ధి

గజకర్ణదళే బద్ధ్వాప్యఫేనం శోధయేద్భిషక్,
డోలాయంత్రే పయఃపూర్ణే పాచితం యామమాత్రకమ్. 581

తా. నల్లమందును కొండబలురక్కసి యాకులోనునిచి మూటగట్టి ఆవుపాలతో డోలాయంత్రమున, ౧ యామమువండిన శుద్ధియగును.

ఇంగువశుద్ధి

పద్మపత్రరసే యామం భావితం చాతపాహితమ్,
రామఠం శుద్ధిమాప్నోతి రసయోగేషు యోజయేత్. 582

తా. ఇంగువను తామరశాకులరసముతో నొకయామము భావనచేసి యెండ నుంచిన శుద్ధియగును. దానిని రసయోగములయందు జేర్చుకొనవలయును.

జీలకఱ్ఱశుద్ధి

ద్విజీరం కాంజికే పూతే క్షిపేద్యామద్వయం పునః,
తతోగ్నౌ కించిదాతప్తం శుద్ధం భవతి నాన్యథా. 583

తా. జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ వీనిని కలితో ౨ యామములు తడిపి కొంచము వేయించిన శుద్ధియగును.

ఆముదపువిత్తులు నేలదంతివిత్తులు వీటిశుద్ధి

గంధర్వహస్తబీజం తు నారికేళోదకాన్తరే,

యామమత్వాక్పచేచ్ఛుద్ధ్యై దన్తిబీజం పచేత్తథా. 584

తా॥ ఆముదపువిత్తులు, దంతివిత్తులు వీనిని పైపొట్టుదీసి టెంకాయనీళ్లతో నొకయామమువండిన శుద్ధియగును.

ముష్టివిత్తులశుద్ధి

బీజాని విషముష్టేశ్చచ్ఛిల్లిశామూలజేరసే,
పాచితం త్రిఘటీమాత్రం శుద్ధం భవతి నిశ్చయః. 585

తా॥ విషముష్టివిత్తుల నడకత్తుతో పలుకులుజేసి చిర్రివేళ్లరసముతో 3 గడియలువండిన శుద్ధియగును.

నేపాళశుద్ధి

నిస్త్వచం చైవ నేపాళం కుమారీజరసేనచ,
గుడోదకేన గోక్షీరైర్గోఘృతేన పృథక్పృథక్. 586
పాచితం శుద్ధిమాప్నోతి వైద్యశాస్త్రవినిశ్చితమ్,

తా॥ నేపాళములను పైపొట్టుదీసి (యందలిమొలకలనుదీసి), కలబందరసము, బెల్లపుపానకము, ఆవుపాలు, ఆవునెయ్యి వీనితో ప్రత్యేకప్రత్యేకములుగవండిన శుద్ధియగును.

వసనాభిశుద్ధి

విషం తు ఖండశః కృత్వా వస్త్రఖండేన బంధయేత్. 587
గోమూత్రమధ్యే నిక్షిప్య స్థాపయేదాతపే త్ర్యహమ్,
గోమూత్రం తు ప్రదాతవ్యం నూతనం ప్రత్యహం బుధైః. 588
త్ర్యహేతీతే తదుద్ధృత్య శోషయేన్మృదు పేషయేత్,
శుధ్యత్యేవం విషం చైవ యోగ్యం భవతి చాత్రిజిత్. 589

తా॥ వసనాభిని తునకలుగ కత్తిరించి బట్టను మూటగట్టి యొకకుండయందు నిచి మునుగునటుల గోమూత్రమునుబోసి మూడుదినములు యెండలోనుంచవలయును, మరియు కుండయందలి గోమూత్రమును ప్రతిదినముదీసి బారవైచి క్రొత్తగ గోమూత్రమును బోయుచుండవలయును. ఇటుల మూడుదినములుజేసి నాలవదివసంబున వసనాభిని బయటదీసి చక్కగ నెండించిచూర్ణించిన శుద్ధియగును. దీనిని ఔషధములలో జేర్చుకొనునెడల నిది సర్వపీడల హరింపజేయును.

రసకర్పూరోత్పత్తి

రసభస్మచయస్మాచ్చాపదూర్ధ్వపాతేన జాయతే,

సర్వౌషధేషు సమ్మిశ్ర్యం సర్వరోగహరం పరమ్. 590
గుంజాప్రమాణం సేవేత వలీపలితనాశనమ్,
తద్భస్మరసభేదైశ్చ రసకర్పూరసంజ్ఞకః. 591

తా. మూర్ఛజెంది యూర్ధ్వపాతనువలన జనించు రసభస్మమే రసకర్పూర మనబడును. దీనిని సర్వౌషధములయందు చేర్చి సేవించిన సర్వరోగముల నశింప జేయును. మరియు గుంజాప్రమాణమును సేవించిన ముడిమిని హరింపచేయును. ఈ భస్మము రసభేదంబగుటవలన రసకర్పూరమని జెప్పెదరు.

రసకర్పూర సేవనవలన నివర్తించురోగములు

రసకర్పూరమమృతం వాతాశీతివినాశనమ్,
కుష్ఠాష్టాదశభేది స్యాన్మేహవింశతినాశనమ్. 592
వ్రణాదిదుష్టరక్తాని భగందరమహోదరే,
గ్రహణీం గుల్మమానాహం క్షయం హిధ్మాం చ నాశయేత్. 593
శ్లేష్మాదిపీనసాజీర్ణరక్తపిత్తవినాశనమ్,
అర్శాంసి విషజాలం చ కర్పూరం హన్తి సేవయా, 594

తా. రసకర్పూరము అమృతతుల్యమగుచుండుటచే, అశీతివాతములు, ౧౮ కుష్ఠములు, వింశతిమేహములు, వ్రణాది దుష్టరక్తభగందరములు, మహోదరము, గ్రహణి, గుల్మము, అనాహము, క్షయ, హిధ్మ, శ్లేష్మాదిపీనసాజీర్ణములు, రక్తపిత్తార్శస్సులు విషసమూహములు వీనిని హరింపజేయును. గావున రసకర్పూరము సే సేవించవలయును.

రసకర్పూరానుపానములు

వల్లవల్లార్ధమానేన గుడం జీర్ణం సమం దదేత్,
యథోచితానుపానేన సర్వకర్మసు యోజయేత్. 595
దుగ్ధోదనం తు పథ్యం చ దేయం తాంబూలమేవచ,
హంతి రోగం సమస్తం చ కర్పూరాఖ్యో రసో నృణామ్. 596

తా. రసకర్పూరమును వల్లప్రమాణము గాని, అరవల్లప్రమాణము గాని, పాత బెల్లముతో గాని, ఆయారోగమునకు ఉచితానుపానములతో గాని సేవించి తాంబూలమును వేసుకొనవలయును. పథ్యము పాలుఅన్నమివ్వవలయును. ఇటులంచేసిన సమస్త రోగములు నివర్తించును.

రసకర్పూరగుణము

ఫిరంగకరికేసరీ సకలకుష్ఠకాలానలో
ఖిలవ్రణవినాశకృన్మదనజాగ్రుతేః కారకః,

సువర్ణసమవర్ణకృద్బలహుతాశతేజస్కర
స్సమస్తగదతస్కరో రసపతిస్సకర్పూరకః. 597

తా. రసకర్పూరము, ఫిరంగిరోగము, సకలకుష్ఠములు, సకలవ్రణములు, సకలరోగములు వీనిని నశింపజేయుటయేగాక, కామోత్పత్తి, సువర్ణసమకాంతి, బలము, అగ్నిదీప్తి, తేజస్సు వీనిని గలుగజేయును.

నవరత్న నామంబులు

వజ్రం విద్రుమమౌక్తికే మరకతం వైడూర్యగోమేదకే,
మాణిక్యం హరినీలపుష్పదృషదా రత్నాని నామ్నా నవ. 598
యాన్యన్యాన్యపి సంతి కానిచిదిహత్రైలోక్యసీమ్ని స్ఫుటమ్,
నామ్నా తాన్యుపరత్ననామకలితాన్యాహుః పరీక్షాకృతః. 599

తా. వజ్రము, పవడము, ముత్యము, మరకతము, వైడూర్యము, గోమేధికము, కురువిందము, (కెంపు) హరినీలము, పుష్పరాగము ఇటుల నీపేర్లచే ౯ విధములుగ రత్నములుండును. మరియు నీభూమండలమునందు, మరికొన్ని ఉపరత్నములను సంజ్ఞలచే రత్నములుంగలవని, రత్నపరీక్షకులచే వచింపబడును.

సర్వరత్నశుద్ధి

రత్నోపరత్నాన్యేతాని శోధనీయాని యత్నతః,
శుద్ధాశుద్ధాని కుర్వన్తి గుణాన్రోగాంస్తు తన్వతే. 600
శుధ్యత్యమ్లేన మాణిక్యం జయంత్యా మౌక్తికం తథా,
విద్రుమం క్షీరవర్గేణ తార్క్ష్యం గోదుగ్ధతశ్శుచి, 601
పుష్పరాగం సైంధవేన కులుత్థక్వాథసంయుతే,
తండులీయజలే వజ్రం నీలం నీలీరసేన చ. 602
రోచనాభిశ్చ గోమేధం వైడూర్యం త్రిఫలాజలైః,
ఏతాన్యేతేషు సంస్విన్నాన్యాశు శుధ్యంతి డోలయా. 603

తా. నవరత్నములు, ఉపరత్నములు వీనిని ప్రయత్నముచే శుద్ధిచేయవలయును. నీరత్నములు శుద్ధములయ్యెనేని గుణములుచేయును. అశుద్ధములు-రోగములు గలుగజేయునుగాన, శుద్ధిజేయవలయును. మరియు మాణిక్యమును, అమ్లవర్గమునందును, ముత్యమును తక్కెనరసమునందును, పవడమును క్షీరవర్గమునందును, గరుడపచ్చను ఆవుపాలయందును, పుష్పరాగమును సైంధవలవణమునను, వజ్రమును వులవలకషాయమునందును, చిర్రియాకురసమునందును, నీలమును, నీలియాకురసమునందును, గోమేదకమును గోరోచనోదకమునందును, వైడూర్యమును త్రిఫలకషాయమునందును ఇటుల డోలాయంత్రముచేవండి శుద్ధిచేయవలయును.

### సర్వరత్నమారణము

సహస్ర్యాద్ధీరకాదీని నవరత్నాని బుద్ధిమాన్,
మహామూల్యాని తేషాం తు వధాద్రౌరవమృచ్ఛతి. 604
యద్వా తదవనీజాత తజ్జాతీయాని లక్షణైః,
స్వల్పమూల్యాని తేషాం తు వధే నాస్తి హి పాతకమ్. 605
కుచలాద్రవసంపిష్టైశ్శిలాతాళకగంధకైః,
వజ్రం వినాన్యరత్నాని మ్రియంతేష్టపుటైః ఖలు. 606

తా. బుద్ధిమంతుడగువాడు గొప్ప వెలగల నవరత్నములను మారణముజేయంజనదు. అటులచేసిన రౌరవనరకము సంభవిల్లుగాన, భూమియందు, తజ్జాతీయములై, ఆరత్నలక్షణములుగలిగి, స్వల్ప వెలగల రత్నములను మారణముచేసిన పాతకములేదుగాన, మనశిల, గంధకము, తాళకము వీనిని భావంచివిత్తులరసములోకలిపి దానిచే మర్దించి ౮ పుటంబులిడిన వజ్రమువినా అన్యరత్నములు మారణముజెందును.

### అశుద్ధరత్నదోషము

అశుద్ధరత్నం విస్ఫోటతాపభ్రమరుజాకరమ్,
బలహానిం వీర్యనాశం తస్మాద్రత్నాని శోధయేత్. 607

తా. అశుద్ధమగు నవరత్నములు, విస్ఫోటము, తాపము, భ్రమ, పీడ, దౌర్బల్యము, వీర్యనాశము వీనిని గలుగంజేయుంగాన వీనిని శుద్ధిచేయవలయును.

### వజ్రోత్పత్తి

దధీచ్యస్థిషుత్పన్నాః పతితాశ్చ కణాః క్షితౌ,
వికీర్ణాస్తే తు వజ్రాఖ్యాం భజన్తే తచ్చతుర్విధమ్. 608

తా. పూర్వము దధీచి ఋషుముకవలన జనించిన శకలములు భూమిపైబడి వ్యాపించి వజ్రమను నామముచే విలసిల్లెను. అవి ౪ విధములుగ నుండును.

### వజ్రభేదములు

శ్వేతం ద్విజాభిధం రక్తం క్షత్రియాఖ్యం తదీరితమ్,
పీతం వైశ్యాఖ్యముదితం కృష్ణం స్యాచ్ఛూద్రసంజ్ఞకమ్. 609

తా. వజ్రము తెల్లగనుండిన బ్రాహ్మణజాతియనియు, ఎరుపువర్ణముగలది క్షత్రియజాతియనియు, పీతవర్ణముగలది వైశ్యజాతియనియు, కృష్ణవర్ణముగలది శూద్రజాతియనియును తెలియుకొనవలయును.

—జాతిభేదగుణములు—

విప్రో రసాయనే ప్రోక్తో సర్వసిద్ధిప్రదాయకః,
క్షత్రియో వ్యాధివిధ్వంసీ జరామృత్యుహరః పరః. 610
వైశ్యో ధనప్రదః ప్రోక్తో తథా దేహస్య దార్ఢ్యకృత్,
శూద్రో నాశయతి వ్యాధీన్ వయః స్తంభం కరోతి చ. 611
స్త్రీపుంనపుంసకాశ్చేతి లక్షణీయ్యాశ్చ లక్షణైః,

తా. తెల్లనికాంతిచే బ్రాహ్మణజాతియని జెప్పబడు వజ్రమును, రసాయనములయందుపయోగించిన, సర్వసిద్ధులనుగలుగజేయును. రక్తవర్ణముచే క్షత్రియజాతియని ప్రసిద్ధికెక్కినవజ్రము వ్యాధులు, ముదిమి, మృత్యువు వీనిని నివర్తింపజేయును. పచ్చనివర్ణముచే వైశ్యజాతియని పేరొందగినవజ్రము ధనమునుగలుగజేయుటయేగాక దేహదార్ఢ్యమునుగలుగజేయును. నల్లనికాంతిచే శూద్రజాతియని జెప్పంబడువజ్రము, వయఃస్తంభనమునుజేయుటయేగాక సకలవ్యాధుల నివర్తింపజేయును. మరియు వజ్రముయొక్క స్త్రీపురుషనపుంసకభేదముల, వాటిలక్షణములచే యెరుంగవలయును.

—స్త్రీపురుషనపుంసకజాతితద్గుణవివరణము—

సువృత్తాః ఫలకాపూర్ణా స్తేజోయుక్తా బృహత్తరాః. 612
పురుషా హీరకా స్తే చ రేఖాబిందువివర్జితాః,
రేఖాబిందుసమాయుక్తాష్షడస్రా స్తే స్త్రియస్స్మృతాః. 613
త్రికోణాశ్చ సుదీర్ఘాశ్చ విజ్ఞేయా స్తే నపుంసకాః,
సర్వేషు పురుషాః శ్రేష్ఠా వేధకారసబంధకాః. 614

తా. గుండ్రమునను, సంపూర్ణమగుపలకలుగలదిగను, తేజస్సుగలదిగను, పెద్దదిగను, రేఖలు, బిందువులు, లేనిదిగనుండువజ్రము పురుషజాతియనియు, రేఖలు, బిందువులువీనితోగూడి, ఆరుకోణములుగలదై యుండువజ్రము స్త్రీజాతియనియు మూడుకోణములుగలదై, నిడుపుగనుండువజ్రము నపుంసకజాతియనియు ఇటుల తెలియవలయును. అందు పురుషవజ్రము శ్రేష్ఠముగను, రసబంధనకారిగనునుండును.

—స్త్రీత్వాదిజాతిభేదముచే వజ్రోపయోగము—

స్త్రీతు స్త్రీణాం ప్రదాతవ్యా క్లీబే క్లీబం తథైవచ,
సర్వేషాం సర్వదా యోజ్యః పురుషో బలవత్తరః. 615

తా. స్త్రీలకు స్త్రీవజ్రమును, నపుంసకులకు నపుంసకవజ్రమును, సమస్తమగువారికి పురుషవజ్రమును ప్రయోగించిన మిక్కిలి బలవత్తరముగ నుండును.

### వజ్రశుద్ధి

కులుత్థకోద్రవక్వాథైర్దోలాయంత్రే విపాచయేత్,
వ్యాఘ్రీకందగతం వజ్రం మృదాలిప్తం పుటే పచేత్. 616
అహోరాత్రాత్సముద్ధృత్య హయమూత్రేణ సేచయేత్,
వజ్రీక్షీరేణ వా సించేత్కులిశం విమలం భవేత్. 617

తా. వజ్రమును ఉలవలు, కొఱ్ఱలు వీనికషాయములో డోలాయంత్రమున వండి పిదప నేలములక వేరులోనునిచి, దానిపైమన్నులేపనముచేసి ౧ అహోరాత్ర పుటంబిడి దానినిదీసి గుఱ్ఱపుపంచితముతో గాని జెముడుపాలతో గాని దడిపిన శుద్ధియగును.

గృహీత్వాహ్ని శుభే వజ్రం వ్యాఘ్రీకం దేవి నిక్షిపేత్,
మహిషీవిష్ఠయా లిప్త్వా కరీషాగ్నౌ విపాచయేత్. 618
నిశాయాం తు చతుర్యామం నిశాన్తే చాశ్వమూత్రకైః,
సేచయేత్పాచయేదేవం సప్తరాత్రేణ శుధ్యతి. 619

తా. శుభకరమగు దినమునందు వజ్రమునుగ్రహించి దానిని నేలములక వేరులోనునిచి, బఱ్ఱెపేడలోపొదిగి, పిడకనిప్పుతో రాత్రి ౪ ఝాములుపుటంబిడి ప్రాతఃకాలమున గుఱ్ఱపుమూత్రములోవైచి దానినిదీసి పూర్వమువలె నేలములక వేరులోనునిచి ౪ ఝాములురాత్రియందు పుటంబిడి గుఱ్ఱపుమూత్రములోవేయవలయును. ఇటుల ౭ దినములుచేసిన వజ్రము శుద్ధియగును.

### వజ్రభస్మము

త్రివర్షరూఢకార్పాసమూలమాదాయ పేషయేత్,
త్రివర్షనాగవల్ల్యా వా పత్రద్రావైః ప్రపేషయేత్. 620
తద్గోళకే క్షిపేద్వజ్రం రుద్ధ్వా గజపుటే పచేత్,
ఏవం సప్తపుటైర్నూనం కులిశం భస్మ జాయతే. 621

తా. 3 సంవత్సరములగు క్రొంగట మొలచిన ప్రత్తిచెట్టుయొక్క వేరు, అట్టిదేయగు తమలపాకురసముతో నూరి, ముద్దచేసి అందు వజ్రమునునిచి దానిని అంధమూసయందునిచి చీలయిచ్చి గజపుటంబిడవలయును. ఇటుల ౭ పుటంబులిడిన వజ్రము భస్మమగును.

త్రిసప్తకృత్వః సంతప్తం ఖరమూత్రేణ శుధ్యతి,
మత్కుణైస్తాలకం పిష్ట్వా తద్గోళే కులిశం క్షిపేత్. 2
ప్రధ్మాతం వాజిమూత్రేణ సిక్తం పూర్వక్రమేణ వై,

భస్మీభవతి తద్వజ్రం శంఖశీతాంశుపాండురమ్. 623

తా. వజ్రమును కాల్చి గాడిదె మూత్రములో చల్లార్చవలయును, ఇటుల ౨౧ మార్లుచేసిన శుద్ధియగును. పిదప తాళకముఁబు, నల్లుతను చేర్చి నూరి ముద్దలుచేసి అందు వజ్రమునునిచి కొలిమిలో బెట్టి నూది గుఱ్ఱపుమూత్రములో దడపవలయును. ఇటుల ౨౧ మార్లుచేసిన శంఖము, చంద్రుడు వీనితో తుల్యముగ తెల్లగభస్మంబగును.

వజ్రభస్మానుపానములు

కుష్ఠే ఖాదిరకంశ్శృతమ్ప్లవనయుగ్రక్తే సమధ్వార్ద్రికం,
కాస శ్వాసబలాసకేషుసకణా త్ర్యగ్యాసకృష్ణద్రవమ్. 624
పిత్తే దాహాయుతే సితాం జ్వరగదే ఛిన్నా జలంతిక్తకం,
వజ్రే మారితశుక్లభస్మనిభిషక్సంయోజ్య దద్యాత్సదా. 625

తా. తెల్లగాభస్మముచేయబడిన వజ్రమును, చంద్రవక్క కషాయముతో పుచ్చుకొనిన కుష్ఠువులు, అల్లపురసముతో తేనెచేర్చి పుచ్చుకొనిన వాతరక్తము, అడ్డసరము, మిరియాలు లవంగపట్ట పిప్పలి వీనిచూర్ణముతో పుచ్చుకొనిన దగ్గు, కఫము, ఉబ్బసము, చక్కెరతో పుచ్చుకొనిన పిత్తము, తాపములు, తిప్పతీగె కషాయముతో పుచ్చుకొనిన జ్వరములు నివర్తింపజేయును.

వజ్రభస్మగుణము

వజ్రమాయుర్బలం రూపం దేహసౌఖ్యం కరోతి చ,
సేవితం హన్తి రోగాంశ్చ మృతసమ్యఙ్న సంశయః. 626

తా. వజ్రభస్మము ఆయుష్యము, బలము, రూపము, దేహసౌఖ్యము వీనిని గలుగ జేయుటయేగాక రోగముల నశింపజేయును.

అశుద్ధవజ్రభస్మదోషములు

అశుద్ధం కురుతే వజ్రం కుష్ఠం పార్శ్వవ్యథాం తథా,
పాండుం తాపం గురుత్వం చ తస్మాత్సంశోధ్యమారయేత్. 627

తా. అశుద్ధమగు వజ్రభస్మము కుష్ఠము, పార్శ్వవ్యథ, పాండువు, తాపము, జడత్వము వీనిని గలుగజేయునుగాన బాగుగ శుద్ధిజేసి భస్మముజేయవలయును.

ప్రవాళశుద్ధి

జంబీరనీరాంతరతోభావితం యామమాత్రకమ్,
ఉష్ణోదకే క్షాళితం తు శుద్ధం భవతి విద్రుమమ్. 628

తా. పగడమును నిమ్మపండ్లపులుసులో నొకఝాము నాననిచ్చి వేడినీళ్లతో కడిగిన శుద్ధియగును.

### ప్రవాళభస్మము

తద్విద్రుమం రవిక్షీరైర్భావితం దివసత్రయమ్,
తతోగజపుటే పాచ్యం భస్మీభవతి తత్ర్క్షణాత్. 629

తా. శుద్ధిజేసిన పగడములను జిల్లేడుపాలలో మూడుదినములు నానబెట్టి మూకుళ్లయందునిచి చీలమన్నుయిచ్చి గజపుటంబిడిన భస్మమగును.

### ప్రవాళగుణము

ప్రవాళం రక్తపిత్తఘ్నం రక్తాతిసారనాశనమ్,
ప్రదరేరక్తశూలఘ్నం గ్రాహిపిత్తవినాశనమ్. 630

తా. పవడము రక్తపిత్తము, రక్తాతిసారము, ప్రదరమునందలి రక్తశూల, పిత్తము వీనిని నివర్తింపజేయుటయేగాక మలబద్ధకారిగనుండును. *

### మౌక్తికశుద్ధి

మౌక్తికం శోధయేదమ్లైః కాంజికైర్నింబుకద్రవైః,
గోమూత్రే శోధయేత్పశ్చాచ్ఛోధయేత్పయసా తథా. 631

తా. ముత్యమును ఆమ్లవర్గములేక కాంజికములేక నిమ్మపండ్లపులుసు గోమూత్రము వీనిలోశుద్ధిజేసి పిదప ఆవుపాలలో శుద్ధిజేయవలయును.

కుండలీఫలజద్రావైర్భావితం దివసత్రయమ్,
అథవా తింత్రిణీద్రావైశ్శుద్ధమ్భవతి మౌక్తికమ్. 632

తా. ముత్యమును తెల్లవుప్పి పండ్లరసములో గాని చింతపండుపులుసుతో గాని మూడుదినములు భావనజేసిన శుద్ధియగును.

### ముత్యపుభస్మము

శుద్ధముక్తాఫలం శ్వేతబృహతీఫలజైర్ద్రవైః,
భావితం భూపుటే పాచ్యం భస్మ శుద్ధం భవిష్యతి. 633

తా. శుద్ధిచేసినముత్యమును తెల్లములకపండ్లరసముతో భావనచేసి మూకుళ్లయందునిచి చీలమన్నుయిచ్చి భూపుటంబిడిన శుద్ధమగు భస్మంబగును.

### ముత్యపుభస్మగుణము

మౌక్తికం సమధురం సుశీతలం దృష్టిరోగశమనం విషాపహమ్,
రాజయక్ష్మపరికోపనాశనం క్షీణవీర్యబలపుష్టివర్ధనమ్. 634

---

* ప్రవాళభస్మము శ్వాసకాసలయందును కఫజమూత్రకృచ్ఛ్రము (మూత్రములో అల్పములుచేరుట) యందును మిక్కిలి గుణకారిగానుండుట అనుభవసిద్ధము.

కఫపిత్తక్షయధ్వంసికాసశ్వాసాగ్నిమాంద్యజిత్,
పుష్టిదం వృష్యమాయుష్యం దాహఘ్నం మౌక్తికం మతమ్. 635

తా. ముత్యపుభస్మము మధురముగను, శీతలముగను, క్షీణవీర్యముగల మనుజునికి బలకారిగను, పుష్టికారిగను, వృష్యముగను, ఆయుష్కరముగ నుండుటయేగాక దృష్టిరోగము, విషము, రాజయక్ష్మ, కఫపిత్తక్షయలు, కాస, శ్వాస, అగ్నిమాంద్యము, దాహము వీనిని నివర్తింపజేయును.

## పుష్యరాగశుద్ధి

పుష్యరాగం ఛాగమూత్రైర్భావ్యం శుద్ధం భవిష్యతి,
తత్పుష్పరాగం పాషాణభేదీ ద్రావేణ భావితమ్. 636
విశ్వకర్మపుటే దగ్ధం భస్మీభవతి తత్క్షణాత్,

తా. పుష్యరాగమును మేకమూత్రముతో భావనచేసిన శుద్ధియగును దానిని పాషాణభేదిరసముతో భావనజేసి మూకుళ్లయందునిచి చీలమన్నుయిచ్చి కొలిమిలో నునిచి యూదిన తత్క్షణమునందే భస్మమగును.

## పుష్యరాగగుణము

పుష్యరాగం పుష్టికరం శ్లేష్మలం గురుశీతలమ్. 637

తా. పుష్యరాగము పుష్టికరముగను, కఫకరముగను, గురువుగను, శీతలముగను నుండును.

## మరకతశుద్ధి

క్షిప్త్వా విదారికం దాంతః పుటే కౌక్కుటసంజ్ఞకే,
పాచితం చాథ తన్నీతం భవేన్మరకతం శుచి. 638

తా. మరకతమణిని నేలగుమ్మడుగడ్డను తొలిచి అందునిచి దానిపై చీలమన్ను లేపనంబొనర్చి కుక్కుటపుటంబిడి సాంగశీతలమునదీసిన మరకతము శుద్ధియగును.

## మరకతభస్మము

తతో మరకతం క్షుద్రా రసేన పరిభావయేత్,
పాషాణభేదీద్రావేణ మర్దితం చ శరావకే, 639
పుటమేకం తతో దద్యాద్భస్మీభవతి తద్ధ్రువమ్,

తా. శుద్ధిచేసినపచ్చలను వాకుడురసములో భావనచేసి కొండపిండివేళ్లరసముతో మర్దించి బిళ్లచేసి ఎండించి మూకుళ్లయందునిచి చీలమన్నుయిచ్చి గజపుటంబిడిన భస్మమగును.

## మరకతగుణము

హారితం విశదం కాంతం లఘుగ్రాహి త్రిదోషజిత్. 640

తా. పచ్చలుపరిశుద్ధముగను, మనోహరముగను, లఘువుగను, మలబద్ధకరముగను, త్రిదోషముల నివర్తిజేయునవిగ నుండును.

## వైడూర్యశుద్ధి

వైడూర్యం వాజిమూత్రేణ కూష్మాండస్వరసేన చ,
భావితం ద్విదినం చాథ శుద్ధమ్భవతి నిశ్చయః. 641

తా. వైడూర్యములను గుఱ్ఱపుమూత్రములో నొకదినము, బూడిదెగుమ్మడిపండుస్వరసములో నొకదినము భావనచేసిన శుద్ధియగును.

## వైడూర్యభస్మము

తద్వైడూర్యం శిలాభేది రసేన పరిభావితమ్,
విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నౌ వజ్రమూషయా. 642
తతో గజపుటే పాచ్యం భస్మీభవతి నిశ్చయః,

తా. ఆ శుద్ధిచేయబడిన వైడూర్యమును పిండికొండవేళ్లరసములో భావనచేసి, కొలిమిలోనునిచియూది పిదప వజ్రమూసయందునిచి చీలమన్నుయిచ్చి గజపుటం బిడిన భస్మమగును.

## వైడూర్యభస్మగుణము

వైడూర్యం వజ్రతుల్యం తు సర్వరోగాన్వ్యపోహతి, 643

తా. వైడూర్యము వజ్రతుల్యముగను, సర్వరోగముల నశింపంజేయునదిగ నుండును.

## గోమేధికశుద్ధి

తతో గోమేధికం వాజిమూత్రే భావ్యం దినత్రయమ్,
తతో విదారీ స్వరసే భావ్యం శుద్ధిర్భవిష్యతి. 644

తా. గోమేధికమును గుఱ్ఱపుమూత్రములో 3 దినములు భావనజేసి పిదప నేలగుమ్మడుగడ్డరసములో నానబెట్టిన శుద్ధియగును.

## గోమేధికభస్మము

శుద్ధం గోమేధికం కృష్ణధుత్తూరద్రావభావితమ్,
విశ్వకర్మపుటే దగ్ధం త్రివారం భస్మతాంవ్రజేత్. 645

తా. శుద్ధిచేసినగోమేధికములను నల్లఉమ్మెత్తాకురసములో 3 మార్లు భావనజేసి కొలిమిలోనునిచియూదిన భస్మమగును.

గోమేధికభస్మగుణము

గోమేధికం కఫహారం దీపనం బలవర్ధనమ్,

తా. గోమేధికము కఫమును హరించుటయేగాక అగ్నిదీప్తి, బలము, వీనిని కలుగ జేయును.

మాణిక్యశుద్ధి

అశ్వమూత్రాంతరే భావ్యం త్రిదినం ప్రబలాతపే. 646
తథోష్ణవారిణా క్షాళ్యం రత్నశుద్ధిర్భవిష్యతి,

తా. కెంపులను గుఱ్ఱపుమూత్రములోవైచి 3 దినములు మంచియెండయం దునిచి వేడినీళ్లతో కడిగిన శుద్ధియగును.

మాణిక్యభస్మము

తన్మాణిక్యం రవిక్షీరే దివసత్రయభావితమ్. 647
శరావే త్రిపుటం దద్యాద్భస్మీభవతి తత్క్షణాత్,

తా. శుద్ధిచేసిన కెంపులను జిల్లేడుపాలతో 3 దినములు భావనచేసి మూకు ళ్ళలోనునిచి చీలమన్ను లేపనముచేసి యెరుపిడకలతో 3 పుటంబులిడిన కెంపులు భస్మమగును.

మాణిక్యభస్మగుణము

మాణిక్యం శిశిరం స్నిగ్ధం మధుకాన్తికరం లఘు. 648
దీపనం వృష్యమాయుష్యం మనోజ్ఞం గ్రహదోషనుత్,

తా. కెంపుభస్మము శీతలముగను స్నిగ్ధముగను మధురముగను, కాంతికర ముగను, లఘువుగను, అగ్నిదీపనకారిగను, వీర్యవృద్ధికారిగను, ఆయుర్వృద్ధికారి గను, మనోజ్ఞముగను, గ్రహదోషముల పోగొట్టునదిగనుండును.

నీలశుద్ధి

ఖరమూత్రాన్తరే క్షిప్త్వానీలం తీవ్రాతపే క్షిపేత్. 649
భావితం దినమేకం చ నీలం శుద్ధం భవిష్యతి,

తా. నీలముల గాడిదెమూత్రముతో ౧ దినము, తీవ్రమగుయెండలో భావన చేసిన, శుద్ధియగును.

నీలభస్మము

తన్నీలం లక్ష్మణాపత్రద్రవే భావ్యం త్రియామకమ్. 650
విశ్వకర్మపుటే దగ్ధం భస్మీభవతితత్క్షణాత్,

తా. శుద్ధిచేసిననీలముల లక్ష్మణసంజీఆసరసములో 3 యామములు నానబెట్టి వజ్రమూసలోబోసి కొలిమినియునిచిశుూదిన తత్క్షణమునందే నీలములు భస్మమగును.

నీలగుణము

నీలం శీతం గురుస్నిగ్ధం మధురం పిత్తనాశనమ్. 651

తా. నీలము శీతలముగను, గురువుగను, స్నిగ్ధముగను, మధురముగను, పిత్తనాశనకారిగ నుండును.

వైక్రాన్తోత్పత్తి

దేవ్యా హతే మహాదైత్యే మహిషాసురసంజ్ఞకే,
అస్యరక్తం తు పతితం యత్ర యత్ర స్థితం భువి. 652
తత్ర తత్ర తు వైక్రాన్తోవజ్రాకారోహ్యా జాయత,
వింధ్యస్య దక్షిణే భాగేచోత్తరే వా స్తి సర్వతః. 653
నికృంతయతి లోహాని తేన వైక్రాన్తఇష్యతే,

తా. మహిషాసురుడను పేరుగల మహాదైత్యుని కాళీదేవి సంహరించుకాలమున వానిరక్తము పడినస్థలమునందు అంతట వజ్రాకారముగల వైక్రాంతములు జనించెను. ఆ వైక్రాన్తములు వింధ్యపర్వతమునకు దక్షిణభాగమునందును, ఉత్తరభాగమందునునున్నయవి. ఇవి లోహముల భేదించునట్టి సామర్థ్యముగల వగుటంచేసి, వైక్రాన్తమని పేర్కొనబడియెను.

వైక్రాన్తలక్షణము

అష్టకోణాష్టఫలకష్షట్కోణోవామృతో గురుః. 654
శుద్ధమిశ్రితవర్ణేన యుక్తో వైక్రాన్తఉచ్యతే,

తా. ౮ కోణములు ౮ పలకలు లేక ౬ కోణములు గలిగి అమృతగుణము శుద్ధవర్ణము, బరువు, మిశ్రితవర్ణముగలది వైక్రాంతమని తెలియవలయును.

వైక్రాంతిభేదములు

శ్వేతో రక్తశ్చ పీతశ్చ నీలః పారావతప్రభః. 655
శ్యామలః కృష్ణవర్ణశ్చ కర్బూరాభోష్టమో మతః,

తా. తెలుపు, యెరుపు, పసుపు, నీలము, పావురపిట్టవర్ణము, శ్యామలవర్ణము, కృష్ణవర్ణము, కర్బూరవర్ణము ఇటుల వైక్రాంతము ౮ విధములుగ నుండును.

వైక్రాంతశుద్ధి తద్భస్మవిధి

వైక్రాన్తం వజ్రవచ్ఛోధ్యం నీలం శ్వేతం చ లోహితమ్. 656

హాయమూత్రేణ తప్తించేత్తప్తం తప్తం త్రిసప్తధా,
తతశ్చోత్తరవారుణ్యాః పంచాగే గోళకే క్షిపేత్. 657
రుద్ధ్వా మూషాపుటే పాచ్యముద్ధరేద్గోళకే పునః,
క్షిప్త్వా రుద్ధ్వా పుటే దేవం సప్తధా భస్మతాం వ్రజేత్. 658

తా. నల్లగగాని, తెల్లగగాని, యెఱ్ఱగగానియుండు వైక్రాంతముల వజ్రమణుల తెరంగున శుద్ధిజేయవలయును. మరియు వైక్రాంతము ౨౧ మారు యెఱ్ఱగకాచి, గుఱ్ఱపుమూత్రములో ౨౧ మారు చల్లార్చిన శుద్ధియగును. పిదప దుష్టుపాకు సమూలమును ముద్దగనూరి అందు శుద్ధిజేయబడిన వైక్రాంతములనునిచి, యాముద్దను మూషయందునిచి, దానిపై మరియొకమూసను బోర్లించి, చీలమన్ను లేపనం బొనర్చి, గజపుటంబిడి, స్వాంగశీతలమునదీసి మరల వైక్రాంతముల పైప్రకారము, దుష్టుపుముద్దలోనునిచి, మూసలోబెట్టి చీలమన్నుయిచ్చి ౭ గజపుటంబులిడిన వైక్రాంతము భస్మమగును.

ప్రకారాంతరమున వైక్రాంతభస్మము

వైక్రాన్తం వజ్రవచ్ఛోధ్యం ధ్మాతం సిక్తం చ మూత్రకే,
వజ్రవన్మృతిమాయాతి వజ్రస్థానే నియోజయేత్. 659

తా. వైక్రాంతమును వజ్రముతెరంగున కొలిమిననూది గుఱ్ఱపుమూత్రములో నద్ది శుద్ధిచేసి వజ్రమువలెనే భస్మముచేసి వజ్రస్థానమున నియోగించవలయును.

వైక్రాంతద్రుతి

కేతకీ స్వరసం గ్రాహ్యం సైంధవం స్వర్ణపుష్పికామ్,
ఇంద్రగోపకసంయుక్తం స్వర్ణభాండే వినిక్షిపేత్. 660
సప్తాహం స్వేదయేత్తస్మిన్ వైక్రాన్తం ద్రవతాం వ్రజేత్,

తా. మొంగిలిచన్నులరసము, సైంధవలవణము, రేలపువ్వు, ఇంద్రగోపపురుగులు వీనితోడ వైక్రాంతమునుజేర్చి బంగారుపాత్రలోనునిచి యేడుదినములు పాకముజేసిన వైక్రాంతముద్రవించి ద్రుతియలెనగును.

వైక్రాంతసత్వ పాతనము

వైక్రాన్తస్య పలం చైకం కర్షైకం టంకణస్య చ. 661
రవిక్షీరై ర్దినం భావ్యం మర్ద్యం శిగ్రుద్రవై ర్దినమ్,
గుంజాపిణ్యాకవహ్నీనాం ప్రతికర్షాణి యోజయేత్. 662
ఏతేన గుటికాం కృత్వా కోష్ఠయన్త్రే ధమేద్దృఢమ్,

శంఖకుందేందుసదృశం సత్వం వైక్రాంతజం భవేత్. 663

తా. వైక్రాంతము ౧ పలము, పాలిగాగము ౧ కర్షము వీనిని జిల్లేడుపాలు, మునగవేరురసము వీనిచే ప్రత్యేకము ఒక్కొకదినము మర్దించి అందు గురిగింజ, గానిగ పిండి, చిత్రమూలము వీనిని చూర్ణించి ప్రత్యేకము ౧ కర్షముచొప్పు ముద్దజేసి కోష్ఠి యంత్రమునందునిచి యూదిన శంఖము, మల్లెమొగ్గలు, చంద్రుడు వీనితో తుల్యమగు కాంతిగల సత్వముదిగును.

—॥ వైక్రాంతగుణాః ॥—

ఆయుఃప్రదం చ రసబంధకరం చ వృష్యం
వహ్నిప్రదం నిఖిలరోగ మదాపహారి,
దోషత్రయాపనయనం విషదోషహారి
వైక్రాన్తకం ఖలు వపుర్బల లోహకారి. 664

తా. వైక్రాంతము ఆయుర్వృద్ధి, రసబంధనము, వీర్యవృద్ధి, అగ్నిదీప్తి, వీనిని గలుగంజేయుటయేగాక సర్వరోగములు, త్రిదోషములు, విషదోషములు వీనిని హరింపజేసి శరీరబలకారిగను లోహవేధనకారిగనుండును.

---

# యంత్రాదిప్రకరణమ్.

—॥ విద్యాధరయంత్రము ॥—

అధస్థ్సాల్యాం రసం క్షిప్త్వా నిదధ్యాత్తన్ముఖోపరి,
స్థాలీమూర్ధ్వముఖీం సమ్యఙ్నిరుధ్య మృదుమృత్స్నయా. 1
ఊర్ధ్వస్థాల్యాం జలం క్షిప్త్వా చుల్ల్యామారోప్య యత్నతః,
అధస్తాజ్జ్వాలయేదగ్నిం యావత్ప్రహరపంచకమ్. 2
స్వాంగశీతాత్తతో యన్త్రాద్గృహ్ణీయాద్రసముత్తమమ్,
విద్యాధరాభిధం యన్త్రమేతత్తత్‌జ్ఞైరుదాహృతమ్. 3



తా. రెండు కుండల గ్రహించి అందొకదానిలో పాదరసమునుబోసి దానిపై రెండవకుండ నూర్ధ్వముఖముగమూసి యీ రెండు కుండలసందులకు చీలమన్ను యిచ్చి పైపాత్రమునం దుదకముబోసి నిండించి పాదరసముండు పాత్రను పొయిమీదనునిచి ౫ ఝాములు పక్వముజేసి స్వాంగశీతలమున యీయంత్రమునందుండురసమును దీసి కొనవలయును. ఇదియ విద్యాధరయంత్రమని చెప్పబడును.

## టంకయంత్రము

భాండకంఠాదధశ్ఛిద్రే వేణునాళం వినిక్షిపేత్,
సమానాం కరకాం వాపి భాండవక్త్రే నివేశయేత్. 4
సంధిం లిప్త్వా చ నాళాగ్రే కాచభాండం నిధాపయేత్,
అధస్తాజ్జ్వాలయేదగ్నిం టంకయంత్రమితి స్మృతమ్. 5



తా. ఒకకుండనుగ్రహించి దాని కంఠమునకు కొంచెము క్రిందుగా రంధ్రముజేసి యందు వెదురు గొట్టమును జేర్చి యాకుండమూతికిసమమైనమూకుడును మూసివాటిసంధులకుచీలమన్ను లేపనము జేసియుంచి పొయిమీదనునిచి గొట్టముయొక్క నోటివద్ద గాజు పాత్రనునిచి పాకముచేసిన దానిలో ఔషధము నాళికాముఖమువలనపతనంబగును. ఇదియటంకయంత్రమనియు గ్రంథాంతరేణఊర్ధ్వనాళికాయంత్రమనియును జెప్పబడును.

## వాలుకాయంత్రము

భాండే వితస్తిగంభీరే మధ్యే నిహితకూపికే,
కూపికాకంఠపర్యంతం వాలుకాభిశ్చ పూరయేత్. 6
భేషజం కూపికాసంస్థం వహ్నినా పాచయేత్తతః,
వాలుకాయంత్రమేతద్ధి యంత్రతంత్రబుధైస్స్మృతమ్. 7



తా. అడుగునిడుపు అడుగువెడల్పుగల మంటిపాత్రను గ్రహించి దానికడుపుయొక్క మధ్యభాగమునందు (దబ్బనముతో లావుగ బెజ్జముజేసి దానిపై) యౌషధపు కుప్పెనునిచి దానికంఠమువరకు నిసుకబోసి పొయిమీదనునిచి రోగములో జెప్పబడియుండు కాలమువరకు పాకము జేయవలయును. ఇదియ వాలుకాయంత్రమనబడును.

## గర్భయంత్రము

స్థూలభాండస్య గర్భేతు ఇష్టికాం స్థాపయేత్తతః,
పాత్రం స్థాప్యం చేష్టికోర్ధ్వాం సద్రవ్యేస్థూలభాండకే. 8
పశ్చాన్ముఖే చాన్యభాండం ఘటికాసదృశం దదేత్,
సంధిలేపమతః కృత్వా జలం దత్తోర్ధ్వపాత్రకే. 9
అగ్నిం ప్రజ్వాలయేన్మందం తప్తం నీరం పునస్త్యజేత్.

పునశ్శీతం జలం దత్వా తప్తం చేత్తత్త్యజేత్పునః. 10
ఏవం కృతేచోర్ధ్వభాండలగ్నం ఫలాదికం స్రవేత్,
అంతస్థే సూక్ష్మపాత్రే చ తచ్చ గ్రాహ్యం ప్రయత్నతః. 11
గర్భయంత్రమిదం ఖ్యాతం సుగంధ్యర్కాదిసాధనే,

తా. ఒకపెద్దభాండమును పొయిమీదనునిచి దానిలో ఇటికరాయినిడి ఆ



యిటికరాయిపై గాజు మొదలగువానిచే జేయబడిన గిన్నెనునిచి, యాగిన్నె కంఠమునగు పెద్దభాండములో ఔషధద్రవ్యముల నునిచి ఆ భాండపుముఖమును మరియొకకుండయొక్క అడుగు భాగముచే మూసి సంధులను చీలమన్ను లేపనంబొనర్చి భాండముపై మూసియుండు కుండలో నుదకముబోసి మందముగ అగ్నిని జ్వలింపజేయవలయును. కుండలోని యుదకము కాగిన దానిందీసి మరల శీతోదకమును బోయవలయును. ఇటుల జేయుచుండిన పైనమూసియుండు భాండముయొక్క అడుగున నావిరిజేరి గిన్నెలో తైలాదులు స్రవించును. దానిని యుక్తిగ గ్రహింపవలయును. ఇదియు గర్భయంత్రమన బడును. *

## కచ్ఛపయంత్రము

ఖర్పరం పృథులం సమ్యగ్గృహీత్వాతస్య మధ్యతః. 12
ఆలవాలం మృదా కృత్వా తన్మధ్యే పారదం క్షిపేత్,
ఊర్ధ్వాధస్తు బిడం దత్వా మల్లేనారుధ్య యత్నతః. 13
ఊర్ధ్వం దేయం పుటం తస్య యంత్రం కచ్ఛపసంజ్ఞికమ్,
జారణార్థం రసస్యోక్తం గంధాదీనాం విశేషతః. 14

తా. పెద్దవెడల్పునోరుగల బానను గ్రహించి దానిమధ్యమున సుమారు మూడు



వేళ్లపొడవుగల మంటిపాదిని జేసి దానియందు బిడాలవణము వేసి దానిపై పాదరసమునునిచి దానిపై మరల బిడాలవణమును పైచి యాపాదికి తగులునటుల కొంచముపల్లముగ నుండు మూకుడుతో దానిని మూసి చీలమన్ను లేపనము జేసి యామూకుడు పిడకలచే నిండించి పుటంబిడిన రసగంధకంబులు జారణంబులగును. ఇదియు కచ్ఛపయంత్రమనబడును.

---

* భాండములో నిటికబెట్టుటకంటె భాండపుమూతినుండి సన్నని దారములతో గిన్నెను వ్రేలాడగట్టి భాండమడుగున ద్రవ్యమునుపరచినయెడల మిక్కిలి సుఖకరము. ఈవిధముగా సుగంధి, అరకు సాంబ్రాణి, అరకు మొదలైనవి చేయవచ్చును.

## జలయంత్రము

ఉపర్యాపస్తలే తాపో మధ్యే చ రసగంధకౌ,
జలయంత్రమిదం గోప్యం యంత్రశ్రేష్ఠం సమీరితమ్. 15
అస్మిన్ స్వర్ణాదిభూసత్త్వగంధకాది చ ధారయేత్,
కృత్వా లోహమయీం పాత్రీమధోముఖసమన్వితామ్. 16
ముఖమధ్యే క్షిపేద్ద్రవ్యం పాత్రవక్త్రం నిరోధయేత్,
లోహచక్రికయా రుద్ధ్వా తత్సంధిం సాధు లేపయేత్. 17
తస్య కోష్ఠే క్షిపేదస్రభాగం లోహరజోన్వితమ్,
పునఃపునశ్చ సంశుష్కే పునరేభిశ్చ లేపయేత్. 18
లోహవత్తచ్చ బబ్బూలక్వాథేన పరిమర్దితమ్,
జీర్ణేష్టికారజస్సూక్ష్మం గుడచూర్ణసమన్వితమ్. 19
లేపయేత్ఖలు తత్ప్రోక్తం దుర్భేద్యం సలిలైః ఖలు,
ఖటికాపటుకిట్టైశ్చ మహిషీదుగ్ధమర్దితైః. 20

యత్తయా మృత్స్నయా రుద్ధో న గంతుం క్షమతే రసః,
విదగ్ధవనితాప్రౌఢప్రేమ్ణా బద్ధః పుమానివ. 21
తతో జలం వినిక్షిప్య వహ్నిం ప్రజ్వాలయేదధః,
అథవా కారయేన్మూషాం పాత్రలగ్నామధోముఖీమ్. 22
లోహేనామనురూపాశ్చ తన్మూషాముఖరోధినీమ్,
దత్వా చాన్యాం తయోస్సంధిం విలేప్యాజాసృగాదిభిః. 23
జలమూర్ధ్వం వినిక్షిప్య నిస్సందేహం విపాచయేత్,
జలయంత్రం తు బహుభిర్దినైరేవ హి జాయతే. 24

తా. ఊర్ధ్వమున జలము, క్రింద నగ్నిజ్వాల, మధ్యమున రసగంధకాదుల



నునిచి పాకముజేయుటయు జలయంత్రమనబడును. ఇది శ్రేష్ఠంబగుటచే రహస్యముగ నునిచికొనవలయును. ఇది స్వర్ణాది సత్వగంధకాది జారణముల కుపయోగించును. ఎట్లనిన లోహముతో నొకపెద్దబానను, దానిలోపల లోహముతో నొకమూసను జేయించి దానియందు స్వర్ణరసగంధకాదుల నునిచి యామూస మూతికి దగినటుల లోహముతో నొకమూకుడుజేయించి దానిచే యామూసమూతిని మూసి ఖాండములోనునిచి మేకనెత్తురుతో లోహకిట్టమును బాగుగనూరి ఆమూస ముఖమునకును దాని అడుగునకును బాగుగ పలుమారు లేపనంబొనర్చి పలుమారు

రొండించవలయును. ఇటులనే యామూషకు క్రిందిభాగమునందును పయిభాగము నందును తుమ్మచెక్కకషాయముతో నూతనఇటికెరాయి, తెల్లను వీనినిసూరి మాటి మాటికి లేపనంబొనర్చి రొండించవలయును. ఇటులజేసిన యుదకము దానిని భేదింపకుండును. మరియు తెల్లసున్నం, ఉప్పు, లోహకిట్టము, వీనిని యెనుముపాలతో నూరి లేపనముచేసిన ప్రియురాలగు స్త్రీయొక్క ప్రేమచే నాయకుడు బంధింపబడు చందంబున పాదరసము బంధింపబడును. పిదప యీయంత్రమునుదకమునుబోసి క్రింద మంటవేయవలయును లేక పక్వభాండమును జేయించునప్పుడె దానినిమూసతో జేయించి పయిప్రకారము మూతమూసి లేపనాగుల జేయవలయును. ఇదియె జలయంత్రమనబడును. ఇది దీర్ఘకాలముకూడ సిద్ధించును.

## గౌరీయంత్రము

గౌరీయంత్రం ప్రవక్ష్యామి సుఖదం జారణావిధౌ,
అష్టాంగులోచ్ఛ్రియాం కృత్వా చతురస్రాం సమేష్టికామ్. 25
మూషాసామాత్సముత్కృత్య మధ్యే చూర్ణేన లేపయేత్,
శ్లక్ష్ణాం సమ్యక్కృతాం పిష్టిం కృత్వా ప్రాగ్బంధితాభ్రజామ్. 26
రూప్యజాం హేమజాం వాపి సత్వేనాపి వినిర్మితామ్,
నివేశ్య తత్ర చోర్ధ్వాధో బలేశ్చూర్ణం పిధాయ చ. 27
తస్యాః పిష్ట్యాశ్చతుర్థాంశం వారంవారం విశోషయేత్,
వక్త్రే ఖర్పరచక్రిం తు దత్వాలేప్య విశోష్య చ. 28
ఊర్ధ్వం హాయఖురాకారం పుటం దద్యాల్లఘూత్పలైః,

తా. జారణవిషయమునందు సుఖకారియగు గౌరీయంత్రమును వచించెదను.



ఎనిమిదంగుళములపొడవు వెడల్పుగల యొక ఇటికెరాయిని జేయించి దానిమధ్యమున మూషాకారముగ పల్లముజేసి దానికి సున్నముబూసి నున్నగజేసి రొండించి పిదప వెండి, బంగారు, అభ్రికము, వీని సత్వములనూరి ఇటికెరాయి మూసలోబోసి ఆసత్వమునకు నాలవభాగము గంధకమును ఇటికెరాయిమూసలో క్రిందపయిననునిచి మధ్యమునందు పైజెప్పబడిన రసాదిద్రవ్యములనునిచి మూసనోటిపై ప్రమిదనుమూసి, చీలమన్ను లేపనముజేసి రొండించి గుఱ్ఱపుగిట్ట ప్రమాణముగల చిన్నయెరు పిడకల పేర్చి పుటంబిడవలయును. ఇదియె గౌరీయంత్రమనబడును.

## వజ్రమూష

వర్తులా గోస్తనాకార వజ్రమూషా ప్రకీర్తితా. 29

ద్వౌ భాగౌ తుషమష్యాశ్చ హ్యేకోవల్మీకమృత్తథా,
లోహకిట్టస్య భాగైకం శ్వేతపాషాణభాగకమ్. 30
నరకేశసమం కించిచ్ఛాగీక్షీరేణ పాచయేత్,
యామద్వయం దృఢం మర్ద్యం తేన మూషాం ప్రకల్పయేత్. 31
శోషయిత్వా రసం క్షిప్త్వా తత్ర సంధిం ప్రలేపయేత్,
వజ్రమూషేఇమేస్యాతాం సమ్యక్సూతస్య మారణే. 32

తా. ఊకమసి బూడిద ౨ భాగములు, పుట్టమన్ను ౧ భాగము, లోహకిట్టము



౧ భాగము, తెల్లరాతిమాగ్గము ౧ భాగము, కొంచెము మనుజుని తల వెంట్రుకలు వీనిని నేకముగచేసి మేకపాలుబోసి యుడికించి ౨ యామములు మెత్తగానూరి గుండ్రముగను, గోస్తనాకారముగను, పొడవుగనుండు రెండుమూసలను జేసి యెండించి మూసలోరసముబోసి పైనమూసి చీలమన్ను లేపనము జేయవలయును. ఇదియ వజ్రమూషయనియెదరు. ఇది రసమారణమునందుపయోగించును.

## భూధరయంత్రము

వాలుకాసు సమస్తాంగగతా మూషా రసాన్వితా,
దీప్తోపలైస్సంవృణుయాద్యంత్రం భూధరనామకమ్. 33



తా. మూసలోపాదరసము బోసి, దాని ముఖమును బంధించి, ఇసుకచే పూరింపబడిన బానయందామూసను సంపూర్ణముగ పూడ్చి, ఇసుకపై పిడకలతో పుటంబిడవలయును. ఇదియ భూధరపుటంబనంబడును.

## కోష్టయంత్రము

వాక్యమ్. హస్తప్రమాణ వేణునలికాం సమాదాయ తస్యామూలే చర్మభస్త్రికాందృఢం బద్ధ్వానలికాగ్రమష్టాఙ్గులమాత్రమ్ భూమౌ తిర్యగ్నిఖాత్య భువంసమ్యగ్విలిప్య తదగ్రదేశే భూమౌగర్తం కృత్వాతత్రాంగారై 35

తా. మూరప్రమాణముగల గొట్టమును జేసుకొని దాని కొనిమిదంగుళప్రమాణముగల సమమగుభూమిలో కొంచమునిమ్నోన్నతముగ నడ్డముగా బూడ్చి యాగొట్టముయొక్క ఇరుపార్శ్వపు ముఖములదెరచియుంచి దానిముఖము



వద్ద భటువుగ నొకపల్లముజేసి యాపల్లమును మన్నుతో బాగుగనలికి గొట్టముయొక్క పైభాగపుమూతియందు తోలుతిత్తినిదగిలించి పల్లమునను తగుమాత్రముగ బొగ్గు వైచి తిత్తినూదవలయును. ఇదియ కోష్ఠయంత్రమనబడును.

## డోలాయంత్రము

నిబద్ధం సౌషధం సూతం భూర్జే తు త్రిగుణాంబరే,
రసపోటలికాం కాష్ఠే దృఢం బధ్వా గుణేన హి. 36
సంధాయ పూర్ణకుంభాంతః ఖావలంబనసంస్థితామ్,
అధస్తాజ్జ్వాలయేదగ్నిం తత్తదుక్తక్రమేణ హి. 37
డోలాయన్త్రమిదం ప్రోక్తం స్వేదనాఖ్యం తదేవ హి,
సాంబుస్థాలీముఖే బద్ధే వస్త్రే స్వేద్యం నిధాయ చ. 38
విధినా పచ్యతే యత్ర తద్యంత్రం స్వేదనం స్మృతమ్,

తా. ఓషధులతోగూడియుండు పాదరసమును భూర్జపత్రములో జుట్టి మూడుమడతలుగల వస్త్రములోగట్టి దారముచేబంధించి యాదారము నొకవెదురుకర్ర మధ్యమునందుగట్టి యొకకుండలో పాచనద్రవముల బోసి పైప్రకారము దారముతో గట్టబడిన యౌషధము కుండలో ద్రావకముల కుండనోటియందు ఆ వెదురుకఱ్ఱ నడ్డముగనిడి గాలిగమునో చెప్పబడియుండు రీతి ప్రకారము పొయిమీదనునిచి పాకముజేయవలయును. ఇదియ డోలాయంత్రమనిగను. లేక స్వేదనాయంత్రమనియును చెప్పబడును. లేక పాత్రనోటియందు వస్త్రమునుగట్టి దానిపై స్వేదనసంస్కారముజేయ వట్టి ద్రవ్యములనునిచి దానిపైమూసి పక్వముజేయుటగూడ స్వేదనయంత్రమనబడును.



## తులాయంత్రము

వృంతాకాకారమూషే ద్వే తయోః కుర్యాదధః ఖలు. 39
ప్రాదేశమాత్రాం నళికాం మృదా లిప్తసుసంధికామ్,
తత్రైకస్యాం క్షిపేత్సూతమన్యస్యాం గంధచూర్ణకమ్. 40
నిరుధ్య మూషయోర్వక్త్రం వాలుకాయంత్రకే క్షిపేత్,
గంధాధో జ్వాలయేదగ్నిం తులాయంత్రముదాహృతమ్. 41
తాళగంధాశ్మసారాణాం జారణార్థముదాహృతమ్,

తా. వంకాయయొక్క యాకారముగల రెండుమూసలజేయించి వానికోటి



యందు బెత్తెడుప్రమాణముగల గొట్టమునుదగిలించి వాని సంధులకు చీలమన్ను లేపనంబొనర్చి * అందొకమూసలో పాదరసమును మరియొకమూసలో గంధకచూర్ణమునువైచి వాని ముఖములమూసి వాలుకాయంత్రమునందుంచి గంధకముందుమూసక్రింద నగ్నిని జ్వలింపజేయవలయును. ఇదియ తులాయంత్రమనంబడును. ఈతులాయంత్రము తాళకము గంధకము లోహము వీని జారణముల కుపయోగించును.

## పాతాళయంత్రము

హస్తప్రమాణనిమ్నం చ గర్తం కృత్వా ప్రయత్నతః. 42
తస్మిన్భాండం చ సంస్థాప్య తథాన్యం పాత్రమాచరేత్,
తస్మిన్నౌషధవర్గం చ దత్వాన్యం చ శరావకే. 43
ముఖంసంస్థాప్యరంధ్రాణి కృత్వాచైవ శరావకే,
శరావసహితం పాత్రం గర్తస్థే భాజనే న్యసేత్. 44
సంధిలేపం తతః కృత్వా గర్తమాపూర్య మృత్స్నయా,
పశ్చాదధోగ్నింప్రజ్వాల్య స్వాంగశీతం సముద్ధరేత్. 45
పశ్చాత్తత్పాత్రమధ్యస్థం పాత్రం యుక్త్యాసమాహరేత్,
తదంతస్థం చ తత్తైలం గృహ్ణీయాద్విధిపూర్వకమ్. 46
పాతాళాఖ్యమిదం యంత్రం భాషితం శంభునా స్వయమ్,

తా. ఒకమూరలోతుగల పల్లముత్రవ్వి అందు వెడల్పునోరుగలభాండము



నునిచి మరియొకకుండలో ఔషధమునునిచి యాఔషధముండుకుండనోటియందు రంధ్రములుగల మూకుడునునిచి ఆ మూకుడు తోడనే యాకుండను పల్లములోని కుండపైని బోరగిలనునిచి సంధిలేపనముచేసి యాపల్లమును మట్టితోబూడ్చి దానిపై నగ్ని నునిచిన మూకుడుయొక్క రంధ్రములవలన క్రిందిభాండములో తైలముగాని ద్రావకముగాని స్రవించును. దానిని స్వాంగశీతలమున యుక్తిచే గ్రహించవలయును. ఇదియు పాతాళయంత్రమనబడును. (ఇది ఈశ్వరునిచే వచింపంబడియెను.)

## తేజోయంత్రము

భాండే చార్ధప్రమాణేన ద్రవ్యం స్థాప్యం ప్రయత్నతః. 47
తన్ముఖే ద్వినళీయంత్రం సంస్థాప్య చ నిరోధయేత్,

* మూసలయందుండే రసగంధకములనిడి అడ్డుగానునిచి సీలుచేయవలెను.

పశ్చాత్ప్రజ్వాల్య మందాగ్నిం జలం దత్వోర్ధ్వమాత్రకే. 48
తత్తప్తం నళికాద్వారా నిస్సార్యం చ పునః పునః,
నీచస్థనళికావక్త్రే భాండం స్థాప్యం ద్వితీయకే. 49
తస్మిన్నర్కాశ్చ సంధాగ్యో గృహ్ణీయాత్తు విశేషతః,
తేజోయంత్రమిదం ఖ్యాతం తథా నైలంబికం మతమ్. 50

తా. పెద్దభాండమును గ్రహించి దానికర్ధభాగమువరకు ఔషధద్రవ్యముల నునిచి దానిమోటియందు * ౨ గొట్టములుగలయంత్రమును దగిలించి సంధిలేపనముజేసి పైభాండములో నుదకమునుబోసి క్రిందమందాగ్నిలో పాకము జేయవలయును. ఆయుదకము కాగియుష్ణంబైన నళికామూలముగ దానిదిగిచేసి మగల శీతోదకమునుబోయు చుండవలయును. క్రిందనుండు నళికాముఖమున గాజు కుందలగువాని! పాత్రలనునిచి ద్రావకమును దీసికొనవలయును. ఇదియ తేజోయంత్రమనబడును. దీనినే మరికొందరు లంబికాయంత్రమని వచించెదరు.



## మహాపుటము

ఘనమానవశాద్గర్తే హస్తద్వితయమాత్రకే,
కరీషైరర్ధపూర్ణే చ ముద్రితం చ శరావకమ్. 51
సంస్థాప్య చాన్యకారీషైః పూరితే శేషగర్తకే,
అగ్నిం ప్రజ్వాల్య శీతే చ గృహ్ణీయాత్తు శరావకమ్. 52
ఏతన్మహాపుటం చోక్తం కృతిభిః పూర్వసూరిభిః,

తా. ౩ మూరలుచదరముగను ౨ మూరలులోతుగనుండుపల్లమును త్రవ్వి అందు సగమువరకు ఏరుపిడకలబరచి దానిమధ్యమున సీలుచేసిన ఔషధశరావమును గాని మూసనుగానినునిచి దానిపై ఏరుపిడకలబరచుటచే నాపల్లమునిండించి యగ్ని నునిచి పుటంబువైచి సాంగశీతలమున ఔషధమును గ్రహింపవలయును. ఇదియ మహాపుటమని పూర్వీకులచే వచింపబడియెను.

## గజపుటము

ఘనమానవశాత్సార్ధహస్తైశ్చైవ తు గర్తకే. 53

---

* ఈగొట్టములలో నొకటియంత్రము లోపలిభాగమునకు రంధ్రముకలదిగాను నింకొకటియంత్రముపైనుండు నీటికుదురులోనికి రంధ్రముకలదిగాను నుండవలెను.

పూర్వవద్వ్రతరేచ్ఛాగ్ని స్తత్పుటం గజసంజ్ఞితమ్,
మాహిషం వేతి సంజ్ఞేయం సూరిభిస్సముదాహృతమ్. 54

తా. ౧¼ మూరచదరము ౧¼ మూరలోతుగలపల్లమును త్రవ్వి దానిలో పైప్రకారము పుటంబిడుటయే గజపుటమనబడును. దీనినే మాహిషపుటమనియు పెద్దలు వచించెదరు.

వారాహపుటము

అరత్నిమాత్రే గర్తే యద్దీయతే పూర్వవత్పుటమ్,
కరీషాగ్నౌ తు తత్ప్రోక్తం పుటం వారాహసంజ్ఞితమ్. 55

తా. మూరప్రమాణముగల పల్లమును త్రవ్వి దాని యందు పైరీతిగ పుటంబిడుటయే వరాహపుటమనంబడును. దీనియందు దేరుపిడకల నుపయోగింపవలయును.

కుక్కుటపుటము

వితస్తిమాత్రగర్తే యత్పుట్యతే తత్తు కౌక్కుటమ్,

తా. అడుగుచదరము అడుగులోతుగల పల్లమును త్రవ్వి దానిలో పైప్రకారము పుటంబోసంగుటయే కుక్కుటపుటంబనబడును.

కపోతిపుటము

వితస్తిమాత్రకే గర్తే సప్తభిర్వాథ చాష్టభిః. 56
వన్యోత్పలైః పుటం దత్తం తత్తు కాపోతసంజ్ఞితమ్,

తా. అడుగుచదరము, అడుగులోతుగల యొకపల్లమును త్రవ్వి అందు ౭ లేక ౮ పిడకలతో పుటంబిడుటయే కపోతపుటమనబడును.

గోవరపుటము

చూర్ణీకృతకరీషాగ్నౌ భూమావేవ తు యత్పుటమ్. 57
దీయతే తత్తు కృతిభిర్గోవరం సముదాహృతమ్,

తా. ఏరుపిడకలచూర్ణమును భూమిపైబోసి, దానిమధ్యమునందు ఔషధమునునిచి చేతితో బాగుగనదిమి యగ్నినునుచుటయే గోవరపుటమనబడును. (ఇది గోపురపుటమనదగును.)

కుంభపుటము

మృద్ఘటస్య తు రంధ్రాణి కృత్వాంగుళసమాని వై. 58
చత్వారింశత్త తస్మిన్ శీతముల్ముకచూర్ణకమ్,
అర్ధమాపూరయిత్వా చ ముఖే దద్యాచ్ఛరావకమ్. 59

కర్పటేన మృదా లిప్త్వా ఛాయాశుష్కం చ కారయేత్,
తస్మిన్నంగారకాన్ క్షిప్త్వా చుల్ల్యాం వాథేష్టకాసువా. 60
నిధాయ త్రిదినాచ్ఛీతం గృహీత్వౌషధమాహరేత్,
ఏతత్కుంభపుటం జ్ఞేయం కథితం శాస్త్రదర్శిభిః. 61

తా. మంటికుండకధోభాగమున నొకఅంగుళప్రమాణముగల నలువది ఛిద్రములజేసి యాకుండకగ్రభాగమువరకు జొగ్గులుబోసి దానిపై నౌషధమునునించి యాకుండమూతిని ప్రమిదతో మూసి, చీలమన్ను లేపనముజేసి నీడనెండించి పొయిమీద నునిచిగాని ఇటుకపైగాని యాకుండలోనికి రంధ్రముల గుండనగ్నినిడి మూడు దినములు అయిన తరువాత చల్లారినపిదప సాంగశీతలమున యౌషధమును గ్రహించవలయును. ఇదియకుంభపుటమనబడును.

---

# అథమానప్రకరణమ్.

## కర్ణాటకదేశప్రస్థపరిమాణము

లాజాక్షీపాయసనారికేళసలిలేమూత్రం జలం కాంజికమ్,
ద్వాత్రింశత్పలకం తదర్ధముదితం ప్రస్థం రసాద్యౌషధీః. 1
తైలం క్షౌద్రఘృతం చ వింశతిపలం క్షీరం చ త్రింశత్పలమ్,
దధ్నః పంచకపంచకం గుడపలం చాష్టాదశో ప్రోచ్యతే. 2

తా. పరిపేలాలు, పాయసము, టెంకాయనీళ్లు, గోమూత్రము, ఉదకము, కలి ఇవి ప్రత్యేకము ముప్పైరెండుపలములు ప్రస్థమనియు, కల్కము, స్వరసములు, ఓషధులు ఇవి పదహారుపలములు ప్రస్థమనియు, నూనె, తేనె, నెయ్యి ఇవి యిరువైపలములు ప్రస్థమనియు, పాలు ముప్పైపలములు ప్రస్థమనియు, పెరుగు ఇరువదైదు పలములు ప్రస్థమనియు, బెల్లము పదునెనిమిదిపలములు ప్రస్థమనియు, (లక్క ఇరువైయొక్కపలము ప్రస్థమనియు) ఇటుల కర్ణాటక ప్రస్థమును నిర్ణయింపవలయును.

## మాగధప్రస్థము

ప్రస్థం తు షోడశపలం ద్రవ్యే క్వాథే రసే తథా,
క్షౌద్రే సర్పిషి తైలే చ ప్రస్థం త్రింశత్పలం భవేత. 3
ఇత్యాగమేన ద్వైగుణ్యం నిరామాత్తుద్రవస్య చ,

తా. ఓషధులు, కషాయములు, స్వరసములు ఇవి పదహారుపలములు ప్రస్థము,

తేనె, నెయ్యి, నూనె ఇవి ముప్పది పలములు ప్రస్థము, ఈ క్రమముచే శాస్త్రము నందు నిగామప్రస్యములవంటి ద్రవములకు ద్విగుణము జెప్పియున్నదిగాన, నవి సమానముగ జెప్పబడిననైనను, ద్విగుణము జేర్చుకొనదగును.

భోజరాజనిర్ధారితప్రస్థము

ద్వాత్రింశతా పలైః ప్రస్థం ప్రోక్తం పాయసలాజయోః. 4
మూత్రకాంజికమస్త్వంబునారికేళాంభసామపి,
మూలత్వగ్దారుపత్రాణాం పుష్పస్య చ ఫలస్యచ. 5
శిలాలవణమృల్లోష్ఠ లోహానాం గోమయస్య చ,
పలైష్షోడశభిః ప్రస్థో రసస్యాహ్యామధస్య చ. 6
ప్రస్థం పలానాం వింశత్యా తైలే మాక్షికసర్పిషోః,
క్షీరేచ వింశతిః ప్రస్థో దధ్నస్స్యాత్పంచవింశతిః. 7
గుడస్య సప్తదశభిరితి భోజమతే స్థితిః,
గుడస్య దశనిష్కం హి పలమాత్రేతు పూజితమ్. 8

తా. పాయసము, పేలాలు, మూత్రము, కలి, పెరుగుమీదతేట, టెంకాయ నీళ్లు ఇవి ప్రత్యేకము ముప్పెరెండు పలములు ప్రస్థము, వేళ్లు, బెరడు, కర్రలు, ఆకులు, పువ్వులు, పండ్లు, రాళ్లు ఉప్పు, మన్ను, పెంకులు, లోహములు, గోమయము ఇవి పదహారుపలములు ప్రస్థము, నూనె, నెయ్యి, తేనె, పాలు ఇవి యిరువైపలములు ప్రస్థము, పెరుగు, ఇరువైయైదు పలములు ప్రస్థము, బెల్లము, పదియేడు పలములు ప్రస్థము, బెల్లము పదినిష్కములరొత్తు వకపలమని జెప్పబడును.

ఘనసారాదివస్తుప్రస్థపరిమాణము

శశికుంకుమకస్తూరీ శర్కరాస్నుక్పయాంసి చ,
వమనే చ నిరూహే చ తథా శోణితమోక్షణే. 9
సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః,

తా. పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి, శర్కర, జెముడుపాలు, రక్తమోక్షణము, వమనము ఇవి ౧౩౺ పలము, ప్రస్థమని తెలియవలయును.

మాగధప్రస్థస్వరూపనిరూపణము

షడంగుళం తు విస్తీర్ణం ద్వాదశాంగుళమాయతమ్. 10
ఏతన్మాగధికప్రస్థం మానభాండేషు పూజితమ్,

తా. ఆరుఅంగుళముల వెడల్పు, ౧౨ అంగుళములు పొడవుగల కొలపాత్ర మాగధ ప్రస్థమనబడును.

—॥ సాధారణతులామానము ॥—

ద్వే గుంజే మాషకం విద్యాత్ నిష్కం స్యాన్మాషవింశతిః. 11
దశనిష్కం పలం ప్రోక్తం తేషాం శతపలం తులా,
ద్రవ్యమానమితి ప్రాహు ర్గౌరభ్రాదిమహర్షయః. 12

తా. రెండుగురిగింజలయెత్తు ఒకమాషము, ఇరువదిమాషములు ఒకనిష్కము పదినిష్కములు ఒకపలము, నూరుపలములు ఒకతులయనుచు గౌరభ్రాది మహర్షులు వచించెదరు.

—॥ పరమాణ్వాదిసంఖ్యానిర్ణయము ॥—

జాలాన్తరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః,
తస్య త్రింశత్తమో భాగః పరమాణుస్స ఉచ్యతే. 13
త్రసరేణుర్బుధైః ప్రోక్తస్త్రింశద్భిః పరమాణుభిః,
త్రసరేణుస్తు పర్యాయనామ్నా వంశీ నిగద్యతే. 14

తా. సూర్యకిరణములు గవాక్షములు మొదలగువానిలో ప్రసరించునపుడు అందు కానబడెడు అణువులలో ౩౦ యవ భాగము పరమాణువనబడును. అట్టి ౩౦ పరమాణువులు ౧ త్రసరేణువనంబరగును. వారయు నీత్రసరేణువుకు వంశీ యను మరియొక పేరునుం గలిగియుండును.

జాలాంతరగతైస్సూర్యకరైర్వంశీ విలోక్యతే,
షడ్వంశీభిర్మరీచిస్స్యాత్తాభిష్షడ్భిస్తు రాజికా. 15
తిసృభీ రాజికాభిశ్చ సర్షపః ప్రోచ్యతే బుధైః,
యవోష్టసర్షపైః ప్రోక్తో గుంజా స్యాత్తచ్చతుష్టయమ్. 16
షడ్భిస్తు రక్తికాభిస్స్యాన్మాషకో హేమధాన్యకౌ,
మాషైశ్చతుర్భిశ్శాణస్స్యాద్ధరణస్సనిగద్యతే. 17
టంకస్సఏవ కథితస్తద్ద్వయం కోల ఉచ్యతే,
క్షుద్రకో వటకశ్చైవ ద్రంక్షణస్సనిగద్యతే, 18
కోలద్వయం చ కర్షస్స్యాత్సప్రోక్తః పాణిమాణికా,
అక్షః పిచుః పాణితలం కించిత్పాణిశ్చ తిందుకమ్. 19
బిడాలపదకం చైవ తథా షోడశికా మతా,
కరమధ్యో హంసపదం సువర్ణం కబళగ్రహమ్. 20
ఉదుంబరం చ పర్యాయైః కర్ష ఏవ నిగద్యతే,

తా. గవాక్షము మొదలగువానియందు ప్రసరించెడి సూర్యకిరణములచే గాన [illegible] వంశియనబడును. అట్టి ౬ వంశీలొక మరీచియనబడును, అట్టి ౬ మరీచు

లోకరాజికయనబడును. అట్టి రాజికలు ఒకసన్నయావగింజయెత్తనియు, అట్టి ౮ ఆవగింజలు ఒకయవమనియు, ౪ యవలు ఒకగురిగింజయనియు, ౬ గురిగింజలు ఒక మాషమనియువచింపబడును. మరియు నీమాషమునకు హేమమనియు, ధాన్యకమనియు, నామాంతరములు కలిగియుండును. మరియు అట్టి ౪ మాషములు, ఒకశాణమనియు, ధరణమనియు, టంకమనియు జెప్పబడును. అట్టి ౨ శాణములు ౧ కోలమనియు, క్షుద్రకమనియు, వటకమనియు, ద్రంక్షణమనియును జెప్పబడును. ౨ కోలములు ఒక కర్షమనియు, పాణిమానికమనియు, అక్షమనియు, పిచువనియు, పాణితలమనియు, కించిత్పాణియనియు, తిందుకమనియు, బిడాలపదకమనియు, షోడశికమనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబళగ్రహమనియు, ఉదుంబరమనియు ఇటులవచింపబడును.

స్యాత్కర్షాభ్యామర్ధపలం శుక్తిరష్టమికా తథా. 21
శుక్తిభ్యాం చ పలం జ్ఞేయం ముష్టిరామ్రం చతుర్థికా,
ప్రకుంచష్షోడశీబిల్వం పలమేవాత్ర కీర్త్యతే. 22
పలాభ్యాం ప్రసృతిర్జ్ఞేయా ప్రసృతశ్చ నిగద్యతే,
ప్రసృతిభ్యామంజలిస్స్యాత్కుడవోర్ధశరావకః. 23
అష్టమానం చ సంజ్ఞేయం కుడవాభ్యాం చ మానికా,
శరావోష్టపలం తద్వత్ జ్ఞేయమత్ర విచక్షణైః. 24

తా. ౨ కర్షము లోకఅర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమికయనియు ౨ శుక్తు లోకపలమనియు, ముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థికమనియు, ప్రకుంచమనియు, షోడశీయనియు, బిల్వమనియు జెప్పబడును. మరియు ౨ పలము లోక ప్రసృతియనియు, ప్రసృతమనియు ౨ ప్రసృతు లోకయంజలియనియు, కుడవమనియు, అర్ధశరావకమనియు, అష్టమానమనియు, ౨ కుడవము లోకమానికయనియు, శరావమనియు, అష్టపలమనియును జెప్పబడును.

శరావాభ్యాం భవేత్ప్రస్థశ్చతుఃప్రస్థైస్తథాఢకమ్,
భాజనంకంసపాత్రే చ చతుష్షష్టిపలం చ తత్. 25
చతుర్భిరాఢకైర్ద్రోణః కలశోనల్వణోన్మనౌ,
ఉన్మానశ్చ ఘటో రాశిర్ద్రోణపర్యాయసంజ్ఞికాః. 26

తా. మరియు ౨ శరావము లోక ప్రస్థమనియు, ౪ ప్రస్థము లోకఆఢకమనియు, భాజనమనియు, కంసమనియు, పాత్రమనియు జెప్పంబడును. అఢకమన

౨౫౬ పలములు. అట్టి ౪ ఆఢకము లొక ద్రోణమనియు, కలశమనియు, నల్వణమనియు, ఉన్మమనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియును జెప్పబడును.

ద్రోణాభ్యాం శూర్పకుంభౌ చ చతుష్షష్టిశరావకః,
శూర్పాభ్యాం చ భవేద్ద్రోణీ వాహో గోణీ చ సా స్మృతా. 27
ద్రోణీ చతుష్టయం ఖారీ కథితా సూక్ష్మబుద్ధిభిః,
చతుస్సహస్రపలికా షణ్ణవత్యధికా చ సా. 28

తా. మరియు ౨ ద్రోణము లొకశూర్పమనియు, కుంభమనియు ౨ శూర్పము లొకద్రోణియనియు, వాహమనియు, గోణియనియు వచింపబడును. ద్రోణియన ౨౫౬ శరావములు, మరియు ౪ ద్రోణు లొకఖారియనియు జెప్పబడును. ఖారియన ౪౦౯౬ పలములు.

పలానాం ద్విసహస్రం చ భారపకః ప్రకీర్తితః,
తులాపలశతం జ్ఞేయం సర్వత్రైవైష నిశ్చయః. 29

తా. ౨౦౦౦ పలము లొకభారమనియు, ౧౦౦ పలము లొకతులయనియు, జెప్పబడును. కావున వెనుక జెప్పబడిన ప్రమాణంబులన్నిటిని నీ తెఱంగుననే గ్రహింపవలయును.

మాషటంకాక్షబిల్వాని కుడవః ప్రస్థమాఢకమ్,
రాశిర్ద్రోణీ ఖారికేతి యథోత్తరచతుర్గుణాః. 30

తా. ౪ మాషము లొకటంకమనియు, ౪ టంకము లొకఅక్షమనియు, ౪ అక్షము లొకబిల్వమనియు, ౪ బిల్వము లొకకుడవమనియు, ౪ కుడవము లొకప్రస్థమనియు, ౪ ప్రస్థము లొకఆఢకమనియు, ౪ ఆఢకము లొకరాశియనియు, ౪ రాశు లొకగోణియనియు, ౪ గోణు లొకఖారియనియు నెఱుంగవలయును. ఇక పచ్చివిగనుండు ద్రవ్య పరిమాణంబుల వచించెదను.

గుంజాదిమానమారభ్య యావత్స్యాత్కుడవస్థితిః,
ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానం సమం మతమ్. 31
ప్రస్థాదిమానమారభ్య ద్విగుణం తు ద్రవార్ద్రయోః,
మానం తథా తులాయాస్తు ద్విగుణం న క్వచిత్ స్మృతమ్. 32

తా. పై జెప్పినపరిమాణంబులలో గుంజాప్రమాణము మొదలుకొని కుడవ ప్రమాణము వరకు ద్రవార్ద్రశుష్కద్రవ్యంబులను సమాంశంబులుగను, ప్రస్థాదిపరి మాణంబులకు ద్రవార్ద్రద్రవ్యంబులను శుష్కద్రవ్యంబులకన్న ద్విగుణంబుగను స్వీకరింపవలయును. ఐనను తులయను ప్రమాణము ద్విగుణంబుగ నెంచుటను లేదు.

---

# అథ పరిభాషాప్రకరణమ్.

## కందసారములు

కందసారాస్తు మంజిష్ఠకుష్ఠచోరవిదారికాః,
హారిద్రా లాంగలీ ముస్తా వరీరాస్నా ఘృణిప్రియా. 1
శారిబార్ద్రిక వారాహీవచాబ్దవనసూరణాః,
నికుంభమార్వ్యమ్లికాఖ్యా వాజిగంధా శుకాసనా. 2
ఏతే చ కందసారాశ్చ భిషక్శాస్త్రేసునిశ్చితాః,

తా. మంజిష్ఠ, చంగల్వకోష్ఠు, కచూరములు, నేలగుమ్ముడు, పసుపు, చెన్నఁగడ్డలు, తుంగముస్తలు, చల్లపిల్లిగడ్డలు, రాస్న, అతివస, సుగంధిపాల, అల్లము నేలతాడి, వస, నాగరముస్తలు, అడవికంద, తెగడ, చాగ, పుల్లబచ్చలి, పెన్నేరు, దుండిగము ఇవి కందసారములని తెలియవలయును.

## మూలసారములు

బృహత్యంశుమతీద్వంద్వం బలాపంచకబర్బరాః. 3
తండులీయకగోరంటకుండలీద్విపునర్నవాః,
పుంఖీవాలుకలామజ్జయాసహింస్రానువర్చలాః. 4
పాఠా గోక్షురకశ్చైవమూలాసారాః ప్రకీర్తితాః,

తా. ములక, కోలపొన్న, ముయ్యాకుపొన్న, బలాపంచకమనగా (అతిబల, మహాబల, నాగబల, జిబిలికె, పేరాముట్టి) వామింట, చిట్టి, గోరింట, నల్లఉప్పి, తెల్ల ఉప్పి, గలిజేరు, ములువెంపలి, కురువేరు, వట్టివేరు, దురదగొండి, వాకుడు, ప్రొద్దు బోడుపుచెట్టు, విషబొద్ది, పల్లేరు, తెగడ ఇవి మూలసారములు. వీనివేళ్లుమాత్రమే ఔషధములయందు ప్రయోగించవలయును.

## మూలత్వక్సారములు

శ్యామాశ్వఘ్న్యగ్నినీల్యాద్యాః మూలత్వక్సారకాస్స్మృతాః. 5

తా. తెగడ, గన్నేరు, చిత్రమూలము, నీలి మొదలగువానియొక్క వేరు పట్టమాత్రమే గ్రహించవలయును.

## దారుత్వక్సారములు

లోధ్రారిమేదకత్వంగదార్వీజంబూలవంగకమ్,
కదంబకింశుకద్వంద్వాశోకమ్యాకక్షీరవృక్షకాః. 6

శాల్మలీకుటజాద్యాశ్చ దారుత్వక్సారకాస్స్మృతాః,

తా. లొద్దుగ, తెల్లతుమ్మ, నల్లతుమ్మ, బూరుగు, మానిపసపు, నేరేడు, అవంగపుచక్క, కొనుగు, మోదుగ, ములుమోదుగ, నేలమ్రుష్టి, రావి, బూరగ, కొడిశపాల ఇవి మొదలగువాని కఱ్ఱలమీది పట్టలను గ్రహించవలయును.

—సారసారములు—

మధుకం చందనద్వంద్వరోహిణ్యామరభూరుహాః. 7

ఖదిరాసననింబాద్యాస్సర్వే సై సారసారకాః,

తా. అతిమధురము, గంధనము, కృష్ణాగరు, కటుకరోహిణి, దేవదారు, చంద్ర, వేగిస, వేప ఇవి సారసారములని తెలియవలయును. సారసారములన చావయే సారముగలది.

—పత్రసారములు—

భృంగాలర్కఝటార్జుశీహారిన్న జందికామ్లికాః. 8

ఉపానదంఘ్రిధుత్తూరకారవేల్లపటోలికాః,

నిర్గుండీమత్స్యదృగ్భృంగీకుండలీకాసమర్దకః. 9

మండూకపర్ణీ లవణీతలపోటార్కకింసుకాః,

జయాగ్నిమంథశ్చాంగేరీశారిష్టా ద్విపునర్నవాః. 10

బ్రాహ్మీ కురంటకానంతా సహాదేవీ హరిప్రియా,

లక్ష్మణద్వయజీవంతీ మూర్వా వాస్తుకవాలుకాః. 11

పుష్ప్యాఖుపర్ణీ కాళింగతుంబాద్యాః పత్రసారకాః,

తా. గుంటకలగర, ములుముస్తె, నేలజిరకి, గొయ్యతూర, కుప్పింట, పుల్లబచ్చలి, చెప్పుతట్ట, నల్లఉమ్మెత్త, కాకర, చేగుపాట్ల, వావిలి, పొన్నగంటి, బంగిఆకు, తెల్లవుప్పి, కసిండీ, మండూకబ్రహ్మి, చామ, తంగేడు, జిల్లేడు, మోదుగ, తక్కలి, సల్లి, పులిచంచలి, కలిశ, తెల్లగలిజేరు, అటికమామిడి, సరస్వతిఆకు, గోరింట, పాచితీగె, సహదేవి, తులసి, లక్ష్మణపుంజి, గొడ్డపాల, పాల, బాగ, చక్రవర్తి, నాగుదోస, అనుగు, ఎలుకచెవిఆకు, పుచ్చ, చేదుసార ఇవిపత్రసారములని తెలియవలయును. పత్రసారములన (ఆకుగసములు సారముగాగలది.)

—పుష్పసారములు—

పుష్పసారాస్తు చాంపేయకేతక్యాశోకపాటలాః. 12

పున్నాగభూర్జవకుళమాధవీజాతిమల్లికాః,

శేఫాలీయూథికాశిగ్రుశతపత్రస్పపద్మమాః. 13

నవాకధాతకీనంద్యావర్తోత్పలజపాదయః,

తా. సంపంగి, మొగిలి, అశోకము, కలిగొట్టు, పొన్న, పొగడ, బండిగురివింద, జాజి, మల్లె, తెల్లవావిలి, మొల్ల, మునగ, * చామంతి, ఏల, లవంగము, వరజాజి నందివర్ధనము రొట్టుకలువ దాసాని ఇవి పుష్పసారములని తెలియవలయును.

ఫలసారములు

ద్రాక్షాదాడిమఖర్జూరరంభాపనసచూతకాః. 14
తాళబిల్వేచకేరాఖ్యం శ్లేష్మాతకకపిత్థకౌ,
నారంగలుంగలికుచపారావతపియాళకాః. 15
సురసౌవీరబదరగుంజాకర్కంధుతోరణాః,
వల్లీఫలాదయశ్చేమే ఫలసారాః ప్రకీర్తితాః. 16

తా. ద్రాక్ష, దాడింబ, ఖర్జూరము, అరటి, పనస, మామిడి, తాటి, మారేడు టెంకాయ, ఇరిగి, వెలగ, నారదబ్బ, మాదీఫలము, పుట్టనిమ్మ, దబ్బనిమ్మ, మొరలి, రేగు, గంగరేగు, గురువింద, పుల్లరేగు. పులిసెలగ, గుమ్మడి ఇవి మొదలగునవి ఫలసారములు.

బీజసారములు

రక్తాద్యాశ్శాలయస్తద్వన్ముద్గాద్యాశ్శింబిజాతయః,
ఏరండయుగ్మపున్నాగనగ్నజిచ్ఛక్రమర్దకాః. 17
జ్యోతిష్మతీకుబేరాక్షీశంఖినీయుగ్మచూతకాః,
ప్రియాళునింబవకుళమునిశిగ్రుకరంజకాః. 18
జాతీఫలైలాతక్కోలబ్రహ్మద్రుమమయూరకాః,
పిప్పలీమరిచాజాజీయవానీధాన్యసర్షపాః. 19
కతకామ్లచణాః పథ్యాధాత్రీవిభీతకాః,
వాకుచ్యంకోలబదరవేల్లాద్యాబీజసారకాః. 20

తా. ఎఱ్ఱరాజనాలు మొదలగువడ్లు, పెసలు మొదలగు కాయధాన్యములు, చిట్టాముదపువిత్తులు, ఆముదపువిత్తులు, పొన్న, ప్రత్తి, తగిరిశ, మాల్కింగిణీ గచ్చ జనుము, గిలక, మామిడి, సారపప్పు, వేము, పొగడ, అవిశి, మునగ, కానుగ, జాజికాయ, ఏలకులు, తక్కోలములు, మోదుగ, వుత్తరేణి, పిప్పళ్లు, మిరియాలు, జీలకఱ్ఱ, ఓమము, ధనియాలు, ఆవాలు, చిల్లగింజలు, శనగలు, కరక్కాయ, తాడికాయ, ఉసిరిక, గచ్చ, ఊడుగ, రేగు, వాయువిడంగములు ఇవి బీజసారములని తెలియవలయును.

* శతపత్రమన తామర కూడనగును.

క్షారసారములు

త్రివృచ్చిత్రకగండీరపూతీకద్వీపిసర్షపాః,
చవ్యాటరూషస్యోనాకపాటలీపారిభద్రకాః. 21
శాకాకన్యార్క వార్తాకపలాశధవకాంసనాః,
గవాక్షీ శంఖినీ వ్యాఘ్రీ నిర్గుండీ కుండలీ నిశా. 22
నీలినీ కేతకీ ముండీ ప్రత్యక్పుష్ప్యజగంధికాః,
అశ్మర్క బర్బరద్వంద్వతిలేక్షురకవేతసాః. 23
శింశపార్జునదేవాహ్వాశిగ్రుముష్కకభూస్తృణాః,
క్షారసారా భవంత్యేతే క్షారసాధ్యేషు సిద్ధిదాః. 24

తా. తెగడ, చిత్రమూలము, జెముడు, కంపుతుమ్మ, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, చవ్యము, అడ్డసరము, దుండిలము, కలిగొట్టుచేము, విషబొద్ది, కలుబంద, జిల్లేడు, వంగ, మోదుగ, ధవవృక్షము, యిరుగుడు, తెల్లగంటెన, కట్ల, వావుడు, వావిలి, తిప్పతీగె, పసుపు, నీలి, మొగిలి, బోడతరము, ఉత్తరేణు, తెల్లవావింట, ములుముస్తె, మంచివావింట, వెఱ్ఱివావింట, నువ్వు, గొల్చి, ప్రబ్బలి, ఇరుగుడు, మద్ది, దేవదారు, కౌరునునగ, మెంకపుచెట్టు, కామంచిగడ్డి, ఇవి మొదలగునవి క్షారసారములని తెలియవలయును.

క్షీరసారములు

బిల్వకార్కమహావృక్షపత్రస్నుగ్వారకన్యకాః,
అన్యేపి క్షీరవృక్షాద్యాః క్షీరసారా భవంతిహి. 25

తా. బిల్వకము, తెల్లజిల్లేడు, జెముడు, ఆకుజెముడు, బ్రహ్మజెముడు, పాలమాను, ఇతరములగు క్షీరవృక్షములు మొదలగునవి క్షీరసారములని తెలియవలయును.

నిర్యాసపారములు

స్థౌణేయసర్జశ్రీవాసదేవధూపతురుష్కకాః,
పాలాశశాల్మలీగుగ్గుల్వీషీహైంగురకాదయః. 26
నింబారగ్వధమేషారికపిత్థఖదిరాసనాః,
అరిమేదద్వయాంబష్ఠాబోళం బిల్వాబ్ధిఫేనకమ్. 27

తా. మాచిపత్రి, సర్జరసము, మాశెడు, మహిసాక్షి, తురుష్కము, మోదుగ, బూరుగ, గుగ్గిలము, ఇషీకము, గార, వేము, రేల, తంగేడు, వెలగ,

చంద్ర, వేగిస, నల్లతుమ్మ, తెల్లతుమ్మ, అంబాళము, బోళము, మారేడు, అభిని ఇవి నిర్యాసవారము లని తెలియవలయును.

సర్వాంగ సారములు

సర్వాంగాశ్చ తథాసారా భృంగకశ్చ పటోలికా,
పిప్పలీమూలభూనింబనతచవ్యాటరూషకాః. 28
దూర్వాప్రసారిణ్యాస్ఫోతాఖ్యాశాఙ్గేరీపర్పటాదయః,
కంద్రైర్నాళైశ్చ మూలత్వగ్గారుత్వక్పత్రసారతః. 29
పత్రపుష్పఫలై ర్బీజైః క్షారేణ క్షీరత స్తథా,
నిర్యాసైరపి సర్వాంగై స్సారవంతశ్చ భూయసా. 30
త త్తద్రోగోపశమనాత్క్రియాసిద్ధిర్విశేషతః,
ఔషధాని స్వవర్గేషు శ్రేష్ఠాని చ ప్రయోగతః. 31

తా. గుంటకలగర, కలుబంద, చేదుపొట్ల, పిప్పలీమూలము, నేలవేము, గ్రంథికగరము, చవ్యము, అడ్డసరము, గరికె, లంజసవరపుచెట్టు, పుల్లబచ్చలి, పులిచెంచలి, పర్పాటకము ఇవి సర్వాంగసారములు. ఇందు దుంపలు, వేళ్లు, వేళ్ళ పలుపు, ప్రూకులవాలుపు, ఆకులు, పువ్వులు, ఫలములు, విత్తులు, క్షారములు, పాలు, బంకలు యీఔషధములు తమతమవర్గులయందుచేర్చిన ఆయారోగముల నివర్తింప జేయును. ఇవి క్రియాసిద్ధిగలవని తెలియవలయును.

ఆర్ద్రిక ద్రవ్యములు

వాశాకుటజకూష్మాండశతావర్యమృతానతాః,
గోరంటైరండలశునఖర్జూరబిసభూ స్తృణాః. 32
పంచమూలం లఘుమహాతృణాఖ్యం మాంసమార్ద్రికమ్,
శారిబాంబుఘనోశీరం కామలం కందమోదకే. 33
నిత్యమార్ద్రం ప్రయోక్తవ్యం యది శుష్కం న వీర్యదమ్,

తా. అడ్డసరము, కొండిశపాల, గుమ్మడి, చల్లపిల్లిగడ్డలు, తిప్పతీగె, కాకికలువ, ములుగోరింట, ఆముదము, వెల్లుల్లి, ఖర్జూరము, తామరతూండ్లు, కొమంచికసువు, కొలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, పల్లేరు, మారేడు, తక్కిలి, దుండిగము, గుమ్ముడు, కలిగొట్టు, దర్భ, రెల్లు, చెరుకు, కాకిచెరుకు, రాజనము, మాంసము, ఆల్లము, సుగంధపాల, కురువేరు, తుంగముస్తలు, వట్టివేరు, తామర దుంపలు, మొరట యీవస్తువులపచ్చవిగానే ప్రయోగించవలయును. ఎండువి ప్రయోగించరాదు.

నిస్త్వగాదిషుగ్రహణములు

నిస్త్వక్శుంఠ్యమృతాభీరులశునం బిల్వపంచకమ్. 34
శతావరీ హరిద్రా చ నిస్త్వక్త్వాం చ ప్రశస్యతే,

తా. శొంఠి, తిప్పతీగ, పిల్లపీచర, వెల్లుల్లి, మారేడు మొదలగు బిల్వపంచకము, చల్లపిల్లిగడ్డలు, పసుపు వీనిని పైతొగడు తీసి ప్రయోగించవలయును.

నిస్తుషద్రవ్యములు

సత్వచఃకార్యాథయూషాదాభక్ష్యాదానిస్త్వచోహితాః. 35
కంగుణీవేల్లతువరీసర్షపానిస్తుషాస్సదా,

తా. పెసలు, ఉలవలు, శనగలు మొదలగు పప్పుదినుసులు కషాయము యూషమునందును పైపొట్టుతోనే వేయవలయును. భక్ష్యాదులయందు పొట్టుతీసి వాడవలెను. నాలకొంగి విత్తులు లేక కొఱ్ఱలు, వాయువిడంగములు, కందులు, ఆవాలు మొదలగునవి పొట్టుతీసియే ప్రయోగించవలయును. మిగిలిన వస్తువులు కషాయాదులలో పైపొట్టుతోనున్ను, చూర్ణాదులలో పైపొట్టుతీసిన్ని ప్రయోగించవలయును.

అలబ్ధప్రతినిధి

అనిర్దిష్టప్రసిద్ధేషు మూలం గ్రాహ్యం త్వగాదిషు. 36
మూలం వీర్యాభిభూయిష్ఠమాషధం చ పరిచక్షతే,
మూలాభావే తు దాతవ్యం మూలతుల్యాగుణం చ యత్. 37

తా. ఆకులు, వేరు, పువ్వు, చావ, ఒంక, పాలు, కొమ్మలు దెరదువఅని వివరణ చెయ్యనిస్థలమునందు వేళ్లనే ప్రయోగించవలయును. వేరు దొరకనియెడల వేరుతో తుల్యసామర్థ్యముగలయంగమును ప్రయోగించవలయును.

అలబ్ధప్రతినిధిద్రవ్యములు

ఖర్జూరం వా మధూకం వా ద్రాక్షాభావే తు విన్యసేత్,
పిప్పల్యాం మరిచం శుంఠ్యాం చార్ద్రికంకణమూమసా. 38
రాస్నాయాం నాగరం యష్ట్యాం జటాముస్తానువానరమ్,
వరాళే ధాతకీపుష్పం జీరకే కృష్ణజీరకమ్. 39
భార్గ్యాం నిదిగ్ధికామూలమేలాంతాళీసపత్రికే,
నేవ్యే హిమం మృణాళం వా కుంకుమే పద్మకేసరమ్. 40
అష్టవర్గేషు జీవంతీ మధుకం వా బలాత్రయమ్,
గుగ్గులౌ నింబనిర్యాసం సైంధవం లవణాంతరే. 41

కాళశాకే తు వర్షాభూ స్తదభావే సునాడికా,
కరంజయుగ్మం కట్వంగే చిత్రమూలం త్వరుష్కరే. 42
కపిత్థం డబిల్వమూలే చ బలామతిబలాంప్రతి,
దురాలభా ధన్వయాసే పాఠాయాం ధన్వయాసకమ్. 43
నిదిగ్ధికాయాం బృహతీ కింశుకం బ్రహ్మభూరుహి,
గ్రంథికే మరిచం చవ్యం గండీరే బర్బరీద్వయమ్. 44
లామజ్జకే మలయజముశీరే గోపకన్యకా,
దంత్యాం త్రివృచ్చిత్రకో వా హారీతక్యాం విభీతకః. 45
శర్కరాయాం గుడం క్షౌద్రే తజ్జీర్ణం తిలజం ఘృతే,
అజంగవ్యే పయస్యాజ్యే మాహిషే చావికం పయః. 46
క్షీరే ముద్గోద్భవం యూషం మసూరో ముద్గజే పునః,
మసూరయూషే క్షీరం వా వ్రీహయశ్శాలిజాతిషు. 47
తైలేష్వైరండజం తైలం రక్తే రండోద్భవం తథా,
మయూరః కుక్కుటే వన్యే కుక్కుటశ్చాపి బర్హిణి. 48
మాంసేషు మత్స్యో మత్స్యేషు శంబూకా స్తేషు శుక్తయః,
సువర్ణే రజతం లోహం లోహం వారజతేపిచ. 49
అన్యోన్యమేవమన్యద్వా ద్రవ్యం యుక్త్యా ప్రకల్పయేత్,

టీ. ద్రాక్ష దొరకని యెడల ఖర్జూరము, ఇప్పపూవు, పిప్పళ్లు లేని యెడల మిరియాలు, శొంఠి లేకున్న అల్లము, మిరియాలు లేకున్న పిప్పళ్లు, రాస్న లేకున్న శొంఠి, అతిమధురము లేని యెడల జటామాంసి, తుంగముస్తలు దొరకకున్న గ్రంధితగరము, లవంగము లేని యెడల విరజాజిపువ్వు, మంచిజీలకఱ్ఱ లేకున్న నల్లజీలకఱ్ఱ, భారంగి లేకున్న వాకుడువేరు, తాళీసపత్రి లేకున్న ఏలకులు, సేవ్యము లేని యెడల చందనము లేక తామరతూండ్లు, కుంకుమపువ్వు లేకున్న పద్మకింజల్కములు, అష్టవర్గులు లేకున్న జీవంతీశాకము, అతిమధురము బలాత్రయమున్ను, మహిషాక్షిగుగ్గిలము సంభవించకున్న వేపబంక, ఇతరలవణములు దొరకకున్న సైంధవలవణము, కరివేపాకు దొరకకున్న తెల్లగలిజేరువేరు, తెల్లగలిజేరు లేకున్న అటికమామిడివేరు, పెద్దమానిచెక్క లేకున్న కానుగచెక్క లేక సెములిచెక్క, జీడిగింజలు లేకున్న చిత్రమూలము, మారేడువేరు లేకున్న వెలగవేరు, అతిబల లేకున్న మహాబల, తెల్లదూలగొండి లేకున్న నల్లదూలగొండి, విషబొడ్డి లేకున్న తీటకసింద, వాకుడు లేకున్న ములక, బ్రహ్మ[illegible] లేకున్న మోదుగవేరు, మోడి లేకున్న మిరియాలు, జెముడు లేకున్న చవ్యము లేక

వైద్య

## పంచకోలములు

మాగధీ గ్రంథికం చవ్యం చిత్రకం నాగరం సమమ్,
పంచకోలమిదం క్వాథం సర్వదోషనివారణమ్. 55

తా. పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి, పంచకోలములు వీనిని కషాయముపెట్టిపుచ్చుకొనిన సర్వదోషములు నివర్తించును.

## దశమూలములు

బిల్వాకాశ్మర్యతర్కారీపాటలాడుండుకైస్సహా,
ద్వే పిరే ద్వే బృహత్యౌచశ్వదంష్ట్రా చ తథా దశ. 56

తా. మారేడు, గుమ్ముడు, * తక్కిలి, కలిగొట్టు, † దుండుకము, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, పల్లేరు ఇవి దశమూలములని తెలియవలయును.

## మహాపంచమూలములు

బిల్వోగ్నిమంథశ్శ్యోనాకః కాశ్మరీచైవ పాటలా,
జ్ఞేయం మహాపంచమూలమితి వైద్యవిశారదైః. 57

తా. మారేడు, కూరసెల్లి, దుండుకము, నేలగుమ్ముడు, కలిగొట్టు ఇవి మహాపంచమూలములని తెలియవలయును.

## మధ్యపంచమూలములు

బలా పునర్నవై రండశూర్పపర్ణీద్వయం తథా,
మధ్యమం పంచమూలాఖ్యం శ్రుతం తత్కఫహారి చ. 58

తా. బల, తెల్లగలిజేరు, ఆముదము, శూర్పపర్ణీ ద్వయము (పిల్లిపెసర అడవిమినుము) ఇవి మధ్యపంచమూలములని తెలియవలయును.

## కనిష్ఠపంచమూలములు

సాలపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీ కంటకారికా,
తథా గోక్షురకం చైవ పంచమూలం కనీయసమ్. 59

తా. ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక, వాకుడు, పల్లేరు ఇవి కనిష్ఠపంచమూలములని తెలియవలయును.

## జీవనాఖ్యపంచమూలములు

అభీరుపీరాజీవన్తీ జీవకర్షభకౌస్స్మృతమ్,
జీవనాఖ్యం పంచమూలం వృష్యం పిత్తానిలాపహామ్. 60

---

* కూరసెల్లియని కొందఱు. † దుండుకమనదుంగిలము.

తా. అభీ, వరా, జీవంతి, జీవకము, ఋషభకము ఇవి జీవనాఖ్యపంచమూలికములని తెలియవలయును.

## తృణాఖ్యపంచమూలములు

దర్భకాశేక్షుకం శాలిశరాఖ్యం తృణపంచకమ్,

తా. దర్భ, కాశ, ఇక్షు, శాలి, శరాఖ్యము ఇవి తృణపంచమూలములని తెలియవలయును.

## ఆమ్లపంచకము

బీజపూరకజంబీరేనారంగం చామ్లవేతసమ్. 61

ఫలపంచామ్లకం చైవ తింత్రిణీకసమన్వితమ్,

తా. మాదీఫలము, నిమ్మ, నారంగము, ఆమ్లవేతసము, చింత ఇవి ఆమ్లపంచకమని తెలియవలయును.

## పంచాంగములు

త్వక్పత్రఫలమూలాని పుష్పం చైకత్ర సంగతమ్. 62

పంచాంగమితి బోద్ధవ్యమిదం వైద్యవిశారదైః,

తా. పట్ట, ఆకులు, పండ్లు, వేళ్లు, పూలు ఇవి పంచాంగములని తెలియవలయును,

## పంచసుగంధములు

వరాళకం పూగఫలం లవంగస్య చ వల్కలమ్. 63

జాతీఫలం సకర్పూరమేతత్పంచసుగంధకమ్,

తా. లవంగము, పోక, లవంగపట్ట, జాతికాయ, పచ్చకర్పూరము ఇది పంచసుగంధమని తెలియవలయును.

## పంచలవణములు

సౌవర్చలం బిడాసంజ్ఞం సైంధవం కాచమేవచ. 64

సాముద్రేణ సమాయుక్తం జ్ఞేయం లవణపంచకమ్,

తా. సౌవర్చలవణము, బిడాలవణము, సైంధవలవణము, కాచలవణము, సాముద్రలవణము ఇవి పంచలవణములు.

## పంచక్షారములు

పాలాశంవముష్కకక్షారం యవక్షారం సువర్చకమ్. 65

తిలనాళోద్భవం క్షారం సంయుతం క్షారపంచకమ్,

తా. మోదుగక్షారము, ముష్కరమను* గ్రంథ్యముయొక్క క్షారము, యవక్షారము, సర్జక్షారము, నువ్వుకాడలక్షారము ఇవి పంచక్షారములు.

పంచ సుగంధములు

కస్తూరీకుంకుమం చైవ కర్పూరం చందనం తథా. 66
గోరోచనేన సంయుక్తం పంచసౌగంధముచ్యతే,

తా. కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, చందనము, గోరోచనము ఇవి పంచసుగంధములు.

పంచపల్లవములు

ఔదుంబరవటాశ్వత్థప్లక్షామ్రతరుపల్లవాః. 67
సర్వఏకత్ర సంయుక్తాః పంచపల్లవసంజ్ఞకాః,

తా. అత్తి, మఱ్ఱి, రావి, జువ్వి, మామిడి వీనిలేతఆకులు, పంచపల్లవము లనియు చెప్పబడును.

పంచవల్కలములు

న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షపీలూత్థవల్కలైః. 68
సర్వమేకత్ర సంయుక్తం పంచవల్కలముచ్యతే,

తా. మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, గోలుగు వీనిపట్టలు పంచవల్కలములని తెలియవలయును.

అష్టక్షారములు

పలాశశిగ్ర్వపామార్గవరుణార్కయవాగ్రజమ్. 69
సర్జటంకణసంయుక్తం క్షారాష్టకమిదం స్మృతమ్,

తా. మోదుగ, మునగ, ఉత్తరేణు, ఉలిమిడి, జిల్లేడు, యవక్షారము, సర్జక్షారము, వెలిగారము ఇవిక్షారాష్టకమనియెదరు.

క్షారషట్కము

తిలక్షారం చ లాంగల్యం వచాపామార్గశిగ్రుజమ్. 70
కౌటజం ముష్కకం చైవ క్షారషట్కమిదం భవేత్,

తా. నువ్వుకాడలు, చన్నచర్ల, వస, ఉత్తరేణు, మునగ, కొడిశపాల ముష్కమను గ్రంథ్యము వీనిక్షారములను క్షారషట్కమనియెదరు.

త్రిక్షారములు

సర్జక్షారం యవక్షారం టంకణక్షారమేవచ. 71

---

* కుంక్కుపుచెట్టు.

క్షారత్రయం సమాఖ్యాతం వైద్యశాస్త్రవిశారదైః,

తా. సర్జక్షారము, యవక్షారము, వెలిగారము ఇవి త్రిక్షారములని తెలియవలయును.

### త్రిజాతక, చాతుర్జాతకములు

ఏలాలవంగంపత్రం చ త్రిసుగంధం త్రిజాతకమ్. 72
నాగకేసరసంయుక్తం చాతుర్జాతకముచ్యతే,

తా. ఏలకులు, లవంగములు, లవంగపత్రి ఇవి త్రిజాతకములనియు, నాగకేసరములతో చేరిన చాతుర్జాతకములనియు తెలియవలయును.

### త్రిఫలములు

హరీతకీ చామలకం విభీతకమితి స్మృతమ్. 73
త్రిఫలాఫలముద్దిష్టం తచ్చ జ్ఞేయం ఫలత్రికమ్,

తా. కరక, ఉసిరిక, తానికాయ ఇవి త్రిఫలములనియు, ఫలత్రికమనియును వచింపబడును.

### త్రికటుకములు

పిప్పలీమరిచం శుంఠీ త్రయమేకత్ర మిశ్రితమ్. 74
త్రికటుత్ర్యూషణం వ్యోషం కటుత్రయమిహోచ్యతే,

తా. పిప్పళ్లు, మిరియాలు, శొంఠి ఇవి మూడును త్రికటుకమనియు, త్ర్యూషణమనియు, వ్యోషమనియు, కటుత్రయమనియును వచింపబడును.

### చాతుర్భద్రములు

నాగరాతివిషాముస్తాత్రయమేకత్ర మిశ్రితమ్. 75
గుడూచీసంయుతం చాపి చాతుర్భద్రమితి స్మృతమ్,

తా. శొంఠి, అతివస, తుంగముస్తలు ఇవి మూడును తిప్పతీగె చేరిన చాతుర్భద్రమని తెలియవలయును.

### లవణత్రయము

సైంధవం రుచకం చేతి బిడం చ లవణత్రయమ్. 76

తా. సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము ఇవిలవణత్రయము.

---

# విషప్రకరణమ్.

## కృత్రిమవిషస్వరూపము

బ్రహ్మగారుడే—

అనేకవిషజీవానాం చూర్ణం ముఖ విషైర్యుతమ్,
మిశ్రితం నఖదంతాదిలోహాద్యం చూర్ణసంయుతమ్. 1
కృత్రిమం తు విషం ఖ్యాతం పక్షమాసాద్విబాధతే,
ఆలస్యం కురుతే జాడ్యం కాసంశ్వాసంబలక్షయమ్. 2
రక్తస్రావో జ్వరశ్శోఫోపీతచక్షుశ్చ లక్షణమ్,

తా. అనేకవిషజంతువులు, ముఖమునందు విషముగల సర్పాదిజంతువిషములు, గోళ్లు, దంతములు, లోహాదులు మొదలగువానితోను, చూర్ణాదులతోను, అన్నాదులతోడగలిపియొసంగుటతోను కృత్రిమవిషముశరీరమునజేరును. ఇది ౧౫ దినములకుగాని, ౧ మాసమునకుగాని విషమెక్కి బాధించును. దానిలక్షణములెవ్వియనిన ఆలస్యము, జాడ్యము, దగ్గు, ఊబ్బసము, బలక్షయము, రక్తస్రావము, జ్వరము, శరీరమునందువాపు, నేత్రములయందు పసుపువర్ణము అనునవియు.

## భీమరుద్రరసము

మృతం స్వర్ణం శుద్ధసూతం శుద్ధం వై హేమమాక్షికమ్. 3
త్రయాణాం గంధకం తుల్యం మర్ద్యం కన్యాద్రవైర్దినమ్,
తచ్ఛుష్కం ససితక్షౌద్రం మాషైకం లేహయేత్సదా. 4
వహ్నిమూలశృతం క్షీరై రనుస్యాద్గరనాశనమ్,

తా. స్వర్ణభస్మము, శుద్ధిజేసినరసము, శుద్ధిజేసినహేమమాక్షికభస్మము, ఈమూటికిసమముగ శుద్ధిజేసినగంధకమునుగలిపి, కలబందరసముతో నొకదినమర్దించి నీడనెండించి, మాషప్రమాణము మాత్రలుజేసి, యందొకదానిని పంచదార, తేనె అనువాని అనుపానముతోడసేవించి, వెంబడిగ పాలలో చిత్రమూలకషాయమును వైచిత్రాగిన కృత్రిమవిషము నివర్తించును.

## శట్యాదియోగము

మాధవనిదానే—

శటీం పుష్కరమూలం చ పిత్తపారావతంపచేత్. 5

తత్పిబేచ్ఛీతలైః పానైర్గరతృష్ణాజ్వరాపహమ్,

తా. కచోరములు, పుష్కరమూలము, పావురపిట్టపిత్తము వీనిని సమభాగములుగ చేర్చివండి, శీతోదకముతో త్రాగిన కృత్రిమవిషములు, దప్పి, జ్వరము ఇవి నివర్తించును.

అభయాదిఘృతము

మాధవకల్పే—

వృషభూనింబపత్రాణి పటోలంచపలంపలమ్, 6
తోయే చాష్టగుణే క్వాథ్యం పాదశేషం సమాహరేత్,
క్వాథతుల్యం ఘృతం గవ్యం ఘృతార్థమభయారసమ్,
ఘృతశేషం పచేత్సర్వం పానాద్విషహారం ఘృతమ్,

తా. అడ్డసరపుఆకు, నేలవేముఆకు, చేదుపొట్లాకు వీనిని దినుసుకు పలము చొప్పునదంచి, ఎనిమిది పలము లుదకముపోసి, నాలవభాగముగ కషాయముకాచి, దానికి సమముగ ఆవునెయ్యి, ఆవునేతికిసముముగ కరక్కాయరసముగలిపి ఘృతశేషముగ వండి సేవించిన విషదోషము నివర్తించును.

సర్పాక్షీయోగము

ఆయుర్వేదే—

సమూలపత్రాం సర్పాక్షీం జలేన క్వథితాం పిబేత్. 8
నరమూత్రైశ్చ వా పిష్టాం పిబేత్సర్వగదాపహామ్,

తా. సర్పాక్షిసమూలమునుదంచి, యుదకములోవైచి కషాయముగాచి త్రాగినను లేక సర్పాక్షిని, నరమూత్రముతోనూరి త్రాగినను సర్వవిషములు నివర్తించును.

విషచికిత్స

అశ్వినీకల్పే—

న్యగ్రోధో రజనీ కుష్ఠం పిష్ట్వాజ్యం గృహధూమకమ్, 9
తండులీయకమూలేన కర్షం గరహారం పిబేత్,

తా. మఱ్ఱి, పసుపు, చెంగల్వకోష్ఠు, కరుదుమూపము, చిఱ్ఱిచేరు వీనిని సమభాగములుగనూరి కర్షప్రమాణమును నేతిలోగలిపిసేవించిన విషదోషము నివర్తించును.

అన్యశాస్త్రే—

శిరీషం మేఘనాదం చ నవనీతసమన్వితమ్, 10
భల్లాతకం విషం హంతి లేపనేన క్షణాద్ధ్రువమ్,

తా. దిరిసెనగింజలు, చిట్లి, జీడి వీనిని సమభాగములుగనూరి, వెన్నలోగలిపి లేపనముజేసిన విషము, నిశ్చయముగ క్షణకాలములో నివర్తించును.

—కుక్కకాటునకుచికిత్సలు—

భేషజకల్పే—

గుడతైలార్కదుగ్ధస్య లేపశ్శ్వానవిషం హరేత్. 11

పిష్ట్వాపామార్గమూలం తు కర్షైకం మధునా లిహేత్,

శ్వానదష్టవిషం హంతి లేపాత్కుక్కుటవిష్ఠయా. 12

తా. బెల్లము, నూనె, జిల్లేడుపాలు వీనినేకముగజేసి లేపనముజేసినను, కర్షప్రమాణము ఉత్తరేణువేళ్లనునూరి, తేనెలోగలిపిభక్షించినను లేక కరచిన స్థలమున కోడిపిష్ఠమును లేపనముజేసినను, వెఱ్ఱికుక్క (నక్క) వీని విషము నివర్తించును. (గొడ్డుకాకరగడ్డను ౪౦ దినములు సేవించినను లేక మ్రంగ, బోడతరము వీనిరసములో మూడు నూనెబొట్లుగలిపి ౪౦ దినములుత్రాగినను వెఱ్ఱికుక్క, నక్క వీనివిషములు నివర్తించును.)

మాధవనిదానే—

నింబకోటజబీజాని చందనాంబుజకేసరా,

క్షీరైః పిష్టం నిహంత్యాశు శ్వానమార్జాలజం విషమ్. 13

తా. వేపవిత్తులు, కోడిసెవిత్తులు, చందనము, తామరకేసరము వీనినిపాలతో నూరిత్రాగిన కుక్కకాటు, (నక్కకాటు) పిల్లికాటు శీఘ్రముగ నివర్తించును. (గోతులము వెంట్రుకలను మంగలములోవైచి మసిజేసి, దానిలో నూనెగలిపి త్రాగినను లేక శరీరమునకు కోకరాకురసముబూసికొని స్నానముజేసినను వెఱ్ఱికుక్క, నక్క వీనివిషము నివర్తించును. కుక్క, నక్కవిషములయందు దొకసంవత్సరము వరకు చప్పిడివంటకమును భుజించుటయేగాక స్త్రీసంగమము, అవాలు, మామిడి కాయ వీనిని వర్జింపవలయును.)

—మూషక విషచికిత్స—

ఆయుర్వేదే—

శిలాంతాళంచకుష్ఠం చ భావ్యం నిర్గుండిజద్రవైః,

పానం మూషకదష్టానాం దంతతీవ్రవిషం హరేత్. 14

తా. శుద్ధిచేసిన మణిశిల, శుద్ధిజేసిన తాళకము, చెంగల్వకోష్ఠు, వీనిని వావిలాకు రసముతోనూరి భావనజేసిత్రాగిన ఎలుకకాటు శీఘ్రముగ నివర్తించును.

చించాఫలసమాయుక్తం గృహధూమం పలార్ధకమ్,

పురాణాజ్యేన సప్తాహం లిహేదాఖువిషం హరేత్. 15

తా. చింతపండు, కరుధూపము, ఈ రెంటినినూరి 4 పలమును ప్రాతనేతితో కలిపి భక్షించిన ఎలుకవిషముహరించును.

శిరీషకుసుమంతక్షైర్వత్సనాభయుతం పిబేత్,
విషం మూషకదష్టానాం శమమాప్నోతి తత్క్షణాత్. 16

తా. దిరిశనపువ్వు, శుద్ధిచేసినవనాభి వీనిని చల్లతోనూరి త్రాగిన ఎలుకకాటు తత్క్షణమున నివర్తించును. (మఱియు వెంట్రుకను త్రాడుగ పేని ముడివేసి జిల్లేడు పాలలో 2 మార్లుతడిసి చుంచెలుక కరిచినస్థలమున గాల్చి దానిపై జిల్లేడుచెక్కపొడి నద్దిన చుంచెలుకకాటు నివర్తించును.)

తోయైర్వా నాగరం నస్యం పిబేద్వామృతసైంధవమ్,
అర్కాదుత్తారమూలం వా జలపానే విషాపహమ్. 17

తా. శొంఠినుదకముతోనూరి నస్యముచేయించినను లేక శుద్ధిజేసినవాభిని సైంధవలవణమునునూరి త్రాగించినను లేక జిల్లేడు, ఉత్తరేణి వీనివేరు నుదకముతోనూరి త్రాగించినను విషము నివర్తించును.

## వృశ్చికవిషచికిత్స

కాకజంఘీయమూలం చాప్యారనాళేన పేషయేత్,
పానాద్వా లేపనాచ్చైవ విషం వృశ్చికజం హరేత్. 18

తా. వెలుమసంధివేరును కలితోనూరిత్రాగినను లేక దానిని గంధముదీసి కరచిన స్థలమున లేపనముజేసినను, తేలువిషము నివర్తించును. (మఱియు తంగేడుకాయలరసమునుద్రాగిన తేలుగరచుటచేగలిగిన రక్తవమనము నివర్తించును.)

## ప్రభావతివటుకములు

హారిద్రానింబపత్రాణి పిప్పలీమరిచాని చ,
విడంగం భద్రముస్తా చ జీరకం విశ్వభేషజమ్. 19
చిత్రకం సైంధవం కుష్ఠం విషం పాఠా హరీతకీ,
ఏతాని సమభాగాని వ్యాఘ్రామూత్రేణ పేషయేత్. 20
చణప్రమాణవటికా శ్ఛాయాశుష్కాశ్చ కారయేత్,
ఏకాముష్ణోదకైః పీత్వా విషూచీం చ వ్యపోహతి. 21
లూతవిస్ఫోటభేదం చ గోమూత్రేణ విలేపయేత్,
అష్టౌ తక్రేణ సేవేత సర్పదష్టవిషం హరేత్. 22

మహారక్తప్రవాహేతు శ్రీగంధేన సమం పిబేత్,
అర్కక్షీరయుతం లేప్యం వృశ్చికాదివిషం హరేత్. 23
హంతి పుష్పం చ పటలం రంభాకందరసాన్వితమ్,
కాకమాచీరసైః పీతా తిమిరాణి వినాశయేత్. 24
నీలికాయారసైర్యుక్తా రక్తాంగత్వం వినాశయేత్,
గుడేన మిశ్రితా భుక్త్వా వాతరోగం వినాశయేత్. 25
భృంగరాజరసైః పీతా శిరసో దాహనుద్భ్రమమ్,
తండులోదకసంమిశ్రా కాసకృచ్ఛ్రం వినాశయేత్. 26
గోమూత్రేణ యుతాపీతాప్లీహరోగం వినాశయేత్,
ఛాగక్షీరసమాయుక్తావటికాచాశ్వగంధికా. 27
పీతా మండలపర్యంతం రాజయక్ష్మవినాశనీ,

తా. మ్రానిపసపు, వేపాకు, పిప్పలి, మిరియాలు, వాయువిడంగములు, భద్రముస్తెలు, జీలకఱ్ఱ, శొంఠి, చిత్రమూలము, సైంధవలవణము, చెంగల్వకోష్ఠు, అతివస, చిరుబొద్ది, కరక్కాయ వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మేక పంచితముతోనూరి, సెనగగింజలంత మాత్రలుజేసి నీడనెండించి యందొకదాని నుష్ణోదకముతో సేవించిన విషూచియు ఆవుపంచితముతో చాది లేపనముజేసిన లూత విస్ఫోటకవ్రణములును ౧ మాత్రలను చల్లతో సేవించిన పాముకాటును, చందనానుపానముతోడ ద్రాగిన మిక్కుటముగ రక్తముగారుటయు, జిల్లేడుపాలతో చాది లేపనముజేసిన తేలుమొదలగువాని విషములును, అరటిగడ్డరసముతో చాది నేత్రముల కంజనముజేసిన కంటిపువ్వులును, పొరలును, కాచియాకు రసముతోడ సేవించిన తిమిరరోగములు, నీలియాకురసముతోడ సేవించిన సర్వాంగముల రక్తము స్రవించుటయు, బెల్లముతోడ సేవించిన వాతరోగములును, గుంటగలగరాకు రసముతోడ సేవించిన శిరముమండుట, తలనొచ్చుటయు, చిట్టియాకురసముతోడ సేవించిన కష్టసాధ్యంబులగుదగ్గులును, ఆవుపంచితముతోడ సేవించిన ప్లీహరోగంబులును, మేకపాలలో పెన్నేరుగడ్డచూర్ణమును యీఔషధమునుగలిపి ౧ మండలమువరకు సేవించిన రాజయక్ష్మయు నివర్తించును. (మరియు నీప్రభావతీవటికములు, తేలు,పాము విషముల హరింపంజేయుటయందు ప్రశస్తంబులు)

## విషప్రతివిషములు

సీసమాలిక

ఊడుగగ స్వర్ణ కాఁగఁగరక్కాయలు పాత్రిగడ్డయుసొంటిపొంగు మీఱు
జీడిగింజదలంపఁజెలఁగి పొగడుగపువ్వు ధరజెమ్ముపాలకుఁ దంగేడాకు
ముసిడికి నేరేడు పెంగిలిచెక్కయుఁ బొంగుగర్పూరమునకునుగలగరాకు
నెఱులనున్న చోదినేరేడులానకు నుసిరికపప్పు దానుచితమగును
దేనెకాజ్యమునకు ధీగతనుదకంబుఁజిక్కుడమ్మలమునఁజింతపండు
తాకినజీడికిఁదగదూలకోవిలయు మ్మెత్త వెఱ్ఱిదానుడుగువిధము
తామరచూర్ణముతగఁబుల్లబావిలి పరగఁనాతుణమునఁబచ్చికడుగు
తింత్రిణీఫలమునఁ దిలకింపబసపును జెరుగుకు జేనీళ్లు పెట్టసేలు
మామిడిజీడికిమహినారికడపాకు స్థిగనుసున్నమునకుఁ దిప్పతీఁగ
తెలికపిండికినూనె తేటయుటుకులకు సైంధవలవణంబుసరసమగును
శొంఠిపిప్పళ్ళకు సారిదిమిర్యాలకు గూరాటికడుగునుగ్రోలగుణము
కడిగియనుములకెల్లగంధంబుసిద్ధంబు దూలింపదగడకుఁదుమ్మచెక్క
పెసలుబెల్లమునకుఁ బసచల్లగుమ్మడియఱుఁగనిమాటికి నావయంత్ర
నూనెయింగువగుప్పగానఁగేతకిరసం బడవిబీగకును స్తులమరియుండు
వత్సనాభులకెల్లవయసతో నాచిత్రి ఘసఁజేతరానికిఁబిరిగినార
కందకుఁదమలపాకంద మైవిలసిల్లు బనసపంటికిసొంటిబాగుసౌను
కనకబీజములకుఁగడనిమ్మగసమును జీలకఱ్ఱనిడుండుచెన్నుమీఱఁ
గడునిమ్మపండ్లకు ఖర్జూరఫలములు పొసగగున్నమునకుఁ బసపుశుద్ధి
నారికేళమునకు నలవరిబియ్యంబు పొనసినువ్వులకెల్ల పొంగలిరసము
జిల్లేడుపాలకుఁజెంచలనీలాకు పాషాణములకెల్లఁబ్రత్తిగింజ
నల్లమందుకుసొంటియల్లంబుసిద్ధంబు బలురక్కసికిసెల్ల నులిమిడాకు
నేతికిబులిచల్ల నేర్పుతో సంధిల్లు జల్లకుబ్రాగుడు జిల్లగింజ
లనుచునుగ్రవిషంబులనవనినడచుఁ జెలఁగుచునునిర్విషంబులఁజెప్పిరిట్లు
సిద్ధసారంబులంత్యుడాఁజెలువమైన వైద్యశాస్త్రంబులందులవరుసఁదలిసి.

## సర్పదష్టలక్షణము

బహ్వాగారుడే—

భ్రాంతిర్మూర్ఛాతిసారశ్చ శూలం వాంతిశ్చ కంపనమ్,
దాహశ్వాసౌ తీవ్రదాహో లక్షణం గద్గదస్వరః,

నచోట, దాపల విషముదిగును కావున పదగ్గునన ఆ, ఆనే బీజాక్షరమును వ్రాసి "మహా పద్మకా హిలి హిలి విజయా విజయాస్వాహా" అను మంత్రముతో శంఖమున దిగమంత్రించి ప్రాత చింతపండును నీళ్లలోగలిపి యభిమంత్రించి త్రాగించిన శుక్రవారమునాడు గరచిన మహాపద్మకుడనే పాము విషముదిగును. శనివారమునాడు గరచిన పాము శంఖపాలకుడనంబడును. అది గరచినచోట దాపల విషముండును కావున నేత్రములమీద ఓం ఆనే బీజాక్షరమును వ్రాసి "శంఖపాల శంఖపాల హిలి హిలి విజయా విజయాస్వాహా" అను మంత్రముతో నేత్రములన్నిటి నభిమంత్రించి, బెల్లమును నీళ్లలోగలిపి యభిమంత్రించి త్రాగించిన శనివారమునాడుగరచిన శంఖపాలకుడను పాము విషముదిగును. శనివారము ప్రొద్దుగూకగా గరచిన పాము సకలుడనంబడును. అది గరచినచోట దాపలవిషముండును. కావున, నడినెత్తిమీద ఓం అను బీజాక్షరమును వ్రాసి" గురుగుర హిరిహిరి విజయా విజయాస్వాహా" అనుమంత్రముతో నడితలమీదమంత్రించి నెయ్యి అనుములకట్లు బెల్లము వీనిని యేకముగజేర్చి అభిమంత్రించి త్రాగించిన శనివారమునాడు ప్రొద్దుగూకి కరచిన సకలుడను పాము విషముదిగును. ఇటుల, ప్రసిద్ధ గారుడను శాస్త్రము నందు అష్టఫణినిదానంబులు, తద్బీజాక్షరౌషధంబులు జెప్పంబడియెను. బీజాక్షరము వ్రాసినచోటనే మంత్రించవలయును.

## సర్వపాముల కోటుకుమంత్రము

అథో నాగో నీలో చిత్తిబాతో బోడా తేరో జాతిమంటిపిత కొపో సర్వే కొటూ లూకేనోజ్యాకేతో జాతి ఈశ్వరపార్వతింకరో కోటి కోటి అజ్ఞా.

## తేలుమంత్రము

"ఊరికినుత్తరాన ఉష్ణగిరిపర్వతం పర్వతంమీద చెట్టు చెట్టుమీద పుట్ట పుట్టలో మున్నూరు ముచ్చుతేళ్లు నన్నూరు నల్లతేళ్లు తొమ్మనూరు ఎఱ్ఱతేళ్లు ఆరున్నూరు అకుతేళ్లు అందులో ఒకతేలు నిప్పైపుట్టునిగ్గుదిగు మీగురువు వల్లేగు నా దాన చల్లగదిగును.

యఃకృత్తికామూలమఘావిశాఖా సార్పాంతకార్ద్రాసు భుజంగదష్టః,
నవైనతేయేనసురక్షితోపి ప్రాప్నోతి మృత్యుం భయదం మనుష్యః

తా. కృత్తిక, మూల, మఘ, విశాఖ, ఆశ్లేష, భరణి, ఆర్ద్ర, నక్షత్రముల యందు పాముచే గరవబడినవాడు గరుత్మంతునిచే రక్షింపబడినను మృతినొందును.

(కర్ణసర్పవిషమునకు నాగముసిడివిరూరి త్రాగించవలయును)

### పొడపాములవిషమునకుచికిత్స.

తా. తిప్పతీగవేరు, నాగముల్లెవేరు, ఊడుగవేరు, పుట్టపాదరువేరు, వస్త్రఘూళితపువేరు, నీలివేరు తీగనుసిరివేరు, మిరియాలు వీనిని సమభాగములుగ నుదకముతోనూరి కుంకుడు గింజలంతమాత్రలుజేసి రేపుమాపు ఒక్కొకమాత్ర నుష్ణోదకముతో సేవించిన పొడపాముల విషముహరించును. పథ్యము—వేనీళ్లన్నమును భుజించవలయును.

### వాపుకుచికిత్స

జిల్లేడాకునుగాని, మారేడాకునుగానినూరి కలితోనుడికించియూజేసికట్టుగట్టి పిదప దిరిసెనపాకు, పుట్టపాదరాకు, జిల్లేడాకు వీనియొక్కరసములలో మిరియపుచూర్ణముగలిపి వాపుపైలేపనము జేసిన, పొడపాము కాటువలన గలిగిన వాపు నివర్తించును.

### గాయమునకుచికిత్స

[illegible]ముడువేరు, పుట్టపాదగువేరు, జిల్లేడువేరు, నాగమల్లేవేరు, తీగెముషిణివేరు, పరిమిపేరు, ముషిణిచిగుళ్లు వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగనూరి ముద్దజేసి చిట్టాముదములో గలిపి లేహ్యపక్వముగ నుడికించి అందు మిరియాలు, చెంగల్వకోష్టు, కాచు, వీనిచూర్ణమును 3 భాగములు, గుగ్గిలచూర్ణమును 3 భాగములు కలిపి మర్దించి గాయముపైనునిచి కట్టుగట్టిన పాము కాటువలన గలిగిన గాయము మానును. కల్మషంబుండిన కోతమందు వేయవలయును.

### ఉల్లిపాముకాటునకుచికిత్స

తిప్పతీగ, నాగముషిణివేరు, మారేడువేరు, ఇందుపువేరు, సెరిజవేరు, నీలివేరు, దిరిసెనపువేరు, తెల్లజిల్లేడువేరు, మిరియాలు వీనిని సమభాగములుగ నుదకముతోనూరి ఇంగుపుకాయ (గింజలంత) మాత్రలుజేసి యందొకదాని సేవించిన ఉల్లిపాము విషము నివర్తించును. పథ్యము—చప్పిడి.

### విషముకక్కుటకుచికిత్స

కుంకుడు వేరునునూరి కుంకుడుగింజంత సేవించిన విషము కక్కును.

ఇతి శ్రీమదాపస్తంబసూత్రకులసుధార్ణవపూర్ణసుధాకర, శ్రీవత్స
గోత్రతిలక, సకలవిద్యాప్రవీణ, శ్రీమదమరేశ్వర భట్టారక
ప్రియతనూజ, భైషజ్య విద్యాపారీణ, సకలపాండిత్య
ప్రవీణ, శ్రీమదింద్రకంఠ వల్లభాచార్య విరచిత,
వైద్యచింతామణౌ, విషప్రకరణన్నామ
షడ్వింశో విలాసః.
గ్రంథః సమాప్తః.

---

